# పేక ముక్కలు

జోకరు

**అవసరాల రామకృష్ణారావు**



**జ్యేష్ఠ లిటరరీ ట్రస్టు**

1, అర్జున్ అపార్ట్‌మెంట్స్,

ఇసకతోట, విశాఖపట్నం - 530 022

ఫోన్ : 535550

పేకముక్కలు
కథల సంపుటి
అవసరాల రామకృష్ణారావు
49-37-8/1, ఎన్.జి.జి.వో. కాలనీ,
అక్కయపాలెం, విశాఖపట్నం - 530 016.
ఫోను : 0891 - 548764 ఫాక్స్ : 0891-513033

మొదటి ముద్రణ :
జులై 1999

డి.టి.పి. :
రాంషా శిరీషా పబ్లికేషన్స్, సామర్లకోట

ప్రింటింగ్ :
చరితగ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
విశాలాంధ్ర ప్రచురణాలయం
హైదరాబాదు - 500 001.

వెల : రూ. **100 ($10)**

# తురుపు ముక్కలు

ఈ లోపలి కథల చిత్రకారులు

బాపు, చంద్ర, బాలి, గోపీ, చిత్ర – మొదలైనవారి సాయమూ

వయసుతోపాటు నా ప్రతిభను గుర్తించి
పదివేలు అనిపించి నా సాహితీ కృషినీ
వృత్తినీ ఎంతగానో గౌరవించి ప్రోత్సహిస్తున్న
వెయ్యి రేకుల కమలం
వెయ్యి రేంకుల నిలయం
వికాస్ విద్యా సంస్థల నిర్వాహక ద్వయమూ

అచ్చుపనిలో ప్రేమ కూడా చేర్చగలమని
నిరూపించిన ప్రేమాభిసారికా ఆహార్యమూ

ఇందులో నా చేత ''వేలు'' పెట్టించినా
తను కూడా ''వేలు'' పెట్టిన భరాగో స్నేహమూ

ఇష్ట కార్యసిద్ధి దీపమ్ము ఇబ్రహీమూ

## రచయిత ఇతర రచనలు

నవలలు

సంపెంగలూ సన్నజాజులూ
అది ప్రశ్న ఇది జవాబు
సహజీవన సౌభాగ్యం
హెడ్‌మిస్ట్రెస్ హేమలత
మేం చేసిన తప్పు మీరూ చేస్తారా ?
రామచిలక
అమ్మకానికో అబ్బాయి
అడిగో మావయ్య, ఆ వెనకే మేరీ !

పిల్లల నవలలు

గణిత విశారద
కేటూ – డూప్లికేటూ

ప్రైజులు

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ (కథలకి – 1969)
2. తెలుగు విశ్వ విద్యాలయం (ఉత్తమ హాస్య రచయిత)

# పేకముక్కల పేర్చు

# ఏముక్క కాముక్కే చెప్పుకోవాలి

ఏ వ్యక్తి అయినా, ఏదో ఓ రంగంలో అర్ధశతాబ్ది కాలం అవిచ్ఛిన్నంగా కృషి చేస్తూ వస్తున్నాడంటే అది సామాన్య విషయం కాదు. ఆ కృషిలో అందరిచేతా ఔననిపించుకొనే గాఢ ప్రతిభ చూపించినప్పుడు ఆ వ్యక్తి, ఆ రంగంలో అగ్రశ్రేణిలో నిలిచినవాడని గుర్తించక తప్పదు.

ఎప్పుడో చాలా కాలం కిందట ఆంధ్ర(వార)పత్రికలో ఒక కథ చూశాను. దానిపేరు 'ఇన్స్పెక్టరూ ఇంత పిసరూ' అని. పేరు పెట్టడంలోనే మాటల రుచీపచీ తెలిసినవాడు, ఆయనెంత చమత్కారో అనిపించింది. ఆయన పేరు అవసరాల రామకృష్ణారావు అని కనిపించింది. అది మనస్సులో నిలిచిపోయింది. ఆ పేరు పెంచిన నారు మంచి ఏపుగా పెరుగుతూనే ఉంది. అదునులో పదును కెన్నడయినా కొరత ఉంటే కదా!

ఈ నాలుగయిదు దశాబ్దాల కాలంలో నేను రామకృష్ణారావు గారి కథలూ, నవలలూ చాలా చదివాను. పేరు చూసి కొన్నీ, ఆయన పేరు చూసి కొన్నీ. చాలా ఇష్టంతో చదివాను. ఆయన పండించిన పంటా, వడ్డించిన వంటా ఒక పాటివా, ఏమన్నానా? వాటిలో నవలలున్నాయి, కథలున్నాయి, గమ్మత్తులున్నాయి, సైన్సు సంగతులున్నాయి. ఎవరికి రుచించేవి వారికి దొరుకుతాయి. అష్టగంధాల్లాటి నవలలు ఎనిమిది. పిల్లల చేతికందించిన రబ్బరు బుడగల్లాటి చిట్టి నవలలు రెండు (గణిత విశారద, కేటూ డూప్లికేటూ). ఇక కథల సంగతి సరే సరి!

కొన్ని వందల కథలు పత్రికల్లో కాళ్ళు పెట్టి సంపుటాల రైళ్ళనెక్కి ఊరూరా వాడవాడా షికార్లు కొడుతున్నాయి. అప్పటి సంపుటాలు ఆరునొక్కటికి, మరొక్కటిప్పుడు తోడు కలిసింది.

ఈ సంపుటిలో ఉన్న కథలు ఏభై పైచిలుకు. కథల కామాక్షి కంఠసీమకు ఈ (ద్విపంచాశత్) రాగాంగాల ముత్యాల కూర్పు అవసరాలంకారం కదా మరి! అందుకే ఇది నేత్రోత్సవం చేస్తోంది; స్వర్ణోత్సవాన్ని తలపిస్తోంది.

కథకయినా, నవలకయినా జీవితమే ముడిసరుకు కనక, రచయితలందరూ, అందులోంచే తీసి గంప కెత్తుకుంటారు కనక, రామకృష్ణారావుగారి 'గనిపనితనం' ఈ సంపుటంలోని కథావస్తువులన్నింటిలో కనిపిస్తుంది. రసాయన మూలకాల్లాటి వెన్నో రకరకాల కలగలుపుల్లో ఉంటాయి వాటిలో. పూల మాటే తీసుకోండి; వన్నె చిన్నెల రేకల మొదళ్ళ నడిమి దుద్దును అంటుకొని ఉంటేనే అవి పూలనిపించుకుంటాయి. వేటికవి పాకం పడితే మిగిలేది మృగ్యం; ఉల్లిగడ్డ పొరలు ఊడదీసినట్లు! ఒకో రెమ్మకు పూసినవి ఒకటో రెండో కావచ్చు. ఇలా గుచ్ఛెత్తగా, ఈ సంపుటంలో నాకు చిక్కిన గుత్తులు అష్టాదశ జాతుల గుర్తులు. వాటిలో మేలివరసలో నిలిచేవి నాలుగయితేనేం, వాలుగా జారేవీ మానవత విలువను నిలబెట్టేవి పద్నాలుగు! ఇదెంత పెనుభారమో వేరే చెప్పక్కర్లేదు.

స్వార్థం కట్టిన గూటికి సంకుచితత్వం సహజ లక్షణం. ఒక కథలో, పన్నుపోటుతో మూలుగుతూండే అవినాశలింగానికి నల్లధనం మూలుగుతోందని, 'అప్పులకుప్ప' లాంటి (అతని బావమరిది) ఏడుకొండలుకు బాగా తెలుసు. అతనికి కావలసిన సొమ్ము ఏర్పాటు చెయ్యమంటే అప్పగారికి అప్పటికప్పుడే చెవుడు పుట్టుకొచ్చింది. బావ సంగతి సరేసరి. అతడిచ్చిన ఉప్పందుకొన్న

ఆదాయప్పన్ను అధికారి, నల్లధనవంతుడితో లక్షరూకల మొత్తానికి రాజీకుదుర్చుకొన్నాడు. కానీ ఏడిచి పోయే ఏడుకొండలికి ఒక పచ్చనోటుకు మించి విచ్చు రూపాయయినా ఇచ్చిన పాపాన పోలేదు (దొంగవెధవ లందరికీ జై!).

''వెధవలు, మనకంటె ఎక్కువ ఉంటే మనల్ని పురుగుల్లా చూస్తారు. తక్కువ ఉంటే మనల్ని చూసి అసూయపడి చస్తారు. వాళ్ళ మొహం చూస్తేనే మండిపోతుంటే, అలాంటిది ఇరుగుపొరుగు వారిని ఏం చూసి ప్రేమించగలం,'' అంటుంది, ఒక మాటకారి రత్తమ్మ (కళ్ళజోడు మార్చి చూడు).

బొంబాయిలో ఉంటున్న శివప్రసాదు, తన సహోద్యోగి చనిపోయాక, అతని కుటుంబం చిక్కుల్లో పడకూడదని సాయపడ్డాడు. చనిపోయినతని భార్యకు ఉద్యోగం వచ్చింది. ఆమె తన బతుకేదో తాను బతుకుతూ పిల్లల్ని పెంచింది. సికిందరాబాదులో ఎం.సెట్. పరీక్షకు తయారవుతున్న పిల్లల్ని చూడ్డానికి ఆమె వెళ్తూంటే, అక్కడ ఆమెకు ఏదయినా సహాయం చెయ్యమని తన పినతండ్రికి ఉత్తరం రాసిచ్చాడు శివప్రసాదు. దానికి ఆ పెద్దమనిషి ఇచ్చిన సమాధానం ఇలా ఉంది: ''ఏనాడో మొగుడు పోయి, ఏ నలభయ్యో దాటిన మనిషి, ఇప్పుడు విడిచిన పువ్వులా, ఇలాగట్రా ఉండడం? దీనికా మనం ఉపకారం చెయ్యవలసింది! బాగా మోజులో పడ్డట్టున్నావు. నీ సంసారానికి అపకారం కాకుండా చూసుకో!'' (సాయం).

హరితోబాటు లెక్చరరుగా పనిచేసే ఘనశ్యామ్ మిత్రా, అతని భార్య; చాలా పొదుపరులు. దానికి కారణం, ఊళ్ళో పెద్దకుటుంబాన్ని పోషించడానికి డబ్బు పంపవలసి రావడం. వాళ్ళ పొదుపరితనాన్ని పిసినారితనంగా జమకట్టి వ్యాఖ్యానాలు చెయ్యడం ఇరుగు పొరుగు వాళ్ళ ఇరుకిరుకు మనస్సులకొక వింత వినోదం! వాళ్ళెలా బతికితే తమకెందుకో? అందులో పోయేదేముందో మరి! (అలాగేనా అంచనా).

లంచాలు పట్టే భూపతికి, కచ్చితంగా బాకీ తీర్చే సంజీవి ధోరణి వచ్చదు. ''నా హృదయం అగ్గిపెట్టె, నా రచనం పాముపెట్టె'' అంటూ మంటల కవిత్వం వెళ్ళగక్కి మహాకవిగా గణుతికెక్కిన ప్రజ్వలంగారు, తమ 'రసిక'తో విమానయాత్ర చేసి రావడానికి కావ్య గానానంతరం మందుకొట్టడానికీ అయ్యే ఖర్చును సాహిత్యాభిమానులయిన విద్యార్థుల నెత్తిన పెట్టడం భూపతికి తెలుసు. అయినా, ''బాకీ తీర్చడంలో కొందరు శ్రద్ధ వహిస్తే అతనివంటి వాళ్ళ ప్రజ్ఞ అంతా బాకీ (లంచం) వసూలు చెయ్యడంలోనే'' (బాకీ).

ఒక ఇంట్లో రెండు వాటాల వాళ్ళు అద్దెకున్నారు. ఒక వాటాలో చలపతికీ, మరో వాటాలో సుందరమ్మకీ, ఆ ఇంటి దొడ్లో చెట్టునుంచి రాలిపడే కొబ్బరికాయల కోసమే యావ. ఇల్లుగల వాళ్ళు తన చుట్టాలనీ కొబ్బరికాయల బాధ్యత తనకే అప్పగించారనీ అంటుంది సుందరమ్మ. ఆవిడ ఊరికి వెళ్ళగా చూసి, కాయలు ఎప్పుడు రాలిపడతాయా అని రాత్రంతా దొడ్లోనే జాగరణ చేస్తూండే 'నారికేళ చోరకేళీ' ప్రియుడు, తన నారీతిలకం, పక్కింటి సుందరమ్మగారి పతిదేవుడి కేళీ మందిరానికి దయచేస్తూ ఉంటుందని ఎలా కలగంటాడు? (ఎవరికేది ప్రాప్తమో!).

పార్వతమ్మ కూతురు కామాక్షి కరడు గట్టిన గడుసు పిండం. మొగుడు స్కూటరు కొనుక్కోడానికని అమ్మ దగ్గరినుంచి పద్నాలుగు వేలు రాబట్టాలని పూనుకొంటుంది. అల్లుడి

ముచ్చట తీర్చడానికి సిద్ధపడ్డ పార్వతమ్మ, అంతమొత్తం అమ్మాయికి ముట్టజెప్పడానికి బాధపడదు. తన భారీ కాయాన్నీ భారీ ఎత్తు సరుకుల్నీ ఎండలో ఆయాసపడుతూ లాక్కొచ్చిన రిక్షావాడికి న్యాయంగా ముట్టజెప్పడానికి మనస్సు ఒప్పదు; గీసి గీసి బేరమాడుతుంది. ''ఇంతటి సాంఘిక కాలుష్యం పోషిస్తున్న మనకి, కడుపు మండిన కార్మికుడి కక్కుర్తి ఎత్తి చూపే యోగ్యత ఎక్కడిది?'' అంటారు రచయిత (యోగ్యత).

రామ్మూర్తిది ఎత్తిరిల్లని కుటుంబం. భార్యకు అనారోగ్యం. తమ్ముడు నెలనెలా అతనికి పంపే ఐదువందలూ ముసలితల్లి (పోషణ గురించే) కనక– అది స్త్రీధనంగా లెక్కకు తీసుకోవాలి కనక – ఆ డబ్బంతా తనకే కావాలని పేచీ పెడుతుంది, పిల్లా పాపా లేని తోబుట్టువు 'సుగుణ' మణి (పై మెరుగు లోకం, ఏ మెరుగు శోకం?).

'సరస్వతీ సమాజం' రజతోత్సవానికి దాని సంస్థాపక అధ్యక్షుడయిన కవి చిదంబరానికి సన్మానం చేస్తామంటారు నిర్వాహకులు. వాళ్ళు ఇరవైవేల పర్సు ఈయనకు ఇచ్చేటట్లూ ఈయన ఆ మొత్తాన్ని మళ్ళీ సమాజానికే విరాళంగా ఇచ్చేటట్లూ ఒప్పందమయింది. చిదంబరానికి పర్సు అందుకున్నాక, ఉసూరుమంటూ వాళ్ళకు ఇవ్వబుద్ధి కాలేదు. తీరా చూస్తే, ఆ కట్టలో ఉన్నవి రెండే రెండు పచ్చనోట్లు; ఒకే సైజు తెల్ల కాయితాల బొత్తికి పైనొకటీ కిందొకటీ! (గొప్ప ఎడ్వాన్సు ఏర్పాటు ఉద్యమం).

మరో కథలో, మూడు వేలు పింఛను తెచ్చుకునే చిదంబరం, వందరూపాయలు తాను మిగుల్చుకొని (తాను చదువుకొనే రోజుల్లో తనకు ఇంత వండి పెట్టినావిడ మనవరాలు) రాముడమ్మ హీన స్థితికి జాలిపడి పంపుతూ, తక్కినదంతా కూతురుకీ అల్లుడికీ ఇస్తూ ఉంటాడు, తాను వాళ్ళింట్లో ఉన్నందుకు అయే ఖర్చుల నిమిత్తం. కొంత కాలానికి, ఆ వందకూడా కలిపేసి 'రౌండు ఫిగరు' గా ఇమ్మని కూతురు అడిగినప్పుడు, ఆయనగారు వాళ్ళ ఇల్లు విడిచి పెట్టి ఆ రాముడమ్మ ఇంటికే మకాం మారుస్తారు. కూతురికి ముట్టచెప్పినది 'సున్న' (వాళ్ళమ్మాయీ, అల్లుడూ).

ఈ మాదిరిగా, ఈ జాతికథలు పది కనిపిస్తాయి. స్వార్థానికి తోబుట్టువే అసూయ. దీనంత నిస్వార్థమయినది మరొకటి లేదు. ఏమంటే, ఇందులో, తనకు లేదన్న గుర్తింపు కన్న ఎదుటివాడికేదో ఉందన్నదొక్కటే బాధ. ఎదుటి వాడికి లాభం కలగ్గూడదు. వాడు బాగు పడగూడదు. పచ్చగా ఉండగూడదు. అందుచేత ఎంత అన్యాయానికయినా పూనుకొంటుంది.

ఒక కథలో, సుజాత స్నేహితురాలు చూడామణికి ఒక డాక్టరుతో పెళ్ళి కుదిరింది. ఆ వార్త సుజాత చెవికి శూలమయింది. చూడామణికి కాబోయే అత్తవారింటికి ఒక ఆకాశరామన్న ఉత్తరం రాసింది. ఉత్తరం అంటించి పడెయ్యమని పిన్ని చేతికి ఇచ్చింది. ఆ ఉత్తరంలో, పిన్నికి కనిపించినది సుజాత కుళ్ళుబుద్ధి. ఒకప్పుడు తనుకూడా ఒకరి మీద అసూయపడి అవమాన పరచడానికి ప్రయత్నించి తాను అవమానం పాలయింది. అంచేత (అగ్గిపుల్ల) అంటించి (పొయ్యిలో) పడేసింది (రాత మారిపోయింది).

మరో కథలో, వెంకటాచలమూ రఘురామయ్యా స్నేహితులు. ఇద్దరూ ఉద్యోగ విరమణ చేసినవాళ్ళే. వెంకటాచలం పైకి రాలేకపోయాడు. అతని భార్యకు కూడా రఘు రామయ్య దంపతుల మీద అసూయ. పైగా సుత్తికొట్టుడు మనుషులు. తాము రఘురామయ్య ఇంటికి వచ్చినప్పుడు నోటికి

వచ్చినట్లు మాట్టాడారే కాని, విషయం తెలుసుకోలేదు. చుట్టు పక్కల పిల్లలకు రఘురామయ్య చదువు చెప్పడం, అతని భార్య బేబీ సిటింగ్ చేయడం ఉచితంగా చేస్తున్న పనులేనని తెలియక, ఇంకా ఏదో సంపాదించేస్తున్నారని అసూయ పడతారు (భూభారం మనుషులూ– శిరోభారం స్త్రీలూ).

ఒక రచయితకు అతని మేనమామ కాశీపతి కనిపించి, ఫలానా కోదండపాణిని ఏకేస్తూ ఒక కథ రాయమంటాడు. ఆ రచయిత భార్యకు కోదండపాణి తారసపడి, కాశీపతి బండారం బయటపెడుతూ మొగుడిచేత కథ రాయించమని చెబుతాడు. అక్రమ సంబంధాల సంగతి ఇద్దరూ చెబుతారు (తాతా, పెళ్ళాడతావా?).

అసూయకు దగ్గరి చుట్టమే మూర్ఖత్వం. ఒక కథలో, శ్రీకూర్మానికి పరోపకార బుద్ధి ఉంది. కల్తీ నూనె బాధ లేకుండా చెయ్యాలని నిఖార్సయిన నూనె డబ్బాలు తెప్పించి చుట్టుపక్కల వాళ్ళకు కావలసినంత నూనె సరఫరా చేస్తూంటాడు. అలాటి వాడి చిత్తశుద్ధినే శంకిస్తూ వ్యాఖ్యానాలు చేస్తారు కురచబుద్ధి వాళ్ళు – కథకుడి భార్యతో సహా. పిల్లలు ఆడుకోడానికి పనికివచ్చే, "సీలు తీసిన రేకుమూతల సంగతి ఎవరూ ఎత్తరేం?" అంటుంది మహా ఇల్లాలు. మూర్ఖత్వానికి తోడు గడసరి మాటలు సరేసరి (నూనె ఎలా తగలడనీ, రేకుమూత వదలకుమీ!).

మూర్ఖత్వం ఎక్కడ ముగుస్తుందో, గడసరితనం ఎక్కడ మొదలవుతుందో కనుక్కోవడం కష్టం. ఏమంటే, రెండూ కేటాయింపుగా కనిపించే దాఖలాలు లేకపోవడం సంగతి అటుంచి, గడుసు పోకడలు పోయే మూర్ఖులూ ఉంటారు, మూర్ఖంగా పోయే గడసరులూ ఉంటారు కనక. గడుసుతనం ముదిరితే టక్కరితనమవుతుంది. దొరికిన వాడి కన్నుగప్పి దొరతనం చెయ్యాలని చూస్తారు కొందరు. సిగ్గూ శరమూ సీసాలో పాతిపెట్టి, అంతరాత్మను అరణ్యవాసానికి తోలి హాయిగా బతికేస్తూంటారు. అప్పుడప్పుడూ బెడిసికొడితే మట్టుకు, "మరోసారి జాగర్తపడనూ?" అనుకుంటారు.

పరమశివంగారు ప్రభుత్వంవారి రహదార్లు, భవనాల శాఖలో నిర్వాహక ఇంజనీరు; జిల్లాకంతకూ పెద్దతలకాయ. ఆయన భార్యామణి అలివేలు, పెద్దతలకాయకే శిఖామణి. ఏం చేసిందీ – రంగు వెలిసిపోయిన పాత పట్టుచీరకు రంగు వేయించి, పుట్టింటికి వచ్చిన ఆడపడుచుకు పసుపు, కుంకుమతో పెట్టింది. ఆ పడుచు, వదినెను ఆకాశానికి ఎత్తేసింది. ఆవిడ విజయమర్మ మేమిటో తెలిసిన తరవాత, ఆయన చురుగ్గా పనిచేశాడు. పాతకాలపు కర్ర వంతెనకు బదులు కొత్త వంతెన కట్టుబడికి ప్రభుత్వం నుంచి అరవైవేల గ్రాంటు తెప్పించాడు. పాతవంతెనకే ముస్తాబు చేసి కొత్తగా కనబరిచి, గ్రాంటులో సగం సొమ్ము, కావలసిన వాళ్ళకు ముట్టజెప్పి తక్కినది దాచుకున్నాడు (పునర్జన్మ ఉంది సుమా!)

మరోకథలో, షణ్ముఖ శర్మది నక్కవినయమూ టక్కరి బుద్ధీ. క్రైస్తవ ఫాదరీ గేబ్రియల్, తన దొడ్లోకి చొరబడ్డ ఆవును తరమడానికి కర్ర విసిరితే అది కిందపడి కాస్సేపు తన్నుకుంది. ఆవును చేజేతులా చంపానని పశ్చాత్తాపపడ్డ ఫాదరీ, ఆవు యజమానెవరో తెలుసుకోడానికని షణ్ముఖ శర్మకు కబురు పెడతాడు. అతగాడు వచ్చి, అది ఫలానా వాడిదనీ, ఆవు హిందువులకు పవిత్ర జంతువు కనక, దాన్ని చంపినందుకు అల్లకల్లోల మవుతుందనీ భయపెట్టి అతని దగ్గర దండిగా డబ్బు లాగాలని చూస్తాడు. కానీ, పాపం! అతని కోరిక తీరకముందే ఆవు చటుక్కున లేచి అక్కణ్ణించి గెంతుతుంది. (గోవూ – గోమాయువూ).

'దెయ్యం చల్లగా ఉండాలిగాని. . . .' అన్న కథలో, గేదెల పున్నమ్మ, పక్కింట్లో (యజమానులు కాని, కిరాయిదార్లు కాని) ఎవరూ లేకుండా ఉంటే తన గేదెలు దొడ్లో స్వేచ్ఛగా విహరించవచ్చని, ఆ ఇంట్లో దెయ్యం ఉందని ప్రచారం చేస్తుంది. భూతవైద్యుడు దాన్ని ఖాయపరుస్తాడు. అలాటి పొగరుబోతు, కుళ్ళుబోతు, వదరుబోతు పున్నమ్మనే దెయ్యంవేషం వేసి హడలగొట్టి పంపేస్తాడు, ఇంటి యజమాని కొడుకు.

'కొల్లగొట్టడం కోటి రకాలు' అని తెలిసిన గురుమూర్తి, తాను చేయించే కాంట్రాక్టు పనిలో సగానికి సగం కమీషను కొట్టడంలో విశేషంలేదు (గుట్టు తెలుసుకో, చెట్టు దులుపుకో).

ఇంకో కథలో, నీలాచలమనే అధికారి, తనకు 'కావలసిన' అమ్మాయికి ఉద్యోగ మిప్పించడానికి, తన కొడుకు సిఫార్సు చేసిన అబ్బాయిని అనర్హుడుగా నిర్ణయించడానికి దామోదరమనే స్నేహితుడి సలహా బాగా ఉపకరిస్తుంది (స్నేహం).

మనస్సూ మాటా చేతా కలిస్తే త్రికరణ శుద్ధి అవుతుందన్నది కద్దు. అలా ఎంతమంది పాటిస్తున్నారని అడగవద్దు. అంతా దాన్ని పాటిస్తే ఇక జగన్నాటక ప్రదర్శనకు ప్రేక్షకులే కరువవుతారు.

'ఆడితప్పరాదు; అసభ్యపదములు ఉచ్చరింపరాదు; కన్నతల్లి మనసు కష్టపెట్టరాదు; లేనివారిని నీచముగా చూడరాదు; దొంగతనము చేయరాదు' – అంటూ పెద్దవాళ్ళు తాము చెప్పే సూత్రాలను పాటించడం లేదని పిల్లలకు తెలుస్తుంది (పిల్లలే బుద్ధి చెప్పాలి).

సంసార తాపత్రయం తగ్గించుకుని పరమాత్మను పరిశోధించమని తన స్నేహితుడి కొడుక్కి సలహా ఇచ్చిన పెద్దమనిషికి, తాను పైసా పైసా పోగు చేసుకున్న 150 తులాల బంగారాన్నీ దోచుకుపోయినప్పుడు చూపూ మాటా పడిపోతాయి (సంచితార్థం).

స్వార్థంకానీ, అసూయకాని తమకు ఏమాత్రం లేకపోయినా ఇతరుల విషయంలో అనవసరంగా జోక్యం చేసుకొని అనుచిత సలహాలిచ్చి కొంపలు ముంచేవాళ్ళు కొందరుంటారు. 'మమ్మల్నిలా బతకనివ్వండి' కథలో పాత్ర అయిన ఒక రచయిత అలాటివాడు.

ఉచిత సలహాదారులకు పెద్దన్నలు వదరుబోతులు – కొండొకచో, సుత్తికొట్టుడుగాళ్లు. అలాంటి పేషెంటుకు నోరు కుట్టెయ్యమని 'డాక్టరు బాబుకో దరఖాస్తు జాబు' రాయాలనిపిస్తుంది కథకుడికి. 'భూభారం మనుషులూ – శిరోభారం స్త్రీలూ' లో వెంకటాచలం దంపతులూ, 'సుత్తి ముత్తాతావళి' లో సూరన్న దంపతులూ ఆ డాక్టరు చికిత్సకు అర్హులయిన వాళ్ళే.

పెద్దగా పనీ పాటా లేనివాళ్ళకు సుత్తికొట్టుడుతో (అది 'ఆత్మ సుత్తి' కావచ్చు, 'పరసుత్తి' కావచ్చు) బాగానే కాలక్షేపం అవుతుంది. కాని ప్రభుత్వ కార్యాలయాల్లో అదేపనిగా సాగదీస్తూండే కార్య నిర్వహణా విధానం మాత్రం కాలపాశంగా తయారవుతుంది. మెడికల్ బిల్లులు పాస్ చేయవలసిన ప్రభుత్వ యంత్రాంగం ఆడే భాగోతాల్ని అచ్చుగుద్దినట్టు రాసిన కథ, 'తమరు కాలంచెయ్యండి, తద్దినాలు పెట్టకపోతే అడగండి'.

ఇలా యంత్రాంగాలు తగలబడుతున్నందువల్లే జనంలో నిరాశ ప్రబలుతుంది. తిరుగుబాటు జరుగుతుంది. విప్లవ భావాలు నాటుకొంటాయి. ఎదుటివన్నీ ఘోరాలే అనిపిస్తాయి. సౌందర్య ప్రియుడైన జోగారావు, డి.ఎస్.పి. బంగళా ఆవరణలో పెరిగిన చక్కని గులాబీలను చూసి ఆనందిస్తాడు. కాని అతని స్నేహితుడు సుధాకర్ నిరుత్సాహపరుస్తాడు. ''ఈ పూలతోట ఎవరి బాబుగారి సొమ్మండీ?

ఇంతింత గులాబీల వెనక అంతంత ముళ్ళుంటాయి. వీటితోపాటు వాటినీ గమనిస్తే గాని మీరు ఆర్టిస్టు కాలేరు," అంటాడు (ఇలా అయితే దేశం బాగుపడ్డట్టే).

రచయితల్లో కొందరు సాహిత్యపు విలువలకు కట్టుబడే వారయితే మరికొందరు అర్జంటు కీర్తికోసం, అర్జంటు ధనార్జన కోసం వెంపర్లాడే వాళ్ళు ఉంటారు. అటువంటి వాళ్ళమీద అధిక్షేపంగా రాసిన కథ 'సరస్వతికి జబ్బు చేసింది'. భాషా సాహిత్యాల్లో పెద్ద డిగ్రీలూ బంగారు పతకాలూ సంపాదించిన వాళ్ళుకూడా అరకొర పరిజ్ఞానం వల్ల ఎలాటి దుర్వ్యాఖ్యలు చేస్తారో తెలిపే కథ 'కంటకాభరణం'. ''డాక్టరు దైవలీల పాఠాలు వినే తెలుగు పిల్లలు ఏమై పోతారో'', అని బాధపడతాడు రాము.

ఇవి ఇలా ఉండగా, ఈనాటి పత్రికలు, సినిమాలు కుర్రవాళ్ళను ఎలా తప్పుదారి పట్టిస్తున్నాయో, అమాయకులకు ఎంత హాని చేస్తున్నాయో తెలిపేకథ 'దైవకార్యం'.

స్త్రీ పురుషుల కామ ప్రవృత్తి ప్రకోపం ఈ సంపుటిలో చాలా కథల్లో కనిపిస్తుంది. 'వాత్స్యాయన కామసూత్రాలు', సర్వే 'జనానా' సుఖినోభవంతు, పిచ్చి తల్లీ వెర్రి మారాజూ, శీలం చిరునామా, తమ మగసిరి తగలేసిరి, తాతా పెళ్ళాడతావా?- వంటి కథల్లో అది ప్రస్ఫుటమ వుతుంది. 'రంకుల రాట్నం' మంటే ఎంత సరదా పడతారండీ, పాత్రజనాలు! ఎవర్నీ నిరాశపరచ గూడదు కదూ, అవసరాలవారూ?

మానవజీవనంలో లైంగిక సుఖం ఎంత ప్రముఖమయినప్పటికీ అదొక్కటే జీవిత సర్వస్వం కాదని అందరికీ తెలుసు. శారీరకంగాను, మానసికంగాను సరిచూసుకోవలసిన, సర్దుబాటు చేసుకోవలసిన కష్టసుఖాలు అనేకం ఉన్నాయి. అనేక సమస్యలను పరిష్కారం చేసుకోవలసి ఉంటుంది. ముఖ్యంగా, స్త్రీల సమస్యల పట్ల సమాజంలో అవగాహన పెరగాలి. స్త్రీకి, వ్యక్తిగా ఎదురయే శారీరక, మానసిక సమస్యలు కొన్ని. వాటిలో ఉద్యోగినులవి కొన్ని, కేవల గృహిణులవి కొన్ని. ఉద్యోగినుల్లో వివాహితలవి కొన్ని, అవివాహితలవి కొన్ని. భార్యా భర్తృ సంబంధాలవి కొన్ని. అధికారులకూ ఉద్యోగులకూ సంబంధించినవి కొన్ని. ఇలా రకరకాలుగా, విస్తృత కార్యరంగంలో ఉన్న పరిస్థితుల్లో, ఇమడలేక, విడిచిపోలేక, పరిస్థితులను మార్చలేక సతమతమయే మహిళలు ఉన్నారు. పరస్పర సహకారం, సానుభూతి కొరవడినప్పుడు సమస్యలు జటిలమయి విపత్కర పరిణామాలకు దారితీస్తాయి. సమాజంలో ప్రతి ఒక్కరూ కోరుకొనే సుఖ శాంతి సౌభాగ్యాలు లోపిస్తాయి.

ఈ అంశాలను దృష్టిలో ఉంచుకొని చేసిన రచనలు తెలుగులో వెలువడుతూనే ఉన్నాయి. ఇటీవల కొంత కాలంగా స్త్రీల సమస్యల మీద దళితుల సమస్యల మీదా ప్రత్యేక శ్రద్ధతో చేసిన రచనలు చాలా వస్తున్నాయి. స్త్రీల సమస్యల పట్ల సరయిన అవగాహనతో, నిర్దిష్ట లక్ష్యంతో రచనలు చేసిన వారిలో రామకృష్ణారావుగారు ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవారు.

ఒక కథలో సరస్వతి, ఇంటెడు చాకిరీ చేస్తూ, అందరి సదుపాయాలూ చూస్తూ మెప్పు పొందుతూ ఉంటుంది. ఆమెకు అదొక తృప్తి. కాని రేవతి దృష్టి వేరు. సరస్వతి తన వ్యక్తిత్వాన్ని చంపుకొని శ్రమ దోపిడికి గురి అవుతోందన్నది ఆమె అభియోగం. అదే పనిగా చాకిరీ చేసి ఆరోగ్యం చెడగొట్టుకున్నందువల్లనే ఒకప్పుడు గులాబీ పువ్వులా ఉన్నది ఇప్పుడు పూచిక పుల్లలా తయారయిందని అంటుంది. ప్రతి మనిషీ పనితోబాటు, తగినంత విశ్రాంతీ, శారీరక మానసిక ఆరోగ్యాలూ అవసరమన్న

సంగతి ఎవరూ కాదనరు. మనిషి యంత్రంగా మారిపోకుండా వివేకంతో వ్యవహరిస్తూ ఇంట్లో ఉన్న ఇతరుల సహాయ సహకారాలు లభించేటట్లు చేసుకోవడం మంచిదన్న స్ఫూర్తిని కలిగించే కథ 'జైకి బహువచనం జైలు'.

ఒక కంపెనీ జనరల్ మేనేజరు దిలీప్, తన స్టెనో జయంతితో అప్పుడప్పుడు సరదాలు తీర్చుకొని తనకు పెళ్ళి అయిన తరువాత ఆమెకు బర్తరఫ్ నోటీసు ఇస్తాడు. తన బతుకు తెరువుకు ప్రమాదం ఎదుర్కొన్న జయంతి, దిలీపును బెదిరించి, ''మీరు బతకాలంటే మమ్మల్ని బతకనివ్వక తప్పదు, డోంట్ ఫర్గెట్! '' అని చెప్పి బర్తరఫ్ కాయితాల్ని చింపి– అతని మొహాన విసిరి విసవిసా వెళ్ళిపోతుంది (ఆడపడుచులం కాదు, కోడెత్రాచులం).

ఆధునిక జీవన సరళిని గురించిన అవగాహనతో, స్త్రీల బాగోగులను గురించి ఝాన్సీ అనే స్నేహితురాలి చేత దుర్గకు చెప్పించిన కథ 'ఇదేమైనా బాగుందా'.

చదువులకో, ఉద్యోగాలకో బయటికి వెళ్ళే యువతులు తమకు ఎప్పుడు ఏ ప్రమాదం వస్తుందోనన్న జంకు విడవాలనీ, ప్రతి విషయానికీ పురుషుల మీద ఆధారపడకుండా తమకు తాము స్వతంత్రంగా, ధైర్యంగా వ్యవహరించాలనీ సూచించే కథ 'ఎవడేం చేసిపోతాడో ఏమో!'

''మగవాళ్ళను మోసగాళ్ళుగా తయారుచేస్తున్నారు పతివ్రతలు'', అంటూ ఫిర్యాదుచేస్తూ రాసిన కథలో ఒక వసుంధర, తన భర్త కళ్యాణితో కాపురం పెట్టినా అతనిమీద కోర్టులో కేసు పెట్టడానికి అంగీకరించదు. మరో వరలక్ష్మి, తన భర్తకూ అతని మేనమామ కూతురుకీ తాను అడ్డులేకుండా ఉండడానికి, కొడుకును తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోతుంది. ''వారివారి జీవితాలు నిర్దేశించిన ధర్మసూత్రాలు వారికి వేరే ఉంటాయి. వాటికే కట్టుబడతారు'' (ఈ ఆడాళ్ళతో ఇదే చిక్కు).

ఈ మాదిరిగా, స్త్రీ సంబంధమయిన వివిధ సమస్యలను రచయిత, స్పష్టమయిన అవగాహనతో చిత్రించినట్లు తెలుస్తుంది.

వెలుగు నీడలు సయ్యాటలాడే ఈ జీవనరంగంలో ఒక్కొక్క ఘట్టంలో నీడలు పారేది ఎక్కువ, వెలుగు పారేది తక్కువ. మరికొన్ని ఘట్టాల్లో వెలుగు వెల్లువయి పారగా, నీడలు నిలువరించుకోజాలవు. మట్టిగడ్డ అనుకున్నది కూడా మణిఖండికలా మెరుస్తుంది. మంచి చెడ్డల కలగలుపునే మానవ ప్రవృత్తిగా మన్నించినప్పటికీ వెలుగును మింగే చీకటి ముసిరితే ఎవ్వరూ హర్షించరు; మంచిని వంచనచేసే చెడ్డకు అడ్డు చెప్పక మానరు. మంచిని పెంచాలనీ చెడ్డను చెండాడాలనీ ఆశించడం సహజమే అయినప్పటికీ మానవ హృదయాశయాన్ని ప్రతి రచయితా ప్రత్యక్షంగా ప్రచారం చెయ్యడు; పరోక్షంగా తలపింప జేస్తాడు. రామకృష్ణారావుగారి కథల్లో ఈ పరోక్ష సూచన మనకు కనిపిస్తుంది. మనుషుల్లోని దురాశలు, దౌర్బల్యాలు, దౌర్జన్యాలు, దుశ్చింతలు, దురభ్యాసాలు వంటివి తమకూ ఇతరులకూ ఎలా హానికరమయినవో స్ఫురింపజేసి మేలు కలిగించే వాటిని అలవరుచుకోవాలనీ అందరితో పంచుకోవాలనీ రచయిత ఉద్దేశించినట్లు గ్రహించవచ్చు.

ప్రేమ, సానుభూతి, సహకారం, సేవాపరత్వం, విశాలహృదయం, ఉపాయశాలిత్వం, ధీరత్వం, ఆనంద పారవశ్యం వంటి మేలిగుణాలమీద ఎక్కువ వెలుతురు ప్రసరింపజేసి వాటిని ఉద్దీపింపజేసిన కథలు ఈ సంపుటిలో పదివరకు ఉన్నాయి.

ఒక కథలో, గాయత్రి అక్కగారు జబ్బుమనిషి. ఆమెను తమ ఇంటికి తీసుకువచ్చి ఏడాదిపాటు సేవచేస్తారు దంపతులు. ఆవిడ చనిపోయేనాటికి గాయత్రి భర్త ఊళ్ళో లేకపోవడం వల్ల గాయత్రి సభ్యురాలుగా ఉన్న 'సేవాదళ్' వాళ్ళు వచ్చి అంత్యక్రియలు జరిపిస్తారు. వాళ్ళు చేసిన సహాయానికి తామెంతో రుణపడి ఉన్నామని గాయత్రి మాటిమాటికీ అంటూంటే ఆమెభర్తకు విసుగెత్తుతుంది. ఏడాదిపాటు తాము ఎంతో అవస్థ పడుతూ ఉన్నప్పుడు రాని సేవాదళ్ వాళ్ళు చివర ఒక్కరోజు వస్తే అదీ ఒక గొప్పేనా, అంటాడు ఆమె భర్త (చచ్చాకేనా సహాయం?).

ఎంత చాదస్తపు ముసలమ్మ అయినా మాతృ హృదయమూ మంచి మనస్సూ ఉన్న మంగమ్మ మీద డేనియల్‌కు గౌరవం ఏర్పడుతుంది. ''నీతి నియమంలేని ఈ లోకంలో ఏదైనా దొరుకుతుంది, మంచి పొరుగు తప్ప'' (తల్లి పేగూ–పిల్ల వేరూ).

'అందచందాల కథ' లో ఉన్నవి రెండు కథలు. శిల్పకళ నేర్చుకోవాలన్న ఆసక్తి ఉన్న ఇద్దరు స్నేహితుల్లో పెద్దవాడు ఒక కార్ఖానాలో పనికి కుదిరి, తన జీతంలోంచి, చిన్నవాడు శిల్పకళ నేర్చుకోడానికి నెలనెలా డబ్బు ఇస్తాడు. అతన్నొక మంచి శిల్పిగా తయారయ్యేటట్టు చేస్తాడు. అందులోనే మరోకథలో, పెద్దమనిషి గంగాధరంగారు, తన కొడుకూ, మనమడూ పోయాక, కోడలికి తొందరలో మరో పెళ్ళి చేసేద్దామని తనకు తానుగా వియ్యంకుడికి చెబుతాడు.

'కాంతికిరణం' కథలో శాంతమ్మ, విదేశంలో ఉన్న తన కొడుకు అక్కడొక క్రైస్తవ కన్యను ప్రేమించినా, పెద్దమనసుతో పెళ్ళికి అంగీకారం తెలుపుతుంది.

'ముసిలాళ్ళంతా సాలీళ్ళేనా?' కథలో, పించనుదారు శర్మగారు, ఉమ్మడి కుటుంబంలో ఉన్న ముసలివాళ్ళు – ఆడపనీ మొగపనీ అన్న పట్టింపు లేకుండా – తమకు చేతనయిన పనులన్నీ చేస్తూ తక్కిన వాళ్ళ శ్రమ కొంత తగ్గించాలనీ తోటి ముసలివాళ్ళకు ప్రబోధం చేస్తారు. ''పెద్దల్ని గౌరవించవలెను- అనిపించుకోవాలంటే ముందు మనం పెద్దల్లా ప్రవర్తించాలి కదా!'' అంటాడు.

'కేరింతలు' కథలో సాంబయ్య, అత్తింట్లో బాధలు పడలేక ఐదేళ్ళ పిల్ల అమ్మలుతో వీధిన పడ్డ రాజ్యాన్ని ఆదుకొని, ఆమె కూతుర్ని పెంచి పెద్దచేసి ఆమె పెళ్ళికోసం డబ్బు దాచిపెడతాడు. తన పింఛను డబ్బంతా నెలనెలా అమ్మలికే ఇచ్చేస్తాడు. చుట్టు పక్కలవాళ్ళ పిల్లలను చేరదీసి వాళ్ళను ముద్దు చేస్తాడు; కావలసినవి కొనిపెడతాడు; కథలు చెబుతాడు. ''బాధ్యతల 'చేదు' కాదనని వారికే కదా, జీవితంలో తీపి తెలిసేది!''

'చిల్లర్ని ఎన్త చల్లన్ది' కథలోను, 'మాస్టరు పీచు' కథలోను ఉపాయశాలిత్వం కనిపిస్తుంది. 'త్యాగమూర్తులున్నారు జాగ్రత్త!' లో సుబ్బారావు, అమాయకురాలయిన తన భార్య శీలాన్ని గురించి శంకించవలసినంతగా హెచ్చరించడానికి వచ్చిన తన పాత స్నేహితుడు రాంబాబుతో, మెచ్చుకోలు మాటలే అంటాడు, ''చెడ్డపేరు వస్తే వచ్చిందని, నీలా కాపురాలు తీర్చి దిద్దే త్యాగమూర్తులు ఎక్కడోకాని ఉండరు''. తన భార్య శీలాన్ని గురించి తనకు చెప్పినట్లే తన శీలాన్ని గురించి తన భార్యకు కూడా చెప్పమని పట్టుబట్టే సరికి, అతగాడు మెల్లగా జారుకుంటాడు.

పిల్లల దృష్టికి, ప్రపంచమొక క్రీడారంగం. ఈ సత్యాన్ని రూపుగట్టించే కథ 'ఆట'. ఇందులో బీద గుమాస్తా గోపాలరత్నానికి, పుట్టిన ఆరుగురు పిల్లల్లో నలుగురే దక్కారు. భార్య చనిపోయింది. ముసలితల్లీ పెళ్ళికాని చెల్లెలూ అతని పోషణలోనే ఉన్నారు. ఆర్థికంగా ఎన్ని ఇబ్బందులు పడుతున్నా

ఆఫీసరుగారి పుట్టినరోజు కానుకకు చందామాత్రం ఇవ్వక తప్పదు. అలాటి ఆఫీసరు, రిటైరు కాబోయే ముందు పుట్టినరోజు కానుకలేవీ తనకు వద్దని ఉద్యోగులకు చెప్పేసి, జ్వరం వచ్చిందన్న కారణం రాసి ఆరోజు సెలవు పెట్టిన గోపాలరత్నాన్ని చూడ్డానికి వాళ్ళింటికి వస్తాడు. అతని తల్లి కంటి ఆపరేషనుకూ చెల్లెలి పెళ్ళి కుదరడానికీ మంచి ఇంట్లోకి మారడానికీ ఉన్న అవకాశాలు చెబుతాడు. సాయంత్రం బడినుంచి వచ్చిన పిల్లల్ని చూసి పలకరిస్తాడు. వాళ్ళకు ఏవో కొనిపెడతాననీ కార్లో తిప్పుతాననీ చెప్పి తనతో రమ్మంటే, వాళ్ళు రామంటారు. ఒకరింట్లో పూసిన నీలమందారాన్ని చూడటానికీ, చాకలివాడి గాడిదకు పుట్టిన ముద్దొచ్చే పిల్లను చూడటానికీ, పావలా డబ్బులిచ్చి ఏనుగునెక్కడానికీ వెళ్ళాలని చెప్పి అక్కణ్ణించి పరుగెత్తుతారు. తన పిల్లలకు 'వ్యాపార లక్షణాలు' పట్టనందుకు గోపాలరత్నం సంతోషిస్తాడు.

పిల్లలు దేవుడిలాంటి వాళ్ళు. మాయామర్మాలు ఈర్ష్యాద్వేషాలూ స్వార్థప్రయోజనాలూ కుట్రలూ కూహకాలూలాంటి అవలక్షణాలేవీ వాళ్ళకు ఉండవు. చుట్టుపక్కల మనుషులనూ పశువులనూ పక్షులనూ పూలనూ మొక్కలనూ మబ్బులనూ వాననూ చుక్కలనూ చంద మామనూ పరిసరాలన్నిటినీ ఉన్నవి ఉన్నట్లు ప్రేమిస్తారు; మైమరుస్తారు. అందరికీ ఆనందం పంచుతారు. పెద్దవాళ్ళంతా తమ అవలక్షణాలను వదుల్చుకొని పసిపిల్లలంత గొప్ప మనసు పెంచుకొన్నప్పుడు ప్రపంచంలో తమ ఉనికిని సార్థకం చేసుకోగలరన్న సత్యాన్ని ఈ కథ ద్వారా నిరూపించారు రామకృష్ణారావుగారు.

మొత్తం మీద, వివిధ కథలను పేర్కొంటూ, ఇంతవరకు చెప్పిన అంశాలన్నీ ఆయా కథల్లో నా దృష్టిని ఆకర్షించినవి; ఏకదేశమయినవి మాత్రమే. ప్రతి కథలోనూ ఇతరాంశాలు కూడా ఉన్నప్పటికీ ప్రస్తావ విస్తరణకు పూనుకోకపోవడం గమనించవచ్చు.

కథనశైలీ విన్యాసంలో, సంభాషణ నిర్వహణ పాటవంలో, నూతన పదబంధ కల్పనలో, జీవన చిత్రణలో, పాత్రపోషణలో అవసరాలవారు అత్యంత సమర్థులని కాని, సునిశితమైన హాస్య ప్రవృత్తిని – అప్పుడప్పుడు జబర్దస్తీ కూడా జోడించి– ఆద్యంతం ప్రదర్శించగలరని కాని ఈ నాడు కొత్తగా చెప్పవలసిన పనిలేదు. ఐదు దశాబ్దాలుగా ఆయన చేస్తున్న రచనలు ఆ వన్నెచిన్నెల మేళవింపుకి 'మెచ్చుతునకలే'.

అయితే ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అంశం, కథలకూ పెట్టడంలో ఉన్న సొగసు. 'జైకి బహువచనం జైలు' దగ్గరినుంచి 'కంటకాభరణం' వరకు పెట్టిన పేర్లు – ఏ ఏడెనిమిదో తప్ప – తక్కినవన్నీ అద్భుతమయినవి. ఈయనలా పేర్లు పెట్టే పెరుమాళ్ళు రచయితల్లో లేరుగాక లేరు!

ఈ సంపుటికి 'పేకముక్కలు' అని ఎందుకు పేరు పెట్టారో మరి ఆయనకే తెలియాలి!

'వస్తువు, శిల్పం, భాషాశైలి' అన్న కథాంగాలతో మూడుముక్కలాట ఆడటంలో అవసరాల రామకృష్ణారావుగారు బహునేర్పరి అనీ కడుగడుసరి అనీ నేను చెప్పాలా?

అన్నట్టు, నాకు తెలియకడుగుతాను – చీట్లపేకలో ఎక్కడైనా ఏభైరెండూ తురుపుముక్కలే ఉంటాయా?

హైదరాబాదు
9.7.99

పోరంకి దక్షిణామూర్తి

# BRIDGE

ఇది రెండర్థాల మాట.

అదృష్టం కొంచెం తక్కువైనప్పటికీ చాతుర్యం ఉంటే గెలవగలిగే ఒక పేకాట.

వంతెన.

ఆయనెవరో అన్నట్టు; మొదటిది నాకురాదు, రెండోది పనికిరాదు.

మొదటిది పోరంకి దక్షిణామూర్తిగారు నిర్మించేశారు. రెండోది ("చాతుర్యం") నాకు పనికిరాదు; పోనీ "అచ్చి"రాదు.

రామకృష్ణారావూ నేనూ 1949 నుండీ స్నేహితులం.

స్నేహితుల మధ్య సమాచారం స్వభావాలూ ఒకరికొకరివి తెలుస్తాయి. సమాచారాన్ని అందిస్తాం గానీ స్వభావాలమీద వ్యాఖ్యలు చేసుకోం. అందుకే కాబోలు ఎవరో అన్నారు:Never judge a friend – అని.

నేను 1994లో "పనిచెయ్యడం" మానేసేను – అతనింకా చేస్తూనే ఉన్నారు. అతనికి పనిచేసి మెప్పించడమే కాదు; పనిచేయించుకుని సాధించడం కూడా ఒచ్చును. (మళ్ళీ రెండర్థాల మాటలు రెండు పడ్డాయి : "పనిచేయించుకోడం", "సాధించడం". . . . . వదిలేద్దాం).

కొంతకాలం కిందటి దాకా సినిమా ప్రకటనల్లో – అంటే పత్రికల పేజీల్లోనూ, వాల్ పోస్టర్ల మీదానూ – "నేడే చూడండి!" అని కూడా చేర్చేవారు. దానికి అవసరాల రామకృష్ణారావు వ్యాఖ్య: "రేపుండదు" అని. ఈ వ్యాఖ్య ఆధారంగా "ఎమ్వీయల్" బాపుగారి చేత ఒక బొమ్మ వేయించి, తాను గౌరవ సంపాదకుడుగా ఉండిన ఒక మాస పత్రికలో ప్రచురించేరు. (తరువాత ఆ పత్రిక "నేడే చూడండి, రేపుండదు" అన్నట్టుగా ఆగిపోయింది; అది వేరే సంగతి)

సినిమాల నాణ్యత మీద అయితేనేమి, వ్యక్తుల విపరీత బుద్ధుల మీద అయితేనేమి, సంస్థల పెడధోరణుల మీద నైతేనేమి, అవసరాల రామకృష్ణారావు వ్యాఖ్యలు అలా క్లుప్తంగానూ, చురుగ్గానూ ఉంటాయి. అవి, తగలవలసిన వాళ్ళకి, తగల వలసిన చోట, లేదా తగల కూడని చోట్ల– తగిలినా; అందులో కోపం తెచ్చుకోవలసిన దేదో వుందన్న సంగతి వాళ్ళకి స్ఫురించక పోవడం అవసరాల రామకృష్ణారావు హాస్యంలో ఒక ముఖ్యమైన లక్షణం.

సంచలనాత్మకమైన రచనలతో గాని, ''సామాజిక స్పృహ''తో గాని; ధగధగ లాడి పోకుండానే; పాఠక హృదయాల్లో చెరగని ముద్ర వేయగలిగిన సమర్థులైన రచయితల్లో అవసరాల రామకృష్ణారావు ఒకరు. అరవై శాతం రంజక శక్తి, నలభై శాతం వికాసం కలిపి ''ఇన్‌స్టెంట్''

రచనలు చెయ్యగలరాయన.

1948 ప్రాంతంలో ఖాసా సుబ్బారావుగారు నడుపుతూ ఉండిన "తెలుగు స్వతంత్ర" వారపత్రికలో అవసరాల రామకృష్ణారావు కథలు చాలా తరచుగా అచ్చవుతూ వుండేవి.

ఆ పత్రికకి ఎడిటర్ ఖాసా సుబ్బారావుగారి పేరే ఉండేది కాని, అసలు ఎడిటర్ గోరాశాస్త్రి గారేనని అందరికీ తెలిసే వుండేది. గోరాశాస్త్రి గారు ప్రోత్సహించినంత ధైర్యంగా ప్రతిభను ఎవరో గాని ప్రోత్సహించగలిగి వుండేవారు కాదు. అవసరాల రామకృష్ణారావు కథలు వారం విడిచి వారం, ఒక్కొక్కప్పుడు వరసగా మూడు నాలుగు వారాలు కూడా ప్రచురించే వారు ఆయన. అలా అని రామకృష్ణారావు "స్వతంత్ర" రచయిత అని బ్రాండై పోకుండా మిగిలిన పత్రికల్లో కూడా అంత పుంఖాను పుంఖంగానూ రాసేవారు. వినోదిని, చిత్రగుప్త, సూర్యప్రభ, కథాంజలి, ఆంధ్రమహిళ, గృహలక్ష్మి లాంటి తక్కువ సర్క్యులేషన్ గల పత్రికలకి కూడా ఆయన రాసేవారు. బాల, చందమామ, ఆంధ్రపత్రిక వీక్లీ, స్వతంత్ర, ఆనందవాణి లాంటి భారీ ఆదరణగల పత్రికలకీ రాసేవారు. క్లాస్‌నీ, మాస్‌నీ ఏకకాలంలో రంజక స్థితికి తీసుకు వెళ్ళగలిగే రచనలు ఆయనవి. ఖచ్చితంగా చెప్పవలసి వస్తే అవసరాల రామకృష్ణారావు హాస్య ధోరణిలో చేసిన రచనల్లో కూడా పడీ పడీ నవ్వవలసిన వాటికంటే సున్నితమైన బాధల్నీ అంతకంటే సున్నితంగా అనుభవింపజేసేవి అధికం అని చెప్పాలి. చమత్కారానికి అందెవేసిన చెయ్యి రామకృష్ణారావుది.

రామకృష్ణారావు తన పాఠకుల్ని ఆకట్టుకునే మార్గాల్లో తన రచనలకి శీర్షిక పెట్టడం ఒకటి. "ఎవడితో నైనా లేచిపోరాదూ?" – "డబ్బు సంపాదనార్థాయ"– "తమరు కాలం చెయ్యండి, తద్దినాలు పెట్టకపోతే అడగండి!" – "తమ మగసిరి తగలేసిరి" – అని కధానికలకి టైటిల్స్ పెట్టడం, తద్వారా తన కథల్ని చదివించుకోడం ఆయన ప్రత్యేకత. నవలలకైనా సరే; "సంపెంగలూ, సన్నజాజులూ" –"మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?" – "అమ్మకానికో అబ్బాయి" – లాంటి టైటిల్సు ఆయనే పెట్టగలరు. కథల సంపుటానికి "అర్థమున్న కథలు" – "అయిదు రకాల ఆత్మ హత్యలు" లాంటి టైటిల్సు పెట్టి (లోపల ఆ శీర్షికల్తో ఏ కథలూ లేకపోయినా సరే) – పుస్తకాలు వెయ్యగలరు. లెక్కలలో తమాషాలు సబ్జక్టుగా నిర్వహించే సీరియల్‌ని 'మేధ मे tricks' అనగలరు. "ఇసక తక్కెడా పేడ తక్కెడా" అని నుడికారం చెయ్యదగిన కథకి "కేటూ–డూప్లికేటూ" అని నామకరణం చెయ్యగలరు. కథ, నవల, బాల సాహిత్యం, అనువాదం, పాట, పద్యం, నాటిక వంటి ప్రక్రియలన్నిటా తన సామర్థ్యం చూపిన అరుదైన రచయిత అవసరాల రామకృష్ణారావు.

రామకృష్ణారావు 1931లో పుట్టేరు. వాళ్ళ నాన్నగారు బ్రిటిష్ దొరల కాలంలో డిప్యూటీ కలెక్టర్‌గా పనిచేసేరు. (అప్పట్లో ఐ.సి.ఎస్. లనే కలెక్టర్లుగా నియమించాలని ఒక నియమం ఉండేది; లేకపోతే జగన్నాథరావుగారు కలెక్టర్‌గానే రిటైర్ అయి ఉండేవారు). చదువులో చురుకుదనం పోగొట్టుకోకుండా సాహిత్యం మీద అభిరుచిని పెంచుకుంటూ వచ్చిన రామకృష్ణారావు ఇరవై మూడో ఏట ఒకటి, ఇరవై నాలుగో ఏట ఒకటి ఆంధ్రపత్రిక వీక్లీ వారి

కథల పోటీల్లో బహుమతులు గెల్చుకున్నారు (ఆ బహుమతులు యాభై రూపాయలకి మించి ఉండేవి కావు; అయితే అవి ఎంత ప్రతిష్ఠాత్మకమైనవో అప్పటి వాళ్ళకి తెలుసు). 1969 నాటికే ఆయన సాహిత్య అకాడమీ అవార్డు విజేత (అది, ''అర్థమున్న కథలు'' అనే కథా సంపుటానికి).

రామకృష్ణారావుకి తెలుగు భాష అంటేనూ తెలుగు సంస్కృతి అంటేనూ వల్లమాలిన ప్రేమా, గౌరవం. జీవిక కోసం ఇంగ్లీషు అధ్యాపకత్వం చేపట్టినా, అనవసరం అయిన చోట్ల ఇంగ్లీషు వాడడం చూస్తే ఆయనకి హేళనా భావం కలుగుతుంది (కోపం కాదు). కావ్యాలూ పురాణాలూ శ్రద్ధగానూ గౌరవంతోనే చదివినా, వాటిల్లో సంస్కృత సమాసాలూ వ్యర్థపదాలూ ఆయనకి హేళన భావాన్ని కలిగిస్తాయి. తాను చదివే వాఙ్మయానికీ తాను సృజించే సాహిత్యానికీ మధ్య ''అవసరం'' అయిన దూరాన్ని జాగ్రత్తగా కాపాడుకోడం రామకృష్ణారావు మార్గం.

రామకృష్ణారావు ఋజుమార్గ వర్తి. నియమం, సమయం ఆయనలాగా పాటించే వారు అరుదు. ఆ పాలన వల్ల తాను నష్టపోయినా సరే; పశ్చాత్తాపం; ప్రాప్తకాలజ్ఞత ఆయనకి కలగవు. వృథాగా ఉపకారాలు చేసేసే బుద్ధి తప్ప మరో వ్యసనం లేదాయనకి. ''కష్టమైనను, ఇష్టమేనని'' జార్జి ఆర్వెల్ రచనలనే తన డాక్టరేటుకి సబ్జక్టుగా తీసుకుని ఎల్.ఎస్.ఆర్. కృష్ణశాస్త్రి వంటి ''కఠిన నియమాల గైడ్'' ద్వారా పిహెచ్.డి. పట్టా సాధించారు. మంచి సంగీత సభల దగ్గిరా అట్టహాసాలూ భేషజాలూ లేని సాహిత్య సభల్లోనూ కనిపించడం ఆయనకిష్టం. కోపం వస్తే మితభాషి అయిపోడం, గర్వం కలిగితే తనలో తానే నవ్వుకోడం; ఆయన సాధనలు. ఇల్లు ఇరుకనీ ఇల్లాలికి అనారోగ్యమనీ జంకక; శరీరంలో చురుకుదనం, మనసులో మంచితనం, రాతలో చిలిపితనం కాపాడుకో గలిగిన తెలివరి. వీథిలో మందారాలూ, డ్రాయింగ్ రూంలో మత్స్యావతారాలూ (అంటే ఏక్వేరియా) పెరట్లో మధుర స్వరాలూ (లవ్ బర్డ్స్) మనకి అవ్యాజంగా దర్శన మిస్తాయంటే ఆ వ్యక్తి శక్తి ఎంతో తెలుస్తోంది కదా.

రామకృష్ణారావుగారు తన జీవితంలో Prime Time అంతా ప్రవాసాంధ్రుడుగా గడిపేరు. అయినా సరే; ఆయన రచనలు పుంఖాను పుంఖాలుగా వెలువడడం, అవన్నీ ఎప్పటి కప్పుడు పుస్తక రూపంలో రావడం, ఒచ్చిన ఏడాది కల్లా అమ్మకాలయి పోయి ఆ ప్రచురణ కర్తలని సుఖ పెట్టడం– ఆనవాయితీ. ఆయన రచనలకి పుస్తకరూపాలు ఏర్పడినప్పుడల్లా ఇంతో అంతో నేపథ్య సంగీతం సమర్పించడం నాకు అలవాటు. కొన్ని పుస్తకాల విషయంలో నా సంగీతం ''సమంగా రికార్డవలేదు''. అయినా సరే – ఈ ఉద్యమంలో ఓటమి లేదనే నేను అనుకుంటున్నాను. . . . .

# 'జై!'కి బహువచనం "జై'లు!"




**కంటి** పరీక్ష పూర్తి కాగానే, ఆ ఊర్నించి బయల్దేరి ఈ ఊరు వచ్చినందుకు సంతృప్తే మిగిలింది ప్రభాకరానికి. ఫీజు ఎక్కువే కావచ్చు గాని ఎగ్జామినేషన్ థరోగా జరిగింది. అన్నిట్నీ మించి డాక్టరు గారి అనునయ వాక్యాలు ఆయన్నెంతో సేద తీర్చాయి. "కుడి కంటిలో శుక్లం మెచూరయింది. మొదట దాని కాపరేషన్ జరగాలి. రెండో కన్ను ఇంకో ఏడాదిలో కాటరాక్టు ముదిరి ఆపరేషన్‌కి సిద్ధం కావొచ్చు. అందుకనే మొత్తమ్మీద విజన్ మీకంత పూర్‌గా ఉంది. అప్పుడే బాగా చీకటి పడిపోయింది. ఇంత రాత్రి వేళ ఎక్కడికి వెడతారూ? మా బాయ్‌ని మిమ్మల్నేదైనా లాడ్జి దాకా దిగబెట్టి రమ్మననా?" అన్నాడు.

"అక్కర్లేదండీ ఆటోస్టాండు దాకా రమ్మనండి, చాలు. రైల్వే స్టేషనుకి మాట్లాడుకుంటాను. పాసెంజర్లో వచ్చేస్తాననీ, స్టేషనుకి రమ్మనీ అబ్బాయికి చెప్పాను. నో ప్రోబ్లమ్" అంటూ థాంక్సు చెప్పి, చేతికర్ర పట్టుకు నడుస్తూ ఆటో స్టాండు చేరుకున్నాడు ప్రభాకరం. అక్కడే అనుకోకుండా

కలిసింది సరస్వతి "మేష్టారూ, మీరా? ఎన్నేళ్ళైంది, ఎంతదృష్టం!" అనుకుంటూ.

పత్రికల్లో పేజీలు తిప్పినట్టుంటుంది, విద్యార్థులతో టీచర్ల పరిచయం, పాతికేళ్ళకి పైగా వేల కొద్దీ విద్యార్థులతో జ్ఞాపకాలయితే మరీను. పత్రికల్లో పేజీల్లో కూడా ఒకటో రెండో మరో సారి వెనక్కి తిప్పి చదువుకోవాలనిపిస్తుంది. అందుకే కలుసుకుని పదిహేనేళ్ళకి పైగా అయినా తన దగ్గర చదువుకున్న సరస్వతిని అట్టే ఇబ్బందిలేకుండా గుర్తు చేసుకోగలిగాడు ప్రభాకరం. అందుకే డాక్టర్ సలహాని తిరస్కరించినా సరస్వతి ఆహ్వానాన్ని అతడు కాదనలేకపోయాడు. మేష్టార్ని పక్కన కూచోబెట్టుకుని తన యింటి వైపు ఆటోని మళ్ళించింది సరస్వతి. ఇక దారి పొడుగునా ఆ కబుర్లే కబుర్లు. 'మేష్టారూ మీరా రోజుల్లో మాకు చెప్పిన ఆ భర్తృహరి సుభాషితంలోని ఆ భాగం మీకు గుర్తుందా? ఏదనుకున్నారు, 'సాధు సద్గుణలవంబులు కొండలు చేసి మెచ్చుచున్' అనేది. పుస్తకాల్లో చదివితే ఇలాంటి వాళ్ళుంటారా! అనుకుంటాం. ఎప్పుడు ఏ పుణ్యం చేసుకున్నానో అలాంటి ఇంట్లోనే పడ్డాను. మా అత్తగారూ, మామగారూ, మా ఆయనా అందరిదీ అలాంటి వెన్న పూస మనస్తత్వం. ఇక నా కొడుకు లిద్దరూ వంకలేని చంద్ర వంకలు... నిజంగానేనెంత అదృష్ట వంతురాల్లో, మీ కళ్ళతో మీరే చూస్తారుగా!'

నిజానికి ఆ మసక చీకటి వేళ, కంటి దృష్టి లోప భూయిష్ఠమైన సందర్భంలో, ప్రభాకరానికిసరిగా చూసే అవకాశం ఎలాగా లేదు. అయినా వీనుల విందుగా ఆ అమ్మాయి అందిస్తున్న కబుర్లు మనసుకెంతో మధురంగా ఉన్నాయి. బాహ్యదృష్టికి అందిన కాడికి సరస్వతి కాస్త చిక్కిపోయిందేమో అనిపించింది. ఆమె వెలిబుచ్చే తృప్తి ముందు అది ఏ పాటిది!

అంతే కాదు ఇంటికెళ్లి సరస్వతి పిల్లల్నీ, అత్తమామల్నీ కలుసుకున్నాక, ఆ అమ్మాయి చెప్పిందాంట్లో ఆవంత అబద్ధం లేదనిపించింది.

ఎప్పుడో దశాబ్దంన్నర క్రిందట తనకి పాఠం చెప్పిన పంతులుగార్ని ఎంతో ఆప్యాయంగా ఆదరించి సకల మర్యాదలూ చేసింది సరస్వతి. వాళ్ళాయన క్యాంపు కెళ్ళేడుట, చూపించలేక పోయినందుకు ఎంతో నొచ్చుకుంది. ఇంట్లో వాళ్ళు కంగారు పడతారు గనక వెళ్ళక తప్పదనీ, తెల్లారి ప్యాసెంజర్లో వెళ్ళి పోతాననీ ప్రభాకరం చబితే, అతి కష్టం మీద ఒప్పుకుంది. "మీరూ, పిన్నిగారూ వచ్చి మా యింట్లోనే దిగండి. మీ కంటి ఆపరేషన్‌కి మా చేతనైన సహాయం చెయ్యనివ్వండి. ముందుగా రాస్తే నేనో, ఆయనో స్టేషనుకి వస్తాం" అని ఎడ్రసిచ్చింది.

మర్నాడు ఉదయం ప్రభాకరం వెళ్ళిపోయే ముందు సరస్వతి మామగారు అతన్ని సాగనంపుతూ అన్న ముక్కలు :

మేష్టారూ, మా కోడల్ది బంగారం లాంటి మనసు. పెద్దలంటే ఇలాంటి గౌరవం, ఆదరణా ఈ కాలంలో ఎరగం. రోజుకో సారైనా 'మా ప్రభాకరం మేష్టారు' అంటూ మిమ్మల్ని తలుచుకుంటూ ఉంటుంది. తన పెళ్ళికి మీకు ఎలక్షన్ డ్యూటీ పడి రాలేకపోయారనీ, ఆ తర్వాత ఎక్కడికో బదలీ అయిపోయి మీ భోగట్టాలే తెలీలేదనీ నొచ్చుకుంటూ ఉంటుంది. నిన్న ఎంతో గొప్పరోజు, 'వద్దే, ఈ రోజుకి ఎలాగో సర్దుకుంటానే ఆ మాత్రలు ఈ చుట్టు పట్ల దొరకవే తల్లీ అంటే అలాకాదని, ఆ చిరు చీకటి వేళ అంత దూరమూ పరిగెత్తింది. దాని మంచి మనసుని దేవుడు గ్రహించాడు. లేకపోతే అక్కడే ఉన్న ఆస్పత్రికి మీరు పరీక్ష నిమిత్తం రావటమేమిటి చెప్పండి? మేం ఈనాడు

జైకి బతుకువచనం "జైలు!"

ఇలా ఈ వృద్ధాప్యంలో సేవలు పొందుతున్నామంటే ఆ నాడు మీరిచ్చిన శిక్షణే కారణం.''

అత్తగారు కూడా శ్రుతి కలిపింది.

"దానిల్లూ, మా ఇల్లూ అని వేరు వేరు లేవు. ఏ మాత్రం మొహమాట పడకుండా ఈ సారి మీరు మా ఇంట్లో నే దిగండి. మీ లాంటి వారు ఇన్నాళ్లకి మా ఇంట్లో కాలుపెట్టారు, ధన్యులం.''

కేవలం మాటలతోనే వారు సరిపెట్టలేదు ప్రభాకరం చేతితో కొత్త బట్టల జత ఒకటి పెట్టి నమస్కరించారు. వారి ఆప్యాయత అతన్ని ఊపిరి పీల్చుకోనివ్వలేదు..

"చూడండి, నా సొంత పని మీద వచ్చాను. ఇపుడు మీరిలా ఇస్తే పుచ్చుకోడానికి నాకు బాగుండదు. ఏదైనా శుభకార్యానికి పిలవండి అప్పుడు ఒచ్చి పుచ్చుకుంటాను.''

వారి నెలాగో కాదన్నా ఆటో దాకా తనని సాగనంపినసరస్వతి బట్టల ప్యాకెట్టు ఆటోలో పెట్టేస్తే తీసి కింద పడెయ్యడం అతని వల్ల కాలేదు. ఆటో కదిలి పోతుండగా చెయ్యి ఊపుతూ సరస్వతిని ప్రేమగా చూశాడు. ముందు రోజు తన కన్ను తనని దగా చెయ్యలేదు గాని బాగా చిక్కిపోయినట్లు మాత్రం అనిపించింది. సరస్వతి ఎప్పుడూ సన్నమే అనే మాట అతనికి తెలిసిందే కాని మరీ ఇంతగానా!

ఆటో పొడుగైన ఆ వీధి చివర దాకా వెళ్లిందో లేదో, ఇంచుమించు ఎదురుగా వచ్చేసి ఓ అమ్మాయి "ఏయ్ ఆటో ఆపు!" అని అరచింది. ఆటోవాడికి బ్రేక్ వెయ్యక తప్పలేదు.

'సారీ, నా కంగార్లో నేను ఆపు చేశానే కాని లోపల ఎవరో పాసింజరున్నారని చూసుకోలేదు..' . అంటూ అతనికి సారీ చెప్పుకుని ప్రభాకరం కనపడగానే "హౌ ఏక్సిడెంటల్! మా తెలుగు మాష్టారు ప్రభాకరరావుగారు కాదు కదా!" అంటూ ఆ ఆటో వాడ్ని రెండ్రూపాయిలిచ్చి పంపేసింది. ఆ పక్క నున్నదే తను అద్దెకున్న వాటా అనీ, కాఫీ తాగి వెళ్లందే కుదరదనీ, అతని బ్యాగ్ పట్టుకు ముందుకు నడిచింది. "మళ్లీ పాసెంజరు అందదు తల్లీ!" అని అతనెంత గోల పెట్టినా వినలేదు.

ఇంతకీ అనుకోని ఈ ఆతిథ్యాల ద్వయంలో ఆ రెండో వ్యక్తి ఎవరో ప్రభాకరానికి ఓ పట్టాన గుర్తు రాలేదు.

"ఎప్పుడో ఎన్నేళ్ల కింద చదివిన అమ్మాయినో గర్తు పట్టానంటున్నారు. నేను మీ దగ్గర చదువుకుని నాలుగేళ్ళు కూడా దాటలేదు. నేనేం పాపం చేశాను మేష్టారూ! నాపేరు రేవతి. ఇంకా గుర్తురాలేదు కదూ? డిబేటింగ్ కాంపిటీషన్‌లో నాకు ఫస్ట్ ప్రైజ్ ఇస్తూ 'మాటల్లో ఘాటుని భరించలేను గాని నీ వాగ్ధాటిని కాదన లేను' అన్నారు. అది గుర్తులేదూ?"

"ఏదో గుర్తొస్తున్నట్టే ఉంది. ఎందుకుకాదనడం!' అనుకుంటూ "అవునవును గుర్తొచ్చింది." అనేశాడు ప్రభాకరం.

మాంచి స్ట్రాంగ్ కాఫీ ఇస్తూ రేవతి తన గురించి చెప్పింది. ఎమ్మే అయిందిట, ఈ మధ్యే యూనివర్శిటీలో రీసెర్చి స్కాలరుగా ఎన్రోలు చేసిందిట. అందాకా ఏదో ట్యూటోరియల్ కాలేజీలో పని చేస్తోందిట.

'పై ఊళ్లో కాపరం పెట్టి, ఆడపిల్లవి ఇంకా చదివి ఎవర్ని ఉద్ధరిస్తావమ్మా?' అనుకున్నాడు ప్రభాకరం. ఆ మాటే అనేశాడు. "ఏమో అనుకున్నాను. నాదే పొరపాటు పెద్దాళ్ళ బుద్ధులెప్పుడూ ఒకలాగే ఉంటాయి. మేమే మారాలి.'' అది రేవతి తనలో తనే అనుకుంటున్నట్టు.

అలాంటి జవాబు ఆమె నుంచి ఆశించని ప్రభాకరం తెల్లబోయాడు. కాలి వేలితో నేలని గోకుతూ ఆమె ఇలా కొనసాగించింది. "ఏం చెయ్యమన్నారు? మమ్మల్నిలా అనిపిస్తున్నది మీరే. మా అమ్మా, నాన్నా కూడా ఇదే వరస. ఇలా నేను వేరే ఊళ్లో నా మటుకు నేను జాబ్ చెయ్యడానికెంత పోరాడవలసి వచ్చిందో మీరు ఊహించలేరు. పోనీ ఇక్కడైనా పీస్‌ఫుల్‌గా బతకనిస్తారా? ఏ ఉత్తరంలో అయినా అదేమాట!"

"ఏమాట?"

"ఇంకే మాట, నా పెళ్ళి మాట! జీవితంలో అన్నిటి కన్నా అదే ముఖ్యమైనట్టు! ఆఖరికి నేనేం రాయవలసి వచ్చిందో తెలుసునా మేష్టారూ? ఏం చెప్పమన్నారు కర్మ!"

రేవతి వాళ్ళ నాన్ననిలా హెచ్చరించిందట.

'చూడు నాన్నా, అమ్మకి కూడా చదివి వినిపించు ఎన్నో సార్లు రాశాను మీ ఉత్తరాల్లోనా పెళ్లి ప్రసక్తి తీసుకు రావద్దని, మీరు నా రిక్వెస్టుని లెక్కపెట్టడం లేదు. ఇక ముందు మాత్రం అది తీసుకురావద్దు. తీసుకువచ్చారో -

1. ఇక నా నుంచి జవాబు ఉండదు.

2. ఆడ పిల్ల పెళ్ళి మీద ఇంతటి అనవసర ప్రాముఖ్యం మన దేశంలోనేమో... అదే అయితే స్టేట్సుకి ఎప్లైచేసి నేను మీ మీద పగతో పారిపోవలసి ఉంటుంది.

"ఇది మీ మీద పగతో రాసింది కాదు. నా వ్యక్తిత్వం రక్షించుకునే ప్రయత్నం." రేవది చెప్పడం అవగానే ప్రభాకరం లేచినిలబడ్డాడు టైమైందంటూ, ఉండండి ఒక్కనిముషం" అంటూ పక్కింటికి పరిగెత్తుకు వెళ్ళింది. అంత వేగంతోనూ తిరిగొచ్చి "ఇప్పుడే రైల్వే స్టేషనుకి ఫోన్ చేసి వచ్చాను. మీరు వెళ్ళే ప్యాసెంజరు గంట లేటట. ఇంకో అరగంట అయాక తీరిగ్గా బయల్దేరవచ్చు. ఆ చేత్తో మా పని కుర్రాణ్ణి హోటలుకి పరిగెట్టించాను. ఇక్కడి మోడరన్ కేఫ్‌లో ఉప్మా, పెసరట్టూ చాలా బాగుంటాయి. తిని మరో డోసు కాఫీ తాగి మరీ వెడుదురుగాని...ప్లీజ్...

"మీరలా మంచం మీద పడుకోండి సార్. అన్నట్టు ఎంత సేపూ నా గొడవే చెబుతున్నాను మీరెందు కొచ్చారో చెప్పరూ. మరెవరో మీ ఎక్స్‌స్టూడెంట్‌ని కలుసుకున్నారన్నారు. ఎవరామె?'

ఆ ప్రశ్నతో లేని బలం వచ్చినట్టైంది ప్రభాకరానికి. పెళ్ళి అనేది ఆడదాని కయినా మగాడి కయినా ముఖ్యమా, కాదా అనేది వేరే విషయం కాని, పెళ్ళి అయ్యాక కూడా ఎన్నేళ్ళయినా హాయిగా ఉండొచ్చు. సరస్వతి నెలకొల్పిన ఆదర్శం తలుచుకుంటే ఆమెకు బోధ చేసిన గురువుగా తన మనసు పులకించి పోతోంది. రేవతి ముందు అదెందుకు బయట పెట్టకూడదనిపించిందతనికి.

"నువ్వు ఈ చివర ఉంటే సరస్వతీ వాళ్లిల్లు ఆ చివర ఉంది. నీలాగే ఆ అమ్మాయి కూడా ఒకప్పటి నా శిష్యురాలు. అనుకోకుండా నిన్న రాత్రి శివశంకర్ ఐ క్లినిక్ సమీపంలో నన్ను కలసి వాళ్లింటికి తీసికెళ్లింది. నీ కంటె ఓ పదేళ్లు పెద్దదేమో తను..."

"అయ్యో, ఇంత సేపూ మీరు చెబుతున్నది సరస్వతీ ఆంటీ గురించా? బాగా పొడుగ్గా తెల్లగా..కళ్ళజోడూ..ఆవిడేనా?"

"ఆ! ఆవిడే, ఆ ఇల్లూ, కాపురం ఆ అత్తమామలూ, పిల్లలూ చూస్తే ఎంత ముచ్చట వేసిందో... ఆవిణ్ణే నువ్వు ఎరుగుదువా?"

---

పైకి బహువచనం "పైలు!"

"అయ్యో రామా, సరస్వతీ ఆంటీ గురించి నాకు తెలీక పోవడం ఏమిటి మేష్టారూ! మూడు నెలల క్రిందటి దాకా వాళ్లు ఈ పక్కనున్న పెద్ద వాటాలోనే కదా అద్దెకుండే వారు. ఇప్పుడు మీరు వెళ్లిన ఇల్లు వాళ్లు కొత్తగా కట్టుకున్న సొంత ఇల్లు!"

. "అలాగా?"

"ఒక్క రాత్రి పరిచయంతోనే మీరెంత తెలుసుననుకుంటున్నారు? ఏడాదిపై మాటగా నేను ఆంటీని స్టడీ చేసాను. ఊరుకోలేక ఎంతో చెప్పి చూసాను....ప్చ్... అలాంటి వాళ్ళిక మారరు సార్..."

ప్రభాకరం గుండె దడ దడలాడింది.

"ఏమిటి రేవతీ నువ్వు చెబుతున్నది? సరస్వతి లాంటివాళ్ళు ఇక మారరంటావా? ఎందుకు మారాలిట? నువ్వేం తెలుసుకున్నావో ఏమో, నేను చూసింది చెప్తా విను. ఆవిణ్ణి వాళ్లత్తమామలు నట్టింట దీపంలా చూసుకుంటున్నారు. వాళ్ళాయనకి ఆవిడ ఆరో ప్రాణంట. ఇక పిల్లలకి సరే సరి, వాళ్లమ్మ వాళ్లకో దేవతా స్వరూపం!"

రేవతి వికృతంగా నవ్వుతూ చప్పట్లు కొడుతూ అంది. "ఎంత సరిగ్గా చెప్పేరు మాష్టారూ, భేష్!"

ప్రభాకరం ఆశ్చర్యంగా చూస్తూంటే రేవతి చెప్పింది.

"పెళ్ళైన ఆడది ఎలా తయారవుతుందో మీ నోటితో మీరు స్పష్టంగా చెప్పేరు. ఆడది ఒకరికి దీపంలా కనపడాలి. మరొకరికి ప్రాణంలా ఉండాలి. ఇంకొకరికి దైవంలా గోచరించాలి. మానవ స్వరూపం అని మాత్రం ఏ ఒక్కరికీ తోచకూడదు. అందుకే చూసి చూసి పెళ్ళనే ఊబిలోకి దిగడానికి నాకు దడ పట్టుకుంది!"

ఇలాంటి ఆరోపణ వినడానికి ప్రభాకరంలోని గురువు సిద్ధంగా లేడు. ఇదేదో తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. వచ్చిన ఈ అవకాశం చేజార్చుకోడానికి రేవతి కూడా సిద్ధంగా లేదు. ఇంటి పక్క ఇంకెవరున్నా పట్టించుకోని విద్యాదాహం రేవతిది. అయితే ఓ సారి ఆమె సరస్వతి పట్ల కుతూహలం చూపే సంఘటన జరిగింది. ముందటేడు అవకాయ సీజనులో జరిగిన ముచ్చట అది రేవతి చెప్పుకొచ్చింది.

లైబ్రరీ నుంచి వస్తూ తను సిటీ బస్ కోసం స్టాప్‌లో వెయిట్ చేస్తూంటే, ఏదో బాగా బరువైన పేకెట్ ఒకటి మోసుకుంటూ సర్వతీ ఆంటీ అక్కడి కొచ్చి "ఖాళీ ఆటో ఏదైనా ఇటెడుతుందేమో కాస్త చూసి పెడతావా అమ్మాయ్!" అంటూ అక్కడ కూలబడిందిట. తేరిపార చూస్తే తన పక్కింటి ఆంటీ. తన పక్కింట్లోనే ఉంటుందని అప్పుడు గుర్తుకొచ్చి... "ఇదేమిటాంటీ, ఇంటి కింత దూరంలో ఈ వేళప్పుడు మీరు..."

'ఇందాకే వెళ్ళి పోదామనుకున్నాను. ఆ కిరాణాకొట్లో బాగా రష్‌గా ఉండి కుదిరింది కాదు."

వస్తున్న ఆటోను బేరమాడి తనే బస్తాలాంటి పాకెట్‌ను ఆటోలో చేర్చి ఇద్దరూ ఆటో ఎక్కేశారుట చేరే స్థలం ఒకటే కాబట్టి ఇంటికి చేరే దాకా అనేకం మాటాడుకున్నారట. సరస్వతి వివరించింది.

"ఇవి మాడుగుల ఆవాలని ఓ ప్రత్యేక రకం. కూరు ఆవకాయ అంటారు వినే ఉంటావ్. వాటికి ఇవే బావుంటాయని ఇత దూరం వచ్చాను. వచ్చినందుకు కాస్త శ్రమా, ఖర్చూ అయితే

అయింది కానీ, ఒకటే రకం సరుకు దొరికిందనుకో. ఇక మన కళ్లెదుట గానుగ ఆడించిన నువ్వుల నూనె అంటావా, అదృష్టవశాత్తూ మన పక్క వీథిలోనే దొరుకుతుంది. ఇక గొల్లప్రోలు పచ్చమిరపకాయలని ఉంటాయి. వాటికోసం ఒహర్ని పురమాయించాను. ఇక అప్పుడు దగ్గరుండి కోయించుకున్న పుల్ల మామిడి కాయ కావాలి. నేడోరేపో తోటల మీదకి నేనే బయలుదేరుతాను ఇలా ఓ వారం రోజులు కష్టపడితే ఏటి కేడాదీ తినే, ఊటలూరే ఊరగాయ పెట్టుకోవచ్చు.'

"ఆవకాయ పెట్టడంలో కూడా ఇంత రీసెర్చి వర్క్ ఉందన్నమాట!"

"ఎమ్మే లిటరేచర్ చేశాను. నేను పరిశోధన పత్రం సమర్పించడానికి ఏ రచయితని ఎంచుకుందామా అని చూస్తున్నాను. డాక్టరేటు సంపాదించాలంటే మాటలా? ఎన్నో చోట్ల తిరగాలి. ఎన్నెన్నో విషయాలు సేకరించాలి. అన్నీ మిళాయించి రుచికరంగా తయారు చేసి సిద్ధాంత వ్యాసం అందించాలి."

"దానికీ దీనికీ పోలిక ఏమిటి? డాక్టరేట్ అంటే కాన్వొకేషన్‌లో అందుకునే ఓ కాగితం ముక్క అంతేగా, ఆవకాయ అయితే ఎంచక్కా ఏడాదీ తినొచ్చు."

"నేనో మాట అంటాను, మీకు కోపం రాదుగా ఆంటీ?"

"అడుగు. కోపం దేనికి?"

"దానికీ, దీనికీ పోలిక లేని మాట మాత్రం నూటికి నూరు పాళ్లూ నిజం. బాగా చదువుకుని డాక్టరేటు తెచ్చుకుంటే పెద్ద ఉద్యోగం వస్తుంది. మంచి జీతం లభిస్తుంది. ఇంకొకరి మీద ఆధారపడి బతక్కుండా, సంపాదించి బతకగల భద్రత లభిస్తుంది. అలాంటి సెక్యూరిటీలోనే ఆడదాని వ్యక్తిత్వం నిలబడేది. ఏడాది మాత్రమే ఉండగల ఆవకాయతోనే మన ఆడవాళ్ల శ్రమా, సమయమూ వృధా కావాలా! బతికున్నన్నాళ్ళూ మనల్ని మనం నిలబెట్టుకునే వ్యక్తిత్వం సమకూర్చే పోరాట దిశలో మనం సంఘటితం కావొద్దా?"

"ఏమిటో నువ్వు చెబుతున్న ఒక్క ముక్క నాకర్ధం కావడం లేదమ్మాయ్! మొగుడూ, పిల్లలతో హాయిగా తృప్తిగా బతక్క, ఏదో పోరాట దిశ అంటావేమిటి? సకాలంలో పెళ్లి కాక నీకేమైనా బుర్ర పాడైందేమో!"

"థ్యాంక్సు ఫర్ ది కామెంట్... బుర్రంటూ ఉంటే కదా పాడవటానికి?"

"అంతే నాకు బుర్ర లేదనే కదా నీ ఉద్దేశ్యం?"

"ఎగ్జాట్లీ, అదే ఉంటే ఇలాగే ఉందురా? పనిమనిషి సూరమ్మ చెప్పింది. మీ ఇంట్లో మీరొక్కరు తప్ప మరెవరూ ఆటు వస్తువు ఇటు తీసి పెట్టరటగా?"

"ఎందుకు పెట్టాలి? మెట్టినింటికే నా సర్వస్వం అర్పించదల్చుకున్నాను. సేవించి తరించ దల్చుకున్నాను. ఇంతకీ నేను సేవ చేస్తున్న దెవరికి? నా భర్తకీ, పిల్లలకీ. ఇక ఆ పెద్ద వాళ్ళెవరు? నా భర్తకి జన్మ నిచ్చిన తలిదండ్రులు. వాళ్లనలా కూచోపెట్టి చెయ్యడంలోనే నాకు సార్థకత ఉంది."

'బాగా బుద్ధి చెప్పింది సరస్వతి రేవతికి' అనుకున్నాడు ప్రభాకరం ఓ విధమైన ఊరట పొందుతూ, కానీ రేవతి ధోరణి ద్దాన్ని నిలబడనిచ్చేలా లేదు!

"నేను ఎన్ని సార్లు వాదించినా సరస్వతి ఇదే వరస. మధ్య తరగతి మనస్తత్వం మరి ఆమెలో ఎంతగా జీర్ణించుకు పోయిందో గాని, ఇంకోలా ఆలోచించదే! నా తరపు వాదం మీరైనా వింటారని

ఆశ. ఆత్మ విశ్వాసమూ, స్వయం సంపాదనా అత్యుత్తమ లక్షణాలని మీరే ఎన్నో సార్లు మాకు బోధించారు. అలాంటివి సాధించడం తప్పదంటారా?''

"అనను కాని , మన సాంఘిక జీవనం పరస్పరాధార భూయిష్ఠమై ఉంటుంది గానీ, అంతా ఏకపక్షమై ఉండదు. మనం తింటున్న అన్నం మనం దున్నిన వరిపొలంలోంచి వచ్చింది కాదు. మనం కట్టుకున్న బట్ట మనం స్వయంగా నేత పని చేసుకున్నది కాదు. ఆఖరికి మనం రాసే ఉత్తరానికి మరొకరు కార్డు కొని తెచ్చి, రాసిపెట్టి వారే పోస్టు చేసినా, అనుకున్న ఎడ్రసుకి చేరడానికి మధ్యలో చచ్చినంత తతంగం ఉంది.''

"మీరు చెప్పే ఏ విషయమూ నేను కాదనను. అయితే ఇంకొకరి దోపిడీకి గురి కాకుండా మనం అహర్నిశం జాగ్రత్తగా కాపాడుకోవలసింది మరొకటుంది. దాని పేరే వ్యక్తిత్వం. దాన్ని కించపరిస్తే మాత్రం ప్రతిఘటించి తీరాలని నా నమ్మకం అలాంటి మాయామర్మంలో పడి అదే ఓ సేవాధర్మంగా భావిస్తోంది గనకనే, సరస్వతిలాంటి వాళ్లని చూస్తే ఒకప్పుడు నాకు సానుభూతి ఉండేది. ఇప్పుడది కూడా పోయింది.

"పోనీ నా పరిశీలన సరి అయినదో కాదో మీరే చెప్పండి. వాళ్లందరూ సరస్వతిని నొప్పించే మాట మాటవరసకైనా అనరుసరికదా, ప్రతీ వాక్యం మెప్పుతోనే మొదలెడతారు.

"సరస్వతీ, నీ లాంటి భార్య దొరకడం నాకెంత అదృష్టమో' అంటాడు భర్త. 'కడుపున పుట్టిన ఇద్దరు కూతుళ్లున్నారు మళ్ళీ, ఎందుకూ? అమ్మ ఎలా ఉందని ఆర్నెల్లకో సారైనా ఉత్తరం ముక్క రాయరు. ఇక ఈ కోడలు పిల్ల రాత్రి పావుగంటయినా నా కాళ్ళు పట్టందే మొగుడు పిల్చినా పడగ్గదిలోకైనా వెళ్ళదు! సరస్వతీ. నీ ఋణం ఎలా తీర్చుకోనే!'' అంటుంది అత్తగారు. "కాళ్ళు పీకయినా నేనెక్కడ బయల్దేరతానో అని తెల్లారుజామునే లేచి పేపరుకీ, పాల పేకెట్టుకీ పరిగెడుతుంది మా సరస్వతి. ఇలాంటి కోడలు దొరకడానికి మేమేం పుణ్యం చేసుకున్నామో!'' అంటాడా మామగారు.

"అచట పుట్టిన చివురు కొమ్మైన చేవ'' - అన్నట్లు సరస్వతి కడుపున పుట్టిన కొడుకులూ అంతే 'మా అమ్మ బంగారు,' 'మమ్మీ ఒక దేవత' లాంటి రిమార్కులకి లోపం ఉండదు.

'ఇంటిల్లిపాదీ ఇలా పెద్ద గొంతుకతో చేసే ప్రశంసాప్రసారాలు - అవన్నీ పొందిన సరస్వతికే కాదు, నాలాంటిది అవి వింటూ మూణ్నెల్ల పాటు ముగ్ధురాలై పోయిందంటే, ఓ రాత్రి అనుభవంతో మీ లాంటి వారు భ్రమలో పడ్డం ఆశ్చర్యంకాదు మేష్టారూ.!

"ఇంతలా గాలిలో తేలిపోతున్న' సరస్వతి ఇంట్లో వాళ్ళకి చేసి పెట్టే పనులు ఒకటా రెండా, భర్తకి బ్రష్ మీద పేస్టు వెయ్యడం, మామగారి పంచెకి చిరుగులు కుట్టడం, అత్తగారి జుత్తుకి రంగు వెయ్యడం, పిల్లల పుస్తకాలకి అట్టలు వెయ్యడం... చీకటింట లేస్తే అర్ధరాత్రి దాకా ఎన్నో పనులో! ఎంతెంత ఆనందమో! విగ్రహమైతే సరస్వతికి నాలుగే చేతులేమో... ఈ సరస్వతికి మాత్రం ఇరవై చేతులయినా చాలవు! స్వార్థపరులూ, మోసగాళ్ళూ గనక వాళ్లని నేనేమీ అనను. ఇంతున్న చిన్న కొడుకుతో పాటు పిడికుచ్చులా ఉన్న వాళ్ళ మామగారితో సహా సరస్వతి కాళ్ళు జాపి పడుకోబెట్టి ఏ పాల చుక్కో చెమ్చాతో నోటి కందిస్తే గుటుకు గుటుకూ మింగడానికి సిద్ధమైన వాళ్ళే. అధోలోకమే అదో గొప్ప ప్రపంచమని మురిసిపోయే ఈ ఆంటీకి రాదేం ఎన్ని సార్లు చెప్పినా బుద్ధి? ఈ మధ్య ఎక్కడ చెడగొట్టేస్తానో అనే భయంతో నాతో మాటలు కూడా మానేసింది. తెలుసా మీ శిష్యురాలు?'

'ఈ ఆఖరి దెబ్బతో తుళ్ళి పడ్డాడు ప్రభాకరం. రేవతి కొనసాగిస్తూనే ఉంది. "అవునండి! ఎందుకు మాటాడుతుంది? 'జై' 'జై' ధ్వానాలే జీవితం అనుకునే స్వప్నంలో బతుకుతోంది సరస్వతి. 'జై'కి బహు వచనం 'జై'లు అని తెలుసుకోలేక పోతోంది. ఇప్పుడు కాస్త చిక్కిపోయింది గాని ఒకప్పుడు గులాబీ పువ్వులా ఉండేది. మా సరస్వతి అన్నారు. ఇందాక మీరు కంటి చూపు దెబ్బ తిని కడగంటి చూపుమాత్రమే మిగిలిన మీకు ఆ రాత్రి వేళ అలా అనిపించడంలో ఆశ్చర్యం లేదు. చాకిరీ చేసి చేసి కీళ్ళ నొప్పులు పట్టుకుని, రక్త హీనత ఏర్పడి, ఆరోగ్యమంతా నాశనమై, ఆ గులాబీ పువ్వు ఇప్పుడు పూచిక ముల్లులా తయారైంది. మీ కంటి ఆపరేషను అయాక మరో మారు వచ్చి చూడండి నా మాట అబద్ధమేమో... శరీరం ముల్లులాగా, మొహం చిప్పలాగా తయారు చేసుకోవడమే సతీధర్మమా? 'ఆలు చిప్ప' అనే పదం అలాగే ఏర్పడిందేమో మీ తెలుగు మేష్టర్లే చెప్పాలి. బానిసలా బ్రతకవలసి రావడం దురదృష్టమే. కాని బానిస వ్యవస్థ అనేది అదేదో వర ప్రసాదంలా భావిస్తూ'ఏదో ఇలా రాలిపోతే ఇంతే చాలు!' అనుకునే ఆడాళ్లని మాత్రం గన్‌తీసి పేల్చెయ్యాలనుంటుంది నాకు . అలా తయారైన శిష్యురాళ్లని చూసి దీవించే మేష్టర్లని చూస్తే మాత్రం...'

రేవతి ఏం చేసునో గాని అలా చెబుతూంటే విని తట్టుకోడానికి మాత్రం ప్రభాకరం అక్కడ లేడు. ఆ వీధి చివనున్న ఆటోలో ఎలాగో ఆయాసంతో శరీరం చేరేసి, తొందరగా స్టార్టు చెయ్యమని డ్రైవరుకి చెబుతున్నాడు!.

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 30-4-97)*

# ఆడపడుచులం కాదు, కోడెత్రాచులం !




**'ఎస్, కమిన్'** అని యథా లాపంగా అన్నాడు దిలీప్.తీరా లోపలికి వస్తున్న వ్యక్తినిఫైలులోంచి తలెత్తి చూసి గతుక్కుమన్నాడు. ఆమె జయంతి!

అప్పటికే పుర్తి చేయవల సిన పని పెరిగిపోయిందని ఆరోజు ఎప్పుడూ లేనిది, ఆరింటిదాకా ఉండదల్చుకున్నాడు. అందుకనే ఇంకో అరగంట దాకా డ్రైవర్ని సహా రావద్దని వాచరు వెంకన్న దగ్గిర తాళాలు పుచ్చుకుని అతన్ని కూడా పంపేశాడు.

ఎప్పుడో గాని ఇలా తనకి తాను కాన్సెన్‌ట్రేటు చెయ్యడానికి కుదరదు. పరాకుగా తెరలోంచి చూసి ఎవరో కాంట్రాక్టరు అనుకుని రమ్మన్నాడు. ఎవర్నుంచి తప్పించుకుందామని యిన్నాళ్ళీ తను ప్రయత్నిస్తున్నాడో ఆమెకే తను ఏకాంతంగా చిక్కిపోయాడు!

మెడకి పట్టిన చెమటని రుమాలుతో అద్దుకుంటూ 'ఆఫ్టరాల్ ఆమె ఓ స్టెనో! ఊర్లోనే పెద్ద సంస్థలలో ఒకటైన ఉమా ఫ్యాబ్రికేటర్సు ప్రైవేటు లిమిటెడ్'కి తను జనరల్ మానేజరు. పిచిక పిల్లని చూసి బ్రహ్మాస్త్రం భయపడడమేమిటి? నో, నెవర్' అని తనకి తానే జవాబు చెప్పుకున్నాడు.

జయంతి ఆలోచనలు ఇంకోవిధంగా ఉన్నాయి. తనని ఉద్యోగంలోంచి తీసేశామంటూ ఆర్డరు అందుకొని వారం రోజులయింది. అప్పట్నుంచీ ఆమె మనసు మనసులో లేదు. పేరుకి ప్రెయివేటు కంపెనీ అయినా చాలా ఖచ్చితంగా పనిచేసే సంస్థ అది. అయిదయాక ఇక అయిదు నిమిషాలయినా ఆఫీసులో ఉంచరు. ఇలా ఒకటో తారీకు రావడం భయం అలా జీతాలు చెల్లించేస్తారు. పై పని అంటూ ఒక్కటీ చెప్పరు. తన చెల్లెలూ చేస్తోంది, కాన్వెంటులో టీచరుగా, ఏం లాభం! పేరుకి నాలుగొందలకి సంతకం పెట్టించుకుంటారు. వెయ్యి దెప్పులతో, లక్షవార్నింగులతో మూడొందలు జీతంగా చేతిలో పెట్టడం బ్రహ్మాండం. ఇంట్లో అన్నయ్యా, నాన్నగారూ మరో ఇద్దరు సభ్యులు, అన్నయ్యకి ప్రభాత్ థియేటరులో గేటు కీపరు ఉద్యోగం. అతనేం తను సంపాదించి ఇంట్లో పెట్టక్కర్లేదు. చెల్లెళ్ళ పర్సులు ఖాళీ చెయ్యకపోతే అదే పదివేలు. నాన్న నిత్య ఉబ్బసరోగి. ఏ రాత్రి ఇంజక్షన్ పడకపోతే ఆరోజు ఆయన ఇంటిని ఏరోడ్రోము చేసేస్తాడు!

తామిద్దరూ సంపాదించినా, ఏ ఒక్క నెలా ఇరవయ్యవ తారీకు వచ్చే సరికి గిజ గిజలాడక తప్పదు. తన ఉద్యోగమూ ఊడిపోతే ఇంకేం తిని బతకాలి.

తనకిగాని, చెల్లెలికి గాని పెళ్ళిళ్ళు జరుగుతాయనే వెర్రిభ్రమకి ఏనాడో స్వస్తి చెప్పించింది జయంతి బ్రతుకులోని పోరాటం. భ్రమలతో పాటు భయాలను కూడా సక్కకి నెట్టించింది. ఆమె జీవితంలోని వాస్తవికత. అయితే ఆమెకి కూడా చిన్న బెంగలేకపోలేదు. ఉన్నట్టుండి ఈ అన్నగాడు ఏ పిచ్చి ముండకో పసుపు పలుపు ఒకటి బిగించి ఇంటికి లాక్కొచ్చి వంశాభివృద్ధికి నడుం కట్టడు కదా!

చచ్చీ చెడీ తను గ్రాడ్యుయేటు అనిపించుకుంది. టైపూ, షార్టుహాండూ పాసైంది. స్టెనో పనిచేసే స్త్రీరత్నానికి స్థిరాభరణాలుగా ఈ క్వాలిఫికేషన్సు చాలవని జయంతికి అనుభవం చెప్పింది. పబ్లిక్ కన్‌సెర్న్‌లోనే పల్లిగ్గా ఎగబడుతున్నారు మొగ మహారాజులు. ఇక ప్రైవేటు కంపెనీలో పనిచేసే ఆడది ఆమాత్రం 'ప్రైవేటు కంపెనీ' ఇవ్వక పోతే పెద్దలు ఉద్యోగంలో ఉండనిస్తారా!

అనుభవంలోకి రానంతకాలం అన్నీ ఆశ్చర్యార్థకాలే. రూఫ్ గార్డెన్ డిన్నరు నుంచి ఆ నాడు దిలీప్ జయంతిని లవర్స్ డెన్‌కి ఆహ్వానిస్తే తొలిసారి మాత్రమే కలవరపడింది. ఏదైనా మొదటి సారే టెన్షను, తరవాత అంతారొటీను. తనతో పాటు మరి నలుగురికి కడుపునిండాలంటే అప్పుడప్పుడు కాస్సేపు కళ్ళు మూసుకోక తప్పదు. కళ్ళు తెరిస్తే మాత్రం ఏమైందని! బండబారింది తన హృదయమే గాని తనలోని పచ్చదనం వెచ్చదనం కోరుతోందని జయంతి ఒప్పుకుంది.

అందుకే ఆమె అనుకుంటుంది. ఇందులో చెడిపోయిందేమీలేదని. చల్లారిన ఇడ్లీ లాంటిది తన పాడి జీవితం. ఇది దిగమింగడానికి సెక్సు అనే కారప్పొడి కాస్త అవసరం. అంతే. నిలువునా ఎండిపోయిన వృద్ధ్య కన్య లెవరూ నిలువెత్తు షీల్డు అందుకున్నట్టు తను వినలేదు. "ఇంతకీ వ్యక్తిత్వం అనేది బొత్తిగా కాళ్ళ మధ్యనే పదిల పరుచుకోవలసినంత చచ్చు సరుకా! మనమాట విని చావని ఈ శరీరంలో ఎక్కడో ఏదో అపవిత్రం జరిగిపోతోందని బెంగపెట్టుకు చావడం అనవసరం. గుండె ఉండాలి, గుబాళించాలి, అంతే" అనుకుంటుంది జయంతి.

ఆడది ఏదో దోపిడీకి గురైందని అంటూ ఉంటారు. ఎవరికేమైందోగాని తన విషయంలో పోల్చుకుని చూస్తే అదీ కరెక్టనిపించదు ఆమెకి. దోపిడీ అనేది జరిగితే దానికి పిడి మగాడిదే అని ఎలుగెత్తి ఏం లాభం, 'ఇదో' అని అంగీకరించిన ఆడదాని బాధ్యత మాట?

అందుకు కాదు.

తనని ఎందుకు తీసెయ్యవలసి వచ్చిందో ఆ కారణం విన్న దగ్గిర నుంచి ఆమెకి మండిపోతోంది. "నిజంగా అది కాదని క్షణక్షణం తెలిసిపోయినా క్షణిక మైన ఎన్నెన్ని వ్యామోహాలు నాకు రుచి చూపించావు! నీ చేత్తో నువ్వు నా కళ్లెదురుగా ఎన్నిసార్లు ఎన్ని వేలు తగలెయ్యలేదు! అడగంది ఏం ఆశించానని నాకీ శిక్ష విధించావు? మీరు రోడ్డుమీద కారులో వెడుతూ మా మీద దుమ్మురేపితే కాదన్నామా! అదే రోడ్డుమీద ఓ పక్కతల వంచుకునైనా మా మటుకు మమ్మల్ని నడవనియ్యరా? నా నెలజీతమే నీ వెంట్రుకకి సరితూగదే, ఇక నీ పెళ్ళానికి ఎవరు, ఆ వజ్రాల బంగారు పిచికకి, నా ముష్టి ఉద్యోగం మీదే దృష్టిపడిందా! మేం మీకు ఎలా ఎప్పుడు అడ్డొచ్చామని మమ్మల్ని తొలగిస్తారు? మా కులాసా మీకు లాసా?"

అని ఎన్నెన్ని విధాలగానో అడగాలని ఆమె మనసు సిద్దపడుతోంది. అందులో ఓ దానికి ముందే భీమశంకరం జవాబు చెప్పాడు.

"ఆ ఏముంది, మన బాస్ రాసక్రీడలు మనోరమ చెవిన ఎప్పుడో పడి ఉంటాయి. ఇంటిదగ్గరే కాక ఇక్కడ కూడా ఇతగాడి లీలావిలాసాలమీద ఓ కన్నువేసి ఉంచుదామని ఆమె ఈ జాబ్‌కి సిద్దపడి ఉంటుంది. లేకపోతే వాళ్ళకేం లేదా, పోదా? ఇంతకీ అది నీ పోస్టే అయిఉండడం నీ కర్మ! నువ్వు కనిపెట్టే ఉంటావు. పెళ్ళికి ముందు మనబాసు ఎంత ట్రిమ్‌గా ఉండేవాడు. ఇప్పుడెంత డిమ్‌గా తయారయాడు!"

ఎలాగయినా సరే తన జాబ్ నిలుపుకు తీరాలనే ధృడనిశ్చయానికి జయంతి ఏనాడో వచ్చేసింది. పట్టెడన్నం కోసం గట్టి పోరాటం ఇది. వాళ్ళకది వేడుక కావచ్చు. తన లాంటి వాళ్ళకది చావు బతుకుల సమస్య. దేనికైనా తెగించక మార్గాంతరం లేదు.

ఆ ఆలోచన తట్టాక ఆమె ఆలశ్యం చెయ్యలేదు. ఇంట్లో కష్టపడి వెతికితే తనూ చెల్లీ ఎప్పుడో చిన్నప్పుడు తీయించుకున్న ఫొటో దొరికింది. దాన్ని నీట్‌గా ఓ కవరులో పెట్టింది. తనని బర్తరఫ్ చేస్తూ వచ్చిన కవరుని కూడా పట్టుకుంది. రెండు కవర్లూ పట్టుకుని నెమ్మదిగా నెమ్మదిగా నడుస్తూ దిలీప్ దివ్యాసనాన్ని సమీపించసాగింది జయంతి.

"మీ తర్వాత ఆ పోస్టులోకి ఎవరొస్తారో మీ కెందుకు మేడమ్! ఒన్ మంత్ నోటీసుగాని, ఓ నెల జీతంగాని మీకు అందించి ఏ కారణమూ చెప్పకుండానే మిమ్మల్ని తొలగించే సర్వహక్కులూ మాకు ఉన్నాయి అంతా రూల్స్ ప్రకారమే జరిగింది. ఈ నిర్ణయానికి ఎట్టి పరిస్థితుల్లోనూ ఇక తిరుగుండదు".

జయంతి ఆగలేదు, అతన్ని అలా చూస్తూంటే జరిగిందేదో నమ్మబుద్ధి కావడం లేదు కూడా. ఎదురు పడి అడిగెయ్యాలని ఎంతైనా కొట్టుకు పోతోంది. ఆఫీసులో అయితే అతని పొజిషను మెయిన్ హాల్లో వేళ్లాడే దీపకళికా గుచ్ఛం. తన స్థాయి వీధిగుమ్మంలో పరచి ఉన్న కాళ్ళు తుడుచుకునే పీచు. ఇవి అఫీషయల్ పొజిషన్సులో అంతరాయాలు మాత్రమే. వీధిలో కాలుపెడితే ఎవరంతటివారు వాళ్ళు. అలా ఓ వయసు వాళ్ళుగా ఫ్రెండ్స్‌గా ఉన్నప్పుడు అతన్ని కదపాలి. అలాంటి ఛాన్సు కోసం జయంతి ఈ వారం రోజులూ ప్రయత్నించంది. గాని కుదరలేదు. అప్పుడే ఆమెలో అనుమానం పొటమరించింది, కావాలనే దిలీప్ తనని తప్పించుకు తిరుగుతున్నాడేమో అని.

పెళ్ళైన ఈ రెండు నెలల్లోనూ అతను పూర్తిగా మారిపోయిన మాట మాత్రం నిజమే

మిలయనీర్ దిలీప్ కుమార్ ఎం.ఏ., ఈ స్టెనో జయంతి బికామ్‌కి తాళి కడతాడని ఎగతాళిగానైనా తను అనుకోలేదు. అతను వజ్రాల వర్తకుల బంగారు బొమ్మని ఇల్లాలుగా స్వీకరించడం సహజమే కాదు, తన దృష్టిలో సమర్ధనీయం కూడా.

అందుకు కాదు

ఫ్రాంక్‌గా ప్రాక్టికల్‌గా తనతో కష్టం సుఖం పంచుకునేవాడు పెద్ద గుమస్తా భీమశంకరం ఒక్కడే. మరెవరి నోటనయినా వస్తే పూర్తిగా వినకుండానే చెవులు మూసుకోవచ్చు. అతనే చెప్తే ఏమనాలి!

దిలీప్ భార్య మనోరమాదేవి ఎమ్మేపాసయిందిట. తన కంపెనీలో ఆవిణ్ణి అతగాడు స్టెనో కమ్ పియ్యేగా వేసుకుంటాడట. ఆ ప్రైవేటు కంపెనీ సర్వాధికారి అతనే గనుక జయంతిని తొలగించి అలా క్రియేటయిన వేకెన్సీలో తన భార్యని వేసుకుంటాడట.

ఆ కబురువిని ఆ లెటరు అందుకున్న జయంతికి ఆ వారం రోజులూ నురి ముద్ద దిగలేదు. ఈ ఉద్యోగం ఊడిపోయాక ఇక ముద్ద ఉంటుందనా దిగడానికి!

ఇంకొకరు చెబితే గుడ్డిగా ఫాలో అవడం జయంతి నెత్తుర్లోలేదు. రెండేళ్ళుగా పనిచెయ్యడం కాక అతనితో పెర్సనల్ కాంటెక్టు ఉంది ఆమెకి. అతని భోగ భాగ్యాలు ఆమెకి అనుభవైక వేద్యాలు. దిలీప్ ఓ మినిస్టరు గారి ఏకైక పుత్ర రత్నం. వాళ్ళింట్లో ప్రతి ఫామిలీ మెంబరికీ తలో ఇంపోర్టెడ్ కారూ ఉందిట. లేజీగా ఉండలేక చేపట్టాడు గాని ఈ అయిదువేల నెల జీతం ఏ విధంగా చూసినా అతని హోదాకి అవమానకరమే.

ఇక అతని సెక్స్ హేబిట్స్ కూడా అవెంత ఖరీదయినవో, ఎంత పెర్వెర్టడో జయంతికి తెలిసినవే. అసలు "లవర్స్ డెన్"కి ఏ లక్షాధికార్లో గాని వెళ్ళరు. అందులో అడుగు పెడితే ఎంతటివాళ్ళకీ ఆ లైటింగ్ ఎఫెక్ట్స్‌కి కళ్ళు తిరగక మానవు. విక్రుతీకరించిన విలాసాలకి అంతెక్కడ! ఆ బిల్డింగ్ పై అంతస్థులో దాన్ని తలదన్నే "న్యూడ్ కార్నర్" అనే అద్దాల కేళీ గృహం ఒకటుంది. ఒక్కరాత్రికి అక్కడ ఓ గది అద్దె గంటకి రెండు వేలు మాత్రమే! మనుసిగ్గుకి తర్పణాలు వదిలించే నిలువెత్తు దర్పణాల గదులవి! అలా ఎంతోసేపని ఎదురుగుండా జయంతితో! దిలీప్ అన్నాడు:

"ప్లీజ్ అండర్ స్టాండ్ మీ. కైండ్లీ గెటవే. ఐ యామ్ మేరీడ్ నౌ"

ఆ "మేరీడ్" అనే మాట విని ఏదో పురుగుమీద పడ్డట్టు అసహ్యంతో మెలికలు తిరిగిపోయింది జయంతి మనసు.

ఒ ఆడదాని దగ్గిర యావజ్జీవం పడుకోడానికి రుసుముగా ఏ లక్షో గుంజి దాన్ని కట్నం అంటున్నాడు. అదే మగాడు ఇంకో ఆడదాని దగ్గిర పడుకోడానికి పదో పరకో ముట్టచెప్పి దాన్ని పడుపు వృత్తి అంటున్నాడు! వరకట్నంతో పోలిస్తే వ్యభిచారం ఎంతచిన్న అపచారం!

సాటి మనిషి అనుకుని ఈ నీచుడి దగ్గిరకా తన సందేహం తీర్చుకోడానికి వచ్చింది! జుగుప్సని తొక్కిపెట్టి, పుణ్యకాలం కాస్తా గడిచిపోకుండా తను చెబుదామనుకున్నది పూర్తి చేద్దామని మరి రెండడుగులు ముందుకువేసింది జయంతి.

ఇంతలోఅతని టేబిల్ మీద ఉన్న ఫోను మ్రోగింది. దిలీప్ ఎంత అనునయంగా మాట్లాడినా అవతలి ఆ ఆడగొంతుకు అతన్ని బతకనిచ్చేలా కనపడలేదు. అది మనోరమ స్వరమని జయంతి కెవరూ చెప్పక్కర్లేదు.

'కాస్త నెమ్మదిగా మాటాడు డియర్, ఇక్కడ నా ఎదురుగుండా ఓ పార్టీ కూచుని ఉన్నారు'

'అవునవును, నా చేతిలో పాకెట్ టెలివిజన్ సెట్ లేదుగాని తమ ఎదుట ఏకాంతంలో ఉన్న పార్టీ ఎవరో స్పష్టంగా నా మనో నేత్రంకి కనపడుతూనే ఉంది.

ఇంతవరకూ ఆఫీసులో మీకు ఏం పనో, డ్రైవర్నీ వాచర్నీ ఇంకో అరగంటదాకా ఎందుకు రావద్దన్నారో బోధపడుతూనే ఉంది. నాకు బోధపడంది ఒకటే, ఇంతటి సరసులూ, చతురులూ నిమిషానికో కొత్తదాని నిషాలో కులకక, నాలాంటి దానికి ఉరితాడు బిగించడం దేనికి?''

ఉస్సురని తలపట్టుకుని క్రెడిల్ పెట్టేశాడు దిలీప్, ఇంకా ఫోను మోగుతూనే ఉంది. రెండు చెవులూ మూసుకుని లేచి నిలబడి పోయాడు.

"మేడమ్, నేనింటికి అర్జంటుగా వెళ్ళాలి. ఇంకా మీరుచెప్పుకోనేది ఏమైనా ఉందా?''

"ఏదీ నేనింకా నోరైనా విప్పందే... ముందు మీరు కూచుంటే నేను కూచుంటాను'' జయంతి కళ్ళలో స్పష్టంగా కనపడుతున్న తీక్షణతకి జడిసి దిలీప్ కూలబడక తప్పలేదు. మ్రోగి, మ్రోగి టెలిఫోను నోరు కూడా మూతబడక తప్పలేదు.

మరోసారి జయంతి లేచి దిలీప్ దగ్గరగా వచ్చింది.

ఇప్పుడు వాళ్ళిద్దరి మధ్య బల్ల మాత్రమే అడ్డు.

అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ ఒకొక్క ముక్కా గుండెలో గుండు దూసుకు పోయినట్టు, స్పష్టీకరించింది జయంతి.

"మిస్టర్ దిలీప్! ఇదిగో నన్ను తొలగిస్తూ మీరు జారీ చేసిన ఆర్డరు. వెంటనే తీసుకుని ఆ లెటర్ని డిస్ట్రాయ్ చెయ్యండి లేకపోతే మీ హాపీ మేరీడ్ లైఫ్ని డిస్ట్రాయ్ చేసే మేటరు ఇదిగో నా ఎడం చేతి కవర్లో ఉంది, దాన్ని బయట పెట్టవలసి ఉంటుంది. దిలిప్ సర్! డోన్ట్ ట్రైటు ప్లే విత్ మి ఎగెయిన్. యు కాన్ట్ ఊస్ట్ మి! ఏం చేస్తాం, పెళ్ళి చేసుకున్న వారికి చేసుకున్నంత!''

"ఏమిటిది, బెదిరిస్తున్నారా? బ్లాక్ మెయిల్ చేస్తున్నారా?''

'రెండూ కొంచెం కొంచెం కలిపి అందిస్తున్నాను మనిద్దరి మధ్యా కొంత ప్రణయ జీవితం నడిచింది కదా! నూడ్ కార్నర్లోని మనిద్దరి కొన్ని అంతరంగిక భంగిమల స్నాప్ షాట్సు ఈ కవర్లో ఉన్నాయి. మీ ఆర్డరు వెనక్కి తీసుకోకపోతే ఈ కవరు ఇక్కడ్నుంచే మీరు ఫోను చేసిన వ్యక్తి దగ్గిరకి వెళ్ళిపోతుంది. అండర్ స్టాండ్?'' దిలీప్ ఆ కవరు అందుకునే లోగా జయంతి అది ఇంతింత ముక్కలుగా చించి పారేసింది అలాంటివేవీ అందులో లేవనే ముందే ఎరుగున్నది గనుక.

"అందులో ఉన్నవి పాజిటివ్స్ మాత్రమే దిలీప్ సర్! నన్నిప్పుడు మీరిలా షూట్ చేసినా ఆ నెగిటివ్స్ మనోరమగారికి అందించే ఏర్పాటు ముందే చేసి ఉంచాను. చూడండి మిస్టర్ దిలీప్! మీ కాపరంలో నీళ్ళు పోసుకోడం మీకెలా ఇష్టం ఉండదో తింటూ తింటూన్న నోటిముందు కూడు పడగొట్టుకోవడం మాకూ ఇష్టం ఉండదు. మీరు బతకాలంటే మమ్మల్ని బతకనివ్వక తప్పదు, డోంట్ ఫర్గెట్'' తెల్ల బోయిన దిలీప్ మొహాన అతను పంపిన లెటరు కూడా ఇంతింత ముక్కలు చేసి విసిరి, విజయ గర్వంతో వెనక్కి మరలింది జయంతి. (జ్యోతి మాస పత్రిక మే, 85)

# దొంగ వెధవలందరికీ జై !



**అవినాశలింగం** గట్టిగా మూలిగాడు.

అయినా ఎవరూ పట్టించుకోక పోవడంతో ఆ మూలుగు మూలకర్త సమూలంగా సాగదీసుకుని దాన్ని ముమ్మరం చేసాడు.

అయినా పెద్దగా రెస్పాన్సు ఉన్నట్లు కనబడదు

మిట్టమధ్యాహ్నపు వేళ కడుపు నిండక పోయినా చాకిరీతో శరీరం అలిసి ఉంటుంది గనక, పనివాళ్లకి కునుకు దొరికే వేళ. చెవిలోపడ్డ మూలుగు అటు తిరిగి పడుకోమని చెప్పి ఉండాలి వాళ్ళకి.

దూరంగా అవతలి పడకగదిలో పొర్లుతున్న కామాక్షమ్మ స్థితివేరు. తండ్రి మూలుగులూ ముక్తాయింపులూ భరించలేక కాపరాల పేరున తలో ఊళ్లో సర్దుకున్న పిల్లల్లా ఆవిడకెలా కుదురుతుంది! బతికున్నవాళ్ళు మొగుడి నీడలో అన్నీ అర్పించి వెళ్ళ మార్చినా, ఈ విసిగి వేసారిన ఆఖరి కాలంలో ఆవిడకీ అబద్ధపు బతుకు తప్పలేదు. బ్రహ్మదేవుణ్ణి ఎన్ని సార్లు తిట్టుకున్నా ఆయన

చెవుడుని ఆశ్రయించక తప్పలేదు! తనకి కావలసిన ముక్కలు తప్ప ఆవిడకిప్పుడు వినబడవు. మొగుడి మూలుగు వినపడగానే లేచి గది తలుపులు గడియపెట్టుకుంది. అప్పుకోసం అప్పగారి ఇల్లుచేరిన ఏడుకొండలికి మాత్రం బావగారి మూలుగుని కాదనే అదృష్టం లేదు. కామాక్షమ్మ పెత్తల్లి కొడుకు అతను. రాగానే రంయ్ మని కామాక్షమ్మ కాళ్ళమీద పడినంత పని చేసాడు. "ఆ పదివేలకు పైగా పాపం పెరిగిపోయినట్టు అప్పు పెరిగిపోయిందే అక్కా! అప్పులాళ్ళు కత్తులు నూరుతూ ఇంటిచుట్టూ తిరుగుతున్నారు. మీ మరదలి పసుపూ కుంకం ఎలానిలబెట్టుకుంటావో యేమిటో'.

కామాక్షమ్మ ఆశ్చర్యంగా ఏడుకొండలి వైపు చూసింది. చెవుడు నటించడం మొదలెట్టాకే ఆమె మెదడు ఆలోచించడం నేర్చుకుంది. చెప్పుకుంటే సిగ్గుచేటు, తన పుట్టింటి వారి వైపున ఒకే ఒక చుట్టం వీడు, అవసరం వస్తేతప్ప చచ్చినా గుమ్మం తొక్కడు. ఇదివరకు దోచబెట్టి దోపిడీకి గురయింది చాలు.

'బావతో చెప్పి ఓ రెండు వేలయినా చేతిలో పెట్టించవే. నీ మరదలి పచ్చతాడు నిలబెట్టవే'

అంతకుముందు ఈ 'అప్పులకుప్ప' మీద ఏ మాత్రం జాలి ఉన్నా ఆ ఒక్క మాటతో కామాక్షమ్మకి పటాపంచలయిపోయింది. ప్రతీ తాగుబోతు చచ్చినాడూ పచ్చతాడుమాట ఎత్తడమే!

"ఏమే, మాటాడవేమే?"

"ఏమిటో ఏమంటున్నావో నువ్వన్న ఒక్కముక్క బోధపడి చావడం లేదు. అసలు మునపట్లా వినబడిచస్తేగా! ఇప్పుడు ఇయర్‌ఫోన్లో ఏవో వస్తున్నాయిటగా... ఆడదాన్ని చెబితే వినరు...నువ్వైనా మీ బావకి బోధపర్చి అదేదో కొనిపించేలా చేద్దూ"

'నీ దుంపతెగ రెండు పుట్లు కర్రలు ఖర్చయితే గాని కాలదు, అంతలా పెంచేశావు శరీరాన్ని, నీకు చెవిడేవిటే నీ సిగ తరగ, నా సంగతి నీకింకా తెలీదులా ఉంది. నే అనుకున్నది పట్టికెళ్లందే గుమ్మం దిగను, నీ పుస్తెలతాడు తెంపైనా సరే'....

అని ఆ క్షణమే ఏడుకొడలు దృఢనిశ్చయానికి వచ్చేశాడు, "చెయ్యవలసిన అన్ని కార్యాలూ చేసేశారు. అయినా లక్షల కొద్దీ పడుంది ఇంట్లో సొమ్ము. చచ్చాక, ఇద్దరే ఉన్నారు కదా, ఇంతడబ్బూ కూడా పట్టుకుపోతారా, నువ్వూ బావా! అంచేత బతికున్నాం గనక, సాటివాళ్లం గనక అప్పుడప్పుడు మేమూ కొంచెం కొంచెం పట్టుకుపోతూంటాం"

అని పైకే, కావాలనే అనేశాడు, చెవిటి వాళ్ళకి వినపడదు కదా! అనుకోని ఈ మాటలకి ఏర్పడ్డ కంగారుని, మొగుడి డబ్బు జాగ్రర్త తెలిసిన మనిషి గనక అణుచుకుని, ఆవిడ అన్నదిదీ.

"నువ్వెన్నీ చెప్పినా ఒక్కముక్క నా చెవిలో పడిచావడం లేదు తమ్ముడూ ఇలా నా రోజు ఎలా వెడుతుందో ఏమిటో' అలాగే నేను చేసి చూపిస్తానుగా అని యీ సారి సంజ్ఞలతో సూచించి ఏడు కొండలు గబగబా అక్కణ్ణుంచి వెళ్ళి పోయాడు.

వారం రోజులయింది ఇక్కడ తిష్టవేసి ఏదో వేళకింతముద్ద వడేస్తున్నారు. తిని కాలంగడుపుతున్నాడు తప్పితే వీళ్ళని ఎలా కొల్లగొట్టడమో కొరుకుడు పడడం లేదు. అందులో ఆ ముసలాడు మరీను పైసా నాణాన్నయినా పడిపోకుండా పొట్లం కట్టి పెట్లో పెట్టుకుని ఆ తాళం చెవి బాంకు లాకరులో పెట్టే ముసాఫరు ముండా కొడుకు.

"ఏం ఏడుకొండలూ, పక్కగదిలోనే తిని బబ్బుంటున్నావ్, ముసలాడు ఎందుకు

మూలుగుతున్నాడో కాస్త కనుక్కోవాలని తోచలేదూ!" "మూలుగుతున్నది నువ్వుకాదు. నువ్వింట్లో చేర్చిన లక్షలు'జీ అని మనసులో అనుకుని-

"ఏదీ, నువ్వు నలుగురికీ వినపడేలా మూలగందే!" అనేసి నాలిక కరుచుకోవాలేమో అనుకున్నాడు.

అవినాశానికి దొరికింది అవకాశం. మేపుతున్న జీతగాళ్ళూ కట్టుకున్న పెళ్లాం ముండా యింతలా బాధతో అరుస్తున్నా చీమ కుట్టనట్టు ఊరుకున్నారు. అరిచిన శ్రమకి ఫలితంగా ఒక్కడైనా చిక్కు పడ్డాడు. అవకాశం పోనిస్తే మళ్ళీ జారి పోతాడో ఏమో! శ్రోతని సొమ్మసిల్ల జెయ్యని ఉపన్యాసకుడు బతికేల? నువ్వు అని పేరుపెట్టకుండా అవినాశం ఏడుకొండల్ని దులిపి దుళ్ళకొట్టేశాడు. ఆ చిందులతో వచ్చిన ఆయాసంతో కూలబడి పోయాడు.

కొంపలు కూల్చడంలో గోల్డుమెడలిస్టు గనక ఏడుకొండలు చెక్కు చెదరలేదు. ఎలాగైతేనేం. తిట్లైనా దీవనలయినా, యిన్నాళ్ళకి యి విధంగా బావకి యింత సేపు చేరువైనందుకు అతను సంతోషించాడు కూడా. ఎంత అభిమానం లేకపోతే అంత శ్రమపడి తిడతాడు! ఏ విధంగానైనా మనిషీ మనిషీ దగ్గిరవాలి. మనిషి దగ్గిరయితే కదా, అతని జేబూ, అందులో పర్సూ దగ్గిరయేది!

"నువ్వేన్ని చెప్పు, లోకంలో ఏదైనా భరించొచ్చుగాని ఈ పన్ను బాధ భరించలేం" అన్నాడు అవినాశం ఆఖరి మాటగా.

తిట్లు కొట్టవు. కొట్టాలన్నా ముసిలాడు కొట్టే స్థితిలో లేడు. తనూ కొట్టలేడు గాని రెచ్చగొట్టగలడు. కోపంతో మనుషులు ఒళ్ళెరగరు. ఏమో, ఏరహస్యాలయినా బయటపడొచ్చు. ఏడుకొండలు అవినాశలింగాన్ని కవ్విస్తూ అన్నాడు.

'ఏమిటి బావా నువ్వు అంటున్నదీ, పన్ను బాధ అనా! అంటే ఇన్‌కమ్‌టాక్సు అనేనా! ఇంట్లో చేర్చిన నల్లధనం చల్లగా ఉండనిస్తుందా మరి? ఎంత బ్లాకుకి అంత షాకు. ఏమంటాన్?' బావమరిది ఎత్తిపోడుపుకి మరీ పేట్రేగి పోయాడు అవినాశం. 'నెత్తిమీద రూపాయి పెడితే పైసాకి మారని ప్రతీ నెత్తిగోతుల సన్నాసీ నా పంచన తిండికి చేరి నాకు నీతులు చెప్పేవాడే! నా దగ్గిరేదో ఊరికే బస్తాల కొద్దీ పడుందని ఏడవకపోతే ఈ ముద నష్టంగాళ్ళని సంపాదించుకో వద్దన్న దెవరో! ఇంతకీ బుగ్గపట్టుకుని గంటైగోల వెడుతున్నాను. పన్ను బాధ అన్నాను గాని టాక్సు గొడవెత్తలేదు! 'ఓహో దంతాల బాధ, దాన్ని పంటి బాధ అంటారు. గాని పన్ను బాధ అనరే! 'పన్' కోసం అలా అఘోరించావు కాబోలు, చెప్పవేం?' 'ఒరే ఇంకా పేలావంటే నిన్నివాళ ఏం చేస్తానో నాకే తెలీదు' అంటూ మీదకి లేవబోయి ఆ అరుపుతో నాలిక కరుచుకుని, దాన్తో పాటు పుప్పి పన్ను మరింత కదలగా, ప్రాణం శోషొచ్చి, చతికిల బడిపోయాడు, అవినాశం, రెండు చేతులూ వెనక్కి ఆనించి.

అదే సమయంలో ఏడుకొండలు బుద్ధి అతి తీవ్రంగా పని చేస్తోందని అవినాశం ఎరగడు. నిజానికి పిప్పి పన్ను బాధ తను ఎరగంది కాదు. ఇంతగా జనాన్ని పీల్చి పిప్పి చేసి ఇంట్లో ధనాన్ని చేరేసిన వాళ్ళకి ఎంతటి నొప్పి అయినా రావలసిందే! దానికి కాదు. ఇంతగా ఉంచుకుని ఏం లేదన్న వాడికి ఏమొస్తే ఎవడిక్కావాలి! ఇంతకీ ఎక్కడ దాచ బెట్టాడో అసలు ఎంతుందో... దాని అంతు కనుక్కోడం ఎలాగో!

ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు సలహా చటుకున్న గుర్తొచ్చింది అతనికి; 'మామూలు పద్ధతుల్లో

అయితే మీ మాయదారి బావ లొంగుతాడటయ్యా! ఎంత ప్రయత్నించినా అతని ఆస్తి వివరాలు మాలాంటి వాళ్ళకే చేజిక్కలేదు. దగ్గిర చేరి, ఎంతైనా బామ్మర్దివి కదా అతని నోటితో అతన్నేతే, నువ్వే కక్కించాలి. ఇప్పుడెంత చిన్నసైజు టేపురికార్డర్లయినా వస్తున్నాయి. మార్కెట్లోకి దిగలేదనుకో. అవసరమైతే మా డిపార్టుమెంటు ద్వారా నీకు సప్లై చేయిస్తాను అదునుచూసి ఎక్కడెలా అమరుస్తావో మరి. అతని ఆస్తి వివరాలు అందించాలి. అయిదువేలు తక్కువ ముట్ట చెప్పం, ఆలోచించుకో'.ఈ దొంగపీనుగ నోటినుంచి తన ఆస్తి వివరం ఒక్క ముక్క ఊడిపడితేనా? టేప్‌రికార్డరు పెడితే ఏం పడుతుంది. అందులో ఈ మూడు లోకాల్నీ ఒకే సారి ముండమొయ్యమనే శాపనార్థాలు కాకపోతే?

'ఈ పంటి సలుపు భరిస్తున్న వాడికి ఎలా ఉంటుందో తెలుసా, అయితే ఆత్మ హత్య చేసుకోవాలనిపిస్తుంది. లేదా ఎదుట పడ్డ మొదటి వాడి పీకపిసికెయ్యాలనిపిస్తుంది. నువ్వింకా దంత వైద్యుడికోసం పరిగెత్తక పోయావంటేనే చెప్పిన రెండోది జరిగిపోగల్దు, జాగ్రత్త'

అని అరిచాడు అవినాశలింగం.

ఇలాంటి వారికి బంధుద్రోహం చెయ్యకపోడం మహాపాపం. ఇంత డబ్బుంది ఈ దగుల్బాజీ గాడు గవర్నమెంటు పన్ను ఎగ్గొట్టడం తగునా! ఇంతటి మహోద్యాన్నంగా ప్రజాక్షోభ నిర్వహిస్తున్న గవర్నమెంటు గాడిని, వీడెవడైనా ముప్పై రెండూ రాలగొట్టినా అంతకన్న దేశసేవ లేదుగాని ఆ శ్రమకి తనకి తీరికెక్కడిది! పెళ్ళాం తమ్ముణ్ణి బాకీ దార్లు తరుముతూంటే చూస్తూ ఊరుకున్న దుర్మార్గుణ్ణి ఏం చేస్తే తప్పుంది, ఉరెయ్యాలా, ఊరెయ్యాలా!

ఏడుకొండలి కళ్ళు కనపడని ఏదో కనుక్కొన్న ఆనందంలో క్రూరంగా మెరిశాయి.

అవును. సంపన్నులు ఆపన్నులుగా మారాలంటే మాయ పన్నులే దిక్కు అతని పన్నుగడ బావ పన్ను ఆధారంగానే పన్నబడింది.

అంతే. ఏర్పాట్లు మెరుపు స్పీడులో జరిగిపోయాయి.

రాబడిపున్ను శాఖ పూర్తి సహకార సహాయాలు లభించాయి ఏడుకొండలికి ఆ ఊర్లో 'ఇక్కడ పన్నులు పీకబడును' అని కొత్తగా బోర్డుదించిన డెంటిస్టుని కలుసుకుని అన్ని విషయాలూ మాటాడి వచ్చాడు ఏడుకొండలు. తర్వాత బావని తీసుకెళ్ళాడు. 'ఇక్కడ పన్నుల ఎగవేత నేర్పబడును' అనే బోర్డులు కట్టుకుని ఇన్‌కమ్ టాక్సు కమిషనర్స్‌తో తప్ప యిలాంటి వాళ్ళతో ఇదివరకు పరిచయం లేదు అవినాశలింగానికి. అయినా ఫిజికల్ సఫరింగ్ మనుషుల్ని ఎలాంటి చోటికైనా నడిపిస్తుంది.కర్మ తప్పించుకోలేనిది గదా! వీధిలోకే వచ్చి నవ్వుతూ పేషెంటు చెయ్యి పట్టుకుని ఆదరించాడు డెంటిస్టు జ్ఞానదంతం.

"పెద్దవారు మిమ్మల్ని శ్రమపెట్టించి రప్పించవలసి వచ్చింది. సారీ, ఏం చేస్తాం, నే వచ్చి చేద్దాం అను కున్నా, అక్కడ ఎక్విప్‌మెంట్ ఉండదు గదా! ఇంతకీ మనం మనం ఓ వయసు వాళ్ళం డబ్బు సంపాదించి అది నిలబెట్టుకోడానికి ఎంత శ్రమపడాలో తెలిసిన వాళ్ళం. మధ్య పుల్లారుబుబడ్డిలా మీ బావమరిది ఎందుకూ, పొమ్మనండి"

ఈ మాటలు రహస్యంగా అని, తొలిపలుకులోనే అవినాశం మనసు దోచుకున్నాడు జ్ఞానదంతం.

పన్ను ఇంకా పీకబడే పరిపక్వానికి రాలేదంటూ నాలుగైదుసార్లు రప్పించి, ఓ వారంలో

వాళ్ళమధ్య దూరంతగ్గిపోయేలా చేశాడు.

"ఈ లోపలది సౌండ్‌ప్రూఫ్ గది. మనం ఏం చెప్పుకున్నా ఎవరికీ వినపడదు ఇంతకీ మీరేం చెప్పొద్దు... మీ మొహం చూస్తూంటే ఎంతో ఆత్మీయత తోచి, నాకు కష్టం సుఖం చెప్పుకోవాలనిపిస్తోంది. ఈ ఫారెన్ ఎక్విప్‌మెంటు అంతా లక్షలకి లక్షలు ఖర్చుపెట్టి తెప్పించాను. ఇదంతా ఆ దిక్కుమాలిన ఇన్‌కమ్‌టాక్సు వాళ్ళకి లెక్కలు చెప్పుకోడానికా! ఇంతకీ మన చేత పన్ను కట్టించుకునే ఆ డిపార్టుమెంటు ఆఫీసర్లలో ఒక్కడైనా తిన్నగా టాక్సు కట్టాడేమో గుండెమీద చెయ్యివేసుకు చెప్పమనండి, అదిగో అదేవద్దు, మీరేం మాటాడవద్దన్నానా?"

అంటూనే అవినాశం చేత అతిగా మాటాడించి తనకి కావాలసిన అన్ని వివరాలూ కక్కించి, మాట దక్కించుకున్న భ్రమ కలిగించాడు.

ఏ నొప్పీ కలగకుండా కబుర్లుచెబుతూ చెబుతూ చటుక్కున పన్ను ఊడదీసాడు. ఆ మర్నాడు కట్టుడుపన్ను ఆ ఖాళీ జాగాలో ఫిక్సుచేసి. సరిగా అమరిందో లేదో సాయంకాలం మళ్ళీ రమ్మన్నాడు. 'బాగా మాటాడండి' అంటూ మాటాడించి చూశాడు. మాట సరిగా రాడంలేదని అది తీసేసి దాని స్థానంలో మరొకటి అమర్చాడు అవినాశలింగం పర్సు తీయబోతే ఒప్పుకోలేదు.

'నే చెప్పినవన్నీ ఎంతో ఓర్పుతో విన్నారు. ఏదీ దాచకుండా అన్నీ చెప్పేశారు. అదే నాకు పదివేలు" అంటూ ఏం పుచ్చుకోకుండా కిర్రెక్కించి కారెక్కించాడు జ్ఞానదంతం.

ఆ ప్రేమకీ సేవకీ కటికరాయిలాంటి అవినాశం మనసు సహా కరిగినట్టయింది. అయితే అది చిన్నసైజు హార్టెటాక్‌కి దారి తీయగలదని ఆ మర్నాడు తప్ప తెలియలేదు.

ఆ మర్నాడు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు నుంచి, వెంటనేవచ్చి కలుసుకోమని ఫర్మానా అందిందతనికి. పరుగు పరుగున మరుగుదొడ్డికి పరిగెత్తినట్టు పరిగెత్తాడు అవినాశలింగం.

ఆఫీసరు సగౌరవంగా ఆదరించి కాఫీ తెప్పించడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. మర్యాదలు ఆయాక ఆఫీసరు అన్నాడు "మీరీ మధ్య ఏదో పన్ను కట్టించుకున్నారని విన్నాను!"

'అయ, అయ' అంటూ వెకిలినవ్వులు నవ్వుతూ ఎడంచేతి చూపుడు వేలితో ఆ కట్టుడుపన్నుని పైకితీసి చూపే ప్రయత్నం చేస్తే 'అక్కర్లేదులెండి. మీ ఆట కట్టుడుపన్ను మా దగ్గరే ఉంది.'

అంటూ ఆఫీసు బాయ్‌ని పిలిచాడు. వాడొక గాజుపళ్లెం తెచ్చి పక్కనున్న బల్ల మీద పెట్టి వెళ్ళిపోయాడు ఆ సాసరులో తన కట్టుడు పన్నులాంటిది ఉండటం చూసి తెల్లబోయాడు అవినాశం.

"ఇదేమిటో గమనించారా?"

"ఏదో దంతంలా ఉంది."

"అవును అది మీదే. మీ ఆస్తిపాస్తులు మాకు అందచేసిన జ్ఞానదంతం." అవినాశం హార్టుబీటు పెరిగింది. అరచేతులకి చెమటలు పోవాయి.

"మా తరపున పనిచేసిన డెంటిస్టుగారు మీ పళ్లఖాళీ మధ్య మొట్టమొదట అమర్చారే, అదే ఇది! నిజానికి ఇది దంతం కానే కాదు టోక్యోనుంచి ఈ మధ్యనే మా డిపార్టుమెంటు తెప్పించిన పవర్‌ఫుల్ మైక్రో మినీ టేపురికార్డరు. ఇది నోట్లో ఉండగానే. నోట్లో శని ఉన్నట్టు, తమరు తమ పూర్తి ఆస్తి వివరాలు మా డెంటిస్టుతో చెప్పుకున్నారు. ఒక్కముక్క పొల్లుపోకుండా రికార్డు అయింది. ఆన్ చెయ్యానా, వింటారా?" "వొద్దొద్దు" అని నోట్లో తడారిపోయి చేతులు జోడించాడు అవినాశం. కేసు

పెట్ట కుండా చూసుకున్నా ప్రభుత్వాన్ని మోసం చేసినందుకు జుల్మానాలో పది లక్షలు కట్టవలసి ఉంటుంది. దీన్నిలా సీలు చేసి పైకి పంపమన్నారా?'' “ఒద్దొద్దు నన్నే ఏదో రేటుకి సెటిలు చేసి అవతలకి పంపు'' అనిపించింది అవినాశానికి. కిందా మీదా బేరాలయాక లక్ష లంచం యిచ్చేలా మాటాడుకుని అతను ఇవతల పడ్డాడు. తీసికెళ్ళి అర్పించాడు,

ఆ రాత్రి ఏర్పాటయిన మందుపార్టీలో అనేకమంది హెడ్స్‌ఆఫ్‌ది డిపార్ట్‌మెంట్స్ ఇన్కమ్‌టాక్సువారి ప్రతిభను కొనియాడారు.

“ఇంతకీ మీకింత సాయం చేసిన ఏడుకొండలికి ఏమిచ్చారూ!'' అడిగారొకరు.

“ఎరస్టు చెయ్యకుండా వదిలేశాం చాలదూ వెధవని? ఏడుస్తాడని ఓ వంద చేతిలోపెట్టి తగిలేశాం, అప్పులాళ్ళ నుంచి పారిపోడానికి రైలు టిక్కెట్టుకైనా పని కొస్తుందనీ''

“ ఈ శుభసమయంలో ఆ టేప్‌రికార్డరు ఓసారి వినిపించరూ!''

“అది టేపురికార్డరు అయితే కదా! మీరే నమ్మేశారే, అంతచిన్నవి, ఇంకా ఇండియాకి దిగలేదని వాడికేం తెలుసు! మనం స్వతహా మంచి వాళ్ళమే. అలా ఉండనిస్తున్నారా ప్రజ! అయినా అంతా మంచివాళ్ళే అయితే చెడెలా గుర్తింపబడుతుంది? దొంగవెధవలు కొందరైనా వర్ధిల్లి తీరాలి.! ఏమంటారు?'' నవ్వులు చెలరేగాయి, గ్లాసులు రివ్వున లేచాయి

*(జ్యోతి మాసపత్రిక జూన్,85)*

# 'సరస్వతి'కి జబ్బు చేసింది




**తనో** పేరు పొందిన సీరియల్ నవలా రచయితగా స్థిర పడగలనని మధుమూర్తి జన్మలో అనుకుని ఉండడు. పదేళ్ళ కిందట అతనికి ఉత్తరం రాయడం కూడా సరిగా రాదు.

పోస్టు కార్డులో పెద్దపక్క నింపడానికే ఆ రోజుల్లో అతని తల ప్రాణం తోకకి వచ్చేది.

'పెద్దలకి వందనములు. పిల్లలకి ఆశీస్సులు. అందర్నీ అడిగినట్లు చెప్పకోర్తాను' ఇలాంటి రోడ్డు రోలరు ముక్కలు తప్ప మరొకటి ఊడిపడేవి కావు. చడీ చప్పుడూ లేని చప్పిడి చచ్చు ఉత్తరాలని మించి అతని కలం మరి జరిగేదికాదు.

ఈ వ్యాపార ప్రపంచంలో వాడుకోడం తెలిసి చావాలి గాని ఎవరి అర్హతలు వారివి. మైనాకి కంఠం ఉంటే, రైనాకి ఖడ్గం ఉంది. జంతు ప్రపంచానికే సమర్ధతలుంటే జ్ఞాన ప్రపంచానికి చెందిన మధుమూర్తికా అపకీర్తి!

అతనిలో ఉన్న రెండు ప్రత్యేక యోగ్యతలు అతని దారిని సుగమం చేశాయి. ఇంగ్లీషు నుండి తెలుగులోకి అనువాదం చేసే ఉద్యోగం అతనిది. రోజూ విధిగా ఇరవై పేజీలు తక్కువ

కాకుండా తెలుగులో రాయాలి. ఆ విధంగా రచయిత కాకుండానే చెయ్యి తిరిగి పోయింది అతనికి. రెండోది చాలామంది రచయితలకే లేనిది, అతని చేతివ్రాత చాలా పొందికగా ఉంటుంది. 'నీ రైటింగుకీ నీ తలరాతకీ చాలా దగ్గర సంబంధం ఉంటుంది సుమా!' అని ఎక్కడో చదివాడు గాని స్వానుభవంలో తప్ప దాని స్వారస్యం అతనికి అవగతమవలేదు.

"మనం గ్రహించక పోయి ఉండొచ్చుగాని ఇదివరకు ఇంకొకరు చెప్పనిదీ, ఇప్పుడు నీకు నువ్వుగా మొదటి సారి సృష్టించేదీ ఇదివరకు లేదు. ఇక ముందు ఉండదు. జీవితంలో కొత్తే ముంది, అదొక దర్శిత దర్పణం. సాహిత్యంలో వింతేముంది, అదొక చర్విత చర్వణం" అనే వివేచన అతన్ని కరదీపికలా ముందుకి నడిపించింది. చీర ఒక్కటే కావచ్చు. చిన్నారి కూడా ఒక్కతే కావచ్చు. కాని కట్టుకున్న తీరుని బట్టి ఆకట్టుకున్న పోజుని బట్టి "ఎప్పుడూ ఎరగని ఆడది సరికొత్త చీర కట్టుకున్నట్టుందే!" అనిపించే అవకాశం లేదా! ఇన్నర్ వాల్యూ ఎవడిక్కావాలి, ఇంప్రెషన్ ముఖ్యం" అనే ఇంగితం ఒంటపట్టుగానే ఒక ఆగలేక పోయింది ఉరకలు వేసే ఆ యువక ప్రాణి. పిచిక గూళ్ళుగా మొదలై పిరమిడ్సుగా రూపు దద్దు కుంటున్న యిటీవల తెలుగు సుప్రసిద్ధుల మేలి రచనలు తిరగేస్తూంటే కొట్టొచ్చి నట్టు ఒకటి కనపడిందతనికి. "ఏ నవల అయినా ఏముంది. ఒక్కపాలు డొక్క శుద్ధీ, తొంభై తొమ్మిది పాళ్ళు జబ్బ పుష్టీ" అంతే. ఆ మెలుకువని ఆకళింపు చేసుకోగానే రంయ్‌మని సాహిత్య రంగ ప్రవేశం చేసేశాడు మధుమూర్తి.

కథకి ఇంతని కిడుతుందని ఎప్పుడైతే పోల్చుకున్నాడో

" కథలు రాయనేల, కక్కుర్తి పడనేల? నవల రాసి వేలు నంజుకొందు" అనే కిటుకు కిటికీ తెరిచేశాడు. "ప్రేమిస్తే దాన్నో దీన్నో ఎందుకు సినీతారనే ప్రేమించేద్దాం" అనుకున్నట్టు. అతని మొదటి నవల "రెండోదే మొదటి ప్రైజుకి తగినది" అనే పేరుగల రచనని, అనన్య ప్రచారంగల వారపత్రిక "ఆంధ్రుల ఆడపడుచు" దీపావళి నవలల పోటీకి పంపించాడు.

మధుమూర్తి పనిచేస్తున్న మహానగరంలోనే ఉంది ఆ పత్రిక కార్యాలయం. దీపావళి ఇంక నెల ఉందనగా అక్కణ్ణుంచి అతనికి ఓ రోజు టెలిఫోన్ పిలుపు అతని సాహితీ జీవితంలో ఒక మరువలేని మలుపు. రెండోకంటి వాడికి తెలీకుండా ఆ సాయంత్రం వచ్చి రహస్యంగా కలుసుకోమని వారి ఆదేశం. గుండె చేత్తో పట్టుకుని అక్కడికి చేరిన మధుమూర్తికి వారు చెప్పిన వర్తమానం ఉన్న గుండె ఇక పలకదేమో అన్నంత ఉత్కంఠకలిగించింది. అతని నవలకి రెండో ప్రైయిజు ఇస్తారట, వాళ్ళు చెప్పిన రూల్సుకి ఒప్పుకుంటే. అతను పెట్టిన పేరు మార్చి 'కోనలగుండెల్లో కోటి కోణార్కలు' గా ఉండాలి. రెండో బహుమతిగా ప్రకటించబడిన అయిదు వేల రొక్కం అతనికి యివ్వరుగాని అందుకున్నట్టు స్టాంపుమీద సంతకం చేసి ఇవ్వాలి. అయితేనేం అతని ఫొటో, జీవిత వివరాలూ, అతనెలా ఇస్తే అలాగే ప్రచురిస్తారు. పాఠకులు రచయిత సందేశం కోసం ఎదురు చూడరా, అదీవేస్తారు! అంతేనా, పదహారు వారాలపాటు ధారావాహికంగా బొమ్మలతో ప్రచురిస్తారు.

"ఇది ఎవరికైనా తెలిసిందో...' రాయడానికి చేతులుమాట దేవుడెరుగు, ముందుఇంటికి చేరడానికి కాళ్ళు మిగలవు. అని జవాబుగా గుర్తించాడు మధుమూర్తి! రాత రమ్యంగా మలచుకోగల స్థాయికి అప్పటికే చేరుకున్న మధుమూర్తిలోని బతకనేర్చిన లక్షణం అతన్ని ఆలశ్యం చెయ్యనివ్వలేదు. అప్పటికప్పుడే వాళ్ళు కోరినట్టు రాసిచ్చేశాడు.

అన్ని పత్రికల్లీ అదే నీచస్థాయికి దిగజార్చి ఊహించే దుస్థితికి అతనెప్పుడూ చేరలేదు గాని "ఒకటీ మూడు ప్రైజులు కూడా ఇలాంటివేనా" అనే చిరుప్రశ్న మొలగజ్జిలా అతన్ని ఓ పట్టాన వదల్లేదు గాని, "కొన్ని కొన్ని తెలుసుకోక పోడం లోనే ఉంది కొండంత జ్ఞానం" అనే వివేకశిఖరాన్ని అతిత్వరలోనే చేరుకున్నాడు. ఇంతకీ "ఆంధ్రుల ఆడపడుచు" పత్రికవాళ్ళు ఎంతో దూరదృష్టి గల వాళ్ళు. డబ్బు అనేది మబ్బులాంటిది. ఇట్టేవస్తుంది. అట్టే మాయమడుతుంది. కీర్తి అనేదే అసలైన పెట్టుబడి, రికరింగ్ డిపాజిట్ అది. అది ఓ సారి చేజిక్కించుకుంటే "తన వెంటన్ సిరి..." అని అదే వచ్చిపడుతుంది. చేనుకోత పూర్తిగా కుండానే పంటబేరం ఫైసలయినట్టు సీరియల్ పూర్తి కాకుండానే ఎందరో పబ్లిషర్వరులు అడ్వాన్సు నిధులిచ్చి మధుమూర్తి నవలని తన్నుకుపోడానికి తన్నుకు చచ్చారు. ఇక ఎదురేముంది? రెండేళ్ళలో మరో మూడునవలలు సంపుటీకరించి మార్కెట్ కర్పించి గొప్పనవలా కారుడై కూచున్నాడు మధుమూర్తి. నవలా రచన అనే "జిగ్ జిగ్ జిల" అందుకుని చేస్తున్న ఉద్యోగానికి ఎగనామం పెట్టేశాడు ఎప్పుడో.

అపరిమితమైన ఆర్థిక పరిపుష్టి మనిషిని పారమార్థిక దృష్టికి మరలిస్తుందేమో మరి! ఈ మధ్య ఒకటి రెండేళ్ళి మధుమూర్తిలో జనసమ్మతం మాట అలా ఉంచి మనం చేస్తున్నది మనసమ్మతమేనా, అని మనోమధనం లాంటిది బయల్దేరింది. నాలుగుసీరియల్స్ ఒకే సారి నడిపే కమర్షియల్ క్రాప్‌ని కాదన్నాడని కాదుగాని రచయితగా తన బాధ్యతంటూ ఒకటి ఏడిసిందేమో ననే చింత అప్పుడప్పుడతన్ని బాధించేది. అది కాకుండా ఓ సారి తన స్వగ్రామంలో తనకి సన్మానం జరిగినప్పుడు చిన్నప్పటి మేష్టారు సీతాపతి గారిని కలుసుకోడం మరింతగా అతన్ని అంతర్ముఖుణ్ణి చేసింది. అయిదేళ్ళప్పుడే మధుమూర్తి తండ్రిపోతే వాళ్ళమ్మ నానాకష్టాలూ పడి అతన్ని పెంచింది. ఒకే ఒక్క కొడుకు గనక సహజంగా ఎంతో గారాబంగా చూసుకొనేది. పదేళ్ళు దగ్గిరపడుతున్నా కొడుక్కి అక్షరం ముక్క అబ్బకపోతే సీతాపతి గారికి అప్పజెప్పింది. నయాన్నో, భయాన్నో తనకి దగ్గిరుండి చదువు చెప్పించింది ఆయనే. అందులో ఆయన పాతకాలపు తెలుగు మేష్టారు అవడం చేత అక్షర క్రమంలో ఏ ఒక్క తప్పు వచ్చినా ఒప్పుకోక క్షుణ్ణంగా భాష తీరుతెన్నులు నేర్పించారు. అన్నం పెట్టిన అమ్మ పోయింది గాని అక్షరభిక్ష పెట్టిన ఆనాటి అయ్యవారు ఈనాడు ఎదురుపడితే ఇన్నాళ్ళూ ఆయన మాటే మరచిపోయి నందుకు డి.యస్.పి. వేషంలో ఉన్న గజదొంగలా గజగజ ఒణికి పోయింది మధుమూర్తి మనసు.

ఆ ఆత్మీయుణ్ణి ప్రత్యేకంగాతను బస చేసిన హోటలుకి పిలిపించి పట్టుబట్టలతో సత్కరిస్తేగాని అతను ఊరుకోలేక పోయాడు.

'ఇంత ఉన్నతస్థితికి ఎదిగినా నన్ను గుర్తుంచుకుని అభిమానించావు అదేచాలు ఇవన్నీ ఎందుకుబాబు!" అంటూనే సీతాపతిగారు అవన్నీ అప్యాయంగా అందుకున్నారు.

"అంతా మీ ఆశీర్వాదబలం మేష్టారూ ! 'ఈమధ్య మళ్ళీ కొత్త తెలుగు పద్యాలు ఏవైనా రాశారా?' అంటే మేష్టారు మధుమూర్తి కలలోనైనా ఊహించని సంగతి ఒకటి బయటపెట్టేరు. సంచిలోంచి ఓ పెద్ద బౌండు పుస్తకం అతని చేతికిచ్చారు. ఇస్తూ అన్నారు.

"పాపులర్ రైటర్స్‌లో పటిష్టమైన స్థానం సంపాదించావు, నీవల్ల ఈ ఉపకారం జరుగుతుందేమో అనే ఆశతో దీన్ని నీ దగ్గిరకి తీసుకొచ్చాను'

మధుమూర్తి లోపల చూశాడు.

'నేతచీర' ఆ నవల పేరు. రచయిత బహుజనపల్లి సీతాపతి. రెండు లైన్లు చదవగానే తెలిసింది అది గ్రాంధిక భాషలో నడచిన పద్యకావ్యం కాదనీ, వ్యవహారిక భాషలో నడచిన వచన రచన అనీ, రెండువైపులా పదును ఉన్న ఆ ప్రతిభా శాలి నైపుణికి ఆ క్షణమే జోహారు చేసింది అతని మనసు. అతని విస్మయానికి విఘాతం కలిగిస్తూ మేష్టారు అన్నారు.

"చూడుమధూ? పుస్తకానికి కావ్య కన్యక అనే పేరుపెట్టిన మన వాళ్ళ దూర దృష్టికి నాకెంతో ఆశ్చర్యం వేస్తుంది. మనసుకి అలజడి కలిగించి బయటపడే దాకా అల్లరిపెట్టే మానసపుత్రికలు ఈ కల్పనా ఖండికలు. అమ్మాయిని కనకుండా ఉండాలేగాని కని, యుక్తవయసు వచ్చాక ఓ అయ్యచేతిలో పెట్టాలని ఉండడం కన్నవారికి సర్వసహజం. అత్తారింట్లో అది నలుగురితోనూ కలిసిపోయి అందరిచేతా అవుననిపించుకుంటే విని ఆనందించాలని ఉండడం అత్యాశ కాదు కదా: మరి వర్తక దృక్పథంలో పడి మనుషుల మనసులు అదెంత బండబారి పోయాయో ఆడపిల్ల పెళ్లికావడమే అసాధ్యమైపోతోందయ్యా మధూ!"

'అదేమిటి మేష్టారూ, మీకు ఆడపిల్లలు లేదుగా!"

"అదేమిటయ్యా దుక్కంత నాకూతురు నీచేతిలో ఉండగా!" ఆ ప్రయత్నంగా తన నోటవెంట వచ్చిన పొరబాటు ప్రశ్నని పెద్దనవ్వుతో కప్పిపుచ్చాడు మధుమూర్తి. ఆయన ఇంకా ఇలా అన్నారు.

"అయిదేళ్ళుగా ప్రయత్నిస్తున్నాను. మా 'నేతచీర'కి వెలుగుచూసే గీత ఉన్నట్టు కనిపించలేదు. కనీసం పది పత్రికాఫీసుల నుంచయినా తిరిగొచ్చి ఉంటుంది. ఇది. ఎలా పంపబడింది అలా కాగితం అయినా నలగకుండా, మాయకుండా తిరిగివచ్చేసింది. దీన్ని నీ ద్వారా ఏదైనా పత్రికలో నిమషాలమీద సీరియలైజ్ చేయించమని అడగడానికి రాలేదు. పాతకాలం మనిషిని కదా, ఈ రోజుల్లో పనికివచ్చేవి ఏదో, ఏ లోపాలు ఉన్నాయో... నీకేమాత్రం లీజరున్నా దీన్నోసారి ఈ రాత్రికి చూసి రేపొద్దున్న ఎలా ఉందో ఏం చేయ్యాలో చెబుతావని' అని మరి మాటడకుండా వెళ్ళి పోయారు సీతాపతి మేష్టారు.

ఆయన్ని వెళ్ళనిచ్చి, లోపల తలుపు గడియపెట్టుకుని, తలగడ మీదకి తల చేర్చి గుండెల మీద ఆ పుస్తకం విప్పి కళ్ళెదుట పరుచుకోడం మాత్రమే గుర్తుంది మధుమూర్తికి. పేరుకి పేజీలు జరుగుతున్నాయి, ఎడమ నుంచి కుడికీ, పైనుంచి కిందకీ కంటి చూపు కదులుతోంది. పైకి తెలుస్తున్నది అంతే. అతని హృదయాంతరాళాలలో కలుగుతున్న అనుభూతికి మాత్రం ఊహ్యం కాదు. భాష్యం లేదు! అది చదివిన ఆ మూడు గంటల సేపూ తానెవరో ఎక్కడున్నాడో తెలియనంతగా మైమరచి పోయాడు. అందులో పాత్రలు తనకెంతో సన్నిహితమైనట్టూ ఆ భాష తనకి తెలిసినవారు తనకి అర్థమయ్యే పద్ధతిలో మాటాడినట్టూ అందులో చిత్రితమైన హ్యూమన్ నేచరూ, అంతర్వాహినిగా ఆద్యంతం ప్రవహించిన హ్యూమరూ, తనని కదిలించి కరిగించేటట్టూ ఉన్నాయి. మధ్య తరగతి జీవితాన్ని ఉన్నదున్నట్టు చెప్పిన, నిండు గుండె విప్పి పరచిన నిజాయితీ ప్రయత్నం అది. అప్పటికప్పుడు, ఆ అర్ధరాత్రివేళ టాక్సీ మీద మేష్టారింటికి వెళ్ళి ఆపుస్తకాన్ని భద్రంగా ఆయన చేతికి అప్ప చెప్పేదాకా మధుమూర్తికి మనశ్శాంతి చేకూరలేదు. గద్గదిక కంఠంతో గురువుకి చేయబడిన శిష్యోపదేశం ఇదీ:

మేష్టారూ! ఎన్నాళ్ళకోగాని ఇంత గొప్ప తెలుగు పుస్తకం చదివే అవకాశం దొరకదు. కృతజ్ఞుణ్ణి.

నేను గుర్తించి నంతవరకు మన తెలుగు సాహిత్యం ముఖ్యంగా నవల అనే ప్రక్రియ ఈనాడు రో
భూయిష్టమై ఉంది. నా అనుభవం నాకు చెప్పిన పాఠాలు ఏమిటంటే ఈ రోగాలు ఒకటీ రెండు
కావని. బీ.పీ. తో అంటే భూతాలతో పాములతో ఎఫ్.సీ.తో అంటే ఫాంటసీలతో పులులతో, వీ.డీ
అంటే వనితల దొంగపేర్లతో, టీ.బీ.తో అంటే తీయని భ్రమలతో, మంచాన పడిఉంది మన సరస్వ
అన్నీ అంతే కాకపోవచ్చుగాని ఎక్కువగా ఇలాంటి రచనల్నే చదివి తరిస్తున్నాడు ఆంధ్రమహాపాతకుడ
ఇక మీరు రాసిన పేజీలు అంటారా, అందులో కిక్కులు లేవు. క్లిక్కులు లేవు, ట్రిక్కులు లేవ
టెక్కు నిక్కుల కుమ్మక్కు అయిన టెక్నిక్కులు లేవు! ఎక్కడ బాగులేదో చెప్పమన్నారు. ఇం
బాగా రాయడం కంటే ఈ రోజుల్లో మరో తప్పు ఉందిటండీ? బొత్తిగా భూమ్మీద మనుష
కష్టసుఖాలే రాస్తే ఎలా! ఏ ఎర్రసిరా గుర్తులూ అండర్లైన్లూలేక మీ అమ్మాయి మీ ఇల్లు చేరిం
సంతోషించండి. చల్లని బీరు అలవాటైన చోట చిక్కనిపాలు సప్లై చేస్తే ఎలా!"

# నూనె ఎలా తగలడనీ, రేకుమూత వదలకుమీ!




‘**ఇంత** చిన్న విషయంలో పేచీ పెట్టుకుంటారుటండీ?’ అని పక్కకి తిరిగి మీరేం ముసిముసినవ్వులు నవ్వక్కర్లేదు. మీ పాటి బోడి తెలివి మాకేం లేకపోలేదు. నేను చాలా ఖచ్చితం మనిషిని. నాతో మాటంటే మాటే. ఏమనుకున్నారో ఏమో, ఆ(నాతో వాదనకి దిగి నేనో పిచ్చి వెధవనని రుజువు చేద్దామనుకుంటున్నారు కాబోలు, ఆ పప్పులేం ఉడకవు. మీరు ఒకటంటే నేను పది చెప్పగలను. తగువులెప్పుడూ అల్ప విషయాల్లోనే మొదలై పెచ్చు పెరుగుతాయి.కుండకి కన్నమంటూ పడకూడదు. కాని అది చిన్నదా పెద్దదా అనే చొప్పదంటు ప్రశ్నలో అర్ధమేమిటి? మనసు విరిగిపోయినా అంతే అనుకోండి. నిజమే, మా ఎదురింటి వాళ్ళకీ మాకూ ఈ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటున్న మాట నిజమే. మాటాడుకోడం మాట అటుంచి మొహం చూస్తే మండిపోయేలా తయారైన మాట కూడా యదార్థమే. అయితే ఏమిటంటారు. చెయ్యని తప్పుకి ఇంతకంటె నీతివంతులు లేరని వాళ్ళ కాళ్ళు పట్టుకొని లెంపలేసుకోమంటారా! ఒకప్పుడు మరి వారూ మీరూ వీపూ వీపూ ఎలా రాసుకున్నారని మీరేం దెప్పి పొడవక్కర్లేదు. నల్లనివన్నీ నీళ్లూ తెల్లని వన్నీ పాలూ అనుకునే అమాయకులం. నిలువునా

చీల్చినా కల్మషం అన్నది ఎరగని వాళ్ళం. ఇరుగూ పొరుగూ అంటే ప్రాణం పెడతాం. ఇంతటి పయోముఖ విషకుంభాలని ముందే పోల్చుకోలేక పోతే అదీ ఓ నేరమేనా!

అవును. మా రెండిళ్ళలో ఒకర్తే దాసీది. పాలు పోసేవాడూ ఒకడే. మా పిల్లలకీ శ్రీ కూర్మం పిల్లలకీ ఒకడే ప్రవేటు మేష్టారు. మా అమ్మవాళ్లింట్లో అప్పడాలు ఒత్తడంలో సాయం చేసేది. అతని చెల్లెలు మా పిల్లల బట్టలు కుట్టి పెట్టేది. అంతేకాదు. వాళ్ళ గుమ్మంలో అతని పెళ్ళాం మా గుమ్మంలో మా ఆవిడా నిలబడి కబుర్లకి తగులుకున్నారంటే అవి ఆపి లోపలికెళ్ళడానికి అటు సూర్యుడు ఇటు తిరిగి పొడవవలసిందే. అంత నిముషాల మీద పొత్తు కలుపుకున్న వాళ్ళు ఇంతట్లోనే ఎందుకు జుత్తూ జుత్తూ పట్టుకోవలసి వచ్చిండీ అని మీరేం ఎత్తి పొడవక్కర్లేదు. మీరు అడక్కుండానే జరిగింది చెబుదామనే మీ లాంటి వాళ్ళని మారుమాటాడకుండానోరు మూయిద్దామనే ఈ ప్రయత్నమంతా. చిత్తగించారు కదూ!.

పాములూ తేళ్ళతోనే ఆరంభమయింది ఈ కథంతా. ఏమీ ఎరగనట్లు ఆశ్చర్యం నటించకండి. పామ్‌తేల్ పేరు మీరు విన్లేదూ! పాం ఆయిలు అంటారు తెలీదూ? ఒహో, ఇప్పటికి తెలిసిందా! సరే! మీది మెతక బుద్ధి అని అర్థమవుతూనే ఉంది. అందుకే అన్ని రకాల సందేహాలు వెలిబుచ్చారు. తీరా నోరు విప్పి అడిగినాకు దొరికిపోయాక, మధ్యలో ఆపడానికి మీరెవరు? బెల్లం కొట్టిన రాయిలా పడుండి చివరి దాకా నేను చెప్పినట్టు వినాల్సిందే. అందులో నేను మీరీ ముక్కుకి సూటిగా పోయే మనిషిని. అందుకనే ఇన్ని కష్టాలు, కష్టాలు నష్టాలూ నన్నేం చేయలేవండోయ్ మరింతగా గుండెను గట్టిపరచడం తప్ప. అసలే మంచివాణ్ణి కాను. అనవసరమైన మాట తప్ప మరొకటి, ఒక్కటంటే ఒక్కటి, నా నాలిక చీల్చేసినా రాదు. నన్ను అనవసరంగా రెచ్చగొట్టి పక్కదార్లు పట్టించక చెప్పిందేమిటో చెవి ఒగ్గి వినండి.

పాం ఆయిల్‌తో ప్రారంభించాను కదూ, కంట్రోల్ షాపులో అది తెచ్చుకోవడంలోనే ఉంది మనిషి గొప్పతనమంతా. పేరుకి మీకు ఫలానా చోట ఇస్తారని ఉంటుందిగాని దానికి ఎప్పుడు వెళ్ళి అడిగినా సరుకు ఉందనరు. ఇవాళో, రేపో వస్తుందని చెబుతూనే వుంటాడు షాపు పని చేసే వేళలు గల బోర్డుముందే వేళాడుతూ ఉంటుంది. గాని అవెప్పుడూ పాటించబడవు. వీలయినంత ఆలస్యంగా తెరిచిన లోపం వీలయినంత తొందరగా మూయడంలో సవరించుకుంటూ వుంటాడు షాపు యజమాని. రోజూ దర్శనం చేసుకోలేక ఓ రోజు బద్ధకించామో ఆ రోజే సరుకు వచ్చి మెరుపు వేగంతో మాయమైపోతుంది. ఏ నక్కతోకనో తొక్కి అదృష్టం బాగుండి సరుకు ఉండగానే షాపు చేరుకున్నామా, కార్డూ, డబ్బూ ఇచ్చి తప్పు చేసినట్టు గంటల కొద్దీ క్యూలో నిలబడాలి. ఆడ క్యూ, మగ క్యూ, తొక్కిసలాటలు, దొంగతనాలు, షాపు ముందు కుళ్ళు కాలువలో అడపా దడపా సరిగంగ స్నానాలు. ఇలాంటి షాపులు సాధారణంగా పెద్ద రోడ్ల మీదే వుంటాయి. గనక ఈ క్యూలని ఛేదించుకుంటూ అప్పుడప్పుడూ సిటీ బస్సుల వాలు మొగ్గల్లు ఇంతకీ ఇంట్లో 'పోపుకయినా గరిటెడు నూనె చుక్కలేదు' అంటూ సన్నాయి నొక్కులు నొక్కుతారు గాని తల్లి గాని పిల్లలు గాని కేరేజి పట్టుకొని క్యూలో నిలబడతారా? ఇల్లంతటినీ మేపే జీతంలేని నౌకర్ని నేనున్నాను కాదుటండీ? తొమ్మిదింటికి రెండు ఉడికీ ఉడకని మెతుకులు బొక్కి రోజంతా ఆఫీసులో అరువు చాకిరీ చేసి ఆరింటికి ఇంటికి చేరే వెధవలం. తైలం ఇంటికి చేర్చే వెధవ పని కూడా మన మొగాళ్ళ మొహానే

రాయాలా ఆ విధాత! ఏ శలవో పెట్టి ఎండలోనో వానలోనో ఆ క్యూలో నిలుపు జీతం కూడా మనదేనా! శెలవు దొరికినా, కాళ్ళల్లో నీరు దిగినా, మన వంతు వచ్చేదాకా సరుకు తరగక పోయినా, ఆ శుభ సమయానికి తగు చిల్లర లేక సగటు పౌరుడు పొందే నిస్సహాయత అనుభవించిన వాళ్ళకి గాని తెలీదు! ఇంతగా పడిగాపులు పడితే దొరికే సరుకు ఎంత? మహా అయితే ఒక్క లీటరు!

'నూనె ఖర్చు తగ్గించండ్రా' చమురు కాళ్ల సతీ సుతలారా!' అంటే వీళ్ళు వినకపోగా ఎదురు జవాబు కూడాను! అది కూడా పాట రూపంలో! నూనెకి స్నేహమనే పర్యాయపదముందిట.

"వంటలో తప్పనిది స్నేహమే నోయి!" అని రాగాలూ సరాగాలూ! ఇంతకీ వాడు నెలకిచ్చే సరుకు ఇల్లాలు తాళింపు ఎగతాళింపుకి చాలదు. ఇక ఇల్లాలి నూనె ఖర్చుకి తట్టుకోడానికి వేరే బ్లాక్ మార్కెట్లో యజమాని కొని అమర్చేవి నూనె చుక్కలు కావు, కార్చిన నెత్తురుచుక్కలు!

ఇంతటి చీకట్లోంచి వెలుగులోకి తీసుకొస్తానంటే ఎవరొద్దంటారు! శ్రీ కూర్మం ఒక పథకం చెబితే ఆ వీధిలో మాకు తెలిసిన మరో పది మందికి అది చెప్పాను.

వంటనూనె హోల్‌సేల్‌గా వ్యాపారం చేసే జనతా ట్రేడ్ కార్పొరేషన్ వాళ్ళు శ్రీ కూర్మానికి పరిచయస్థులట వాళ్ళతో చెప్పి రెండు మేలి రకం నూనె డబ్బాలు సీల్డు చేసినవి, ప్రతీనెలా అతను కొంటాడుట. డబ్బా పదహారు లీటర్లు ఉంటుందిట.

ఎవరింట్లో ఏ మాత్రం నెలకి వంట నూనె పడుతుందో అన్ని లీటర్ల డబ్బులు అతనికి నెల మొదటి వారంలోనే ఇస్తే డబ్బాలు తెచ్చి తన ఇంట్లో అతను ఉంచుతాడు. ఎవర్నైనా జాగా ఇచ్చి పంపిస్తే కొలిచి అతను నూనె సప్లయి చేస్తాడు.

దీనివల్ల రెండు లాభాలున్నాయి. మొదటిది సీలు డబ్బా కనక కల్తీకి అవకాశం లేదు. రెండోది ఒకేసారి డబ్బా పుచ్చుకుంటున్నాము గనక పైన కొనే రేటుకంటే తప్పకుండా తక్కువ పడుతుంది.

లోపల వేరే లాలూచీ ఉంటుందని కలలో అయినా అనుకోకుండా అందరం రంగంలోకి ఉరికాం, ఇవన్నీ నెల నెలా తెచ్చి అందరికీ పంచే పూచీ నీదే సుమా. అని చెప్పాం అలాగే అన్నాడు.ఇలా కొన్ని నెలలు గడియెలేదో ఎవరి అనుమానాలు వాళ్ల కొచ్చేయి. మాదే బుద్ధి తక్కువ. ఈ పిదపకాలంలో ఎవర్ని దేనికి నమ్మగలం గనక! ఎందుకొచ్చామో పోల్చి ఎంత ఘోరం చేశాడో చూడండి, శ్రీ కూర్మంగారు. ఏదైనా చెయ్యొచ్చు చెయ్యపోవచ్చు. ఆయన ద్వారా నూనె పుచ్చుకోక ముందు అది లేక మనమేం మలమల మాడి చావలేదు కదా!' అని ఒకరు మొదలెట్టారు..

చెప్పేను కదా నా పనేదో నేను చేసుకుపోడం తప్ప, దేన్ని గురించీ పెద్దగా పట్టించుకోనని. అతని మీద వాళ్లందరూ చేసే ఒకొక్క నేరారోపణ విన్నకొద్దీ అందులో నిజం కనువిప్పై అగ్గి నిప్పే అయింది.

'పదిమందికి ఉపకారం చేస్తున్నట్టుకనిపించిన పెద్దమనిషికి మరీ ఇంత స్వార్థబుద్ధిటండీ?' అని నేనింకా పూర్తి చెయ్యనేలేదు.

'మీరింకా పెరటిదారిని ఉండబట్టే ఇంత సుళువుగా బుట్టలో పెట్టగలిగాడు. పెద్దలు మీరు చెప్పారని మేమందరం గోతిలోకి దిగాం' అంటూ ఇంకొకరు అతని ద్రోహబుద్ధిని వివరించసాగేరు. మేమిలా చర్చించుకుంటూండగా తమ రహస్యంగా లోపలికి వచ్చానని ఆ తరువాత శ్రీకూర్మం చెబితేనే నాకు తెలిసింది. వెళ్ళిన పని ముందుగా ఆయిపోయి, అదృష్ట వశాత్తూ ఎక్స్‌ప్రెస్ బస్

దొరికి అతను మెల్లిగా తలుపు తెరచుకొని తన ఇంటికి వచ్చాడుట. తన పేరు పెద్దగా వీధిలోకి వినబడి తనింట్లో ఈ మీటింగేమిటో కనిపెడదామని మెల్లిగా సందులోంచి పెరట్లోకి వచ్చి పక్కనున్న అరుగుమీద కూచున్నాడుట. మా గొడవలో మేం పడి అతని రాక గమనించలేదు. దొంగ బుద్ధులు కాకపోతే ఇలా పొంచి వుండి వినడం పెద్దమనిషి తరహాటండీ?

ఇంతకీ శ్రీకూర్మం పడిన కక్కుర్తి కూటి పనుల ఒకటా రెండా నా చెవికి చేరినవి! దేనికవే సబవనిపించేయి నాకు. న్యాయం ఎటుంటే అటే మొగ్గుతుంది నా మనసు. మీరది బలహీనత అనుకున్నా నేనేం చెయ్యలేను. ఇంతకీ ఆ లిస్టు ఇదీ :

1. పదహారు లీటర్ల డబ్బా ఈ నెల ఇంత పడిందని అతని నోటి మాటను మనం శిరసావహిస్తున్నాం. అవునో కాదో మనకేం తెలుసు? ఆ షాపతను ఇతని ఫ్రెండని మనం ఇక్కడ మరచిపోకూడదు.

2. డబ్బాలు షాపు నుంచి ఇంటికి తేడానికి రిక్షా ఛార్జీ అయిదు రూపాయలని ముక్కు పిండి పుచ్చుకుంటున్నాడు. ఎక్కడైనా అంత ఛార్జీ వుంటుందా? ఒకసారైతే ఫర్వాలేదు. ప్రతీ నెలా అయితే ఎంత నష్టం అవుతోంది? ప్రతీ నెలా ఒకే రిక్షావాడు తెస్తున్నాడు గనక ఏ మూడుకో రాడా? ఇంతా చేస్తే వాడు తమ పిల్లల్నే స్కూలుకి దిగబెట్టే వాడుక రిక్షా వాడుట! ఏ రూపాయి ఇస్తున్నాడో, దబాయించి ఫ్రీగా తెస్తున్నాడో!

3. అతనే డబ్బాల సీలు విడగొడుతున్నాడు. పిల్లల్ని పంపించి తెప్పించుకుంటున్నాం మనం. మొదట్లో నూనెకి ఉన్న నాణ్యత ఇప్పుడు లేదే! కల్తీ జరగలేదన్న గ్యారంటీ ఏముంది?

4. కొలత కూడా అతనిదే. ఇంటి కొచ్చాక కొలుచుకుంటే కాస్త తక్కువగా ఉన్నట్టు తోచి గిల గిల కొట్టుకుంటోంది మనసు. పాపం పుణ్యం పరమాత్ముడికెరుక!

5. ఈ పాటికి పదికి తక్కువ కాకుండా కాళీ డబ్బాలు చేరి వుండాలి. ఎంత లేదన్నా ఒకొక్క దానికి నాలుగు పలుకుతోంది బజార్లో. వాటి ఖరీదు మాట!

ఆఖరి మాటగా మా ఆవిడ ఇలా అంది. మనమేం డబ్బిచ్చి కొనుక్కుంటున్నాం గాని దయాధర్మ భిక్షకాదుగా! ఏదైనా అడిగే హక్కుంది మనకి. అనుమానం రాకూడదు గాని వచ్చాక ఎంత చిన్న విషయమైనా నిలదీస్తాం. సీలు తీసిన రేకు మూతల సంగతి ఎవరూ ఎత్తరేం?"

"రేకు మూతేం చేసుకుంటామే నిన్ను తిరగమోత వెయ్య" అని నేను అనుకోకుండానే ఆవిడ జవాబు చెప్పింది.

"ఏదైతేనేం తీసి దిగదీసిందా ఏం ఊరికే వస్తే! దానికి రెండు కన్నాలు చేసి అటూ ఇటూ దారం దూర్చి ఇస్తే పిల్లలు దాన్ని గిర్రున తిప్పుకుంటూ మరి ఈ లోకం ఎరుగరు!. మొన్న వాళ్ళ బాబు తిప్పుకుంటూంటే చూశాను. మన పాప ఓసారి అడిగితే ఇచ్చిందా మరి?"

ఇక ఆగలేకపోయాడు కాబోలు, లోపల్నుంచి నలుగురి మధ్యకీ వచ్చేశాడు శ్రీకూర్మం. నానా కంగారూ పడిపోయారు అందరూ, అందరకీ నమస్కారించాడు చేయెత్తి.

'ఎప్పుడూ ఎరగని దైవానికి ఎన్నెన్నో మొక్కులు కడతారు. ఎక్కడో కొండ మీది దేవుడికి హృదయమైనా కానుకగా ఇవ్వగలరు. సాటి మనిషి సహాయం చేస్తానని వస్తే సందేహిస్తారు. 'నీరా' జనం, మీకు నీరాజనం!'

*నూనె ఎలా తగలడనీ, రేకుమూత వదలకుడు !*

అప్పటికే ఒక్కొక్కరూ పట్టుపడినట్టు జారుకున్నారు. నేనూ మా ఆవిడా మిగిలాం.

"ఏ ఒక్కరూ జీతాలందగానే తెచ్చి డబ్బివ్వరు. మంచి పని చేస్తున్నాననే తృప్తితో ఎన్ని నష్టాలకైనా ఓర్చినా ఇన్ని నిందలు వేశారు. మీరైనా గ్రహించారనుకున్నాను, మూత దగ్గిరే నిలబడిపోయారు.!" అంటూ ఎందుకో విరగబడి నవ్వాడు. 'చాల్లే సంబడం' అని ఇంటికొచ్చేశాం మేం.

చేసిన వెధవ పనికి తల వంచుకుసిగ్గు పడక, పెద్ద గొంతుక పెట్టుకుని దైవదూషణ కూడా ఎందుకండీ! అంతే! మరి మా ఇంటి కాకినా ఆ ఇంటి మీద వాలనిచ్చాంకాం, పాములూ తేళ్ళూ ఎండలూ వానలూ క్యూలూ వేచి వుండడాలూ ఇవే బావున్నాయి మాకు!

అదిగో, అన్నీ విని మళ్ళీ ఆ దొంగ నవ్వులు దేనికీ? మీ పాటి తెలివితేటలు మాకు లేకపోవచ్చు. కష్టజీవులం, కచ్చితమైన మనుషులం, మేమెలాగో మా బతుకులు ఈడ్వగలం లెండి! ఇలా చావడంలోనే మాకున్న తృప్తిని మాకు మిగలనివ్వండి!

*(జ్యోతి మాసపత్రిక,జనవరి 86)*

# పునర్జన్మ ఉంది సుమా!




**జీతాలు** చాలీచాలకుండా ఇచ్చి, ధరలు మాత్రం అందీ అందనంతగా పెంచి 'మా ప్రజలకేలోటూ లేదు' అని ప్రభుత్వం గొంతు చించుకు ప్రకటించుకుంటోందంటే దాని అర్థమేమిటి, ఎవరిశక్తి కొద్దీ వారు ఇతరత్రా సర్వత్రా కొల్లకొట్టుకు బతకమని కోటిగొంతుకలతో ఘోషిస్తున్నట్లు కదా! పిచ్చి ప్రజ పోల్చుకోలేకపోతే ఆ నేరం సర్కారు వారిదా! చిన్నప్పుడు సెనక్కాయలమ్ముకునే మంత్రిగారి బావమరిది సినిమాహాలు కట్టించే స్థితికి చేరుకున్నాడంటే సదరు విద్యలో వారి వంచనాశిల్పం సర్వోత్తమ స్టేజికి చేరుకున్నట్టే కదా! పెద్దలూ, జీవితాన్ని కాచి వడబోసినవారూ, మార్గదర్శకులూ వారు. వారిని కాదని మరోదారి తొక్కడంమనకేంధర్మం!

అని మనసా నమ్మడమే కాక త్రికరణశుద్ధిగా దాన్ని ఆచరిస్తూ, యథాశక్తి తెలుగుతల్లి రుణం తీర్చుకుంటున్నారు, రహదారులు మరియు భవనాల ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పరమశివంగారు. రాష్ట్రలో గవర్నమెంటు సర్వెంట్సు మాత్రమే లేరు. నెలకింత జీతం, ఇంటి అద్దెలాంటి సదుపాయాలేకాక పెరుగుతున్న ధరల సూచిని అనుసరించి కరువు భత్యం లాంటిది పెంచుతూనే ఉన్నారు. ప్రావిడెంటు

ఫండు, ఫించెను సరేసరి ఇవేవీ ఎరగని, అర్హతా శక్తీ ఉన్నా అవకాశం దొరకని, ఆకలి మంటలు చల్లార్చే ఆసరాకి నోచుకోని అక్షలాది నిర్భాగ్యులూ ఉన్నారు. వాళ్ల గురించి మాటవరసకైనా ఆలోచించరేం? అని పొరబాటున ఏ ధైర్యమున్న వాడో ఎదురుతిరిగినా, ఆయన అణుమాత్రం తొణకరు . ఇంకొకరికి కాదు తనకు తానే జవాబు చెప్పుకుని దర్జాగా మహరాజులా కాలం వెళ్ళబుచ్చడానికాయన ఏనాడో అలవాటు పడిపోయారు.

"ఎవరిగుమ్మం వారు తుడిచి ముగ్గు పెట్టుకుంటే వీధంతా కళకళలాడదా! మనిల్లేదోమనం నింపుకోవాలిగాని ఈ లోకాన్నంతా మరామత్తు చెయ్యగలమా! అవన్నీ చూసుకోడానికి పైన పరమాత్ముడున్నాడు. అందులో మనం వేలుపెడితే లోకాధీశుడి కోపానికి గురికామా!" అని ఒక్కముక్కలో కొట్టి పారేసి నిశ్చింతగా కాలం గడపగలడాయన.

అంతా తనొక్కడే ఔపాసన పట్టడానికాయనకేం అభ్యంతరం లేదుగాని ఆ పబ్లిక్ వర్క్సు డిపార్ట్ మెంటు అందుకు అనుమతించకపోడంతో నీతి ప్లేటు ఫిరాయించక తప్పలేదు. "ఇంతసేపూ నేను చెబుతున్నది ముక్కూ మొహం ఎరగని స్ట్రేంజర్స్ గురించి, వాళ్ళ బాగోగుల గురించి మనకెలాగా పూచీ ఉండదు. కాని పొద్దుటలేచి ఒక ఆఫీసులో పనిచేసే కుటుంబసభ్యులతో ఆ మాట నేనెలా అనగలను? వారిక్షేమమే నాక్షేమం. ఇలాంటి వివిధ శాఖల క్షేమమే ప్రభుత్వధ్యేయమూ శ్రేయమూను" అని జస్టిఫై చేసుకోగల నేర్పరి ఆయన. మూడేళ్ళయి ఆ కొత్త జిల్లాకి ట్రాన్సఫరై వచ్చినా, అందుకే, మూడుకార్లూ ఆరుమేడలూ అన్నట్టు ఓ వెలుగు వెలిగి పోతున్నారాయన.

అయితే రోజులు ఒక్కలా వెళ్ళవు ఎంతటివారకైనా. జనరల్ ఎలక్షన్లలో చిత్రమైన ఓ చిక్కు పరిస్థితిని ఎదుర్కోక తప్పలేదు. పరమశివంగారికి.

సగటు భారతీయుడు సంతకం పెట్ట లేనిమాట అటుంచి సొంతంగా ఆలోచించలేని పరిస్థితిలో ఎల్లకాలం పడిఉండడం ధనమూ, అధికారంకోసం పోటీపడే వారికి లాభదాయకం. అలాంటివారికి ఇటు కిరాయి స్వామీజీలూ అటు కుహనామేధావులూ ఎప్పుడూ చెరోకొమ్మూ కాస్తూంటారు. బూడిదలో దొర్లే గాడిదల సంఖ్య ఎంతపెరుగుతే రాజకీయవాదులకంత బలం. తియ్యటి వాగ్దానాలు చేసి తిమ్మిర్లు ఎక్కించడంలోనూ ఎక్కడ అధర్మం జరుగుతుందో అప్పుడు నేను అవతరించి ధర్మస్థాపన చేస్తాను.' అని చెప్పడంలోనూ శ్రీ కృష్ణుడు ఆదిగురువు. ఒక అంకెగా తప్ప ఒక మనిషిగా నిలబడి ఎరగని ఓటరుకి అయితే తన కులం వాడికో కాకపోతే బాగా డబ్బు ముట్ట చెప్పిన వాడికో తన నటనా చాతురితో మనసులో నిలిచి పోయిన వేషగాడికో, ఓటు వియ్యాలనుకుంటుంది. గాని దాని విలువ ఇంకోపదిజన్మలకైనా తెలిసే అవకాశం కల్పింపబడలేదు. ప్రజాస్వామ్యానికి మనదేశ ప్రజలు ఎంత మాత్రం అర్హత కలిగిలేరు. అని ముందు గానే తెలిసి ఆ అజ్ఞానాన్ని పెట్టుబడిగా పెట్టి, గెలిచి, ఆ పరిస్థితులు ఏమాత్రం బాగుపడకుండా జాగ్రత్తపడి తమ పదవిమరింత శక్తి మంతం చేసుకుంటున్నారు నాయకులు. గొర్రెల రాజ్యంలో కసాయి వాడికే గెలుపు. రాజ్యాంగం కల్పించిన రక్షణలో రాజ్యాలేలుతున్న పరమశివం లాంటి పెద్ద పెద్ద ఆఫీసర్లు చేసే ప్రార్థన ఒకటే.

దేవుడా! దెయ్యమా! దయవుంచి వినవోయి!

సగటు హిందువునెపుడు చవటగా నిలుపోయి!

ప్రజాస్వామ్యం అనేది ఇటు విచక్షణ కలిగిన ప్రజలూ అటు నిస్వార్థపరులైన స్వాములూ

ఉన్నప్పుడే పదిమందికి పని కొచ్చే ప్రభుత్వ విధానం కాగలదు. ఆ రెండూ లేవుగనక మిగిలేవి ప్రభుతకి నిలవలూ, ప్రజలకి చిడతలూ. ఎవరికి దక్కినవి వారు ఎప్పటికప్పుడువచ్చే ఐదేళ్ళ జాతరలో వృద్ధిచేసుకోడానికి శక్తి కొద్దీ ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఎవరెంత విసురులూ, విసుగులూ ప్రకటించినా ఒప్పుకున్న పద్ధతిని ఏలుకోక తప్పదు గనక, చట్టబద్ధమైన ప్రాముఖ్యం కల్పించబడడం సహజమే, ప్రభుత్వ సాధన సంపత్తి అంతా ఇందుకు కేంద్రీకరింపబడడమూ న్యాయమే. ఇంతటి అలజడిలో హడావిడిలో వీలైనంత ఎక్కువగా సొమ్ముచేసుకుందామని ప్లండరింగ్ విత్ఔట్ డేంజర్ (పి.డబ్లుయు.డి)కి డిస్ట్రిక్ట్ హెడ్ అయిన పరమశివంగారు అనుకోవడమూ సందర్భమే. ఆ విధంగా ఎక్కడికక్కడే లచ్చుం తల్లిని మచ్చిక చేసుకోగలిగారుగాని ఓ చోటమాత్రం అనుకోకుండా చుక్క ఎదురైంది.

'ప్రజలనగా ఎవరు? మూర్ఖపు ప్రజలే ప్రజలని ఆ పదమును అవమానించగలమా! కావున మేమే ప్రజలము. ఈ సత్యదృష్టిని పరిశీలించిన మేమే నిజమైన ప్రజలము. ప్రజాసేవ యనగా మా సేవయే. మేము బాగుపడుటయే. బాగు పడుటయనగా వీలయినంత ధన సంపాదన చేయుటయేగదా!' అనే లాజిక్కుని ఆ డిపార్టుమెంటు ఆఫీసర్లు అక్షరాలా అమలు చేస్తున్నారు, అంచేత వారు ప్రజాసేవ చేద్దాము అనరు. 'చేసుకుందాము' అంటారు. అలా చేసుకుంటున్న నిండు నడకలోనే ఓ చోట అనుకోకుండా కుంటి తనం ఏర్పడింది. "ఇన్నిరకాలుగా జేబులు నింపుకుంటున్నాం కదా దీనికింత కొట్టుకుపోవటం దేనికి? పంచభక్ష్యపరమాన్నంతో కడుపునిండినప్పుడు ఓసారి తాంబూలం లేకపోతే తాండవం ఆడేస్తామా" అని ఓ జూనియర్ అని పరమశివం మూడోకన్ను తెరిపించాడు. "కోడ్ఆఫ్ కాండక్టు" అంటూ ఉంటుంది. అందులో ఓ అక్షరం పొల్లుపోడలానికి వీలా! ఇవాళ తాంబూలం లోటు అయితే రేపు భోజనమే కరువు కావచ్చు. అయినా మనం మనసుపడేది తాంబూలమే కదా! మనం యీ యీ కుర్చీలు అలంకరించిన నేరానికి గవర్నమెంటు మనల్ని నెలనెలా ఎలాగా మేపుతోంది. దక్షణతాంబూలాది సత్కారాలు మానుకుంటామా ఎంత మెతక మనుషులనుయినా? కేవలం ఈ జీతాల మొహం చూసే వీటితోనే మన జీవితాలు వెళ్ళమారిపోతాయనే ఇందులో ప్రవేశించామా!" అని ఎగిరెగిరి పడ్డాడు.

ఆ సమావేశం అలా తగలడగా ఇప్పుడు క్వార్టర్సులో కూచుని తలపట్టుకు ఆలోచిస్తున్నాడు పరమశివంగారు.

అప్పుడే రెండు సార్లు వర్కింగ్ స్పాట్‌కి వెళ్ళొచ్చాడు. చినగంగవరం వరకూ బస్సులు వెడతాయి. అక్కణ్ణుంచి గోదావరి పాయ మహేంద్రతనయని పడవ మీద దాటాలి. పడవ దిగి అవతల ఒడ్డున చేరాక తమపని మొదలవుతుంది. అక్కణ్ణుంచి సుమారు నూట ఏభై గజాల ఎప్రోచింగ్ రోడ్డు వేసి ఔటర్ మెయిన్ రోడ్డుతో కలపాలి. అలా తప్ప బలభద్రపురం నియోజక వర్గం చేర్చే సరైన దారిలేదు. ఈ ఎప్రోచింగ్ రోడ్డులో కూడా ఓ చోట మళ్ళీ అడ్డుకున్న నీటిపాయమీద ఉడెన్ కల్వర్టు నిర్మించాలి. కలెక్టరు ద్వారా ఎప్పుడో అందిన ప్రభుత్వ ఆదేశానికి అత్యధిక ప్రాధ్యానత ఇచ్చి టెండర్స్‌ని కాల్‌ఫర్ చేశాడు. సకాలంలో ఆఫీసుకి చేరిన దాన్లో మినిమమ్‌అరవైవేల చిల్లరికి అప్లై చేసిన కంట్రాక్టరు పాండ్రంగి పాపారావుకే అది ఇచ్చి తీరాలి.

చినగంగవరంకి ఇప్పుడయితే బ్రిడ్జి పడి రోడ్డు వచ్చింది గాని చాలా కాలం అది ఓ లంక

పెదబుల్లిబాబులుంగారిని ఒకప్పుడా సంస్థానానికి మకుటంలేని మారాజు. రాజులకి నాగరికత అవసరం గనుక డబ్బు ఖర్చు పెట్టుకుని మోటారు బోటు మీద నదిని దాటి ఎక్కడికైనా వెళ్ళి ఏ జల్సా అయినా చేసి వస్తూండే వారు. పల్లె ప్రజలు నాగరికత పెరిగి తెలివి మీరి పోకుండా ఎన్నిసార్లు బ్రిడ్జి ఎప్రూవ్ అయినా ఏదో స్టేజిలో దాన్ని అడ్డి విజయం సాధించారు. ఎలాగైతేనేం ఓ వైపు బ్రిడ్జి పడింది. మనవాళ్ళు వచ్చి నాలుగో దశాబ్దం దగ్గర పడుతున్నా రెండో వైపు పక్కా బ్రిడ్జి పడలేదు. అలా పడితే రెండు జిల్లాల మధ్యదూరం తగ్గి ఇట్నించి పడవ మీద చేరే అన్ని సరుకులూ అక్కడ చవకైపోయి, ఎంతో మంది షావుకార్లు నాశనమై పోతారు. వారు హైదారాబాదు వెళ్ళి చేసిన ప్రయత్నాల ఫలితంగా ఇటు బ్రిడ్జి ఇంకా పడలేదు. డబ్బున్న ప్రజలే ప్రజలు. వారి సేవే సిసలైన ప్రజాసేవ కదా! ఎలాగైతేనేం, సామాన్య ప్రజకి సవ్యమైన దారి లేకుండా చేసి తరిస్తారు ధర్మాత్ములు వారు కల్పించిన సదుపాయం ఉండబట్టే కదా తనలాంటి వారి కింత దప్పిక తేరేది! కాని ఏంలాభం ఇద్దరు ఎక్స్‌పర్ట్ ్స ఇంజనీర్సు చేత వేరు వేరుగా ఎస్టిమేటు వేయించి తెప్పించి గంటల కొద్దీ స్టడీ చేశాడు. మినిమమ్ ఏభైవేలు అయేలా ఉంది. చచ్చి మరో పది తగ్గించవచ్చు. ఇంతా కష్టపడితే ఇరవై వేలా మిగిలేది? కంట్రాక్టరు, సూపర్‌వైజర్స్, అసిస్టెంట్ ఇంజనీర్సు ఇలా సవాలక్ష మంది బందిపోట్లు సిద్ధంగా ఉన్నారు, కొల్లగొట్టిన ఊళ్ళు పంచుకోడానికి. ఎంత పెద్దవాటా అయినా ఇరవై వేల ముష్టి బేరంలో ఇంకేం మిగులుతుంది తనకి? ఆ ఎత్తు రోడ్డు పొయ్యమనీ, ఈ చిన్న బ్రిడ్జి కట్టమనీ ఇలా పురమాయిస్తునే ఉంటుంది గవర్నమెంటు దానికేం, ఎందులో అయినా చేతికి అందాలి కదా, తగినంతమనీ! మనీ మనసుకెంత సంబరమనీ!

'ఈ రాత్రికి నేను మావూరు వెళ్ళిపోతున్నాను అన్నయ్యా.. ఏదో ముఖ్యమైన పన్లో ఉన్నట్టున్నావు...'

అంటూ లక్ష్మీ నరుసు గుమ్మందగ్గిరే ఆగిపోయింది.

"అబ్బబ్బ సమయానికి తగలడతావు కదే సతీ సైతాన్!" అని మనసులో అనుకుని "ఎలక్షన్ల హడావిడి కదమ్మా ఊపిరి సలపడంలేదు. అప్పడే, ఏం తొందరమ్మా రాకరాక వచ్చావు" దగ్గరికి పిలిచాడు. 'వచ్చి పది రోజులయిపోయింది, ఇంకెన్నాళ్ళు ఉంటాను. నీకు వినే తీరిక ఉంటే చిన్నమాట. ఏమో అనుకున్నాను గాని వదిన ఇలాంటిదని ఇది వరకు ఎరగను సుమా!' అంది.

అతను తెల్లబోయి చూస్తుంటే గొంతుక తగ్గించి ఇలా అంది "ఇప్పుడు పెళ్ళా, ఒడుగా, ఎంత చెప్పినా వినదు పోనీ ఇంత పసుపూ, కుంకుమా ఇచ్చి ఓ జాకెట్టు గుడ్డ పెడితే చాలదూ? ఏకంగా చీర పెట్టింది అన్నయ్యా? నీతో ఎంత మాత్రం చెప్పొద్దంది! అలాంటి ఇలాంటి చీర అనుకున్నావా! అందులో మామూలిదా? ఇప్పుడు ఏ వెయ్యిదాకా ఉంటుందో!పట్టుచీర! వదిన, దేవత ఇదిగో చూడు!"

ప్లాస్టిక్ సంచీలోంచి పట్టుచీర తీసి అన్నయ్య చేతిలో పెట్టింది, లక్ష్మీనరసు. తనతో ఎందుకు చెప్పవద్దందో తన చురుకైన కళ్ళు ఇట్టే పసిగట్టేశాయి. చీర జాగ్రత్తగా మడిచి మళ్ళీ దాచేసుకుని

"వస్తాను అన్నయ్యా-- తీరిక చూసుకుని ఓ ఉత్తరమ్ముక్క రాస్తూండూ.., నేనిలా చీర చూపెట్టానని చెప్పకుమా,ఒట్టు కూడా వేయించుకుంది. అనవసరంగా ఆడిపోసుకున్నాను, వదినంటే ఎవరు, మనయింటి మహలక్ష్మి!"

అంటూ వచ్చినట్టే వెళ్ళిపోయింది లక్ష్మీనరసు.

పరమ శివంగారు ఎంతగా ఆశ్చర్యంలో మునిగిపోయాడంటే గంటల కొద్దీ బుర్ర బద్దలు కొట్టుకుంటున్న సమస్యే కొంత సేపు గుర్తురాలేదు! పాతికేళ్ళయి తనతో కాపరం చేస్తున్నా ఆరడజను తెలుగు అక్షరాలైనా తప్పుల్లేకుండా రాయలేదు తన భార్య అలివేలు. అయినా ఇంత జాణ అయిపోయిందా! పదిహేనేళ్ళ కింద తిరపతి కెళ్ళొస్తూ కంచి కెళ్ళి అలివేలుకి కొన్న పాత పట్టు చీర అది! ఆ డిజైనూ, ఆరంగూ, అన్నిటీని మించి ఆ పమిట బోర్డరూ తనకి ప్రత్యేకించి గుర్తు, అంతేకాదు ఆ చీర తెగవాడడం చేత గులాబిరంగు వెలిసి పోయి పేడ అలికినట్టు తయారైంది, తను ఈ మధ్య న్యూఢిల్లీ కాన్ఫరెన్సుకి వెళ్ళినప్పుడు-అక్కడ "డ్రై"చేస్తారని తెలిసి నీలం రంగు వేయింపించుకుని తన చేత తెప్పించుకుంది. రంగూ, పేకింగు మార్చి పాత చీరని కొత్త చీరగా అంట కట్టిందా! అది చూసి కొత్తదని చెల్లెలి కళ్ళలో మెరుపులా!

తలెత్తి చూశాడు గొడ మీద నవ్వుతూ అభయమిస్తూ కనిపించింది. స్వామిజీ ఫోటో, కిందని ఇంగ్లీషులో ఇంతంత అక్షరాలు, "గతనాపది అవతారాలూ మీరు ఎరిగినవే. ఇది పదకొండోది. నమ్మి చెడినవాడు లేడు!"

అతనిమనసులో ఏదో కొత్త సత్యం మిరుమిట్లు కొల్పింది.

అతని కొచ్చిన చిక్కు నిమషాల మీద విడిపోయింది.

"అవును నమ్మి చెడినవాడు లేడు. చెడినవాడు తను బాగుపడతాడు. పది మందిని సమానంగా బాగు చేస్తాడు. ఎటోచ్చీ తను కాస్త 'ఎక్కువ సమానంగా బాగుపడతాడు." అనుకోకుండా ఓ పనికి మాలిన ఆడది తనకెంత తత్వబోధ చేసింది! పదార్థం ఒకటే, పైతొడుగైన కోకవేరు! కాస్త రంగుమార్పు, అంతే! అవతారం ఒకటే, కాస్త మేకప్‌లోనే తేడా! మూలం ఒకటే. మూల్యంలోనే "యావత్తు"తేడా!'

'నిజరూక దర్శనం' అయీ అయి అవగానే పరమశివం ఇంజనీర్ల ఎమర్జెంటు మీటింగులో "తనదైన మెజారిటి అభిప్రాయం" తీసుకుని కార్యరంగంలోకి ఉరికాడు. అంతకు ముందు ఉన్న అదే ఇసకరోడ్డుకీ అదే కర్రబ్రిడ్జికీ నిమషాల మీద రిపేర్లు చేయించి రంగులు పూయించి "న్యూలుక్" వచ్చేలా ఆహో రాత్రులు నిద్రాహారాలు లేకుండా శ్రమించాడు. వెయ్యి విధాల కష్టపడి అయిదు వేల రూపాయలు మాత్రమే ఖర్చు పెట్టేడు. కాగితం మీద మాత్రం ఎక్కడా ఒక్క అంకె తప్పు లేకుండా అరవై వేలకూ లెక్క చూపించాడు. అలా తయారు చెయ్యడానికి వివిధ దశల్లో లెక్కలు చూపించిన నిపుణులకు అదే నిష్పత్తిలో లెక్క ముట్టేలా చేశాడు. ఇలాంటి అసలైన ప్రజాసేవకి ప్రతిఫలంగా ముట్టిన ముప్పై వేలూ అలాతోవ చూపించడానికి కారకురాలైన అలివేలుకి అందించాడు!

ఆ నియోజక వర్గంలో పేరు నమోదు కాబడిన గుంపులు గుంపులు ప్రజలు కొత్తగా కట్టబడినదని చెప్పబడిన కర్రబ్రిడ్జిని సంతోషంతో దాటుతున్నారు. ప్రజా సమూహం ఊగుతోంది. ప్రజాస్వామ్యం ఊరేగుతోంది!.

*(జ్యోతిమాసపత్రిక, డిశంబరు, 86)*

# వాళ్ళాయన కామసూత్రాలు




బ్రా హుక్కు వీపు మీద సరిగ్గా పట్టక పరాయి ఆవిడ అవస్థ పడుతున్న వేళ, మధ్య నున్న సందులోంచి, సరిగ్గా వెయ్యనికిటికీ రెక్కల ఖాళీలోంచి, ఇవతలింటి మగ బుద్ధి గుడ్లప్పగించి గుటకలు మింగుతున్న వేళ.

"దొరికిందండోయ్, దొరికింది!" అని కనకరత్నం హఠాత్తుగా అరచింది!ఆవిడ తుళ్ళిపడి ఇటు తిరిగింది. తన్నెవరో గుర్తించడం గమనించింది. పైటనిండుగా కప్పుదుని పక్క గదిలోకి తప్పుకుంది.

సుబ్బరాజు, మనసు విలవిల లాడింది. ఇంతసేపై ఊపిరి బిగబట్టిన మధుర దృశ్యం చేజారినట్టు చేసిందే, చాలక దొరకడం మేమిటి, నిన్ను దుర్గమ్మకొండ ఎక్కించి, దొర్లించ! అని పెళ్ళాన్ని కసిదీరా తిట్టుకున్నాడు. అయితే పైకి తేలకుండా పైపైకి చేరుకోవడం ఎలాగో ప్రాక్టీసు చేసి ఫలితాన్ని కొల్లగొట్టడం నేర్చుకున్న పండితుడు ఆయన. చాతకానిదంటూ ఉంటే మళ్ళుతున్న వయసుని వెనక్కి మళ్ళించ లేకపోడమే. జుట్టుకి రంగూ బుగ్గలకి క్రీమూ ఎంతగా పూసినా కళ్ళకింద మచ్చలు

దాగడం లేదు. మునపట్లా పై ఆటలకి లైన్ క్లియర్ అవడం కొంత కష్టంగానే ఉంది. వయసుమళ్ళిన ఆడాళ్ళయితే బాగా ముస్తాబయి అలా అద్దం వైపు చూస్తూ ఎంతసేపయినా ఉండి పోగలరు. తమ ప్రతిబింబం చూసుకొనే మనసు పడి మరులు కొనగలరు వాళ్ళు. మగాళ్ళకి అలా ఎలా కుదురుతుంది! మూడో పురుషార్థం లోనే కదా, చచ్చేదాకా మగాడు నాలుగోది అందుకోవాలని తహతహ లాడేది! పక్కింటి ఇవతలి గదిలోకి ఓ కొత్త నర్సమ్మ అద్దెకి దిగిందని, తెలిసిందగ్గిర్నుంచి సుబ్బరాజు మనసు మరీ మారాంచేస్తోంది. ఆవిడకి ఏ ముప్పై అయిదో ఉండవచ్చు. నలుపూ, తగు మాత్రం లావు కూడాను. ఏం చేస్తాం. ఎడ్జెస్ట్ మెంట్‌లోనే కదా ఎనిమిదో హెవెను ఉందంటారు! ఈ వయసులో తనకి మరీ "లావొక్కింతయులేదు" అనిపించే మైతీగెలు ఎక్కడ దొరుకుతారు!

కనకరత్నం మాత్రం కూచున్న చోటునుంచి కదల్లేదు. కదిలినా లేచినా ఆయాసం వస్తుందని ఆవిడ అనుమానం. అలాగని యాక్టివిటీ తక్కువనుకునేరు. సుబ్బరాజు రిటైరు అయ్యాక, ఒకేసారి చేతికందిన పెద్ద మొత్తం ఆ యింటికయిన అప్పుతీర్చడానికే సరిపోయింది. వాళ్లాయనది పింఛను అందుకునే ఉద్యోగం కాదు. ఇల్లుకూడా కనకరత్నం పేరనే ఉంది. పై ఊళ్ళలో స్థిరపడిన ఇద్దరు మగపిల్లలూ డబ్బు నెలనెలా ఆవిడపేరనే పంపిస్తారు. ప్రస్తుతం దేనికయినా సుబ్బరాజు పెళ్ళాం ముందు చెయ్యిజాచవలసిందే.

మొదట్నుంచీ సుబ్బరాజుది ఒకరికి నొప్పి కలగకుండా తనకి కావలసినంది చేసుకుపోయేరకం. ఈప్రపంచం కొన్నినీతులకీ నియామాలకీ కట్టుబడి ఉందనే భ్రమకి అతనెప్పుడూ లోను కాలేదు. తనకి తోచింది పదిమందికి ప్రచారం చేసి టైము వేస్టుచేసుకోడం అతనికి నచ్చదు. తనకి దైహిక వాంఛలు ఎలావుంటాయో అలాగే ఎదుటివారికి ఇంకోరకం మానసికవసారాలు వుండొచ్చు. దేన్నైనా కేష్ చేసుకోగలగడంలోనే అతనికి కైవల్యం కనిపిస్తుంది.

కనకరత్నం కూచునే మనిషేగాని ఊరికే ఊరుకొనే మనిషికాదు. అక్కణ్ణుంచే ఎంతటి ఉద్రేకాన్నయినా ప్రవహింప చేయగలదు. ఇన్నాళ్ళూ చాకిరీ చేసి చేసి అలిసిపోయింది. కళ్ళ మీదకి కళ్ళజోడు దిగిం దగ్గర్నుంచీ ఆవిడకి చదవాలనే కోరిక తగ్గి, రాయాలనే తపన పెరిగిపోయింది. భర్త ఇచ్చే ప్రోత్సాహంతో మరింత విజృంభించింది. కథలు,కాగితాలు, ఆరోజు విడుదలయిన అన్ని తెలుగు పత్రికలూ ఆయన తెచ్చి ఎదురుగా బల్ల మీద పెడతారు. ఆ యుద్ధ సామగ్రితో అక్కణ్ణుంచే సమస్త పురుషాహం కారాన్నీ చావుదెబ్బ తియ్యగలవని ఆవిడ దృఢవిశ్వాసం. అంతటి ఉత్సాహంతో పోయిట్రీలాంటింది. తన్నుకురావడం ఆమెకీ మధ్య ఎంత తృప్తినయినా ఇస్తోంది.

కని పడేసిన కొడుకులు చచ్చినట్టు తల్లిరుణం తీర్చుకుంటున్నారు. వండి పడెయ్యడానికీ, బజారుపనులు చెయ్యడానికీ జీతగాళ్ళు వున్నారు. అవీ ఇవీ అందించడానికి కట్టుకున్న మొగడున్నాడు. కనకరత్నం మగాడిమీద అక్షరాలా దాడి ప్రారంభించదా మరి! ఆ పూట ఆ ఆడపులి శ్రేనుపు ఇది

దొరికిందండోయ్ దొరికింది
ఆనాదినుండీ మగాడు చేసే
కిరాతకాలను సవాలు చేసే
కొత్త విశేషం దొరికింది!

ప్రశంసా పూర్వకంగా చూస్తూ సుబ్బరాజు చప్పట్లు కొట్టేడు. శరీరావసరాలని ఆదుకునే ఎలాంటి పరిస్థితులకయినా అతను అలా సలాం చేస్తూనే ఉంటారు. ఎవరికి కావలసింది వారికలా

దొరికి అందరూ కూలాసాగా ఉండడంకంటే ఎవరైనా కోరేది ఏముంటుంది! "ఆడదానికి జరుగుతున్న అన్యాయమా, పదికాలాలపాటు వర్ధిల్లుమా!" అని పాడుకుంటుంది, అతని మనసెప్పుడూ. ఈ రిటైరు అవడంకాదుగాని ఆవిడతోపాటు పత్రికలు చదువుతూ తెలుగు సినిమాలు చూస్తున్న అతనికి స్పష్టంగా బోధపడింది ఇదే అదేమిటో తెలిసినా మానినా, దానివల్ల ఏ ఒక్కరూ ఎన్నాళ్ళయినా మారకపోయినా, తెలుగు రైటర్సుకి ఇంత తిండి పెడుతున్న ముడిసరుకు మాత్రం "ఆడదానికి జరుగుతున్న అన్యాయమే."

'డేంజరులో దేవగాంధారి' అనే సీరియల్ పడుతున్న పత్రికని కనకరత్నం మొగుణ్ణి స్టేషనుకి పరిగెత్తించి తెప్పించుకున్నది. మృత్యువుతో హోరాహోరీ పోరాడుతున్న ఇప్పటి వారలవారం వారం సీరియల్సు ధీర వనితా పాఠకుల బ్లడ్ సర్క్యులేషన్‌తో పాటు ప్రతికల నెట్ సర్క్యులేషన్ పెంచుతోంది! ఇది వరకు బాత్‌రూమ్ కయినా ఒక్కర్తీ వెళ్లగల కనకరత్నం ఆ స్త్రీ సాహసం నెత్తుర్లోకి ఇంకి, ఇప్పుడు లేచి నిలబడ్డాకయినా భర్త సాయం కోరుతోందనేది వేరే విషయం.

అంతేకాదు 'నవనారీ, నీకుజోహారు!' అనే పేరున ఈ మధ్య ఓ తెలుగు సినిమా విడదలయింది. మాంగల్యాన్నీ మాతృత్వాన్నీ కాదని మానవతని రక్షించే మహోన్నత స్థాయికి ఎదిగింది అందులో నాయిక. నిజాన్ని నెత్తుర్లా పీల్చి నిలువెత్తుగా నిలిచిన ఓ కసాయి రాజకీయవాదిని పదిమందిలో పేల్చేస్తుంది ఆ సాహసి. మీసాలతో పాటు గెడ్డాలు పెంచడంలో కూడా పోటీ పడుతున్న ఎంతటి మగధీరులూ ఆ వీరనారికి నీరాజనాలు అర్పిస్తున్నారు. ఓసారి అదే సినిమాకి ఓ ఫ్రెండుతో వెళ్లాడు సుబ్బరాజు. ఆ ఫ్రెండు జీవితంలో ఓ నిమిషమైనా తను మగాడినని మరచిపోని రకం. అంతటి అహంకారీ ఆ హీరోయిన్‌కి జేజేలు పలికాడు. వాళ్లావిడ సినిమా నుంచి యింటికి స్వతంత్రించి రిక్షా బేరమాడబోతే 'వెనక చెట్టంత మొగుడు ఉన్నాడనుకున్నావా, చచ్చాడనుకున్నావా!' అని ఆంత మందిలోనూ ఫాట్‌మని ఓ లెంపకాయ ఇచ్చుకున్నా డనేది అ ప్రస్తుతం.

'నా కెందుకీ సాయుధ పోరాటాలు? నా లాంటి వాడి 'రసాయుధ పోరాటాలు చాలు' అనుకుంటాడు సుబ్బరాజు. ' ఆ కొత్త విశేషం ఏమిటో అడక్కుండా అలా కూచుంటారేం!' అంది కనకరత్నం అతని ఆలోచనలు చెదరగొడుతూ. 'అదే అదే. కొత్త 'సంగతి' కోసం ఉవ్విళూరుతోంది నా మనసు' అన్నాడు సుబ్బరాజు పక్కింటి వైపు దొంగచూపులు చూస్తూ. 'ఇలా రండి నేను చెబుతా.' 'నాకు నమ్మకమే నువ్వు దారి చూపిస్తావని. ఇల్లాలే దేవత అని ఊరికే అన్నారా అనుభవజ్ఞులు!' అని దగ్గిరగా వెళ్ళాడు. అతని చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుంటూ అంది.

'మీలాంటి ఉత్తములూ, సహృదయులూ, ఆడదాని మనసు కనిపెట్టిన వారూ నూటికి ఒక్కరో అరో ఉంటారు. అందరూ మీలాగే ఉంటే ఇలా ఎందుకు నాశనం అవును! అనాదినుండి ఆడదాన్ని అతి నీచంగానే చిత్రిస్తున్నారు! ఎంతో ఆలోచించిన మీదట ఓ పాతశ్లోకంలోని పక్షపాత వైఖరి బయటపడింది. చూడండి 'మాతృదేవోభవ. పితృదేవోభవ' అన్నారు. తల్లినీ తండ్రినీ గురువునీ గెస్టునీ ఆకాశానికెత్తేరు. మొట్టమొదట ఆడదాని పేరెత్తితే అదే గొప్పని పొంగిపోయాం యిన్నాళ్లూ.

ఈ నలుగుర్లోనూ ఒక్కర్తే ఆడది. అంత అన్యాయమా! అంతేకాదు తల్లిదండ్రులకే తప్ప కట్టుకొన్న పెళ్ళానికేదీ ప్లేసు? గెస్టుగాడికంటె కనికష్టమై పోయిందా! దీని మీద నేనో పెద్ద పరిశోధనా వ్యాసం లాంటిది సమర్పించ దల్చుకున్నాను. ఏమంటారు?'

'వేరే అనడానికి ఏముంది! అందర్నీ ఇన్నాళ్లపాటు పెడత్రోవ పట్టించిన పక్షపాత సూక్తుల్ని

జుత్తు పట్టుకు చిత్తు చేస్తున్నావు. హిస్టరీ అనే పదం 'హి' తో ప్రారంభమైందనీ అది మార్చాలనీ, 'హి'ప్నటిజమ్ కూడా పురుషులు స్త్రీల పై పన్నిన మాయాజాల పదమనీ వరల్డ్ విమెన్ లిబ్ వారు ఆందోళన చేస్తున్నట్లు వినికిడి అవన్నీ ఎందుకు గాని ప్రస్తుతం నీకు కలిగిన సందేహం, ఇంత గొప్పదీ కొత్తదీ ఇదివరకు ఇంకొకరి కొచ్చినట్టు వినలేదు. కాలు కదపకుండా ముల్లోకాలూ గజగజ లాడిస్తుంది. నీ అవలోకనం హేట్సాఫ్. అయాం ప్రౌడ్ ఆఫ్ యు'

మొగుడు పెదిమెల మీద బూరెలు వండేస్తూంటే పరవశిస్తూవింటూ అది పైకి తేలకుండా చిరుకోపం ప్రకటిస్తూ కనకరత్నం ఇలా అంది. "కబుర్లతో తృప్తి పడే మనిషిని కానండీ, నాకు కార్యాచరణ ముఖ్యం. పట్టడమైతే ఆయువు పట్టు పట్టాను గాని ఆ శ్లోకం ఎందులోదో ఏ సందర్భంలో ఉపయోగించ బడిందో ఆ వివరాలు నాకు తెలీవు'

'నీ వినయం చూస్తే ముచ్చట వేస్తోందే కనకం'

'అదిగో, అలాంటి పొగడ్తలే వద్దన్నాను. మళ్లీ కట్టేస్తాడేమో మీరు వెంటనే సెంట్రల్ లైబ్రరీకి వెళ్లండి. శాన్ స్క్రీట్ సెక్షన్ గాలించండి. వీలయితే రిఫరెన్సు బుక్సు తీసుకురండి. అన్నట్టు అలాంటివి బయటకి ఇస్తారా?'

"రూల్సు ప్రకారం ఇవ్వకూడదుగాని పదో పాతికో మనది కాదనకుంటే అక్కడి అసిస్టెంటు కాదంటాడంటావా?'

"అయితే ఇంకా చూస్తారేం, స్పీడప్ ఇవిగో తాళాలు. ఎందుకేనా మంచిది రెండు ఏభై రూపాయిల నోట్లూ, వేరే ఓ ఏభై చిల్లరా పట్టి కెళ్లండి. ఆటోలోనే వెళ్లండి. కక్కూర్తి పడకండి. మీ ఆరోగ్యం మాత్రం ఏం బాగుంది. గనక!"

సుబ్బరాజు ఆటో హాస్పటల్ వైపు పూర్తిగా డైరెక్ట్ చెయ్యకుండానే దార్లో నర్సమ్మ ఎదురైంది నడిచి వస్తూ ఆటో ఆపించి

"మీ పక్కింటి వాణ్ణి, గమనించే ఉంటారు" అని పరిచయం చేసుకుని అటూ ఇటూ చూసి స్వరం తగ్గించి "మీ లాంటి అందగత్తెలు ఇంతగా రోజంతా పనిచేసి అలసిపోయి నడిచి రావడం ఏంబాగులేదు ...." అని ఏదో అనబోతే ఆవిడ అందుకుని" ... ఏం చేస్తాం అన్నీ తెలిసినా ఇరుగూ పొరుగూ పెద్ద మనుషులు తమకేం పట్టనట్టు ఊరుకుంటే" అంది. చాలు. సస్పెన్సు తెగిపోవడానికీ టెన్షన్ పెరిగిపోవడానికీ ఆ మాత్రం హింట్ చాలు. చెయ్యి అందించి ఆటోలోకి దారి చూపాడు. ఇంకో పావుగంటకి హోటల్ "సుఖసీమ" ఎయిర్ కండిషన్ గదిలో అదే చెయ్యి అందించి గుండెల మీదకి లాక్కున్నాడు.

ఆ వేళకి అదే కుర్చీలో కనకరత్నం కునికిపాట్లు పడుతూవుంది. ఉపనిషత్తులు వెలసిన కాలంలో, శిష్యుల్ని కన్నబిడ్డల్లా టీచర్లు చూసుకునే గురుకులాలలో, ఆడా మొగా తేడాలేకుండా చేర్చుకున్న స్టూడెంట్స్‌కి పెద్దలు చెప్పే ప్రథమ ప్రవచనం "మాతృదేవోభవ" అనీ చిన్నపిల్లలే కాబట్టి అందులో భార్య ప్రసక్తి ఉండనే ఉండదనీ, ఇదంతా ఏ లైబ్రరీకి వెళ్లకుండానే సుబ్బరాజుకి ముందే తెలుసు. కాని భార్యల అజ్ఞానాన్ని పోషించడమే భర్తల సౌఖ్యానికి పెట్టుబడి అని ఆ గడుసరి ఎప్పుడో గ్రహించాడు!.

*(జ్యోతి మాసపత్రిక, మార్చి, '86)*

# సర్వే 'జనానా' సుఖినో భవంతు !




**'నిజంగా** ఆదర్శ దాంపత్యం అంటే వాళ్లిద్దరిదే''

అని ఆ వీధి అమ్మలక్క లందరూ లక్ష్మి మాధవరావుల అన్యోన్యం చూసి గొప్పగ చెప్పుకుంటారు.

''ఏ మాట కామాటే చెప్పుకోవాలి. ఈకాలపు చదువుకున్న పిల్లలు మొగుళ్ళ నుంచి ఏద లేనిపోనివి ఆశించి ఎందుకో ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతూ ఉంటారు. నా అదృష్టం కొద్దీ మ కోడలు అలాంటిది కాదు. మావాడు ఏ వేళప్పుడు వచ్చినా ఎంతో ప్రేమతో ఆదరిస్తుంది. ఎప్పుడు నవ్వుతూ కనబడుతుంది. దాని ప్రోత్సాహమే లేకపోతే మావాడు ఈనాడింతగా సత్కారాలు సన్మానాలు పొంది ఉండునా!''

అంటుంది లక్ష్మి అత్త రవణమ్మ గారు.

''ఏదో ఆయన అడుగు జాడల్లోనే నడుచుకుని తరిస్తున్నాను. స్త్రీ జన్మకి ఇంతకంటె సార్థక్య

అని తృప్తి పడుతుంది లక్ష్మీ నరసమ్మ.

స్థూలంగా విభజిస్తే మనుషులు రెండు రకాలు, తమకి కలిగిన అనుభూతిని స్పష్టంగా ముఖకవళికల ద్వారా ప్రదరిస్తూ, వీలైనంత పెద్ద గొంతుకతో తమ అభిప్రాయం చాటి చెప్పేవారు మొదటి రకం. ఎలాంటి పరిస్థితులకైనా తట్టుకోగలిగినట్టు కనబడుతూ పీకపోయినా పైకి తేలక మందహాసం వెదజల్లే చతుర్మతులు రెండవరకం. ఈ రెండో తరగతి అందమైన పెళ్ళాం ఒకటో రకం అనకాపల్లి బెల్లం కన్న మధురతరంగా మొగాడికి తోచడంలో ఆశ్చర్యంలేదు. అందుకే కాపరానికి వచ్చిన మొదట్లో స్వశక్తిని విస్తరించి సత్ఫలితం గుర్తించి తన్మయురాలైంది. లక్ష్మి. కాని ఏడాది దాటకుండా అది మూణ్ణాళ్ళ ముచ్చట అని గ్రహించి తెల్లబోయింది. అయితే తెల్లబోడం తల్లడిల్లడం మనసుకి సంబంధించిన విషయాలు ఆమె దృష్టిలో. ఎప్పట్లా పోర్టికోలోనే చెక్కు చెదరని చిరునవ్వుతో భర్తకి స్వాగతం పలికింది. ఆలవోకగా చూసినట్టు రిస్టు వాచీ వైపు చూసింది. "ఆఫీసు నుంచి అరగంట ముందుగా వస్తానన్నారు సినిమాకి వెడదామన్నారు. గంటన్నర ఆలశ్యంగా వచ్చారు. ఏమిటి మీ సంజాయిషీ?" అని ఆమె నోటితో అడగదు, కాని ఆ చూపు అంతకన్న ఎక్కువగానే నిలదీస్తుంది, ఎన్ని నవ్వులు కురిపించినా సరే.

పైకి దొరికిపోలేదుగాని, మాధవరావు జవాబు విని లక్ష్మిమనసు మొదటిసారిగా కలవరపడింది. ఆలిండియా ఫేమ్ ఉన్న మెజీషియను ప్రదర్శనం ఒకటి చూసే అదృష్టం కలిగిందిట అతని కారోజు. అందులో లీనమైతే తనెవరో ఎక్కడున్నాడో ఎంతసేపయిందో ఏ మాత్రం గుర్తుకు రాలేదుట అతనికి. ఈ విద్యలో తను ఎప్పటికి ఇంతవాడిని కాగలనో అని అతని మనసు కొట్టుకుపోయిందిట. నిజానికి ఇంతప్పట్నుంచీ అతనికి మేజిక్ అంటే పంచప్రాణాలూనట. గారడీ వాళ్ళ చుట్టూ తిరగడం చేతే గ్రాడ్యుయేటు అవడం అంత ఆలశ్యం అయిందిట. ఏమైతేనేం మనవాడు ఒకడు పైనుండబట్టి మళ్ళీ వెనక్కి చూడక్కర్లేని ఈ బ్యాంకి ఉద్యోగం దొరికింది. 'లైఫ్ సెటిల్ అయిపోయింది కాబట్టి ఇక ఆ ఇంద్రజాల కళకే నా శేష జీవితం అంకితం చెయ్యదల్చుకున్నాను అంటూ ఆ స్కూటర్ దిగకుండానే అన్ని కబుర్లూ చెప్పి ' చెత్త సినిమాలు ఇవాళ కాకపోతే రూపు చూడొచ్చు. అన్నట్టు వైట్ డెవిల్, అదే ఆ మెజీషియన్ నాకు ఇంటర్ వ్యూ ఇస్తానన్నాడు. ఇలాంటి అవకాశం మళ్ళీ జన్మలో దొరుకుతుందా, నీకేం అభ్యంతరం లేదుగా?' అంటూ రివర్స్ చేసిన వాడు కాస్సేపు ఆగేడు. 'ఉండండి, చిన్నమాట' అంటూ లోపలికెళ్ళి క్షణంలో అతని కిష్టమైన ఐస్‌కూల్డ్ ఏపిల్ జ్యూస్ బాటిల్ నోటికందించింది లక్ష్మి. మెత్తటి పైట చెంగుతో మొగుడి నుదుటి ముత్యాలు అద్దుతూ ఆఖరి ప్రయత్నంగా అంతకంటె తియ్యనైన కంటిచూపు కానుక ఇచ్చి చూసింది. ఊహుం అతన్ని బలంగా ఆవహించి ఉన్న మాయామోహం ముందు ఆమె ఆకర్షణ బలహీనమైంది. మరుక్షణం ఆ స్కూటర్ అక్కడలేదు. అది రేపిన దుమ్ములో కాస్సేపు తనకే తను కనబడకుండా పోయింది లక్ష్మి. పోర్టికో పై మెట్టు మీద కూచుని దుమ్ము చెదిరిపోయాక ఆమెకి కనిపించింది అత్తగారు రవణమ్మ.

"ఎప్పుడొచ్చా రత్తయ్యా పురాణం నుంచి?" అని అడిగింది ఏం జరగనట్టు.

"మీరు సినిమాకి వెడతానన్నారుగా, ఇందాకే వచ్చేను ఇంటి తాళం పుచ్చుకుందామని. అవునూ

అబ్బాయి వీధిలోంచి వచ్చినవాడు అలాగే వెళ్ళిపోయాడేమిటి? బంగారంలాంటి సినిమా పాడుచేసుకుని ఏదో మేజిక్ అంటూ ఎగబడుతున్నాడేమిటీ? ఉద్యోగం అయితే వచ్చిందిగాని జ్ఞానం వచ్చే యోగం వీడికీ జన్మలో లేదన్నమాట. పొద్దుట్నుంచీ ఎంత సంబరపడుతున్నావు. వాడెప్పుడొస్తాడా అని వెయ్యి కళ్ళతో ఎదురు చూశావు. అలా చేసినందుకు వీధిలోనే కడిగెయ్యక కూల్‌డ్రింక్ తెచ్చి అందిస్తావుటమ్మా? మీ మావగారూ యిలాగే ముద్దుచేసి వాణ్ణి చేజేతులా పాడుచేశారు. చచ్చి ఏలోకాన ఉన్నారో, ఇవాళ ఆయన తరపున నువ్వు వకాల్తా పుచ్చుకున్నావా! అవ్వ, ఏం సత్యకాలపు పిల్లవు తల్లీ నువ్వు!"

వెర్రి అత్తగారి గొణుగుడు పూర్తి కాకుండానే తన గదికి చేరి చన్నీళ్ళతో మొహం కడిగేసుకుంది లక్ష్మి. లైట్‌గా వేడి వేడి కాఫీ చేసుకుని పెరటి బాల్కనీలో కుర్చీ వేసుకు కూచుంది. ఎప్పటికైనా ఎలాంటి పరిస్థితిలో నుంచైనా ఆమెకి ఆత్మీయంగా తోచి అవంతమైన శక్తి ప్రసాదించేది ఆలోచనా బలమే. తల్లి తండ్రులకి ఏకైక సంతానంగా పుట్టి ఒంటరిగా పెరిగిన ఆమెలాంటి వాళ్ళకి వెయ్యి స్నేహితుల పెట్టు ఆ అంతరంగ మధనమే. పెరటివైపు మెట్లవైపు చూస్తూ కాఫీ కొద్దికొద్దిగా సిప్ చేస్తూ ఆలోచించసాగింది ఆమె.

లక్ష్మి తల్లి చిన్నప్పుడే పోయింది. రేషనల్ అవుట్‌లుక్ ఉన్న తండ్రి పెంపకంతో ప్రభావితురాలై వ్యక్తిత్వం తీర్చిదిద్దుకుంది ఆమె. సాధారణ స్త్రీల కట్టుబాట్లూ ఆచారాలూ కనుచూపు దూరంలోనే ఉంచి భౌతికావసరాలు భర్తీ చేసుకోడంలోనే సుఖపడగల ధీశాలి ఆమె. సాధించడం, రోదించడం ఇలాంటివి ఆమె మనస్సా అసహ్యించుకునే లక్షణాలు. ఏడాది క్రితం ముక్కూ మొహం ఎరగని వ్యక్తిపట్ల ఏ భార్యకయినా ఆరాధన అనేది ఏర్పడిందని చెబితే అంతకు మించిన పెద్ద అబద్ధం ఆమె దృష్టిలో లేదు. ఆరాధన అనేది లేకపోయాక ఆ వ్యక్తి సాహచర్యం కాసేపు కనుమరుగయితే ఆవేదన ఎలా కలుగుతుంది? మరెందుకు తన మనసు అతని కోసం అంతగా కొట్టుకుపోతోంది? ఒక్క చిరునవ్వుతో అతన్ని చెంగునముడేసుకోవాలనుకుందే, మరేదో శక్తివచ్చి తన్నుకు పోయిందని ఎందుకంతగా తన మనసు చిన్నబుచ్చుకుంటోంది?

జీవితంలోని ప్రాక్టికాలిటీని పూర్తిగా ఆకళింపు చేసుకున్న లక్ష్మి తొందర్లోనే తన ఆలోచనలోని పొరపాటుని సరిదిద్దుకుంది. రోజంతా వెయ్యి కళ్ళతో ఎదురుచూసింది అదే అదీ అందకపోతే భంగపాటు పడినదీ తన మనసా, ఎంత పొరపాటు! పొందు కోసం వయసు పొందే తొందర!

ఎప్పుడూ బాధించని ఒంటరి తనం ఈ ఏడాది అనుభవంతో ఎందుకింత తుంటరి తనం నేర్చుకుందో ఆ క్షణం అర్థమయింది లక్ష్మికి. ప్రేమా, హృదయం, త్యాగం, పాతివ్రత్యం ... ఇలాంటి సవాలక్ష దొంగపేర్లకి మూలాధారం 'చీకటిలో చేరిక' మాత్రమే కద! నీచంగా చెప్పారనుకోక నిజం ఒప్పుకుంటే యానిమల్ ఇన్ స్టింక్ట్ మాత్రమే కద! పడకగది తలపులే ప్రతినిముషం ఉక్కిరి బిక్కిరి చెయ్యకపోతే, పడుచుదనం దేనికి, పాతిపెట్టనా? 'మాధవ్ ఏ రాత్రికైనా రాకపోతాడా, అతని ఇంద్రజాలం మించిన ఇంద్రియజాలం ప్రదర్శించి అంతకంతకీ వడ్డీతో సహా బాకీ తీర్చుకోకపోతానా' అనే ఆత్మవిశ్వాసంతో అప్పటి ఆందోళనకి ఆనకట్ట కట్టింది లక్ష్మి.

ఆమె పట్టు అతన్నుంచి సడలడానికి నిజానికి ఆరోజు ఆశాభంగమే తొలిమెట్టు. ఆ తర్వాతి

రెండేళ్ళలో అతని అవతలివైపు ఆకర్షణ ఆమె నుంచి ఊహించలేనంతగా దూరం చేసింది. రాత్రీపగలూ భేదం లేకుండా ప్రతిక్షణం అ అనుభవం కావాలని ఆమె తనువు తహతహలాడే తరుణారుణ తరుణంలో ఆ యువకుడు ఆ యువతిని దగ్గిర తీసుకునేది ఎప్పుడో, జన్మానికో శివరాత్రి! అదైనా క్లుప్తంగా, నిర్లిప్తంగా, స్పీడీగా మూడీగా ఆమె అసంతృప్తిని మరింత రెచ్చగొట్టేలా, చిచ్చుపెట్టేలా.

మన బాధల పరిష్కారం మరెవరి చేతిలోనో ఉంటుందని ఒప్పుకునే రకం కాదు లక్ష్మి. ఎదిగిన వ్యక్తుల సరదాల్ని ఏవేవో బోధలు చేసి తనకినచ్చిన వైపు తిప్పుకుందామనే వెర్రిభ్రమా ఆమెకి లేదు. అత్తగారికి కళ్ళు సరిగ్గా కనిపించవు. ఇలా చీకటి పడుతొందో లేదో ఇంత రాత్రి ఫలహారం కడుపునింపుకుని గోపాలస్వామి కోవెలకి పురాణానికని బయలు దేరుతుంది. మళ్ళీ ఏ పదింటికోగాని ఇల్లుచేరదు. ఒక్కనాడు తనని పరుషంగా మాటాడి ఎరగదు. ఇంకొకర్ని ఇబ్బంది పెట్టడం ఆమెకి తెలీదు. ఒక్కముక్కలో చెప్పాలంటే తన అత్తగారు అక్షరాలా 'అల్ప సంతోషిమా'.

ఇక ఈనాటి మాధవ్ ప్రవర్తన? మరి ఎలా మనసు చిక్కబట్టుకుని అన్ని గంటలపాటు ఆ బ్యాంకి ఉద్యోగం వెలగబెడుతున్నాడో అతనికే తెలియాలి. అంతకుముందూ ఆ వెనకా ఏంచేసినా, ఏది మాటాడినా మేజిక్ సంబంధించినదే. ఈ రెండేళ్ళ తీవ్ర కృషిలో అతను ప్రేక్షకుడి స్థాయి నుంచి ప్రదర్శకుడి స్థాయికి ఎదిగేడు. ఇప్పుడు ఇంట్లో ఎక్కడ చూసినా తయారుచేసిన పేకముక్కలూ రహస్యపు మరలూ అరలూ అమర్చిన రకరకాల పెద్దడొక్కులూ. తన చూపులూ ఒంపు సొంపులూ ఈ దిక్కుమాలిన సంత ముందు దిగుదుడుపు అని తెలుసుకున్నప్పుడుల్లా అవన్నీ విసిరెయ్యాలని లక్ష్మికి అనిపిస్తుంది. అలా చెయ్యలేకపోయింది. సరికదా ఆ వస్తువుల నిత్యపరిచయం వల్ల ఆ పుస్తకాల పఠనంవల్ల అనుకోకుండానే ఆమెకి కొన్ని మేజిక్ ఐటమ్స్ పట్టుబడ్డాయ్ మాధవ్ బలవంతంచేత అప్పుడప్పుడు అతని ఇంద్రజాల ప్రదర్శనలకి హాజరు కాక తప్పలేదు కూడా. అలాంటి ఒకానొక ప్రదర్శన పరిశీలనలోనే కోరికలు తీర్చుకోడానికో దారంటూ దొరకడం ఆమె ఊహించలేని మాయ!

కిక్కిరిసిన ప్రేక్షకులు గల హాలులో ఆ ఇంద్రజాల ప్రదర్శనలో లక్ష్మి మొదటి వరసలో ఫస్ట్‌ప్లేసులో ఉంది. అది జాదూ సామ్రాట్ మాధవరావు చూపించే ఆఖరి ఐటమ్. అసిస్టెంటు అతన్ని పెద్ద పెట్టెలో కూచోపెట్టి మూతవేసి పెద్ద తాళం వేసి దానికి సీలు కూడా వేశాడు. అన్నీ అలాగే చెక్కు చెదరకుండా ఉంటాయి. అంతలో చెవులు చిల్లులుపడే పెద్ద ప్రేలుడు. హాలు బయట నుండి ప్రేక్షకుల మధ్యనుండి చప్పట్ల వర్షంలోంచి నెమ్మదిగా నడుచుకుంటూ మాధవ్ స్టేజి మీదకి వస్తాడు అక్కడితో అతను ఊరుకుంటే లక్ష్మికా విషయం తట్టకనేపోను 'చూశారా కళకి తనని తాను అర్పించుకోడంవల్ల, ఆ సాధన లోని నిత్య తపస్సువల్ల, మనిషి ఎన్ని వింతలయినా ప్రదర్శించవచ్చు. మీ కళ్ళెదురు గుండా ఇప్పుడే పెద్దపెట్టెలో బంధింపబడ్డాను. మీ కళ్ళెదురు గుండానే అవతలినుంచి నడుచుకుంటూ వచ్చాను. తలుచుకుంటే ఇదే క్షణం మా ఇంటి మీద మీద సహా ఉండగలను. అవును, నేనే!'

ఒకేవ్యక్తి ఏకకాలంలో మూడు చోట్ల ఉండగలడంటే నమ్మేటంత వెర్రిదేం కాదు లక్ష్మి. ఆ క్షణం మాయలో మునిగినా మరుక్షణం 'ఇందులో ఏదో ఉండే ఉంటుంది' అనుకుంటారుగాని

సూపర్ నేచురల్ పవర్స్ ఒప్పుకోరు చూపరు లెవరూ. లక్ష్మికి మాత్రం 'అందులో ఏముందో' తెలుసు. పెట్టెలోపల బంధింపబడినవాడు తన భర్తతో సమానమైన, వీలయినంత అతనిలాగే మేకప్ చేయబడిన, సహచరుడు. పై నుంచి వచ్చి పెద్దకబుర్లు చెప్పినవాడే నిజమైనభర్త అయితే అంతటితో అతను ఊరుకోలేదు. 'తలుచుకుంటే ఇదే క్షణం మా ఇంటి మేడ మీద సహా ఉండగలను!' అని ఛాలెంజ్ చేశాడు కూడా. తెలివైన సెక్స్ స్టార్వ్డ్ లేడీకి. ఇంతకన్న సూచన యేం కావాలి ఇక ఆలస్యం అనవసరం అనే నిర్ణయానికి వచ్చింది లక్ష్మి "నీవు నేర్పిన విద్యయే నీకు శిక్ష" అనే నిశ్చయానికి వచ్చేసింది.

ఓ వారం- రోజుల లోపుగానే లక్ష్మిలో మళ్ళీ జీవకళ పుంజుకుంది. ఆమె చలాకీ తనం పసికట్టి "ఏమిటి, ఈ మధ్య నువ్వు మరీ హుషారుగా కనిపిస్తున్నావే" అని భర్త ప్రశ్నిస్తే "అవునండీ, ఈ మేజిక్ కళలో మీరింతగా పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తూ ఉంటే నాకు హుషారుకాక మరేమిటి ఇంతకంటె ఇష్టకామేశ్వరీ వ్రతం లేదని ఇన్నాళ్ళకి ఒంటపట్టింది. ఇంటి దగ్గిర నేను ప్రాక్టీసు చేసేది అదే" అంటుంది సహజమైన చిరునవ్వుతో.

"మోరల్స్ అనేవి అన్నీ లౌక్యంతో కూడినవే" అని మొట్టమొదట్నుంచీ నమ్మినదే గనక దేహావసరాలు తీర్చుకునేందుకు ఆమె పచ్చజెండా చీర చెంగు ఎగరెయ్యాలేగాని దరికి చేరే పడుచు శకటాలు కావలసినన్ని. కాని దానికోసం సాంఘిక భద్రతకాలదన్నే అజ్ఞానం ఆమెకి లేదు. అందుకే ఇన్నాళ్ళూ వేచి చూసింది. ఈనాడు అనుకోకుండా భర్త ఉపదేశ సారం తలకెక్కి ఆమెకి జ్ఞానోదయం అయింది.

మాట వరసకయినా తప్పుపని చేస్తున్నాననే ఆలోచనే ఆమెకిలేదు. ఎంతో కన్ఫ్యూజింగ్గా కనబడే వేదాంత రీత్యా చూసినా ఈ శరీరానికి అంత ప్రాధాన్యత ఇవ్వడం అనవసరం. పై తళుకు ఏదైనా లోకిటుకు మాత్రమే శాశ్వతం. మనసు నిర్మలంగా ఉంచుకున్నంత వరకూ ఇవాళ ఉండిరేపుపోయే ఈ పాడు తనువు ఎవరికి అర్పిస్తేనేం!

మాధవరావు ఏ టౌన్హాలులోనో ఇంద్రజాలం ప్రదర్శించే సమయంలో ఇక్కడ మేడ మీద "మరో మాధవ రావు" ఒడిలో ఉంటుంది లక్ష్మి. ప్రేక్షక లోకం కన్ను కప్పడం కోసం కొంత ప్రదర్శన తప్పదు మరి. ఆ మరో మాధవరావు ఇంచుమించు అతని ఫిజికల్ మెజర్మెంట్స్ గల డ్రైవరు పోతురాజు అనేవాడు. భావన ముఖ్యం గనక భర్త దుస్తులుకూడా ఇస్తుంది లక్ష్మి అతనికి. అతని కవల తమ్ముడు వీరునాయుడు, "మరో పోతురాజు" భ్రమతో భర్తని కారు మీద ఇంటికి చేర్చే ఏర్పాటు. ఇల్లు చేరినట్టు సూచనగా హారన్ వాయిస్తాడు వీరునాయుడు. అప్పటికి అక్కడే ఉంటే గుట్టుచప్పుడుగా పోతురాజు దిగిపోతాడు. పెరటి మేడ మెట్లు వేరే ఉండనే ఉన్నాయి కదా!

*(జ్యోతి మాస పత్రిక, ఫిబ్రవరి, 86)*




**వయసు** గడచిన కొద్దీ ఎన్నెన్నో విషయాలు మరుగున పడిపోతూంటాయి. రెండేళ్ల క్రింద అయిన ఆ హైదరాబాదు అనుభవం మాత్రం సీతారామయ్య ఎన్ని జన్మలైనా ఏమరలేనిది. అసలు ఈ గొడవంతా సుగుణమణి ఉత్తరంతో మొదలైంది. 'మేష్టారూ, నేను గుర్తున్నానా!' అనుకుంటూ ఆ లెటరు ఇలా సాగింది:

"మీరు రాజాస్ హైస్కూల్లో లెక్కలు చెప్పేటప్పుడు ఆడపిల్లల బెంచీలో మొదటి ప్లేసు నాదే. బొత్తిగా పీలగా ఉండే దాన్నని రోజు కో పేరు పెట్టి ఏడిపించేవారు. మీ దిష్టే తగిలింది. పిప్పళ్ల బస్తాలా తయారయ్యా నిప్పుడు. చూస్తే గుర్తే పట్టలేరేమో ... అయినా ఆడదాన్లో మార్పు రావడానికి ఎన్నాళ్లు కావాలి ! ఒకటా, రెండా మనం కలుసుకుని పాతికేళ్లు గడిచాయి! మీరు మాత్రం ఎన్నేళ్లయినా ఒక్కలా ఉండగలరని నాకు నమ్మకముంది. ఇంతకాలం గడచినా రాసే కథలు అపలేదు కదా మీరు ! రాసే కథల్లో మీరు నమ్మిన విలువల్ని ఏనాడూ ఎత్తి చూపకుండా ఊరుకోలేదు కదా! ఇంతటి స్థిరమైన వ్యక్తిత్వం గల మీలో గుర్తు పట్టలేనంత మార్పొచ్చిందని నన్నెలా

ఊహించమంటారు ! ఎంత దూరంగా ఉన్నా మీ కథలు చదువుతూంటే మీతో మాటాడుతూన్నట్టే ఉంటుంది కద ! ఆ చనువుతోనే కదా ఇంత ఫ్రీగా మీ కివాళ రాయగల్గుతున్నది."

కళ్లజోడు తీసి ఎడం చేత్తో పట్టుకుని ఓ సారి కళ్లు మూసుకుని ఎంత సేపు ఆలోచించినా ఆ అమ్మాయి ఎవరో గుర్తు రాలేదు సీతారామయ్యకి. గుర్తు రానందుకు విచారమూ కలగలేదు. క్లాసులో బాగా పాఠాలు చెప్పే మేష్టారే మంచి కథలు రాయగలడని పేరు తెచ్చుకుంటే అభిమానించే శిష్యకోటి సంఖ్యకి అంతుండదు. ఎవరైతేనే ం, మరో ఆత్మీయురాలు, ఇంతకీ ఉన్నట్టుండి ఇప్పుడేందుకు రాసిందో!

"ఎన్నాళ్లయినా మీ కథలు ఎంత చురుగ్గా చమత్కారంగా ఉంటాయి మేష్టారూ ! నేనూ ఏదో అప్పుడప్పుడు ఒకటీ అరా రాస్తుంటానని మీరు గమనించే ఉంటారు. మీ శిష్యరికం ఊరికే పోతుందా! 'అనుకున్నది జరిగేనా!' అనే నా వారపత్రిక సీరియల్ నవల ఈ మధ్యే అచ్చు వేయించాము. దాని కాపీ వేరే రిజిస్టరు పోస్టులో పంపుతున్నాను. దాన్ని మీ చేతుల మీదుగా ఆవిష్కరింపజెయ్యాలనీ, మీ ఆశీర్వాదం పొందాలనీ, మిమ్మల్ని సన్మానించాలనీ నా కోరిక. తప్పక తీరుస్తారుగా!"

.... అలా మొదలయింది సుగుణమణి ఉత్తరాల పరంపర. మరీ పెద్ద సంఖ్య కాదు గాని త నా ఊరు వెళ్లేలోగా మరో రెండు ఉత్తరాలు రాసింది. తను తప్పక వస్తానని రాయడం కాదు గాని ఇంకెన్నెన్నో ఆంతరంగిక విషయాలు తెలియజేసింది.

"నీ ఉత్తరం చదివితే నీ ఎదురుగుండా కూచుని నీ కబుర్లు వింటున్నట్టుంది సుగుణా! ఇంతటి చైతన్యం లేఖలోనే నింపిన దానివి నువ్వేదో గుమ్మాలు పట్టకుండా తయారయావంటే ఎవరు నమ్ముతారు? ఇకనేనా! నువ్వు చెప్పినట్టు, నేను కథల్లో చెక్కుతున్నట్టు, చెక్కు చెదరకుండా ఉన్నమాట నిజమే, నువ్వే చూస్తావుగా!"

సీతారామయ్య మొహమాట పడి అలా రాశాడు గాని అరవై ఏళ్ళు దాటిన అతని శరీరానికి ధూర్జ ి 'కాళహస్తీశ్వర శతకం' లో చెప్పిన అన్ని 'వింతలూ' వచ్చి పడ్డాయి. అదృష్టవశాత్తూ ఆరోగ్యానికి ఢోకా లేదు. మొహం నిండా ముడతలూ, టకప్‌లా లాకప్ అవడానికి ఇష్టపడని చిరు బొజ్జా పరిశీలనగా చూస్తే గుట్టు రట్టు కాక మానదు. పళ్లు కట్టించుకున్నాడు గనక, జుత్తుతోపాటు రెప్పలకి 'డై' ఎప్పుడూ వాడే నాడై ఉన్నాడు గనక, పరాగ్గా చూస్తే పదేళ్లు తక్కువని భ్రమపడడం సహజమే. అదిగాక అతను 'బతకనేర్చిన బడిపంతులు'. యు.జి.సి. స్కేలు మీద రిటైరైన అదృష్టవంతుడు. ఉద్యోగ విరమణ చేసినా కథలూ, ట్యూషన్లూ మానని 'టు ఇన్ ఒన్' సరుకు. ఎన్నాళ్లైనా కట్టుదిట్టంగా ఉండగలనని తొడకొట్టడంలో ఆశ్చర్య మేముంది!

"మీతో ఏదో మాటాడాలట. ఎదురింటి సుందరమ్మ వదిన వస్తే పావు గంటై వీధి వరండాలో కూచోబెట్టాను. మీ రెంతకీ తలుపు తియ్యకపోయిరి. ఆవిణ్ణి మరో మారు రమ్మందునా!" అంది, తలుపు కాస్త వారగా తీసి, సీతారామయ్య భార్య మాణిక్యాంబ.

"ఆ మాట వేరే చెప్పాలా!" అంటే దఢాలున తలుపు వేసుకుని లోపల అడ్డ గడియ పెట్టేసుకున్నాడు. "ఈ ఆడంగులకి ఏదైనా ఉంటుంది, హూమోపతీ మాత్రంత బుర్ర తప్ప!" అని విసుక్కున్నాడు.

"విసుక్కున్నానంటే విసుక్కోనా మరి! రాజధాని వెడితే లక్షా యాభై పనులు చక్కబెట్టుకు రావొచ్చు! ప్రేమతో పిలిచింది గనక రానూ పోనూ ఫస్టు క్లాసు రైలు ఛార్జీలు ఎలాగా ఇస్తుంది. ఛార్జీ పంపితే పంపింది గాని మొదటి తరగతిలోనే ప్రయాణం చేసి తీరాలని ఏ రైలూ పట్టు పట్టదు కదా! అందులో ఈ మధ్య ఛార్జీలు బ్రహ్మాండంగా పెంచారు. రైల్వే జనా సుఖినోభవంతు! బోల్డంత మిగులుస్తుంది. పైగా ఇన్నేళ్లకి ఆమె ఇష్ట కార్యమ్మీద దిగుతున్న ఇష్ట దైవం తను! ఆ సుగుణమణి ఎవరో అడుగులకి మడుగు లొత్తదా! సన్మానం చేసి పట్టు వస్త్రాలైనా సమర్పించదా! ఎంత చవకరకం పట్టయినా వెయ్యికి పై మెట్టే కదా! అదృష్టం ఇన్ని రకాలుగా అందలం ఎక్కిస్తానని కూచుంటే ఎందరు సుందరమ్మలు తనని కిందికి లాగగలరు!"

'అన్నయ్య గారూ! మీరు హైదరాబాదు వెడుతున్నారటగా?'

నలభై ఏళ్లుగా నలభీమపాకం ఎడం చేత్తో వండి పారేస్తోంది, మాణిక్యాంబ. కాని ... అంతవరకేనా పతివ్రతా ధర్మం! మగని మనసు కనిపెట్టని ముత్తైదు ఉంటే మొగుడి బతుకు విడిఖైదు కదూ! ఇంకా తను గట్టిగా అనుకున్నాడో లేదో హైదరాబాదు సమాచారం అప్పుడే ఊరంతా ప్రచారం కావాలా! సీతారామయ్య నిట్టూరుస్తూ తలుపు తీశాడు. సుందరమ్మ మరో మారు తన గోడు వెళ్లబోసుకుంది.

సుందరమ్మ దంపతులకి అయిదుగురు ఆడపిల్లల తర్వాత కుల 'మాపకుడు' గురుమూర్తి ఉదయించాడు. ఆడపిల్లల్ని సాగనంపే సరికే ఆ దంపతులు అన్నీ హరించుకుపోయి ఆశలన్నీ అబ్బాయి మీదే పెట్టుకున్నారు. కుర్రాడు కండలు పెంచాడు గాని కన్న వారి కే విధంగానూ అండదండలుగా నిలవలేకపోయాడు. అప్రయోజకుడైనా మగాడనే క్వాలిఫికేషన్ ఉంది గనక కాస్త ఆలస్యంగానైనా పెళ్లయింది. 'పెళ్లయాక పిల్లల్ని కనకుండా ఉంటే ఎవరే మనుకుంటారో ఏమో' అని గురు మూర్తి రెండేళ్లలో వారి కుటుంబ సభ్యుల సంఖ్యకి మరో ముగ్గుర్ని కలిపాడు. మంచం మీద నిత్య మగతలో పడి ఉండే గురుమూర్తి తండ్రికి ఏం జరిగినా చీమకుట్టినట్లుండే అవకాశం ఎప్పుడూ లేదు. ఇందరు జీవుల్ని మేపలేక సుందరమ్మ మాత్రం ఏ వేళా 'లబోదిబో' మంటూనే ఉంటుంది!

"ఆ రోజుల్లో మాకు చెప్పేవాళ్లు లేక, బుద్ధీ జ్ఞానం లేక, ఇంతగా భూభారం పెంచాం. అంతకంతా అనుభవిస్తున్నాం. ఇప్పు డిన్నిరకాలు వస్తున్నాయి. మా అబ్బాయి గాడికి రాదే మండే బుద్ధి? కన్నతల్లిని, నేను చెప్పుకుంటే బావుండదనుకోండి, ఏం చెయ్యను మరి! భారీగా శరీరాన్నైతే పెంచాడు గాని దమ్మిడీ అంత ధైర్యం లేదండి మా వాడికి! మాత్ర వేసుకోమంటేనే అదో పరలోక యాత్రలా భయపడిపోతాడే బిడ్డ, వీడికి ఆపరేషను ఎలా చేయించను! పిల్లలు పుట్టకుండా ఆపరేషనుకి మా కోడలు పిల్ల సిద్ధమే కాని అది ఆసుపత్రిలో చేరితే ఇంటి దగ్గిర ఆ ముసలాయన్ని ఎవరు చూస్తారు, ఈ పసివెధవల్ని ఎవరు సాకుతారు? అన్నయ్య గారూ, మామూలు బుర్ర కాదు మీది, మమ్మల్నెలా గట్టెక్కిస్తారో ...."

ఇదీ నివేదన.

సీతారామయ్య గారి ఇద్దరు కొడుకులూ అమెరికాలో పెద్ద పెద్ద ఉద్యోగాల్లో వాళ్ల పిల్లా పాపల్తో హాయిగా ఉన్నారు. తన 'కరెక్ట్ ప్లానింగ్'కి రోజు కో సారైనా తనని అభినందించుకుంటూ

ఉంటాడు ఆయన. ఒంటరితనంతో, మనిషి కోసం వాచిపోయిన మనసుతో, రోజుకి ఓ యాభై సార్లైనా మొగుణ్ణి తిడుతూ ఉంటుంది మాణిక్యాంబ. 'ఇదేనా కులస్త్రీ ధర్మం?' అనే భర్త ప్రశ్నకి 'అవును. ఇదే, ఇదే!' అని తిరగబడుతూ ఉంటుంది, కలతపడ్డ ఆమె కన్నతల్లి మనసు!

ఇప్పుడు సుందరమ్మ గారు తెచ్చిన డేంజరస్ న్యూస్ వేరు. కోడలు మళ్లీ నీళ్లోసుకుందేమోనని అనుమానం. "ఇక్కడ దీనికి ఏ ఇంగువో మింగబెట్టి కడుపు తీయించేస్తాను గాని ఈ లోగా మీరు మా వాణ్ణి, ఎలాగా హైదరాబాదు వెడుతున్నారు గనక తీసికెళ్లి అదేదో అయిందనిపించి తీసుకురాక తప్పదు అన్నయ్య గారూ...." అంటూ అటూ ఇటూ చూసి పమిట చెంగు ముడి విప్పి ఓ ఉంగరం చేతిలో పెట్టింది, రైలు కర్చుల కని. దాని బరువు అరచేతిలో ఓ సారి అనుభవించాక, మరి కాదనడం సబబు కాదనిపించింది ఆ కెరీరిస్టుకి.

ఆమె వెళ్లిపోయాక, ఉంగరాన్ని బీరువాలో జాగ్రత్త చేసి సుగణమణి ఉత్తరాన్ని మళ్లీ చదువుకున్నాడు.

"మా ఆయన నా కథా రచనని ప్రోత్సహిస్తాడా అని అడిగారు. ఏం చెప్పమన్నారు! పెద్దగా ఒకరి కొకరం అడ్డురాము గాని మావి భిన్న దృక్పధాలు. పిల్లలతో ఇల్లు నిండిపోవా లనుంటుంది నాకు. 'భగవంతు డింత ఇచ్చాడు కదా, ఎందరు పిల్లలైతేనేం!' అనే నా వాదన ఆయన ఒప్పుకోరు. ఇలా బిడ్డ కానుపు అయిందో లేదో నాకు ట్యూబెక్టమీ కాక ఆయనా వేసక్టమీ చేయించుకున్నారు. డబుల్ జాగ్రత్తట! అదృష్టవశాత్తూ మా మోహన్ బాగా ఎదిగి వృద్ధిలోకి వచ్చాడు గాని ఏదైనా తేడా వస్తే ఏమైపోదుం చెప్పండి! పైగా అదో సాంఘిక బాధ్యతంటూ వాదిస్తారు మా వారు! అన్నట్టు మీకు చెప్పనే లేదు కాబోలు - మా వారు ఫేమలీ ప్లానింగ్ డాక్టరు ! వారానికి ఇన్ని వందల ఆపరేషన్లు చేసి తీరాలని ఆయన పట్టుదల! 'విచక్షణ లేకుండా ఇలాంటివి చేసి పారేస్తే గాని మనం ఎలాంటి ప్రగతీ సాధించలేం' అంటారు. 'సంజయ్‌గాంధీ నర్సింగ్ హూమ్' అని మా హాస్పిటల్‌కి పేరు పెట్టుకున్నారు కూడా!"

ఉత్తరం చదవడం ముగించి ఆలోచనలో పడ్డాడు సీతారామయ్య. కలసి వచ్చే కాలం కాకపోతే పుస్తకావిష్కరణకి తనని పిలిచి సన్మానించే నవలా రచయిత్రి భర్తే డాక్టరయి ఉండడ మేమిటి! ఈ గురుమూర్తికి ఏదో మంచిమాట చెప్పి తనతో రైలెక్కించి ఆ డాక్టరుకి అప్ప చెబితే ఆ 'కోత పని' కాస్తా పూర్తి చేస్తాడాయన. వాళ్ల పని చేసి పెడుతున్నాడు గనక ఆ తర్వాత ఉంగరం పెట్టుకు తిరిగినా అంతరాత్మ అట్టే బాధించదు.

తన కథలంటే పడి చచ్చే గురుమూర్తిని రప్పించి బోధపరచాడు సీతారామయ్య. అలా బోధపరుస్తున్నప్పుడు పక్క నున్న బీరువాలోని నిలువు టద్దంలోని తమ ప్రతిబింబాలు చూసి గతుక్కుమన్నాడు. ఇద్దరూ ఇంచుమించు ఒకే ఒడ్డూ పొడవూ. తన కున్న కళ్లజోడు తీసేస్తే ఎవరి వయసెంతో బాగా పరిశీలిస్తే గాని చెప్పడం కష్టం. తన చిన్న కొడుకు వయసు వాడితో తనూ సరిసమానంగా ఉండడం సీతారామయ్య కెంతో గర్వం కలిగించింది. కాస్సేపటికి తమాయించుకుని 'తనతో గురుమూర్తిని హైదరాబాదు తీసికెళ్లి అన్నీ చూపించదలుచుకున్నానని' చెప్పాడు. "నీకూ పిల్ల ల్నిక ఆపు చెయ్యాలని ఉందని తెలుసు. ఆపరేషను చెయ్యకుండా ఏదో భస్మం లాంటిది ఇస్తా డక్కడ నాకు తెలిసిన ఓ మౌల్వీ. ఎందరికో ఇచ్చాడు. అభ్యంతరం లేకపోతే నీకూ ఇచ్చేలా

చూస్తా'' అంటూ గురుమూర్తిని ఒప్పించాడు.

ఈలోగా సుగుణమణిని నుంచి ఉత్తరం రానే వచ్చింది : "ఇన్ని కథలు రాసినా ఎక్కడా ఫోటో పడకుండా తప్పించుకున్నారు కదూ ! ఇప్పుడు మమ్మల్ని తప్పించుకోలేరు లెండి. వచ్చాక ఎన్ని ఫోటోలు తీస్తానో చూస్తారుగా ! మీరు ఇరవై అయిదు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి వస్తున్నామని రాశారు. నాంపల్లి స్టేషన్లో బాగా రష్‌గా ఉంటుంది కదా, మిమ్మల్ని పోల్చుకోలేమని కాదు. చాలా ఏళ్లైపోయింది కదా ... మిమ్మ ల్నెలా గుర్తు పట్టాలో ఏదైనా తిరుగులేని ఆచూకీ ఇవ్వండి మేష్టారూ! కల్పనా సార్వభౌములు. మీకు చెప్పాలా?''

ఉబ్బి తబ్బిబ్బౌతూ సీతారామయ్య వెంటనే జవాబు రాశాడు.

" 'అనుకున్నది జరిగేనా!' అనే నీ పుస్తకం ఉంది కదా, అది ఈ చేత్తో పట్టుకుంటాను. కళ్లజోడు తీసి రెండో చేత్తో పట్టుకుంటాను. అలా పట్టుకున్న ఒడ్డూ పొడుగూ మనిషి మీ మేష్టరేనని గుర్తుంచుకో. ఇంకో ముఖ్య విషయం. నువ్వు నా కెలాగా జీవితాంతం గుర్తుండే సత్కారం చేస్తావు. దానికి కాదు. మా పొరుగిం టాయన కొడుకుని నా కూడా తీసుకొస్తున్నాను. వాడికి కూడా సత్కారం జరగాలి. మీ ఆయన ద్వారా! ఫేమిలీ ప్లానింగ్ ఆపరేషన్. ఎర్ర కారులో రౌడీలతో తిరిగే నీ మొగుడు కేసు దొరికితే మరి వదలడని నాకు తెలుసు. ఎంత అడ్డుపెట్టినా ఏం చెప్పినా వినకుండా ఈ 'సత్కార్యం' మీ ఆయన వల్ల తప్పక జరుగుతుందనే ఆశతో కేండిడేటుని నాతో తీసుకొస్తున్నాను. నీ నీలం రంగు కారులోకి రప్పించుకుని న న్నెలాగా గుర్తు పట్టి సన్మానించుకుంటావు. అవునా?''

అనుకున్నట్టే గురుమూర్తితో సహా సీతారామయ్య గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి నాంపల్లి స్టేషన్లో దిగాడు. తను సెకండ్ క్లాస్‌లో దిగినట్టు వాళ్లకి తెలీకుడదని స్టేషన్ రాగానే ఇంచుమించు జంప్ చేశారు ఇద్దరూ. సమీపంలోని ఫస్టు క్లాసు వైపు నడిచారు. ఓ గుమ్మం లోంచి ఎక్కి మరో గుమ్మంలోకి దిగాలని. అంత హడావిడిలోనూ సీతారామయ్య ఓ చేత్తో నవలా మరో చేత్తో కళ్లజోడూ వదల్లేదు. అయితే దిగే కంగారులో రెండూ కింద పడిపోయాయి. పక్కనున్న గురుమూర్తి అవి రెండూ తీసి చెరో చేత్తో పట్టుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో సుగుణమణీ, డాక్టర్జీ అక్కడి కొచ్చారు. ఆ చిరు చీకటిలో, తొడ తొక్కిడిలో వాళ్లేం చెప్పినా వినవలసిన అవసరం వాళ్లకి కనపడలేదు. గురుమూర్తి బ్లూ కార్‌లోనూ, సీతారామయ్య రౌడీల మధ్యగా రెడ్ కారులోనూ వారికి జరిగే 'సత్కారాల' వైపు దూసుకుపోతున్నారు !

*(ఆంధ్రప్రభ వారపత్రిక, ఏప్రిల్ 20-26, 1994)*

# చచ్చాకేనా సహాయం?




"**తీరా** మీరు సమయానికి తప్పుకున్నారు. మా సేవాదళ్ వాళ్ళు అలా ఊరుకోగలరా మరి!" అంటూ తను ఊర్నించి వచ్చి రాగానే భార్య గాయత్రి గుమ్మం లోంచే దుమ్మెత్తి పోస్తూంటే రామానికి కారం రాసినట్టయింది.

అసలే అతన్ది 'ఈగ వాలితే జోడిచ్చుకు కొట్టే' మనస్తత్వం. రోగంతో వున్న పెళ్ళాం అక్క సూరమ్మని తీసుకొచ్చి దినం తీర్చాడు. చివరి దాకా సేవ చేశాడు. ఉద్యోగ రీత్యా అవసరం వస్తే క్యాంపుకి వెళ్ళాడు. ఇంతలో ఆవిడ కాలం చేస్తుందని ఎవరనుకున్నారు? ఈ వర్తమానం అర్థం చేసుకోవాలంటే ఏడాది వెనక్కి వెళ్ళి విషయాలు సమీక్షించాలి.

ఏదో కలసి ఏకముఖంగా సంసారం ఈడుస్తున్నారుగానీ వాళ్ళిద్దరివీ ఎడముఖం పెడముఖం. తన పుట్టింటివారి విషయంలో ఏనాడూ ఆసక్తి ప్రదర్శించని తన భర్త దిక్కులేని తన రోగిష్టి అక్కకి ఆశ్రయ మివ్వగలడని గాయత్రి ఎప్పుడూ అనుకోలేదు. ఇలా తన అక్క ఇవాళ రేపో అన్నట్టువుందని తెలిసిన వాళ్ళెవరో ఓ కార్డుముక్క రాసిపారేస్తే పైకయినా వినపడకుండా ఏడుస్తూ కూచుంది. తెలివైన రామం ముందు అది దాగలేదు. ఆ కబురు విన్నాక అతన్లోని మానవత్వం తిరుగు రైల్లో ఆమెని

తీసుకొచ్చేదాకా ఆగలేదు కూడా.

గాయత్రి అక్క సూరమ్మగారు భర్తని తిట్టని రోజంటూ వుండేది కాదు గనక, చచ్చిపోయినా అతను బతికున్నట్టే లెక్క. ఆవిడ కొడుకు ఎక్కడో ఏదో విదేశంలో పెద్ద ఉద్యోగంలో స్థిరపడినా తల్లెలా వుందో ఏనాడూ పట్టించుకుని ఎరగడు, గనక వాడు బతికున్నా చచ్చినవాళ్ళతో జమ. జాగ్రత్త వున్న మనిషి గనక వంటిన వున్న బంగారం కాస్త కాస్తా కరిగించుకుంటూ ఎలాగో ఇన్నాళ్ళూ రోజులు గడుపుకొచ్చింది ఆవిడ. పెద్ద కెరటం లాంటి మధుమేహ రోగం వున్నట్టుండి ఆవిణ్ణి ముంచేసి మంచాన చేరేసింది. చెల్లెలి చేతా, మరిది చేతా చేయించుకుంటే తప్ప ఆవిడ ఆఖరి కాలం వెళ్ళింది కాదు.

అయితే తాము ఎత్తుకున్న బరువు తమనే చిత్తు చేసేదని ఆ దంపతులకు అతి తొందర్లోనే తెలుసుకొచ్చింది. మంచాన పడిన పంచదార రోగులకు సేవ చెయ్యడం కుళ్ళు కాలవ పక్కన కాపరం పెట్టినట్టు. ఆ రోగం మూత్రానికి సంబంధించింది గనక ఆ రోగులు ప్రతినిముషం పసివారిలా పక్క తడుపుతూనే వుంటారు. బ్లడ్‌షుగర్ కూడా పట్టుకుంటే ఆ దుర్వాసన మరింత దుర్భరం. అయినా వ్యాధిగ్రస్త అయిన సాటి వ్యక్తిని సాకడంలో రామం ఎటువంటి అశ్రద్ధా చూపించలేదు. ప్రాక్టికల్ సెన్సు వున్నవాడు గనక ఆవిడ మెళ్ళో మిగిలిన ఆ ఒక్క గొలుసూ అమ్మేసి ఆ పదివేలూ బ్యాంకులో వేసి ఏ లోపం రాకుండా వైద్యం చేయించాడు. ప్రతి నిముషం బట్టలారేస్తూ సేవచేసే మనిషి మాత్రం నెలకి రెండొందలు యిస్తామన్నా కుదిరింది కాదు. మునుపయితే ఏమోగాని బిడ్డసంచీ తీయించేసుకున్న ఆపరేషనుతో గాయత్రి ఈ మధ్య బాగా డీలాపడిపోయింది. పిల్లా పీచూలేని గాయత్రి మొదట్నుంచీ సామూహిక భజనల్లోనూ భక్త సమాజాల సేవాదళ్‌లోనూ ప్రముఖ పాత్ర తీసుకుంటూ వచ్చేది. ఈమధ్య ఆవిడకి అక్కగారి గుడ్డలు జాడించడమే అఖండ భజన. పత్యంపానం అందిస్తూ ఇంట్లో ఇరవై నాలుగ్గంటలూ అతుక్కుపోవడమే ఆవిడ కిప్పుడు నగర సంకీర్తన 'ఇది ఇప్పట్లో చావదు. ఇక ఇంతట్లో నాకు బతుకూ లేదు' అంటూ ఏడాది దాటకుండానే అక్కకి వినపడేలాగే విసుక్కునే స్థాయికి చేరింది. పైకి అనలేదుగానీ రామం అభిప్రాయమూ అదే. మరీ ఈ మూడు నెలలై వదిన గారి మందూ ఆహారమూ చూడడమే కాకుండా ఆవిడ గుడ్డలు ఆరేసి మరీ ఆఫీసుకి వెడుతున్నాడతను. అదేదో అంటు రోగమనే మూఢ విశ్వాసంతో అక్కడి నౌకర్లు భయపడుతూంటే అతనేం చెయ్యాలి మరి!

పీకలు తెగిపోయే వారి ఈ సమస్యని కాలం ఇలా పరిష్కరించగలదని రామం కలలో కూడా అనుకోలేదు. ఆఫీసు పనిమీద అతనలా మద్రాసు వెళ్ళొచ్చేసరికి వదినగారి మరణమే కాదు, దహన సంస్కారం కూడా జరిగిపోయింది. "మా సూరమ్మక్క నిజంగా అదృష్టవంతురాలు. దాని చావు పెళ్ళిలా జరిగిదంటే నమ్మండి. ఊరు ఊరంతా ఏకమయ్యారు. ముఖ్యంగా మా సేవాదళ్ చేసిన సాయం ఈ జన్మలో మరచిపోలేను. నాకింత కష్టం వచ్చి సమయంలో మీరు ఊళ్ళో లేరని వాళ్ళంతా వచ్చి తల్లీ తోడూలా ఆదుకున్నారు. నాకు ధైర్యం చెప్పి రాత్రి తెల్లవార్లూ నాకు ఆసరాగా వుండిపోయారు. తర్వాత యివ్వొచ్చని స్వంత డబ్బు ఖర్చుపెట్టి మా సెక్రటరీగారు అన్ని పనులూ దగ్గరుండి చేయించారు. ఎక్కడా ఏ తేడా రాకుండా చూసి, శవాన్ని శ్మశానికి నడిపించి యధావిధిగా దహన సంస్కారం చేయించారు. లేకపోతే ఈ మారుమూల ఊళ్ళో దిక్కూదివాణం లేక ఏమైపోయి వుందునో!" భక్త సమాజాలూ వాటికి సంబంధించిన సేవా దళ్‌లూ ఇలాంటి సంస్థలు మీద

రామంకి సదభిప్రాయం లేదు. అయినా మంచి పని ఏ పేరున జరిగితేనేం! వెంటనే వాళ్ళ దగ్గరికి పరుగెత్తాడు. పేరు పేరునా కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. వాళ్ళు ఖర్చు పెట్టింది కృతజ్ఞతతో తీర్చేయ్యడమే కాక ఆ ఆదివారం జరిగే అన్నదానపు ఖర్చు అంతాతనే భరించాడు. సమయానికి తమ లేకపోయినందుకు విచారం వెలిబుచ్చాడు. సూరమ్మగార్ని తెచ్చిపెట్టుకున్న శిక్ష అక్కడితో పూర్తి అయిందనుకున్నాడు. కాని గాయత్రి ఈ మధ్య చేస్తున్న విమర్శలు వింటూ ఎందుకు ఊరుకోవాలో అతనికి అర్థంకావడం లేదు.

అతన్ది పూర్తిగా హేతువాద తత్వం. ఆవిడది పూర్తిగా సనాతన సంప్రదాయం. 'కట్టుకున్నాం గనక తెగ్గొట్టుకోలేం గనక ఎలాగో కొట్టుకొద్దాం. అందుకే నీ జోలికి రాను. నా జోలికి రాబోకు' అని లెక్చర్లు దంచడుగానీ, అతని ఆచరణ మాత్రం అదే. "ఆ సేవాదళ్ వాళ్ళ రుణం మనం జన్మలో తీర్చుకోలేమండీ" అని రోజుకి పదిసార్లైనా ఆవిడ గుర్తు చేస్తూంటే వింటూ ఎలా ఊరుకోవాలి! ఆవిడ పదే పదే వాళ్ళని పొగుడుతూన్న కొద్దీ "ఎందుకింతలా ప్రశంసిస్తోంది చెప్మా! నిజంగా వీళ్ళలో ఏమీలేదేమో!" అని శంకించడం మొదలెట్టింది అతని మనసు. ఆ దృష్టితో ఆలోచించిన కొద్దీ అతని మనసు ఇంకా వెనక్కి వెళ్ళి ఏవేవో వెతక సాగింది.

ఇంటి యజమాని లేని విపత్కర పరిస్థితుల్లో ఆదుకుని, అంత బాధ్యతా నెత్తినేసుకుని ఆ భజన సమాజం సేవాదళ్ సభ్యులు వందమందీ ఆ దహన సంస్కారం జయప్రదంగా నిర్వహించారు. ఆ మేరకు కావాలంటే యావజ్జీవం వాళ్ళ సహాయాన్ని కొనియాడుతూ వుండాల్సిందే. కాని ఆ వందమందీ కలిసి అలాంటి సాయం చేసింది ఒకే ఒక రోజున. అదైనా ఎప్పుడు? ఆ మనిషి చచ్చిపోయాక, అదే మనిషి అదే ఊళ్ళో మూడొందల అరవై అయిదు రోజుల పైగా మంచాన పడి రాత్రింబవళ్ళు చావు బ్రతుకుల మధ్య కొట్టుకుపోయిందని ఆ వంద మందికీ తెలుసే ఒక్కడైనా ఒక్క రోజైనా వచ్చిసాయం చేయ్యలేదేం! మలమూత్రాలలో మగ్గిపోతున్న ఓ అనాథకి ఆదుకోడానికి తమ ఇద్దరి సర్వశక్తులూ చాలక తల్లడిల్లి పోతున్నప్పుడు ఇంత మంది వున్నారు, వంతులు వారీగా వచ్చి స్నేహహస్తం అందించలేదేం! అంతకు ముందు ఏమాత్రం రాకపోకలు లేని ఓ దూరపు బంధువు రాల్ని ఏడాదిపాటు రక్తమాంసాలు హరించుకుపోయినట్టు అహర్నిశలూ ఓ బ్రతికున్న మనిషిగా అదుకుని సేవచేస్తే ఓ మంచి మాటయినా తనకి దక్కలేదే! ఇంత మంది కలిసి యీనాడు ఓ శవాన్ని సాగనంపినందుకు ప్రతీక్షణమూ సాష్టాంగ పడలా! ఏం న్యాయం యిది!

"ఏమండీ! ఏమిటాలోచిస్తున్నారు వీళ్ళ రుణం ఏం చేసి తీర్చుకోగలమంటారు?" బోధ పడదనో చెప్పినా లాభం లేదనో రామం గాయత్రితో ఆర్గ్యుమెంటు ఏనాడో మానేశాడు. కాని ఆవిడ వేసిన ఆ ప్రశ్నతో అతను రెచ్చిపోయాడు. అన్నీ మరచిపోయాడు. "బతికున్నంత వరకే ఏమనిషితో ఏదయినా అనే నా విశ్వాసం తెలిసి మరీ నన్ను రెచ్చగొట్టేవు. సరే, నాజవాబు విను. ఈ పరిస్థితుల్లో నేను రుణం తీర్చుకునే పద్ధతి ఒకటే. మనింట్లో శవాన్ని ఆదుకున్నారు వాళ్ళు. అందుకని మనమూ సరిగ్గా అలాగే చెయ్యడమే రుణం తీర్చుకునే పద్ధతి. ఇంకా ఏడాది సర్వీసుంది నానిక్కడ. ఈ ఏడాదిలోగా మీ వంద మంది వాలంటీర్లలో ఎవరో ఒకరు గుటుక్కు మనకపోరు. అలా జరిగిన వెంటనే తెలియజెయ్యి. దహన సంస్కార బాధ్యత వహించి రుణం తీర్చుకుంటాను. అంతే ఈ లోగా 'రుణం' సంగతి మరోసారి నాకు గుర్తు చేశావో ఆ క్షణమే నీ పీక నొక్కేస్తాను జాగ్రత్త!"

*(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక,దీపావళి సంచిక,1990)*

# కళ్లజోడు మార్చిచూడు!




**వీధిగేటు** దగ్గర కనపడిన పులి విస్తరాకు ముక్క ఎగిరిపోకుండా చేతికర్రతో తొక్కిపట్టి చేటలో ఎత్తిన తుక్కు పారెయ్యడానికి వస్తున్న పక్కింటి పనిమనిషి పైడితల్లిని నిలబెట్టేశాడు.రంగయ్య "ఏమే! 'మీ ఇంట్లో అంటవిస్తళ్ళు మా వైపుకి రాకుండా కాస్త జాగ్రత్త పడండి" అని మీ అయ్యగారికి కబురు చేస్తే మా ఇంట్లో గాజు ప్లేట్లే తప్ప దేనికీ విస్తరాకులు వాడం అని మరి నోరెత్తకుండా నీ చేతే కబురంపించాడే అతగాడు మరి ఈ విస్తరంట ఎక్కణ్ణుంచి వచ్చిందట?"

రంగయ్య తెల్లారుఝామునే బయల్దేరి అలా తిరిగి ఇంటికి వచ్చేసరికి ఏ ఆరుగంటలో అవుతుంది. ఆసరికి పాలపాట్లాలూ, దినపత్రిక మడతా లోపలివైపు పడి ఉంటాయి. వాటితోపాటు తినిపారేసిన విస్తరాకు ముక్క అప్పుడప్పుడు దర్శన మివ్వడం రంగయ్య భరించలేని దృశ్యం. వాళ్ళింట్లో కూడా స్టీలు సామాన్లు తప్ప మచ్చుకైనా మరొకటి వాడరు. పోనీ రెండోవైపు ఇంటినుంచి వచ్చిందేమో అనుకుంటే రంగయ్యదే ఆ వీధి చిట్టచివరి ఇల్లు, ఏముంది, తినేసి ఏమేడ మీది కిటికీలోంచో విసిరేస్తారు. అదెవరింట్లోపడితే మనకేం! మన ఇంటి పిల్లల్ని ఎదురింటి కాలుఒడ్డున దొడ్డికి కూచోపెట్టే

దొడ్డజాతి మనది. ఇంతగా సివిక్‌సెన్సు మనవాళ్ళలో పెరిగిపోయాక ఇక ఈ ఎంగిలి కానుక పక్కింటి వారిదే అని చెప్పడానికి కర్రకింద తొక్కిపెట్టిన సాక్ష్యం చాలదా! అందుకే పైడితల్లిని రెడ్‌హేండెడ్‌గా పట్టుకున్నానని భ్రమించాడు రంగయ్య కాని దాని జవాబు విని నిలువుగుడ్లు పడిపోయాయి. అతనికి.

చదవడం, రాయడం రాకపోవడం చేత ఏ మాత్రం నష్టపోని రాజకీయవాదులకి రాణీ అనదగ్గది పైడితల్లి. చేస్తున్నది పాచిపని అయినా అది ఎరగని భోగట్టా లేదు. చూడని సినిమా లేదు. విని గుర్తుంచుకోని కథ అంటూ లేదు.

"సూడండి,బాబుగోరూ! అచ్చరం ముక్కరాని పిచ్చిముండ ఇదేటి సెపుతుందని తీసిపారెయ్యమాక, సిన్న ఇసయం ఇసారించండి. నా చిన్నతనంలోనే ఇన్నాను. మునసబుగోరు సెబుతూంటే కాసీమజిలీ కతలో ఏటో అంటారు ఆటిని. ఆట్లో 'సేవ నవ్విన కత' నాకలా గుండికాయకి పట్టిపోనాది. నదుంకున్నారు. తమరికి ఎరికే అదోపాలి యాదికి తెచ్చుకున్నారా, ఇసయం అర్థమయిపోతాది. ఒస్తా తమతో కూకుడుంటే ఆయమ్మ ఎంట పెట్టదా!"

అంటూ తుక్కుచేటని చంకపెట్టుకుని పక్కింట్లోకి తప్పుకుంది. దీని దుంపతెగ, సవాలుకి సవాలా జవాబు! ఎంగిలాకు ఎక్కణ్ణుంచి వచ్చిందో తెలుసుకోడానికి 'చేవ నవ్విన కథ' చదివి తీరాలా! అలాంటి అమూల్యమైన సలహా పారేసిందా ఓ అంట్లు తోముకునే పాచిమనిషి!

"ఏమిటి నిలువు గుడ్లేసుకుని ఆగేటు దగ్గరే పాతుకుపోయారు? మార్నింగ్ వాక్ మత్తు ఇంకా వదల్లేదా ఏం?

రత్తమ్మ కేకతో గాని రంగయ్య మళ్ళీ ప్రజల్లో పడలేదు. ఆవిడ కళ్ళపడకుండానే ఎంగిలాకుని నెమ్మదిగా చేతికర్రతో బయటికి నెట్టేశాడు. 'లవ్ దై నైబర్స్' అనే బైబిల్ వాక్యాన్ని కలలో అయినా ఖండించగల కచ్చితమైన మనిషి రత్తమ్మ. 'తిన్నది అరక్క కూసిన తప్పుడు కూత తప్ప అంతకన్న జరగని మాట ప్రపంచంలో ఉంటుందా! వెధవలు, మనకంటే ఎక్కువ ఉంటే మనల్ని చూసి అసూయ పడి చస్తారు. వాళ్ళ మొహం చూస్తేనే మండిపోతుందే, అలాంటిది పొరుగువారిని ఏం చూసి ప్రేమించగలం?" అనే థీరీ ఆవిడది, ఇక ఈ ఎంగిలాకు గనక కంటపడిందా, ఆ పక్క పక్క ఇళ్ళలో ఆ పూట ఇక మంటలే తప్ప వంటలు ఉండవు.

" ఈ పురుడు పుణ్యాలు ఈ పెద్దవయసులో నేను దేవలేనని ఎంత మొత్తుకున్నా విన్నారా! తల్లిలేని పిల్లని కోడలుగా తెచ్చుకునేదాకా మీ పట్టు వదల్లేదు. అబ్బాయి ఎంత ఇష్టపడితే మాత్రం, చివరంటా సాగగలమో లేదో పెద్దాళ్ళం మనం చూసుకోవద్దూ! ఇప్పుడా సీమరాణికి మేడమీదకి అన్నీ అందించలేక నాకీళ్ళు కీచుకీచు మంటున్నాయి. పోనీ ఇదేమైనా నూతిగిలక గనకనా ఓ నూని చుక్క వేసుకోడానికి! కాస్త మర్దనా చెయ్యవే అంటే ఆ మంగమ్మముండ అసలు పనికే ఎగనామం పెడుతోంది. ఎంతచేసినా అత్తగారికి మంచిమాట దక్కిచావదుకదా! వాళ్ళ మేనత్త ఉందికదా, తీసుకెళ్ళి పురుడుపోసి పంపమని ఇవాళే రాసి పడెయ్యండి. అంత్యనిష్ఠురం కన్న ఆదినిష్ఠురం మేలు!"

చెప్పులు విడిచి, చేతికర్రా, కళ్ళజోడూ వాటి స్థానాల్లో పెట్టి, పై కండువా, చొక్కా తీసేసి, స్నానాల గదిలో కూచుని చెంబుతో నీళ్ళు తీసుకుని అలా తలపై దిమ్మరించుకుంటూనే ఉన్నాడు. రంగయ్య. రత్తమ్మ దండకం అలా స్మరించుకుంటూనే ఉన్నాడు.

ఇంకొకరు మనం చెప్పింది ఎట్టి పరిస్థితుల్లోనూ వినరు గనుక వారినలా బతకనిచ్చి, మనకి

కావలసింది మనం చల్లగా చేసుకుపోవడమే జ్ఞానలక్షణం అని కొంతరంటారు. అన్నగారి పాదుకలు తలమీత పెట్టుకుని రాజ్యవిహీనుడు అయాడు ఒక తమ్ముడు. అమ్మగారి చిన్నకొడుక్కి పాదుకలు అందించి రాజాధ్యక్షు డయాడు మరొక ఘటికుడు. వీరిద్దరిలో ఎవరు నిజమైన జ్ఞాని? దేశ చరిత్ర చవిచూసి ఎవరికి వారు నిర్ణయించుకోవలసిందే. 'జ్ఞాన మొసగరాదా!' అని త్యాగరాజులా సంగతులు వేస్తూ కూచుని పాడడానికి ఇప్పుడు సమయం ఎక్కడిది, సహనం ఎవ్వరికుంది! పిల్లల్ని కని, వారిని పెంచి పెద్దచేసిన భార్యమణికి ఇంటి బాధ్యత అప్పచెప్పి వారి కేరాఫ్‌లో బతుకుతారు, సాధారణంగా జ్ఞానులైన భర్తలు, భార్య అనేది వడ్డీలకే ఇస్తుందో, చీటీలే కడుతుందో జీతం తెచ్చి చేతిలో పెడితే,ఇల్లు నడిపే దక్షతగలది అయితే, మంత్లీ కేష్‌తో సరిపుచ్చుతే అంతకన్న 'కార్యేషు మంత్రీ' ఎక్కడుంది! అలాంటి అదృష్టవంతుల జాబితాలో తనూ ఒకడని ఇన్నాళ్ళూ భావించాడు రంగయ్య. తన సర్వీసూ, ప్రమోషన్లూ, ఇంక్రిమెంట్లూ ఇంకా చెప్పాలంటే పైకి కదలడాలూ, పైన దొరకడాలూ, పైపైన దొరలడాలూ ఇలా జీవితం ఓ విధంగా తనదిగానే నడిచింది. ఇప్పుడు అలాంటి వన్నీ అటకట్టే, ఇక రమించలేవు-చాలని ప్రభుత్వం తీర్పుచెప్పి, తను ఉద్యోగంలోంచి విరమించాక, ఇప్పుడిప్పుడు....

ఇప్పుడిప్పుడే తెర తొలుగుతోంది. అది తన పెళ్ళినాడు రత్తమ్మకీ తన అడ్డంగా పట్టుకున్న తెర కాదు. ఎక్కణ్ణుంచో తన ఆమోదముద్ర వేయడం కాదు. రిటైరై ఇంటిపట్టున ఉండి గమనిస్తుంటే 'కేరాఫ్' లనే తెర తొలగి స్వయంగా చూస్తుంటే ఎన్నో చిత్రాలు కనిపిస్తున్నాయి. కంటికి పొర ఏర్పడవచ్చునుగాని వయసుతో పాటు మనసు అనేది మరింత పొరలు విడుతుంది కదా!

చిన్న చిన్న విషయాల్లో పెళ్ళాం లాంటిది ఎంతెంత పెద్ద నాటకం ఆడగలదో తన ఆఖరి కొడుకు వాసు పెళ్ళి సందర్భంలో బయటపడి ముక్కుమీద వేలేసుకున్నాడు. మొదటిసారి రంగయ్య ఎక్కడో బీహారు నుంచి వందలకి వందలు రైలుకి పోసి మేనల్లుడి పెళ్ళికని వచ్చింది. తమ ఆరుగురి అన్నదమ్ముల్లో ఒక్కగానొక్క ఆడపడుచు. ఏ రెండొందలు పెట్టి కొందో కుక్కరు ఒకటి కానుకగా చదివించింది. రైలుకి దిగబెట్టడానికి తను వెళ్ళినప్పుడు చెల్లెలి తన ముఖం మీదే అనెయ్యడం కాక 'పాపం, వదిన మనసు ఎంత ఉగ్గబెట్టుకుని ఇచ్చిందో ఈ నూలు చీర ఎప్పుడైనా పనిమనిషికి ఇవ్వడానికి ఉంటుంది. దాచుకోమను' అంటూ రైలు కదులుతూండగా తన ముఖం మీద విసిరేసింది. ఆ చీర రత్తమ్మ చేతిలో పెట్టకుండా దాచి, 'ఏమే, మాసుబ్బికి పసుపూ కుంకం కింద ఏం ఇచ్చావు?' ' అని ఆరా తీశాడు తెగించి. ఎప్పుడూ ఇలాంటి విషయాల్లో జోక్యం కలగజేసుకోని తన మొగుడు ఇలా అడిగితే రైలు దగ్గిర ఆ దొంగపీనుగ ఏదో అంటించి ఉంటుందని పసిగట్టి ఠక్కున ప్లేటు ఫిరాయించేసింది రత్తమ్మ. 'అతనేమో పెద్ద ఇంజనీరు. మీరేమో రిటైరయిన హెడ్‌గుమస్తా. అతని భార్యకి వెర్రిగాని మనమేం ఇవ్వగలం! కొండంత దేవుడికి కొండంత పత్రి పెట్టగలమా! అలాగని ఇన్నాళ్ళకి ఆడపడుచు గడపతొక్కితే కలిగింది పెట్టకపోతే మనకి ఇహపరా లుంటాయా? వెయ్యి రూపాయల పట్టుచీర తెప్పించాను. ఫారిన్ పోలియెస్టర్ పెడదామని చూశాను. ఇలాంటివి కట్టి కట్టి, విసుగెత్తిపోయిందట. మీ చెల్లెమ్మకి నేనెంత వాదించినా వినకుండా, ఇలాంటివి అక్కడ దొరకవంటూ ఓ వెంకటగిరి నేత చీర తీసుకుందండోయ్! పోన్లే ఆ పిల్లకి ఏది నచ్చితే అదే మనకి శుభం అనుకుని బొట్టుపెట్టి చేతిలో పెట్టేను. వెర్రిపిల్ల ఎంత ముచ్చటపడి పోయిందో!".

ఆ సంఘటన జరిగిన నాటినుంచి పెళ్లాం ద్వారా తెలుసుకున్న విషయాల్ని యథాతథంగా

తీసుకోవడానికి అంతో ఇంతో జంకుతూవచ్చాడు రంగయ్య. సరిదిద్దలేనప్పుడు తెలుపుకొని మాత్రం ఇప్పుడే లాభం, సుఖాన ఉన్న ప్రాణాన్ని కష్టాన పెట్టుకోవడం కాక!

ఉన్నవి చాలక ఈ పైడితల్లి 'చేప నవ్విన కథ' అనే మరో జటిల సమస్యని వెదజల్లి వెళ్ళింది. ఎక్కడ విందో, మరి ఎలా గుర్తుంచుకుందో! రెండ్రోజులపాటు పాత గ్రంధాలయాలు దులిపితే గాని ఆ తొలి తెలుగు సీరియల్ కథకుడు మధిర సుబ్బన్న దీక్షితుల మనసు బయటపడలేదు. పన్నెండు భాగాల ఆ ఉద్గ్రంధమాల పరిశీలిస్తే తప్ప ఆ 'చేప నవ్విన కథ' తెలిసిరాలేదు. ఆ కథ ఇంచుమించు ఇలా ఉంటుంది:

ఓ రాజుగారికి పాపం బహు పత్నీ వ్రతం ఉండేదట. అంతఃపురంలోకి పోతుటీగ జొరబడకుండా జనానా మంచి కట్టుదిట్టంలో ఉంచడానికి గట్టి ప్రయత్నమే చేసేవాడు ఆ రాజు. ఇటు ఆడా, అటు మగా అయితే ఏదైనా తప్పు పనికి దారితీసే అవకాశం ఉంది గనక వందమంది రాణుల దగ్గిరా ఒక్కొక్కరు చొప్పున కొజ్జాలను భటులుగా నియమించడానికి ఏర్పాటు చేశాడు. తన వందమంది సుందరీమణులూ ఎంతో శీలవంతులని రాజు నిశ్చింతగా ఉండేవాడు.

ఇలా ఉండగా ఆ రాజుగారి సభలోకి ఓ జాలరి ఓనాడు ఓ పంచరంగుల చేపను పట్టితెచ్చి కానుకగా అర్పించాడు. ఆ చేపని చూసి రాజు ఎంతో మెచ్చుకొని ఎన్నో కానుకలు ఇస్తూ 'ఇలాంటి వింత చేపని ఇదివరకు ఎరగం గాని, జాలరీ, ఇంతకీ ఇది ఆడదా, మగదా?' అనే ప్రశ్న వేశాడు.

కొన ప్రాణంతో ఉన్న ఆ చేప ఆ ప్రశ్నవింది. అది వింటూనే అది పకపక నవ్వింది. అలా నవ్వుతూ గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచిందట.

చేప ఎందుకు నవ్వింది? చెప్పగలిగినవాడికి అర్థ రాజ్యమిస్తా నన్నారు రాజుగారు. అర్థరాజ్యం మాట దేవుడెరుగు గాని అయిదొందల పేజీల సస్పెన్స్ పోషించి ఆఖరి పేజీలో నిజం బయటపెట్టేస్తారు తెలుగు కానన్‌డయిల్ గారు.ఇంకో తమాషా ఏమిటంటే అది రాజుగారితో చెప్పడానికి వీలులేని నిజం. ఏ అపకారమూ తలపెట్టనని రాజుగారి వద్ద ముందుగానే హామీ పొందిన మీదటనే నిజం బయట పెట్టబడుతుంది ఇంతకీ ఆ రాణివాసంలో ఉన్న భటులు కొజ్జాలు కారట, ఆ వేషంలో ఉన్న పూర్ణ పురుషులు, ఆ రాణుల ప్రియులు.

'నీ అంతఃపురంలో ఏ జాతి కాపలా ఉందో తెలుసుకోలేనంత గుడ్డి రాజువి నువ్వు, ఇంకో క్షణంలో చచ్చే చేపని' 'నేను' ఆడదయితే నీకేం, మగయితే నీకేం?" అనేది చేప నవ్వులోని అంతరార్థం!

'హమ్మ, ఈ పైడితల్లిముండ ఎంతదిబ్బతీసింది!" అని భుజం తడుముకుని నిజం తెలుసుకున్నాడు రంగయ్య. మర్నాడు, మల్లెపొద దగ్గిర దాక్కున్నాడు. సమయానికి విస్తరాకు ముక్క పడనేపడింది! ఎక్కణ్ణుంచి? తన ఇంటి మేడమీది గదిలోంచే! ఎంగిలి అయితే అయిందని పట్టుకుని వాసన చూశాడు. సాంబారు, కొబ్బరి పచ్చడి, ఇడ్లీ ముక్కలూ!

'మీరిలా వెడతారా, ఆ రోలు దగ్గిర దెయ్యంలా కూచుంటాను. ఏ మినపట్టో, పెసరట్టో కాల్చి పైకి పంపలేక నా దుంపతెగిపోతోంది. ఇవికాక రెండు పేకట్ల పాలు, రేప్పొద్దున్న కోడలికి ఏదైనా వస్తే నన్ను అంటారుగాని మిమ్మల్ని అనరు కదా!"

రత్తమ్మ ఇన్నాళ్ళూ ఏం చెబితే అది నమ్ముతూవచ్చాడు. లోకంలో తనలాంటి గుడ్డి పీనుగల

గుంపు ఎంతగా పెరిగి ఉందో మరి! పాపం, కడుపుతో ఉన్న పిల్ల ఏవైనా తినాలనుంటుంది
పొద్దుటిపూట మరీ ఆకలేస్తుంది. ఇలాంటప్పుడు కడుపు తడిమి పెట్టడానికి కన్న తల్లి లేనేలేద
ఉన్న అత్తగారు మేకవన్నె పెద్దపులి. కట్టుకున్న మొగాడు తల్లి నోటికి జడిసి ఏ సందునో ఫలహారః
పొట్లాలు అందించక ఏ గంగలో దూకుతాడు! ఎంత ఆకలున్న కొడలయినా ఫలహారంతోపాట
విస్తరాకు ముక్క కూడా మింగలేదు కదా! అవి గిరవాటెయ్యాక మార్గాంతరం లేదే!

సంగతి తెలిశాక రంగయ్య ఆగలేకపోయాడు. ఇప్పటికైనా పెళ్ళాన్ని ఎదిరించే దమ్ము
అతనికి లేవు. దొడ్డిదారినే ఆశ్రయించాడు. ఆ మేనత్త దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చిందని నాటకమాడాడ
తనే డబ్బించి కోడల్ని రైలెక్కించాడు. 'ఇలాంటి దొంగ బతుకు బతక్క ఇక హాయిగా, దర్జాగా
ఉండండి.' అని సలహా ఇచ్చాడు దిగబెట్టడానికి వెడుతున్న కొడుకుని సాగనంపుతూ, వచ్చేస్తు
దార్లో పైడితల్లి ఎదురైతే ఓ వంద రూపాయల నోటు చేతిలో నొక్కి 'దీన్తో ఎంత పెద్ద చేప వస్తే అ
కొనుక్కో, నవ్వుతూ కొరుక్కో' అన్నాడు.

*(ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక 15-8-81*



# మమ్మల్నిలా బతకనివ్వండి




**నాలుగు** కథాసంకలనాలూ, ఆరు నవలలూ పుస్తక రూపంలో రావడమే కాక, కేంద్ర అకాడమి ప్రైజు కూడా అందుకున్నాడు శివరావు. అంతగా పాపులారిటీ పెరిగిన వాడికి జీవిత మనేది చాలావరకు అర్థమైందనుకుంటే అందులో ఆశ్చర్యం లేదు. ఏళ్ళ తరబడి మనస్తత్వ చిత్రణకి అలవాటుపడి, నిజానికి వూహని జోడించి, మనసుకి హత్తుకునేలా మనోహర శైలిలో చెప్పగల ఆ ప్రసిద్ధ కథకుడికి తన వూళ్ళోనే పుట్టి తనతోనే చదువుకొన్న దీక్షితుల ప్రవర్తన బోధ పడలేదంటే అంతకంటే ఆశ్చర్యం లేదు కూడా.

అయితే ఇందులో మరో ముఖ్య విషయం కూడా లేకపోలేదు. దీక్షితుల పెళ్ళి వరకూ మాత్రమే శివరావు అతని అనుపానులు గుర్తించింది. మళ్ళీ అనుకోకుండా ఈ బొంబాయిలో ఈనాడు కలుసుకోవడమంటే, అదెక్కడ, ఇంచుమించు పాతికేళ్ళ నాటి మాట! దీక్షితులే ఫోన్ చేశాడు.

"ఆహ్వాన పత్రికలో నీ ఫోటో చూసి వెంటనే నిన్ను గుర్తు పట్టాను, శివరావు! రెండు దశాబ్దాల

కాలం మనిషి ఆకారంలో ఇంత తక్కువ మార్పు తీసుకు రాగలగడం చాలా ఆశ్చర్యకరం. నిన్ను కలుసుకొని కడుపుదీరా కబుర్లు చెప్పుకుందామని కొట్టుకుపోతూంది. నా మనస్సు.''

"ఓరి నువ్వట్రా, దీక్షితులూ! అక్కడ మునిగి ఇక్కడ ఇన్నాళ్ళకి తేలావా? హౌ లకీ అయామ్! సాయంకాలం సాహితీ సమాఖ్యకి తప్పకుండా వస్తున్నావ్ కదూ?''

ఎందుకోకాని ఒక గడియ మౌనం వహించి జవాబు చెప్పాడు దీక్షితులు. "సారీ. నేను వచ్చే స్థితిలో లేను. రావాలనే ఉంది. ఏం చెయ్యను! సరే, మీ కార్యక్రమం ఎన్ని గంటలకి ముగుస్తుంది? పదికా! సరే పదింపావు కల్లా ఆంధ్ర మహాసభ బిల్డింగు మెయిన్‌గేటు దగ్గిర మా బఫ్ కలరు అంబాసిడర్ నీ కోసం వెయిట్ చేస్తూ ఉంటుంది. మా డ్రైవరు రాజేష్ ఖన్నాలా ఉంటాడు. గొంతుకు మాత్రం కీచు. మేధావివి ఎలా పోల్చుకోవాలో నేను నీకు చెప్పాలా! నీ మూటా ముల్లే పట్టుకుని నా దగ్గిరకి వచ్చెయ్యి. ఉహు మరేం చెప్పకు వచ్చాక మాటాడుకుందాం. వస్తావు కదూ! నువ్వెప్పుడొస్తావా అని ఎదురు చూస్తూ ఉంటాను బై.''

మరి మాటాడనివ్వకుండా దీక్షితులు ఫోన్ పెట్టేశాడు.

నిజం చెప్పాలంటే ఆ రాత్రి పదిన్నర కోసం దీక్షితులు కంటే ఎక్కువగా ఎదురు చూసింది శివరావే. డబ్బూ కీర్తీ కలిసి సృష్టించిన విషవలయంలో కూరుకుని దిగజారిపోతూన్న నేటి కళాకారుల్లో శివరావు ఒకడు. ఇటు చలన చిత్ర రంగమూ అటు రాజకీయ వ్యాపారమూ రెండు చేతులా ఆహ్వానించి, ఆలోచించగలిగిన మనిషిని తానెవరో తనకి తెలియకుండా చేస్తున్నాయి. సినీ శతదినోత్సవ మయినా, సాహితీ సన్మానమయినా కాలం తీర్చిన కళకు కనుగప్పే జలతారు ముసుగులు. వీటిలో ఏమైనా ఉంటాయి ఆప్యాయతా, మానవతా, నిజాయితీ తప్ప! కాదనలేని కృత్రిమ వాతావరణం నుంచి, శివరావు లాంటి వాడికి చిన్ననాటి స్నేహితుడితో గడపడం కోరదగిన రిలీఫ్.

ఇంతకీ ఆ మాట చెబితే దీక్షితులు ఎంతగా నవ్వాడనీ!

"అలాగయితే నువ్వు వెంటనే రిటర్న్ ఫ్లైటు అందుకోవలసి ఉంటుందిరా శివా! ఎందుకో తెలుసా? ఇప్పుడిలా నీతో మాటాడుతున్న ఈ మనిషి శరీరంలో నాలుగింట మూడు భాగాలు కృత్రిమంగా అమర్చినవేసుమా!''

అలా నవ్వుతూ ఎడమ వైపు కింద కడుపు చివర పట్టుకుని 'అమ్మో, అమ్మో' అంటూ బాధతో మెలికలు తిరిగిపోయాడు దీక్షితులు. వెంటనే అతని భార్య వైదేహి పరిగెత్తుకు వచ్చి అంత స్పీడులోనూ ఏవో ఎర్రని మందు రెండు చుక్కలు డ్రాపర్‌తో అతని నోటిలో వేసింది. ఇంకా ఇలా చప్పరించడం అయిందో లేదో, అలా కనురెప్పలు మూతలు పడిపోయాయి దీక్షితులకి.

అసలు ఆ ఇల్లు చేరుకోకుండానే ఆనాటి తమ ముఖ్య అతిధిగా పాల్గొనే సాహితీ సమాఖ్యకి, దీక్షితులు ఎందుకు రాలేకపోతున్నాడో తెలిసింది శివరావుకి. తన కంతో ఇంతో హిందీ వచ్చునని తెలిశాక ఇక అజానియర్ రాజేష్ నోటికి మూత వెయ్యడం అతని తరం కాలేదు. దీక్షితులు జబ్బుతో మంచాన పడి ఉన్నాడుట. గత ఆరు నెలలై అతను ఆఫీసుకి వెళ్ళలేదు. అయితే పని చేస్తూన్న ప్రైవేటు కంపెనీకి బిజినెస్ మేనేజరుగా దీక్షితులు అమిత లాభాలు అదివరకే సంపాదించి పెట్టాడుట. ఆ కృతజ్ఞతతో ఆ కంపెనీ అధిపతులు వాళ్ళకుటుంబ సభ్యుడిగా అతన్ని చూసుకుంటూ 'శరీరంలో

శక్తి ఉన్నంత కాలం మా అభివృద్ధికి పాటు పడ్డావు. ఇప్పుడు ఈ స్థితిలో నిన్ను వదిలేస్తే మా జైన తీర్థంకర్ మమల్ని మన్నిస్తాడా! నువ్వు ఎన్ని నెలలు పడక వెయ్యి నెల మొదటి తేదీకే నీ జీతం నీ ఇంటికి అందుతుంది. టెలిఫోన్, కట్ చెయ్యం సరికదా, మా కంపెనీ కార్లూ, డ్రైవరూ నిన్ను వదిలి పెట్టరు, అనే ధీమా ఇవ్వడమే కాక దీక్షితులు మెడికల్ బిల్ అంతా వాళ్లే చెల్లిస్తున్నారట! మామూలు మెడికల్ బిల్లా అది! ఈ రెండేళ్ళలో నాలుగు మేజరు అపరేషన్లు అయ్యాయిట. ధనికులు కూడా మనుషులే కాబోలు!

"ఈ నాలుగో సారైనా టపా కట్టిస్తావనుకున్నాను. దీని సాహసం తగలడ ఇంకా ఈ గుండె ఎలా టపటపా కొట్టుకుంటూందో ఒకసారి ఇక్కడ చెయ్యి వేసి చూడవే!" తెలివి బాగా వచ్చాక దీక్షితులు వైదేహితో అన్న మొదటి మాట ఇదిట, అంటూ చిన్న నవ్వు నవ్వబోయి 'హమ్మో, హమ్మో' అంటూ లుంగలు చుట్టుకు పోయాట్ట, అదృష్టవశాత్తు వెంటనే మెడికల్ హెల్ప్ అంది, సరైన ఇంజక్షన్ పడి, మళ్ళీ బతుకులో పడ్డాడుట. అప్పుడే ఆ డాక్టరు చెప్పాడుట.

"నవ్వుతూ బతుకు అని ఎవర్నయినా దీవిస్తాం! శరీరంలో అత్యధిక బాగాలు కోత వాత పడి, శరీరంలో ఆర్టిఫిషియల్ కంటెంట్ పెరిగిపోయి, అతి సున్నిత కండరాలు ఆ కదలికకి తట్టుకోలేక 'నవ్వితే మది బతకవ్' అనే స్టేజికి చేరుకున్నాడు మీ ఆయన వెంటనే మెదడుని మొద్దు బారేలా చేసి, నిద్ర పుచ్చాలి. అందుకే ఈ ఎర్ర చుక్కల మందు ఎప్పుడూ దగ్గిర ఉంచుకోండి."

"ఇంతకీ దీక్షితులకి ఏం రోగం?" అని అడగబోయి నాలిక కరుచుకున్నాడు శివరావు. 'అతని ఏ శరీర భాగానికి లేదు గనక రోగం!' అంటే చాలా వరకు కరెక్టేమో, 'చాలావరకు' అనే హంసపాదు ఎందుకంటే అతని బ్రెయిన్ మాత్రం ఇప్పటకీ పెర్ఫెక్ట్‌గా పని చేస్తూందిట. తన ఫ్రెండు జనరల్ కండిషన్ తానుగా తెలుసుకుందామని ఆ మరునాటి ఉదయం కంపెనీ డాక్టర్ కులకర్ణిని కలుసుకున్నాడు. దీక్షితులు పట్ల అతని కన్‌సెర్న్ చూసి ముగ్దుడయ్యాడు శివరావు.

"సారీ, మిష్టర్ రావ్, దీక్షిత్‌జీ చాలా పాస్టుగా సింక్ అవుతున్నారు. బ్రెయిన్ బాగుంది కాని అదొక్కటే అలా ఉంటే చాలదుగా! లివరూ, హార్టూ లంగ్సూలాంటి అన్ని వైటల్ ఆర్గన్సూ, అంతో ఇంతో చెడిపోయి ఉన్నాయి. మహా అయితే మరి కాస్త అతని బతుకుని పొడిగించగలం కాని కమ్ముకుని వచ్చే మృత్యువుని అపడం మా తరం కాదు కదా! అప్పుడే కేన్సరస్ సిమ్‌టమ్స్ తొంగి చూస్తున్నాయికూడా. ఇదంతా తెలిసికూడా ఏం పట్టనట్టు ఉండగల గొప్ప వ్యక్తి దీక్షిత్‌జీ. తను నవ్వడం కష్టమని తెలిసినా ఇంకోళ్ళని నవ్వించకుండా ఉండలేని ఉత్తముడు మీ ఫ్రెండు. గత మూడు నెలలుగా ఆయనకి ఆహారం విటమిన్సుగా కాప్సూల్సు రూపంలో ఇస్తున్నాం. ఇంతకీ మిసెస్ దీక్షిత్‌జీ ట్రెయిన్డ్ నర్స్ అవడం కొంత నయం. ఈ మధ్య ఒక ఉదయం ఏమైందో తెలుసా, నాచురల్ ఫుడ్ ఇమ్మని కూచున్నాడు. తెగించి ఒక స్పూన్ పళ్ళరసం తాగించాను. అది ఇమిడిందని ఆయన ఆనందం చూడాలి!" 'చూశారా' కులకర్ణీ, అరగంటయినా వాంతి కాలేదు. అనవసరంగా బెదరగొట్టి చంపారు. ఇవాళ ఈ నాలుగు చుక్కలూ నోటిలో దిగుతూ ఉంటే మళ్ళీ ఆనాడు మా అమ్మ పాలు పట్టినట్టు ఉందే, వైదేహి! ఇదిగో, డ్రైవర్! ఏమిటనీ స్పీడు, ముందీ శుభవార్త విని మరీ వెళ్ళు ఇన్నాళ్ళకి నానోటికి ఆహారం ఇమిడింది తెలుసా! ఈ వారం దాటకుండానే ఆఫీసుకి వస్తానని బడాసాబ్‌కి చెప్పు." తనకి జరిగిన కాస్త మంచీ పది మందికి పంచితే కాని ఉండలేని మహానుభావుడు

మీ ఫ్రెండు. పనిలో పడి మెకానికల్‌గా తయారవుతారు మా లాంటి ప్రొఫెషనల్సు. మాలో మళ్ళీ ఇమోషన్ రేకెత్తిస్తారు దీక్షిత్ జీ లాంటి వాళ్ళు. కాని ఏం లాభం! మహా దాటితే మరో నెల ఇంతకీ మీరు కొన్ని వందల కథలు రాశారని ఆయన చెప్పారు. మీ లాంటి ఎస్టాబ్లిష్డ్ రైటర్స్‌కి అందని కారెక్టర్సు అంటూ ఏం ఉండదనుకోండి.!"

తనేం అంటున్నాడో తెలుసుకోకుండానే కులకర్ణి శివరావు సృష్టి స్థానం మీద చావుదెబ్బ తీశాడు. నిజానికి దీక్షితులు పాత్ర తన కలం కల్పనకు కనుచూపులో ఎరగనిది! పాత్ర పరిధి దేవుడెరుగు, ఆ తరవాతి సంఘటన శివరావు వూహకైనా దొరకనిది. ఆ రాత్రి వైదేహి అతనితో అంది.

"మా అమ్మకి మళ్ళీ తిరగ బెట్టిందని ట్రంక్‌కాల్ అందింది, రావుగారూ! ఆయన స్థితి గమనించారుగా- నేను కదలడానికి వీలు లేదు. ఇంకో నెల దాటదనే కఠిన సత్యాన్ని క్షణం క్షణం దిగమింగుతూ గుండె రాయి చేసుకుని బతుకుతున్నాను. మాకు పిల్లల్లేరని మీకు తెలుసు. అంతకు మించిన వెలితి బతుకులో ఉండదు.అయినా పసిపాప లాంటి ఆ పవిత్రమూర్తి ముందు ఒక్కొక్కప్పుడు ఏ వెలితీ నాకు కనపడేది కాదు. అది కూడా కోల్పోతున్నాననే కాలసర్పాన్ని కొంగున కట్టుకుని నేనెలా తిరుగుతున్నానో నాకే తెలీదు. 'ఇది స్వార్థమే. నాకు స్పష్టంగా తెలుసు, నీ ఒళ్ళో పడుకుని కన్ను మూస్తే అంతకంటే నేను కోరేది ఉండదు, అని నా చేత వాగ్దానం చేయించుకున్నారు ఆయన. వారిని ఈ స్థితిలో విడిచిపెట్టడం అంత అపరాధం మరొకటి ఉండదు. కాని ఏం చెయ్యను చెప్పండి? అవతల చావు బతుకుల మీద ఉన్న అమ్మ, ఒకసారి చూసి రావాలని ఉంది. ఈ ప్లేన్లో వెళ్ళి ఆ ప్లేన్‌లో వచ్చేస్తాను. అయినా కనీసం రెండ్రోజులు పడుతుంది. సమయానికి దేవుళ్ళా వచ్చారు."

"వైదేహిగారూ! ఇంతలా మీరు చెప్పడం అనవసరం. ఇంతప్పటి నుంచీ వాడూ నేనూ ఒక వూళ్ళో పుట్టి పెరిగాం చదువుకున్నాం. ఏయే మందులు ఎప్పుడెప్పుడివ్వాలో కాగితం మీద రాసిచ్చి మీరు ధైర్యంగా వెళ్ళి రండి. దీక్షితుల్ని కంటికి రెప్పలా కాపాడి మీకు తిరిగి అప్పచెప్పే పూచీనాదిగా.'

ఆ మరునాటి మధ్యాహ్నం చంటిగుడ్డుని వదలలేని కన్నతల్లిలా వెయ్యి అంపకాలు పెట్టి, ఎలాగో రైలెక్కి వెళ్ళింది వైదేహి.

అంతే.

ఆ క్షణం నుంచి కథ అడ్డం తిరగడం ఆరంభించింది.

కాదు, కాదు.

అడ్డ దిడ్డ మనిపించిన కథని ఒక పద్ధతిలో పెట్టే ప్రయత్నం మొదలు పెట్టాడు శివరావులోని కథకుడు. జీవితమనేది ఎవరికీ లొంగని ఒక మొండిఘటం, దాన్ని కొన్ని ఇజాల ఇనప కటకటాల ఇరుకులో కాని, నీతి నియమాల నేలమాళిగలో కాని బంధించి, గుర్తుండే ఆదర్శాలను ప్రబోధిస్తారు సాధారణంగా కథకులు పేరు పొందిన శివరావు లాంటి వాడు ఎలా వూరుకోగలడు?.

అందునా తన ప్రబోధం ఇంకొకరికీ ఇంకొకరికీనా?

ఇదేం కథా?

ఎప్పటినుంచో తెలిసిన వాడు.

ఎక్కడికో తెలీదు కాని ఎప్పుడు వెళ్ళిపోతాడో ఎరిగున్నవారు. ఏదో ఇలా బ్రతక్కుండా వెర్రి కబుర్లు చెప్పి నవ్విస్తూ ఈ నాలుగు రోజులూ ఇలాగేనా వెళ్ళబుచ్చడం! బుర్ర ఇంకా క్లియర్‌గా ఉందన్నారే నెల రోజుల వ్యవధి ఏమంత తక్కువ! ఎన్ని మంచి పనులు చెయ్యొచ్చు! పాతికేళ్ళ కంటిన్యువస్ సర్వీస్, అందులోనూ హృదయ మున్న కంపెనీలో పోతే ఎన్ని లక్షలూ అందుతాయో... పిల్లలు కూడా లేరు కదా... అందులో భార్య కూడా తన వాళ్ళని ఎదిరించి పెళ్ళాడిన మరో కులం నర్సమ్మాయె. ఇన్ని లక్షలూ ఏ అపాత్రుల చేతిలోనో పడకుండా ముందే కట్టుదిట్టం చేసుకోవద్దా? అ ప్రియం అయినా సత్యమనేది చెప్పక తప్పదు. ఈ ఏర్పాటంతా తరవాతి మాట. ఇంకా కొన్ని రోజుల బతుకనేది మిగిలే ఉంది కదా. చేతిలో కారుంది. ప్రాణం పెట్టే డ్రైవరున్నాడు. మంచాన పడున్న మాట నిజమే కాని మెదడూ మాటా బాగానే ఉన్నాయి కదా! దేశంలో ఎన్ని దేవాలయాలు లేవు! దేశంలో మాట దేవుడెరుగు ఒక్క బొంబాయిలోనే ఎన్నెన్ని ఆరాధనాలయాలు లేవు! పోనీ అలాంటివి నమ్మకం లేకపోతే దానం, ధర్మం? పోనీ అవీ నచ్చకపోతే మనసుకు నచ్చే సంగీతం, సాహిత్య కాలక్షేపం? అలా పడుకుని మందులు మింగుతూ ఉంటే కాలం ఆగుతుందా? మనసు పెట్టి శివరావు అలా ఆగకుండా చెబుతూనే ఉన్నాడు. దీక్షితులు అలా వింటూనే ఉన్నట్టు అనిపించింది. ఇంతే జరిగింది. ఇలా ఒక రోజు కాబోలు గడిచంది. ఉన్నట్టుండి సర్వశక్తులూ కూడదీసుకున్న దీక్షితులు ఒక అరుపు లాంటిది అరచాడు. అదీ నవ్వేమో అనుకున్నాడు శివరావు. ఎర్ర చుక్కలు ఈ సారి పని చెయ్యలేదు. డాక్టరు వచ్చేదాకా కూడా ఆ ప్రాణం ఆగలేదు. శివరావు నిలువునా కుంగిపోయాడు. మరేదైనా ఆవచ్చు కాని, ఈ సారి తను చేసింది సృష్టి మాత్రం కాదు. వైదేహి మొహం ఎలా చూడాలి! జీవితం గురించి నీకేం తెలుసునంటే ఏం జవాబు చెప్పాలి!

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 8-8-84)*

# సాయం!

## 13



**రిసెప్షనిస్టు** సుంధర అడుగుల చప్పుడు సీనియర్ ఆఫీసరు శివప్రసాదుకు గుర్తే.

"ప్లీజ్ సిడౌన్" అన్నాడు తలెత్తకుండానే. కాని ఆవిడ కూర్చోలేదు. అలా కూర్చోకూడదు, ఆ ఆఫీస్ రూల్స్ ప్రకారం. ఆ విషయంలో ఆవిడే కాదు అతనూ ఏం చేయ్యలేడు. తలమునకలైన ఆఫీసు పనిలో ఎంతగా ఊపిరి సలపకపోయినా ఆవిడ సమక్షంలో వాళ్ళిద్దరి మధ్య తేడా అతను తలపోసుకోకుండా ఊరుకోలేడు.

తను ఇలా మెత్తని కుర్చీలో కూర్చోడం, ఆవిడ అలా నిలబడ్డం - ఇది కాదు, బతుకు పోరాటాన్ని ఎరుక్కొనే మానసిక బలాన్ని బట్టి హోదాలు, నిర్ణయించగలిగితే అమెను ఇంకా ఎత్తున కూచోబెట్టి, తనకు కటిక నేల మీద జాగా ఇవ్వాలని శివప్రసాద్ ఉద్దేశం.

తనకేం మగాడు ! తల్లీదండ్రీ లేకపోతే నేం పిల్లలు లేని పిన్నీ చిన్నాన్నలు ప్రేమతో పెంచి పెద్ద చేశారు. చదువు చెప్పించారు. పెళ్ళి చేశారు. సొంతిల్లు ఉంది. మంచి ప్రైవేట్ ఫర్మ్‌లో పెద్ద ఉద్యోగం కారూ, బంగళా, దేనికి లోటని?

తను ఎప్రంటిస్‌గా ఆ ఫర్మ్‌లో చేరేనాటికి వసుంధర భర్త గవర్రాజు కెమిస్ట్‌గా అక్కడ పని

చేస్తూ ఉండేవాడు. ఇంజనీరింగ్‌లో పోస్టు గ్రాడ్యుయేషన్ చేశాడు గనక తనకు రెండేళ్ళలోనే ప్రమోషన్ వచ్చింది. తనకు పెద్ద ఉద్యోగం వచ్చిన ఏడాదే ఆ ఘోరం జరిగింది. ఓ గ్యాసు లీకు యాక్సిడెంటులో మరో ఇద్దరు అసిస్టెంట్స్‌తో పాటు గవర్రాజు ఘోర మరణానికి గురి అయ్యాడు. అప్పుడు వసుంధర పెద్ద కొడుక్కి నాలుగో ఏడు. రెండోవాడికి మూడు. ఒళ్ళో మూడు నెలల పాప. ఫర్మ్ రూల్సు ప్రకారం ఎక్స్‌గ్రేషియా చెల్లిస్తారు. చెల్లించారు కూడా. ఆవిడ ఏ ఎనిమిది దాకానో చదివింది. బతికు న్నన్నాళ్ళూ పెళ్ళాం కాలుకదపకుండా నెత్తి మీద పెట్టుకుని చూసుకున్నాడు గనక వసుంధరకు వచ్చిన హిందీ కూడా అంతంతమాత్రమే అప్పటి ఆమె క్వాలిఫికేషన్‌ను అంతే.

స్వతహాగా తనేమో తన పనేమో తప్ప గట్టిగా ఎదుటివాడితో నైనా రెండు ముక్కలు మాటాడ్డం శివప్రసాద్‌కి అలవాటు లేదు. అయినా గవర్రాజు కుటుంబం కోసం రంగంలోకి దిగాడు. పెద్దింటి పిల్ల కదా క్లాస్ ఫోర్ ఉద్యోగానికి వసుంధర ఒప్పుకోదేమో పిల్లలతో కుదరదేమో అని సందేహించాడు. క్లాస్‌ఫోర్ వాళ్ళకు క్వార్టర్ల సదుపాయం ఆ రోజుల్లో లేదు. ఫర్మ్ వాళ్ళు తగిలేస్తా రేమో, బొంబాయి లాంటి ఊళ్ళో ఏ పంచా దొరక్క పిల్లలతో ఎక్కడ ఇబ్బంది పడుతుందో అని కంగారు పడ్డాడు. కాని సీరియస్‌నెస్‌కే, సిన్సియారిటీకీ మారు పేరైన తన మాట ఫర్మ్ మేనేజ్‌మెంటు పెద్ద మనసుతో మన్నించింది. ఎప్పుడూ లేని మధ్యవర్తిత్వం వహించి విధి వంచితులైన ఆ తల్లీపిల్లల్ని వీధి పాలు కాకుండా కాపాడగలిగాడు.

ఏ మనిషికయినా ఏ స్థితిలో అయినా ఇంకొకరి సహాయం అనేది కొంతవరకే. సాటి మనిషి శాశ్వతంగా సహాయం కోరడం, కళ్ళబడని అదృశ్యశక్తి మీద మూఢ విశ్వాసం ఉంచడం మనిషిలోని బలహీనతలను చూపిస్తుంది. వసుంధరలో ఈ రెండూ మాటవరస కయినా కనిపించవు. అందుకే శివప్రసాద్ దృష్టిలో ఆమె కంతటి అత్యున్నత స్థానం. భర్త పోయేనాటికి పెనుగాలిలో చిక్కుకున్నలేత మొక్కలాంటి వసుంధర ఈ పదమూడు పధ్నాలుగేళ్ళలో ఒకరికి నీడ చూపించే వృక్షంలా తన కళ్ళ ముందే ఎదగడం ఎంతో ఆశ్చర్యంగా ఆనందదాయకంగా ఉంటుంది. తనేదో పెద్ద ఉద్ధరించాడనుకోడం వెర్రితనం. ఒకసారి తన కాళ్ళ మీద తను నిలబడగలిగాక ఇక ఎవర్నీ దేనికీ యాచించలేదు ఆవిడ. పిల్లల ముగ్గుర్నీ ఎవరైనా గర్వపడేలా పెంచింది. పెద్ద పిల్లలిద్దరూ ఇంటరు పస్టు క్లాసులో పాసయారు. వాళ్ళిద్దరూ ఇప్పుడు ఏదో కోచింగ్ సెంటర్లో సికింద్రాబాద్‌లో ఎమ్‌సెట్ పరీక్షకు ప్రిపేర్ అవుతున్నారు. ఇక తల్లి దగ్గిరే ఉండే బేబీ అయితే ఆ చురుకుదనం చూసి ముచ్చటపడని వారుండరు. దానికి రాని భాష లేదు, అది ఆడని ఆట లేదు ! ఇక వసుంధర అయితే ప్రైవేటుగా కట్టి ఎప్పుడో పూర్తి చేసింది గ్రాడ్యుయేషన్. టైపు హయ్యర్ పాసయింది. హిందీలో విశారద పరీక్ష పాసయింది. సీనియర్ రిసెప్షనిస్టుగా ప్రమోటై రెండు వేలు తక్కువ కాకుండా తెచ్చుకుంటోంది. ఒకర్ని ఒక మాట అనదు, ఒకరిచేత ఒక్క మాట పడదు. ఉద్యోగరీత్యా ఎంత టెన్షన్ ఏర్పడ్డా మొహం మీద ఆ చిరునవ్వు చెదరనివ్వదు.

తనేదో ఆవిణ్ణి నిలబెట్టానని అందుకే శివప్రసాద్ ఎప్పుడూ అనుకోడు. అవకాశం వచ్చినా ఆవిడకు తోడ్పడి తీరాలనే తపన అతని బలహీనతేమో మరి!

" ఈ రాత్రికే రిజర్వేషన్స్ దొరికేయి సార్! నేనూ, బేబీ ఇవాళే బయలుదేరి వెడుతున్నాం. ఫైవ్ డేస్ లీవ్‌కు అప్లై చేశాను. ఈ సంక్రాంతి పిల్లల్తో సికింద్రాబాదులో గడిపి వస్తాను. మళ్ళీ నేను సోమవారం డ్యూటీలో జాయిన్ అవుతాను. ఫైల్సన్నీ మేరీకి అప్ప చెప్పేను. పెండింగ్‌లో ఉన్న టైపింగ్

మేటరంతా అరుణ్ బిస్వాల్‌కి ఇచ్చాను. మరి నేను వెళ్ళి రానా సార్?"

వసుంధర నోరు విడిచి అడక్కుండానే తను చేయగల సాయం అతని మనసులో మెదిలింది.

వసుంధర కొడుకులిద్దరూ తల్లికి బాగా దూరంగా ఆ మహా పట్నంలో చదువులు వెలిగిస్తున్నారు. ఎంత క్రమశిక్షణలో ఉన్న పిల్లలైనా పెద్దల డబ్బు నెల నెలా అందుతూంటే ఈ కాలపు ఆకర్షణలకు తట్టుకుని వయ సొస్తున్న పిల్లలు ఓ దార్లో పడడం అంత సుళువా! తన పిన్నీ, చిన్నాన్నా ఈ మధ్యే తన సొంతింటికి వచ్చేశారని తెలియబరచారు. అన్నట్టు చిన్నాన్న రిటైరయి పదేళ్ళయినా ఇంకా మహా ఏక్టివ్‌గా ఉండి ఉండాలి. లేకపోతే ఇలా వస్తునే ఓ మేథమెటిక్స్‌కోచింగ్ సెంటరు ఓపెన్ చేస్తాడా! అంతేకాదు. వాళ్ళింట్లో ముందు వాటా వాళ్ళు ఖాళీ చేశారని పిన్ని రాసింది. వసుంధర కొడుకులు ఎలాగూ నాలుగొందలు ఇచ్చి వేరే వాటాలో ఉన్నారని ఆవిడే చెప్పింది. వాళ్ళని తమ వాటాలో దింపి చిన్నాన్న సంరక్షణలో పెడితే? మగపిల్లలు చేతి కంది వస్తే ఇక బేబీ భారం ఒకటే ఆవిడకు మిగులుతుంది.

ఒకరి సహాయం అర్థించని పద్ధతిలో ఆవిడ తన జీవితం దిద్దుకుంది. ఇవన్నీ చెప్పి తమవాళ్ళ సాయం పొందమంటే ఆవిడ ఎలాగూ వినదు. అన్నీ వివరంగా రాసి వసుంధర చేతికిస్తూ శివప్రసాదు అన్న దిదీ:

"నన్నింతవాడిని చేసిన మా వాళ్ళు సికింద్రాబాదులో ఉన్నారు. 'ఇదిగో ఎడ్రసు. మా క్షేమం తెలియజేస్తూ ఆ ఉత్తరం మా చిన్నాన్నకివ్వండి!"

శివప్రసాదు చెప్పిన ఎడ్రసు పట్టుకుని, సికింద్రాబాదు చేరిన మూడో రోజున వసుంధర ఆ ఇంటికి వెళ్ళి వాళ్ళను కలుసుకుంది. అతనిచ్చిన ఉత్తరం వాళ్ళ కందజేసింది. ఆ ఉత్తరంలో ఉదహరించబడిన అంతనీట్‌గా యాక్టివ్‌గా ఉండడం చూసి, వాళ్ళు తట్టుకోలేకపోయి ఉండాలి. వాళ్ళబ్బాయి దగ్గిర పని చేసే క్రింద మనిషిగా తప్ప మరోలా చూడలేకపోయి ఉండాలి. లోపలి కెళ్ళి రెండు ముక్కలు రాసి కవర్లో పెట్టి అంటించి ఇచ్చాడు.

"చూడమ్మాయ్ ... అరబస్తా బియ్యం మూట మావాడి కోసం సిద్ధం చేసి ఉంచాం. కొత్త మంచాలు ప్యాక్ చేయించి ఉంచాం. నువ్వెళ్ళేటప్పుడు ఇలా వచ్చి తీసుకెళ్ళి మావాడికి అందించు' ' అనే బరువు కూడా అమె మీద వేశారు.

ఓసారి ఎక్కితే ఎప్పుడెక్కడ ఆగిపోతామో ఎరగని ఈనాటి రైలు ప్రయాణాల్లో, అందులో ఇంత దూరం, అందున్నా ఓ ఆడపిల్లతో ఓ ఒంటరిఆడది, ఇంత భారం తలకెత్తుకోడం - అసాధ్యం అని ఆ క్షణమే నిర్ణయించుకుంది వసుంధర అవి తీసుకురాకుండానే బొంబాయి వచ్చేసింది.

"నా కెలా కుదురుతుంది?" అంటూ శివప్రసాదుతో స్పష్టంగా చెప్పింది.

అయితే ఉత్తరంలో ముసలాయన ఏం రాశాడో శివప్రసాదుకే ఎరిక, "ఏనాడో మొగుడు పోయి, ఏ నలభయ్యో దాటిన మనిషి, ఇప్పుడు విడిచిన పువ్వులా ఇలాగ్రటా ఉండడటం! దీనికా మనం ఉపకారం చెయ్యవలసింది ! బాగా మోజులో పడ్డట్టున్నావు, నీ సంసారానికి అపకారం కాకుండా చూసుకో."

అతని తల తీసేసినట్టయింది. వసుంధరలాంటి వ్యక్తికి తన లాంటివాడు ఏ సాయం చెయ్యకుండా ఉండటమే అన్నిటి కన్న గొప్ప సాయం!

*(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 4-5-91)*

సాయం !

# పిల్లలే బుద్ధి చెప్పాలి




**"అదేమిటి** కోడలు పిల్లోయ్, ఎప్పుడూ లేంది అబ్బాయి మరీ ఇంత తెల్లారుఝామునే లేచి చిందులు తొక్కేస్తున్నాడూ! ఆ ఆఫీసరుగారికి గాని మళ్ళీ పెద్దమ్మవారు పూనిందా యేం?"

అని బామ్మ అమ్మని అడుగుతున్న ముక్కలు నా చెవిలో పడ్డాయి. అసలు అంతకు ముందే నాకు మెలుకువ వచ్చేసింది. బాగా చలిగా వుంటే కప్పుకు పడుకున్నాను. నిద్ర నటిస్తూ, పెద్దాళ్ళ కబుర్లూ చేష్టలూ చాటుగా కవి పెడుతూ వుండడం మా పిల్లలకి బూర్లూ పులిహోరలూన్నూ.

"హెడ్డాఫీసునుంచి ఏదో పెద్ద ఘటమే యివాళ యిన స్పెక్షనుకి తగలడుతున్నంటట. ఈ ముదనష్టపు పని అయిపోయేదాకా మరి వీళ్ళకి శవజాగారం తప్పదు కదా! అవునుగాని యింకా పాలవాడు అఘోరించినట్టు లేదు. మళ్ళీ వాడికి ఏం సంకటం వచ్చిందో, కాస్త వీధి చివరిదాకా వెళ్ళిరాగలరూ?". అని అమ్మ జవాబూ. ముసుగు సవరించుకుంటూ బామ్మ కదిలింది. కళ్ళునులుపుకుంటూ నేనిలా మంచం దిగేనో లేదో 'సూరిబాబు లేచాడా అండీ:' అంట్లూ ఎదురింటి చిట్టిబాబు ప్రత్యక్ష్యం. 'మిలట్రీకిగాని దరఖాస్తు చేస్తున్నారా ఏమిటర్రా, మరే తెల్లారకుండా కవాతు

ప్రారంభించి మమ్మల్ని కాల్చుకు తింటున్నారూ:'' అంటుంది అమ్మ నవ్వుతూ.

చిట్టిబాబు మునిసిపల్ స్కూల్లో ఎనిమిదో క్లాసు చదువుతున్నాడు. నామీద ఎంత భక్తివున్నా రోజంతా నాతో తిరగడానికి వాడికి కుదరదు. వాడిలాంటి వాళ్ళతో తిరగడం నాలాంటి వాళ్ళకి గొప్పతనమే. బొత్తిగా పొడుంకాయ అంతే వున్న నాకు, చిట్టిబాబులాంటి బుడంకాయ సైజుగాళ్ళు దొరకడం అదృష్టం కాదూ: కాని ఏం లాభం? ఎంత ట్రైచేసిన నాకా స్కూల్లో సీటు దొరకలేదు. బొత్తిగా ఏ నవంబర్లోనో బదిలీ అయి వస్తే వాళ్లు మాత్రం ఎక్కడ ఖాళీ చూపించగలరూ?

''పెద్దాడికయితే ఇంజనీరింగ్‌లో సీటొచ్చి వేరే ఊళ్ళో చదువుతున్నాడు, ఇబ్బంది లేకపోయింది. సమయం సందర్భంలేని మీ బదిలీలు కాదు గాని ఇప్పటికి యిది మూడోసారి యిలా సూరిగాడి చదువు దెబ్బతినడం, ఇప్పటికే యింటి పట్టున కూచుని ఆడారి కబుర్లు వంటబట్టి పిల్లాడు నాశనం అయిపోయాడు. ఊళ్ళో యిన్ని స్కూళ్ళు అఘోరిస్తున్నాయి. కొంచెం దూరమైతే అయింది. ఎక్కడో అక్కడ గట్టిగా పట్టుబడితే దొరక్కపోదు. అంతా మీకు బద్దకం. మరోసారి ప్రయత్నించకూడదూ!'
'

అని అమ్మ ఎన్ని సార్లు మొత్తుకున్నా నాన్న పట్టించుకున్నట్టు లేదు. ఆ ఊళ్లోనే బ్యాంకులో పనిచేస్తూ, శలవలకో పండుగలకో మా యింటికి భోజానానికి వచ్చే మా అమ్మకి దూరపు చుట్టం, దీనికి జవాబు చెప్పేవాడు:

''ఇదిగో చెల్లెమ్మోయ్, నీ చిన్న కొడుక్కి యీ దిక్కుమాలిన స్కూళ్ళలో సీటు దొరకలేదని నువ్వేం గాభరాపడకు, పేరుకి పధ్నాలుగేళ్ళు వెళ్ళేయో లేదో గాని ఏ పెద్దవాళ్ళకీ లేని జ్ఞానం మనవాడికుంది. కాస్త మంచి టీచర్ని చూసి ప్రైవేటు పెట్టిస్తివా రెండేళ్ళలో మెట్రిక్, స్టేట్ ఫస్ట్ కొట్టేస్తాడు. అమ్మో అలా కనిపిస్తున్నాడనా, చీమ మిరపకాయ, సీమటపాకాయ:''

ఎవరేం అంటేనేం, యింట్లోనే వుండి ప్రైవేటుగా చదువుకోడంగానే మిగిలింది నా పని. మధ్యాహ్నం మూడు తర్వాత మేష్టారు వచ్చి ఓ రెండు గంటలపాటు చెప్పి వెళ్ళిపోతారు. నిజానికి పాఠాల విషయం ఎప్పుడూ నాకు బెంగలేదు. మేష్టారు చెబుతున్నప్పుడే అంతా అలా జ్ఞాపకం వుండిపోతుంది. ఆయన ఎంత హోంవర్కు ఇచ్చినా ఓ గంటకన్న ఎప్పుడూ ఎక్కువ పట్టదు. నాకు వచ్చిన ఇబ్బంది చదువు కానేకాదు. ఆ మాటకొస్తే స్కూల్లో చదువుకునే పిల్లలే నా దగ్గిర కొచ్చి చెప్పించుకొంటారు మరి? రోజంతా నాతో ఆడుకోడానికి ఎవరూ లేరు. ఏం తోస్తుంది! ఇప్పుడయితే పై ఊర్లో వుంటున్నాడు గాని యిక్కడ వున్నప్పుడయినా అన్నయ్య నన్నెప్పుడూ అటకి తీసికెళ్ళేవాడు కాదు., నాలాంటి 'గొటిక్కాయి'తో అడ్డం వాడికి నామోషీట. చెల్లెలితో అడుకోమంటుంది అమ్మ ఒంటి మీద లాగు వుంటే విప్పేసే దాకా గుక్క పెట్టే పసిముండ, నా కర్మ కాలిపోనూ, ఆదా నా ప్లేమేటు!

మా బ్యాంకి మామయ్యే అనేవాడు:

''రచయిత అవుతాడో రాజకీయ నాయకుడే అవుతాడో నీ చిన్న కొడుకు, వీడు చూసే చూపులకీ వీడు వేసే ప్రశ్నలకీ తట్టుకోలేకుండా వున్నానమ్మోవ్, చెల్లెమ్మోయ్.... అన్నిటికన్న ఆ భాషాజ్ఞానం వుందే....''

మామయ్య మాటలు ఎంతమటుకు నిజమో నేను చెప్పలేను. ఎప్పుడూ ఏదో ఒకటి అలా

ఆలోచిస్తూ వుండడం మాత్రం నాకు అలవాటయిపోయింది. ఒంటరితనం - అంటే తగిన పనీ పాటూ లేక అస్తమానూ ఒక్కణ్ణి వుండవలసి రావడం - బొత్తిగా చికాకుగా వుండేది. 'అబ్బా, యింత చిన్న వయసులో యీ కుర్రాడికి ఎన్నెన్ని తెలివితేటలమ్మా:' అని అందరూ అంటూంటే అమ్మా బామ్మా మురిసిపోయేవారు. నిజంగా అలాంటివి వుంటే గింటే అవి ఏం చేసుకోవాలో తెలియక ప్రాణం విసుగెత్తి పోయేది. అందులోంచి పుట్టినవే అనుకుంటాను యీ ఆలోచనలు.

ఈ పెద్దవాళ్ళు పిల్లలకి తగిన పని చెప్పరు. పోనీ మనమటుకు మనం ఏదో విధంగా కాలం గడుపుతూ వుంటే చూస్తు ఊరుకోకూడదూ చెప్పండి, అడుగడుగునా రూల్సు ఒకటీ, 'అలా మాటాడకూడదు, ఇలా చెయ్యకూడదూ' అనుకుంటూ ఏం చెయ్యాలో చెప్పరు, ఏం చెయ్యకూడదో అదే చెబ్తారు అదే చేసి తీరాలనిసిస్తుంది.

"బావా, నీ కొడుకు "టీనేజ్'లో పడ్డాడు. అందులో స్కూలుకి వెళ్ళకుండా యింట్లో ఎంత సేపూ కూచుంటే యీ వయసులో యింతటి 'బ్రిలియంట్ ఫెలో'కి ఎలాంటి 'డేంజరస్ ఇంప్రషన్స్' అయినా పడవచ్చు. చెల్లాయి కంగారుపడుతుందని అలా చెప్పేనుగాని, సూరిబాబుని ఏదో ఓ ప్రైవేటు స్కూల్లో పడెయ్యడమే మంచిది."

అని ఆ మామయ్యే చెప్పబోతే

'నేనూ అలాగే అనుకుంటున్నాను గాని, చూశావా, నాకు ఊపిరి పీల్చుకోడానికైనా టైం ఏదీ' ' అని నాన్న కొట్టి పారేశారు.

దాన్తో నా ఆలోచనా ధోరణికి ఏ అడ్డూ లేకుండా సాగింది. అయినా మా పిల్లలకి అడ్డేమిటి? పెద్దవాళ్ళు, 'చందమామ' చదువుతూంటే మేం 'వార పత్రిక సీరియల్స్' చదువుతాం. అన్ని రకాల సినిమాలూ యించుమించు అందరం చూస్తాం. ఒక్క ముక్కలో చెప్పాలంటే పెద్దలు చెప్పే నీతులే మాకు ఒళ్ళుమంట. బొత్తిగా మాటలురాని పాపాయికి కూడా ఏం చెబుతారో చూడండి. 'ఏదీ తప్పు చూపించమ్మా' అని కదా! ఆ పాప ముక్కు మీద నిలువుగా వేలుపెట్టి చూపిస్తే ఎంతో సరదా పడిపోతారు. 'ఏదీ ఒప్పు చూపించూ' అనరేం? దానికి ముక్కు మీద అడ్డంగా వేలు పెట్టే ఏర్పాటో ఏదో లేదేం?

నిజంగా వద్దన్న పని చెయ్యడంతో ఎంత హుషారు ఉందీ! 'ఇంటిపట్టున ఏం అల్లరి చేస్తున్నావురా సూరీ!' అంటుంది అమ్మ.

నాన్న కాగితాలు రాసుకునే బల్ల వుంది చూశారా, దాన్ని తల్లకిందులుగా చేసి పల్లకీగా మార్చి, అందులో చెల్లాయిని కూచోబెట్టి ఓ పక్క నేనూ ఓ పక్క రాంపండూ పట్టుకుని పెట్టిన కూత పెట్టకుండా అరుస్తూ, చెప్పులైనా విప్పకుండా వీధిలోని మట్టి అంతా యింట్లో చేరుస్తూ, వంట గదిలోంచి దేవుడి గదిలోకి, ఓ పదిసార్లైనా ఊరేగందే ఎందుకేండీ, మా రామదండు వుంది?

'ఓర్నాయయనో, సూరిబాబు తండ్రోయ్..... నువ్వు ఏదైనా చెయ్యగాని, డాబామీద వేరే చేటలో దూరంగా ఎండబెట్టుకున్నాను చూశావూ, ఏవి, నా మాగాయి ముక్కలు, అవి మాత్రం ముట్టుకోకు. పెద్దదాన్ని, పళ్ళులేవు. ఏటికేడాది అవే నాకు ఆధారం. నా నోట్లో మట్టికొట్టకునా యన్నాయన......''

అని బతిమాలుతుంది బామ్మ.

సరిగ్గా అదే మధ్యాహ్నం బామ్మ కునుకు తీస్తున్న వేళ డాబా మీద కాళ్ళు కాలుతూ వుంటే ఆవిడ చెప్పిన ప్రత్యేకమైన చేటమీదే నిలబడి, పుల్లని ఓ ముక్క బుగ్గలోకి తోసి, ఆ రుచికి తట్టుకోలేక నోటిలోంచి దారకట్టిన లాలాజలం చుక్క చుక్కా చేటని తడుపుతూండగా, అందులోని ఓ టెంక అందుకుని అక్కణ్నుంచి పక్క సందులోని స్వీపర్ కుర్రాడితో రింగ్ టెన్నిస్ ఆడుకోకపోతే ఎందుకంట మా కుర్రసజ్జు!

ఇలాంటివి ఏవో కొన్ని చిన్న చిన్న ముచ్చట్లు మే చడీచప్పుడూ లేకుండా తీర్చుకోవాలని సరదాపడితే అనవసరంగా యీ పెద్ద వాళ్ళే 'ఇల్లు తీసి పందిరి వేస్తున్నామని' మాకు లేనిపోని పేర్లు అంటగట్టడం బాగుందా?

మరి మా యింట్లో వాళ్ళే అలాంటివాళ్ళో లేక అందరు పెద్దవాళ్ళూ అంతేనో నాకు తెలీదుగాని, ఈ మధ్య నెలలకొద్దీ యింటిపట్టున వుండి పోయి బాగా చూస్తే నాకు ఒక్కటి మాత్రం స్పష్టంగా తెలిసిపోతోంది.

ఎవరూ లేరనుకుని మా పక్కింటి పంతులమ్మ నూతిదగ్గర బట్టతడుపుకుంటూ వుందనుకోండి. నేను పొరపాటున అలా వెళ్ళబోతే 'ఒరి వెధవా, తప్పుకాదూ అలా, ఆడాళ్లు స్నానం చేస్తూంటే చూడొచ్చా? అంయ్" అంటాడు మామయ్య, నిజమే నన్ను వెనక్కితోసేసిన పెద్దమనిషి తను అక్కణ్నుంచి కదలక పోగా యింకా అటే అడుగులు వేస్తాడేం? అదేం పోయేకాలం!

అంటే, ఏవన్నమాటా?

పెద్దవాళ్ళం అయిపోతే హాయిగా కావలసినన్ని తప్పులు చెయ్యవచ్చునన్న మాట. తప్పులు చేసే స్థితికి ఎదగాలంటే ముందు పిల్లలంతా వీలయినంత త్వరగా పెద్దవాళ్ళుగా ఎదిగితీరాలన్న మాట. ఇవన్నీ నేనూ, చిట్టిబాబు మరికొందరం చిన్నవాళ్ళం రోజుల తరబడి ఆలోచించాం.

"ఒరే, ఎల్లకాలం యిలా మరీ చిన్నపిల్లల్లా మనం వుండిఫోబట్టే కదరా పెద్దవాళ్ళకి లోకువయిపోయింది.... అందుకని మనందరం ఏం చేయ్యాలంటే....." పెద్ద వాళ్ళుగా త్వరగా అయిపోయే అన్ని ప్రయత్నాలూ మెదలెట్టడమే!"

ఆ మాట గట్టిగా అనుకోడమే తడువు, మా జట్టు జట్టంతా శీతాకాలం అవనీండి, చీకటిపొద్దుకానివ్వండి ఆ తెల్లవారుఝాము నుంచే ఎక్సర్‌సైజ్ ఆరంభించాం.

ఇలా నేను చెప్పుకుపోతుంటే "యీ కుర్రాడికేం పనీ పాటూ లేదుకాబోలు, అందుకే తీరి కూచుని యిలా పెద్దవాళ్ళ మీద దండెత్తుతున్నాడు" అని మీరు అనుకోవచ్చు. దానికి నేనేం చెయ్యలేను. సరిగ్గా మాటలురాని మా చెల్లాయిని ఒక్కదాన్ని తప్పిస్తే మా యింట్లో పెద్దవాళ్ళందరి సంగతీ ఒక్కలాగే వుంది. మరి మీ అందరి యిళ్ళల్లో ఎలా వుందో చెప్పడం నా వల్ల కాదు. మా ఫ్రండ్సందరూ మాత్రం నేను చెప్పిందే రైటంటున్నారు.

ఇంతగా నాకు ఒళ్ళు మండిపోయిందంటే దానికి ముఖ్య కారణం మరొకటుంది. మా ఎదురింటి కాంపౌండరుగారి ఆఖరబ్బాయి వేణు అయిదో తరగతి చదువుతున్నాడు. వాడి తెలుగు వాచకంలో "పంచ సూత్రవళి" అనే చిన్న నీతి పాఠం లాంటిది ఉందిట. దాన్ని కంఠతా పెట్టి అప్పజెప్పమన్నారుట. ముందుగా నా దగ్గరికి వచ్చి అప్పచెప్పేవాడు. ముందే చెప్పేనుగదా ఓసారి చదివేస్తే వెంటనే ఏదైనా నాకలా గుర్తుండిపోతుందనీ .... వేణు వెళ్ళిపోయినా ఆ సూత్రాలు అలా వరసగా నాకు జ్ఞాపకం

వుండిపోయాయి. అవన్నీ ఎంతవరకు మా ఇంట్లో పాటిస్తున్నారో మొట్టమొదట చూడదల్చుకున్నాను. అందులో అన్నిటికన్న మొట్టమొదటి నీతి యిదీ:

"ఆడి తప్పరాదు."

అంటే అబద్ధం చెప్పకూడదని అర్థంట.

దేవుడి సృష్టిలో ఉపయోగం లేనిది ఏదీ లేదంటారుకదా, ఉపయోగించడానికి కాకపోతే మరి యీ 'అబద్ధం' అనేది ఎందుకంట? వాడకపోతే ఏ పదమైనా, వస్తువయినా తుప్పుపట్టిపోదూ: అందుకే అనుకుంటాను మా యింట్లో పెద్దలందరూ దీన్ని ఎంతో భక్తిశ్రద్ధలతో పాటిస్తారు:

"మీ వారికి ఎంత జీతం?" అని అడగనియ్యండి. ఎవరైనా, మా అమ్మ సరిగ్గా రెట్టింపు చెబుతుంది.

"మీ వయసెంత వదినగారూ!" అని అడిగారనుకోండి ఏ మాత్రం తడువుకోకుండా సరిగ్గా సగం చెబుతుంది.

" మీ యింట్లో ఎందరండీ జనం?" అని అడిగితే వచ్చే జవాబు ఎప్పుడూ ఆ సందర్భాన్ని బట్టి మారుతూ వుంటుంది. రేషన్ కార్డు ఇస్తామని అడిగారనుకోండి. అప్పుడు మా కుటుంబ సభ్యులతో పాటు మా దాసీదీ దాని యిద్దరు పిల్లలూ, పాలవాడూ వాడి తల్లిదండ్రులూ మాతో కలిసిపోతారు! అదే టైఫాయిడు యింజక్షన్ యిస్తామని వచ్చారనుకోండి. ఎప్పుడో పోయిన మా తాతగారి పేరుతప్ప, మా కుటుంబం మొత్తం మీద ఒక్కటంటే ఒక్కపేరు రికార్డుకి ఎక్కదు!

అయినా గాంధీ పోటో, రాముడివిగ్రహమూ మా అందరి ఇళ్ళల్లోనూ వుంటాయి. హరిశ్చంద్రుడి నాటకం అంటే పిల్లలతో పాటు పెద్దవాళ్ళకి కూడా ఎంతో గురి, తన లేగదూడకిపాలిచ్చి, అన్న మాటప్రకారం పులి దగ్గరకి వచ్చిన ఆవుకథ మాకు ఉగ్గుపాలతో సహా నూరిపోస్తారు.

ఆ కథే ఓ పెద్ద అబద్ధం. ఏ పులి అయినా దగ్గరకొచ్చిన ఆవుని చంపకుండా విడిచిపెడుతుందా!

తక్కినవాళ్ళ మాటకేంగాని యీ విషయంలో మాత్రం మా అన్నయ్యకి పట్టుదల ఎక్కువ.

" అలా ఏపుగా ఎదిగిపోయాడు, గాని మా పెద్ద మనవడికి పదిహేడు వెళ్ళలేదు."

అని మా బామ్మ ఎదురింటి దొడ్డమ్మగారితో చెబుతూంటే విని ఊరుకోలేకపోయాడు.

"మా బామ్మకి తెలీకే చెబుతూందో లేదా తన కంటికి మే యింకా పిల్లలుగానే కనిపిస్తామో: మొన్న నాగులచవితికే నాకు పందొమ్మిది వెళ్ళిపోయాయండీ దొడ్డమ్మగారూ:"

అని ఆ మధ్య శలవలకి వచ్చినప్పుడు అన్నయ్య అంటూంటే ఎంతో ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగేయి. అభిమానమూ గౌరవమూ పెరిగిపోయాయి. ఆ తర్వాత కూడా మళ్ళీ మళ్ళీ జాగ్రత్తగా పరిశీలించాను. ఒక్క నిజంకోసం దేనికైనా సిద్ధపడే మనిషి మా అన్నయ్యే అని అందరితోటి గర్వంగా చాటేవాణ్ని.

ఆ రోజుల్లోనే చిన్న తమాషా జరిగింది.

మా వీధి చివర డాక్టరుగారొకరు వుండేవారు. వాళ్ళకి ఒకే ఒక అమ్మాయి. మా వీధిలోంచే రోజూ కాలేజీకి వెడుతూ వుండేది. ఓ సారి ఆ అమ్మాయి మా అన్నయ్య కంట పడింది.

అంతకు ముందు శలవలకి వచ్చినప్పుడల్లా మా అన్నయ్య మధ్యాహ్నం భోంచేసి పడుకుంటే మరి నాలుగింటికే లేవడం. ఇప్పుడు నిద్రా గిద్రా జాంతానయ్, భోంచేస్తున్నప్పుడు కూడా ఎంత

సేపూ వీధి మీదే దృష్టి.

అసలు ఆ వీధి గది మా బామ్మది, నడుంవాల్చినంతసేపు వాల్చి అదే కుక్కి మంచాన్ని ఆ వీధి గది కిటికీ ఎత్తుకువచ్చేలా కింద ఇటికెలు పెట్టుకుంటుంది. అందుమీద ఆ ఊచలు పట్టుకు కూచునేది. ఎప్పుడైనా అల్లరిపెడితే మా చెల్లాయికి తప్ప మరొకరికి అక్కడ చోటు లభించేది కాదు. మడిగట్టుకుని తను వేరే పెట్టుకున్న ఏ ఊరేసిన ఊసిరికాయనో ఆ బుగ్గనుంచి యీ చివరకి మార్చుకుంటూ, ఆ కిటికీలోంచే వీధిభాగం ఎంత కనపడితే అంత, గుడ్లుఅట్నించి యిటు మారుస్తూ, చూస్తు వుండేది. ఊరికే చూస్తు వుండేదా: ఉహుం ఏ రోజు మంచిదో ఏ రోజు కాదో అక్కణ్నుంచే చెప్పేది. ఏ కురుపుకి ఏ ఆకునూరి వేస్తే తగ్గుతుందో అక్కణ్నుంచే సలహా యిచ్చేది. ఏ యిద్దరు దెబ్బలాడుకున్నా ఆ కిటికీలోంచే తీర్పు యిచ్చి విడిపించేది. నిజానికి అక్కణ్నుంచి దేశాన్ని పరిపాలించమన్నా ఆవిడ సిద్ధమే. అయితే అంత నిమషాల మీద ఆవిడకి అక్కణ్నుంచి బట్వాడా జరుగుతుందని మే ఎవరం అనుకోలేదు!

ఆ వీధి గది మా అన్నయ్య ఆక్రమించేశాడు.

శలవలు అయిన తర్వాత తనకి పరీక్ష వుందనీ, ఆ గదిలో తప్ప చదువుకోడానికి మరో చోట బాగుండదనీ మా బామ్మతో మూడు రోజులపాటు పెద్ద దెబ్బలాట పెట్టుకుని ఆఖరికి సాధించాడు.

అంతేకాదు......

బామ్మ అటూ ఇటూ తిరుగుతూంటేనూ చెల్లాయి ఏడుస్తూంటేనూ తన చదువు పాదయిపోతోందని ఇలా భోజనాలు అయిపోతాయో లేదో అటు వీధిలోకి వచ్చేసి ఇంకెవరూ ఇటు రాకుండా వీధి వైపు తలుపు గడియపెట్టేసేవాడు.

మా ఎదురింటి చిట్టిబాబుకి కూడా క్రిస్మస్ శలవలే మరి. ఇంట్లో ఆడాళ్ళతోపాటు యీ విడిఖైదు అనుభవించడానికి నాకేం ఖర్మం : భోజనం అవగానే పుస్తకాలు తీసుకుని ఎదురింటి చిట్టిబాబుగారి మేడ ఎక్కేసేవాణ్ని. ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్న డాక్టరుగారమ్మాయికి మాత్రం ఏవో ప్రయివేటు క్లాసులో ప్రాక్టికల్సో వుండేవిట. ఒక్క ఆదివారం తప్ప ఇంచు మించు ప్రతిరోజూ ఆ వీధిలోంచి వెళ్ళేది. ఆ మేడమీద కిటికీలోంచి కిందకి చూస్తే నాకూ చిట్టిబాబుకీ రోజుకో కొత్తరకం 'సినిమా' కనిపించేది.

అన్నయ్యా, నువ్వేదో పెద్ద ఆదర్శప్రాయుడవనుకున్నాను. ఇంట్లో అబద్ధంఆడని పెద్ద మనిషివి నువ్వొక్కడవయినా వున్నావని సంబరపడ్డాను. పాపం ఆ ఆడ కూతుళ్ళని వెర్రి వాళ్ళని చేసి యిదా నువ్వు చేసే పనీ? పాపం నీకు పరీక్ష వుందా ? దానికోసం మధ్యాహ్నం ఓ రెండుగంటలయినా చదివి తీరాలా : ఏమాత్రం డిస్టర్బెన్సూ పనికిరాదూ? ఇంతకీ మా అన్నయ్య ఎన్ని విధాలుగా ట్రై చేసినా ఆ అమ్మాయిని ఒక్క మాటయినా మాట్లాడించలేక పోయాడు. ఆ తర్వాత మా యింట్లో ఏదో మాటలో మాటొచ్చి 'పాపం' ఎంత చక్కగా వుంటేనేం, భగవంతుడు ఏదో ఓ కొరత పెడుతూ వుంటాడు, ఆ డాక్టరుగారమ్మాయి మూగట కదూ:' అనుకున్నారు.

ఆ మాట మా అన్నయ్య చెవిలో పడనే పడింది. 'ఇక్కడ నా చదువేం సరిగ్గా సాగడం లేదు' అంటూ ఇక నాలుగు రోజులకి కాలేజీలు తెరుస్తారనగానే రైలెక్కేశాడు: ఇంకేం సాగుతుందీ?

ఆ మర్నాటినుంచీ మళ్ళీ మా బామ్మ తన రాజ్యం తను ఏలడం ఆరంభించింది. ఇక ఆ

వీధిలో హోడావిడికి ఏం లోటు ? దేశాన్ని పాలించే స్థితికి ఎక్కడ ఎదిగిపోతుందో అని, చెప్పకేం, నాకీ బెంగ పట్టుకుంది!

"అసభ్య పదములు ఉచ్చరించరాదు" - అంటే ఏమిటీ? అని ఓనాడు వేణుగాడు నన్ను అడిగాడు. ఎంత అలోచించినా నాకూ తెలీలేదు. కాని నాకూ తెలీదంటే నన్ను ఎంతో పెద్దగా చూసుకుంటున్న కుర్రకుంకవాడు బాధపడతాడు కదా: అందుకని ఓ ఉపాయం ఆలోచించాను. 'చూడు వేణూ, ఇప్పుడు అర్జంటుగా నేను మార్కెటుకి వెళ్ళాలి. ఇంట్లో పంచదార అయిపోయింది. సాయంకాలం రా, తప్పకుండా చెబుతాను' అని వాణ్ని పంపించేశాను. ఈ లోగా అదృష్టవశాత్తూ మామయ్య మా యింటికి వచ్చాడు.

"ఏంరా బృహస్పతీ, మొహం అలా పెట్టేవ్, మళ్ళీ ఏం అనుమానం వచ్చిందేం?" అని అడిగాడు.

"అసభ్య పదములు అంటే ఎలాంటివి మామయ్యా?"

"ఇదిగో ఇలారా చెబుతాను."

అంటూ గబగబా రెండక్షరాల పదాలు కొన్ని చెవిలో ఊదేడు. 'ఛ, ఛ తప్పుకాదూ, అలాంటి మాటలు అనొచ్చా?' అని పైకి అన్నా, 'మరోసారి ఆ ముక్కలు చెవిలో పడితే ఎంత బాగుణ్ను! నామటుకు నేనే నా నోటితో ఆ తేనె చినుకులు వల్లిస్తే ఎంత హాయిగా వుండును!' అని మాత్రం మనసు పీకకపోలేదు. నాకే కవిత్వం వస్తే

భాషా ప్రవీణా! వన్నుమోరు!

స్వేచ్ఛాజీవీ ! జోహారు!!

అని గేయాలు అల్లుదునేమో! ఇంతకంటే ఇప్పటి తెలుగు సినిమా పాటలు బాగున్నాయా అని!

"ఎందుకురా అలా వెర్రెత్తినట్టు చూస్తావ్? అసభ్య పదములు అంటే యిప్పుడు నేను ఉదాహరణలు యిచ్చానుకదా, ఏక సంతాగ్రాహివి నీకు బోధపడిపోయే వుంటుంది. సులువుగా చెప్పాలంటే బూతుమాటలు అన్న మాట పూర్వకాలపు వెర్రివాళ్ళు వర్ణక్రమం పిల్లలకి నేర్పేటప్పుడు "అమ్మ, ఆవు" అంటూ మొదలెట్టేవారు. ఇప్పటి పిదపకాలపు పిల్లలకి ఒకళ్ళు నేర్పర్కర్లేదు. బురద గుంటల్లోంచి దోమల సంగీతం దానికదే పుట్టుకొచ్చినట్టు ఒకరు చెప్పకుండా వాళ్ళమటుకు వాళ్లే మొదలెడుతున్నారు. "అమ్మా, ఆలీ" అంటూ. అక్కడితో ఊరుకున్నాడా? వాళ్ల పాప చదువుకుంటుంటే స్పష్టంగా విన్నాట్ట.

ఏమిటి?

ఏ ఫర్ ఎబార్షన్

బి ఫర్ బాయిఫ్రెండ్

సీ ఫర్ కండోమ్

డీ ఫర్ డైవోర్సు ....

నేను రెండు చెవులు మూసుకున్నాను. ఇంగ్లీషులో నేనా తెలుగులో కూడా ఈ స్వేచ్ఛ ఉందా?

అంటూ పెద్దగా నవ్వుకుంటూ వెళిపోయాడు!

మా యింట్లో చిన్న తెలుగు డిక్షనరీ వుంటే తీసి చూశాను. అసభ్యపదములు అంటే కేవలం లంజా, లమ్డీ, ఇలాంటివే కాదుట, వినడానికి అసహ్యం కలిగించే కఠినమైన అన్నిరకాల అనకూడని మాటలూ అందులోకే వస్తాయిట. తాగుబోతు పేలాపన ఒకటేకాదుట, మనం మాటాడుకునే మాటల తీరు చాలా వరకు అసభ్యకరమైనదేనుట నాకేం సరిగ్గా బోధపడలేదు. ఆ తర్వాత ఒకే ఒక్క రోజు జాగ్రత్తగా చూశాను. మా వాళ్ళ ధోరణి అలాగే వున్నట్టుంది సుమండీ!

"తలుపు తియ్యవే" అని నాన్నగారు ఎపుడూ పిలవరు.

"ఎక్కడ చచ్చావే దరిద్రపు ముండ!" అంటాడు.

"ఎందుకలా అరుస్తారు?" అని అమ్మ అడగదు.

"దెయ్యంపట్టినట్టు ఎందుకా గింజుకోడం?" అంటుంది.

"చిన్న విషయానికి ఎందుకలా పోట్లాడుకుంటారు?" అని సర్దిచెప్పాలని బామ్మ అభిప్రాయం అయివుంటుంది. కాని పైకి చెప్పే తీరు మాత్రం అలా వుండదు.

"తద్దినం మంత్రం చదివినట్టు అలాగేనుట్రా అబ్బాయీ పెళ్ళాన్ని పిలవడం? పోనీ వాడు మొగాడూ, ఏదైనా అన్నాడే అనుకో, పూనకం వచ్చినదాన్లా అలాగేనుటే మీద పడడం! సంసారాలంటే ఇలాగేనా, ఎంత సరసంగా ఆఘోరించాలీ!

ఇదిగో ఇంత మృదువుగా మాటాడుకుంటారు మావాళ్ళు!

"ఆ హెడ్మాస్టరు చచ్చినాడు మా పిల్లాడ్ని పాస్ చేశాడు గాదు"

"ఆ నర్సుముండ వస్తానని దగా చేసింది."

"ఆ కంట్రాక్టరు దరిద్రుడు ఓ పట్టాన దొరికి చస్తేనా?"

"ఆ తాసిల్దారు ముండాకొడుకు పెర్మిటు ఇచ్చాడు కాదు."

ఇలా ఎవరిగురించి యింట్లో చెప్పుకున్నా చివర్న ఓ అభరణం తగిలించి మరీ చెప్పుకుంటారు.

బూతుమాటల లాంటివే ఇంత మధుర మధురంగా వుంటే, బూతుదృశ్యాలు ఆవెంత కన్నుల పండుగగా వుంటాయో! అవి పెద్దవాళ్ళకి మాత్రమే చూడ్డానికి అవకాశం యిస్తారుట. అలా ఇచ్చిన సినిమా 'పెర్మిషన్‌కి 'ఏ సర్టిఫికేటు' అంటారుట. అంటే అడ్డమైన బట్టిప్పుకున్న బొమ్మలూ చూడ్డానికి పెద్దవాళ్ళకి మాత్రమే లైసెన్సు వుందన్నమాట.

ఇంతకన్న ఘోరం వుందా ప్రపంచంలో !

మాకు ఏ అవకాశాలూ లేకుండా చేసి, కొన్ని నీతులు చెప్పి, నోరునొక్కి ఇంట్లో కూచోబెట్టి చిన్న పిల్లల్ని చేసి ఇంతగా మోసం చేస్తారా!

మాకేనా అంత తెలివితేటలు లేనిది?

"చూడు సూరీ, తల్లి అంటే ఎవరనుకున్నావ్, సాక్షాత్తూ దైవస్వరూపం, పదినెలలూ నిన్ను మోసి, కని, ఎన్నో కష్టాలకోర్చి నిన్ను యింతటివాణ్ని చేస్తుంది. ఆవిణ్ని అలా కష్ట పెట్టవచ్చునా?"

అని ఓనాడు నాన్నగారు నన్ను కూచోపెట్టుకుని బోధించారు. ఆ ముందురోజు ఎవరో స్నేహితురాళ్ళుట, మధ్యాహ్నం వేళ అమ్మని చూడ్డానికి వచ్చారు

వాళ్ళు వచ్చేసరికి మా చెల్లాయి నానా అల్లరీ పెట్టేసింది. అప్పుడే లేచిందేమో ఎన్ని విధాల ఊరుకోబెట్టినా లొంగలేదు. 'చూడు సూరీ, దీన్ని కొంచెం అలా వీదిలో తిప్పి ఆడించమ్మా!' అని

అమ్మ చెప్పిన మాట నిజమే. కాని ఆ రోజే ఏవో కొత్త ఫిల్ము ముక్కలు కొట్టుకొచ్చాననీ అద్దం సినిమా వేసుకుందాం రమ్మనీ పక్కవీధి పట్ ఫట్‌ఖాన్ కబురంపించాడు. వీధి పిల్లలందరూ ఎప్పుడో అక్కడికి చేరేరుట. 'గురూ, జరూర్' అంటూ అప్పుడే మూడోసారి 'మాకు మాత్రమే బోధ పడే ఈల సందేశం' పంపించాడు చిట్టిబాబు. ఇంకెలా తట్టుకోను! అయినా వచ్చిన ఆడాళ్ళిద్దరూరాడార్పులా వున్నారు. ఇటు మా అమ్మకాక బామ్మ ఒకటిగదా! ఎంతసేపూ 'మీ యింట్లో యివాళ ఏం వండుకున్నారు వదినా!' అని సాగదీసుకుని మురిసిపోకపోతే నలుగురు పెద్దాళ్ళు వున్నారు, ఒక్క పసిముండని దార్లోకి తెచ్చుకోలేరూ?

ఇలాంటి చోట వాదించి లాభంలేదని ఇది వరకటి నా అనుభవమే పాఠం చెప్పింది. అంతే, చల్లగా పలాయన మంత్రం పఠించాను, పెరటిదారిన.

సహజంగా అమ్మ నాన్నగారికి కంప్లైయింటు ఇచ్చి వుంటుంది. దాని ఫలితమన్న మాట ఈ పాఠం.

"......అందుచేత నేను చెప్పేదేమిటంటే అమ్మ ఏదైనా పని చెప్పినప్పుడు అలా పారిపోకు తల్లిని ఏడిపించవచ్చునా, ఏం చెబుతున్నారు మీ స్కూల్లో?......"

నేను చెప్పలేను. ఎందుకంటే నేను స్కూలికి వెళ్ళడం లేదుగదా! వేణుగాడి స్కూల్లో మాత్రం ఈ పాఠం బోధిస్తూ వుండి వుండవచ్చును.

అవును.

హఠాత్తుగా నాకు గుర్తొచ్చింది. వేణుగాడి తెలుగు వాచకంలోని పంచ సూత్రావళిలో మూడోది ఇదే " కన్నతల్లి మనసు కష్టపెట్టరాదు."

"ఛ. ఎంత పొరపాటు చేశాను పొద్దుట్నుంచీ రాత్రిదాకా అలా యింట్లో అందరికీ చాకిరీ చేస్తూనే వుంటుంది అమ్మ, ఎప్పుదో మరీ తప్పనప్పుడు తప్ప, నాకు పనే చెప్పదు. పాపం చెల్లాయి ఎంత విసిగిస్తే నా మీద నాన్నతో చెప్పిందో! ఇంటిలో నాకేం పనా పాటా? ఈ రోజు మొదలు అమ్మ అడక్కుండానే సాయం చెయ్యాలి."

అని నిమషాల మీద నిశ్చయానికి వచ్చేశాను.

దానికి తోడు ఆ రాత్రి అమ్మా నాన్నతో 'మాతృ దేవత' సినిమా చూశాను నేను. అందులో ఆ కన్నతల్లి పడిన కష్టాలు చూస్తే నా కన్నీళ్లు ఆగలేదు. కొంతసేపటికి ఎలాగో ఆపుకుని అటూ ఇటూ చూశాను. సినిమాహాలు సినిమా హాలంతా ఏకమొత్తంగా ఏడుస్తోంది. అందరికంటె దుఃఖం పట్టలేకపోయింది మా నాన్న, అమ్మ దెబ్బలాడింది. "ఊరుకోండీ మరీ అలా బెంబేలు పడిపోతే ఎలా? పైకలా రాయిలా కనిపిస్తారుగాని మీ నాన్న మనసు ఉత్తి వెన్న సూరీ!" మరోసారి ముగ్గురం కలిసి బావురుమన్నాం.

ఆ రాత్రి చెల్లాయీ అమ్మా నాన్నా వేరే గదిలో పడుకున్నాక, నేను బామ్మ పక్కలో కూచుని 'కొంచెం గోకవూ?' అన్నాను. 'నువ్వూ సినిమాకి వస్తే బావుణ్ను బామ్మా, చెల్లాయి ఎక్కడ లేచి ఏడుస్తుందో అని ఇంటిలో వుండిపోవాలా? ఆ ఏడుపేదో దాన్తో పాటు హాయిగా అందరం ఏడుద్దుమా! చాలా గొప్పగా ఏడిపించారు. అంత బాగా తీశారనుకో.'

అని సినిమా కథ టూకీగా చెప్పేను.

"నాన్నగారు అంత కోపంగా కనిపిస్తారా పైకి, ఆ సినిమాలో తల్లి బాధలు చూడలేక అంత

మనిషీ కుంగిపోయారనుకో."

బామ్మ ఆశ్చర్యంగా చూసింది నమ్మలేనట్టు.

"నిజం బామ్మ, సరస్వత్తోడు, అందరూ మానేసినా ఇంకా చాలా సేపు నాన్న వెక్కి వెక్కి ఏడుస్తూనే వున్నారు.

"ఊళ్ళోవాళ్ళ తల్లులందరి బాధా పాపం మీ నాన్నదే, ఇంటిలో వున్న కన్నతల్లి ఎలా చచ్చినా బాధలేదుగాని!"

నే అనుకున్నవి అబద్దాలు చేస్తూ బామ్మ యింకా చాలా చెప్పింది.

"నువ్వింకా చిన్నవాడివీ, చెప్పినవన్నీ సరిగ్గా అర్థమవుతాయోలేదో! పోనీ జ్ఞానం వచ్చిన ఆ పెద్ద మనవడి ముందు మొరపెట్టుకుందామంటే వాడికి పై ఊళ్ళో చదువాయె. ఇంటిపట్టున వున్న రోజుల్లో అయినా వాడికి నాకూ పడి చావదాయె ఇక కోడలంటే అది పైదీ. దానికేం వీపా కడుపా? ఇంకా ఆ మాటకొస్తే అదే నయమేమో! నడుం వంగిన దాన్నని నా మీద దయదల్చి పాపం యింటి చాకిరీ అంతా ఇంచుమించు అదే చేసుకొస్తోంది. ఏమైనా పై ఇంటిది మన ఇంటిదెందుకవుతుందీ? చూసి చూసి నా సిగ్గు చిమిడిపోనూ, నా బాధ దాన్తో ఏం చెప్పుకోనూ అందుకని నీతో చెప్పుకోక తప్పలేదురా సూరీ యివాళ అద్దైనా తెలిసో తెలీకో, నువ్వే కదిపేవు కాబట్టి."

అంటూ నా వీపు గొకుతూ బామ్మ ఇంకా యిలా చెప్పుకొచ్చింది: 'కన్న కొడుక్కి లేకపోయింది, యిక గుంటవెధవ్వి నీతో చెప్పుకుని ఏం లాభం! అంతా నా భ్రమ. ఏ మంచీ చెడ్డా కావలసివచ్చినా వీధి వీధంతా నన్ను అడుగుతారు. ఇంట్లో మాత్రం నాది కుక్క బతుకు.....'

అవతలి గదిలో జోడు గుర్రాల స్వారీ వినిపిస్తోంది. అమ్మా నాన్నా పోటీలు పడి గుర్రుపెడుతున్నారన్నమాట. అది వినడమేమిటి, బామ్మ లేచి కూచింది. రంగంలోకి దిగిపోయింది,'ఇటు తిరుగు ఇంకా సరిగ్గా గోకుతాను' అంటూ బామ్మ సినిమాకి రాకపోవడానికి కారణం చెల్లాయి కానే కాదుట. ఆ ముండ రోజంతా నానా న్యూసెన్సూ చేసినా పిట్టలతో పడుకుని పువ్వులతో కళ్లు విప్పుతుందిట. బామ్మకి యిప్పుడు కళ్ళు సరిగ్గా కనపడ్డం లేదుట. ఎన్నిసార్లు చెప్పినా నాన్నగారు కళ్ళజోడు కొనరట. దానికి ముందు కళ్ళు పరీక్ష చేయించుకోవాలిట. అదంతా 'బోలెడంత తతంగమూ కొప్పెట్టినంత ఖర్చూట.

'ఈ బాధంతా యీ రోజుల్లో యెవరుపడతారు నాయనా? నన్నిలాగే వుంచేస్తే, మీ నాన్నకి సినిమా టిక్కెట్టు ఖర్చు కలిసొస్తుంది గదా! ఏదో యింకా తన్ని తగలెయ్యకుండా యింత ముద్ద పెడుతున్నాడు, అదెంత కాదు, ఏవంటావ్?'

"నిజమేగాని గోకడం స్పీడు యెక్కువ చేశాన్, మంట పెడుతోంది. ఇంత సరిగ్గా గోకక్కర్లేదు తగ్గించు బామ్మా!"

నా మాటలు ఆవిడ వినిపించుకున్నట్టు లేదు. ఇటు నోటితో పాటు అటు చేతికీ పని యెక్కువ చేస్తూనే వుంది, నేను 'అమ్మోయ్' అంటూ లేచి కూచుని ఆవిడ రెండు చేతులూ పట్టుకున్నాను!.

కాస్సేపటికి చెప్పవలసినవేవో ఫులిస్టాపు కామా లేకుండా పూర్తిచేసి, బామ్మ అలసిపోయి నిద్రపోయింది. నాకు మాత్రం నిద్ర పట్టలేదు. ఆ ఊపున దెయ్యం బరికినట్టు వీపంతా గోకేసిందేమో ఒకటే మంట, అదిగాక ఆవిడ చెప్పిన భోగట్టాకి తట్టుకోలేక పోయింది నా మనస్సు. అన్ని రకాల దురదా ఒక్కమారే వదిలిపోయింది.

నాన్నకి ఎనిమిదేళ్ళుండగా తాతగారు పోయారట. పాపం బామ్మే అష్టకష్టాలు పడి నాన్నని చదివించి యెవరో తెలిసినవాళ్ళ కాళ్ళు పట్టుకుని ఉద్యోగం వేయించిందట. ఇప్పుడు మేం వుంటున్న యిల్లు బామ్మకి వాళ్ళ వాళ్ళు ఇచ్చిందేనట.

"ఏదో మాట వరసకి నువ్వు అడిగావని అన్నానుగాని సూరీ, కాటికి కాళ్ళు చాచుకున్న ముండని సినిమా చూడాలని నాకేం ఏడుపులేదు సుమా! వారం వారం కోవెలకి వెడతాను. అరటిపళ్ళూ ఊదొత్తులూ అన్నీ కలసి మహా అయితే రూపాయి అవుతుంది. 'నెలకి ఆడక్కుండా నా మొహాన్న అయిదు రూపాయిలు పడెయ్యరా' అని బతిమాల్తాను. ఇచ్చిన నెల యిస్తాడు, యివ్వని నెల యివ్వడు. ఏం చెప్పమన్నావు మీ నాన్నగారి మాతృభక్తి!"

అనే బామ్మ మాటలు నా చెవిలో గింగురు మంటున్నాయి.

'కన్న తల్లి మనసు కష్టపెట్టరాదు' అంటే సినిమా చూసి చీదిపారెయ్యడం వరకేనా?

ఒక్క నాన్నగార్నే కాదు, అన్నయ్యని చూస్తేకూడా నాకు ఓ విషయం బాగా తెలిసొచ్చింది. ఇంట్లో ఆడాళ్ళు ఎంత చాకిరీ చేసినా మొగాళ్ళ మాటే చెల్లాలి. ఆ సంగతి గ్రహించిన దగ్గర్నుంచీ నాకు మా అమ్మా బామ్మా అంటే గౌరవం ఎక్కువైపోయింది. వాళ్ళు చెబితే మాత్రం ఏ పనైనా వెంటనే చేసెయ్యాలి అనుకున్నాను. అయితే మొగాళ్ళయితేనేం, ఆడావాళ్ళయితేనేం ఈ పెద్ద వాళ్లు అంత సులువుగా మాట దక్కనిస్తారా!

"సూరిబాబూ! పంచసూత్రావళిలో నాకు నాలుగో నీతి వచ్చేసింది సుమా!" అన్నాడు వేణుగాడు ఓనాడు.

"ఏదీ అప్పజెప్పూ!" అన్నాను.

"మరి పుస్తకం పట్టుకుచూడూ కరెక్టో కాదో!"

"అక్కర్లేదు అప్పజెప్పవయ్యా ఆంజనేయా!" అన్నాను. చెప్పేడు. "లేని వారిని నీచముగా చూడరాదు."

రైటే దాన్ని ఆచరణలో పెట్టడంలో మా పిల్లల వరకూ కరెక్టే. ఈ మధ్య మూడేళ్ళయి వరసగా కుదర్లేదుగాని అంతకు ముందు నేనూ హాయిగా అందర్తో పాటు బడికెళ్ళేవాడినే. అదంతా నాకు గుర్తు వుండనే వుంది. వీడు మా కంటే తక్కువ కులం వాడట అయినా యేమాత్రం తేడా లేకుండా ఒకే బెంచీమీద కూర్చుని చదువుకునేవాళ్ళం, స్కూలుకి వెళ్ళినా వచ్చినా జటపటాలు వేసుకునేవాళ్ళం ఇప్పుడూ మే ఆడుకునేటప్పుడు యిలాంటి భేదాలు యేవీ పాటించడం. పెద్దగా ఎంగిలి పట్టింపులు కూడా మా పిల్లల్లో వుండవు.

"పెద్దవాళ్ళలో మాత్రం అలాంటి తేడా లెక్కడున్నాయి?" అని కోతలు కొయ్యకండి. మీ తేడాలన్నీ అలా యేర్పడ్డవే.

"ఒరే రిక్షా కడతావా?" అని అడుగుతారు.

"ఎక్కడకి వెడతారండీ,!"అంటాడు వాడు.

చూశారా? మీరు యెక్కేవారు, అందుకనే 'ఒరే' అన్నారు. వాడు తొక్కేవాడు, అందుకనే 'అండీ' అంటున్నాడు. ఇదంతా యేదో మామూలు విషయమైపోయి ఎవరైనా గుర్తు చేసేదాకా మనకి తెలీడం లేదు!

ఈ నీతి గురించి ఆలోచిస్తూ ఒక్కరోజు చూశానో లేదో మా యింట్లోనే ఎన్ని చిత్రాలు

బయటపడ్డాయని?

వంటచేసే మా అమ్మ అన్ని సదుపాయాలూ వున్న శుభ్రమైన వంట గదిలో చెప్పులేసుకుని నిలబడి, గ్యాస్ స్టవ్ మీద కుక్కర్ మీద వండుతుంది. అంట్లుతోమే అప్పలమ్మ పాకీదొడ్డి పక్కన యిటికమీద చతికిలబడి మేం తిని విడిచిపెట్టిన యెంగిలి గిన్నెలన్నీతోమి, కడిగి, తుడిచి యిస్తుంది. అమ్మ కష్టానికి పాకెట్ మనీగా నూర్రూపాయలూ, అప్పలమ్మ చాకిరీకి పదిరూపాయలూ, నాన్నగారు యిస్తారు. బాగుంది. ఎక్కడైనా అమ్మా, అప్పలమ్మా ఒకటౌతారా? అని అడుగుతారు యెవరైనా, కావాలని కాదు. నిజంగా అమ్మ చేసేది అంత గొప్ప పనీ, అప్పలమ్మది అంత పనికిమాలినదీ అయితే, ఒక్క రోజు అది నాగా పెడితే అంత గోలచెయ్యడం దేనికీ? నాన్నగారు నెలకి మూడు నాలుగయినా 'ఫ్రెంచి లీవులు' పెట్టేస్తూ వుంటారట. దిక్కులేని దాసీ ముండ తన కొడుకు యెక్కడికో పారిపోయాడంటే దానికోసం పెద్దగా యింత అల్లరా!

"అవునే అప్పలమ్మా! పోనీ పోనీ కదా అని ఊరుకుంటే నాకు జవాబు చెప్పేటంతగా నువ్వు తయారయ్యావా?"

అంటూ అమ్మ తగులుకుంది కదా, మరి చెప్పలేను!

"పోనీ యే రోగమోవస్తే అదో మాట గుంటవెధవ యెక్కడికో పారిపోయాడనీ, వెదికి తీసుకొచ్చానని నువ్వు చెబితే నమ్మాలి మేము. అనుమానంవచ్చి ఆ మాట అన్నామో "మీకు మాత్రం యిబ్బందులు రావా అమ్మగారూ!" అంటూ ఎంత మాట పడితే అంత మాట అనెయ్యడానికి సిద్ధం. అవునే, మాదే తప్పు పాచిపనిచేసే జాతి మీది ఎంగిలి మెతుకులు యేరుకునే బతుకులు మీవి. మిమల్ని అలాగే వుండనియ్యక కాఫీలూ, టిఫిన్‌లూ యిచ్చి మాతో సమానంగా చూసుకోడం తప్పు కాదూ! పాత చీరలూ అవీ పడేసి అందలం యెక్కించడం నేరం కాదూ?" అంటూ ఛెళ్లూ ఛెళ్లూ లెంపలు వాయించుకుంది. పాపం గుడ్ల నీరు కుక్కుకుని, ఎంతో పెద్ద తప్పు చేసిన దాన్లా అప్పలమ్మ అక్కడే నిలబడిపోడం యెప్పుడూ గుర్తుంటుంది నాకు. డబ్బులేని వాళ్ళని యింతగా అవమానిస్తూ ' లేనివారిని నీచముగా చూడరాదు' అని సూత్రాలు వల్లించడానికి మన పెద్దవాళ్ళకే చెల్లింది.

మనిషి యెలా వుంటుందని నన్ను అడక్కండిగాని మా బామ్మ గొంతుక మాత్రం చాలా బాగుంటుంది.

ఎమ్. ఫిల్. చేసింది ఆవిడ.

అంటే మూడో క్లాసు ఫేలయింది.

అలాంటిది అన్ని పద్యాలు అంత స్పష్టంగా యెలా వచ్చాయో!

భాగవతంలో కిష్టుడి కొంటె చేష్టలు వర్ణించే పద్యాలు మరీ బాగా చదువుతుంది.

"ఓ యమ్మ నీ కుమారుడు

మా యిండ్లను పాలు పెరుగు మననీడమ్మా.

అనే పద్యం చదువుతూ వుంటే భక్తి పారవశ్యంతో ఆమె కళ్ళు మూతలుపడి పోతాయి. అలాంటి ఒకానొక సమయం కనిపెట్టి కొంగున డబ్బులు విప్పుకుంటే "ఎందుకురా ఆ దొంగ



బుద్ధులూ, అడిగితే నేను యివ్వనూ!''

"ఇవ్వవనా! అదో సరదా! అందులో ఎంత మజా లేకపోతే ఆ కిష్టుడే యిలాంటి పన్లు చేస్తాడూ? ఇంతకీ యిరుగు పొరుగు యిళ్ళల్లో దొంగతనాలకి నేను బయల్దేరలేదు కదా! మరి కాస్త పెరుగు వెయ్యమంటే యింట్లోనే వెయ్యరే. యిక మా కుర్రాళ్ళం యేం కావాలని?''

"ఆఖరికి ఆ కిష్టపరమాత్మని యెత్తిపెట్టే దాకా వెళ్ళిందిట్రా నీ బుద్ధి, అవ్వ! యింట్లో వుంటే పాడైపోతాడని మీ నాన్నకి యెంత చెప్పినా వింటేనా?''

అంటూ బుగ్గలు నొక్కుక్కుంది.

"తప్పు నాయనా, ఆలోచించకుండా మాటాడకూడదు. కిష్టపరమాత్మ యేంచేసినా మనకి తెలీని యేదో అర్థం వుంటుంది. అవన్నీ అవతారపురుషుడి లీలలు.''

"అవున్లే, జైల్లో పుట్టినవారికి దొంగబుద్ధులు కాక మరేం అబ్బుతాయి?''

బామ్మ కొట్టబోతే నేను తప్పించుకుని నవ్వుతూ దూరంగా నిలబడ్డాను.

"నోటి కెంతొస్తే అంతా అనెయ్యడమే! లెంపలేసుకో కళ్ళు టప్పున పేలిపోగలవు. మళ్ళీ చదువు కూడా చెబుతున్నావు ఎందుకూ? మీ పంచసూత్రావళిలో ఆఖరి నీతి ఏమిటి? "దొంగతనము చేయరాదు'' అని కాదూ? మనదికాని వస్తువుని కోరడం, దొంగిలించడం మహాపాపాలలో ఒకటి. ఇదెప్పుడూ మరచి పోకు.''

ఎలా మరచిపోతాను?

అంత గొప్ప నీతిని ఉపదేశించిన పుణ్యాత్మురాలు అదే రోజు చేసిన పని - స్పష్టంగా నా కళ్ళయెదుట పడితే - బొత్తిగా చిన్నికిష్టుడి చిలిపిపని అని యెలా కొట్టిపారెయ్యను?

ఆ రోజు సీతాఫలాలు అమ్మకానికి వచ్చాయి. చంకన ఓ మూడేళ్ళ కొడుకుని ఎత్తుకుని యెవర్తో అమ్మి బుట్టడు పళ్ళు అమ్మకానికి తెచ్చింది . బాగా పెద్ద పళ్ళు.

"నాకు చెయ్యి తీరికలేదు అత్తయ్యా, మీరే మంచివి యెంచి ఓ డజను తీసుకొండి.. అంటూ అమ్మ డబ్బు యిచ్చి చెల్లెలికి అన్నం తినిపించడానికి లోపలికి తీసికెళ్ళింది.

నేనూ పళ్ళు యెంచుతానంటే 'అక్కర్లేదు నీ పనేదో నువ్వు చూసుకో అని బామ్మ కసిరికొట్టింది. నేను దూరంగా కుర్చీమీద కూచున్నాను. ఎదురింటి నుంచి తెచ్చిన వీక్లీలో బట్టలులేని బొమ్మలు పత్రిక చూస్తున్నాను. అయినా నా దృష్టంతా యిటే వుంది, యెప్పుడు ఓ పండు అంకించుకుందామా అని.

ఓ అరగంటసేపు పళ్ళమ్మిని కిందా మీదా పెట్టింది బామ్మ డజనూ తీసుకుంటానంటే రెండ్రూపాయిలకి యిస్తానని ఎలాగైతేనేం పళ్ళమ్మి ఒప్పుకుంది. ఇంకేం, కోడలు యిచ్చిన రెండ్రూపాయాలూ సరిగ్గా సరిపోయింది. ఇదిగో డబ్బు, బుట్ట ముందుకి జరిపి నువ్వు కొంచెం వెనక్కి జరగు మంచివీ నాక్కావలసినవీ నేనే యేరుకుంటాను. నువ్వలా మీద మీదకి రాకు దూరం' ' అంటూ పన్నెండు పళ్ళూ యెంచి ఓ పక్కగా పెట్టింది బామ్మ.

'అమ్మ నా కొడుకోయ్' అని అరిచింది. పళ్ళమ్మి కొడుకు కనపడక ఇంట్లోకి బుట్టతెచ్చి దించినప్పుడే వాణ్ణీ దించింది. నడకొచ్చిన వెధవ. ఎక్కడికి పోయాడో! నేనూ పళ్ళమ్మితోపాటు వీధిలోకి వెళ్ళేను. ఎవరో గోళీలు ఆడుతూంటే చూస్తున్నాడు వాడు. పిర్రమీద ఒక్కటిచ్చి వాణ్ణి

యెత్తుకుని లోపలికి తీసుకొచ్చింది. అప్పుడే అప్పలమ్మ వస్తూంటే దానిచేత బుట్ట నెత్తిమీద కెక్కించుకుని అమ్మకం కేకవేసుకుంటూ వెళ్ళి పోయింది.

అది కొడుకుని తెచ్చుకునే లోగా యింట్లో కనికట్టు జరిగిపోయింది.

బామ్మ ఎంచిపెట్టిన డజను పళ్ళూ వేరే పళ్ళంలో కనిపిస్తూనే వున్నాయి. వేరే ఓ మూల బీరువా చాటున యెత్తుగా యేదో కనిపించినట్టయింది. చటుక్కున వెళ్ళి బామ్మగావంచా తీశాను.

అదనంగా రెండు సీతాఫలాలు! దొంగని పట్టుకున్నట్టు కోపంగా బామ్మ కళ్ళలోకి చూశాను. ఆవిడ నదరలేదు బెదరలేదు. పైగా అంటుందీ

'ఎంత దౌర్జన్యమూ దురన్యాయమూ కాకపోతే రూపాయికి ఆరు పళ్ళేమిటి? ఇలాంటి పాపిష్టి ముండలకి యిలాగే బుద్ధి చెప్పాలి. దొంగతనం కాదని ఎక్కడుందంట? పొద్దున్నే ఏ తోటలో దూరి దొబ్బుకొచ్చిందో!"

❋ ❋ ❋

ఇంట్లో వుండి యిలాంటివి చూస్తున్న కొద్దీ వాటికి అలవాటుపడిపోయి మొదట్లో యీ తప్పులు మామూలు విషయాలుగా తోచసాగేయి. 'క్రమంగా యిలాంటివి మనమూ ట్రైచేస్తే యెంత బావుణ్ణు' అనే స్థితికి చేరుకున్నాం మా కుర్రాళ్ళ మందరం.

పెద్దలూ!

చాక్లెట్సులాంటి యీ అయిదు సూత్రాలు మాకు యిచ్చారు.

1. ఆడి తప్పరాదు.
2. అసభ్య పదములు ఉచ్చరించరాదు.
3. కన్నతల్లి మనసు కష్టపెట్టరాదు.
4. లేనివారిని నీచముగా చూడరాదు
5. దొంగతనము చేయరాదు.

ఇవి మాకు ఇచ్చినందుకు సంతోషంగా స్ట్రాంగు బిళ్ళలలాంటివి మరి రెండు మీకు బహుమతి యిస్తున్నాం, తీసుకోండి.

1. మీరు పాటించలేని నీతులను పిల్లలకు చెప్పరాదు.
2. మీ అడుగుజడలలో నడిచిన పిల్లలను దండించరాదు.

ఏదో మా నెత్తి మీద రుద్దుతున్నారని కోపంతో యిలా అన్నాం కాని, మీరొక్క మొట్టికాయ వేశారంటే మూడు రోజులు మాడు అదిరిపోతుంది.మాకు తప్పులు చేస్తూ శిక్షపడని లైసెన్సు సంపాదించాలంటే మే త్వరగా పెద్దవాళ్ళం కావడమే మార్గం. అందుకే 'సామూహిక వ్యాయామ క్రీడలు' ప్రారంభించాం. ఒకరికి నీతులు చెబుతూ హాయిగా బతికే స్థాయికి మమ్మల్ని త్వరగా చేరుకోమని పెద్దలందరూ మమ్మల్ని దీవించండి.

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక దీపావళి సంచిక)*

# పిచ్చితల్లీ, వెర్రి మారాజూ!




**'పుణ్య దంపతులు'** అనే పేరుతో ఆ మధ్య ఓ స్త్రీల మాసపత్రికలో వరసగా ఓ శీర్షిక వేశారు. ప్రత్యేకించి ఆ శీర్షికలో వచ్చిన ప్రతీ భార్యామణీ సదరు శ్రీవారి ద్వితీయ కళత్రమే అని కొందరు కిట్టనివారు జోకు. వాళ్ల సంగతెందుకుగాని ఆదర్శదంపతులంటే పార్వతినీ వెంకట్రామయ్యనీ చెప్పుకోవాలనీ ఆ వీధి వీధంతా సర్టిఫికేటు ఇచ్చింది.

సొంతిల్లు అన్యాక్రాంతం అయిపోతోందని కంపల్సరీ రిటైరుమెంటు తీసుకువచ్చేశాడు గాని వెంకట్రామయ్య కింకా ఏభై అయినా రాలేదుట. ఆ రోజుల్లో కాబట్టి పదహారు రాకుండా మూడు ముళ్ళూ పడిపోయి వెంట వెంటనే ఇద్దరాడపిల్లల్నీ కనేసిందిగాని పార్వతికీ నలభై దాటి ఉండదు. రెండేళ్లై స్వగృహంలో కాలుపెట్టినా వాళ్లేమో వాళ్ల పనులేమో అంతే! కింది భాగం బాగుచేయించుకున్నారు. పైన కూడా ఓ గది వేయించుకున్నారు.

ఎప్పుడు చూసినా ఆ పార్వతి ఏదో పని చేస్తూనే ఉంటుంది. రెండో అమ్మాయికి కూడా పెళ్లి చేసి అత్తారింటికి పంపేశాక ఇక ఇంట్లో ఇద్దరే కదా అనుకుందో ఏమో, పని మనిషినయినా

పెట్టుకున్నట్టు లేదు. చేతిలో ఏ పని ఉన్నా ఎక్కడేం జరుగుతోందో అని ఆవిడ కళ్ళూ చెవులూ ఆరా తీస్తూనే ఉంటాయి. ఎవరితోనో ఏదో ఒకటి చెప్పుకోవాలనే ఆ ఇల్లాలి ముచ్చట ఏనాడూ తీరినట్టు లేదు. ఏళ్ల తరబడి పిల్లలతో కుస్తీ పట్టి రిటైరయి ఇంటి పట్టున ఉండే మొగుడైనా మనసు విప్పి తనతో మాటాడితే ఆసిడకాచింత లేకపోను. ఆ కళ్లమీద ఇంతింత దళసరి కళ్లద్దాలూ, ఆ చేతుల్లో ఎప్పుడూ ఇంతింత దుక్కలాంటి పుస్తకాలూ - ఇదీ వెంకట్రామయ్య నిత్య వ్యాసకం. పేరుకి ఏదో బజారు పని చేసొస్తాడు గాని వేరే కట్టించుకున్న సైడు రూములోనే అతనికి మోక్షమూ, స్వర్గమూ, పెళ్లాం గట్టిగా కేకేస్తే ఆ కళ్లజోడు తీసేసి ఇటు చూస్తాడుగాని ఆ చూపుల్లో ఆవిడ కోరే ప్రతిస్పందన ఉంటేనా?

చేసిన పనే మరోసారి చేసినా ఎంతో టైము మిగిలిపోతూ ఉంటుంది పార్వతికి. ఏదో నవలలూ అవీ తిరగేసే పాటి చదువు ఉందిగాని ఇరవై నాలుగ్గంటలూ మొగుడిలా అందులో కూరుకుపోవడమంటే ఆవిడకి మంటే. ఉద్యోగరీత్యా భర్తతో తిరుగుతున్నప్పుడు ఇంత అన్యాయం లేదు. వీధి అరుగు మీద నిలబడి ఎదురింటి పిన్నిగారితోనో, సందులోంచి పక్కింటి వదినగారితోనో కబుర్లు చెప్పుకుంటూ తెలీకుండానే కాలం దొర్లిపోయేది. సొంతిల్లు సుఖం బాగానే ఉందిగాని ఆ మాత్రం ఇరుగూ పొరుగూ సౌఖ్యం ఇక్కడ లేదు! తమ యింటికి ఎడం చేతి వైపు ఏదో ఆఫీసు. కుడి వైపున ఆనుకుని పెద్ద మేడయితే ఉందిగాని వాళ్లు బొత్తిగా అంతఃపుర స్త్రీలు!

తను ఇంటి మేడ మీద ఎందుకైనా ఉంటుందని ఓ గది వేసుకున్నారు. కేవలం ఓ గది మాత్రమే. తక్కిన అన్నిటికీ కిందికి దిగి సందులోంచి పెరట్లోకి రావలసిందే. శంకర్రావని, అతనికి ఆంధ్రా బ్యాంక్‌లో పనిట. పెళ్లాన్ని పురుటికి పంపించాట్ట. తీసుకొచ్చాక వేరే వాటా చూసుకుని వెళిపోతాట్ట. అందాకా ఈ ఆర్నెల్లూ ఉంటానని బతిమాలితే ఆ గది అద్దెకిచ్చారు. ఎన్నించి చూసినా పదే పదే చూడాలని అనిపించే అందగాడు ఆ శంకరం. పిలిచినా లోపలికి రాడు. వచ్చినా వంచిన తల ఎత్తడు. ఉన్న జాడా కన్న జాడా ఎరగని వాళ్లతో కబుర్లు కూడానా!

పక్కింటి పెద్ద మేడ బట్టల షాపు వాళ్ల రెండో కోడలు, తలుపు తట్టుకుని ఓనాడు తానుగా ఇంటికి వస్తే ఏదో పోయింది దొరికినట్టు పొంగిపోయింది పార్వతి. చూస్తే కన్ను చెదిరిపోయే అందం. ముట్టుకుంటే మాసిపోతుందేమో అనిపించే ఒంటి రంగు. ఏమైతే ఏం కావాలి, పది నిమిషాలు దాటకుండానే పార్వతి మనసుకి తెలిసిపోయింది. ఈ శాల్తీ కూడా 'పలుకే బంగారమాయెనా' బాపతు అని. రిటైరయిని లెక్కల మేష్టరని తెలిసి వెంకట్రామయ్య దగ్గిర ట్యూషను కొచ్చిందట, బియ్యేకి కడుతున్న ఆ అమ్మాయి, మీనాక్షి రావడం, ఈయనగారు చెప్పడం. ఈ 'బెల్లం కొట్టిన రాయి' ఏం బోధ పరచారో తెలీదు. ఆ 'గంగిరెద్దు' ఏం అర్థం చేసుకుందో తెలీదు.

ఇంటి యజమానీ, పైన అద్దెకున్న పెద్ద మనిషీ, ప్రైవేటు కొచ్చిన అమ్మాయీ 'ఇంత చేటు మాటకారి మనుషులవడం' చేత పార్వతికి వీధి గేటుని ఆశ్రయించక తప్పలేదు. వంటా పై పనీ అయిపోయాక కావలసినంత తీరుబడి. ఆ గేటు దగ్గిర కుర్చీ వేసుకుకూచుంటే ఎన్ని భోగట్టాలైనా తెలుస్తాయి. ఏ పాలవాడో, ఏ కూరల మనిషో, ఏ పేపరబ్బాయో అటూ ఇటూ వెళ్లక మానరు. తను నోరిప్పి అడగాలే గాని రోజుకో కొత్త సంగతి. అందులో పెద్ద మేడవాళ్ల పని మనిషికి అయిదు నిమిషాల నోరు మూత పడదు. కాస్త ఆవకాయ పచ్చడి అందిస్తే చాలు ఎక్కళ్లేని వార్తలూ ఊరించి

ఊరంతా రుచిమయం చెయ్యగలదు. ఎదురింట్లో ఏ రోజు బట్టలు ఆ రోజే ఉతికించుకుంటారుట. ఓ పాత గుడ్డ పారేస్తే చాలు ఆ చాకల్దాని నోట ఊడిపడని ఊసంటూ ఉండదు.

పాపం ఏమాట కామాటే చెప్పుకోవాలి, తక్కిన అందరి మొగాళ్లలా వెంకట్రామయ్య "చూడు, వంటింట్లోంచి ఏదో మాడు వాసన వస్తున్నట్లుంది," అని గాని, "ఇదిగో తలుపు లు బార్లా తీసుకుని అస్తమానూ ఆ వీధి వాకిట్లోనే అఘోరించకు" అని గాని సాధించడం ఎరగడు. పొద్దుట ఓ గంట మార్నింగు వాకూ, సాయంకాలం ఆంజనేయస్వామి గుడిలో పురాణ కాలక్షేపం - మిగిలిన సమయం అంతా తనేమో, తన పుస్తకాల పఠనమేమో, అంతే. 'గుమ్మం ఎదుట పట్ట పగలు హత్య జరిగినా అదేమా అని తొంగి చూడడు అదీ మావారి ప్రత్యేకత!' అనుకుని ఏడవలేక నవ్వుకుంటూ ఉంటుంది, పార్వతి.

పరీక్షలు దగ్గిర బడ్డ దగ్గిర్నుంచీ ఇప్పుడా మీనాక్షీ రావడం లేదు. అవి అయిపోయాక పండుగకి కన్నవారి ఊరెళ్లిన ఆ అమ్మాయి ఇంకా వచ్చినట్టు లేదు. మేడమీది శంకరం ఆ నెల అద్దె డబ్బు లిచ్చేసి గది కాళీ చేసి పదిహేను రోజులు దాటింది. ఆ ఇంటి రాకపోకలు ఆ మాత్రమూ బందయిపోడంచేత పార్వతి 'గేటు బైఠాయింపు ఉద్యమం' ఈ మధ్య ఏదో మొస్తరుగా వదిల్తే వదిలింది గాని ఆవిడ శ్రోతల సంఖ్య రోజు రోజుకీ పెరగజొచ్చింది. అక్కడికి మూడో యింటి సూరమ్మత్త కూడా తప్పని సరిగా ఎటెండెన్స్ వేయించుకుంటోంది. "అందరూ నోరున్న మూగి పీనుగులే ఉండరుగా లోకంలో!" అనిపించేది పార్వతికి. 'నేర్పంటూ ఉండాలే కాని ఏ ఎడారిని మాత్రం కల కల్లాడించలేము!' అనే స్థితికి వచ్చేసింది, అతి తొందర్లోనే.

డబ్బెట్టి ఆడితేగాని పేకాటకి జీవం రానట్టు అంతో ఇంతో వ్యభిచారం పాలు చేర్చందే ఏ రూమరుకీ గ్లామరు చేకూరదు. నీలి సినిమాలైనా, నీలాపనిందలైనా నాలుక్కాలాల పాటు బతికేది అక్రమ సంబంధాల సేకరణ వల్లనే. అయితే ఏ అడివిలోనో పిడుగు పడిందనే వార్త ఇచ్చే పైశాచికానందం సొంతకొంప నడికొప్పునే జరిగిందంటే కలగదు కదా! నమ్మలేని ఆ భోగట్టా చెవిన పడ్డ దగ్గిర్నుంచీ పార్వతి మనసు మనసులో లేకుండా పోయింది అందుకనే. 'ఇంత అన్యాయమా, ఇలా జరుగుతుందా ఎక్కడైనా!" అని కొట్టుకోసాగింది. ఒకటా రెండా పది రుజువులు చూపిస్తూంటే, వీధి వీధంతా కోడైకూస్తూంటే, ఎలా కాదనడం! చెవి చేరిన ఆ తప్పుడు మాట అక్కడితో ఊరుకుంటుందా, మరీ ఈ మధ్య పార్వతి అనే వక్త శ్రోతగా మారిపోయింది. క్రమంగా వాళ్లు చెప్పే కబుర్లు తన చెవికే ఎక్కడం లేదు, అలా వాళ్లేదో చెప్పుకుపోతున్నా తన ఆలోచనలేవో దొలిచేసే స్థాయికి చేరింది. రెండ్రోజులై గేటు మూసేసింది. కుర్చీ కూడా లోపలికి లాగేసింది - అంతటి సంచలన వార్తది మరి!

ఎవరో ముక్కూ మొహం తెలీని వాళ్లతో ఇంకా డిస్కస్ చెయ్యవలసిన సంగతి కాదది. కాదనలేని ఘాతకం. కొంగున కట్టుకున్న నిప్పు! శ్రీవారి చెవిన చేర్చేదాకా ఉండబట్ట లేదామెకి. అది విన్న దగ్గిర్నుంచీ, చెప్పకేం, వెంకట్రామయ్య దృష్టి కూడా ఆట్టే పుస్తకం మీద నిలబడ్డం లేదు!

తన మీద తనే చిరాకుపడే స్థాయికి చేరుకుంది పార్వతి. ఏనాడో చేసుకున్న పుణ్యం వల్ల ఈ మంచి ఇంట్లో పడింది. పెద్దలంటే గౌరవం, దేవుడంటే భక్తీ ఇంకా చావలేదు గనక ఏన్నాడూ మడి కట్టుకోనిదే తను వుండలేదు. దైవానికిన్ని పువ్వులు వెయ్యందే ఏ ఒక్కరోజూ చెంబ్బాడు మంచి నీళ్లయినా పుచ్చుకోలేదు. ఏదో అలా పవిత్రంగా గృహిణీ కార్యం నిర్వర్తించి, అన్నీ శుద్ధి చేసుకుని,

అన్ని పనులూ పూర్తి అయ్యాకే సుమా, ఏదో కాలక్షేపం లేక మడత కుర్చీ పట్టుకుని అలా వీధి గేటు దగ్గిర కాస్సేపు మేను వాలుస్తోంది. ఆ మాత్రం భాగ్యానికే. మరి అక్కడ చేరాలనిపించని అనూహ్యం, అసహ్యం చెవిన పడాలా! ఇక వానలు పడవంటే ఎందుకు పడతాయిట!

ఇవతలి సందు వైపు కిటికీ తెరిచి పక్కనున్న మేడింటి వాళ్ల కిటికీ తెరుచుకుంటే నోరారా సాటి మనిషిని పలకరించాలని పార్వతి మొదట్లో ఆశపడేది. లోపల్నుంచి అనేక శబ్దాలు వినిపించేవిగాని మాట వరసకైనా అవి తెరుచుకోలేదు. అటు వైపు అడ్డంగా ఏ వెదురు బద్దలు వేసి మరి తలుపులు తెరుచుకోకుండా దాన్ని బంధించారోగాని, ఏ వెలుతురూ ప్రసరించకుండా ఇటు వైపు ఇంత దళసరిని విండో కర్టెను కూడాను! ఆ తెరుచుకోని కిటికీ వైపు నిట్టూర్పులతో చూస్తూ కాలం గడిపింది. కాని సరిగ్గా తన నెత్తి మీద జరిగిన భాగోతం పార్వతి ఊహకైనా అందకుండా పోయింది. తమది ఒకే గదిగాని అవతలి మేడ మీద ముగ్గురి కోడళ్లకీ ఎవరికి వారికి వేరే వేరే పడగ్గదులూ, ఎటాచ్డ్ బాత్ రూములూనట. అందులో రెండో కోడలి బాత్‌రూమ్ తమ ఇంటి వైపు ఉంటుందిట. సరిగ్గా కింద మూసి ఉండే కిటికీ నెత్తి మీదే ఓ కిటికీ ఉంటే దాన్నీ క్లోజు చేయించి దానికి దగ్గిరగా మీనాక్షి బాత్రూం ఏర్పాటుట. అక్కడి బాత్‌టబ్‌లో పడుకుంటే మీనాక్షికి మరి లేవాలని ఉండదుట. ఎవరూ లేరు కదా అని, ఎండపడితే బాగుంటుందనీ ఓనాడు ఆ అమ్మాయి కిటికీ తలుపు ఓరగా తీసిందిట. ఏదో ఫైలు మరచిపోయి ఆ వేళ ఇంటికొచ్చిన శంకరం తన వైపు కిటికీ తలుపు తీస్తే ఎదుట పడిన దృశ్యం అదీ! నాలిక కరుచుకుని ఎవరికి వారు వెంటనే తలుపులు వేసేసుకుని ఉండాలి. ఆ చూపు బలం ఎంతటిదోగాని ఆ ఇద్దరి మనసుల్నీ ఓ ఊపు ఊపేసినట్టుంది. కలుస్తేగాని బతకలేమనే గాఢ స్థితికి చేరుకోడమే కాదు, అన్ని రకాల నీతి నియమాలకీ అతి త్వరలోనే తిలోదకాలిచ్చేశారుట.

ఈ భోగట్టా మొగుడికి చెబితే 'ఈ వీధి వాళ్లకి పనీ పాటు లేదు. మన పైవాడు ఎంత పోకిరీ మనిషైనా మగాడు. సంసారుల ఇంట్లోంచీ, సమిష్టి కుటుంబంలోంచీ వచ్చిన ఓ ఇంటి కోడలు ఇంతకి తెగిస్తుందంటే ఎవరు నమ్ముతారు! అందులో ఆ అమ్మాయి మూణ్ణెల్ల పాటు నా దగ్గిర ట్యూషను వెలిగించింది కూడాను. ఎప్పుడూ పమిట నిండుగా కప్పుకుని కూచొనేది. వంచిన తలేనా ఎత్తేది కాదు. లేనిపోని గాలి పోగు చెయ్యడం ఈ పని వాళ్లకే చెల్లింది. అయినా దగ్గిరుండి వీడియో తీసినట్టు!' అని కొట్టి పారేశాడు వెంకట్రామయ్య.

ఏదైనా రుజువు దొరక్కపోతుందా అనే ఆశతో మేడ మీద గది రెండ్రోజుల పాటు గాలించిన పార్వతి కృషి ఊరికే పోలేదు. శంకరం ఉపయోగించే చిత్తు కాగితాల బుట్ట అడుగున అతను పొరపాటున వదిలేసిన ఉండచుట్టిన ఓ కాగితం మీనాక్షి ఆంతర్యం పరచి చూపించింది. 'రెండ్రోజులై పిచ్చెత్తినట్టు చూస్తున్నాను. నీ నుంచి ఎలాంటి సిగ్నలూ అందక వెర్రెత్తిపోతున్నాను. నిన్నూ నన్నూ ఏ పిచ్చాసుపత్రి సింగిల్ రూమ్‌లోనో మరి రాకుండా పడేస్తే ఎంత బావుణ్ణు! బట్టల వ్యాపార నిమిత్తం మా శ్రీవారు ఇవాళే బొంబాయి వెళ్ళేరు. మళ్ళీ శుక్రవారం గాని రారు! నేను చెప్పించుకునే ట్యూషన్ అయీ అవగానే మా మేష్టారు పక్క గదిలోకి వెళ్లిపోతారు. ఆ వేళప్పుడు మా మేష్టారి పెళ్లాం మాంచి నిద్రలో ఉంటుంది. ఇంకో గంట నేనిక్కడ ప్రైవేటు చెప్పించుకున్నానన్నా మా వాళ్లెవరూ అనుమానించరు. చడీ చప్పుడూ లేకుండా మేడెక్కేస్తాను. ఈ నాలుగు రోజులూ శలవ పెట్టుకుని ఆ వేళకి రూంలో ఉండకపోయావో చంపేస్తాను, లేదా నేనైనా చస్తాను! అలా జరక్కుండా ఉండాలంటే ఆ గదిలోనే మనిద్దరం మన నట్టు చావడం, మనం బతకడానికి అవసరం!''

పిచ్చితల్లీ, ఊరిచా!

ఆ చీటీ చదువుకుని గుండెలు బాదుకుంది పార్వతి. అలా తీసుకొచ్చి మొగుడి చేతిలో పెట్టింది, 'ఇప్పుడేమంటారు?' అన్నట్టు.

"వీళ్లింతటి వాళ్లని కలలోకూడా అనుకోలేదు. పెళ్లై తండ్రి కాబోతున్న వెధవ, వాడి కింత జులాయి, తనమా! పోన్లే, మన గది కాళీ చేసి వెళ్లిపోయాడు. మరి వీధి వీధంతా గుప్పుమందంటున్నావు, మేడింటి పెద్దల చెవిని యిది పడిందో లేదో! మనం ఇందులో ఇరుక్కోడం అనవసరం. ఆ చీటీ ఎవరికీ చూపించకు, కొంపలు అంటుకోగలవ్. ఇక నువ్వు లోపలికి తగలడు" అంటూ ఆ కాగితం ఊడలాక్కున్నాడు వెంకట్రామయ్య.

"అయినింటి అమ్మాయిని లోపలికి రానిచ్చాఖగాని ఇలాంటి కొంపలు ఆర్పే కొరకంచని తెలిస్తే గుమ్మంలోనే చీపురు తిరగేద్దును. ఓ రోజా రెండ్రోజులా ఏకంగా మూణ్నెల్లు పాఠం చెప్పేరు. మీ పనేదో మీరు చూసుకునే వెర్రి మారాజు కాబట్టి నా కాపరం నిలబడింది గాని, హమ్మో, ఇంకేమైనా ఉందా!" అంటూ పార్వతి అక్కడ్నుంచి వెళ్లిపోయింది. ఆవిడ ఉదహరించిన వెర్రిమారాజుని మాత్రం ఆ సంఘటన నిలబడనివ్వలేదు. ఏదో కోల్పోయినట్టు అతని మనసు గిల గిల కొట్టుకుంది.

ఇదే గదిలో తన సమక్షంలో గంటలు గంటలు గడిపి వెళ్లింది ఆ అమ్మాయి. తన కూతురి వయసు కుర్రదనీ, పెళ్లి అయిన పిల్లనీ, తను ఉపేక్షించాడు గాని ఇంతటి మత్తెక్కించే ఉత్తరం రాయగల నెరజాణ అని ఎవరికి తెలుసు! పడుచుదనంతో పాటు పాటమరించిన కోరిక ఏ మనిషి కయినా పుట్టెడు పుల్లల్తో తప్ప బూడిద కాదు గదా! పైనున్న ఆడంగి రేకుల వెధవ తప్ప తను పనికొచ్చాడు కాదా! ఏభై ఏళ్లు రాకుండానే తనని ఎందుకూ పనికిరాని వాడని కొట్టి పారేసిందా! తన అభిప్రాయం ఇదని సూచనా ప్రాయంగానైనా చెప్పి ఏడిచిందా! ఒకర్ననుకోడం దేనికి! చేజేతులా ఛాన్సు ఒదులుకుని ఇప్పుడీ బట్టతల బాదుకుంటే ఏం లాభం! ఆడది 'సంయ్' అనాలే గాని ఎలాంటి పుస్తకమైనా విసిరేసి ఇలాంటి పుష్పకాన్ని 'రంయ్' మని చేరని మగాడుంటాడా! ఇంతకీ ఇటు వంటా అటు వాగుడూ తప్ప ఇంటి ఆడదానికి అప్పుడప్పుడూ 'ఆ బుద్ధి' అంటూ ఉంటే మగాడికి పై ఆటల మీద మనసవుతుందా? పిచ్చి తల్లిని కట్టుకున్నాను, అనుభవిస్తున్నాను, అంతే! - అంటూ విలవిల్లాడిపోయాడు వెంకట్రామయ్య.

వంటింటి కిటికీలోంచి నూతి చప్టా వైపు చూస్తున్న 'పిచ్చితల్లి' ఆలోచనలు మాత్రం ఆ వేళప్పుడు అదో రకంగా ఉన్నాయి. ఆ నూతి దగ్గిరే నీళ్లు తోడిపోసుకునేవాడు ఆ శంకరం. ఓసారి పొరపాటున తన కళ్ల బడిన ఆ 'నవ మన్మధాకారం' కళ్లు మూసుకున్నా తెరిచినా రోజుల్లా తనని వెంట బెట్టేది. 'ఛ, ఈ వయసులో ఇదేం బుద్ధి!' అనే పాప చింతతో ఎన్నిసార్లు లెంపలు వాయించుకున్నా నిగ్రహించుకోలేక పోయేది. పుస్తకాల పురుగైన మొగుణ్ణి తలుచుకుంటే అసహ్యంతో మనసు ముడుచుకుపోయేది. తన బతుకు కేవలం పోచికోలు కబుర్లకేనా పరిమితం! ఏనాడైనా అచ్చటా ముచ్చటా ఉంటే ఇలా ఈనాడు తను కంగారు పడునా! ఆడ పిల్లలికి తొందరగా పెళ్లిళ్లై అమ్మమ్మ అయిపోయి ఉండొచ్చుగాని నలభై ఏళ్లకే తను అవ్వ అయిపోయిందా! పెళ్లాం మీద బెంగెట్టుకున్నాడేమో అని భ్రమ పడిందిగాని ఇదిగో ఇలాంటి అభిప్రాయముందని ఒక్క ముక్క ముందుగా తన చెవిని వేస్తే... ఏమో... ఏం జరిగి ఉండునో!

*(రచన మాసపత్రిక, జనవరి 1993)*

# తల్లి పేగూ, పిల్ల వేరూ




**పక్కింట్లోంచి** మళ్ళీ కేకలు వినిపించాయి. నేనూ మేరీ ఒహరి మొహం ఒహరు చూసుకున్నాం. ఈ మంగమ్మకేం బుద్ధొచ్చినట్టు లేదు. తానా ఒంటరిది. అటువైపు వాళ్లా? తమ్ముడూ, పెళ్ళాం, పిల్లలూ మొత్తం నలుగురు. ఆవిడ తమ్ముణ్ణి కష్టపడి చదివించిన మాట నిజమే. పెళ్లి చేసి పంపించిన మాటా కరెక్టే. ఆనాడే కాదు, ఈనాడూ వాళ్ల నుంచి పైసా ఆశించింది లేదు. ఒక్క పూటైనా వచ్చి వండి పెట్టమని బతిమాలింది లేదు.

"మాతో వచ్చి ఉండవే అక్కా" అని తమ్ముడన్నాడంటారు.

"వాడి పెళ్ళాం అలా అననిస్తుందా" అని పెదవి విరిచేస్తారు కొందరు.

ఏం జరిగిందో మాకు అనవసరం. మాకు తెలిసింది మాత్రం ఆ ఇల్లూ ఆ ఊరూ మంగమ్మ విడిచి వెళ్ళదని. ఆ వీధి చివరి శివాలయం ఆవిడకి అర్థమూ ప్రాణమూ.

ఇరవై ఏళ్ళ కిందట జరిగిందిట అది. వాళ్ళాయన పత్రి కొయ్యడానికి మారేడు చెట్టెక్కి

పడిపోయాడట. పెద్ద దెబ్బే తగిలి, సెప్టిక్ అయి మరో పది రోజులకి కన్ను మూశాడట.

ఇప్పుడా చెట్టు కింద గుండ్రని సిమెంటు చప్టా ఉంది. మంగమ్మ రోజూ అక్కడికి వెడుతుంది. ఏదో ఓ సమయంలో ఓ అరగంటసేపు అక్కడ కూచుని ఇంటికి వస్తుందిట.

మొగుడు పోయినా ఆవిడకి డబ్బుకేమీ ఇబ్బంది లేదట. ఆవిడ మామగారు ఉన్నవాడే కాక, మనసున్న వాడు కూడానట. తమ్ముణ్ణి దత్తతకి తీసుకుందని ఏమాత్రం కక్ష కట్టలేదు. ఇల్లూ పొలమూ కోడలి పేర రాసి మరీ కాలం చేశాడట.

పొద్దున్నే తెల్లారనివ్వదు మంగమ్మగారు. తలారా స్నానం, మనసారా ధ్యానం. ఒక్కర్తేగాని హడావిడికేం తక్కువ? ఉపవాసాలు అభిషేకాలూ సరేసరి.

తిరగలి పట్టుకు కూచుని ఇప్పటికీ విసురుకుంటూ ఉంటుంది. రోలూ రోకలీ ఉపయోగిస్తూంటుంది, ఏదైనా దంచుకోవాలంటే.

ఆవిడకి దాసీ మనిషి అవసరమున్నట్లు కూడా లేదు. ఏ పని చేసినా పెద్దగా చప్పుడు చెయ్యడం ఆవిడకలవాటు. దాంతోపాటు ఊరెగిరిపోయే గొంతుక కూడాను.

ఆ పక్కింట్లో దిగిన మాకు మొదట్లో గొప్ప ఇబ్బంది అయేది. ఏ పని చేస్తున్నా నోరలా వాగుతూ ఉండవలసిందే. దాంతోపాటు అప్పుడప్పుడు పాట కూడా జోడిస్తూ ఉంటుంది. ఆ గొంతుక ఏమాత్రం బాగుండదు. అలా అని ఆ స్వరం ఆపడమనేది జరగదు. ఏ చంద్రశేఖరాష్టకమో అలా గొంతెత్తి గానం చేస్తూనే ఉంటుంది.

నీటితో పాటు మరో అవలక్షణం కూడా. విపరీతమైన మడీ, ఆచారమూ. ఎవరెక్కడ ముట్టుకుని ఆవిడ మడిని కొల్లగొట్టుకుపోతారో అని ఆవిడ భయం.

"దూరం.... దూరం" అని అరవడం ఆవిడ కలవాటు.

"తెలియక దిగేం. ఆ పొరుగున ఇక ఉండలేమండీ" అని మా మేరీ ఎన్నిసార్లు గోల పెట్టిందో! మత మౌఢ్యాన్ని కాదని హాయిగా బతుకుతున్నాం.

ఒక కులం, మతం కానివాళ్ళం రిజిస్టర్డు మేరేజి చేసుకున్నాం.

అయినవాళ్ళకి దూరం అయినా, మేమిద్దరం బాగా దగ్గరైనాం. బాగా ఫార్వర్డని మా నమ్మకం. మేమిద్దరం ఉద్యోగస్థులం. ఎంతో ఖర్చు పెట్టి ఎలాగో ఒకే ఊళ్ళో చేరి బండి లాగిస్తున్నాం. కాన్వెంట్‌లో వేశాం మా మెట్టిల్దాని. దానికి దగ్గరగా ఎలాగో ఈ వాటా సంపాదించాం. ఇది దొరకడానికే మా తాడు తెగింది.

పక్కింట్లో ఉన్నవాళ్ళు కూడా మాకు నచ్చాలంటే ఎలా కుదిరేను! కాని, "దూరం.... దూరం..." అంటూ మనుషుల్ని దూరం చేసుకునే ఈ మంగమ్మ ప్రభావాన్ని ఎలా తప్పించుకోవడం?

"పిల్ల పాడైపోతుందేమో" అనే మేరీ భయమే నాది కూడా.

చిన్నప్పట్నుంచే పిల్లలకి మంచీ చెడ్డా స్పష్టంగా తెలియాలి. దాని వ్యక్తిత్వ వికాసానికి తగిన మోరల్ సపోర్ట్ ఉంటే మంచిది. మంగమ్మ ఇన్‌ఫ్లూయెన్సుకి లోనైతే పిల్ల ఇంకెందుకైనా పనికొస్తుందా?

వేరే వాటా కోసం మేం ఎవరి మట్టుకు వాళ్లం గట్టి ప్రయత్నాలు ప్రారంభించాం. అంత సులువుగా దొరికి చస్తేనా!

ఇంతలో ఓ చిత్రమైన సంఘటన జరిగి మా నమ్మకాన్ని చెదరగొట్టింది.

ఈ రోజు కరెంటు బిల్లు కట్టడానికని హాఫ్‌డే లీవ్ పెట్టాను. ఇంటికొచ్చి తాళం తీస్తూంటే మంగమ్మ గొంతుక వినపడింది.

"ఏం ఉద్యోగాలో ఏం లోకమో... కడుపున పుట్టిన పిల్లల్ని ఇలా గాలికొదిలేసి ఈ తల్లిదండ్రులు ఉద్ధరించేదేమిటో?" ఆ గొంతుకతోపాటు బ్యాండుమేళంతో సన్నాయి వాద్యంలా "డాడీ, నేనిక్కడున్నాను, ప్లీజ్ కమ్ హియర్" అనే స్వరం వినిపించి గతుక్కుమన్నాను. ఆ గొంతుక మా అమ్మాయి మెటిల్డాది.

తీస్తున్న తాళం వేసేసి ఆ వైపు పరిగెత్తేను. పక్కింట్లో మంగమ్మ ఒళ్లో అది పడుకుని ఉంది. తర్వాత జరిగింది తెలిసింది.

స్కూల్లో ఉన్నప్పుడే మెటిల్డాకి బాగా జ్వరం వచ్చిందిట. ఎంతో భయం వేసిందిట. ఏమీ తోచలేదట. రిక్షా కట్టించుకుని ఎలాగో అలా ఇల్లు చేరిందిట.

గుమ్మంలోనే కళ్ళు తిరిగినట్లై కూలబడిపోయిందిట. ఆ మర్నాడు కార్తీక సోమవారం అని బండెడు పూజాసామాగ్రి పట్టుకుని అప్పుడే మంగమ్మ రిక్షా దిగిందిట.

ఆదరాబాదరా ఆ సరుకులోపల పెట్టించి మా అమ్మాయిని ఎత్తుకుని తీసుకుపోయిందిట.

నోరు అలా వాగుతూనే ఉంది గాని, మంగమ్మ తక్షణం ఆదుకోవడం మానలేదుట - మెటిల్డా ఒకటే చెప్పడం.

అప్పటికప్పుడు ఏదో కషాయం కాచి ఇచ్చిందట. ఏదో మందు తలకి రాసి మర్దనా చేసిందట.గంధప్పట్టు వేసిందిట.

వద్దని ఎంత బలవంతపెట్టినా కాళ్ళు పడుతూనే ఉందిట. దిష్టి కూడా తీసిందట.

దాంతో పాటు మమ్మల్నిద్దర్నీ తిడుతూనే ఉందిట. "తెల్లారితే చచ్చినంత పనుంది. ఇప్పుడిలా తగలడింది. ఈ గుడ్డలు తడుపుకోవాలి. ఇల్లంతా శుద్ధి పుణ్యాహవచనం చేసుకోవాలి. కర్మ" అంటూ ఏదేదో గొణుక్కుంటూనే ఉందిట.

ఇవన్నీ మాకిద్దరికీ చాలా అభ్యంతరకరంగా తోచాయి. కాని, ఆ సేవాస్పర్శతో పులకించిన మా మెటిల్డా అభిప్రాయం వేరు.

"మమ్మీ అయినా నాకెప్పుడూ ఇలా చెయ్యలేదు డాడీ."

ఆపదలో ఉన్న పిల్లని ఆదుకుంది కదా అని మా మేరీ థ్యాంక్సు చెప్పడానికి వెళితే, "చాల్లే - ఎలా అయితేనేం కన్నావు పిల్లని. మీద మీదకు రాబోకు. దూరం, దూరం" అని విసిరికొట్టింది.

ఏం పొగరుమోతు ఈ మంగమ్మ! ఎవరి అభిప్రాయాలు వాళ్ళకుంటాయి. పెడితే తింటారుగాని కొడితే పడరుకదా!

నిష్ఠానియమాలు శరీరానికేగాని మాటకి ఉండవా యేం? పెంచి పెద్ద చేసి, పెళ్ళి చేసిన తమ్ముడు అతడెవడోగాని దేశాలు పట్టిపోయాడంటే పోడా మరి!

ఇంతకీ ఈవిడింత "దూరం... దూరం..." అంటున్నా దగ్గిర దగ్గిరగా జరుగుతున్న ఈ చుట్టుపట్ల మూఢ ప్రజని అనాలి. లేపోతే ఆ వీధి వీధికంతటికీ ఈవిడొకర్తే పెద్ద దిక్కా?

ఓ వారం చెప్పినా, వర్జ్యం చెప్పినా, ముహూర్తం పెట్టించుకోవాలన్నా, మంత్రం వేయించుకోవాలన్నా, రక్షరేకు కట్టించుకోవాలన్నా ఈవిడొకర్తేనా వాళ్లకి కనపడిందీ!

పోనీ, ఇవన్నీ పిచ్చి నమ్మకాలని కొట్టిపారేద్దాం. ఈవిడ కొచ్చినన్ని ఊరగాయ రకాలు ఈ ఊళ్ళోనే ఎవరికీ రావట.

ఓ చక్కిలాలు చుట్టినా, ఓ మినపసున్ని కలిపినా అది నోట్లో వేసుక్కుంటే ఆ రుచి ఆ జన్మంతా ఉంటుందని పేరు.

ఇంతెందుకూ?

ఏ ముష్టివాడూ ఆ గుమ్మంలోంచి వట్టి చేత్తో వెళ్ళడే!

చేత్తో ఏం పెట్టినా నోటితో మరి రెండు వడ్డించక మానదే!

"ఇదిగోరా అబ్బీ, ఆ మధ్య చలిమిడి బావుందన్నావు కదా, మరికాస్త ఏలగ్గుండ కలిపి, నూపప్పు వేసి, మెదాయించి చేశాను. ఉపవాసముండి సాయంకాలం ప్రసాదంగా తిన్నాను.

ఒక్కర్తిని ఎంతకని మింగుతాను? మీకందరికీ ఇద్దామనే కిలో బియ్యం నానబెట్టి పిండి చేశాను. ఇదిగో - అఘోరించండి. అలా మీద మీదకి వస్తారేం? తగిల్తే కళ్ళు పోతాయని ఆ మాత్రం తెలీదూ. నేనే ఉండలు చేసి విసురుతాను. జోలె సరిగ్గా పట్టండి. అయ్యో - అయ్యో... ఆ ముసిలి పీనుగ అలా పక్కకి ఒరిగిపోయాడేం? పట్టుకోరేం పిచ్చి సన్నాసిని. ఉండండుండండి. ఇన్ని మజ్జిగనీళ్ళు తెస్తాను. రేకు గ్లాసు పట్టండి. హమ్మయ్య, లేచాడు కదా? మాయమేళం... అరుగు అరుగంతా మైల చేసి పారేశారు. బాల్చీడు నీళ్లు పోసి కడిగినా శుభ్రపడదు. కర్మ - ఏం చేస్తాం?"

మెటిల్డాని ఆదుకున్న తీరుతో ముగ్ధులమై మరింతగా మంగమ్మను గమనిస్తే, అప్పుడప్పుడు చెవిలో పడే ముక్కలు ఇలాంటివే.

అలా పరిశీలించగా ఇంకా కొన్ని విషయాలు తెలిశాయి. ఉంటున్న ఆ చిన్న కాంపౌండు ఇల్లు కాక, దాని కెదురుగా ఉన్న పెద్ద పెంకుటిల్లూ ఆవిడ పేరనే ఉందట.

ఆ పెద్దింటి అద్దె ఏ నెలకా నెల తమ్ముడి పేర పంపించేస్తుందిట.

"నేనా ఒంటరిదాన్ని. వాడా పిల్లలు గలవాడు. వాళ్ళిద్దరి సంపాదనతో పాటు పిల్లలిద్దర్నీ ఏవో పనులకి పెట్టి సంపాదించుకున్నా వాళ్ళకి చాలవు. ఏం చేస్తా, కర్మ" అంటుంది మంగమ్మ.

ఆవిడ మరదలు సరోజ గురించి కూడా కొంత భోగట్టా తెలిసింది. ఏ విధంగా చూసినా వీళ్ళిద్దరికీ చుక్కెదురు. మరి అలాంటి సంబంధం ఎలా చేసుకుందో ఏమో!

సరోజదంతా మెగా సూపర్ స్టైల్. ఎప్పుడో బాబ్డ్ హెయిర్ చేయించేసుకుంది. పొరపాట్న కూడా చీరలు కట్టదు. ఇంట్లో కూడా కూలింగ్ గ్లాసెస్‌ని తియ్యదు. పిల్లల్తో అయినా ఇంగ్లీషు తప్ప మాట్లాడదు.

ఎక్కడున్నవారక్కడే ఉంటే ఈ కథే కండకపోను. పెద్ద పెంకుటింటిని పడగొట్టి రీమాడల్ చేయించుకుందామనే బుద్ధి పుట్టినట్టుంది.

లాంగ్ లీవ్ పెట్టి పట్నం వచ్చేశారు, పిల్లల్తో సహా.

మంగమ్మ ఉన్న చిన్న ఇంట్లో ఏం ఉండగలమని హోటల్లో దిగేరు. ఆ సంగతి విని ఆవిడ ఏం కుమిలి పోతుందో అనుకున్నాం. కాస్త చనువయింది కదా, ఆవిడ నాతో అంటుందీ:

"పోనిద్దూ బాబూ.... వాళ్ళకెక్కడ సదుపాయంగా ఉంటే అక్కడే ఉండనీ. కలుసుకోవాలీ అనుకుంటే మార్గాలే లేవాయేం? పిల్లల కోసం చేగోడీలూ బందరు లడ్డూలూ చేసి నేనే పట్టుకెడితే

పోలా? ఇలాంటి వంటే మా షణ్ముఖానికెంత ఇష్టమో.''

షణ్ముఖం అనేది కాస్త అరుదైన పేరు కదా, నాతో ఆ రోజుల్లో క్రికెట్ ఆడే ఓ పొడుగాటి వ్యక్తి కళ్లముందు మెదిలాడు.

"ఎలా ఉంటాడేం మీ తమ్ముడు'' అని అడిగితే మంగమ్మ ఓ పాత ఫోటో తీసుకొచ్చి చూపించింది.

సందేహం లేదు, వి. షణ్ముఖరావు నా ప్లేమేటే!

వెంటనే హోటల్కెళ్ళి వాణ్ణి పట్టుకున్నాను.

"ఇలా వేరే దిగడం ఏం బావుందేయ్'' అనే మాటకి తప్ప ఏది అడిగినా సరదాగా మాటాడుతూనే ఉన్నాడు. వేషభాషల్లో వికారం విస్మరించగలిగితే సరోజ కూడా బాగానే మాటాడింది.

ఇంతకీ మంగమ్మ వెళ్ళకుండానే వాళ్ళిక్కడికి వచ్చారుట. నేనప్పుడు ఇంట్లో లేను.

మేరీ పూసగుచ్చినట్లు జరిగిందంతా చెప్పింది.

"మీరు అక్కడికి వచ్చేస్తే ఖర్చు కలసివస్తుంది కదా, వదినా'' అని సరోజ అంటే, మంగమ్మ వినీ విననట్లు ఊరుకుందిట.

షణ్ముఖం మాత్రం ఊరుకోలేదట.

"నీ ఒంటికి ఏదైనా వస్తే చెయ్యలేదని లోకం నన్ను ఆడిపోసుకుంటుంది. కాస్త ఆలోచించవే అక్కా! నీకేదైనా చికాకు చేస్తే ఉన్న ఉద్యోగాలు మానేసి అంత దూరం నుంచి మేం పరిగెత్తుకురాలేం కదా?''

మంగమ్మ పకపక నవ్విందిట.

"ఒరే తమ్ముడూ ఎంచుకున్న జీవిత విధానాన్నిబట్టే సాధారణంగా ఎవరి ఆరోగ్యాలైనా ఉంటాయి. నాకు ఏభై అయిదు పైబడిన మాట నిజమే. కానీ, నేను వాడే తిరగలిరాయిలాగే నేనూ ఆట్టే చెక్కుచెదిరినట్టు లేదు. మీరు వాడుతున్న గ్రైండర్లు, కుక్కర్లు లాగే మీకిద్దరికీ ఏవేవో రిపేర్లు. నీకు బీపీ, నీ పెళ్ళానికి సుగరూ. సరిపోయే స్థిరాస్తి ఉండి కూడా తెల్లారి లేచింది మొదలు ఏ అర్థరాత్రి వరకో ఎప్పుడూ మీలాంటి వాళ్ళకి ఉరుకులూ పరుగులూ. మీరెలాగ తగలబడ్డారు. పిల్లల్ని చూడబోతే కళ్ళల్లో ఉన్నాయి ప్రాణాలు. ఏదో ఉద్ధరిద్దామనుకుని వాళ్ళని ఇరుకున పెట్టకండి. నాకు మీరు చేసేదేమిటి మీ మొహం? ఎలాగా పెద్ద సెలవు పెట్టేరంటున్నారు. ఏకంగా రాజీనామా చేసేసి హాయిగా ఇక్కడి కొచ్చెయ్యండి. నేనే అందరికీ ఇంత వండి పడేస్తాను.''

ఇలాంటి తీర్పులకి సరోజ సిద్ధంగా లేదు. వదినగారిని పట్టుకు దులిపేసిందిట.

"ఎప్పుడో బీసీ నాటి మనిషివి. మడీ మైలా తప్ప మరో ప్రపంచం ఉందని ఎరగని నూతిలో కప్పవి. నీకేదో చేద్దామనుకోవడం మా బుద్ధితక్కువ. నీ తమ్ముడికి అలాంటి బుద్ధులు రాకపోవడం నా అదృష్టం. పదండి, ఇంకా చూస్తారేం? కదల్రేం కుర్ర వెధవల్లారా.''

మంగమ్మ మారు మాటాడలేదు.

వాళ్ళు తిరిగి వెళ్ళిపోయే టాక్సీలో రెండు బుట్టల ఫలహారాలు మాత్రం పెట్టించిందిట. బలవంతాన.

పొలాలన్నీ ఆవిడ పేరనే ఉన్నాయి. మాటమాత్రమైనా చెప్పకుండా భూమి అమ్మకానికి పెట్టేరు.

పెద్దింట్లోని అద్దె వాళ్ళని వెళ్ళగొట్టేశారు. దాన్ని నేలమట్టం చేసే ప్రయత్నాలూ జరగుతున్నాయి. ఈవిణ్ణి కూడా వెళ్ళగొట్టి, ఈ చిన్నిల్లు కూడా ఆక్రమిద్దామని ఉద్దేశం."

మేరీ ఏం చెబితే నేనేం చెయ్యగలను? దొంగలు రాజ్యాలేలుతున్న పిదపవ్యవస్థ మనది. అయినా, ఊరుకోలేక మంగమ్మతో ఓ మాట అని చూశాను.

"ఏమైతే అయింది, పొరపాట్నైనా మీరీ ఇంటి నుంచి కదలకండి మంగమ్మగారూ."

"అలాగేలే, ఆ కబురు కొంచెం దూరం నుంచే చెప్పొచ్చుగా, మీది మీదికి రావాలాయేం? ఏమిటీ, నన్నీ ఇల్లు కదలొద్దన్నావా? నేనెలా కదుల్తాను, పిట్టలన్నీ ఎక్కడికి ఎగిరిపోయినా తిరిగి రావడానికి కుదురైన గూడంటూ ఒకటి ఉండాలి కదా. ఎంత తప్పు చేసిన పిల్లలైనా తిరిగొస్తే సేదతీరడానికి అమ్మ ఒడి లాంటిది ఒకటి ఉండాలికదా పెద్దవాళ్ళయితే తెలివి మీరిపోయి తప్పుకున్నారుగాని, ఆ పిల్లవెధవలు చాటుమాటున ఆంటీ - ఆంటీ అంటూ ఎన్నిసార్లు ఇక్కడికొచ్చి నన్ను చుట్టబెట్టుకున్నారో, ఎన్ని రకాలు చేసి పెట్టానో, ఎన్ని కథలు వినిపించానో, ఎన్ని పాటలు నేర్పించానో! పిల్ల వేరుకి ఒకరు చెప్పాలా? ఎక్కడ తడి ఉంటే అక్కడ వెతుక్కు మరీ చేరుకుంటుంది. ఆ వెధవలకి మీద పడి తొక్కే రక్త సంబంధం ఉంది మరి, స్నానాలు చెయ్యలేక చస్తున్నానుకో."

మేం మాత్రం మంగమ్మగారి పక్కవాటా ఖాళీ చేసే ప్రయత్నాలు మరి చెయ్యలేదుజ

నీతీ నియమం లేని ఈ లోకంలో ఏదైనా దొరుకుతుంది, మంచి పొరుగుతప్ప.

ముఖ్యంగా మా పిల్లకు అది మరీ అవసరం.

అయాచితంగా లభించినదాన్ని మేమెందుకు వదులుకోవాలి?

*(ఇండియా టుడే మాసపత్రిక 26 ఆగష్టు 1997)*

# గోవూ గోమాయువూ




**ఫాదరీ** గేబ్రియల్ దొరకేమీ పాలుపోలేదు. అంతఘోరం జరుగుతుందని తెలిస్తే తనలా చేసి ఉండేవాడు కాడు. ఈవెనింగ్‌వాక్ కి మామూలుగా బయలుదేరి వైట్ వాషింగ్ సరిగ్గా జరిగిందో లేదో స్వయంగా చూద్దామని స్కూలు బిల్డింగ్ వైపు రావడంతో కొంప మునిగింది. ఇంతకీ తను వచ్చేసరికి శీతాకాలమేమో చీకటి తరుముకు వస్తూనే ఉంది. పనివాళ్ళు ఎవరూ లేరు. తోటమాలి శలవు పెట్టేడు. లేడు. కాపలావాడు ధర్మసందేహంగాడు కూడా ఎక్కడో లోపల ఉన్నట్టున్నాడు అలికిడి లేదు.

గేటు దగ్గిరపడుతుంటేనే లోపల్నుంచి ఏదో కర కర మనే చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. మళ్ళీ ఏ పశువో జొరపడి ఉంటుంది కాంపౌండు గోడ లోపల ఎత్తుగా ఉంటుంది గనక ప్రయత్నించి పైకి గెంతొచ్చు నేమోగాని పై నుంచి లోపలికి పశువులు జొరబడే అవకాశం ఎలాగా లేదు. వికెట్ గేటు లోపల గడియ పెట్టడం మరచిపోయాడు కాబోలు..... వెధవ అశ్రద్ధ. గేబ్రియల్ విసుక్కుంటూ లోపల ప్రవేశించాడు.

ఎదురుగుండా కంటపడిన దృశ్యం అతని ఒళ్ళు వేడెక్కించింది. ఆ మసక చీకటిలో ఆవొకటి ప్రవేశించి చేసిన సర్వనాశనం స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. కేబేజి మడి నమిలిపారేసింది. బీన్సు తీగెల్ని పువ్వులతో పిందెలతో లాగేసింది. కలకల లాడుతున్న పూలమొక్కల వరసలు నామరూపాలు లేకుండా తొక్కేసింది.

ఏళ్ళ తరబడి కృషి చేసి తీర్చిదిద్దిన తోట నిమిషాలమీద పాడయిపోవడంతో అతనికి ఒళ్ళు తెలియలేదు. చేతి కర్ర బలంగా విసిరేడు. వెనకనుంచి ఎవరో వస్తున్నట్టు ఆవు చూసినట్టులేదు. తప్పుకోలేదు. అది మామూలు చేతికర్రా కాదు. లోపల యినపకడ్డీ అమర్చబడి ఉన్నది. ఆవుకి తగలరానిచోట తగిలినట్టుంది. పెద్ద అరుపు అరచి కుప్పలా కూలబడి పోయింది. ఆ అరుపు విని అటువైపు పెద్దగేటు తాళం వేసి వస్తున్న ధర్మసందేహం అక్కడికి పరిగెత్తుకు వచ్చాడు. గేబ్రియల్ తన కోపమంతా వాడి మీద చూపించాడు. ముందా ఆవుని బయటకి తగిలెయ్యమని ఆదేశించాడు. ధర్మసందేహం ఆవుని కాలితో తన్ని చూశాడు, మోకాలితో పొడిచి చూశాడు, కర్రతో ఆదిలించి చూశాడు. దానిలో చలనంలేదు. ఒకపక్క వేలాడుతూన్నట్టు చూడగానే వాడి పై ప్రాణం పైనే పోయినట్టయింది.

వాడి మొహం చూడగానే గేబ్రియల్‌కి జరిగిందేమిటో అర్థమయిపోయింది. పాప చింతతో అతని గుండె విల విల లాడిపోయింది. కాలికి దెబ్బ తగిలిన కుక్క పిల్లకి స్వయంగా మందు రాసి కట్టుకట్టే మనస్తత్వం తనది. అలాంటిది యివాళ తన చేతుల్తో తను నోరెరగని ఒక పశువుని కొట్టి చంపేడు! నుడుటని బట్టిన చెమట బిందువులు తుడుచుకుంటూ అతను మేడ మీద తన గదిలోకి వెళ్ళిపోయి అద్దాల కిటికీ దగ్గర నిలబడ్డాడు.

అప్పుడే చుక్కలు ఒక్కొక్కటీ మెరియడం ప్రారంభించాయి. అతను వాచీ చూసుకున్నాడు. రేడియం ముళ్ళు ఏడున్నర చూపిస్తున్నాయి. అక్కడ అలా నిలబడ్డం అతని కెంతో యిష్టం. అదే యివాళ విషమయిపోవడం అతనికెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. పగలిపూట ఆ అద్దాల కిటికీ దగ్గర నిలబడి కిందకి చూస్తే తను ఎవరికీ కనపడడు. అందర్నీ తను చూడొచ్చు. మబ్బుల్తో దొబూచులాడుతున్న పిట్టల్తో పాటూ గడ్డి దుబ్బుల వెనక దొంగాట లాడుకుంటున్న పిల్లల్ని కూడా వాళ్ళ సహజ సుందర ప్రకృతులతో అక్కణ్నుంచే చూడొచ్చు. పేరుకి బంగళా ఉందిగాని ఈ స్కూలు బిల్డింగే తన సర్వస్వం. అవును. ఈ దేశంగాని దేశంలో తనకెవరున్నారు. లేకేం, ఈ పిట్టలూ, ఈ పువ్వులూ ఈ పిల్లలూ ఇంతకన్నా ఇంకేం ఆస్థి కావాలి మనిషికి!

పదేళ్ళ కిందట మిషనరీగా తను ఈ ప్రాంతానికి వచ్చాడు, ఆరెకరాల జాగాలో అందమైన చిన్న చర్చీ, అనుబంధంగా చిన్న స్కూలూ ఆరంభించాడు. ఎక్కణ్నుంచో తెల్లగెడ్డవు కిరస్తానీతాత ఒకడు పిల్లల్నెత్తుకుపోడానికి వచ్చాడనే భయం చిరుగుండెల్లో తగ్గించడానికి ఏళ్ళతరబడి పట్టింది, పరవాలేదు, తనునాటిన కొబ్బరిచెట్లు మొవ్వులు విడి పువ్వులు వెదజల్లే సమయం ఆసన్నమయింది. తను విశ్వాసం నాటలేనిది పెద్దవాళ్ళలోనే ముఖ్యంగా తన మతస్థులలోనే గొర్రెపిల్లని ఎత్తుకున్న ఏసుక్రీస్తు పెయింటింగ్ పక్క గోవుకి జారబడి మురళి వాయించే శ్రీకృష్ణుడి పటంమెయిన్ హాల్‌లో ఉంచాలనే తన ప్రతి పాదనమీద పైకి ఎన్ని పితూరీలు వెళ్ళేయని! స్కూల్ స్టాఫ్‌లో నాన్ క్రిష్టియన్స్‌కి అవకాశం కల్పించనందుకు తనకి ఎన్ని వార్నింగ్సు వచ్చాయని!పోన్లే ఏం చేస్తాం... పెద్దల మనసులు





అలాగే ఉండనీ.... తనుతో ఒకరిగా గుర్తించారు, తాతా అని ప్రేమగా పిలుస్తారు. పరమ పవిత్రమూర్తులు పసిపాపలు, తన సారశాల విద్యార్థులు. ' వాళ్ళకోసమే తన జీవితం అంకితమైపోనీ...

"బాబుగారూ, ఆవు చచ్చిపోయినట్టుంది...అదెవరిదో ఏమిటో.....'

ధర్మసందేహం మాటలతో తుళిక్కిపడి గేబ్రియల్ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు. కొండంత సమస్య ముందుంచుకుని సముద్రమంత లోతుకి తన ఆలోచనలు పంపిస్తున్నందుకు అతనికి తడీసొడీ లేని నవ్వొకటి నచ్చింది. నిండు ప్రాణాన్ని ఒకటి నిలువునా తీశాడు ఇవాళతను ఏమిటి దీనికి నిష్కృతి?

'తెలుగు మేష్టారి ఇల్లు దగ్గరే.....కేకేసుకు రానా? ఆయన కిలాంటివన్నీ బాగా తెలుస్తాయి. ఆయన దగ్గర కూడా ఒకటో రెండో ఆవులుండాలి. ఒకవేళ ఆయనదేమో ఇది....'

ఫాదరీ తల ఊపేడు, మరో పావుగంట దాటకుండా షణ్ముఖశర్మ స్కూలు కాంపౌండులో ఉన్నాడు.

'హరహర, పొద్దున్న లేచి ఎంత దుర్వార్త విన్నాను. నోరురుగని పశువు.... నాలుగు గడ్డిపరకలు కొరికి కాలం వెళ్ళబుచ్చే పరమసాధువు, మనల్ని అన్నం అడిగిందా, నీరు అడిగిందా! ఆఖరికి దానికివాళ మృత్యువు రాసిపెట్టుంది'కోపంతో అతని ఒళ్ళు ఊగిపోయింది. అయినా ఎలాగో తమాయించు కున్నాడు. నీరోజులు దగ్గిరపడ్డాయిరా గోమాంస భక్షకా! లేకపోతే ఇంత దురాగతానికి సిద్దపడవు' అని గొణుక్కుంటూ మేడమెట్లు ఎక్కేడు.

"ఆ ఆవు మీదా?'' అని అడిగేడు గేబ్రియల్.

"నాదా అంటారా? పెద్దదొరలుమన్నించాలి. తమరు మా దేశక్షేమం కోరి పై నుండి పంపబడిన దేవదూతలు..... తెల్లనివన్నీ నీళ్లూ, సారపాటు, తెల్లనవన్నీ పాలూ నల్లనివన్నీ నీళ్లూ అనుకుంటారు ఇక్కడి వాతావరణం ఎంతక్లిష్టమయిందో ఎన్నాళ్ళయినా తమరు పోల్చుకున్నట్లు లేదు.''

"నేను అడిగింది ఆ ఆవు మీదా అని.''

"అదే అదే మనవి చేస్తున్నాను.....ప్రభువులు....తమ దగ్గిర నేనెంత. భృత్యమాత్రుణ్ణి....మాటకి అడ్డువచ్చాను......మన్నించాలి.''

"ఆ ఆవు......''

"అవును, అవును ....అక్కడికి వస్తున్నాను. ఆ ఆవు నాదా అని అడిగేరు. ఏం చెప్పను! అది నా ఒక్కడి సొమ్మా కాదుగద! మా దేశానికంతటికీ ఉమ్మడి ఆస్తి అది. పూజల కంతటికీ పరమ పవిత్రమూ, మహా పూజ్యమూ అది. మమ్మల్ని పాలించే తెగకి చిహ్నం కూడా అదే. భూసురులతో సమానంగా పూజిస్తాం మేం గోవుల్ని, ఆవు శరీరంలో మాకు శిరోధార్యం కాని భాగమంటూలేదు.గోవు గురించి ప్రత్యేకించి పురాణమే ఉన్నటుంది మాకు. బతికుండగానే కాదు చచ్చిం తర్వాత కూడా ఆవుతో పరుంది మకు. ఆవు చచ్చాక కాదు. మే చచ్చాక అపరకర్మల్లో గోదానం అతి ముఖ్యమైంది మాకు గోవు తోక ఒకటి దొరకకపోతే వైతరణి ఎలాదాటగలం చెప్పండి మేము'.

"అవును బతికుండగానే కాదు చచ్చింతర్వాత కూడా ఆవుతో పనుంది మీకు మీరు చచ్చాక కాదు, ఆవు చచ్చాకే....'' అనుకున్నాడు ఫాదర్. అతనికి ఆ మధ్య జరిగిన సంఘటన ఒకటి గుర్తుకొచ్చింది.

మోకాళ్ళలో సత్తువ సన్నగిల్లిపోయి నడుస్తూ ఆ మధ్య ఒక ముసలి ఆవు ఒకటి నాలుగుదార్ల కూడలిలో కీళ్ళు జారి పోయి కూలబడిపోయింది, ఇదే కాదు, దీని సంతతి కంతటికీ మెయిన్‌రోడ్డే శరణ్యాం ఏ పట్నంలో ఏ అర్ధరాత్రి ఏ రోడ్డు పరికించినా విశాలమైన భూమాత మీద విశ్రాంతి తీసుకుంటూన్న గోమాత దర్శనం తప్పించుకోలేరు ఇలాగే కాబోలు మీరు గోవుని పూజిస్తారు! ఇంతకీ ఆ ముసలి ఆవుది ఎంత పశుచర్మమైనా మండుటెండలో మలనుల రోజుల తరబడి మాడి అరచే శక్తిని కూడా కోల్పోయేదాకా వచ్చింది. కొద్దిగా తలఎత్తడం దీనంగా చూడ్డం. ఇవి మాత్రమే మిగిలేయి దానికి. ఇన్ని మంచి నీళ్ళు తెచ్చి దానిముందు పెట్టే నాధుడు కూడా లేకపోయాడు. మనషులు వస్తున్నారు వెడుతున్నారు. ఎవరి పనులు వాళ్ళవి మరి ఓ రోజు ఆ గోవు బాధలు తీరిపోయాయి. అంతే, జన ప్రవాహం ఆగిపోయింది! చందాల పళ్ళేలు నిండిపోయాయి. పెద్ద బండి చేయించారు. గోశరీరాన్ని అందులో చేర్చేరు. దాని మొహాన్ని ఇంత పసుపూ అంత కుంకుమా మెత్తేరు మేళతాళాలతో దాని శరీరాన్ని తీసుకువెళ్లేరు.

"తమరు నామాట వింటున్నట్టు లేదు.'' అన్నాడు శర్మ.

ఫాదర్ తల ఎత్తేడు.

"ఏదీ నేను అడిగిందానికి మీరు జవాబు చెప్పందే!''

"చిత్తం చిత్తం ఆ సంగతి విన్నవించాలనే ఇంత ప్రయత్నమున్నూ. జరిగిన విషయం ధర్మసందేహం ద్వారా తెలుసుకున్నాను. తెలిసి చేస్తేనేం తెలియకచేస్తేనేం ఇది గోహత్య. ఇంతకన్న మహాపాతకం ఉండదు. పంచమహా పాతకాల్లో యిలాంటి వాటిని మావాళ్లు ప్రధమశ్రేణిలో చేర్చేరు, ఇది చేసినవాళ్ళకి యిక పుట్టగతులుండవని మా శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. గేబ్రియల్ ముందున్న బల్లని కోపంగా తోసి లేచినిలబడ్డాడు.

"మిష్టర్ శర్మా.........విషయాన్ని మీరు మరింత కాంప్లికేట్ చేసిపారేస్తున్నారు. నేను మిమ్మల్ని కబురంపింది యీ ఆవు ఎవరిదో తెలుసుకుందామని, మీకా ఇన్ఫర్మేషన్ తెలుస్తే చెప్పండి లేకపోతే.....!'

"అదీ అదే అది చెప్పాలనే యింత ఉపోద్ఘాతమున్నూ..... తమరు అడిగింది శలవియ్యకపోతే సేవకవర్గం మేమెందుకండి మరి? జగపతి శాస్త్రుల్లు అనీ మాకు బావమరిది వరస వాడిదే ఈ ఆవు. నుదుటి మీద గోధుమ రంగు మచ్చా అదీ నాకు గుర్తే. మా ఎన్నికయిన పశువండి అది, పశువుటండీ, కామధేనువుగాని! పూటకి కుంచెడు పాలు యిచ్చేది, పదిమంది గల కుటుంబం అది వాళ్ళందరూ తాగినంత తాగి పారబోసినంత పారబొయ్యగా రోజుకి రెండుపుంజీల రూపాయిలు వచ్చే వండి దానిమీద, అసలలాంటి పశువులున్నాయా యిప్పుడు! అందుకే దానిదినం తీరిపోయింది. పాపం వాళ్ళ నోటిదగ్గర కూడు పడగొట్టేసినట్టయింది, గంపెడు పిల్లల తల్లి మా చెల్లెమ్మ... పాపం ఇక ముందు రోజులెలా వెళ్ళబుచ్చుతుందో ఏమో... తమకి మాత్రం ఏం తెలుసు ఏదో మామూలుగా కర్ర విసిరేరు. పొద్దుట లేచి ఎందరు కర్రలు విసరడం లేదు! ఇంత విపరీతం కద్దా! ఇంతకీ రోజుల మహాత్యం!

"ఐయాం ఆపుల్లీ సారీ మిష్టర్ శర్మా - నిజానికి నా దృష్టిలో అన్ని జంతువులూ ఒకటే. గాడిద చావుకన్న ఆవు చావుకి ఎందుకెక్కువ కన్నీరు కార్చాలో ఎంత ఆలోచించినా అర్థం కావడం లేదు నాకు...

'పావుకేజీ గోమాంసం ఉంటేగాని రోజు వెళ్ళదు నీకు - నీకెలా అర్థమవుతుంది!'' అని గొణుక్కున్నాడు శర్మ.

"ఏమిటి మీలో మీరే ఏదో అనుకుంటున్నారు''

"అబ్బే అబ్బే... చీమకైనా హాని చెయ్యని మత బోధకులే తమరు, ఎంత ధర్మసంకటం వచ్చిపడిందీ అని విచారిస్తున్నాను,''

"ఏం చెయ్య మన్నారు! నా చేతిలో దానికి ఆయువు మూడింది గనక ఆ ఫేమిలీకి నష్ట పరిహారం చెల్లించుకోడం నా కనీస బాధ్యత. అవు ఖరీదు మీద సరి అయిన అయిడియా లేదు నాకు. బాగా పాలిచ్చే పశువు అని చెబుతున్నారు. మీకు వెయ్యిరూపాయిల చెక్కురాసి ఇప్పుడే ఇస్తాను. మీ బావమరిదిని పిలిపించి నా క్షమాపణ చెప్పి చెక్కు అందజెయ్యండి. ఇది తాత్కాలికంగా యిచ్చే రిలీఫ్ మాత్రమే. ఏకంగా ఆ ఫేమిలీకి ఏదో ఏర్పాటు చేద్దాం ఏమంటారు?''

"తమరు ఎంత అమాయకులు! అన్నాడు శర్మ. ఆ మాటకు జవాబుగా,

'అదేమిటి? అన్నాడు గేబ్రియల్ తెల్లబోయి.

'వస్తున్నా, వస్తున్నా... ఆమాటే మనవి చేస్తున్నా. తమరు మా జగపతి శాస్త్రులుకి జరిగిన నష్టం గురించే ఆలోచిస్తున్నారు. తమరికి జరగబోయే నష్టం యెంతటిదో తాము ఎంతటి ప్రమాదకర పరిస్థితుల్లో చిక్కుకున్నారో ఏమాత్రం అర్థం చేసుకున్నట్టు కనపడదు. అమాయకత్వం అంటే ఇంకెలావుంటుంది?'

ఫాదర్ నుదుట చిన్న ముడతా, ఆ ముడతలో కాస్త తడి స్పష్టంగా కనిపించి శర్మ మరింతగా వుత్సాహం తెచ్చుకున్నాడు.

'ఎక్కణ్నుంచో వచ్చారు తమరు. ఎన్నాళ్ళనుంచో కృషిచేస్తున్నారు. మా భాష నేర్చుకున్నారు. మా అలవాట్లు తెలుసుకున్నారు. మాలో యిమిడిపోదామని ప్రయత్నిస్తున్నారు. కాని, మా వాళ్ళకి తమర్లాటి వాళ్ళని కలుపుకోగల తాహతూ-శక్తి వుండొద్దూ? తమ వుప్పు తింటూన్న తమకే చెబుతున్నానని ఆగ్రహించవద్దు. తమ ఒంటిమీద ఈగవాలితే భరించలేనునేను. తమరు గొప్ప ఆపదలో వున్నారు ప్రస్తుతం. మేం పూజించే పశువు అది. తమ ఆవరణలో హత్య చేయబడి పడివుంది. మా వాళ్ళకి మతోన్మాదం హెచ్చు. ఈ సంగతి నలుగురికి తెలిస్తే ఏంకొంపలంటు కుంటాయో అని నాప్రాణం కొట్టుకుపోతోంది. ఏమోయ్. ధర్మసందేహం... ... నిన్నే వెంటనే ఇలారా'

కాపలావాడు వచ్చాడు.

'చూడూ, అన్నిగేట్లకీ జాగ్రత్తగా తాళాలు వేసేవుకదూ... ... మరోమారు చూడు! పిట్టపురుగుని లోపలికి రానియ్య కూడదుసుమా! నీ అజాగ్రత్తే దొరగారి పీకలమీదికి తెచ్చింది. జాగ్రత్త... వరండాల్లో లైట్లన్నీ ఆర్పెయ్యి !

ధర్మ సందేహం తలూపి వెళ్ళి పోయాడు.

'ఇంకానయం ఆ ప్రభువు మనపట్ల ఉన్నాడు. శీతాకాలం, రాత్రివేళా కాబట్టి యీ మారుమూల జరిగిన యీ ఘోరం యింకా ఎవరికీ అందినట్టులేదు. కబురు అందిందంటే యీ స్టూడెంటు కుర్రాళ్లని మనం పట్టగలమా; ఈపాటికి యీ భవనం భవనమంతా పెట్రోలులో స్నానమాడి నిప్పురంగు చీరకట్టుకుని సెగలలో పొగలతో ప్రళయ నృత్యం చేస్తూ ఉండకపోనా?'

ఫాదరీ గుండె దడదడ కొట్టుకొంది సురుచిరమూ, శుభప్రదమూ అయినదింకా యీ సుందర జగంలో మిగిలి ఉందని నమ్మే సున్నిత హృదయుడాయన.

'నో.. ఐ కాన్ట్ ఎగ్రీ... తక్కిన వాళ్లమాట నాకు తెలీయదు గాని మన స్కూల్లో చదువుకున్న పిల్లల క్రమశిక్షణ వేరు. వాళ్లలా చెయ్యరు... యు ఆర్ రాంగ్' 'తమకి చెప్పగల పాటివాణ్ణి కానని నాకు స్పష్టంగా తెలుసు. కాని ఏం చెయ్యను; కాని తమకి మనవి చెయ్యకతప్పేటట్లు లేదు. మనస్కూల్లో ఉన్నంత వరకు మన పిల్లల క్రమశిక్షణ బాగానే ఉంటుంది. కాని వాళ్లు ఎక్కువసేపు ఇంట్లోనే కదా ఉండేది! ఇంటి దగ్గర ఒక ఆదర్శమూ, ఒక నియమమూ ఏడుస్తేగా! తండ్రి లంచగొండి, తల్లి వ్యభిచారిణీ అనుకోండి. ఇది పిల్లల కళ్ల పడితే - ప్రతిక్షణం కట్టలు తెచ్చుకొని పారేవాళ్ళ శక్తిని ఎటువైపు మళ్ళించాలి! ఇదిగో దాని పర్యవసానమే నేటి యీ విద్యార్థుల అలజడికి కారణం. వాళ్ళలో కల్లోలం లేపడానికి ఎటువంటి చిన్న సంఘటన అయినా చాలు. అందులో మాకు ఇంతతిండి పెట్టే గోమాతకి నేడు మారణ హోమం జరిగింది. మావాళ్లు ఊరుకుంటారా!'

'అయితే ఇప్పుడేం చేద్దామంటారు?'

అందుకే... అందుకే... దానికోసమే బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాను. నలుగురటూ నలుగురిటూ కాళ్ళకి మోకుతాళ్ళుకట్టి మోసుకువెళ్ళినా కదుల్తుందా అన్నట్టు ఉంది ఆ ఆవు, లేకపోతే చీకుచింతా లేకుండా నిమిషాల మీద తర్లించి వెయ్యనూ: తమ దాకా రానిద్దునా?... పోనీ... తమరే ఓ పని చేస్తే!!

'ఏమిటి?'

'చెబుతా చెబుతా... తమరేం అనుకోరనే ధైర్యం ఉందినాకు. రాత్రికి మెయిల్ అందుకుని మెద్రాసు వెళ్ళిపోండి రేపు అక్కణ్ణుంచి విమానంలో తమరి దేశం వెళ్ళిపోవచ్చు. వీళ్ళు తమర్ని బతకనియ్యరు.... నాకు తెలుసు... మనకి తెలిసిన జాగ్రత్త లేవో మనం తీసుకున్నాం గాని యీపాటికి యీ వార్త ఊరంతా పాక్కిపోయి కోపతాపాలతో అంతా కుతకుత ఉడికిపోతూ ఉంటారని నా ఉద్దేశం!'

'అదెలా, మన ముగ్గురికీ తప్ప తెలీదే! అన్నాడు ఫాదరీ ఒణికిపోతూ.

"పెదవి దాటితే పృదివి దాటుతుందని మాలో ఒక సామెత. మనం గేటుతాళం వేయించాంగాని ధర్మ సందేహాన్ని ఒక గదిలో పెట్టి తాళం వెయ్యలేదు గద!"

'అవునవును పొరపాటే... నేను కర్రతో అవుని కొట్టడం కళ్ళతో చూసింది వొక్కడే అయివుంటుంది. వాణ్ణి ఆ పేరు కారేం?'

'అయ్యో అయ్యో.... అందుకే తమర్ని మళ్ళీ మళ్ళీ సత్తెకాలపు వాళ్లు అనవలసి వస్తోంది.' కళ్ళతో చూసినవాడే వచ్చి చెప్పనక్కరలేదు. పుచ్చిన కర్రా చచ్చిన కుక్కా కూడా వచ్చి సాక్ష్యాలు యివ్వగలవు మా కోర్టులో. ఇంతకీ కోర్టు దాకా తెచ్చే శ్రమ కలిగించరు మా పిల్లలు. ప్రస్తుతం వాళ్లే రక్షకభటులూ, న్యాయ వాదులూ, న్యాయమూర్తులూ అన్నీ..... అప్పటి కప్పుడే తీర్పూ శిక్షా జరిగిపోతుంది. ఇందాక మన ధర్మసందేహంగాడు మా యింటికి వచ్చి నాతో చెప్పడం మటుకు రహస్యంగానే చెప్పాడనుకోండి, కాని ఏం చేస్తాం, వాడి గొంతుక పెద్దది అదిగాక తమకూ నాకూ ఉన్న ఆత్మత వాడికెందుకుంటుందీ? ఉండండి... ఏమిటా గోల? కొంపదీసి హోమగుండంగాడు

గాని నాలుగు హాస్టళ్లలోకీ వెళ్ళి కుర్రాళ్ళని ఉసిగొల్పి రావడంలేదు గద... లేదులెండి..... మా పక్క వీధిలో పెళ్ళి జరుగుతోంది వాళ్ళ గొడవే అయి వుంటుంది. అమ్మయ్య హడలి చచ్చాను, కొంచెం మంచి తీర్థం వుంటే యిప్పించండి.'

షణ్ముఖశర్మ ఒక గ్లాసు ఖాళీచేసేలోగా గేబ్రియల్ నాలుగు గ్లాసుల మంచినీళ్లు ఖాళీ చెయ్యడం అతనికెంతో తృప్తి నిచ్చింది.

'ఎవడో హోమగుండం అన్నారు.... ఎవరతను?' అన్నాడు ఫాదరీ హీనస్వరంతో'

'మా ఇంటి ఎదురుగుండా మేడ మీద ఉంటున్నాడండీ... ఇందాక తమరు ధర్మ సందేమాన్ని మా యింటికి కబురు చెప్పి రమ్మన్నారే, సరిగా ఆ కబురు అందజేసే వేళకి వాడి కిటికీ తలుపులు తెరుచుకున్నాయి. విన్నాడో లేడో నేను నిర్ధారణగా చెప్పలేనుగాని యిలాంటి విషయాలంటే చెప్పలేని ఆసక్తి వాడికి. ఎంత రక్తపాతం జరుగుతే అంతగా మనం ముందడుగు వేస్తున్నామని త్రికరణ శుద్ధిగా నమ్మే మొదటిరకం రౌడీ వెధవవాడు. క్రిందటేడు మన వూరి సైన్సు కాలేజీ యూనియన్ ప్రెసిడెంటు వాడే. పదవీ విరమణ చేశాక వాడ్ని విద్యార్థులందరూ నాయకుడిగా చూసుకుంటున్నారు.

గేబ్రియల్ మొహం పూర్తిగా మాడిపోయింది.

శర్మకి కనపడకుండా మొహం మరో వైపుకు తిప్పుకున్నాడు.

'డబ్బు వెదజల్లి యీ వెధవలందరి నోళ్లూ కట్టించడం పెద్ద బ్రహ్మ విద్యకాదు గాని, తమ రిలాంటివాటికి ఒకబడరని నాకు తెలుసు. అంచేతే అంటున్నాను, మా వాడి మొహాన్న ఏ అయిదు వందలో కొట్టేసి - ఎందుకలా చూస్తారు? అవును అయిదు వందలే. చాలు. పూటకి కుంచెడు పాలు యిస్తుందని మా బావమరిది అంటే మాత్రం మనం నమ్మడమా ఏమిటి? చిత్తగించారు కదూ - వాడికా మాత్రం ముట్టచెప్పి తమరు రైలెక్కిపొండి బతికుంటే మరోచోట బడిపెట్టుకోవచ్చు. మరో గత్యంతరం లేదు. ఈ లంచాలూ అవీ యిలాంటివాటికీ మీరెలాగా సరిపెట్టుకోలేరు... ఇక ఈ స్కూలన్నారా? దీని జాతకం బాగులేదు. లేకపోతే ఎక్కడిదో ఆ ఆవు యిక్కడికొచ్చి మీ చేతుల్లో చావడమేమిటి? రేపీపాటికి యిదెలాగా భూమట్టం అయిపోతుంది. దీన్ని బ్రహ్మ దేవుడు ఆపలేడు. కానియ్యండి.... ఏం చేస్తాం?'

ఫాదరీ ఉద్రేకంతో బల్లమీద గుద్దేడు.

'నో.... నో..... నా కంఠంలో ప్రాణముండగా యీ బిల్డింగ్ కూలదొయ్యనివ్వను. ఇది నాశనం కాకుండా చివరి వరకూ చూస్తాను నేను. ఎటినీకాస్ట్' అలా బల్ల గుద్దడంలో అతని పండు జుత్తులోంచి కొబ్బరి పువ్వు ఒకటి పైకి వచ్చి బల్లమీద పడింది. తను నాటి పోషించిన కొబ్బరి చెట్టు కింద మంచి వెడుతూంటే కృతజ్ఞతతో తన మీద వర్షించిన ప్రేమపుష్పం అది. ఆ పిల్లలు ఈ పువ్వులు.... ఈ పిట్టలు... తను పెంచి పోషించిన ఇంత మధురమైన అందమైన బాధ్యత నుంచి తప్పించుకుని పారిపోయే భీరువా తను? పిల్లలు అందరూ రాళ్లేనా? కాదు...... అందులో రత్నాలు వున్నాయి. అన్నీ మట్టిబెడ్డలేనా? కాదు. కాదు. ఇందులో మాణిక్యాలు దొరుకుతాయి. వెతికి పట్టుకోడంలో ఉంది. ప్రేమించి దిద్దడంలో ఉంది. పువ్వులతో సరిపెడితే ఎలా? చెట్ల నుంచి గుత్తులు గుత్తులు కొబ్బరి కాయలు వేళ్ళాడాలి. పిల్లలతో పిల్లాడైపోయి వాళ్ళతో ఎస్కర్షన్‌కి వెళ్ళాలి. ఆ కొబ్బరి బొండాల చల్లని నీరు అందరూ అందుకోవాలి. మతానికి దూరమైనదీ, మనిషికీ, మనిషికీ దగ్గర చేసేదీ,

అదేదో పిల్లలకైనా చెప్పగలగాలి. చెప్పగలగాలి ఏమిటి, చెప్పి తీరాలి.

ఫాదరీ గేబ్రియల్ నిశ్చయానికి వచ్చాడు. సేఫ్ తెరిచాడు. గబగబా చెక్‌బుక్ తీశాడు. శర్మ పేర అయిదు వేలకి చెక్ రాశాడు మళ్ళీ ఏమనుకున్నాడో రాసిన కాగితం చింపేశాడు. పర్సు తీసి అతని చేతిలో పెట్టేడు.

'చూడండి మిష్టర్ శర్మా... నే చెప్పేది జాగ్రత్తగా వినండి. వీలైనంత తొందరగా ఆ ఆవు శరీరాన్ని యిక్కణ్ణుంచి తరలించి వెయ్యండి. ఎవర్ని కబురంపిస్తారో ఏం చేసుకుంటారో అంతా ఈ పన్నెండు లోగానే, అతి రహస్యంగా జరిగిపోవాలి. ఆ ఖర్చుల నిమిత్తమే ఈ డబ్బు యిచ్చాను రేపొద్దున్న సరిగా పదకొండుకున్నరకి మీరు మా బంగళాకి రండి. ముందు చెక్కిద్దామనుకున్నాను గాని మీ పేర నేను చెక్కివ్వడం ఎందుకు జరిగిందని తర్వాత ఏదేనా గొడవ రావచ్చు అది మీకూ నాకూ కూడా మంచిదికాదు ఎందుకొచ్చిన గొడవ ఇప్పటికి జరిగింది చాలు, మనీ విత్‌డ్రా చేసి రెడీగా ఉంచుతాను ఎంత అయిదే వేలు చాలుగదూ? మీ బావమరిదీ, ఆ స్టూడెంటు లీడరూ, దర్మసందేహంగాడూ, మీరూ ఇంకెవరయినా సరే ఎవరికేం పంచుతారో ఏమో అంతా మీదే పూచీ.... ఇది మళ్ళీ ఎక్కడా పొక్కకూడదు, వింటున్నారా?

'చిత్తం......... చిత్తం.......'

'నా దృష్టిలో అందరికంటె ఎక్కువ నష్టపోయినవాడు మీ బావమరిది, అందరి కన్న పాపం అతని కెక్కువ ముట్టచెప్పండి. పిల్లలవాడు. ఈ స్కూలు భవిష్యత్తూ నా వ్యక్తిగత శ్రేయస్సూ అంతా మిమ్మల్ని నమ్మి మీ చేతులలో పెడుతున్నాను. సరేనా?'

'ఎంత మాట - ఎంతమాట..... ఏమైనా హెచ్చుతగ్గులు వస్తే ఆ గోపాలకిష్టుడు నాపీక తీసెయ్యడా?'

గేబ్రియల్ వెళ్ళిపోయాడు.

షణ్ముఖశర్మ అసహ్యంగా అటువైపు చూశాడు......ఆలోచించసాగేడు.

'ఎవడ్రా నువ్వూ? ఎక్కణ్ణుంచో వచ్చి మా మీద ఆధిపత్యం చెలాయిస్తావా? నీ ఏడుపేదో నీ దేశంలో ఏడవక, మత ప్రచారం మిషతో మాదేశం వచ్చిందే చాలక, యీ పుణ్యభూమిని యింకా కలుషితం చేస్తావా? మా ప్రతి రక్తబిందువూ మిమ్మల్ని ద్వేషిస్తూ ఉంటుందనీ సమయం దొరికితే చావుదెబ్బ కొట్టందేవదలిపెట్టదనీ ఆ మాత్రం తెలీదా మీకు! నన్ను ఎప్పుడు కబురంపించావో అప్పుడే నీ రోజు మూడింది. నీ స్కూలు తగలడింది. ఇంకా నీ అదృష్టం బాగుంది. అయిదేవేలూ రాసిన చెక్కే ఏకారణంచేతో వెనక్కి తీశావు. లేకపోతే ఈ ఊరు ఊరంతా యీ ఆవరణలో నిండిపోయేటట్లు యీ పాటికి ఏర్పాట్లు చేసి ఉండనా! ఇప్పుడయినా మించి పోయింది ఏముంది! ఎన్నాళ్ళనుంచి ఎదురు చూస్తున్నావో, పగబట్టి, పొంచి ఉండి , చేజేతులా గోహత్యకు పూనుకున్నావు లేకపోతే ఒక్కదెబ్బతో గోవుచావడం ఎక్కడేనా విన్నామా? నీ గోరోజనం యిహాన్ని యిహాన్నే వెళ్ళగక్కించకపోతే యింకెందుకు? ధర్మ సందేహం! ఏమోయ్..... ఎక్కడయ్యా నువ్వూ'

'వస్తున్నా బాబుగారూ, ఏం మేష్టారూ పిలిచారా?'

'అవునయ్యా.... చూడు. కరీంపేటకి వెళ్ళి జమాజట్టీ లాంటి నలుగుర్ని కేకేసుకురా... దీన్ని యిక్కణ్ణుంచి తర్లించి వెయ్యాలి..... తాళ్ళూ అన్నీ వాళ్ళనే తెచ్చుకోమని చెప్పు. చూడు పాపం ఎలా

ఉందో యిది రెండేండ్లయి వట్టిపోయి.... తిండిలేక చిక్కిపోయి...బతికున్నప్పుడయినా చచ్చినట్టు కనిపించేరకం ఎలా చచ్చిపోయిందో ఏమిటో వాళ్ళతో నువ్వేం అనకు.... అన్నీ నేను చూసుకుంటాను. అన్నీ సరిగ్గా చేసుకురా.... ఇదిగో రెండొందలు. వాళ్లకేం యిస్తావో నువ్వేం తీసుకుంటావో రెండోకంటివాడికి తెలీకూడదు. జాగ్రత్త....'

ధర్మసందేహం పచ్చనోట్లు కళ్ళకద్దుకుని రొంటిన దోపుకుని పరిగెత్తేడు. గేటు వేసేసి షణ్ముఖశర్మ లోపలికొచ్చాడు ఆలోచిస్తూ: 'నేను తింటాను, ఒకడికి పెడతాను. అందరికీ ఇంత కరుణ రసార్ద్ర దృష్టి ఉంటే లోకం ఎప్పుడో బాగుపడిపోను. వీడికో పదో పరకో ఇచ్చి మిగిలింది కాజేస్తే నాకు అడ్డెవరు? అయినా నా అయిదు వేలూ నాకు ముడుతోంది గదా! హోమ గుండం అనేది కల్పిత పాత్ర అని ఎవరికైనా తెలుస్తుంది. మా బావమరిది అనేవాడు లేనేలేడనీ జగపతి శాస్త్రులు నా అపూర్వసృష్టి అనీ ఎవరు పోల్చగలరు? వెర్రి గేబ్రియల్! మన తూర్పు బుర్రల ముందు వాళ్ళెవనగా ఎంత! ఎవరికి తెలిసి చచ్చింది! అది ఎవరిదనే చచ్చు ప్రశ్న దేనికి? అది మాజాతికే జీవగర్ర. దాన్ని చేతికర్రతో మోది చంపితే భరించడానికి మేమేనా అంత గాజులు తొడిగించుకున్నది! ఇంతకీ దీన్నిక్కణ్ణుంచి తొలగించేస్తే రేపొద్దున్న దీన్ని వీడుచంపేడని నలుగుర్నీ నమ్మించడం ఎలాగ?

షణ్ముఖశర్మ పచారు చేస్తూ ఆలోచించసాగేడు. అట్టే సేపు గడవకుండానే అతని మొహంలో ఒక వికృత దరహాసరేఖ వచ్చిపడింది. వాహకులచేత దీని శవాన్ని పశువుల ఆస్పత్రికి చేర్పిస్తేసరి. అక్కడి వెటర్నరీ డాక్టరు ఎవరు, అపరిమితకుటుంబంగారు. తన కోవలోకి చెందని వాడేం కాదు, వాడిచేత పోస్టుమార్టెమ్ చేయించవచ్చు. కావలిస్తే నిజమే చెప్పి చావనీ, ఏం చేస్తాం! గోవు ప్రాణం ఎందుకుపోయిందో కొట్టిన దెబ్బేకదా దాఖలా! ముందు ఆ అయిదువేల రొక్కం చేతిలో పడ్డాక ఎంత కథయినా నడుపుకుని రావొచ్చు.

కొద్దిగా వెన్నెల వచ్చింది. షణ్ముఖ శర్మ తలెత్తి బిల్డింగ్ వైపు చూశాడు. 'ఏమాత్రం వెలుగుతావో ఇప్పుడే వెలిగెయ్యవే భవనమా' పాపం రేపీపాటికి నీ నామరూపాలు ఉండవుగదా! మా యజమాని మతప్రచారకులుంగారు పాపం ఆసుపత్రిలో మూలుగుతూనే ఉంటాడో కుంభీపాక నరకంలో కూరముక్కలా పెనంలో వేగుతూ ఉంటాడో...'

శర్మ ఆవు శరీరం దగ్గిరకొచ్చేడు. అతనికి నవ్వొచ్చింది. చచ్చిన గోశరీరం ఖరీదు అయిదువేల రూపాయలు! ఈ సారైనా మెరక వీధి మెరుపులకి ఎగబడకుండా సొమ్ము జాగ్రత్తపెట్టి పెద్దపిల్లకి పెళ్ళి చెయ్యాలి.

పాపం వెనకకాళ్ళ రెండిటిమధ్యా చావు దెబ్బ తగిలినట్టుంది. కసాయివాడు ఎంత పనిచేశాడు. శర్మకి ఎప్పుడో చిన్నప్పుడు చూసిన సినిమాలో పాటలో ఓ చరణం జ్ఞాపకం వచ్చింది. అనుకోకుండా పైకి పాడసాగేడు. 'గోమాతా నిను కొలచిన వారికి, కొరత తీరునట, కాదా?'

వాళ్ళు వస్తున్నట్టున్నారు. అడుగుల చప్పుడు దగ్గిరవుతోంది. ఫాదరీ చేతికర్ర దెబ్బతగిలి ఆవు చచ్చిపోయిందనే సంగతి వాళ్ళకి తెలియనివ్వడం ప్రమాదకరం. ముందే అంతా గోల అయిపోతే తన చేతిలో పడవలసిన రూపాయలు పడవు. కేవలం వృద్ధాప్యం వల్ల చచ్చిపోయిందని వాళ్ళని నమ్మించాలి. దెబ్బ కనపడకుండా, తోక దగ్గర అడ్డుగా, కూచున్నంత పని చేశాడు షణ్ముఖం. అసలే కముకు దెబ్బ తిని, సొమ్మసిల్లి చచ్చినట్టు పడి ఉందేమో. దెబ్బతిన్న ఆయువు పట్టుమీద

కూచోగానే వె(రినొప్పి కలిగింది ఆవుకి భరించలేని బాధతో పిచ్చి బలం వచ్చేసింది దానికి. శక్తి అంతా కూడగట్టుకుని ఒక్కసారి లేచి ఒళ్ళు తెలియని బలంతో తన్ని, గెంతువేసింది.

ధర్మ సందేహం, యమకింకరుల్లాంటి నలుగుర్ని తీసుకుని. అక్కడికి వచ్చేసరికి ఆవు స్థానంలో శర్మ ఒళ్లు హూనమై, కొస(పాణంతో మూలుగుతూ కనిపించాడు. ఆవు కష్టపడి కాంపౌండ్ గోడ గెంతి, ఆవలపైపు చేరుకుని అయిదు నిమషాలు దాటింది!

*(జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక 1970)*

# వెన్నెల్లో విహరించు

18



**వేనూ** మా అక్కయ్య రేవతీ పుట్టింది ఒక కడుపునే అయినా విడివిడిగా పెరిగాం. మా అక్కయ్య పెళ్ళినాటికి నాకు బాగా చిన్నతనం. అప్పట్లో మాకు బాగా ఆస్తి ఉండేదిట. ఇంట్లో మొదటి పెళ్ళి కదా అని ఒళ్ళూ పై తెలీకుండా ఖర్చుపెట్టేశాడుట నాన్న. ఆ అయిదు రోజుల పెళ్ళి ఆఖరు రోజున మాకు వ్యతిరేకంగా కోర్టు తీర్పు అయి మా ఆస్తి అంతా అన్యాక్రాంతం అయినట్టు తెలిసిందిట! ఆ దెబ్బతో మంచం చేరిన మా నాన్న మరి లేవలేదుట. మా పెద్దమ్మ మొగుడికి ఎంతో కష్టంతో నన్ను దత్తత యిచ్చి మరీ కన్ను మూశాడట.

పట్నంలోని మేడింటికి మా పెద నాన్నా వాళ్ళతో మకాం మార్చేయడంతో మా మధ్య దూరం బాగా పెరిగింది. మా ఇద్దరి మధ్యా ఉన్న ఇరవై ఏళ్ల వయసు తేడా సరేసరి అయితే మా అక్కయ్యకీ నాకూ మధ్య నున్న అసలైన అగాధమేమిటో నా పెళ్ళినాడు గాని అవగాహన కాలేదు.

మా అక్కయ్య కూతురు అనూరాధనే నేను పెళ్ళి చేసుకున్నది.

చెప్పకేం ఆ పిల్లని చేసుకోడం మా పెద్దమ్మ కాట్టే యిష్టం లేదు. 'ఆ రేవతిని అన్నీ పాత

పద్ధతులు. ఇక్ష్వాకుల కాలం నాటి ఆచారాలు. ఆ ఇంటి పిల్లని తెచ్చుకుంటే మనం సరిగా సర్దుకుపోలేమేమోనని నా భయం' అని మొదట్లోనే స్పష్టీకరించింది. ఇంకా మే ఇలా పడుగూ పేకా వేస్తూ ఉండగానే ఓనాడు అక్కని తీసుకుని మా బావ మా యింటికి వచ్చేశాడు.

ఆ అమ్మాయి చక్కదనం ముందు మా అనుమానాలన్నీ చెల్లా చెదరు అయిపోయాయి. మా పెద్దమ్మ కూడా మరేం అడ్డు చెప్పలేదు.

'ఇలా అనూని ఇక్కడికి తెచ్చినట్టు మా రేవతికి తెలిసిందో ఇంటికి నిప్పెట్టేస్తుంది. దానివన్నీ రూల్సు, ఆధునికి భావాల్ని అర్థం చేసుకునే తాహతు అది సంపాదించలేదు. మీకు మా అనూనచ్చినందుకు సంతోషం. మరోసారి పెళ్ళి చూపులంటూ మా యింట్లో యధావిధిగా ఏర్పాటు చేసి మీకు తెలియజేస్తాను. అప్పుడే వచ్చి చూసుకున్నట్టు మా యింట్లో చెబుతారుగా!''

ఇవతలి గది లోంచి ఇలాంటివి వినపడుతున్నా నా చూపులు మాత్రం పక్క గదిలోని గోడల్నీ చీల్చుకుని అక్కడ నిలబడిన అనూరాధ బట్టలు చీల్చుకుని ఎక్కడెక్కడో స్పృశిస్తున్నాయ్!

పెళ్ళినాటి పేచి అంతా మగపెళ్ళివారిదే అని చెప్పుకుంటారు. మా విషయంలో మాత్రం జరిగింది దానికి పూర్తిగా వ్యతిరేకం. ఆ రెండ్రోజులూ ఎక్కడ చూసినా మా అక్కయ్య గొంతుక ఆ పెళ్లి పందిట్లో మార్మోగి పోయేది. మా వాళ్ళు ఎక్కడికక్కడ సరిపెట్టుకుని సర్దుకు రాబట్టిగాని మరొకరైతే అక్కడికక్కడే తెగతెంపులు చేసుకుని వచ్చేసి ఉందురు.

మాట వరసకి ఇప్పటి పెళ్ళిళ్ళలో డ్రింక్ పార్టీ అనేది వీడియో తియ్యడం అంత సర్వ సహజం. నలుగురూ ఆమోదించి ఆచరణలో పెడుతున్నంత కాలం దాని మంచి చెడ్డల విమర్శ అప్రస్తుతం. అయినా మా నారాయణ బావ అక్కయ్యకి జడిసి ఆవిడకి తెలీకుండా పార్టీ ఏర్పాటు చేశాడు. పెద్ద పెద్ద ఫంక్షన్సులో ఇలాంటివి దాగుతాయి గనకనా! 'ఇలాంటి దగుల్బాజీతాగుముచ్చు సంబంధం అనుకోలేదు' అంటూ ఆవిడ ఎగరగొట్టిన దుమ్ము మా వాళ్ళ కళ్ళల్లో పడి మందు మీద ఉన్నారేమో చిందులు తొక్కేశారు. వాళ్ల కాళ్ళా వేళ్ల పడేసరికి మా నారాయణ బావ నవ నాళ్ళూ క్రుంగిపోయి ఉండాలి.

ఏమైనా సొంత అక్కయ్యలో ఇంతగా విజృంభిస్తున్న స్టుపిడిటీకి తట్టుకోలేక నా మనసు విలవిల్లాడింది. పిల్లకి తల్లిగాలి సోకకుండా మా బావ అంత చిన్నతనం నుంచీ అనూని పై ఊళ్ళో హాస్టల్లో పెట్టి ఎందుకు చదివించాడో అర్థమయింది. అయితే పగలంతా నన్ను అల్లరి పెట్టిన ఆలోచనలన్నీ ఏ రాత్రికి ఆ రాత్రి పడక గది గడప దగ్గిరే ఆవిరి అయిపోయేవి.

అలా మిడిసి పడుతూ ఎగిరెగిరి సాగిపోతూ ఆరంభమయిన మా సంసార జీవనం, కాస్త కుదురుగా కొన్నాళ్ళు నడిచి ఈ అయిదేళ్ల తర్వాత ఈ మధ్య అతి నెమ్మదిగా దొర్లే స్టేజికి చేరుకుంది. నాలుగేళ్ల శశికాంత్ ఏడాది తారా మా ఇంట్లో ఉదయించిన మాట నిజమేగాని సొగసులు కాదని లొసుగులు ఎత్తి చూపే స్థితికి దిగజారిపోయాక, ఇక కాపురాల్లో కాంతులు ఎలా కనిపిస్తాయ్?

లోపాలు కనపడక పోవాలే గాని అణువంతటివి అంతరిక్షం సైజుకి ఎదిగిపోడం అదెంత సేపు! మాట వరసకి ఆడదాని కళ్లల్లో దుమ్ముకొడితే మగాడి తప్పేమోగాని తన మటుకు తను వేరే దమ్ముకొట్టుకుంటే అదో బ్రహ్మహత్యా పాతకమా! అప్పటికీ ఫామిలీ లేడీసు ఇలాంటివి ఆమోదించరని మనసు ఎలాగో ఉగ్గబట్టుకుని, పెళ్ళికి ముందే నా బ్రెయిన్‌కి పెయిన్‌బామ్ లాంటి ఆ చెయిన్

స్మోకింగుని ఎలాగో అపు చేసుకున్నాను. నా పాంటుకి లోపలి వైపు సీక్రెట్ పాకెట్‌లో ఉండే సిగరెట్ పెట్టి ఎప్పుడూ గుర్తు చేస్తూనే ఉంటుంది. అయినా ఇన్నాళ్ళూ నిగ్రహించుకువచ్చానా లేదా?

కొత్తగా వచ్చిన కుర్ర స్టెనోతో ఆ రోజు కబుర్లలో కాలం దొర్లిపోయి ఇంటికొచ్చాకగాని గుర్తు రాలేదు, అనూని ఆ వేళ సినిమాకి తీసికెళతానని మాట ఇచ్చానని. పిల్లల్ని తీసుకుని అప్పుడే ఆవిడ రిక్షా ఎక్కి పావుగంట దాటిందంటూ పక్కింటి వాళ్లు తాళాలు ఇచ్చారు.

గిల్టీగా ఫీలయినప్పుడు బుర్ర పల్టీలు కొట్టకుండా చురుకుదనం కలిగించే పనిముట్టు సిగరెట్టు. అలా ఊదేస్తూ ఊహాలోకాల్లో ఈ దేస్తూ ఎంత సేపు గడిపానో నాకే తెలీదు. అనూ గావుకేకల్లో ఈ లోకంలోకి వచ్చి చూట్టూ పరికించాను. టిక్కెట్లు దొరక్క పిల్లల్తో ఏ సందున ఇంట్లో దూరిందో మరి, నలుగుర్ని కేకేసుకు వచ్చి మరీ మీటింగు పెట్టినట్టుంది.

'చూశారా! చూశారా! ముగ్గులు పెట్టిన తులశమ్మ ముంగిట్లో శుక్రవారం పూటా కాండ్రించి ఉమ్ములూ, కాల్చి పారేసిన సిగరెట్టు పీకలూ! పవిత్రమైన మునీశ్వరుల యాగవాటికల్ని రక్తమాంసాలు పోసి రాక్షసులు ధ్వంసం చేశారంటారు చూశారా, ఇదిగో ఇలాగ ........,

నలుగురి మధ్య తల తీసెసినట్టు చేసి పారేస్తే మాటాడక ఊరుకుంటే నా మగతనం ఏం కాను! తిప్పి కొట్టే అవకాశం అతి త్వరలోనే చేజిక్కింది.

అనూరాధకి ఎడంచేతి చూపుడు వేలూ, మధ్య వేలూ జోడించి నోట్లో పెట్టుకుని పీల్చే అలవాటు పెద్దయ్యేదాకా ఉందని విన్నాను. పెళ్లయాక కూడా అప్పుడప్పుడా అతీంద్రియావస్థలో మునిగి తేలుతూ ఉంటుందని అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. ఏదో ఫైలు మరచిపోయి నేనోనాడు ఇంటి కొచ్చేసరికీ ఇదీ దృశ్యం! వెంటనే కెమెరా క్లిక్ మనిపించే దాకా ఉండలేకపోయాను. ఆ ఫోటో నాలుగు కాపీలూ ' నిర్మల గంగ నిజస్వరూపం' అనే కేప్షన్‌తో సహా ఆ చుట్టు పట్ల నలుగురికీ అందజేస్తేగాని నా పగ చల్లారింది కాదు, ఏం చెయ్యమన్నారు!

అవును! ఏం చెయ్యమన్నారు.... విడివిడిగా మే చెడ్డవాళ్లం, కాదు కలివిడిగానే మాలో ఏ కలహం పుట్టినా ఒకప్పుడు ఏకాంతంగా ఉన్నప్పుడే ఎత్తిపోతలు ఈ మధ్య పక్కని గుంట జంట ఉన్నా పరుషాలు ఆపలేని పౌరుషాలకు పాల్పడుతున్నాం. మరీ ఇటీవల కాలంలో ఏ రైల్వే ప్లాట్ ఫాం మీదయినా సరే జుత్తు జుత్తూ పట్టుకోడానికి మేమిప్పుడు సిద్ధం. పోనీ యీ మాత్రపు స్వారస్యంతోనైనా మా సంసారం సాగిచావకూడదా? ఏదో సుఖపడి అఘోరిస్తున్నట్టు మా అత్తగారు దిగబడింది. అదే, మా అక్కయ్య రేవతి!

ఉన్న ఒక్క కూతురి దగ్గరికీ నిలుచున్న పాళంగా దిగిపోడానిక ఆవిడకీ అభ్యంతరం ఏం లేదుగాని, ఆ కూడా వచ్చిన సామాను చూస్తే నాకు కళ్లు తిరిగేయి. ఇలా దిగిపోయిందేమిటా అనిపించింది. 'రెణ్ణెల్ల కిందటేగా బావ రిటైరయిందీ, ఏకంగా యిక్కడికి వచ్చేస్తారనే అనుకున్నాం. అక్కడ మీ యిల్లు అమ్మకం పెట్టేరా? అన్నీ అయి పోయాక ఏకంగా ఇద్దరూ లారీతో వచ్చేస్తే బావుణ్ణు కదా! నువ్వు వచ్చేస్తే ఈ వయసులో ఆ ఒంటరి మనిషికి ఇబ్బందేమో! అనే నా మాట యింకా నోట దాటనేలేదు, అక్కయ్య చుర చుర చూసింది. 'ఏ వయసులో అయినా మీ బావ ఇబ్బందికీ, నేనింటి పట్టున ఉండడానికీ ఎటూవంటి సంబంధమూ లేదులే, నువ్వాట్టే కంగారు పడనక్కర్లేద్దు!' అంటూ ఓ విషపునవ్వు నవ్వి విసురుగా లోపలికి వెళ్లిపోయింది. ఈవిడ కూతురు

మాట మామూలుగా ఉండదు, ఏదో అరచినట్టు ఉంటుంది.!ఇక ఆ తల్లిగారి పలుకు కిటుకు ఇప్పటికీ నాకు తెలిసింది. ఎక్కడో చరిచినట్టు ఉంటుంది. ఎవరో కరిచినట్టు ఉంటుంది.

చూడ్డానికయితే ఆ కూతురి తల్లిలా ఉండదు, అక్కలా ఉంటుంది. శరీర సౌష్టవం మాట అలా ఉంచి మరి ఏ వేళప్పుడు ఏ సందున ఇంత హెయిర్ డ్రైపూసేస్తుందో ఒక్క తల వెంట్రుక పండ నివ్వదు. ఈ వయసులో రోజుకి ఎన్ని సెట్లు మారుస్తుందో కట్టుకున్న బట్టనలగనివ్వదు. ఇంతటి నీట్‌నెస్ చూసి ఇదంతా మోడ్రన్ అవుట్ లుక్ అనుకుంటే ఇంతకన్న తప్పు అంచనా ఉండదు!

ఈ ఆడవాళ్ళిద్దరూ ఎకరికివారే ఒక్క చూపుడు వేలు మీద ఈ భూచక్రాన్నంతా తిప్పగల సమర్థులమనే సంపూర్ణ విశ్వాసంతో ఉన్నవారు! ఇక వీరిద్దరూ ఒక చోట చేరితే నాలాంటి మామూలు శాల్తీలు ఆ శక్తిద్వయానికి ఆనుతారా! ఆ ధాటీకీ ఘాటుకీ తట్టుకోలేక నెల్లాళ్ల దాటకుండానే మా బావదగ్గిరికి పరిగెత్తాను. అదొక్కటే కాదు. నారాయణ బావ ఎవర్తినో చేరదీసి పబ్లిగ్గా కాపరం వెలిగిస్తున్నాడనే స్కాండల్ అక్కయ్య నోటనే కాదు, ఎందరో చెప్పగా విన్నాను. 'ఈ వయసులో ఇదేం పోగాలం!' అని నిలదీసే అధికారం ఇంకా నాకుంది గనక హడావిడిగా బస్సెక్కేశాను. తీరా ఆ ఒక్క రోజూ వాళ్లతో గడిపాక నా మతి పోయినట్టయింది.

• నారాయణ బావ కొత్తగా పెట్టిన ఎంసెట్ కోచింగ్ సెంటరుకి పార్వతమ్మ ప్రిన్స్‌పాలట. భర్తా పిల్లలూ యాక్సిడెంటులో పోతే పుట్టిల్లయిన ఆ ఊరు చేరిందట. ఏడాదయాక కాస్త తేరుకుని బావ ఆధ్వర్యంలో మిగిలిపోయిన ఎమ్మే పేపర్లు కట్టి, కిందటేడే డిగ్రీ తెచ్చుకుందిట.

లోకంలోని చిత్రాలన్నిటిలోకి చిత్రమైంది ఏమిటంటే అప్పటి వాళ్ళిద్దరి అనుబంధమూ అనిపించింది నాకా క్షణాన ఒకే కడుపున పుట్టిన అక్కయ్య యింట్లో అడుగు పెట్టినప్పుడు ఎంతో బెరుకుగా దిగులుగా ఎప్పుడు పోదామా అన్నట్టు ఉండేది నా ప్రాణానికి. ఎంత తెలిసిన వాడినయినా అతిధిని కదా, ఆ ఒక్కరోజైనా కొంప నిశ్శబ్దంగా ఉంచడానికి మా బావ నోచుకుని ఉండద్దూ! మామూలు కంటె పై స్థాయిలోనే కొంప ఎగిరిపోయేది.

సీరియస్ టైపు తగవులన్నిటికీ కారణాలు సీరియస్‌గా ఉండాలని లేదు, సిల్లీగా ఉంటాయి కూడా.

బూరెల మూకుడు కాస్త పై వైపు మసి ఉండిపోయిందనీ, దాంతో ఆనాటి మడి ఆమూలాగ్రం తగలడినట్టేనీ, తద్వారా తలపెట్టిన సమస్త పూజావిధానమూ సర్వనాశనమై మన్వంతరాలన్నీ మంట కలసిపోయినట్టేననీ పని మనిషి అప్పలమ్మ మీద అక్కయ్య రేవతి గావు కేకలు.

ఆ కేకల ధాటికి జడిసి అప్పుడే నిద్రకి ఉపక్రమిస్తున్న అతిధి తమ్ముడు హడలిపోయి మంచం మీంచి కింద పడినా ఆవిడ ఊరుకోదు. అవమాన భారంతో గుండె దెబ్బతిని యింటాయనకి పల్సు అందకపోయినా ఆవిడ లక్ష్యపెట్టదు. కంటికి కనిపించే తమ్ముడూ కట్టుకున్న మొగుడూ, ఇలాంటి శాల్తీలు ఆవిడ దృష్టిలో ఎలా పోయినా బాధ లేదు. ఎక్కడ ఏ మాత్రం దోషలేశమయినా అంటకుండా పరమ పవిత్ర స్థాయిలో నోములూ వ్రతాలూ, పూజలూ పుణ్యావహాచనాలూ నిర్వహించబడి గోత్రాలు ఆచంద్రార్కమూ గౌరవించబడాలి. ఋషులు శాంతించాలి, దైవాలు దీవించాలి, మనుషులు ఎలా తగలడితేనేం!

ఇంతకీ ఎవరి ఆరగింపుకి ఏ ప్రసాదం చేయించాలని చూసినా ఆ పని జరిగేది ఆ మూకుడు లోపలి వైపున గాని అవతలి వైపున కాదు. ఇటువైపు పరిశుభ్రంగా తళతళ లాడుతున్నంత కాలం అటు వైపు నుంచి వచ్చి అంటుకుని కులభ్రంశం చేసే కల్మషం ఏమిటో రీజనింగుకి మాత్రం అందదు!

తల్లి చేసిన ఈ మూకుడు తోముడు ఆర్భాటం గుర్తుకు తెచ్చుకున్నపుడల్లా మొదట్లో వాళ్లమ్మాయి చేసిన 'ఒకే నూతిలో రెండు రకాల నీళ్ల ఉదంతం ' కూడా నన్ను వెంబడిస్తూ ఉంటుంది.

మేం మొట్టమొదట్లో కాపురం ఉన్న యింటి పెరట్లో ఓ నుయ్యి ఉండేది. సిమెంటు చప్టా, మంచి గిలకా కూడా ఉండేవి. బాల్చీ తాడూ మాత్రం మావి. దాసీ మనిషి రాగానే బాల్చీ తాడూ ఇచ్చేది మా అనూరాధ. నీళ్లు తోడి, అంట్లు తోమి, వాడుక నీళ్లు బాల్చీలలో నింపి దాసీ మనిషి దూరంగా వెళ్లిపోయేది. కాస్సేపటికి అనూ వచ్చేది. అంతకు ముందు రోజు ఉంచుకున్న నీళ్లతో చప్టా కడుక్కునేది. బాల్చీ సబ్బు గుండతో తోముకుని తాడు మీద పసుపు నీళ్లు జల్లుకునేది. నీళ్లకి కులం లేదని అనుకునేరు ఒకే నూతిలోంచి అవుతే ఔగాక దాసీది తోడినవి వాడకానికి, వాటి పేరు కాపనీళ్లు! అమ్మగారు తోడినవి తాగడానికి, వాటి పేరు బ్రహ్మణ నీళ్లు!

నా మనసు వర్తమానానికి మళ్లిస్తూ పార్వతిని పరిచయం చేస్తూ బావ 'ఇదుగో ప్రిన్సిపాలు అయిన నాటి నుంచీ యీవిడే నా బ్రెడ్ విన్నర్' అంటూ నాకే వినపడేలా 'మరీ ఈ మధ్య బెడ్ విన్నర్ కూడా' అని పూర్తి చేశాడు. ఆ ఆఖరి వాక్యం నా గుండెల్లో అలా దిగబడిపోయింది. ప్రయారిటీస్ ఏమిటో తెలుసుకోకుండా ప్రగతి అంటే అర్థం చేసుకోకుండా మూఢత్వం తోనే ముక్తి అనుకునే మా అక్కయ్య కాపరంలో మా బావ మొహం ఒక్కసారంటే ఒక్కసారైనా ఇంతగా వెలిగిపోలేదు.!

పించెను పుచ్చుకున్నాకైనా పింఛెం విప్పి ఆడింది ఆ మనసు, అదెంత కాదు! అలా దోహదం చేసిన ఆ మనిషిదెంత గొప్ప మనసు!

నారాయణ బావ జీవితంలోని చివరి మలుపు నాకు చెప్పకుండానే గొప్ప సందేశం అందజేసింది. ఏ పాతికేళ్లు మా అక్కయ్యతో ఏంపడ్డాడో మహానుభావుడు, పద్మశ్రీ యివ్వొచ్చు. అయిదేళ్ళకే నాదారి నాకు చూపించిన వాళ్లమ్మాయి బృహశ్శక్తికి జోహర్లు. ఇద్దరూ ఓ చోట చేరారు గనక ఒకరు జీవాత్మ మరొకరు పరమాత్మా అనుకుని కలిసిపోయి కాలక్షేపం చెయ్యగల చరితార్థులు. ఉప్పు, పులుసూ తిని సారమూ స్పందనా ఆశించే నాలాంటి జీవికి మరో దారి తప్పదు. రుక్మిణిని లేవదీసుకు పోయిన శ్రీ కృష్ణుడే సుభద్రని ఏ వేషం వేసి ఎలా లొంగదీసుకోవాలో అర్జునుడి లాంటి నరులకు సూచించగలడు. ఏమైనా ఇక ఆలశ్యం చేసి నేను సాధించకునేది ఏమీ లేదు. మన యింట్లోకి వెన్నెల రాదు. మనమే వీధిలోకి పరిగెత్తి వెన్నెలలో విహరించడం నేర్చుకోవాలి.

*(జ్యోతి మసపత్రిక, ఉగాది '88)*

# ఇలా అయితే దేశం బాగుపడ్డట్టే !




**'దేశమొక్కటే,** మన దేశమొక్కటే!' అని రేడియోలోంచి వస్తున్న దేశభక్తి గీతం విని తుళ్ళిపడ్డాడు జోగారావు. 'నేనేం తప్పుగా వినలేదు కదా' అని మరోసారి మరింత శ్రద్ధగా చెవులు నులుపుకున్నాడు. 'దేశ మొక్కటే, మన దేశ మొక్కటే! అదే పల్లవి. మళ్ళీ మళ్ళీ.... ఆహా, పెడదారి పట్టిన శ్రోతల్ని ఆకాశవాణి వారు ఎంతో శ్రద్ధతీసుకుని ఎంత బాగా మంచిదారి వైపు మళ్ళిస్తున్నారూ! ఈ రెండు బేండ్ల ట్రాన్సిస్టరుకి లైసెన్సు కూడా రద్దు చేశారే, ఇక ఎలా ఈ ఋణం తీర్చుకోవడం!' అని కావాలనే, పక్కనున్న పెళ్ళానికి వినపడాలనే తనలో తను జనాంతికంగా గొణుక్కున్నాడు. రాధ మళ్ళీ అడక్కుండానే 'ఇన్నాళ్ళూ మనది రెండు, మూడు దేశాల కలయిక కాబోలు అనే భ్రమలో కొట్టుమిట్టాడుతున్నాను. ఎన్నాళ్ళకి తెలిసింది....' అని రేడియో గొంతు బాగా తగ్గించి,

'దేశ మొక్కటే, మన దేశ మొక్కటే!' అని దాన్ని అనుకరిస్తూ పాడిన మొగుణ్ణి చూసి ముచ్చటగా నవ్వింది రాధ. నవ్వుతూ అంది ఊకలోంచైనా జోకు లాగగలరు. మిమ్మల్ని అత్తగారు 'జోగులూ' అని పిలవకుండా 'జోకులూ'! అని ఇప్పటికైనా పిలవడం న్యాయం. 'జోగారావు రాధ మాట

వినిపించుకున్నట్టే లేదు. తన మటుకు తను కొన సాగించాడు.

'మనసు వేదన చెందితే ఏదో వెర్రి జోకు వేసి తృప్తిపడక ఏం చెయ్యమన్నావు! చిన్న పిల్లల్ని నిద్రపుచ్చడానికి జోలపాటలు పాడుతారు. వెర్రి ప్రజ ఎక్కడ తెలివి తెచ్చుకుని మేలుకుంటారో అని ప్రభుత్వం తన ప్రచార సాధనాలన్నింటి ద్వారా ప్రజల్ని నిద్ర పుచ్చే జోలపాటలు ఇవి. లేకపోతే దేశంలో ఇంత ఎత్తు కొండలున్నాయి, ఇంత లోతు నదులున్నాయి అనుకుంటూ ఏ రోజు కా రోజు ఈ లిస్టు దేనికి? బతికే పరిస్థితులు సృషించడంలో ప్రభుత్వం ఎలాగా ఘోరంగా విఫలమైంది కనక ఆ ఎత్తు కొండలు ఎక్కి దూకమనీ, ఆ లోతు నదుల్లో మునిగి చావమనీ పరోక్షంగా సందేశం అంటావా!'' అంతటి వ్యంగ్యం భరించలేక 'మీ లాంటి వాళ్ళనే సినిక్స్ అంటారు' అంది రాధ. 'మరి నీలాంటి వాళ్ళని ఏమంటారు? అని మొగుడడిగితే 'ఆర్టిస్టు ' అంది అతన్ని ఊరించాలని.

'అంటే?'

'అంత సులువుగా నేను చెప్పలేను గాని ఒకలా చెబుతాను హిమాచలం ఔన్నత్యం, గంగానది గాంభీర్యం పొందికైన మాటలలో వీనులవిందు చేస్తూంటే ఇంతటిరువ్యాఖ్య ఆర్టిస్టయితే చెయ్యడు'

'వాడే కళాకారుడైతే చేసే తీరతాడు. హృదయమున్న మనిషి తప్ప కళాకారుడు కాలేడు. అలా అయినవాడు కళ్ళెదుటి అన్యాయాలకు చలించి, స్పందించి తనదైన ఆర్టిస్టిక్ మీడియంలో సాటి మనిషి కది అందించక మానడు. అమ్మాయి అందమైన బుగ్గ కళ్ళున్న ప్రతివాడికీ కనపడుతుంది. ఆ బుగ్గమీద అందరికీ కనపడని కన్నీటిచారని గుర్తించి, అందరి దృష్టి అటు మళ్ళించిన వాడే అసలైన ఆర్టిస్టు పైకి ఏదో శ్రద్ధగా వింటున్నట్టు నటించినా లోలోపల తనని తాను అభినందించుకుంటుంది రాధ. మొగుణ్ణి ఎప్పుడు రెచ్చ గొట్టాలో ఎలా, ఏ విధంగా కవ్వించాలో ఎరిగిన పడుచు ఆ విషయంలో రాధ ముందు ఎవరైనా దిగదడుపే అలా మాట్లాడుతున్నప్పుడు బహిర్గతమయే అతని వ్యక్తిత్వంలోని చైతన్యం ఆమెని ముగ్ధురాల్ని చేస్తుంది. అలా మధ్య మధ్య అంటిస్తూ హింటిస్తూ అర్థమైన ఆ హృదయం నుండి వాగ్రూపాన రాలిపడే రవ్వల్ని ఏరుకోవడం ఆ ముద్దరాలికి ఎప్పటికప్పుడు సరికొత్త ముద్దు.

'అయితే బుగ్గమీదికన్నీటిచారని పైకి చాటేవాడే ఆర్టిస్టు అందురూ, అలాకాక ఆ బుగ్గమీదే నవ్వితే పడే సొట్ట ఉంటేనో... దాని గురించి చెప్పక్కర్లేదనుకుంటా...'

అంటూ కిసుక్కున నవ్వేసింది రాధ. అదిగో అలాంటప్పుడే అంతటి తెలివైన అమ్మాయీ అనుకోకుండా అతనికి దొరికిపోతూ ఉంటుంది. అయినా ఓసారి సీరియస్‌నెస్ అవహించాక అతనంత సులువుగా చలించడు. తన ధోరణి నుంచి మరలడు.

'ఏ కళ అయినా మానసోల్లాసానికీ, మానవకల్యాణానికీ, అన్ని కోణాల్లోంచీ సత్యాన్ని చూపించడమే దాని లక్ష్యం, గమ్యం, బుగ్గమీద నొక్కూ చూపించాలి, కన్నీటిచారనీ చూపించాలి. అయితే రాజకీయ ప్రభంజనంలో కొట్టుకుపోయి ఏ కళ అయినా ప్రభుత్వ ప్రచార సాధనం స్థాయికి దిగిపోయింది. ఈ కట్‌త్రోట్ కాంపిటిటివ్ వ్యవస్థలో ఎంత పెద్ద సాహితీవేత్త అయినా పేరు కోసం వేసే వేషాలు చూస్తే మతి పోక మానదు. వెనకటికి నాకు బాగా పరిచయం ఉన్న ఓ కవిగారు ఓ గ్రంధరాజానికి ముందుమాట రాశారు. తీరా ఆ ఉద్గ్రంథం ఏమిటో అని చూద్దునూ, ఎక్కాలబుక్కు ...!నీ కా తమాషా చెప్పానో లేదో గుర్తు లేదు.'

"ఏదీ, ఇవాళ ఏదో గురి కుదిరంది గాని ఇలాంటి పెద్ద పెద్ద విషయాలు ఎందుకూ పనికిరాని మా ఆడాళ్ళతో చర్చించే అవకాశం మీ కేది?' అంటూ రాధ మరో సమిధ వేసింది.

'చెబుతూనే ఉన్నాగా మధ్య ఎందుకు ఆ సన్నాయి నొక్కులు! ఇవాళ ఆదివారం. నువ్వు తెచ్చిన ప్లేటెడు ఉప్మా కడుపులో పడింది. ఇక పన్నెండు దాకా మారు కాఫీ అయినా అడగను. విసుగెత్తి నువ్వు లేచి పోవాలి కాని ఇలాంటి జీవన్మరణ సమస్య వచ్చి పడ్డాక ఇక నేను ఆగలేను. అన్నట్టు ఎక్కాలబుక్కు, తొలిపలుకు రాసిన 'కవిరాజ విరాజ' గురించి కదూ నేను చెబుతూంట? ఆయన్ని బాగా ఎరుగుదును కనక వెళ్ళి నిలదీశాను. ఇలా మీరు చెయ్యటంలో ఔచిత్యం ఏమిటీ అని. ఆయన జవాబు చెప్పకుండా "ఎవరైనా చేతిలో అక్షింతలు పెట్టి 'ఇదిగో మా చెల్లాయికి ఇపుడే పెళ్ళయింది. దీవించండి' అంటే ఏం చేస్తావు?'' అని ఎదురు ప్రశ్న వేశారు. 'దానికే నెత్తి మీద ఆ అక్షింతలు వేస్తాను' అన్నాను. "ఆ అమ్మాయిని అదివరకు ఎరగవు. నీ ఆశీర్వచనం ఫలిస్తుందనే పెద్ద విశ్వాసమూ నీకు లేదు. మరెందుకు వేశావు? హౌ ఆర్ యు జస్టిఫైడ్?'' అని నన్నే నిరుత్తరుణ్ణి చేసి ''వెర్రిజోగయ్యా ఈ లోకంలో అనేక మొహమాటాలు ఉంటాయి. ప్రతిభ లేదు కదా అని మనదగ్గిరికి వచ్చిన వాళ్ళని కాదు పొమ్మనే అధికారం మనకి లేదు. ఇంతకీ ఎన్సైక్లోపీడియా అయినా, ఎక్కాలబుక్కు అయినా హెచ్చు తగ్గులుండొచ్చు గాని రెండూ పుస్తకాలే అనే సంగతి కాదనలేవు కదా! దేనికైనా సమదృష్టి ఉండాలి. ఆరాసినాయన నా బాల్యమిత్రుడు కాదనలేక 'అచ్చు బాగున్నది. అంకెలు స్పష్టముగా పడినవి. మరింత కృషితో గ్రంధకర్త ముందుకు రాగలడని నా సంపూర్ణ విశ్వాసం' అని మూడు ముక్కలు రాసిచ్చాను. పూర్తి సంతకం చేసి మరీ ఇచ్చాను. కావలిస్తే గ్రంథర్త పేరు చిన్న క్షరాలలోనూ, నా పేరు బాగా పెద్దక్షరాలలోనూ వేసుకోమనే సూచన నేనే ఇచ్చాను. పాపం, అలాగే చేశాడు. ఎంతటి భక్తుడో ' అని చెబుతూంటే ఆయన ధీమా చూసి ఒళ్ళుమండి. 'ఇంతటి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాక మీకు ఇలాంటి పనులవల్ల అపకీర్తి వస్తుందని భయం లేదా, మాష్టారూ?' అని నిలదీశాను.

'ఇంతటి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన తరువాత ఇదేమని ఎవరైనా నన్ను అడగడానికి ఎన్ని గుండెలు? ఇక మనవాడు ఎన్ని వేల ప్రతులు వేశాడో అన్నిటిలోనూ నా పెద్ద పేరు ఉంటూనే ఉంటుంది. ఇక ఏ విధంగా చూసినా నాకు పోయిందేమిటంటావ్?' అంటూ మళ్ళీ నోరెత్తకుండా చేశాడు. నా నోటిని మూశాడు. కాని మనసుని మూయలేడుగా!కల్తీ, కల్తీ అంటారు. సొంత లాభం కోసం మన దేశంలో కళాకారులు చేస్తున్న ఈ మానసిక వ్యభిచారం దుర్భరం. ఇలాంటివాడు ఒక్కడు మునిగితే ఎంత పవిత్రమైన గంగ అయినా పూర్తిగా కల్మషం అవుతుంది. పదవిలో ఉన్న నాయకులకు వీళ్ళు తాకట్టు పెట్టే పరజాలవు ఇంద్రజాలంలో సామన్య ప్రజ చిక్కుకుపోవడమే దేశానికి పట్టిన అరిష్టం. అందరూ అనను గానీ, మూడొంతులు మేధావులు, నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు దేశద్రోహులు. నిజం చెప్పడం కాదు. నిజాన్ని కప్పడమే - జనాన్ని లేపడం కాదు. జోకొట్టడమే ప్రస్తుతం వీరు చేపట్టిన బాధ్యత. ఓలక్షధికారి అచ్చులో తన పేరు చూసుకుందామనే ముచ్చటని ప్రోత్సహించి, వారి విరచిత ఎక్కాలబుక్కుకి ముందుమాట రాసే సాహిత్య ద్రోహానికి పాల్పడడమే గాక దానిని ఏ మాత్రం పాపభీతి లేక సమర్థించుకో చూచిన 'కవిరాజ విరాజ' లాంటి బరితెగించిన పండిత రౌడీలే ప్రస్తుతం దేశం నిండా, ఆ పై మెరుగులకి భ్రమపడి, ఆపై పై సొగసుల వలలో

పడితే ఇక నిజానికి చోటు ఇచ్చినట్టే, మంచివాళ్ళకి ఓటు వేసినట్టే! ఇంతెందుకు ఒకప్పుడు రంగు రంగుల గులాబీలు చూసి నేనే మతి పోగొట్టుకున్నాను.!

'ఏమిటీ, ఇంత సేపూ ఇన్నిన్ని పెద్ద కబుర్లు చెబుతున్న మీరే!'

'అవును, నేనే! మంచి మాటల మాయకీ పంచరంగుల చాయకీ తట్టుకు నిలబడలేని వయసు అది. ఇప్పుడే కాదు పుట్టి జ్ఞానం వచ్చిందగ్గిరనుంచీ నాలోని ఆర్టిస్టు నన్నేదో విధంగా అల్లరి పెడుతూనే ఉన్నాడు. ఎప్పుడూ అంతే, యూనివర్సిటీ చదువు పూర్తై మా ఊరు చేరిన సమయం అది. ఊరంటే పల్లెటూరు కాదు పట్నమే. కొద్దిగా వెనుకబడిన ప్రాంతం గాని, అదీ ఆ జిల్లాకి కేంద్రమే. మా వీధిలో నేను కాక సుధాకర్ అనే కుర్రాడు కూడా మా బ్యాచీ సబ్జెక్టూ కాదూ కానీ నాతో పాటు యూనివర్సిటీలోనే చదివేవాడు. అతని కేదో విప్లవ సంఘంలో సభ్యత్వం ఉందని మా వాళ్ళు నన్నతనితో కలవనిచ్చేవారు కారు. అతనిలో ఉన్న స్నేహ ప్రియత్వమూ, మృదుభాషణమూ నన్నతని వైపేఆకర్షింపజేసేవి. అయినా ఎప్పుడో కాని కలవడం కుదిరేది కాదు. ఆ సెలవుల్లో ఓ రోజు ఏమైందో తెలుసా?''

'ఏమైందేమైంది' అని రాధ ఆత్రుతగా అడిగింది జోగారావు కొనసాగించాడు.

'ఆ ఏడాది ఫైనలు పరీక్షలకని నేను ఓ ఏడాదిపాటు ఏ సెలవులకీ ఇంటికి రాలేదు. మా వీధి చివర డి.ఎస్.పి.గారి బంగళా ఉండేది. వాళ్ళబ్బాయి మాతో క్రికెట్ ఆడ్డానికి వచ్చేవాడు. ఆ సందర్భంలో వాళ్ళింటికి అతన్ని పిలవడానికి వెళ్ళేవాణ్ణి. ఇంటిముందు పెద్ద ఖాళీ జాగా ఉండేది. ముందు ముళ్ళ తీగెల కాంపౌండూ, గేటూ ఉండేవి. కాని లోపల అడ్డదిడ్డంగా పెరిగిన పిచ్చి మొక్కలు లోపలికి వెళ్ళడానికే అసహ్యంగా ఉండేది. అలాంటిది పాత ఆయన ట్రాన్సరై నేను వచ్చేసరికి కొత్త డి.ఎస్.పి.వచ్చి ఎనిమిది నెలలు దాటిందట. ఆ పాత ఆయనతో పాటు పొరుడుకూడా కొట్టుకుపోయినట్టుంది. ఈ కొద్ది నెలల్లో ఈ కొత్త ఆయన ఆ ముందు ఖాళీ జాగాకి ఎన్ని మార్పులు తెచ్చాడని! ఇప్పుడా బంగళాకి ముందు పొట్టిగా లైట్ బ్లూ కలర్‌లో ఉన్న సిమెంటు కాంపౌండు గోడ రాతిగోడ గనక ఏ రంగు వేస్తే అలాగే పడుంటుంది. దానికేంగాని, ఆ లోపల ఇప్పుడు ఏం కనపడుతున్నాయని! ఓహ్! ఎన్ని రంగుల గులాబీలు, ఎంత పెద్ద గులాబీలు! ఇలాంటి రకాల రాజా రోజాలున్నాయని ఎవరూ ఊహించనైనా లేరు! చూస్తే అసహ్యం వేసే ప్రదేశాన్ని కన్నుల వైకుంఠంగా మార్చిన ఆ కళారాధకుడి సౌందర్యదృష్టిని ఏమని పొగడాలి! మా వీధి చివరనే కదా ఆ బంగళా! కాళ్ళు అటే లాగేవి కళ్ళు అక్కడే నిలబడిపోయేవి. ఎన్నిసార్లు ఎంత సేపు చూసినా నా సౌందర్య తృష్ణ నన్ను మళ్ళీ మళ్ళీ అటే లాగేది. నేనే కాదు, నాతోపాటు ఏదో పనిమీద అలా వెళ్ళే ప్రతి ఒక్కరూ టక్కున అక్కడ ఆగిపోయేవారు. నాకోసారి అనిపించింది. ఇంతమందికి ఆయాచితంగా ఇంతటి సుందర సంపద పంచిపెట్టే ఉదారుణ్ణి ఒక్కమారు అభినందించి రావాలని దాని కోసం వేచి ఉంటే ఓసారి ఆ అవకాశమూ లభించింది. ఆయన అంతకు ముందే క్యాంపు నుంచి వచ్చి వీధి వరండాలో ఎవరి తోనో మాటాడుతున్నట్టున్నాడు. ఆ వచ్చినతను వెళ్ళిపోగానే వెళ్ళి కలుసుకుందామని అటే ఆత్రుతగా చూస్తున్నాను. వెనక నుంచి బలంగా భుజంమీద చెయ్యి పడితే ఇటువైపు తిరిగి చూశాను. సుధాకర్! నేనేందుకక్కడ నిలుచున్నానో చెప్పాను 'మీరూ రండి లోపలికి వెళదాం' అన్నాను.

అతను నవ్వి 'అలా కాదు, మీకొన్ని సంగతులు చెబుతాను. మీరు ముందు నాతో ఇలా రండి' అని బయటికి తీసుకువెళ్ళాడు. అతను చెప్పింది విని ఆశ్చర్యపోయాను, అలాంటి లైన్ ఆఫ్ థాట్ ఉంటుందని కూడా నేను ఊహించలేదు ఏం చెప్పాడో తెలుసా రాధా!

'జోగారావుగారూ! యూనివర్సిటీ చదువు పూర్తి చేసుకుని వచ్చిన ఉత్సాహవంతులూ, యువకులూ మీరు మీలాంటి వారే పై భ్రమలకి పరవశించిపోయి ప్రశంసాగీతాలు ప్రారంభిస్తామంటే, అక్షరంముక్క రాని ఈ వెర్రిప్రజ ఏం కావాలి! నాయకులకి బానిసలుగా పని చేసి, ప్రభుత్వ సేవకులుగా, ధనికులకి దన్నుగా, సామాన్య ప్రజకి కూటిలో మన్నుగా పని చేసే ఈ పోలీసు ఆఫీసరుల ఉదారదృష్టికా మీ జోహారు! ఇంతకీ ఈ బంగళా ముందున్న ఈ పూలతోట ఎవరి బాబుగారి సొమ్మండీ? ప్రజలు కట్టే పన్నులే కదా ప్రభుత్వం ఇచ్చే జీత భత్యాలు! ఇంతకీ ఈ పూలతోట వేయించడానికి ఎంత ఖర్చయిందో, ఈ అందమైన కాంపౌండుగోడకి ఆయన ఎంత బిల్లు సమర్పించాడో, కంట్రాక్టరుకీ ఆఫీసరుకీ అందులో ఏయే వాటాలు ఉండి ఉంటాయో మీరు ఆలోచించారా? ఈ కళ్ళ వేడుక ఎవరికండీ? మీలా, నాలా కడుపు నిండిన వారికే! ఈ వెనకబడిన జిల్లాలో ఎన్ని కరువు కాటకాలు విలయతాండవం చేస్తున్నాయో, ఇంత తిండి లేక దొంగతనాలకి దిగిన ఆకలి దొంగల్ని ఎందరు రాజకీయచోరులు జైళ్ళపాలు చేశారో, వీరికి శిక్షా వారికి రక్షా ఏ కళాపోషకులు ఇస్తున్నారో మీరెప్పుడైనా గమనించారా? ఇంతింత గులాబీల వెనక అంతంత ముళ్ళుంటాయి. వీటితోపాటు వాటినీ గమనిస్తే గాని మీరు ఆర్టిస్టు కాలేరు. బాగా ఆలోచించండి.'

ఆ రోజుల్లో సుధాకర్ వేసిన వివేచనా బీజం ధర్మమా అని నాలో క్రమంగా విచక్షణ పెరిగింది.పై మెరుగుల దేశంలో ఎలాంటి అందమైనా సందేహించతగిందనే నా సందేశం, రాధా!

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 29-8-84)*

# అలాగేనా అంచనా ?




**'ఎందుకురా** కుర్రాణ్ణి అలా ఏడిపించావ్?' అన్నాడు రాజారాం నాతో.

'రూపాయి యిచ్చి ఒక కవరుకొనుక్కుని రమ్మని పంపిస్తే మిగిలిన ఎనభై అయిదు నయాపైసలూ పెట్టి క్వాలిటీ ఐస్‌క్రీమ్‌ట కొనుక్కుని తినేశాడు. వెధవ, డబ్బువిలువ నీడికి ఎప్పుడు తెలుసుకొస్తుందీ? ఆ డబ్బుతో ఒక బీదవాడికి పూర్తి భోజనం లభించునే!' అన్నాను నేను. ఎక్కడ విందో ఆమాట, మా ఆవిడ తారాజువ్వలా వచ్చిపడింది.

'అవునవును... నోరెరగని గుంట నాగమ్మ వాడు చేస్తే తప్పొచ్చింది. నాలుగురకాల బూట్లు వుండగా మనం నలభై అయిదు తగలేసి ఎంబాసిడర్ బూటు కొనుక్కున్నాం. ఆ డబ్బుతో ఒక బీదకుటుంబం నెల్లాళ్ళు జీవించగలిగి ఉండును. మనల్ని వేలెత్తి చూపే వాడెవడు!'

'మీరు ఉన్నారు కారుటమ్మా?'. అన్నాడు చటుక్కునే రాజారాం.

'అవునవును అలా అడుగు' అన్నాను నేను మరేమీ అనలేక.

'నేను అన్నాననికాదు, ఆ వస్తువు అంత అవసరమేమో కనుక్కోండి' అంది మళ్ళీ. నేను

వెంటనే అందుకున్నాను.

'అబ్బెబ్బే లేదు. కిందటి నెలలో ఎనభై పెట్టి నువ్వు కొనుక్కున్న టెరిలిన్ చీరే అత్యవసరమూ, నిత్యోపకరమూ. అవునా? అయ్యోదేశం ఎంత క్లిష్టపరిస్థితిలో ఉంది. మన బాధ్యత ఏమిటి? మనం ఎంత క్లుప్తంగా ఖర్చుపెట్టాలి అన్న ఇంగితం ఇంటిదానికే లేనప్పుడు చెమటోడ్చి సంపాదించే మగవాడికి చిన్న చిన్న సరదాలు తీర్చుకోడానికి అధికారం లేదా?'

'మీరిలా పరస్పరం పరుషవాక్య ప్రయోగం చేసుకుంటూంటే తిన్న దెబ్బలమాటే మరచిపోయి మీవాడు ఎంత హాయిగా వింటున్నాడో చూడండి.'

రాజారాం ఆ మాట అంటుంటే మా వాడు సిగ్గుపడి అక్కణ్ణుంచి పారిపోయాడు.

'నువ్విలా మాట మారుస్తే నేను ఊరుకుంటా ననుకున్నావ్ కాబోలు అదేం కుదర్దు. ఈ విషయంలో నీ అభిప్రాయం చెప్పు' అన్నాను నేను.

'అవును. ఇష్టమైన చీర ఒకటి కొనుక్కున్నందుకు ఇన్ని మాటలు పడవలసి వస్తుందని నేనూ అనుకోలేదు. ఇదేం బాగుందో మీరే చెప్పండి' అని సరోజ అక్కడి కుర్చీ లాక్కుని కూచుంది.

'మీ సంసారపు ఖర్చుల విషయంలో మాటాడడానికి నాకు ఏవిధమైన అధికారమూలేదు. అది కేవలం మీ వ్యక్తిగతం అయినా అడిగారు కాబట్టి అంటీ ముట్టనట్టు ఊరుకోవడం అనుచితం. నా అభిప్రాయం చెప్పేముందు నాకు మరికొంత భోగట్టా కావాలి. ప్రస్తుతం సేవింగ్సు బ్యాంకులో నీ పేర ఎంత అకౌంట్ ఉందిరా హరీ?'

'నీకు తెలియని ఏముంది. మినిమమ్ బ్యాలెన్సు, అయిదు రూపాయలు.'

'ఇరుగూ పొరుగూ దగ్గిర మీ ఇద్దరిలో ఎవరైనా చేసిన చేబదుళ్ళుగాని నోటురాసి పుచ్చుకున్నది గాని ఋణం ఏమాత్రం?'

ఏమీ లేదన్నట్టు మేమిద్దరం ఒకరివైపు ఒకరువైపు ఒకరు చూసుకుని తలలు అడ్డంగా ఆడించాం.

'అయితే ఇంకేం? మీ ముగ్గురికీ నా హృదయ పూర్వక అభినందనలు. ఎవరి క్కావలసింది వాళ్ళు కొనుక్కున్నారు. వివాదమూలేదు, విచారణా అక్కర్లేదు!'

మే మిద్దరం ఒక్కసారి నవ్వేశాం.

'ఏడిసినట్టుంది; ఇదొక తీర్పా?'

'లేకపోతే? ఇదొక కంప్లెయింటా? ఒకరి దగ్గిర చెయ్యి జాచనంతకాలం మీరేం ఖర్చు పెట్టుకుంటే అడిగేదెవరు? ఒకరికొకరు లేరా అంటారేమో, మీ మీ విషయాల్లో మీకూ మీకూ కాక శ్రద్ధచూపేది మరెవరు?

అసంతృప్తితో అసూయతో ఇద్దరూ కలసి లోకాన్ని దుమ్మెత్తి పోసేకన్న ఒకరికొకరు వేలెత్తి చూపించుకోడం అవసరమూ, శుభప్రదమూ కాదా?'

'ఎరక్కపోయి అడిగాం' అంది సరోజ.

'అవును. టాపిక్‌మార్చు, నీకు పుణ్యముంటుంది' అన్నాను.

'బాగుంది. మొదలు పెట్టమనడం, మధ్యలో ఆపెయ్యమనడం అంతా మీ ఇష్టమే కాబోలు. నేనలా మానేవాణ్ణికాను. చివరదాకా వినవలసిందే' బిక్కమోహాలు వేసుకుని మే మిద్దరం సర్దుకుకూచున్నాం.

'ఎవరో కట్నాలు ఇచ్చారనీ మరెవరో లంచాలు పట్టారనీ-ఇచ్చినవాళ్ళకీ పుచ్చుకున్నవాళ్ళకీ లేని బాధ మధ్య వాళ్లు పడ్డం అన్నిటికన్న పెద్ద దురాచారం. అలాంటి గొడవ లేం లేకుండా హాయిగా తెచ్చింది ఖర్చుపెట్టుకుంటున్నారు. సంతోషించవలసిన విషయం. కూడబెట్టింది కూడా పట్టుకుపోము గదా! ఇక దేశానికి పట్టిన అరిష్టమూ, మనము చూపవలసిన త్యాగమూ, ఇలాంటి అర్ధం తెలియని పెద్దకబుర్లూ ఈ సందర్భంలో అనవసరం.

'ఇంతకీ ఎవరి వాకిలి వారు ఊడ్చుకుంటే దేశమనే లోగిలి ఎప్పుడూ కళ కళ లాడుతునే ఉంటుంది. ఇక క్లుప్తంగా ఖర్చుపెట్టడం, అనవసరంగా దుబారా చెయ్యడం వీటికి కొలమానాలు లేవు. దానానికీ వేష్ట చెయ్యడానికీ, క్లుప్తానికీ పిసినారితనానికీ వెంట్రుకవాసి మాత్రమే వుంటుంది. బాధ్యతలను బట్టి చేసే ఖర్చు పరిధి మారుతూ వుంటుంది.

'వంటింట్లో ఏదో చప్పుడయినట్టుంది - పిల్లి కాబోలు, కాల్చుకు తినేస్తుంది చూసి వొస్తాను' అంటూ సరోజ లేచింది.

'స్నానం చేసి వస్తాన్రా, మళ్ళీ సెకండ్ సిటింగ్ కూచుందాంలే, నిరుత్సాహ పడకు' అని నేనూ లేవబోయాను. రాజారాం సీరియస్‌గా అన్నాడు.

'ఇంత తొందరపాటు మనుషులు కనకనే ఇలా అనవసరంగా బాధపడుతున్నారు. వినాలని లేనప్పుడు వెంటనే వెళ్ళిపోవచ్చు. ఇదేం కాన్వొకేషన్ ఎడ్రెస్ కాదు. వంకలు మాత్రం అనవసరం.'

మే మిద్దరం మళ్ళీ భారంగా కూలబడ్డాం.

'మిమ్మల్ని అనుకోడం దేనికి? ఒకప్పుడు నేనూ జయాకూడా ఇంతకన్న తేలికగా ఆలోచించేవాళ్ళం. దేశంగాని దేశంలోని ఆ రోజుల్లోని ఆ సంఘటన ఎప్పుడు తలుచుకున్నా చెప్పలేని చిన్నతనం అనిపిస్తుంది.'

'ఏమిటదీ?' అన్నాను నేను ఆతృతగా.

'అంతగా మీ మనసు మీద ముద్రవేసిన ఆ విచిత్రం ఏమిటో!' అంది సరోజ అంతకంటె కుతూహలంగా.

'నాకు చెప్పాలనీ ఉంది, మీకు వినాలనీ ఉంది. నాకు తెలుసు, కాని ఏం చేస్తాం. బస్సుకి వేళయింది వస్తా' అని రాజారాం లేచాడు. మా ఇద్దరి చేతా ఓ పావుగంట పాటు తనివిదీరా బతిమాలించుకున్నాక జరిగిన విషయం ఓ చక్కని కథలా చెప్పుకొచ్చాడు.

నేను డాక్టరేటు సంపాదించక పూర్వం ఒరిస్సాలో ఓ ప్రైవేటు కాలేజీలో కొన్నాళ్ళపాటు లెక్చరరుగా వెలిగించానే, అప్పుడు జరిగిందన్నమాట, ఈ ఉదంతం. అసలా ఊళ్లో పెంకుటిళ్లే తక్కువ. మేమెలాగో కష్టపడి ముప్పై రూపాయిల అద్దెకి ఒక మంచి ఇంట్లోనే ప్రవేశించాం. కాని మొదట్నుంచీ అష్టయిశ్వర్యాల్లో మునిగితేలుతూ ఉండడంచేత ఎన్ని సదుపాయాలున్నా ఏవో యిబ్బందులు కనిపిస్తూనే ఉండేవి. మా ఉద్దేశంలో సుఖమన్నది లభ్యమైనపుడు అది ఎంతఖరీదైనా సంపాదించడానికి వెనుకాడేవాళ్ళం కాము. నాకు వచ్చేది రెండొందల ఏభై అయితే ఎంత లేదన్నా మరోవంద ఇంటికిరాసి తెప్పించుకునేవాళ్ళం.

ఒకనాడు మా జయ నాతో అంది.

'ఏమండీ, ఇక్కడివాళ్ళకి యిళ్ళు కట్టడాలు ఏమాత్రం తెలియనట్టుందే! గాలిదేవుడు వచ్చి

ఎక్కడ చొరబడి పోతాడో అని కిటికీ, గుమ్మానికెప్పుడూ ఎదురుగా పెట్టించరే, కర్మ! ఎన్నిగదులున్నా వరండాలోంచి వెళ్ళవలసిందే గాని గదిలోంచి గదిలోకి గుమ్మం పెట్టరేం పాపం? అయినా ఈ లక్కపిడత గదుల్లో నేను కాపరం చెయ్యలేనుబాబూ!'

'ఇల్లు ఇరకటమైతే పరవాలేదు...'

'ఏం పరవాలేదు? అందుకేగా ఇల్లాలు మరకటమయ్యేదీ? ఆవిడ్ని మరకతంలా చూసుకోవాలంటే మహలులోకాదు ఉంచవలసిందీ!'

'ఉన్నంతలో ఇదే పెద్దింటిమహలు!'

'పెద్దింటి మహలుకాదు, బొద్దింక గుహలు అని పేరుపెట్టడం మంచిది. ఎక్కడ చూసినా అవే. చీకటిమాటున ఆ మీసాలూ అవీ చూస్తూంటే నాపై ప్రాణం పైనే పోతోంది. మీకేం ఏ ఆడపిల్లలచేతో ప్రాక్టికల్సూ అవీ చేయించి ఆనందిస్తూ ఉంటారు.'

నేను నవ్వాను. అలాంటి పరిస్థితుల్లో నవ్వితే ఏ ఆడదీ ఓర్చదు. మా జయలక్ష్మి అసలు ఓర్చదు.

'ఏంచి ఏంచి మంచి ఊరు తెచ్చిపడేశారు. దీపాలు పెట్టేసరికి వీధిలో మొర్రోమని కుక్కలు, పెరట్లో కుయ్యోమని నక్కలు, సందులో అయ్యో అడవి పందులు, తలుపేసుకు ఇంట్లో కూచుంటే బొద్దింకలూ, గొల్లభామలూ! ఇవే నా ఫ్రండ్సు. ఇదే నా బ్రతుకు.'

'చూడూ మన ఊరు మనకి సరిపడకా, మనదేశంలో మనం చెలామణీ కాకా ఈ ఊరు వచ్చామన్న సంగతి మరచిపోవద్దు. ఎలాంటిదైతే ఏంగాక, ఇంత అన్నం మనకి దొరుకుతున్నది ఈ సీమే అన్న విషయం విస్మరించకు.'

జయ కొంచెం తగ్గింది. స్వరం తగ్గించింది గాని విషయం మార్చలేదు.

'ఏమోనండీ బాబూ. డబ్బు పారేసినా సుఖమన్నది దొరుకుతే బాధలేదు. పనిమనిషి దొరకకపోడం ఓ యిబ్బంది. భాష రాకపోడం అన్నిటికన్న పెద్ద యిబ్బంది. ఇవన్నీ గడిచి ఎప్పుడు సుఖపడతామో.'

నేను జవాబు చెప్పలేదు. ఒకక్షణం ఊరుకుని మళ్ళీ తనే అంది.

'తక్కిన మాటల కేంగాని, ఇల్లే మరీ చిన్నదిగా ఇరుకుగా ఉందండీ. మనింటికి ఎదురుగా ఉన్నగది ఖాళీగా ఉన్నట్టుంది. మనకి నిత్యం వాడుకలో లేని సామాన్లు అందులో పడేసి తాళం వేసుకోవచ్చు. కావాలంటే మరో పది రూపాయలు పారేద్దాం. ఇంటతన్ని అడిగిచూడండి.'

నేను ఇంటి యజమానిని కనుక్కువచ్చి చెప్పిన సంగతి విని జయ ఆశ్చర్యాన్ని కంతులేకపోయింది. 'ఏమిటీ! ఆగది ఎనిమిది రూపాయిలకి ఫిజిక్సు లెక్చెరరు తీసుకున్నాడా? వీళ్ళసిగ్గు చిమిడిరిగదే! ఆ ఒక్కగదీ ఒక్కమనిషికయితే మాత్రం ఎలా సరిపోతుందండీ?'

'చిన్న వరండా కూడా ఉన్నట్టుందిగా!'

'చాల్లెండి ఎవరైనా నవ్విపోగలరు, ఎక్కడ నీళ్ళోసుకుంటాడు, ఎక్కడ భోంచేస్తాడు. ఎక్కడ పడుకుంటాడు, ఎక్కడ...'

'మనల్ని అడిగినప్పుడు చెబుదాంలే' అని ఆ సంభాషణ నే నక్కడికి తుంచేశాను. ఇంతకీ మేము విన్నదే, లేదా అర్థంచేసుకున్నదే పొరపాటు. ఫిజిక్సు లెక్చెరరు ఘనశ్యాంమిత్రా ఆ గదిలోకి

ఒక్కడూ రావడం లేదు. ఫేమిలీతో కూడా వస్తున్నాట్ట!'

'ఒక పుంజూ, ఒక పెట్టా పదిపిల్లలూ ఒకేబుట్టకింద ఎలా ఉండగలవా అని నాకెంతో ఆశ్చర్యంగా ఉండేది. ఇప్పుడా అనుమానం తీరిపోతోంది. రానీయండి. వీళ్ళని అబ్జర్వ్ చెయ్యడమే ఒక కాలక్షేపం' అంది జయ. ఈ విషయంలోనూ మేము తప్పటడుగేవేశాం. పుంజూ, పెట్టా రెండే వచ్చాయి. పిల్లలేం లేవు. అయితే మాత్రం? ఒక్క గదిలో ఎలా ఇమిడి ఉండేదీ భగవంతుడికి తెలియాలి.

అతనూ నేనూ అయితే తప్పదు కాబట్టి కాలేజీలో కలిసేవాళ్ళం. అయినా డిపార్టుమెంట్సు వేరు కాబట్టి కలిసి తీరాలని రూలూలేదు. అదిగాక ఏకాస్త టైము ఉన్నా మిగిలిన యిద్దరు తెలుగు లెక్చర్సుతో నేను గడిపేసేవాణ్ణి. ఒకసారి మా మాటల్లో ఘనశ్యామ్ ఊసు వచ్చింది.

'మళ్ళీ స్టేటస్ చూస్తే లెక్చరరూ, ఆ ఒంటిగది గుడిసెయింట్లో ఎలా ఉంటున్నా డబ్బా!' అన్నారు ఆచారిగారు.

'ఏమోబాబూ, నీళ్ళూ, వీళ్ళ పద్ధతులూ చూస్తే ఒళ్ళు కంపరం వేసుకొస్తోంది. నోటిలో పుల్లో, చేతిలో కచికగుండో వేసుకుని కాలువ్వడ్డుకు బయల్దేరుతారు. మొహం కడుక్కోడం, స్నానం చెయ్యడం, బట్టలు ఉతుక్కోడం సమస్త ప్రక్రియలూ, సర్వ కాలకృత్యాలూ ఆచేత్తో పూర్తి చేసుకుంటారు. ఒక నీలంపంచె ఒక గావంచా నీటితో ఎన్నిపనులైనా ఎన్నాళ్ళయినా నిశ్చింతగా నెగ్గుకురాగలరు. ఇది పిసినారితనం కాక క్లుప్తం ఎలా ఔతుంది చెప్పండి?'

'ఒకర్ని చూసి అందర్నీ అంచనా వెయ్యడం న్యాయంకాదు. వీళ్ళ సుగుణాలు వీళ్ళకి ఉన్నాయి' అన్నారు మోహనరావు.

'ఏంసుగుణమో; ఏంలోకమో, ఒంటికి రాసుకున్న ఆవనూనె సుగంధం మాత్రం పదికోసులదూరానికి పరిగెత్తుకు వస్తుంది!'

ఆచారిగారి మాటకి నవ్వుతూ మళ్ళీ మోహనరావు అన్నాడు.

'లేదు, లేదు. నేను ఏళ్ళబట్టీ ఈ దేశాన్ని ఎరుగుదును. సత్సాంప్రదాయాలూ, సహజ సంపదలూ నిజమైన నిసర్గరూపంలో సాక్షాత్కరించే కొద్ది భారత రాష్ట్రాలలోనూ ఒరిస్సా ఒకటి.'

'ఏమిటి వీళ్ళు సాధించింది? ఫిలిం ఫీల్డులో చివరిస్థానం వస్తుంది. ఈ రాష్ట్రానికి.'

'కావచ్చు. ఒక రాష్ట్రం ఔన్నత్యానికీ, అందులో తీయబడే సినిమాల సంఖ్యకూ ఎలాంటి సంబంధమూ లేదు. ఆ మాట కొస్తే చలన చిత్రాలవల్ల వచ్చే చెడులక్షణాలవల్ల వాళ్ళ భాషగాని భావం గాని యింకా కలుషితం కాలేదు. భారతదేశమనే చక్కని కొలనులో ఉత్కళం ఒక ఉత్పలం.'

'మహానది నీళ్ళు బాగా వంటబట్టినట్టున్నాయే!' అన్నాను నేను నవ్వుతూ.

'కాదు, ఆ మహాతల్లి ప్రఫుల్ల చంద్రమాదేయా చలవ!'

'అదెవరు?' అన్నాను నేను ఆతృతగా.

'ఇంకెవరు, ఆ ప్రిన్సిపాలుగారి కూతురు. ఈయన ఆవిడకి మేధమెటిక్సు ట్యూషను చెబుతున్నాడు గదా మరి!'

'అదా సంగతి,'

'మీ రేమనుకున్నా నా కభ్యంతరం లేదు - నా మంచిచెడ్డలు తగ్గవు, హెచ్చవు.'

'హోస్ప్యాని కంటే అంత మాత్రానికే అంత కోపం దేనికి? పోనీ, తక్కినవన్నీ అలా వుంచి వాళ్ళలో మూడొంతులుమంది ఇరవైనాలుగు గంటలూ బుగ్గని కారా కిళ్ళీ నవుల్తూంటారని ఒప్పుకుంటావా? పళ్ళు నల్లగా గారెక్కికాటెక్కి అసహ్యంగా ఉంటాయని అంగీకరిస్తావా?'

'ఇప్పుడు వాళ్ళలోనూ ఈ దురలవాటు క్రమంగా సన్నగిల్లుతోంది. వెతుకుతే మనలోనూ అలాంటి చెడు అలవాట్లు లేకపోలేదు. కాని మన దృష్టి కేంద్రీకరించవలసింది అక్కడ కాదు. ఇంకా వాళ్ళ గురించి తెలుసుకోవలసిన ముఖ్య విషయాలు చాలా వున్నాయి.'

ఇలా సాగుతున్న వాళ్ళ వాగ్వివాదం మధ్య ఇంకా తల దూర్చలేక అక్కణ్ణించి వెళ్ళిపోయాను.

ఎప్పుడో రోజుకోసారి ఆయనా నేనూ పలకరించుకోడం తప్ప ఎదురింటాయనకీ నాకూ ఇంచుమించు మాటలే ఉండేవి కావు. ఇక మా ఆవిడకి సరేసరి, వాళ్ళ పేరెత్తితేనే పరమాసహ్యం. ఇరవై నాలుగు గంటలూ అలా ఫ్యాను తిరుగుతున్నా ఇంకా ఉక్కతో మగ్గిపోయే మా జయకు ఆ ఏక గదిలో నిక్షేపంలా నిద్రపోయే ఏకవస్త్రనుచూస్తే భగ్గున ఒళ్ళుమంట.

'పోనీ పేరేనా కనుక్కున్నావా ఎలాగో అలా కష్టపడి?' అన్నాను నేను.

'ఆః, నాకిదే పని - మన పనివాడు చెప్పేడు "బిద్దుళ్ళేతా"ట.'

'విద్యుల్లత కాబోలు - బాగుందే పేరు. మనిషెలా ఉంటుందో?'

'తొక్క మాత్రం తెలుపే, ఓ తీరూ దిబ్బా ఉండదుగాని - ఇంకా తమ కంటపడలేదంటే ఎవరు నమ్ముతారు?'

'లేదు జయా! ఎప్పుడూ తలుపు గడియ వేసుకుని లోపలే వుంటుంది,'

'ఆవిడ కింకా పూర్వకాలం ఘోషాపోలేదనుకుంటాను.'

'నిజమేమరి, నూతి దగ్గర తప్ప స్నానం చెయ్యదుగాని!'

'అదేమిటి, ఇది నలుగురూ నీళ్ళు తోడుకునే నుయ్యిగదా!'

'అయితే ఒకటిలెండీ. ఏ తెల్లవారుఝామునో లేచి, గదులు తుడిచివేసి, అంట్లు తోముకుని, ఆచేత్తో నీళ్లోసేసుకుంటుందనుకుంటాను.'

'ఆలా ఐతే అది మంచిపద్ధతేమరి!'

జయలక్ష్మి మొహం చూస్తూండగా ఎర్రగా మారింది.

'మంచిదే. కాని వాళ్ళ పెళ్ళయి ఏడాదికూడా దాటలేదని విన్నానని మీరే చెప్పారు. అమ్మమ్మలనాటి పద్ధతులన్నీ అక్షరాలా అమలుజరిపి, ఈవిడ మొగుణ్ణేం సుఖపెడుతున్నట్టు? పోనీ లేనివాళ్లైతే అనుకోవచ్చు. ఏడాదై కాపరం చేస్తున్నా, యింట్లో అవసరమైన వస్తువ ఒక్కటున్నట్టు కనపడదు. మొన్న తలుపు బార్లా తెరచివుంటే చూశాను. కుండలమీద వంట; కర్రలు ఉపయోగించి పొయ్యిమీద వండుతోంది. మీతోబాటు సమాన జీతగాడామరి, ఏంచేసుకుంటారో ఇంత సొమ్మూ! ఈ స్టౌ వత్తులతోనూ, ఈ కిరసనాయిలుతోనూ వేగలేకే నాప్రాణం ఓకొలిక్కి వస్తోంది. వరండామీద ఓతడిక అడ్డుకట్టి ఆ పొగలో ఆ యిల్లాలు ఎలా వేగుతోందో, మొత్తానికి ఘటికురాలే!'

నిజం చెప్పాలంటే మన భాషవాళ్ళు కారని ఎదురింటివాళ్ళ మీద మాకు ఎటువంటి దురభిప్రాయమూలేదు. పైగా ఎదుటివారి ఆచార వ్యవహారాలు తెలుసుకోడానికి మే మిద్దరమూ ఒకర్ని మించి ఒకరు ఆసక్తి చూపిస్తాము. వెనక నేను మెద్రాసులో చదువుకున్నప్పుడు జయకు

ఉన్న తెలుగు ఫ్రెండ్సుకన్న తమిళ ఫ్రెండ్సే ఎక్కువ. మరి వీళ్ళంటే ఇంత తక్కువ అభిప్రాయం... ఏర్పడ్డానికి కారణం ఏమిటీ?

మరేమీలేదు. అంతులేని వారి లుబ్ధత్వమే మా మనసులనుండి వారిని దూరం చేసింది. ఆ ఘనశ్యాం మిత్రా వారం రోజులూ కాలేజికి ఇంచుమించు ఒకే డ్రెస్‌తో వచ్చేవాడు. ఇంటిదగ్గిర సరేసరి. ఒకటే నీలంపంచె. పైగా ప్రైవేట్లు కూడా చెప్పేవాడు. నందలకి వందలు వీళ్ళిలా మూటగట్టి వెళ్లేటప్పుడు పట్టుకుపోతారేమో - మాకు అర్థమయ్యేదికాదు. ఆ పిసినారితనం చూస్తే మాత్రం రోజు రోజుకి వాళ్ళంటే మాకు ఏవగింపు ఎక్కువయింది.

దానికి తగ్గట్టు ఓసారి మాకు ఇంటి నుంచి అనుకున్న సమయానికి లెక్క అందలేదు. ఓ యాభై రూపాయలేనా వెంటనే చేతిలో ఆడితేగాని రోజు గడిచేటట్టు కనబడలేదు. నే నూరికే కంగారు పడుతూంటే మా జయ అంది. 'ఎక్కడో ఎవర్నో అడిగే దేమిటి? ఆ నీలమేఘశ్యాముణ్ణి అడిగిరండి. ఎంత సేపూ డబ్బుఏడుపే కదూ వాడికి; కావాలంటే వడ్డీ పారెద్దాం, ఎనడికోసం ఇస్తాడు?'

కాని ఎన్నిసార్లు అడిగినా అతన్నుంచి 'అయాంసారీ' అన్న ముక్క తప్ప నాకు మరొకటి వినపడలేదు. నాకే సిగ్గనిపించింది. అడిగి లేదనిపించుకున్నందుకు కాదు - ఇలాంటి లేకినునిషిని అడిగినందుకు. ఆ ఊళ్ళో పోస్టాఫీసులోగాని బ్యాంకులోగాని అతనిపేర ఎకౌంటు ఉందేమోనని ఆరాతీశాను. ఎక్కడా ఏంలేదట. ఉన్నదంతా ఆ యింట్లో ఆ ఒక్కగదిలోనే గొయ్యితీసి కప్పెడుతున్నారన్నమాట. ఇంట్లో సొమ్ము ఉంచుకొని లేదన్నారు. వీళ్ళ నీచత్వానికి అవధి అంటూ లేదన్నమాట! 'తేనెటీగ కూర్చి తెరువరి కియ్యదా!' అని అంత సొమ్మూ ఎవడో ఒకడు ఓరాత్రివేళ కాజేస్తేగాని వీళ్ళకు జ్ఞానోదయం కాదు - అనుకున్నాం నేనూ జయా.

ఆ మూడోనాడు రాత్రి అనుకుంటా అర్ధరాత్రిలేవేళ లేచి వాళ్ళిద్దరూ గొల్లున ఏడుస్తూంటే మా కిద్దరికీ ఒక్కసారే మెలుకూవచ్చింది.

'డబ్బుకీ ప్రాణానికీ లంకె అయిన వారికి ఎవరికి తప్పింది గనక ఈ అవస్థ! అనుకున్నంతా అయిందన్న మాట' అంది జయ వచ్చేనవ్వును ఆపుకుంటూ. ఆరు నెలలపైగా ఉంటున్నా 'ఆసొంతు' , 'బొసొంతు' - రండి, కూచోండి, అన్న బొట్లేరుముక్కలు తప్ప మరొక ఒరియాముక్క రాని నాకు వాళ్ళ ఏడుపు ఎందుకో మాత్రం అర్థంకాలేదు.

'ఇంక ఎందుకో ఏమిటి, స్పష్టంగా తెలుస్తూంటే - ఆ సొమ్ము, ఏకమొత్తంగా ఎవడో లంకించుకుని ఉంటాడు. మనకి ఆ ఏభై ఇస్తే అదేనా కలిసొచ్చునా? ఇంకా అలా చూస్తారేం, కలిగిన నష్టం ఎంతో వెంటనే భోగట్టా చేసిరాక?'

నేను వెళ్ళేసరికి అక్కడ చాలామంది ఉన్నారు. అందులో మా మోహనరావు కూడా ఉన్నాడు. అతనికి ఒరియా బాగా వచ్చు. కలిగిన నష్టమేమిటో తెలుసుకునే సరికి నా గుండె నీరయిపోయింది!'

'ఏం ఏన్నివేలు పోయాయేమిటి?' నేనూ, మా జయా, దొంగచాటుగా అంతా వింటున్న మా కుర్రాడూ ముగ్గురమూ ఒకేసారి అడిగేం. రాజారాం చెప్పేడు 'ఘనశ్యాం మిత్రా వాళ్ళది బాగా బీద కుటుంబమూ, పెద్ద కుటుంబమూనట. వాళ్ళు నలుగురు అన్నదమ్ములూ, ఇద్దరు అప్పచెల్లెళ్ళూ; పెద్దమ్మాయికీ, ముగ్గురు మొగపిల్లలకీ పెళ్ళిళ్ళు అయాయి. ఇక ఇంటిపట్టున వాళ్ళ ఊళ్లో ఉండేది

పెళ్ళికాని చెల్లెలూ, చదువుకుంటున్న తమ్ముడూ, ఘనశ్యాంమిత్రా తల్లీ, పినతల్లీని. తండ్రి ఏడాదై చనిపోవడంతో ఆ కుటుంబం ఆర్థికంగా మరింత దెబ్బతిన్నది. ఇతని అన్న లిద్దరూ కాపరాలు చేసుకుంటూ ఎవరి సంపాదన వారు చూసుకుంటున్నారు. కాని ఇంటి కేమీ పంపరుట. చెల్లెలు సుచేత పెళ్ళిచేసి ఆమెను అత్తారింటికి పంపేసి, తల్లినీ, కుటుంబాన్నీ తన ఊరు తీసుకొద్దామని ఘనశ్యాం ఉద్దేశం. చెల్లెలు పెళ్ళి కట్నానికని బ్యాంకులో వెయ్యమని అప్పటికి పన్నెండు వందలు పంపేడట. సుచేత అంటే ఇంట్లో అందరికీ చిన్నప్పట్నుంచీ ప్రాణం. అందుకనే ఆ ప్రాణం అట్టేసేపు నిలబడలేదు. ఆరోగ్యంగా తిరుగుతున్న పిల్లకి, అప్పటికప్పుడు అపెండిసైటిస్ వచ్చి తీసుకుపోయింది. ఆ రాత్రి వచ్చిన టెలిగ్రాం అదేట.'

రాజారాం కళ్ళనీళ్ళు అద్దుకున్నాడు.

'మనుషుల్ని ఎంత తొందరగా తప్పుగా అంచనా వేస్తామో తలుచుకుని నేనూ జయా సిగ్గుతో క్రుంగిపోయాం. 'తిండీ, బట్టా, ఇల్లూ మనిషికి ముఖ్యమే, కాని అవే సర్వస్వమూ కావు.' చెప్పేది పూర్తిచేశాడు రాజారాం.

ఆ ఘనశ్యాం మిత్రానీ, విద్యుల్లతనూ మే మెవ్వరూ చూడలేదు. చేసే అవకాశం లేదుకూడా. కాని పుణ్యం మూట కట్టుకుంటున్నవారెవరైనా మా స్మృతిపథంలోకి వస్తే వాళ్లే ముందుగా గోచరిస్తారు. ఎంతటివాళ్లని ఎంతతక్కువగా అంచనా వేస్తాం మనం!

(యువ మాసపత్రిక)

# రాత మారిపోయింది!




"పిన్నీ, ఏమిటి, పిన్నీ, ఎన్నిసార్లు పిలిచినా పలకవ్" అంటూ సుజాత పడక్కుర్చీలో కూచున్న వరలక్ష్మిని ఒక కుదుపు కుదిపింది. ఆమె ఉలికిపడి లేచేసరికి వరలక్ష్మి ఒళ్ళో ఉన్న కళ్ళజోడు కిందపడింది. దాన్ని తీసి ఆమెకి అందిస్తూ సుజాత అంది!

"నిజానికి ఇలాంటి డొంక తిరుగుడు పనులు చాలా తప్పనుకో, కాని ఉన్నట్లుండి ఆ చూడామణికి అంత గర్వం దేనికి! నిన్న మొన్నటిదాకా ఈవిడగారు ఎదురింటి మెడికల్ రిప్రజెంటెటివ్‌తో తిరిగిందని ఎవరెరగరని! ఇంతోటి డాక్టరు మొగుడూ తనకే దొరక బోతున్నాడనా అంత చేటు రాలిపాటు! దాని ఏడుపేదో అది ఏడిస్తే మన కెందుకు కాని, మరీ అంతగా కన్నూ మిన్నూ కానక తెలిసిన వాళ్ళనే ఈసడించి పారేస్తూంటే నాలాంటి వాళ్ళు వూరుకోలేరుసుమా!" అని అక్కడికి ఆపింది ఒక నిమిషం. మళ్ళీ ఏమనుకుందో వరలక్ష్మి ఒడిలోకి ఒక ఎన్‌వలప్ విసురుతూ ఇలా అంది;

"లెటరే కాదు, కవరుమీద ఎడ్రసుకూడా రాశాను. అంటించలేదు. అంతే, నువ్వు చదవాలని,

అసలు అలాగే పోస్టు చేసేద్దామనుకున్నాను కాని, నాలో తప్పు లేనప్పుడు నీకు చూపిస్తే ఏం అనిపించింది. ఏం చెయ్యను? నీతో చెప్పకుండా ఏ ముఖ్యమైన పనీ నా మట్టుకు నేను చెయ్యలేనంతగా కట్టి పారేశావు. అమ్మో, అలా ఉన్నావనా!" అని దగ్గిర కొచ్చి గట్టిగా ఒక ముద్దు పెట్టుకుని ...

"ఇంకా అలా చూస్తావేం, షో మొదలయాక సినిమా హాల్లోకి అడుగుపెట్టిన దాన్లాగ? వెంటనే కాగితాలు పైకి తీసి చూడవేం? సరే. నే నలా అనసూయా ఆంటీ ఇంటికి వెళ్ళొస్తా. ఈ లోగా నువ్వది చదివేసి పోస్టు చెయ్యి, వింటున్నావా, పిన్నీ! మళ్ళీ నాకేం చూపనక్కర లేదు. అన్నీ ఆలోచించే ఇంతటికి తెగించాను. ఈ దెబ్బతో చూడామణి తలదిమ్ము దిగిపోవాలి."

వడగాలిలా వచ్చి సుడిగాలిలా పోయిన సుజాతవైపు కళ్ళింతంతలు చేసుకుని చూసింది వరలక్ష్మి. ఇంకా మాటలు పలకని ఏడాదిన్నర వయసులో దీన్ని తను తీసుకువచ్చింది. ఇప్పుడిదే తనని నోట మాట రాకుండా చేసేటంతగా తయారయింది. ఆనాడు ఆ బస్సు యాక్సిడెంటులో పెద్దక్కా బావా ఒకేసారి పోతే దీన్ని తెచ్చి పెంచింది. ఎంతది ఎంతటిది అయిందీ!

వరలక్ష్మి లోపలికి వెళ్ళి, ఒక కప్పు కాఫీ కలుపుకుని తాగింది. సీలింగ్ ఫాను ఫుల్‌స్పీడుతో పెట్టుకున్నాక కాని ఆమె కుదుట పడలేదు. అప్పుడు చదివింది, సుజాత ఇచ్చిన ఉత్తరం. చూడామణి కాబోయే మామగారికి ఎడ్రస్ చేయబడింది అది. దస్తూరీ తనదని తెలీకుండా మార్చి రాయడానికి సుజాత చేసిన ప్రయత్నం తెలుస్తూనే ఉంది.

మీ అబ్బాయికి చూడామణి అనే అమ్మాయిని వధువుగా నిర్ణయించుకున్నారని తెలిసినది. కారణాంతరముల వల్ల నేనెవరో మీకు తెలియజేసే అవకాశం లేదు. అలాగని మంచి వంశమూ, గొప్ప సంప్రదాయమూ గల మీ లాంటి పెద్దలకు తీరని ద్రోహం జరుగుచున్నప్పుడు మౌనము వహించుట నాకు న్యాయంగా తోచలేదు. తగు మనుషులను పంపి మీ మటుకు మీరే మంచి చెడులను స్వయంగా విచారించుట శ్రేయస్కరము. బొత్తిగా దూరప్రాంతముల వారగుటచే మీవద్ద ఇంతటి ముఖ్య విషయము దాగినది. మీరు నిశ్చయ తాంబూలములు పుచ్చుకున్న వధువు చూడామణి నడత మంచిది కాదని వ్రాయుటకు విచారించుచున్నాడను.

-ఇట్లు మీ శ్రేయోభిలాషి, ఆకాశరామన్న వ్రాలు.

ఉత్తరం పూర్తికాకుండానే ఊపిరి ఆగిపోతుందా అన్నంత ఆందోళన కలిగింది వరలక్ష్మికి. మింగలేని చేదుమందులా సుజాత మీద కలిగిన కోపంతో ఆమె విలవిలలాడిపోయింది. కాలేజీలో చదువుకుంటూంది. సాటి ఆడపిల్లల ఒడిదుడుకులకి అంతకన్న దగ్గిర సాక్షి ఉండదు. కేవలం పెళ్ళి పీటలమీద పెళ్ళికూతురుగానే కాదు, ఆ స్థాయికి చేరుకోవడానికి అంతకు ముందు ఆడపిల్ల అనేది ఎన్ని అన్యాయాలకు తల ఒగ్గి, ఎన్నెన్ని అధికారాలకు తల వంచుకుని కూచోవాలి! తెలివైన దనుకున్న సుజాతకి ఆమాత్రం మనసు లేకపోయిందా! పెద్దలకే ఎటువంటి నీతి నియమాలూ కనబడని ఈ కరప్ట్ కాలంలో చూడామణి లాంటి పెళ్ళికాని పిల్ల ఎదురింటి కుర్రాడిపై కాస్త భ్రమ పెంచుకుంటే అదీ ఒక నేరమేనా? అదే ఒక నేరమైతే మర్మావయవాల నిర్మాణ ధర్మాల్ని అయిదేళ్ళపాటు చదువుకున్న ఆ డాక్టరు పెళ్ళికొడుకు అంతకుముందు ఆ థియరీ ప్రాక్టీసులో పెట్టలేదనడానికి ఏమిటిట రుజువు?







తలచుకున్న కొద్దీ చూడామణి తరపునే వాదించడం మొదలు పెట్టింది వరలక్ష్మి మనసు. ఆ అమ్మాయి చెల్లెలికి ముందుగా పెళ్ళయిపోయింది. ఆ తరువాత మూడేళ్ళు గడిచినా, వాళ్ళ వాళ్ళు ఎంత ప్రయత్నించినా చూడామణికి పెళ్ళి గీతంటూ ఇన్నాళ్ళూ కనపడలేదు. "ఇంకా నీకు పెళ్ళేమిటే? నీ వయసుకి ఇద్దరు పిల్లలు పుట్టి ఆపరేషన్లు కూడా అయిపోతుంటేనూ" అని ఆమె మొహం మీదే అనడం మొదలు పెట్టారు దిమ్మ చెక్కల లాంటి అమ్మలక్కలు. ఇన్నాళ్ళకి ఆమెకి కళ్యాణయోగం అంటూ కలిసి వచ్చి, అందునా రోరింగ్ ప్రాక్టీసు ఉన్న ఒక డాక్టరు సంబంధం స్థిరపడితే ఆమెకి గర్వం కలగదా మరి! అసూయ పడడం తగునా?

అన్నీ బాగానే ఉన్నాయి కాని, తన చేతులతో తాను పెంచిన సుజాతలో ఇంతటి కుళ్ళు బుద్ధి ఎలా నెలకొందని? సాటి స్నేహితురాలి పెళ్ళి చెడగొట్టే కట్టుదిట్టమైన ప్రయత్నం చెయ్యడమే కాకుండా తన ఆమోద ముద్రకూడా లభించి తీరుతుందనే అచంచల విశ్వాసంతో ఈ ఉత్తరం తనని పోస్టు చెయ్యమనడమేమిటి?

నీరసంగా తోచి ఒకసారి మొహం కడుక్కుంటే ఫ్రెష్‌గా ఉంటుందనిపించింది వరలక్ష్మికి. అలా చేసి బొట్టు పెట్టుకోవడానికి అద్దం వైపు చూస్తూంటే బొట్టు సరి చేసుకుంటున్న ఉంగరపు వేలు అక్కడే నుదుటి మధ్య అంటుకున్నట్టు ఉండిపోయింది. తనలోకి చూసుకుంటున్నట్టు నిశ్చలమై పోయింది ఆమె మనసు. ఇవాళ సుజాతని తప్పు పట్టి లాభమేమిటి? ఆమెకి తన బుద్ధులే వచ్చాయి! ఇప్పుడు తలుచుకుంటే ఆ రోజుల్లో తన బుద్ధి ఎంతగా పెడత్రోవ పట్టలేదు! తక్కిన అందరికంటే ఎక్కువగా తన నుదుటి రాత తనే దిద్దుకోవడానికి కారకురాలైంది. అయిదుగురు అక్క చెల్లెళ్ళలో మధ్యది తను. తను తప్ప మిగిలిన నలుగురూ ఇంచు మించు నలుపులోనే జమ. ఇక తనో? పచ్చని బంగారు ఛాయ. అక్కల కోసం ఏ పెళ్ళి కొడుకు వచ్చినా వరలక్ష్మిని చేసుకుంటామనే వారు. ఆ పెళ్ళికొడుకులతో సహా అక్కలిద్దరూ తన కంటికి చింతమొద్దుల్లా కనపడేవారు. పోనీ తన వంతు వచ్చాక తమ కుటుంబ తాహతుకి సరిపోయే వారితో సరిపెట్టుకుందా? ఊహు! అక్కలు గుంట నక్కల్లా ఉన్నారు కాబట్టి వాళ్ళు ఈ వరదువరుడుతో అయినా సరిపెట్టుకోగలరు. కుందనం బొమ్మ తన కేం కర్మ! ఆఖరికి తన కర్మతనే నిర్మించుకున్న బంగారు బొమ్మ అలాగే ఉండిపోయింది. చెల్లెళ్ళిద్దరూ కూడా పెళ్ళిళ్ళయి వెళ్ళిపోయారు. నాన్న పోయాక అమ్మ అన్నయ్య దగ్గరకి వెళ్ళిపోయింది. తను బి.ఇడి., డిగ్రీ పుచ్చుకుని రైల్వే సర్వీస్ కమిషన్‌లో సెలెక్ట్ అయి ఇలా టీచరుగా వూరూరూ తిరుగుతూంది. ఇంకా సుజాతని తెచ్చి పెంచింది కాని రిటైరు అయిపోయిన ఈ ఒంటరి బతుకులో ఇక తనకు దిక్కంటూ ఎవరు! ఇదీ తన లాగే తయారు అవుతుందా?

వీధి వరండాలోకి వచ్చి మళ్ళీ పడక్కుర్చీలో కూచుంది వరలక్ష్మి. ఆరోగ్యకరమైన ఆలోచనలతో పిల్లని పెంచుతున్నానేమో అని ఇన్నాళ్ళూ భ్రమపడింది తను. ఎంతటి తప్పు దారిలో ఉంది ఈ సుజాత! నిజానికి ఒకప్పుడు తనలో మాత్రం అసూయాద్వేషాలు లేవా! ఆరోజుల్లో ఆ హైస్కూల్లో తను ఇంగ్లీషు చెబుతున్నప్పుడు ఒకసారి వరలక్ష్మి మాత్రం ఎంత ఘాతుకానికి పాల్పడలేదు! కళ్ళు మూసుకుని కూచుంది కాని, కళ్ళెదుట జరిగినట్టే ఉంది. ఇరవై ఏళ్ళ కిందటి ఆ సంఘటన.

అది పూర్తిగా బెంగాలీ ప్రాంతం. చదువుకున్న పిల్లల్లో మిగిలిన పది శాతమూ నార్త్ ఇండియన్

తప్పొ ఇటు వేపు వాళ్ళు ఉండేవారు కారు. లెక్కల టీచరు సీతారత్నం తెలుగు అమ్మాయే కాని వాళ్ళు మొదటినుంచీ కలకత్తాలో స్థిరపడి పోవడం చేత ఆ అమ్మాయి చదువుకూడా బెంగాలీ భాషలోనే నడిచిందట. ఎటొచ్చీ తెలుగు మాట్లాడగలదు కనక కాస్త గుడ్డిలో మెల్ల.

అది వరలక్ష్మికి ఒక విధంగా తన ఒంటరితనంలో చేదు తల కెక్కుతున్న రోజులు. అప్పటికి ఆమెకి ముప్ఫైఅయిదుకూడా దాటింది. ఆ రోజుల్లోనే కాబోలు చిన్నక్క పెద్ద కూతురు శుభలేఖ అందింది. నలుగుర్లోకీ వెళ్ళాలని ఉంటుంది. వెడితే మళ్ళీ నలుగురూ ఎక్కడ వేలెత్తి చూపిస్తారో అని మనసు వెనుదీస్తుంది. తనిలా అవివాహితగా ఉండిపోవడానికి ఈ దిక్కుమాలిన సంఘానిదే పూర్తి బాధ్యత అని వరలక్ష్మి ఇంకా భ్రమపడుతున్న రోజులవి. ఆ రోజుల్లోనే కిరణ్మయి అనే ఆవిడ హెడ్మిస్ట్రెస్‌గా ఆ స్కూల్‌కి వచ్చింది. ఆవిడతో పోల్చుకుంటే తను శరీరపు వన్నె చిదిమిన పసుపుకొమ్ము కావచ్చు. కిరణ్మయిది? అది లేలేత గులాబీరేకు తళుకు! అంతేనా? కిరణ్మయి జీవితం ప్రధాని విందులాంటిది. ఆవిడకి పాలమీగడ లాంటి కూతురు, పనసపండు లాంటి కొడుకు, చెరుకుగడలాంటి మొగుడు!

ఎంతో మంచి ఇంగ్లీషు టీచరని అదివరకు వరలక్ష్మికి ఉన్న పేరుకూడా తోసిరాజు చేసింది కిరణ్మయి. అక్కడితో ఉండనిస్తుందా ఆవిడగారి తలబిరుసుతనం! ఒకసారి టీచర్సు కామన్‌రూమ్‌లో అందరికంటె ఎవరు పెద్ద అనే చర్చ వచ్చింది. 'ఇంతవరకూ నేనే అనుకున్నాను. ఇప్పుడు రికార్డు ... చూస్తే తెలిసింది వరలక్ష్మి దీదీ నాకంటే మూడేళ్ళు పెద్ద అని' అని నలుగుర్లో తనని ఇన్సల్టు చేసింది. లేకపోయింది కాని చేతిలో కత్తి ఉంటే అప్పుడే విసిరెయ్యాలనిపించింది వరలక్ష్మికి 'అలా వద్దు - ఎప్పుడో ఒకసారి దీనికి మరి అమ్మా అనీ అడక్కుండా వెన్నుపోటు పొడవాలి' అని ఆ క్షణమే కృత నిశ్చయురాలైంది. అయితే ఆ అవకాశం అంత త్వరగా వస్తుందని అనుకోలేదు.

ఆ రోజుల్లో క్రమం తప్పకుండా మార్నింగ్ వాక్ చేసి వచ్చే అలవాటుండేది వరలక్ష్మికి. ఇటు తన క్వార్టర్స్ నుంచి అటు బిపిన్ బిహారీ పూర్ రోడ్ అనబడే ఆ రైల్వేస్టేషను వరకూ తిరిగి వచ్చేది. దార్లో ఏ బోర్డు కనపడినా బెంగాలీ భాషలోనే ఉండడం చేత చదవ లేకపోయేది ఆమె. మాట్లాడ్డం అయితే నేర్చుకుంది -- చదవడం, రాయడం మాత్రం ఆమెకి పట్టుబడలేదు. అలా తిరిగి వచ్చేరోజుల్లో ఒక్క విషయం గమనించింది. ఆ హైస్కూలుకి సంబంధించిన బోర్డు లన్నీ బాగా రాసే స్టూడెంట్స్ చేతే రాయించటం వాళ్ళ అలవాటు.

ఒకరోజు వైట్ వార్నిష్ చేయబడి ఆరిపోయిన ఒక రేకు ముందు తెలిసిన ఒక అమ్మాయి కూచుని ఉండడం చూసింది వరలక్ష్మి. ఆ అమ్మాయి పేరు కల్లోలినీ మిత్రా. చాలామంచి అమ్మాయి అని పేరు. ఆమెని అడిగి ఏమిటి పెయింట్ చెయ్యవలసి ఉందో కనుక్కుంది.

"హై స్కూలు మెయిన్ ఆఫీసుకి ఇదే దారి" అనే అక్షరాలు రాయాలిట. వరలక్ష్మి బుద్ధి చురుకుగా పనిచేసింది. ఆమె పగ తీర్చుకునే అదను ఇదే. అటూ, ఇటూ చూసింది. అదృష్టవశాత్తు ఇంకా ఎవరూ లేచినట్టులేదు. 'కల్లోలినీ, మన హెడ్మిస్ట్రెస్ దురాగతాలు రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి. మొన్నటికి మొన్న నేను నీకు ఫస్టు మార్కు ఇస్తే తను మళ్ళీ దిద్దేసి తన మేనకోడలికి ఫస్టిచ్చి నిన్ను నాలుగో ప్లేసులోకి తోసేసింది. దానికి బుద్ధి రావాలంటే నేనో ఉపాయం

చెబుతాను -- చెయ్యి. నీ రైటింగు మానేసి మరెవరో రాసినట్టు వంకర టింకరగా పెయింట్ చెయ్యి. అంతేకాదు, 'హై స్కూల్ మెయిన్ ఆఫీసుకి ఇదే దారి' అనే అక్షరాల బదులు 'హెడ్మిస్ట్రెస్ కిరణ్మయి పచ్చి దొంగ ముండ' అని మీ భాషలో రాయి. ఇలా చేశావో ఈసారి స్కూలు ఫస్టు నీదే. ఎవరికీ చెప్పకు."

కల్లోలిని రాత పూర్తయేదాకా అదృష్టవశాత్తూ ఎవరూ అటు రాలేదు. తెలియని ఆ బెంగాలీ అక్షరాల్ని పెయింట్ ఆరేదాకా ప్రేమతో చూస్తూ అక్కణ్ణుంచి ఒక పట్టాన కదలలేకపోయింది వరలక్ష్మి.

ఇంకా పగలు పది కాకుండానే ఆ బోర్డు దగ్గిర ఇంచుమించు స్టూడెంట్సంతా ఈగల్లా మూగిఉండడం తన డాబామీంచి చూసి పరవశించిపోయింది. 'ఇంత జరిగాక ఆ పెద్ద పీనుగ పొగరు వదిలితీరుతుంది. ట్రాన్స్ఫర్ చేయించుకుపోతుంది. పీడ వదిలిపోతుంది' అని వరలక్ష్మి ఇంకా మురిసిపోతూనే ఉంది. కిరణ్మయి కబురు వచ్చి ఆ బోర్డు దగ్గిరికి వెళ్ళవలసి వచ్చింది. 'హై స్కూల్ మొత్తం మీద బెస్ట్ టీచరు మీరు. ఒకరి జోలికి పోరు. ఎవరికి పుట్టిందో ఈ పాడు బుద్ధి!' అని కిరణ్మయి అంటూంటే తెల్లబోయి సీతారత్నంని అడిగింది. సీతారత్నం జవాబు విని ఆమె నెత్తిని పిడుగు పడింది. అందులో 'పచ్చి దొంగ ముండ' అలాగే ఉంది. ముందున్నది మాత్రం హెడ్మిస్ట్రెస్ కిరణ్మయి కాదుట! మేడమ్ వరలక్ష్మి అనే అక్షరాలుట! చిన్నపిల్లయితేనేం కల్లోలిని ఎంత చక్కగా బుద్ధి చెప్పిందీ! ఈసారి ఆ ప్రాంతాల నుంచి వెంటనే బదిలీ చేయించుకునే వంతు తనదే అయింది!

వరలక్ష్మి గతంలోంచి వర్తమానంలోకి వచ్చింది. ఆనాటి తనకే అంతగా బుద్ధి వక్రీభవించి నప్పుడు, వేడి నెత్తురు పారే ఈపిల్ల వింటుందా? వీళ్ళతో ఆర్గ్యుమెంటు కుదరదు.

"ఏం, పిన్నీ, కవరు అంటించి పడేశావా?" అని సుజాత వస్తూ అడిగితే తల వూపింది వరలక్ష్మి. (అగ్గిపుల్ల) అంటించి ఆ కాగితాలు (పొయ్యిలో) పడేసింది, నిజమే!

*(ఆంధ్రప్రభ వారపత్రిక 1-8-1984)*

# బా




**కంట్రాక్టరు** అప్పుడే ఇచ్చి వెళ్ళిననోట్లు లెక్క పెట్టుకుంటున్నాడు భూపతి. తలుపులు సరిగా వేసి ఉన్నాయో లేదో అని కిటికీవైపు చూశాడు. ఆ సందులోంచి ఎదురింటి సంజీవి మొహం కనిపించింది. వీధి మెట్లమీంచి సైకిలు రోడ్డుమీదకి దింపుతున్నట్టున్నాడు. ఎలాగా వెళుతున్నట్టున్నాడు. ఈయనచేత వీక్లీ తెప్పించుకుంటే సరీ-అనిపించింది. పెళ్ళాన్ని కేకేశాడు. ఆవిడ రాగానే నోట్ల కట్ల చేతికిచ్చాడు. 'ఎదురింటాయనతో నేనో కబురుచెప్పి రావాలి. జాగ్రత్త. తలుపేసుకో' అంటూ వీధి వరండాలోకి వచ్చాడు. ఆలశ్యమయితే ఆయన దాటేస్తాడని అక్కణ్ణుంచే ఓ కేక వేశాడు.

"యాఁవండోయ్. సంజీవిగారూ...మళ్ళీ ఎక్కడకీ, టౌనుకే! ఇప్పుడే కదండీ ఇంట్లో ఏవో సరుకులు పడేయించినట్టున్నారూ... మీ ఓపిక్కి మెచ్చుకోవాలి." సైకిలు ఎక్కబోతున్న సంజీవి చటుక్కున దిగి ఓ నిమిషం నిలబడి, 'ఏం చెయ్యనండీ మరీ...ఒక్కొక్క రోజు యిలా తిరక్క తప్పడంలేదు. ఇవాళ ఏమయిందా నేను తీసికెళ్ళిన లెక్క సరిపోయింది కాదు. అదృష్టవశాత్తు

టౌనులో కొత్తగా బుక్ షాపు పెట్టిన మా ఫ్రెండు మార్తాండం గుర్తుకొచ్చాడు. వాడి దగ్గర ఓ ఇరవై చేబదులు చెయ్యక తప్పింది కాదు. వాడి సాయంవల్ల సరుకు ఇల్లుచేరింది. బాకీ తీర్చేద్దామని వెడుతున్నాను!''

అని జవాబు చెప్పేడు.

'యాఁవిటండీ బాబూ మరీ ఇంత చాదస్తం! ఇప్పుడు వెంటనే వెళ్ళి ఇచ్చెయ్యకపోతే ఆ బాకీ అలా ఉండిపోతుందనే?

'మళ్ళీ అవకాశం ఉండొచ్చు ఉండక పోవచ్చు... మరో ఖర్చుతరుముకురావొచ్చు. మరుపులో పడిపోవచ్చు... చిన్నదై తేనేం పెద్దదైతేనేం. ఒకళ్ళకి రుణాన్న పడివుంటే అది పైసలు చేసుకునేదాకా నాకు మరి తోచదు సుమండీ...వస్తానూ?' అంటేనే సైకిలెక్కి తరలిపోయాడు సంజీవి.

ఆ మాటలకు ఏదో షాక్ కొట్టినట్టయింది భూపతికి. గోడకి జార్లా పెట్టబడివున్న పడక కుర్చీని వాల్చి అందులో కూలబడ్డాడు. ఎంతో దూరం నుంచి వినబడుతున్న ట్టున్నా ఇవి తన గుండెకి ఎంతో దగ్గరిమాటలు. ఈ పైమెట్టు కూడా సాధించగలిగేక ఈ ఒకటి రెండేళ్ళయి కొద్దిగా పెడచెవిని పెట్టేడేమో గాని, ఎన్నెన్నిసార్లు ఎన్నేళ్లపాటు ఇంచుమించు ఇలాంటి మాటలే తనని వెంబడించి తనలో మార్మోగలేదు!

వీక్లి విషయమే తను మరచిపోయానని గుర్తుకువచ్చింది భూపతికి. ఆఫీసరుగా జిల్లా శిఖరాగ్రాన చేరుకున్నాక ఒకటీ ఒకటీ తుడిచి పెట్టుకుపోతున్నాయి గాని ఆ రోజుల్లో తెనుగు సాహిత్యం మీద ఎంతపిచ్చి ఉండేది తనకి! ఇంటర్మీడియట్ సీనియర్ చుదువుతున్న ఆ రోజుల్లో - ఎన్నేళ్ళయిపోయిందో ఎవరికి గుర్తు? -- ఆంధ్ర భాషా విభాగానికి పోటీచేసి ఎన్నిక అయ్యేదాకా ఎంత కొట్టుకుపోయాడో ఎలా చెప్పడం!

"నా జీవిత కాలమంతా ఇక్కడే గడిచిపోయింది బాబూ, నేడో రేపో పదవీ విరమణ చేస్తాను. నా తలవెంట్రుకలన్ని సాహిత్య సభలు చూశాను. కాని ఈ ఏడు ఆంధ్రవారోత్సవాలు నువ్వు జరిపించిన తీరు ఉంది చూశావూ భూపతీ. 'న భూతో న భవిష్యతి' అనుకో!'' అని అభినందించారు. తెలుగు పండిట్ చెంచురామయ్యగారు ఆయన తన తలమీద చెయ్యివేసి నిమురుతూ ఆ ఒక్కమాటా అంటూంటే ఆ వారం రోజులూ తను మోసిన బరువు చేత్తో తుడిచేసి నట్టయిపోయింది. అంతకు ముందూ ఆ తర్వాత కూడా ఇటు టీచర్‌గా గాని అటు పొయెట్‌గా గాని ఆయన మీద ఏమంత పెద్ద అభిప్రాయం లేదు భూపతికి. కాని ఆ ముందురోజే తెలిసింది చెంచురామయ్యగారంటే ఏమిటో!

స్నేహితులనుకున్న వాళ్ళే ఎంతగా గోతులు తవ్వుతారో అహర్నిశలూ కష్టపడినవాళ్ళకి గాని తెలీదు! తెలిసీ తెలియని ఆ వయస్సులో కేవలం ఉత్సాహమే పెట్టుబడిగా ఆ ఆంధ్ర వారోత్సవాల నిర్వహణలో నాయకత్వం వహించాడు భూపతి. కొద్దిమంది అండగా నిలబడకపోలేదు గాని దూరంనుంచి చూస్తూ రాళ్లు విసిరినవాళ్ళే ఎక్కువ. ఏమయితేనేం సర్వశక్తులూ కూడదీసుకుని ఆ ఆరురోజులూ అవుననిపించుకో గలిగేడు. ఆఖరు రోజున పడిన శ్రమ తలుచుకుంటేనే ముచ్చెమటలు పోస్తాయి. ఇప్పటికీ భూపతికి!

"అంతగా దమ్ములుంటే ముగింపు సమావేశానికి ముఖ్య వక్తగా ప్రజాకవిని పిలిపించు''

అని కార్యకర్తల సమావేశంలో ఒకరు పెంకితనంగా సూచిస్తే కాదనలేక వెంటనే ఉత్తరం రాశాడు భూపతి.

ఇరవై ఏళ్లై కవిత్వం ఒలకబోస్తున్నాడు ప్రజ్వలంగారు. అయినా అతనేనడో ఏంరాశాడో ఎవరూ ఎరగరు. ఆయన పాటలు రాసిన సినిమా ఒకటి శతదినోత్సవం చేసుకుంది అప్పట్లో. అంతే. ప్రముఖ ప్రజాకవిగా యావదాంధ్రం నిలబడిపోయాడు ఆయన. "నా హృదయం అగ్గిపెట్టె. నా రచనం పాముపెట్టె" అనే ఆయన గేయం కంఠతారాని తెలుగువాడు ఏడీ?

"మీరు విచ్చేసి యీ యువ సాహితీ జగతికి చేయూత ఇవ్వక తప్పదు" అని భూపతి పదేపదే రాసిన మీదట జవాబు వచ్చింది.

"ఊపిరి తిరగని సినిమా పనులలో ప్రాణం పోతోంది. సాహితీ ప్రియుల్ని కలుసుకుంటే పోయిన ప్రాణం వస్తుందేమో అనే ఆశ పీకుతోంది. మీరంత ప్రేమతో రమ్మని రాస్తే కాదనడం నా తరమా? నేనూ రసికా వస్తున్నాము. ఇక్కణ్నుంచి విశాఖ రానూపోనూ ఫస్టు క్లాస్ ఫ్లైట్ ఛార్జెస్ భరించవలసి వుంటుంది మీరు. అక్కణ్నుంచి మీ ఊరికి కారు ఎలాగూ ఏర్పాటుచేస్తారు. కన్ఫర్మ్ చేస్తూ వెంటనే ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్ ఇవ్వకపోతే తర్వాత నన్ను నిందించి లాభంలేదు."

కుర్రాళ్ళ గుడ్లు గిర్రున తిరిగిపోయాయి. ఈ లెక్కని మొదటి ఆరురోజుల ఖర్చూ ఆఖరి ఒక్కరోజుకీ సరిపోయేలా ముందే అంచనా వేసుకోవాలి. ధర పెంచినకొద్దీ వస్తువ విలువ పెరిగేలా కనిపించడం సహజం. ఎవరిమటుకు వారికి ఆయన్ని పిలిపించి తీరాలని ఉంది. ఖర్చుమాట తలచుకుంటే గుండె అదిరిపోతోంది. " దేశం కవులకు ఏమిస్తోంది? ఇంతకీ ఇది ఏపాటి ఖర్చు. ఓ మినిష్టరు లెట్రిన్ రిపేరు చేయించిన పాటిలేదు!" అనేశాడు ఉద్రేకంతో ఓ కుర్రాడు. అందరూ చప్పట్లు కొట్టేశారు. కార్యవర్గ నిర్ణయం ప్రకారం వెంటనే టెలిగ్రామ్ యివ్వడానికే నిశ్చయించుకున్నారు. ఏమైనా ఒకసారి ప్రిన్సిపాల్‌ను కలుసుకోవడం మంచిదనిపించి తెలుగు పండిట్‌ని తీసుకువెళ్ళేడు భూపతి.

"ఆయన స్థాయి సరిగ్గా తెలుసుకుని యిలాంటి పెద్ద పరుగులకు పోకుండా ఉంటే బాగుండేది. ఇప్పుడు కాదంటే కాలేజి ప్రిస్టేజి దెబ్బతింటుంది. టెలిగ్రాం ఇద్దామనే నిర్ణయం సరియైనదే. వీలైనంత జాగ్రత్తగా ఖర్చుపెట్టండి. ఇంతకుముందే నిర్ణయం అయిపోకపోతే ముందురోజుల వక్తల్ని వీలయితే ఇక్కణ్ణుంచే పికప్ చెయ్యండి. ఆ లోటు కనపడకుండా నాటికలూ, నాటకాలూ అన్నీ ముందు ఆ ఊరోజులలోనూ ఫిక్స్ చెయ్యండి. ప్రజ్వలం గారి స్పీచి చాలు ముగింపురోజున, వేరే ఎంటర్‌టయిన్‌మెంట్ అడగరనుకుంటాను ఆడియన్సు., ఈసారికి అదనంగా ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలకి వెయ్యి ఎడ్జస్టు చెయ్యడానికి ట్రై చేస్తాను. విష్ యు బెస్ట్ ఆఫ్ ది లక్. కేరీ ఆన్."

ఆయన వివరణకి రూమ్సు దద్దరిల్లిపోయేలా కుర్రాళ్లు కృతజ్ఞత తెలుపుకున్నారు. ఆయన అమ్మాయి భరతనాట్య ప్రథమ ప్రదర్శన సినీ కళామయ జీవిముందు జరగడానికి ఇదొక అవకాశం అని అతికొద్దిమంది సూక్ష్మగ్రాహులకు గాని అప్పట్లో తెలీలేదు. ఏదయినా తెలిసింది గాని రసిక అనే లలనామణి ప్రజ్వలంగారికి ఏమౌతుందో అనే విషయం నాటికి నేటికీ ఊహాగానంగానే మిగిలిపోయింది!

ఆ సాయంకాలం ఆ ఊరు ఊరంతా అక్కడే ఉంది! ఆ పిచ్చెక్కిన కిక్కిరిసిన జనాన్ని

చూసి ఎవరికైనా మతులుపోయాయి గాని ప్రజ్వలంగారికి చీమ కుట్టినట్టులేదు! పైగా "ఒక్క వందన సమర్పణ తప్ప మిగిలిన కార్యక్రమమంతా ముందే జరిపించెయ్యండి. ఆఖర్ని నా ఉపన్యాసం వుంచండి. ఎంచేతంటే ముందే నేను మాటాడేస్తే స్టేజిమీద తప్ప జనం మిగలరు. ఇది నా అనుభవం!" అని స్పష్టంగా సూచించారు. ఈలలతో గోలతో భరతనాట్యం భరతం పట్టేశారు మొట్టమొదట. వారి 'ఉషోదయం' నుంచి చెంచు రామయ్యగారు కొన్ని పద్యాలు చదువుతామని నిలబడగానే "దిగు దించూ" అని అరిచారు. "తూర్పున తెల్లవారినది తోయజబంధుడు తొంగిచూడగా" అనే పోయెటిక్ టేబిల్‌లో ఒక్క కోడు అయినా పూర్తిగా చెక్కనిచ్చారు కాదు! ఆ కారణంచేత వారి ఉషోదయం అముద్రిత కావ్యంగానే కాక నిశ్శబ్ద సంగీతంగా మిగిలిపోయింది!

ఇక ఆనాటి ప్రజ్వలంగారి ప్రజ్ఞా పాటవాలు ఆ ఊరి ప్రజలు ఇక జన్మలో మరచిపోలేదు. అక్కడ చేరినవారు వినడానికి వచ్చారో, చప్పట్లు కొట్టడానికి వచ్చారోగాని ఆకాశం, భూమి కంపించిపోయాయి.

అంతే కాదు. ఉపన్యాసం చివర ఆయనగేయం చదివారు. అందులో ముక్క ముక్కా దెబ్బలాడుకుని. ఏ అక్షరానికా అక్షరం పోటీలుపడి పంచేసుకున్నట్టయింది శ్రోతలందరూ...

అందులో కొన్ని ఇప్పటికీ మర్చిపోలేదు భూపతి

రా! దారి చూపిస్తాను

నిజం నిరూపిస్తాను.

నిప్పులు కురిపిస్తాను ... జబ్బులు వదిలిస్తాను.

ఆకలేమిటో చీకటేమిటో

శోకమేమిటో కేకలెందుకో

రా! చూపిస్తాను ... వినిపిస్తాను...అవుననిపిస్తాను....

దమ్ములుంటే పైకి రా!

కను దమ్ములుంటే చూడరా ! రా! ....

ఇలాగే సాగుతుంది. "నన్ను చూడ్డానికి కాకపోతే మీ కన్నులెందుకు!" అన్నంత ఆ [illegible]యంగా ఉన్న రసిక ఆయన ప్రతీ మాటకీ ఊగిపోతూ పొంగిపోతూ పడుతూ లేస్తూ సభని మరింత శోభాయమానం చేసేసింది. "ఆ సభలో అందరు జనం ఎంజాయ్ చేసింది ఏమిటి?" అనే ప్రశ్నకు తావులేదు. అసలైన ఆనందం అనిర్వచనీయం కదా!

శీతాకాలం కాబట్టి సభ ఎనిమిదింటికే ముగిసినా, ఎంతో రాత్రి అయిపోయినట్టుంది. నిజానికి సభ ఏడున్నరకే అయిపోయింది, హాలు కాళీ అయేసరికి మరో అరగంట పట్టింది.

మైకూ, లైట్లూ, కర్టెన్లూ, ఫర్నిచరూ ఇలాంటి పనులు కొంతవరకు చూసి మిగిలినవి జాయింట్ సెక్రటరీ జాకబ్‌కే, లేడీ రిప్రజెంటేటివ్ ఝాన్సీకీ, విద్యార్థి నాయకుడు రెడ్డికీ అప్పచెప్పి హోటలుకు భూపతి చేరేసరికి తొమ్మిది కావస్తోంది.

"సమయానికి వచ్చారు. రండి రోజూ రాత్రి వేసుకునే టాబ్లెట్ ఒకటి మరచిపోయాను. ఈ వేళప్పుడు మెడికల్ షాప్సు ఉంటాయిగా?"

అంటూ కారులోకి భూపతిని ఆహ్వానించారు ప్రజ్వలంగారు, "నేను తెప్పిస్తాలెండి మీ

కెందుకు శ్రమ, అదేదో కాగితమ్మీద రాసివ్వండి'' అని భూపతి చెప్పినా వినలేదు.

తీరా ఆ మెడికల్ షాపు చేరేక ఇంత పొడుగు లిస్టు తీశాడు ఆయన. "ఇదేమిటి, ఇవన్నీ వారి సిటీలో దొరకవనే!'' అనే భూపతి సందేహం ఆఖర్ని గాని తేలలేదు. నూట ఇరవై రూపాయిల బిల్లు కాగితం తన చేతిలోపెట్టి వాళ్లిద్దరూ దర్జాగా కారెక్కి కూర్చున్నప్పుడు తప్ప భూపతికి అసలు విషయం తెలిసిరాలేదు.

అంతేకాదు, కారు మరో అరమైలు వెళ్లాక, "అరె! ఇంత రాత్రివేళ యిలాంటి ఊళ్ళో మోస్ట్ మోడరన్ ఎక్విప్‌మెంట్ ఉన్న ఫోటో స్టూడియో తెరచి ఉండడం ఎంత ఆశ్చర్యం! మనం ఇక్కడికొచ్చి నందుకు గుర్తుగా నాలుగు షాట్సు తీయించుకుంటే ఎలా ఉంటుందంటావ్ రసీ?'' అని అక్కడ కారు ఆపించి భూపతి వైపు తిరిగి "మీకేం అభ్యంతరం లేదంటేనే!'' అంటూనే అందులోకి జొరబడిపోయాడు అన్ని సైజుల రేట్లూ స్పష్టంగా అక్కడ వేల గట్టబడి ఉన్నా, తను కనీసం ఓ శతమాసం మేరకు శిక్ష విధించానని మాట వరసకైనా పైకి ప్రకటించక, "కాపీలు ఎప్పట్లో యిస్తారు? మా ఎడ్రస్ సరిగ్గా రాసుకున్నారు. కదూ?'' అని మరోమారు మేనేజర్ని హెచ్చరించి ఎప్పట్లా నవ్వుతూ వచ్చి కారులో కూర్చున్నాడు.

"జన్మలో ఇలాంటి సాహిత్య సభ ఈ ఊళ్ళో జరగలేదు. ఇకముందు జరగదు... ఇలాంటిది నిర్వహించిన యీ కీర్తి నాది కాక మరెవరిది!'' అని ఆనందోద్రేకంతో శరవేగంతో కొట్టుకుంటున్న భూపతి హార్టుబీటు ఈ రెండు సంఘటనలతో బిలోనార్మల్‌కి చేరిపోయింది. ఓచర్సు అంటూ ఉంటాయి గనక ఏదో ఓలాగ వీటిని మీట్ కావొచ్చు. కాని ఆ రాత్రి భోజనాలయాక ప్రజ్వలంగారు కోరిన కోరిక చెవిన పడ్డాక గుండె ఆగిపోయినంత పనయింది. పదిహేనేళ్ళ క్రితం దేశంలో ఏ మున్నా మానినా ఇంతటి తాగుముచ్చుతనం లేదు మరి! ఆయనకి "తెల్ల గుర్రపు స్కారీ'' చేస్తేగాని నిద్రపట్టదుట.... వీళ్ళ అలవాట్లు ఇలాంటివని చూచాయగా వినకపోలేదు గాని 'ఇంతటి సురేంద్రుడని' ఊహించలేకపోయాడు...చెయ్యడానికేముంది "శ్రాద్ధాంజలి'' ఘటించక, స్వయంగా తెచ్చిపెట్టుకున్న తద్దినమాయె!''

ఆ "ఉచ్చైశ్శ్రవం'' ఓ పట్టాన పట్టుబడలేదు. ఎంత ట్రై చేసినా ఆ మార్కు ఫారెన్ విస్కీ ఎక్కడా దొరికి చావలేదు. ఆ ఎముకలు కొరికే చలివేళ ఆ హోటల్ వరండాలో విద్యార్థి ప్రతినిధులు బుర్రలు బద్దలు కొట్టుకున్నా బయటపడే మార్గం బోధపడలేదు. ఆఖరికి "మాయల ఫకీరు ప్రాణ రహస్యం'' ఒక ఎక్సైజ్ ఆఫీసరు కొడుకు బయట పెట్టాడు. విజిలిన్సు ఆఫీసరు పెళ్లాం ఈ సరుకు అమ్ముతుందిట. అక్రమ రవాణా జరుగుతున్న ఫారెన్ షిప్పునుంచి ఆఫీసరు కొట్టు కొచ్చి యిల్లు నింపిన సరుకు. ఆయన యిల్లాలు యీ విధంగా సక్రమ సరఫరా చేస్తున్నదట. మరో కుర్రాడితో వాళ్ళింటికి వెళ్ళి ఆవిణ్ణి కలుసుకున్నాడు భూపతి. పూర్తి బాటిల్ తప్ప ఆవిడ ఇవ్వనంది -- నూటిరవై ముందుగా చెల్లిస్తేనే...అదైనా ఎటువంటి రసీదూ ఇవ్వని పద్ధతిలోనే! అయిదారు రూపాయిలు తప్ప మరేంలేవు విద్యార్థి వీరుల దగ్గిర! "అతిధిదేవోభవ' అనే హెమరేజ్‌లాంటి హెరిటేజ్ తప్ప; ఆఖరికి ఓ కుర్రాడి ఖరీదైన రిస్టు వాచ్ ఆవిడదగ్గర కుదువబెట్టి ఆ బాటిల్ సంపాదించగలిగేడు భూపతి. ఆ రిస్టువాచ్ తిరిగి అతనికిప్పించడానికి ఆ తరువాత నెల పదిమంది స్టూడెంట్సు ఎలా చందాలు వేసుకున్నదీ భూపతి జన్మలో మరచిపోలేదు.

---

బాక్

"ఛ! పదిమంది కష్టపడ్డమూ, ఒకడు సుఖపడ్డమూనా! ఈ వ్యవస్థ పోడానికి నా ఆఖరి రక్తపుబొట్టు కారిపోయేదాకా పోరాడితీరతాను!" అంటూ ఆ సరుకు అప్యాయంగా రెండు చేతులా అందుకున్నాడు ప్రజ్వలంగారు.

కురుస్తున్న మంచుచేతా. మనసులో ఏర్పడుతున్న అయోమయాన్ని తట్టుకోలేకా ఎంతోరాత్రి అయిపోయినట్టుంది భూపతికి. ప్రజ్వలంగారికి గుడ్‌నైట్ చెప్పి ఫ్రండ్స్‌కి థాంక్సు చెప్పి అతను ఇంటివైపు మరలేసరికి ఫస్టుషో వదిలి పెట్టేరు.

"ఎవరిదీ, బాబూ భూపతీ, నువ్వేనా?"

పరిచిత కంఠం విని త్రుళ్ళిపడ్డాడు, అది చెంచురామయ్యగారు అద్దె కుంటున్న పెంకుటిల్లు తలకి ఓ గుడ్డ చుట్టపెట్టుకుని ఒణుకుతూ నిలబడ్డాడు ఆయన వసారాలో.

"ఎవరైనా తెలిసిన కుర్రాడు కనబడతాడేమో నని ఇందాకట్నుంచి ఇక్కడే నిలబడి చూస్తున్నాము-నువ్వు ఇప్పుడు కనిపించావు కాని నీకు మళ్లీ పని చెప్పడానికి ఎంతో సిగ్గుగా ఉంది. వారం రోజుల అలసటా నీ మోహం మీద స్పష్టంగా కనిపిస్తోంది. కాని ఏం చెయ్యను. అవసరం అలాంటిది..."

తెల్లబోయి నిబడ్డం తప్ప భూపతి మరేం చెయ్యలేకపోయాడు.

"మీటింగు నుంచి వచ్చానా, మామూలుగా నాతోనే భోంచేసింది మా ఆవిడ, పడుకున్నాం. అంతా ఓ పావుగంటైె లేచి కూర్చుంది. కడుపు నొప్పి అని అదసలే బెదురుగొడ్డు, ఇదివరకు దానికీబాధ ఉన్నదే సోడా తాగితే తగ్గిపోతుంది. చుట్టుపక్కల కిళ్ళీకొట్లు కట్టేశారు. ప్రభాత్ సినిమాహాల్ దాకా వెళ్ళి రావాలి. పోనీ నేను వెళ్లొద్దామంటే, ఇంతటి బాధతో ఒక్కర్తీ ఉండలేదుట...ఎలా చావను చెప్పు? సమయానికి నువ్వే దేవుళ్ళా కనిపించావ్....బాబ్బాబు."

భూపతి ఇంకేం వినలేదు. ఎదురుగా ఖాళీ రిక్షా ఒకటి వస్తూంటే ఆపించాడు. పది నిమిషాలు దాటకుండా సోడాతో ప్రత్యక్షమయ్యాడు. ఆయనెంత చెబుతున్నా వినకుండా ఆవిడ బాధ సర్దుకునేదాకా మరోపావు గంట అక్కడే కూచున్నాడు. తీరా అతను లేచి ఓ యాభై గజాలు నడిచాడో లేదో

"బాబూ, భూపతీ ... ఒక్కమారు ఆగు ...."

అంటూ ఇంచుమించు పరుగుతో చెంచు రామయ్యగారు అతన్ని అందుకున్నారు.

"ముసిలి ముండావాణ్నీ ... మతి కూడా పోతున్నట్టుంది నాకు .... రిక్షావాడికి నువ్వు రూపాయి యివ్వడం చూశాను... అంతట్లో మరిచేపోయాను. స్పెషల్ సోడాకి పావలా ... ఇవిగో డబ్బులు తీసుకో."

భూపతి ఆ డబ్బులు అందుకుని పేంటు జేబులో వేసుకుంటూ అన్నాడు.

"ఏం చాదస్తం మేస్టారూ మీది... ఇప్పుడు ఇవ్వకపోతే ఈ బాకీ ఇలా ఉండి పోతుందనే, మళ్ళీ మనం రేప్పొద్దున్న కాలేజీలో కలుసుకోమూ?"

ఆయన గద్గదిక స్వరంతో చెప్పిన జవాబు అతను ఎప్పుడూ మరవలేనిది.

"ఇంత రాత్రివేళ వచ్చి యిలాంటి ఆపద గడిపిపెట్టేవు చూశావూ, భూపతి, ఆ ఉపకారం నేను జన్మలో దిద్దుకోలేని దయారుణం. నేను తీర్చుకో గలిగింది. ఈ చిన్న బాకీ మాత్రమే.

ఇలాంటి చిన్నచిన్నవైనా ఎప్పటికప్పుడు తీర్చేసుకోకపోతే, ఏం చెయ్యనూ, నాకు తోచదు మరి!"

అలాటి విద్యార్థి భూపతి ఈనాడు జిల్లా ఆఫీసరు అయ్యాడు. ప్రజాకవి ప్రజ్వలం గారు పదితరాల సరిపడ డబ్బూ, పేరూ చేసుకుంటే ఎప్పటి బాకీలు అప్పుడు తీర్చుకుంటూ జీవితం గడిపిన చెంచురామయ్యగారు ఆయన కవిత్వంలాగే ఏం మిగలకుండా ఏం మిగుల్చుకోకుండా కదలిపోయారు.

సత్యస్ఫూర్తిగల సాహిత్యం మినుకు మినుకు నక్షత్రం మాత్రమే. డాబా మీది పట్టుపరుపుపై వెల్లకిలా పడుకుని అప్పుడప్పుడు వాటిని పోల్చుకోడంలో తప్పు కనిపించలేదు భూపతికి. ప్రేక్షకుడిగా మిగిలిపోతేనే పెద్దవాడు కాగలడు అని అతడే నాడో పోల్చుకున్నాడు. బాకీ అనేది ఉంచకూడదు. అనే మాట అతనూ కాదనడు. బాకీ తీర్చడంలో కొందరు శ్రద్ధవహిస్తే మరికొందరి ప్రజ్ఞ అంతా బాకీ అలా ఉంచెయ్యడంలోనే!

పాత ఆలోచనలు ప్రక్కకునెట్టి పడక్కుర్చీ ఎత్తిపెట్టి, భూపతి లోపలికి వెళ్లాడు.

*(అనామిక మాసపత్రిక)*

# అందచందాల కథ




**వాళ్ళిద్దరూ** ప్రాణస్నేహితులు. శక్తిగల వ్యక్తులను పూజించడంతోనూ చేతగానివాళ్ళను చీదరించుకోవడంతోనూ మానవత్వమే నశిస్తున్న ఈ లోకంలో ఏ భేదమూ లేకుండా సమానంగా అన్ని విధాలా ఒకే త్రాటిమీద నడుస్తున్న నవయువకులు వాళ్ళు. ఒక తల్లి కడుపున పుట్టకపోయినా అన్నదమ్ముల్ని మించిన వాళ్ళు. వాళ్ళకి 'నా' అన్నవాళ్ళు లేరని బాధ లేదు. ఒకరికొకరున్నారు, చాలు! కలసి జీవిస్తున్న కళాకారులు వాళ్ళు.

ఓసారి వాళ్ళిద్దరూ ఓ మ్యూజియంలో ఓ చక్కని శిల్పం చూశారు. ముసుగులోంచి సొగసు వెదజల్లుతున్న ఒక ముగ్ధ - చలువరాతి విగ్రహం అది. పండు వెన్నెలలో తాజమహలు అందం తనలో ప్రతిఫలిస్తే యమున మురిసి పరవళ్ళు తొక్కిందో లేదోగాని ఆ శిల్పంలోని చెక్కిన చక్కదనం చూచి వాళ్ళిద్దరూ మైమరచిపోయారు. పంచేంద్రియాలకూ అతీతమైన భావమేదో వాళ్ళలో ఒక్కసారి ప్రజ్వలించింది. గచ్చుమీద ఉన్న గోతుల్లో నిలిచే నీళ్ళలో కిచకిచమంటూ పిచికలు స్నానం చేసేటప్పుడు అయ్యే చప్పుడూ కళ్ళు తెరవని పిల్లిపిల్ల మీసాలకు అంటుకున్న పాలచుక్కల్ని వాళ్ళమ్మ నాకి శుభ్రం చేస్తున్నప్పుడు అయ్యే చప్పుడూ - యిలాంటివేవో వింటున్నప్పుడు కలిగే

ఆనందంలాంటిదేదో వాళ్ళలో నిలువెల్లా మెరిసి ఉండాలి.

'ఈ చేతలే చేతలు. ఈ శిల్పం చెక్కిన చేతులే చేతులు' అనుకున్నారు వాళ్ళు. ఇద్దరికీ ఒకేసారి శిల్పకళ అభ్యసించాలని బుద్ధి పుట్టింది. ఆ పట్నంలో ఆ విద్య నేర్పే ఓ ప్రైవేటు కాలేజీకి వెళ్ళి అడిగారు ఆ కాలేజీలో ఆరునెలలపాటు శిక్షణయిచ్చి పరీక్షకు తయారుచేస్తారు. నెలకి ఏభై రూపాయిలు ఫీజు తీసుకుంటారు.

వాళ్ళిద్దరూ బాగా బీదవాళ్ళు. వాళ్ళకున్న కొద్ది ఆస్తీ తినడానికే బొటా బొటీ అవుతూండేది ఫీజు కూడా ఎక్కణ్ణుంచి తెచ్చి కడతారు? అల్లంత దూరాన ఆశ బాధించగా నాలుగురోజులు కిందామీదా పడ్డాడు. రోజా రెండున్నర రూపాయలు కూలి యిచ్చే ఫ్యాక్టరీ ఒకటుందని తెలుసుకున్నారు ఆ వూళ్ళోనే.

'నే నివాళే ఫ్యాక్టరీలో చేరుతాను. ఆ డబ్బుతో నువ్వు నేర్చుకో. ఆర్నెల్లు నువ్వు అక్కడ నేర్చుకోవడం అయాక యిక్కడ పనిచేద్దువుగాని అప్పుడు నేను నేర్చుంటాను' అన్నాడు అందులో పెద్దవాడు. అలాగే అన్నాడు చిన్నవాడు. పెద్దవాడు ఫ్యాక్టరీలో కూలిపనిలోనూ, చిన్నవాడు శిల్పకళా శిక్షణ కేంద్రంలోనూ చేరారు. పెద్దవాడు డబ్బు తెచ్చి చిన్నవాడికి జీతం కట్టేవాడు. చిన్నవాడు శిల్పకళ అభ్యసించేవాడు. అరమరిక అన్నది లేకుండా అలా ఆరునెలలు గడిచాయి.

'ఒరే రాముడూ నా సరదా కొంతవరకు తీరింది. ఇన్నాళ్ళుంచి నేను ఫ్యాక్టరీకి వెడతాను' అన్నాడు చిన్నవాడు.

ఎంతో ఉత్సాహంతో, ఆశతో పెద్దవాడు కాలేజీకి వెళ్ళేడు. వెళ్ళినట్టే తిరిగివచ్చాడు. ఆ కళ్లలో జీవం లేదు! రాగానే తమ్ముణ్ణి కౌగిలించుకుని హృదయ విదారకంగా ఏడ్చాడు. వాడి ఆశ నిరాశ అయింది. గొడ్డళ్ళూ, గునపాలూ ఎత్తి, కాయలు గాచి బండబారిపోయి, సున్నితత్వం శూన్యమయిన వాడి చేతుల కిక శాశ్వతంగా కళాభ్యాసంచేసే అదృష్టం లేదు. చేతులేం వాడి హృదయమే బండబారిపోయింది. కొంతసేపటికి అందులోంచే ఓ పచ్చని మొక్క తొంగిచూసింది. 'ఏవిఁటో ఎంతసేపూ నా గురించే ఆలోచించాను గాని .... నిజానికి ... నేనే అదృష్టవంతుణ్ణిరా కిష్టుడూ .... నే నేమైపోతే ఏంగాక నీలాంటి మహాశిల్పిని తయారుచేశాను.... మొదట నేనే కాలేజీలో చేరి నువ్వే ఫ్యాక్టరీలో చేరేవ్‌కాదు, యింకా నయం!' పెద్దవాడు చిన్నవాడి సుందరమైన వ్రేళ్ళని ప్రేమతో స్పృశించాడు. చిన్నవాడు భరించిన బాధ భాష్యాని కందనిది. అనుభవించిన ఆవేదన అక్షరాలకు అంతుపట్టనిది.

పెద్దవాడి రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకున్నాడు. ముద్దెట్టుకున్నాడు. కళ్ళ కద్దుకున్నాడు. కన్నీటితో అభిషేకం చేశాడు.

'ఎంత మంచివి ఈ చేతులు! ఎంత అందమైనవి ఈ చేతులు!! తాము త్యాగంచేసి అరిగిపోయి నా చేతుల్లోని సౌకుమార్యాన్ని నిలిపి సుందరమైన కళను వికసింపజేసిన వీటికి నేను చెయ్యగల బహూకృతి ఏమిటి? ఏమిటి?'

ఆ చిన్నవాడు అదేపనిగా ఆలోచించాడు. వాడి మనస్సులో శ్రమ సౌందర్యంతో జ్వలిస్తున్న ఆ చేతులూ వ్రేళ్ళూ అలా నిలిచిపోయాయి. కరుణారసం కరడుగట్టి కట్టెదుట నిలచింది. సర్వశక్తులూ కేంద్రీకరింపజేసి వాడి జీవితంలో ఒకే ఒకసారిగా అద్భుతమైన శిల్పకళాసృష్టి చేశాడు. ఆ రెండు చేతుల్నీ ఒకదాని ప్రక్క మరొకటి ప్రార్థిస్తున్నట్టు చక్కని ఫలకంపై అపూర్వంగా చెక్కేడు. 'చేతులారంగ



....' అని క్రింద వ్రాశాడు. ఆ శిల్పానికి ప్రథమ బహుమతి లభించింది.

❋

అందచందాల నిర్వచనంగా ఒకరు ఓ చోట చెప్పిన చక్కని కథ పైది. అదే సంగతి నాకు మరో విధంగా బోధపడిన మరో చిత్రమైన కథ క్రిందిది.

కృష్ణమూర్తి నాకు యింటర్మీడియట్‌లో క్లాసుమేటు. తుని నుంచి నేనూ, ద్రోణాచలం నుంచి వాడూ వచ్చి కాకినాడలో కలుసుకున్నాం. కలుసుకున్న కొద్దిరోజుల్లోనే పైకి తెలియని పరస్పరాకర్షణకు లోనయ్యాం. గాఢ స్నేహితులం అయిపోయాం.

ఇప్పుడు తలుచుకుంటే ఆ రోజుల్లో అతని చమత్కార సంభాషణకే జోహారు లర్పించానా అనిపిస్తుంది.

'కృష్ణమూర్తీ యీ చొక్కాగుడ్డ చాలా బాగుందయ్యా. ఎక్కడ తీశావు!'

'కొట్లో.'

'ఆ సంగతి అందరికీ తెలుసు ఎక్కడ కొన్నావని?'

'బజార్లో .... బట్టల కొట్లో.'

'అబ్బా .... ఏం భాష బాబూ యిది?'

'తెలుగు.'

'అలాగా, మాకు తెలీద్సుమీ .... గుడ్డ అత్యాకర్షణీయంగా ఉండబట్టి ఇన్నిన్ని రకాల ప్రశ్నలు అడగవలసి వచ్చింది. ఏ కొట్లో కొన్నావో చెప్పవు గదూ .... పోనీ కొట్టుకొట్టూ వెతుకుతాంలే, ఎలా కొన్నావో అదయినా చెప్పు మరి.'

'డబ్బిచ్చి.'

'ఏం తిక్కమనిషి బాబూ? సరిగా చెబుతానా చెప్పవా? గజం ఎంత?'

'మూడడుగులు.'

'అబ్బా చంపకయ్యా బాబూ. అసలే మేము గుడ్డ దొరకదేమో అని సస్పెన్సుతో చస్తూంటే .... బట్ట ఎలా తీశావని?'

'ఇలా .... కుడిచేత్తో.'

అంతేగాని అడిగినదానికి ఆ మనిషి నుంచి జవాబు రాదు!

ఓసారి మా క్లాసులో - మేం ఎప్పుడూ చివరి బెంచీలో కూచునేవాళ్ళం - విష్ణుచక్రనాదం కోసం గజేంద్రుడిలాగ - బెల్ ఎప్పుడవుతుందా అని చూస్తూ కూచున్నాం. కఠిన సమాన భూయిష్ఠమైన వ్యాకరణారణ్యంలో అగోచర విహారం చేస్తున్నాడు మా తెలుగు లెక్చరరు కామేశ్వరరావుగారు. ఒక్కడికి ఒక్క ముక్క బోధపడితే ఒట్టు. కృష్ణమూర్తి నా ముందుకి చిన్న కాగితం విసిరాడు. అందులో యిలా రాశాడా తుంటరి.

'నవనవలాడెడు ప్రాణులు
చివరికి తమ బోధచే అచేతనమయ్యెన్
భవదీయ శిష్యకోటికి
శివకామా! క్లాసు వదిలి జీవనమిమ్మా!'

నా వెనకవాళ్ళూ పక్కవాళ్ళూ - గేలరీమీద ఉన్నామేమో - ఓ పదిమందిలా ఆ కాగితం చదువుకుని ఒక్కసారి గొల్లుమన్నాం.

'ఆ కాగితం యిలా యివ్వండి' అన్నారు ఆయన. మాకు ప్రాణాలు లేవు.

ఆవేళతో మా కృష్ణమూర్తి కాలేజీ జీవితం సరి అనుకున్నాను ఆ రోజు. ఆయన ఎంత సరసుడో చూడండి. పద్యం చాలా బాగుందనీ యింకా రాస్తూండమనీ ప్రోత్సహించి పంపేడు!

చపలత్వమూ చురుకుతనమూ చిత్రంగా మేళవించిన వాడి బహు విధమైన 'యాక్టివిటీ' చూసి వాడికి నేను 'ఉడతశ్రీ' అని మారుపేరు పెట్టేను. అయితే వాడు నాకు తిరిగి బహూకరించిన మారుపేరు యిక్కడ నేను చెప్పడం ప్రస్తుతమూ కాదు - నా కేమంత క్షేమకరమూ కాదు!

అయితే తూగుటుయ్యాల లూగుతున్న ఈ గంగాతరంగాలకు గంగోత్రి వేరే ఉందని నాకు ముందు తెలియనేలేదు.

హెచ్.యీ.ఏ.డి. కలిపితే 'హీడ్' అని పలికే నాకు 'రన్ గ్రామరు' అవసరమని ఇరవైయో ఏట తోచి కృష్ణమూర్తి నడిగితే అలాగే అని తెచ్చిపడేశాడు.

ఇస్తూ ఓ పజిలు నామీద విసిరాడు.

'ఇది మా అమ్మది. అంతేకాదు ఈ పుస్తకమే నాకు అమ్మలాంటిది .... ఒక్క పేజీ నలిగిందా డొక్క చీల్చేస్తాను....'

ఈ పైత్యానికేంలే .... అని మనసులో అనుకుని ఆ పుస్తకం యిలా తీశాను.

ఆ పేజీపై నున్న ఖాళీలో యిలా ఉంది.

'నా పేరు తెలుసుకోవాలనుందా?.... రెండొందల ఏభైనాలుగో పేజీ చూడు.'

ఆ పేజీ తీశాను.

'అంత సులువుగా దొరుకుతానా? నూటపదో పేజీ తిరగెయ్యి.' అదీ తీశాను.

'ఇక్కడ కాదు. అరవైనాలుగో పేజీ చూడు.' అది కూడా తీశాను.

'ట్రై అండ్ ట్రై. నూట ఏభై రెండులో వెతుకు. సహనం ప్రయోజనకారి కాకపోదు.' నాకు ప్రాణం విసుగెత్తినా తహతహ చంపుకోలేక ఆ పుట కూడా తీశాను.

'దారిలోనే ఉన్నావులే .... మంచివాడవు కదూ! ముప్ఫైమూడో పేజీ తియ్యమ్మా.' ఆ పేజీ కూడా తీశాను.

'ఓయి వెర్రివాడా? ఎండమావుల్లో ఏవీ బావులు! పేరు ఎక్కడ రాసుకుంటారో ఆ మాత్రం తెలియదా నీకు?'

ఇంతా వెదికితే చివరికి మిగిలింది ప్రశ్న మాత్రమే. కొంచెం ఆలోచించి మొదటిపేజీ చూశాను. కాస్త కనీకనబడకుండా అక్కడే ఉన్నాయి అక్షరాలు కె. స్వరాజ్యలక్ష్మి అని. గ్రామరు నాకు రాలేదుగాని అందులో గ్లామరు నన్ను ముగ్ధుణ్ణి చేసింది. పెళ్ళిచూపులనాడు కూడా 'మా అమ్మాయి ముస్తాబు అవుతోంది. అందాకా దాని రైటింగు ఎలా ఉంటుందో చిత్తగించండి' అని కృష్ణమూర్తి తండ్రికి యీ పుస్తకమే అందించారుట అందులోని కొంటెతనాన్ని గాఢంగా వరించి ఆనాడే బాలగంగాధరతిలక్‌తో పాటు గంగాధరంగారు కూడా 'స్వరాజ్యం నా జన్మహక్కు' అనుకున్నారుట!

స్వరాజ్యలక్ష్మమ్మగారు కాపురానికి వచ్చిన మరుచటి ఏడే కృష్ణమూర్తి పుట్టేడుట. ఆ పురిట్లోనే ఆవిడకు చాలా జబ్బుచేసిందట. దాన్తరవాత మళ్ళీ ఆవిడకి కానుపులేదు.ఇది ఎందుకు చెపుతున్నానంటే వాళ్ళిద్దర్నీ తల్లీ కొడుకులని ఎవరూ అనుకోరు. వీడు ఉడతలా ఉంటే ఆవిడ పిచికలా ఉంటుంది. ఇద్దరూ అక్కాతమ్ముళ్ళలా ఉండేవాళు. ప్రతీ చిన్న విషయానికీ యిద్దరూ చిన్న పిల్లల్లా దెబ్బలాడుకుంటూ ఉండేవారు. ఎడ్వొకేటు గంగాధరంగారికి యివి రెండూ రెండుకళ్లు. ఎవరిపక్షం తీర్పుచెప్పకుండా రవ్వంత విసుగు లేకుండా చిరునవ్వుతో ఆయన వాళ్ళ చిల్లర తగవుల్ని వీక్షించడం నాకు ఎప్పటికీ కమనీయ దృశ్యం.

'ఈ వెర్రివెధవకి చదువొకటా? పెళ్ళి కూడానా ఖర్మ!' అనే ఆ తల్లికి కొడుకు చీకటిపడేసరికి యింటికి రాకపోతే కలిగే ఆతృతా, 'ఇంత వయసొచ్చి దీనికి పౌడర్లు ఎందుకో? ఈ షికార్లు ఏమిటో!' అనే కొడుక్కి తల్లికి కాస్త ఒళ్ళు వెచ్చగా ఉంటే పొందే ఆదుర్దా చూసితీరాలి మరి, చెబితే నమ్మరు గద!

మా స్నేహానికి అప్పటికి ఎనిమిదేళ్ల వయసొచ్చింది.

వాడి పెళ్ళికి వెళ్ళినవాడు అంతమందిలోనూ పెళ్ళాన్ని బరబరా నా ముందుకి లాక్కొచ్చి.....

'ఎలా ఉందటావ్? నిజం చెప్పు.... కనురెప్పలు దిద్దీ..... సవరం జెడపెట్టీ మోసపుచ్చారు పెళ్ళిచూపులనాడు.... ఇంత చిన్న కళ్ళు అనీ, ఇంత చిన్న జడ అనీ ఎవరికి తెలుసూ', అనడం, వెంటనే ఆ పిల్ల అందుకుని 'నిజమే నిజమే.... అరంగుళం దళసరిని కోటాకొట్టి, పక్కనున్న కుర్చీపీట మీద నిలబెట్టి బోల్తా కొట్టించారు ఆనాడు. ఇంత నల్లరంగు అనీ మరీ యింత పొట్టిమనిషి అనీ ఎవరికి తెలుసూ?' అనడం..... నేను మరిచిపోలేని విషయాలు. అంతేగారు, కృష్ణమూర్తి కొడుకు అన్న ప్రాశననాడే వాళ్ళు క్రొత్తగా కట్టించుకున్న యింట్లో గృహప్రవేశం కూడా చేశారు. ఆంధ్రదేశంలో ఉన్న అయిదురకాల సంపెంగలూ, మాదీ అని ఓ యిల్లు కట్టుకుని అందులో వేసుకోవాలి అని గంగాధరంగారి కోరిక కూడా తీరింది. నేను వాళ్ల కొత్త యింటికి రాగానే మొక్కలకి నీళ్లు పోస్తూ నన్ను చిరునవ్వుతో పలకరించింది కూడా ఆయనే.

'అదేమిటి మీరు నీళ్లు పోస్తున్నారేం? బంట్రోతు ఏమయ్యాడు?'

'మానిపించేశాను. ఇంకా వాడెందుకు? అయినా ప్రాక్టీసు కూడా మానేశాక నేను యింట్లో ఉండి పడే పాటేమిటి గనుక. వాడేమో ఆఫీసుకు పోతాడు. కోడలు ఎప్పుడూ అలా పెరట్లో పనిచేసుకుంటూనే ఉంటుంది. ఇంకా మా ఆవిడ సంగతి నీకు తెలిసిందే కదా.... ఎంత వయసొచ్చినా యింట్లో క్షణం కాలునిలువని వెయ్యిళ్ళ పూజారి అది.... ఇంక యీ తోటలో మిగిలేది యింకా పళ్ళూడని యీ తాతగారూ, యింకా పూర్తిగా పళ్ళురాని ఆ బాబుగారూ.... ఎవరికి తప్పినా నాకు మాత్రం తప్పదు గదా...'

ఆ చివరి మాటలు ఆయన నవ్వుతూ అన్నప్పుడు ఆయనగాని నేనుగాని అలాగే జరుగుతే ఎలా ఉండునని కలలో అయినా అనుకోడానికి అంగీకరించి ఉండము. కాని జరిగింది అదే. ఆ మధ్య ఆ వూళ్ళో ఇన్ఫ్లూయెంజా అంటువ్యాధి మహాతుఫాను ఇంటింటా వచ్చి వెలిసిన తరువాత **ఆ యింట్లో ఆ తల్లీ లేదు, ఆ కొడుకూ లేడు!**

'ఇదుగోనోయ్..... ఇదేమో డ్రాయింగు రూం. ఇది మా అబ్బాయి బెడ్ రూం. తరువాత వసారా, అది దాటితే హాలూ... దూరంగా మా పడకగదీ.... ఎంచేతంటావా నిన్నగాక మొన్న పెళ్ళయినవాళ్ళు వాళ్ళు... ఏం ముద్దులూ ముచ్చట్లూ ఉంటాయో... ఆ గుసగుసలూ అవీ రాత్రిపూట యింకోళ్ళు వినడం వాళ్ళకి ఏమంత హితవుగా ఉంటుంది గనక.... అందుకని మా గది దూరంగా...'

"అలా అనకపోతే మీ కస్సుబుస్సులూ, చిర్రుబుర్రులూ వినిపించకుండా మీ గదికి మా గదే దూరంగా ఏర్పాటు చేశారని ఎందుకనుకోకూడదు?' అని పరాచికాలాడుకొనే ఆ తల్లీ కొడుకూ యిప్పుడు లేరు!

విద్యా పీఠం వదలి పొట్ట చేత్తో పట్టుకొని ఎవరి సంసార తాపత్రాయాల్లో వాళ్ళు పడిపోయి విడిపోయినా, నాకే, 'కృష్ణమూర్తీ మమ్మల్నందర్నీ విడచివెళ్ళిపోయావా కృష్ణమూర్తీ' అని గుండె బద్దలువుతూంటే, ఆ కఠిన సత్యం ఒప్పుకోడానికి మనసు శతథా మొండికెత్తుతూ ఉంటే, ఆ గంగాధరంగారికి ఒక్కగానొక్క కొడుకు.... పాతికేళ్ళవాడు... ఉద్యోగం చేస్తున్నవాడు... కట్టుకున్న యింట్లో కళ్ళముందు కలకాలం కలకల్లాడుతూ కదలాడవలసిన వాడు... హఠాత్తుగా మాయమయితే ఎలా భరించారో.... బాధ పంచుకోడానికి సహధర్మచారిణి కూడా లేకుండా కొడుకుతో గిల్లికజ్జా పెట్టుకోడానికి కూడా వెళ్లిపోతే, ఎలా బతికి నిలబడ్డారో నా ఊహకందని విషయం ఏదో పనిమీద ఆ ఊరు వెళ్ళినా అటువైపు వెళ్లడానికి నా కాళ్ళు రాలేదు. అయినా ఆ వీధి చివర్నే మా బంధువులు ఉండి, వెళ్ళవలసి వచ్చింది. ఆయనే నన్ను చూసి పిలిచారు. ఆయన్ని చూడగానే నా కళ్ళనీళ్ళు ఆగలేదు..

'నన్ను పరామర్శించడానికి వచ్చి నువ్వే ఏడుస్తున్నావా బాబూ?' అన్నారు ఆయన. నేను కళ్ళెత్తి చూశాను.

'ఏవిటో ప్రతి శరీరమూ ఒక అద్దెకొంప. కాని ఈ అద్దెకొంపే ప్రతినిత్యం సొంతకొంప కోసం చూస్తుంటుంది. చిత్రంగా లేదూ?'

నిజమే. ఆయన మాట చిత్రంగానే ఉంది. చెట్టంత భార్యనీ, కొండంత కొడుకుని మింగి ఇంకా ఆ మొహంలో ఆ చిరునవ్వు కాంతి చెదరకపోవడం చిత్రంగానే ఉంది.

'మానవుడు స్వార్థపరుడు బాబూ.... స్వార్థంతోనే మనోస్వాస్థ్యం కూడా చెడుతుంది. కొడుకుని పోగొట్టుకున్నాననే స్వార్థమే నా కన్ను కప్పేసింది. నేనింక బతుకుతే ఎన్నాళ్ళూ బతుకుతాను గనుక? ఆ పిల్ల, ఎవరు, మా కోడలి మాటే చూడు..... ఆ పిల్లకి పద్దెనిమిదేళ్ళు కూడా వెళ్ళలేదు. దాని బతుకు ఏం కావాలి చెప్పు?'' మృదువైన మనస్సూ, చురుకైన బుద్ధీ, పదునైన నాలికా కలిగి నిత్యం చైతన్య స్రవంతితో యిల్లు ప్రవహింపజేసే భార్యా, కొడుకూ, ఒకేసారి పోయిన మహాదారుణమైన దుఃఖంలో కూడా యీ 'నయనపథగామి' ఎదుటివారి కష్టసుఖాల గురించే ఆలోచిస్తున్నాడు! ఈ సుఖదుఃఖాలకు వీళ్లెందుకు వంచితులుకారో యిప్పుడిప్పుడు కొంతవరకు నా కర్థమౌతోంది.

'అవునవును పాపం....కృష్ణమూర్తి పెళ్లాం.... ఇప్పుడెక్కడుందీ?'

'ఎక్కడుంటుందిక? వీడెక్కడున్నాడో అక్కడ....'

నే నంతసేపూ చూడనేలేదు. తాతగారి వెనకనుంచి వాడివతలకి వచ్చాడు. రెండేళ్ళయింది వాణ్ణి చూసి బాగా ఎదిగాడు. ఎంతో ముద్దొస్తున్నాడు.

'ఏం చదువుతున్నావు?' అన్నాను యింకేం మాటాడాలో తెలీక.

'పెపరేతిరీ' అన్నాడు. నాకేం బోధపడలేదు. గంగాధరంగారు చెప్పేరు ఏదో మిషన్ స్కూల్లో 'ప్రిపరేటరీ' సెక్షన్లో ఉన్నాట్ట.

శలవు తీసుకుని వెళ్లిపోతూ వెనక్కితిరిగి చూశాను. అన్ని గదులూ బావురుమంటూ భయం భయంగా కనిపించాయి. అంత ఇంట్లో వెనక పెరట్లో ఆ పిల్ల ఒక్కర్తీ ఏం పనీపాటూ చేసుకుంటూందో భగవంతుడికి తెలియాలి. ఆయన ఏదో మొక్కకి గొప్పు తవ్వుతూంటే మనవడు వీపుమీద ఎక్కి ఊగుతున్నాడు. వాళ్ళమీద చెప్పలేని అభిమానం కలిగింది. 'ఎవరికి తప్పినా మాకు మాత్రం తప్పదు గదా!' అన్నట్టున్నారు వాళ్ళు.

ఇంకో రెండేళ్లు గడిచాక భగవంతుడు గంగాధరంగారిని మరోసారి పరీక్షించాడు. అది ఇలా జరిగింది అనుకుంటాను.

రానురాను గంగాధరంగారికి గార్డెనింగ్ పిచ్చి మరీ ఎక్కువైపోయింది. ఆయన యింట్లో పూయించని పువ్వు లేదు. సాయంకాలం అయేసరికి పువ్వులన్నీ కోసి ఆయనే స్వయంగా అరిటినారతో మాలలు కట్టేవారు. ఆ దండలన్నీ మనవడిచేత ఆ చుట్టుప్రక్కల యిళ్ళన్నిటికీ పంపేవారు. అదే పూజ అని ఆయన ఉద్దేశం. కళ్లెత్తి చూస్తే ఒక్కొక్కప్పుడు అరుగుమీద నిలబడి రెండు కళ్ళల్లోనూ నీటిచుక్కలు కారుతున్న ఆ కోడలిలో ఆయనకి తెగిపోయిన పూలమాలిక కనిపిస్తూ ఉండేది.

'వెర్రితల్లీ .... నీ తలలో దండ పెట్టే అదృష్టం నాకు లేకపోయింది' అనేరేమో...

'అక్కర్లేదు .... మీలాంటివారే నాకు ప్రత్యక్షదైవం .... నా కన్నీటి పుష్పాలే మీకు ఈ దీనురాలి పూజ' అనుకునేదేమో ఆమె....

పువ్వులే కాదు, ఆ యింటి ముందున్న విశాలమైన స్థలంలో చక్కని ఆకుపచ్చని లాన్స్ పెంచడం ఆయనకు మహా యిష్టంగా ఉండేది. 'ఇవి గరికపచ్చలు కావు .... భూమహాలక్ష్మి ధరించే గరుడపచ్చల పతకాలివి' అనుకునేవారు ఆయన....

'తాతా తప్కో తప్కో' అంటూ మూడుచక్రాల సైకిలు మీద వచ్చేవాడు మనవడు, తాత పరచిన పచ్చతివాసీ తొక్కుకుంటూ.

ఆ దృశ్యం చూసి కళ్ళకద్దుకునేదేమో ఆ యింటికోడలు.

ఓసారి వాళ్ళకు తెలిసినవాళ్ళ పిల్లలెవరో చిన్న రెయిన్‌కోటు వేసుకుని వెడుతూండడం ఆ బాబు చూశాడు. అలాంటిది కావాలని పేచీ పెట్టేడు వాడు కోరితే తీరని కోరిక అంటూ ఏముంటుంది ఆ యింట్లో? మరుక్షణం వాడికి సరిగ్గా సరిపోయే సిమెంట్ రంగు చిన్న ప్లాస్టిక్ రెయిన్‌కోటూ, చక్కని పువ్వుపువ్వుల రెయిన్‌హేటూ యింట్లో ప్రత్యక్షమయాయి.

తేగానే అవి వెంటనే వేసుకున్నాడు ఆ బాబు.

'వెంటనే వెళ్ళి మా యీ స్కూల్లో పిల్లలందరికీ చూపిస్తా' అన్నాడు వాడు.

'వర్షం రాందే అని వేసుకోకూడదు బాబూ, అందరూ నవ్వుతారు.'

బాబు చిన్న బుచ్చుకుని అవి విప్పేశాడు.

'అమ్మా! అమ్మా వర్షం ఎప్పుడొస్తుందే?' అని తల్లి గడ్డంపట్టుకు అడిగాడు.

'వచ్చినప్పుడు చెబుతాలే, అప్పుడు ఎంచక్కా వేసుకుందువుగాన్లే' అంది ఆవిడ. కాని నిజంగా

చెప్పనేలేదు. ఆ రాత్రి వర్షం కురిసి కిటికీలోంచి జల్లొచ్చి లోపల పడుతూంటే తలుపు వేసేసి పడుకుంది.

'అమ్మా రాత్రి వర్షం వచ్చిందా!' అని లేస్తూనే అడిగాడు బాబు గుంటల్లో నిలబడ్డ నీటిని చూసి.

'అవును బాబూ!'

'మరి నాతో చెప్తానన్నావ్‌గా .... లేపలేదేం?'

'ఆ అర్ధరాత్రివేళ ఏంచేస్తావురా'

'మరి వానొస్తే రెయిన్‌కోటు వేసుకోవద్దా' ఆవిడ నవ్వింది.

'బాగానే ఉందిరా నీ వరస .... తడిస్తే వేసుకోవాలిగాని ఊరికే ఎందుకూ?'

'వేసుకుని తడవకూడదా ఏమిటి?'

బాబు అమ్మని క్షమించలేదు. పోనీ అది వేసుకుని పదిమందికీ చూపించకపోతే పోయె .... ఓసారి అది వేసుకుని వానలో నుంచుంటే ఎంత తమాషాగా ఉంటుందీ?

వర్షకాలమయినా ఆ నాలుగు రోజులూ వర్షమే కురవలేదు. అయిదోరోజు వర్షం కురిసే వేళకు బాబు బళ్ళో ఉన్నాడు. వాడు ఆవాళ స్కూలుకి రెయిన్‌కోటు తెచ్చుకోలేదు. స్కూలు విడిచేసరికి వాన వెలిసిపోయిందికూడా ....

బాబు ఆశగా ఆకాశంకేసి చూసేవాడు ఎక్కడయినా చిన్న మబ్బు అన్నది ఉన్నదేమోనని....

'తాతా .... అసలు యిక వానలన్నవి పడవా?' అని అడిగాడు ఆ రోజున గంగాధరంగారిని. ఆయన వాడి కళ్ళలోకి చూశారు. అక్కడ లేదా వాన? పెద్దపెద్ద చినుకులు పడాలి. పన్నీరులాంటివి. పారిజాతాల లాంటివి. గబగబగబగబ పడిపోవాలి దడదడదడదడదడా పడాలి. చిట్పుటచిట్పుటమని పడాలి. నిలువుగా అడ్డంగా వంకరగా అన్ని రకాలుగా చినుకులు పడాలి. అమ్మోయ్, నాన్నోయ్, బాబోయ్, తాతోయ్, అని అందరూ అటుయిటూ పరిగెత్తాలి. ఆ మధ్యనుంచి ఏ మాత్రం భయంలేకుండా ఏ కొంచెం లెక్కలేకుండా కవచం తొడుక్కుని యుద్ధంలోకి వెళ్ళిన అభిమన్యుడిలా తను రెయిన్‌కోటు వేసుకుని, టోపీ పెట్టుకుని చకచకా నడిచివెళ్ళాలి. అందరూ ఆశ్చర్యపోవాలి.

అన్ని కోరికలున్నాయి ఆ కళ్ళల్లో .... అన్ని రంగులున్నాయి ఆ కన్నీళ్ళలో.

ఆ మర్నాడు పదిగంటలవేళ బాబు పరిగెత్తుకు తాతదగ్గిరకి వచ్చాడు. ఒక మోస్తరుగా వర్షం పడుతోంది.

'తాతా, తాతా యిదిగో రెయిన్‌కోటు తొడగవూ? నాకు పెట్టుకోడం రాదు తాతా, గుండీలూ అవీ సరిగా పెట్టవూ?'

వాడి సరదాకి ముచ్చటపడి గంగాధరంగారు కోటు తొడుగుతూ ఒళ్ళు ముట్టుకు చూశారు యధాలాపంగా, ఒళ్ళు కాలుతోంది. రెండు గుండీలు పెట్టిన కోటును మళ్ళీ విప్పేశారు. ఎత్తుకుని కోడలి దగ్గిరికి తీసుకొచ్చేరు.

'వీడికి జ్వరమొచ్చినట్టుంది చూడు తల్లీ ....' అన్నారు భయంగా. టెంపరేచరు చూశారు. నూటరెండు ఉంది.

వాడు ఆ కోటు వేసుకుని వర్షంలోకి వెడతానని ఎంత పేచీ పెట్టినా వాళ్ళు ఒప్పుకోలేదు. ఆవాళ ప్రారంభించిన ఆ వాన ముసురుగాపట్టి యించు మించు వారం రోజులు కురిసింది.

కిటికీలోంచి వర్షం చూస్తున్నాడు వాడు. హేంగర్‌కి తగిలించి గాలి కెగురుతున్న రెయిన్‌కోటు చూస్తున్నాడు వాడు. అలా ఆ వారంరోజులూ చూస్తూనే ఉన్నాడు. ఆ చివరిరోజున పన్నీటిలాంటి, పారిజాతాల్లాంటి, బాణాల్లాంటి ఆ చినుకులు ఎక్కణ్ణుంచి వస్తాయో అక్కడికే వెళ్ళిపోయేడు వాడు!

కృష్ణమూర్తి కొడుకు పోయాడన్న సంగతి వినగానే మ్రాన్పడిపోయాను నేను. పిచ్చెత్తకముందో, ఆత్మహత్య చేసుకోకముందో తక్షణం వెళ్ళి గంగాధరంగారిని కలుసుకోడం నా కర్తవ్యంగా భావించాను. ప్రకృతిలో లీనమై పరమపవిత్రంగా జీవితాన్ని గడుపుతున్న ఆ ప్రశాంతమూర్తిని యింకా భగవంతుడెందుకు పరీక్షిస్తున్నాడో నాకు తెలీదు. దేన్ని చూసుకుని బతుకుతున్నాడో అదే పోతే మనుషులు ఏమైపోతారో నాకు తెలీదు. తెలుసుకోవాలని ఉంది. అందుకే తక్షణం రెక్కలు గట్టుకుని అక్కడ వాలేను.

గేటులోంచే అల్లంత దూరాన గంగాధరంగారిని చూస్తూ నిర్ఘాంతపోయాను. ఈసారి కూడా నన్నే ఆయన పరామర్శ చేయవలసి వస్తుందని నేను కలలో అనుకోలేదు ఆయన చేతికత్రతో కొమ్మలు విరిగిపోకుండా గులాబి పువ్వులు కోస్తున్నాడు. 'రా, బాబూ రా ... గుమ్మంలోనే నిలబడిపోయావేం?' అని ఎప్పట్లా ఆదరించాడు. స్పష్టంగా. శ్రద్ధగా విన్నాను, చూశాను. అదే గొంతుక, అదే చిరునవ్వు. అది మానవ హృదయమో కఠిన శిలాఫలకమో నాకు అర్థం కాలేదు. నిశ్శబ్దమైన వాతావరణాన్నీ, నిర్మానుష్యమైన ఆ భవనాన్నీ నేను భరించలేకపోయాననుకుంటాను. కాదు. కాదు ... అత్యున్నతమైన ఆ మహావ్యక్తి సాన్నిధ్యాన్ని నేను సహించలేకపోయాను. ఇతడు దేన్ని చూసుకుని జీవిస్తున్నాడో నేను ఊహించలేకపోయాను. 'ఎవరికి తప్పినా నాకు మాత్రం తప్పదు గదా!' అని ఎలా అనుకోగలుగుతున్నాడో అర్థం చేసుకోలేకపోయాను. 'మళ్ళీ వస్తాను' అని గుమ్మంలోంచే వచ్చేశాను.

దుర్భరమైన ఏకపుత్ర శోకంలో మునిగిపోయిన కృష్ణమూర్తి భార్యని తీసుకువెళ్ళడానికి వచ్చిన ఆమె తండ్రి రెండుచేతులూ పట్టుకుని 'బావగారూ.. దురదృష్టవంతుణ్ణి నేను .. మనవడు మీ దగ్గిరున్నా బ్రతుకునేమో .... అమ్మాయిని చూస్తే కడుపు తరుక్కుపోతోంది .... బొత్తిగా చిన్నపిల్ల .... పెళ్ళే కాలేదనుకోండి .... పిల్లే పుట్టలేదనుకోండి .... తగిన ధైర్యం చెప్పి నాలుగు ఊళ్ళూ తిప్పి మళ్ళీ మనిషిని చెయ్యండి .... ఈ అయిదువందలూ ఉంచండి .... పిల్లని అలాగే ఉంచేస్తే భగవంతుడు మనిల్ని క్షమించడు. వీలయినంత తొందర్లో పెళ్ళి చేసేద్దాం ఎంత కట్నం యిచ్చైనాసరే. ప్రపంచమంతా ఎదురైనా సరే'' అని గంగాధరంగారు అన్నారంటే కొంతవరకు నమ్మగలను.

ఎనిమిదేళ్ళ శంకరాచార్యుడు 'అదేమిటే అమ్మా, తెలిసినవాళ్ళెవరో పోయారని ఏడుస్తున్నావా? తొమ్మిది కన్నాలున్న తోలుతిత్తి అయిన ఈ శరీరంలో ప్రాణవాయువులాంటి పదార్థం ఉందంటే చిత్రంగాని - అది బయటకు పోయిందంటే అందులో ఆశ్చర్యం ఏముందే?' అన్నాడంటే కథగా నేను నమ్మగలను. అదే ఆధ్యాత్మిక దేశంలో అన్నీపోయిన గంగాధరం లాంటివారు చిరునవ్వుతో జీవించగలుగుతున్నారన్న విషయం సత్యమే అయినా అది నాలాంటి సామాన్యుడికి అర్థంచేసుకోలేనిది.

*(యువ మాసపత్రిక)*

# దెయ్యం చల్లగా ఉండాలి గాని ..

## 24



**పున్నమ్మకథ** విన్నవాళ్ళెవరికైనా 'దెయ్యాలున్నాయా?' అనే సందేహం రానేరాదు. పున్నమ్మ చచ్చి దెయ్యమయిందని కాదు, ఏ దెయ్యమో తగిన ధైర్యం చాలక, తపస్సుచేసి బతికి పున్నమ్మ అయివుంటుంది.

జుత్తెప్పుడూ పున్నమ్మ విరబోసుకునే ఉంటుంది. కళ్ళెప్పుడూ అమెకు ఎర్రగానే ఉంటాయి. మనిషెప్పుడూ జోగుతూనే నడుస్తుంది. అక్షరాలా ఆమె ఆ యముడి భార్య. అందుకనే ఎనుబోతుల సహధర్మచారిణులయిన గేదెల్ని సాకుతూ జీవిస్తూ ఉంటుంది.

రాజ్యాలయితే లేవుగాని నోరయితే ఆవిడకి పెద్దదే ఉంది. కొడుకయితే లేడుగాని 'మిస్. అండర్‌వరల్డ్' లాంటి మేనగోడలు ఆమెని కనిపెట్టుకునే ఉంటుంది. దగ్గిరవాళ్ళంటూ లేకపోవచ్చునుగాని చేరదీసిన మనుషుల సంఖ్య ఏమంత తక్కువకాదు. ఇల్లయితే లేదు గాని ఆ వీధి బాగా విశాలంగానే ఉంటుంది. మొగుడయితే లేడుగాని మొగసాయానికి ఏ రాత్రీ మొగంవాచి ఎరగదు ఆసాధ్వి. దూడకి ఒక్క చుక్క మిగల్చకుండా పాలు పిండుతూ యావత్‌లోకం పాపాలు

పిండుతున్నట్టు లెక్చెరివ్వగల సమదృష్టి ఆమెది. సెచ్చు చాలకపోతే ఏ మొగుణ్నో తలుచుకుని అప్పటికప్పుడు ఏడ్చి కన్నీళ్లు కార్చి అనుకున్న ఏ కొంతకైనా పాలు యివ్వగల యోగవిద్య ఆమెది. బయస్కోపు కెళ్ళినా భద్రాద్రికి బయల్దేరినా టిక్కెట్టుకొని ఎరగని స్వేచ్ఛా ప్రవృత్తి ఆమెది.

'జాతి, మత, కుల, వర్గ భాషా విభేదాలు సంకుచితంగదా!' అనే సదుద్దేశంతో ఎవరింట్లో ఏ పాదు, తీగె బయటకి కనబడినా ఎగిరి కాయలూ పువ్వులూ తెంపుకునే సెక్యులర్ తత్వం ఆ యింటి సిల్లలిది.

'భూమీ, గాలీ, నీరూ, కాంతీ - ఇవి ఏ ఒక్కరిసొమ్మో అనుకోడం అన్యాయం గదా!' అనే విశ్వమయ ప్రేమతో ఎవరి పచ్చటి పొలం ఏ మూల కళ్ళబడినా ఎగిరి గంతేసి, ఎగబడి కుమ్మేసే కలుపు గోరు విధానం ఆ చూరు గేదెలది.

ఇంతకీ ఇల్లని భ్రమపడి చచ్చేదాకా యీ చూరుని పట్టుకుని వేళ్ళాడతాంగాని పున్నమ్మలాంటి లోకాతీతకి ఎంత జాగా కావాలి! ఆ వీధికి ఎడంచేతివైపు చివర, అన్నిటికీ ఆఖరుగావున్న ఖాళీ జాగాలో చిన్న పాకవేసుకుని జూనియర్ విక్టోరియాలా పున్నమ్మ 'పాలిస్తోంది!'

'పోనీ దిక్కులేని ఆడదానివి, నువ్వేదో యిల్లు ఏర్పాటు చేసుకుంటే మేం ఏమీ అనం. నీ గేదెల్ని వీధిలోకి ఊరిమీదకీ వదిలేస్తున్నావు. పబ్లిక్‌కి నానా న్యూసెన్సుగానూ ఉంది జాగర్త'

అని ఆమె దగ్గిర పాలబాకీ పెట్టిన మునిసిపాలిటీ మునిమంచ్చొకడు ఒకసారి నిలదియ్యడం జరిగింది.

'బాబ్బాబూ ... కోరుటు కెల్దారనీ. సూసొద్దారనీ ఎన్నాల్లకాడ్నించో ఉందిరా కొడకా నాకు ... ఓపాలి బేగి తీసికెల్దూ ... అయితే ఒకటీ ఆడపేనాన్ని. ... ఒక్కత్తినీ రాలేను. నాకు పురుసతోడుగావాల. ఎవుడో దెల్సా? వక్కయీది కంటాకటరు కైలాసంగోడు నేడూ ? ఎవుడు? నారీ ఓనరూ... ఆడూ నారీలన్నీ రిపేరు కని యీదిలోనే పేరుత్తాడు. ఆ బల్లు సేసే గోలకన్న మాగొడ్లు సేసేగొడవ ఎక్కువేంకాదు. మా కిద్దరికీ కలిపి చంకిల్లేయించరా కొడకా ... గల్లుగల్లుమని బయలెల్తాం జంటగా .... ఊరంతా ఆరతులివ్వనేక పోటీలు పడేని.!'

అని మళ్ళీ నోరెత్తకుండా పున్నమ్మ జవాబివ్వడమూ జరిగింది.

లారీలూ గేదెలూ వీధివాళ్ళకి ఎలా ఉన్నాయోగాని పున్నమ్మ కుడిచేతివైపు యింట్లో అద్దెకు దిగిన కుటుంబాన్ని చూస్తే ఆమెకి అరికాలిమంట తలకెక్కుతోంది. వాళ్ళకి యిరుగూపొరుగూ లేదు. మంచీ చెడ్డా అసలేలేదు. అలవాటు ప్రకారం వాళ్ళ పెరట్లో జొరబడితేచాలు సరిగ్గా గొడ్డుని బాదినట్టే బాదేస్తున్నారు వాటిని. తన మనవలు వాళ్ళ అరుగుఎక్కితే చాలు బూజులు దులిపినట్టు దులిపేస్తున్నారు. తన మనుమలు, ఏదో స్నేహం కొద్దీ సుమా, సందులోంచి యిలా గడకర్రతో అందుకుంటున్నారో లేదో ఆ యింటి ములక్కాడలు, పట్టుకుని కుక్కని కొట్టినట్టు కొట్టి, పందుల్ని తోలినట్టు తోలేస్తున్నారు!

'బగుమంతుడా! యియ్యేదవల్ని సిచ్చించు' అని పున్నమ్మ పోతరాజుకి మొక్కుకుంది. కలడు కలండనెడువాడు 'కలడా, కలడున్నరా!' అనిపించాడు. ఆ యింటికోడలు ఓనాటి అర్ధరాత్రి ఎందుకు లేచిందో ఏమో పెరట్లోకి వచ్చి నూతిదగ్గిర కాలుజారి, అందులో పడి యముడి ముడిలో చిక్కుకుపోయింది. నక్షత్రం మంచిది కాదని మూడునెలలపాటు ఆ అద్దెవాళ్ళు ఆ యిల్లు

పాడుపెట్టేశారు. అయితే అంతటితో పున్నమ్మ కష్టాలు గట్టెక్కేలా కనబడలేదు. మూణ్ణెల్లు ఎంతలో అయిపోవాలి! మళ్ళీ వాళ్ళు రారా! మహలక్ష్మి లాంటి కోడల్ని సోగొట్టుకున్న వాళ్ళు మళ్ళీ ఆ దిక్కుమాలిన యింట్లో అడుగుపెట్టలేమన్నారని విని ఆమె ఎంతో సంతోషించింది. కాని వీళ్లు కాకపోతే నీళ్ళ అమ్మనమ్మ మొగుళ్లు మూడోనాటికి ఆ యింట్లో నిండిపోరా? అద్దెకి యిల్లు దొరకడం అమ్మాయికి మొగుడుదొరకడం అంత కష్టంగదా!

నిమిషాలమీద మరొకరు వచ్చి ఆక్రమించెయ్యరా! 'దీని కేదో ఒక శాశ్వతమైన ఏర్పాటు చెయ్యాలి' అని నిశ్చయించింది పున్నమ్మ. ఈసారి ఆమె ఎవరిమీదా ఆధారపడదల్చుకో లేదు. 'చాలా కష్టపడ్డావు గాని కాస్సేపు రెస్టుతీసుకో' అన్నట్టు భగవంతుడికి సలహా యిచ్చి ఆమె రంగంలోకి దిగిపోయింది.

ఆ తరవాత ఒకరోజు తెల్లవారుఝామునట ... చిరు చీకటిగావుందో తెలతెలవారిపోతోందో సరిగ్గా చెప్పలేదుటగాని, పున్నమ్మ కాలవ ఒడ్డుకివెళ్ళి వస్తూంటే ...

'సిట్టెన్మా దాన్ని సూసేక ఇక నాకు పేనాలు నేవే ... తెల్లటి కోక ... మొగన్నిండ యింతెత్తుని పసుపు ...రకతంముద్దనాగ అంత బొట్టు ... అంత పొడుగున యిరబోసుకున్న జుత్తు ... ఓలమ్మో యిప్పుడు సూస్తున్నట్టు ఒల్లు ఒనికి పోద్దే ... గల్లుగల్లు పట్టీలసప్పుడు ... మా పాకకి పాలకి ఒచ్చేదిగదూ అదే సప్పుడు ... పకపకనవ్వుతూ ఎల్లిగమ్మని నూతిలో ఉరికిందే మాయమ్మో'

తెల్లవారిలేచి ఎవరినోట విన్నా ఇదే మాట ...

'సందేహ మేమిటీ, ఆ యింటి కోడలే అదీ!'

'పున్నమ్మగాబట్టి నిలబడగలిగింది గాని మరొకరయితే అక్కడికక్కడ రక్తం కక్కుకుని చచ్చి ఉందురు!'

'అయితే పాపం కోడల్ని అత్తగారు నూతిలో తోసేసిందన్నమాట!'

'ఎంత ఘోరం! లేకపోతే అప్పటి కప్పుడు యిల్లు ఖాళీచేస్తారా?'

'బాగా చెప్పేరు! అయితే ఎందుకు చంపేశారంటారు?'

'ఏమో కోడలికీ మావగారికీ సంబంధం ఉందేమో! ఆ సంగతి అత్తగారి కళ్ళ పడిందేమో!'

లోకం సూక్ష్మబుద్ధికి లోలోన పున్నమ్మ ఎంత ముచ్చటపడింది. ఆ ఇల్లు సాంబయ్య అనే రిటైర్డు హెడ్‌క్లర్క్‌ది. ఏభైరూపాయిలకి అది అద్దెకిచ్చి వేరే కొత్తపేటలో యిరవై రూపాయిలకి చిన్న యిల్లు తీసుకున్నాడాయన. ఆయన గట్టి ప్రయత్నం చెయ్యగా మూడోనెలలో కాబోలు యిద్దరు స్టూడెంటు కుర్రాళ్ళు ఆ యింట్లో దిగేరు. ఎంత ఉక్కబోసినా మేడమీద గదిలో లోపల తలుపేసుకుని పడుకుంటారుగాని పీకపోయినా డాబామీదకి రారు. వచ్చినా కిందకి చూడరు. ఏ కారణంచేతైనా కరెంటు కొంతసేపు ఆగిపోతే ఆ కొంతసేపూ వాళ్ళ గుండెలు కొట్టుకోవు.

అందులో ఒకడికి గాలికి కొబ్బరి చెట్టు మట్టలు చప్పుడు చేస్తూంటే కింద ఎవరో కిరకిర తలుపులు తీస్తున్నట్టు భ్రాంతి కలిగింది. అర్ధరాత్రివేళ వీధి గుమ్మంలో కుక్క ఒకటి 'కుయ్యో' మని కూనిరాగం తీస్తే 'అయ్యో' అని అతిదీనంగా ఆడదొకతె ఆక్రందనం చేసినట్టు వినిపించిందని అతను చదువుతున్న డిటెక్టివ్ పుస్తకంమీద ఒట్టు పెట్టుకుని రెండో కుర్రాడు చెప్పేడు. ఏమయితేనేం మర్నాడు ఉదయం యిల్లు ఖాళీ అయింది. ఆ పక్కయింటివాళ్ళు సహితం 'ఎప్పుడేం

కంటబడుతుందో' అని హడలి చస్తున్నారు.

సాంబయ్యగారి భార్య అయిదేళ్ళయి మరణించింది. ఇంట్లో పనికుర్రాడే యింత ఉడికించి పారేస్తాడు. ఆయనకి చదువుకుంటున్న ముగ్గురు కొడుకులున్నారు. 'బాబుగారూ! చూశారా? దెయ్యాలంటే మీరు కొట్టిపారేస్తారు. ఆ అపనమ్మకమే మీ కొంప తీసింది... వెంటనే వెళ్ళి మాంత్రికుడు పరాంకుశం గారిని కలుసుకోండి' అని పనికుర్రాడు సలహా యిచ్చాడు. సాంబయ్య మంచివాడేగాని లోకజ్ఞానం లేనంత వెర్రివాడేంకాదు. తనకి దెయ్యాలమీద నమ్మకం లేకపోవచ్చు. కాని తనయింట్లో దిగేవాళ్ళకి ఆ ధైర్యం ఉండాలిగదా! పోనీ ఆ పరాంకుశం చేతిలోనే ఏదోపెట్టి ఆ యింట్లో దెయ్యం లేదనిపిస్తే!

ఆయన తను అనుకున్నంత అందుబాటులో లేడని సాంబయ్య పరాంకుశాన్ని చూడగానే పోల్చుకున్నాడు. తీర్థప్రజలా ఉన్నారు అక్కడ జనం. మూడుపదులు విజిటింగు ఫీజుగా ముందు చెల్లించాలి! మనుషుల భయాలమీదా బలహీనతల మీదా రీసెర్చి చేసి ఆయన యీ మధ్యనే స్వయ్గా డాక్టరేటు పుచ్చుకున్నాడు. 'ప్రేత భయంకర' బిరుదు బాగులేదని 'ప్రొఫెసర్ ఆఫ్ ఘోస్టాలజీ' అనే బోర్డు ఒకటి భక్తుడొకడు స్వయంగా రాసి ఆయనకు అర్పించుకున్నాడు. ఇద్దరు ఆడపిల్లలకీ రెండేసి వేలుచొప్పున లంచాలు కట్టి అత్తారిళ్ళకు ట్రాన్స్ఫరు చేయించుకున్నాడాయన. ఏదో, తనూ ఓ దెయ్యం అవకనుందే సొంత యిల్లొకటి లేపుకుందామని ఆయన ఆలోచన. సాంబయ్యతో చేసిన ఇంటర్వ్యూవల్ల అతని యిల్లు తనదే అనిపించింది ఆ క్షణాన పరాంకుశానికి.

ఓ గంటసేపు ఆ యింటి మేడమీది గదిలో ఆ అసురసంధ్యవేళ ముగ్గులు వేసి మంత్రాలు చదివి భళ్లున తలుపు తీశాడు.

'మీరేం చెప్పొద్దు ... దెయ్యంలేదని రుజువు చేశానని చెప్పండి. మీకు నూట పదహార్లు యిస్తాను' అన్నాడు సాంబయ్య అతి మెల్లిగా. వీధిలో చేరిన అశేషజనాన్ని చూసి భయపడుతూ. పరాంకుశం ముక్కుమీద వేలేసుకున్నాడు. చల్లగా చీవాట్లు పెట్టేడు.

'తప్పు నాయనా! నన్ను దూషించు. శాస్త్రాన్ని శంకించకు. సత్యస్వరూపులయిన ఆ అమాయిక ప్రజముందు యీనాడు నేను నీ రూపాయలకి గడ్డితిని బొంకినా రేప్పొద్దుట ఆ సర్వాంతర్యామికి ఏం జవాబు చెప్పను! చూడు నాయనా నువ్వేచూడు, చెదిరిన ఆగరికమీద కనీ కనిపించని ఆ పాదాల గురుతులు చూడు. రివ్వుమని జువ్వివేసే సవ్వడి విను. దాని మీద వాలింది రాబందులాగుంది చూడు. నీచగ్రహానికి యివన్నీ నిదర్శనాలుకావా?'

'ఇంతెందుకు బాబుగోరూ! ఆ దెయ్యం కొబ్బరిసెట్టు సూడండి. ఆ మునగసెట్టు సూడండి ... మునపు యింతేసి కాయలు దిగేవి... యిప్పుడు పువ్వు నల్లగా మాడిపోవలసిందేగాని యింత పిందె దిగదే! ఏటంటారు?' అని పున్నమ్మ శ్రుతి కలిపింది. సాంబయ్య అడిగేడు. 'పరాంకుశం బాబూ! ఈ దెయ్యాన్ని యిక్కణ్ణుంచే పంపించెయ్యలేరా?'

'సాధువుల్ని చెయ్యవచ్చుగాని సతీ పిశాచాన్ని స్థానభ్రంశం చేయడం సాధ్యం కాదు నాయనా! మనకు ఒక దశాబ్దం పిశాచమాన ప్రకారం ఒక్క ఏడాదికి సమానం. పదేళ్ళయినా పీడించందే యిక్కణ్ణుంచి వెడలనడపడం అసందర్భం నాయనా!'

చీకటిపడింది. అక్కడ మూగినవాళ్లు ఒక్కొక్కళ్ళే జారుకున్నారు. సాంబయ్య అనుకున్నదొకటీ, జరిగిందొకటీ ... తింటూ తింటున్న కూటిలో మన్ను పడిపోయింది. ముగ్గురు పిల్లల చదువులు జరగాలి. ఎలాగో యీడ్చుకు వస్తున్నాడు యీ అద్దెరాళ్ళతో. ఇక ముందు ఎలా బతకాలి! లోకంమీద చెప్పతేని కసి ఏర్పడింది అతని కాక్షణంలో. ఏం తప్పుచేశాడని తనకి యీ శిక్ష?

'ఈ వీధివాళ్ళకి యీ ఊరివాళ్ళకీ తప్ప యీ కబురు తెలియదుగదా! పై ఊరి వాళ్ళ కెవరికైనా ఎంతొస్తే అంతొస్తుందని అమ్మేస్తే?'

'నాయనా! నీ అవస్థ నీలాంటి యోగ్యుడిచేత అలాంటి మాట అనిపిస్తోంది. ఒకరు బాధపడితే ఒకటీ మనం అయితే ఒకటీనా తండ్రీ! కానీ నాకు యిబ్బంది అయితే అయింది. నీకు అభ్యంతరం లేకపోతే యీ యిల్లు నేనే కొనుక్కుంటాను.'

సాంబయ్యకి ఏదో అనుమానం పుట్టుకొచ్చింది.

'నీ అనుమానం నేనెరుగుదును నాయనా! మంత్రవిద్యలు ఎరిగినవాళ్ళం. శాస్త్రాలు తిరగేసినవాళ్ళం ... ఈ క్షుద్రశక్తులు మమ్మల్నేం చెయ్యగలవు!'

సాంబయ్యకు కొత్త సత్యమేదో తెలిసినట్టయింది. పరాంకుశంగారింట్లో అతనూ పెళ్ళామూ తల్లీ వెధవప్పగారూ కాక యింకా అయిదుగురు పిల్లలున్నారు. ఇంట్లో యింతమందిలో ఏ ఒక్కర్నీ యీ యింట్లో ఉన్న పిశాచం యేం చెయ్యదా? అందరికీ శాస్త్రజ్ఞానం ఉన్నదా! తన జ్ఞానోదయం ఏమాత్రం బయటపెట్టకుండా,

'బాబూ అంతకంటె కావలసిందేముంది? తమరే ఏదో రేటు ...'

'ఇన్ని మాటలు నాదగ్గిర ఉండవు నాయనా! రెండువేలు యిస్తాను ... కాళ్ళదన్నుకోకు ... దెయ్యాలకొంప ... నువ్వు ఉత్తినే యిచ్చినా ఎవడూ పుచ్చుకోడు--ఆలోచించుకుని రేపు సాయంకాలంలోగా కబురు చెయ్యి వస్తాను మరి ... అక్కడ భక్తుల్తో యిల్లు నిండిపోయి ఉంటుంది.'

పరాంకుశం వెళ్ళిపోయాడు. ఆ మాటలతో సాంబయ్యకి యింకేమైనా సందేహాలుంటే అన్నీ పటాపంచలయి పోయాయి. పదేళ్ళకిందట ఏడువేలకి ఆ యిల్లు కొన్నాడు తను. మూడువేలు ఖర్చుపెట్టి డాబా. మేడమీద గదీ వేయించాడు. ఇంతకంటె చిన్నది, వెనక పెరడూ పైన డాబా లేనిది, సరిగ్గా దీనికి ఎదురుగా ఉన్న యిల్లు మొన్న మొన్ననే యిరవై వేలకి బతిమాలి కొనుక్కుపోయారు! తన యిల్లు రెండు, రెండంటే రెండువేలా! 'ఈ ఇరవైయో శతాబ్దంలో కూడా నీకింత పలుకుబడి ఉందా దెయ్యమా! నీ ఖరీదు మరీ అంత హెచ్చా!' అని ఈ చీకట్లో ఆ డాబామీద కూచుని పకపక నవ్వుకోబోయిన సాంబయ్య గజగజ వణికిపోయాడు. ఎవరో జుత్తు విరబోసుకున్న ఎర్రకళ్ళ తెల్లచీర ఆడమనిషి మెట్లెక్కి తన దగ్గిరకు వస్తోంది! అతని భయాన్ని చూసి పున్నమ్మ పకపక నవ్వుతూ, తానెవరో చెప్పుకుని 'సూశావా బాబూ! ఏటో పెద్ద కపుర్లు సెప్పినోవు. నువ్వీయిల్లు తెగించి వొవడికయినా అద్దెకియ్యి, లేదా అమ్మిచూడు, ఆర్నెల్లు దాటకుండా ఆ కుటమానం కుటమానం బుగ్గి అయిపోకపోతే సూడు. ఆడినలా సేస్తే పిల్లలోడివి నీ సంసారం లెగుస్తదా? దిక్కు నేలోల్లం కాబట్టి మానాంటి పేదోలం బితుకూ బితుకూమంటూ యీ సుట్టు పక్కల ఆ గొడ్లతో కలసిపోయి యీడుసు కొత్తన్నాం ....'

తనకంటికి ఆ రాత్రి పక్కింటి కోడలు దెయ్యం ఎలా కనబడిందో అంతా మరోసారి కళ్ళకు కట్టినట్టు వర్ణించి మరీ వెళ్ళింది పున్నమ్మ.

పరాంకుశం యింట్రస్టు తెలుస్తూనే ఉంది. ఇంతలా ఆపేక్ష చూపించి హెచ్చరిస్తోందే యిందులో పున్నమ్మ పాత్ర ఏమై ఉంటుంది? వరసగా రెండ్రోజులు తనయింటివైపు చాటుగా చూసిరండని కొడుకుల్ని పంపిన తరువాత మరొకసారి సాంబయ్యకి కళ్ళు విడ్డాయి. పెరటివైపు తలుపు ఎప్పుడో విరిచేశారు. పున్నమ్మ పశువులు స్వేచ్ఛగా తన పెరట్లో తిరుగుతున్నాయి. వీధివైపు తాళం వేసినతలుపుకి ఒక చెక్క ఊడదీసి ఉండడం ఇదివరకే చూశాడు తను. అందులోంచి పున్నమ్మ మనుషులు లోపలికి దూరి మెట్లెక్కి డాబాఎక్కి బట్టలు ఆరేసుకుంటున్నారు. ఇంటికి కావలిసిన నీళ్ళన్నీ పున్నమ్మ మేనగోడలు తన నూతినుంచే సప్లయి చేస్తోంది. తన నీధి అరుగుమీదే పున్నమ్మ మనవలు నుప్పొద్దులా దినం తీర్చుకుంటున్నారు.

ఇంతమందిలో ఏ ఒక్కర్నీ కామినీ పిశాచం ఏమీ చెయ్యదా?! వెంటనే ఒక నిర్ణయానికి వచ్చి, సాంబయ్య మొహం ఇన్నాళ్ళకు మళ్ళీ వెలిగింది.

సాంబయ్య పెట్టిన గడువులోగా పరాంకుశానికి యింటిమాట కబురు చెయ్యలేదు సరిగదా అక్కణ్నుంచి కబురొస్తే కసిరి పంపించేశాడు. శివరాత్రి అమావాస్య తెల్లవారే సరికల్లా తన ముగ్గురి కొడుకులతో అద్దెయిల్లు ఖాళీ చేసి స్వంత యింట్లో వచ్చి దిగిపోయాడు. పని కుర్రాణ్ణి మాత్రం ఎంత బతిమాలినా దెయ్యానికి జడిసి రాను పొమ్మన్నాడు.

ఆ రోజు రాత్రి ఒంటిగంటా రెండు గంటలమధ్య, కన్ను పొడుచుకున్నా కనబడని కాటుక చీకటి. ఆ వీధి చివరికి ఎలక్ట్రిక్‌పోల్ ఒకటి లేకపోలేదు గాని దానికున్న బల్బు - పోయిన గాలివానలకి ఆ తీగెలు ఏం దెబ్బతిన్నాయో ఏమో మరి, వెలుగుతూ ఆరుతూ ఊగుతూ ఉంటుంది.

పున్నమ్మ 'మాయలమారి' సినిమా రెండోఆట చూసివస్తోంది. 'ఎదవలు ... కూకుని బొక్కమంటే అందరూ సిద్ధమే యిల్లు సూడమంటే అందరూ ఆ అరికతకి అగోరించారు గావాల.'

పున్నమ్మ దూరంనుంచే పేరుపేరున పిలిచింది. పాకనుంచి ఎటువంటి జవాబూ రాలేదు.

'గొడ్లు ఏటయిపోనాయో యేటో ...' అని ఆ దీపం వెలుగులో ఒక్కసారి చూసింది పున్నమ్మ. పక్కింటి పెరటి గుమ్మం కనిపించింది. 'ఎర్రిబామ్మడు .... ఈ పున్నమ్మ తడాకా ఎరగడు గావాల్న ...' పున్నమ్మమాట ఆమెలోనే ఉండిపోయింది...గలగల పట్టీల చప్పుడు ... ఆమె గుండె కొట్టుకుంది... అదే ... అదే ... పక్కింటికోడలు తనింటికి పాలకొచ్చేది. అదే పాదాల పట్టీల చప్పుడు. మళ్ళీ మళ్ళీ వినబడింది. పున్నమ్మ రెండడుగులు వెనక్కు వేసింది, నాలిక పిడారిపోగా అటే చూస్తూ! పెరటి గుమ్మంలోంచి తెల్లని ఆకారం ... ఇటే వస్తోంది ... మొహమంతా పసుపు ... పెద్దబొట్టు ... తెల్లచీర ... విరబోసుకున్న జుత్తు ... అరుద్దామనుకున్నా పున్నమ్మ నోట మాట పెగల్లేదు. గల గల నడుస్తూ తన పాకలోకి, తన పాకలోకే వెళ్ళిపోయింది! గేదెలన్నీ దీనంగా అరిచాయి. గేదెలరాణి పున్నమ్మ ఘోరంగా అరిచి, తెలివి తప్పి పడిపోయింది!

నలుగురూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని అక్కడ చేరేలోగా పాక అవతలివైపునుంచి ఆ దెయ్యం పరిగెత్తి గబగబా పెరటి గుమ్మంలోంచి సాంబయ్య యింట్లోదూరి, వేషమూ, విగ్గూ, పట్టీలూ గబగబా విప్పేసి 'నాన్నా యీ మూట వేరేపెట్టు ... రేపు నాటకం కంపెనీవాళ్ళ కిచ్చేద్దాం' అని

రెండోకొడుకు రూపంలో సిద్ధమయింది!

మర్నాడు మధ్యాహ్నం పన్నెండు గంటలయినా పున్నమ్మ తన పాకలోకి వెళ్ళడానికి సాహసించలేదు! జ్వరం తగ్గేవరకూ చిట్టెమ్మ పిన్ని గుమ్మం దిగలేదు! ఆమే, ఆమె పటాలమూ, ఆమె పశు సమూహమూ మళ్ళీ ఆ వీధి మొహం చూడలేదు! మరో రెండునెలలకి పున్నమ్మ పాక పక్కని మరో పెణక దింపుకుని, ముందు జాగా చుట్టూ దడి కట్టుకుని, సాంబయ్యా పిల్లలూ క్రమంగా అక్కడికి చేరుకున్నారు! ఇల్లు బాగు చేయించుకుని యీ మధ్యనే ఎవరికో డెబ్భై అయిదుకి అద్దెకిచ్చారు కూడా.

*(యువ మాస పత్రిక)*

దెయ్యం చల్లగా ఉండాలి గానీ...



# ఆట

25



**ఎలాగా** ఆఫీసుకి శలవు పెట్టేను కదా అని ఆ రోజు కాస్త తీరికగా భోంచేసి మరోగంట ఎక్కువగా నిద్రపోయి గోపాలరత్నం కళ్ళు తెరచి చూసేసరికి అలమార పై సొరుగులో అతని కెదురుగుండా కనిపించింది డే కేలండరు. మార్చబడుతున్న ఆట్టముక్కలకీ, గడుస్తున్న తన రోజులకీ ఆట్టే తేడా కనపడలేదతనికి. తన ఒంటిమీది గుడ్డల్లా నలిగిపోయి ఉన్నాయి అవి. అయినా తనలాంటి వాళ్ళకి అందులో మొదటి పది తేదీలూ కనుచూపు మేరలో గిర్రున తిరిగిపోతాయి. ఇక ఆఖరి పదీ ఒక్కొక్క తేదీ ఒక్కొక్క ఆజన్మాంత ఖైదీ.

కాదు, కాదు ఆ జూన్ పదహారు అన్ని తేదీలలాంటిది కానేకాదు. తను పాతిక రూపాయలు అప్పుచేసి తోటి గుమాస్తాగాళ్ళ నలుగురి నోళ్ళూ తీపిచేసిన రోజది. తన తొలిసంతానం చిట్టి పుట్టినరోజది. మళ్ళీ గిర్రున ఏడాది తిరిగే సరికల్లా దాని ఏడాది పుట్టినరోజు తన యింట్లో ఎలా చేసుకున్నారో తనకింకా గుర్తుంది.

చిట్టికి తెచ్చిన కొత్త గౌను చవక అవనీ అదికట్టుకున్న చిట్టి నవ్వింది మరి! తను తెచ్చిన

జిలేబీ నూనెతో చేసిందే అవనీ, అందరూ ఓ చోట కూచుని కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు మరి! ఆ రోజు తన కుంటుబం బెంచీ టెక్కెట్టుకే సినిమాకి వెళ్ళనీ, అప్పటికే కళ్ల మసకలు ప్రారంభమైన అమ్మమ్మ కూడా సినిమాకి వచ్చింది మరి!

అదే అదొక్కటే అప్పటికీ ఇప్పటికీ తాము జరుపుకున్న పుట్టినరోజు! మొదటి పంట కనుక ఆ మాత్రం వేడుక కయినా నోచుకుందేమో! నిజమేమరి.

మొదటి సంతానం మొట్టమొదటి ఏడుపయినా ఎలకోయిల స్వరమాలిక.

రెండోది పక్కింట్లో సంగీత సాధనం.

మూడోది బొక్కి పాప నోటి కొబ్బరాకు బూరా.

నాలుగోది నూనె చాలకపోయినా నడవక తప్పని సంసార చక్రాల బ్రతుకు పాట.

అయిదోది అప్పుడే మెయిలు ఆగిన రైల్వేస్టేషను.

ఆరో శబ్దం వినపడకుండా గోపాలరత్నమయితే జాగ్రత్తపడలేదు గాని, ఆ పురిట్లో వాళ్ళావిడే జాగ్రత్తపడింది. ఆపరేషను చేయించుకుందని కాదు, ఇక జన్మలో మరచిపోలేని శస్త్రచికిత్స తనకే చేసింది!

"ఎప్పటికప్పుడు ఎంత శతపోరినా మీరు ఆపరేషను చేయించుకున్నారు కారు. నాకూ చేయించారు కారు. చాలీచాలని సంపాదనగల సంసారంలో పిల్లలకి జవాబు చెప్పుకోలేక తల్లిప్రాణం యెలా తల్లడిల్లిపోతుందో తండ్రి ప్రాణానికి కూడా కాస్త రుచి చూపించడానికి ఆడది మొగాడికి ఇంతకంటె పెద్దశిక్ష వెయ్యలేదు" అనుకుందేమో! తన నోటితో మాత్రం అనలేదు.

ఆరో పిల్ల పుట్టడమయితే పుట్టింది. గాని, ఏడవడం యిష్టంలేక కాబోలు బతకలేదు. అంత సుళువైన మార్గం చూపించిన చంటిదాన్ని వదిలిపెట్టడం యిష్టంలేక కాబోలు, తల్లికూడా అటే దారి తీసింది!

"ఇలాంటివి ఇంకా ఇంకా చూడ్డానికే కాబోలు, అందరి ఆయుస్సూ పోశాడు. భగవంతుడు నాకు" అని అమ్మమ్మ గొల్లుమంది. ఆవిడ మాట కాదనడానికి వీల్లేక కాబోలు ఎనిమిదేళ్ల బతికి --సరిగ్గా జూన్ పదహారునే -- చిట్టి, నాలుగునెలల క్రిందట అమ్మా చంటిదీ ఎక్కడికి వెళ్ళారో నాలుగుదిక్కులూ చూసిరాడానికి కాబోలు, బయలుదేరి వెళ్లిపోయింది.

చిట్టి పోయినప్పుడుకూడా తను పాతిక రూపాయిలు ఖర్చుచేసి ఇరుగుపొరుగుల నోరు మూయించవలసి వచ్చింది.

ఆ తారీఖు చూస్తూంటే ఏడుపో నవ్వో తెలియనిదొకటి వచ్చింది గోపాలరత్నం కంటి చివరికి వేడినీటి చుక్క రూపంలో.

దిక్కుమాలినవాళ్ళ బతుకుల్లో పుట్టిన రోజుకీ, చచ్చినరోజుకీ పెద్ద ఏమంత తేడా ఉంటుంది గనక! అమ్మమ్మ అనేక రకాలు చూసినది. కడుపులో కాళ్లుపెట్టుకు పడుకోగలదు. ఇరవై ఏడేళ్ల పెళ్లికాని తన చెల్లెలు ఇంగితం ఎరిగినది కన్నీరు పైకి చిమ్మకుండా కాలక్షేపం చెయ్యగలదు. ముప్ఫై ఏళ్లు రాకుండానే మోస్తున్న భారంతో జవజీవాలు చచ్చినది, తన మనసు ఏది ఏమైనా లెక్కచెయ్యకుండా ఈడ్చుకు రాగలదు. కాని ఎదుగుతున్న నలుగురు పిల్లలు! తెల్లవారి, పీకలమొయ్యా అన్నంపెట్టి సంపిస్తే మళ్ళీ పదీ అవకుండా కడుపులు మోకాళ్ళ దగ్గిరకి వేళ్ళాడేసుకు

తయారు! దీపావళమావాసకి చొక్కా కుట్టిస్తే సంక్రాంతినాటికి మెడ పట్టదు, చేతులు ఎక్కవు!

ఎలా వీళ్ళతో! ఆ రోజు ఎలా గడపడమా అనేదే వీళ్ళతో సమస్యగాని, వీళ్లెప్పుడు పుట్టేరో ఎవడికి జ్ఞాపకం?

పక్కింటి గడియారం కొట్టిన రెండు గంటలు చెవిలో పడగానే గోపాలరత్నం ఆలోచనలు పక్కదారి నుండి మళ్లీ అవసరమైన దారిలోపడ్డాయి. అతని గుండెవేగం మరింత హెచ్చింది. అవును. ఆ పదహారో తారీఖు వాళ్ళ ఆఫీసరు అది నారాయణగారి పుట్టినరోజు! గుమాస్తాలనే కీలుబొమ్మలను ఆడించే ఆధారాలు ఆయన చేతిలోనే ఉంటాయి. పిచ్చి ప్రజని మరింత వెర్రివెధవల్ని చేసి నాటకమాడే నాయక శిఖామణుల్లో మొదటిస్థానం దేవుళ్ళది. రెండోది మనమే ఎన్నుకుని మనలో మనమే తన్నుకుని చచ్చేలా చేయగల నేర్పుగల పాలక వర్గానిది. మూడోది వివిధ కీలకస్థానాలలో ప్రభుత్వం చేతిలో పావుల్లా నియమింపబడి శక్తిహీనవర్గాలను శక్తికొలదీ దోచుకుతినే ఆఫీసరు మహాశయులది. మూడేళ్ళ క్రిందటే రిటైరు అయిపోతారనుకున్న ఆదినారాయణగారు ప్రత్యేక ప్రతిభాశాలిగా గుర్తించబడి ఏభై ఎనిమిదో పుట్టినరోజు యధాపిధిగా జరుపుకుంటున్నాడు! ఇంట్లో ఆ రోజు తిన్నా పడుకున్నా ఆఫీసులోని అందరు స్టాపు మెంబర్సూ తగు రీతిని ముడుపు సమర్పించుకుని వారి అనుగ్రహానికి పాత్రులవుతే తప్ప వారికి భవిష్యత్తు అంటూ ఉండదు. మనసు కలసినచోట ఎలాంటి బహుమతి యిచ్చినా, అసలు మనసంటూ ఉంటే, యివ్వకపోయినా ఫరావాలేదు. రాజకీయ ప్రాతిపదికతో, వ్యవహారజ్ఞానంతో, లౌకిక కుశలతతో ఇచ్చే బహుమతులకు విలువ ఉండకపోవచ్చు గాని ధర అంటూ ఉంటుంది. పెట్టుబడి ఉంటే గాని వ్యాపారం జరగదు. రోజువిడిచి రోజు తప్ప పొయ్యిలో పిల్లి లేవని గుమాస్తాగాళ్ళకి నాలుగువేళ్ళూ నోట్లోకి వెళ్ళే అవకాశమే ఉండదు. ఇకపై అధికారికి బహుమతులు ఎలా?

అమ్మమ్మ దగ్గ సంగతేమిటో ఓసారి విశాఖపట్నం వెళ్ళి తేల్చుకురావాలని గోపాలరత్నం పదేళ్లనుంచి ప్రయత్నిస్తున్నాడు. నల్లగావున్నా, పొట్టిగావున్నా ఆడదంటే కాదనరు గనక చెల్లెలు తిలకానికి ఎవడో ఒకడు మొగాడయితే చాలు. ఎంతో అంత ఇచ్చి కట్టబెట్టిద్దామని ఆమెకు ఇరవై వెళ్ళిన మరుక్షణం నుంచీ గోపాలరత్నం కలలు కంటున్నాడు. మూడు చిరుగులూ ఆరు మాసికలుగా ఉన్న తన పిల్లలు నలుగుర్నీ -- తను చచ్చేలోగా ఒక్కరోజంటే ఒక్కరోజయినా కాస్త మంచిబట్టలతో కళ్ళ చూడాలని గోపాలరత్నం ఏళ్ళతరబడి ఆశపడుతున్నాడు. ఇవేవీ జరగలేదు సరిగదా -- తన కళ్ళజోడు మార్పించడం జరగలేదు. తన సైకిలుకి కొత్తటైర్లు వేయించుకోడం కుదరలేదు. నిముషానికి పదిసార్లు కక్కే తన పెన్ను పాళీ మార్పించుకోడం సహా అవలేదు!

కాని .... యీ ఎనిమిదేళ్ళ సర్వీసులో ఓసారి ఈగిల్ ఫ్లాస్కూ. మరోసారి పైలట్ పెన్నూ. ఇంకోసారి దంతపు గుండీల సెట్టూ .... ఇంకా ఏవేం ఇచ్చాడో సరిగ్గా జ్ఞాపకంలేదు గాని .... ఎటా ఈ అబ్దికాన్ని యధావిధిగా పెట్టలేక పాత్తర్ల రూపంలో -- పితృదేవతల పేరు చెప్పి భూ భూతాలచేతికి స్వయంపాకం నిమిత్తం ఇంతని దర్శించుకున్న పద్ధతిని .... కొందరు బుద్ధిమంతులైన స్టాపు మెంబర్సు కనిపెట్టేరు. కొంత తర్జనభర్జనలు జరిగిన మీదట జాన్‌నెల జీతంలో రెండున్నర శాతం ప్రతివాడూ శ్రీవారికి ఏకమొత్తంగా పోగుచేసి ఏదో ఓ వెండికంచమని గాని, స్టెయిన్‌లెస్ స్టీల్ కేరేజి అనిగాని ఇలా ఏదో ఒక వస్తురూపేణా బహూకరించేలా నిర్ణయం తీసుకున్నారు. గత మూడేళ్ళ బట్టీ అదే

అమలులోకి వస్తోంది .... ఆ రోజు సాయంత్రం అందరూ ఆ సీనియర్ ఆఫీసర్ శిఖామణిని దర్శించుకుంటారు.

....ఏదో భగవంతుడు మాకింత తిండికీ గుడ్డకీ లోపం లేకుండా ఇచ్చాడు కాబట్టి, దానికి మూలకారకులయిన తమ లాంటి ప్రభువులు పదికాలాలపాటు చల్లగా ఉండాలని -- తమ కిలాంటివి ఇష్టంలేదని తెలిసినా .... ఈ శుభదినాన మరో ఇన్ని శుభదినాలు తమరా శ్రీరామచంద్రమూర్తి కటాక్షంవల్ల అయురారోగ్యాలతో తులతూగాలని కోరుతూ .... కొండంత దేవుడికి కొండంత పత్రి ఇవ్వలేం గదా అని సరిపెట్టుకుంటూ .....

సహజత్వానికి సరిహద్దు లుంటాయి గాని నటనకీ నాన్చడానికీ అవధులంటూ ఉండవుగదా అందుకే ఆశ్రితుల వాక్యాలు పూర్తికావడం అంటూ ఉండదు దానికి తగ్గటుగానే నటకుల చక్రవర్తులుంగారు అందుకుంటారు.

"మన రామ రాజ్యంలో అసంతృప్తికి చోటు లేదని వేరే మీరందరూ రుజువు చెయ్యాలా, కళకళలాడుతున్న మీ ముఖ కమలాలు చూస్తే తెలియడం లేదూ? నా జబు జిల్లాకంతటికీ పెద్దదయినా చేతిడబ్బుతో టిక్కెట్టు కొనుక్కుంటేగాని సినిమా హాల్లో కూచోను. పెర్మిట్స్ అనీ, టెండర్స్ అనీ, కంట్రాక్ట్స్ అనీ, రికమెండేషన్సు అనీ అటు వాచీముల్లు ఇటు తిరిగేలోగా ఏరోప్లేను ఎరగా పెట్టినా ఎర్రేగాణీ పుర్రచేత్తో ముట్టుకుని ఎరగను. ఏడావారాల నగలకి ఇసుమంత లొంగని కృష్ణమూర్తి సహా తులసీ దళానికి తూగి ఊరుకున్నాడు. అష్ట అయిశ్వర్యాలనీ కాదనగలం గాని అభిమానాలకీ భక్తికీ అవుననక తప్పదు. ఇంత మంది ప్రేమానురాగాన్ని గాయపరచే కఠిన హృదయం నాకు లేదు..... మనసెంత చెబుతున్నా నా చేతులు ముందుకు రావడం లేదు..... మీరెం తెచ్చారో మీ చేతుల్తో మీరే ఆ టేబిల్‌మీద పెట్టి వెళ్ళండి....."

అదీ అలాగే అంతూ పొంతూ లేకుండా సాగుతుంది. ఆదినారాయణగారు అరుగు మీద నిలబడతారు. అసలు అంత మంది కూర్చోడానికి అక్కడో చాప అయినా వేసి ఉండదు. ఇంటి ముందు ఖాళీజాగాలో మట్టిలో చేతులు కట్టుకు నిలబడి. ఏ పి.యే గారో ఎవరో మాట్లాడుతూ ఉండగా అందరూ "రెండూ నిమషాలపాటు మౌనంగా ప్రార్థిస్తారు." ఏదో ఉడతా భక్తిగా, వారు తెచ్చిన నాలుగొందల ఖరీదుకు తక్కువగాని "చంద్రుడికో నూలు పోగు" ని అక్కడ ఉంచుతారు. ఆఫీసరు గారు వచ్చిన వాళ్ళకి మంచినీళ్ళయినా ఇవ్వరు. అలా ఇవ్వలేదని ఏ ఒక్కరూ పైకి అనుకోరు. ఒక వేళ పొరపాటున ఇంటి దగ్గిర అలా అన్నా యాచక పితామహులని పేరు గాంచిన వారి పెద్దలు వాళ్ళవాళ్ల నోళ్లు నొక్కుతారు. అందుకని అక్కణ్ణుంచే అందరూ శలవు తీసుకుంటారు. ఇంత జరిగినా అక్షరంముక్క అఫీషియల్‌గా రికార్డు కాకుండా చూసుకోడంలో ఆఫీసరు కంటె అసిస్టెంట్లు పడ్డ తాపత్రాయమూ, శ్రమా ఎక్కువ!

మంచి వార్త తెచ్చిన టెలిగ్రాము బంట్రోతు చేతిలో పెట్టింది బక్షీసు అంటాము. మనల్ని ఎప్పుడయినా ఓ కంట చూడకపోతాడా అనే ఆశతో ఆఫీసరు కిచ్చింది బహుమతి అంటున్నాము. పోస్టలు ప్యూన్‌కీ, డిస్ట్రిక్ట్ ఆఫీసరుకీ వారి వారి విధుల్ని సక్రమంగా నిర్వర్తించడానికి ప్రభుత్వం నెలజీతాలు ఏర్పాటుచేసింది. జీతాల మొత్తంలో తేడా తప్పితే ఈ యిద్దరు గవర్నమెంటు సర్వెంట్సుకీ మనం ముట్టచెప్పే కానుకలకి వేరు వేరు పేర్లుకూడా ఎందుకు? శలవు పెట్టుకుని ఆ జూన్ పదహారున

యింట్లో కూచున్న గోపాలరత్నానికి తనకి తనే యెంతో ద్రోహం చేసుకుంటున్నాననే భావం నిలువెల్లా క్రుంగదీయసాగింది. ఎక్కడెక్కడి ఊహాలూ అతని దిగుల్ని మరింత ద్విగుణీకృతం చేశాయి.

కాలేజీలో చేరడానికి సీట్లు అమ్ముతున్నారు. పరీక్షలు ప్యాసవడానికి మార్కులు అమ్ముతున్నారు. డిగ్రీలు వచ్చేక ఉద్యోగాలు అమ్ముతున్నారు. ఉద్యోగాల దొరికేక ప్రమోషన్లు అమ్ముతున్నారు. అంతా ప్రతి ఒక్కరికీ తెలిసిన వ్యవహారం. బేరం. లాభనష్టాలు. అంతే. కొనగలవాడే మేల్కొనగలవాడుగా చెలామణి అవుతున్నాడు. లేనివాడు బతకలేని వాడుగానే మిగిలిపోతున్నాడు. పేర్లు తేడా గాని దోపిడీ విధానం లేని చోటులేదు. పత్రికాధిపతులు పాఠకుల "కాలక్షేప సూత్రాన్ని' ' ఎక్స్ప్లాయిట్ చేస్తున్నారు. సినీ నిర్మాతలు ప్రేక్షకుల నీచాభిరుచుల్ని రెచ్చగొట్టి కొల్లగొడుతున్నారు. మంత్రులు ప్రజల అజ్ఞానం మీద పడి బతుకుతున్నారు. ఎక్కువ తక్కువల్లో ఎవరు చేసినా వ్యాపారం వ్యాపారమే, వ్యభిచారం వ్యభిచారమే?

తన చింకిబట్టలూ, అవయవలోపాలూ చూపించి మీ ఇంటికి వచ్చి చెయ్యిజాపి అడిగిన ముష్టివాడికి మీరిచ్చిన అయిదు పైసల నాణేన్ని ధర్మం అంటున్నారు. తన ఆస్తిపాస్తులూ, తెచ్చుకున్న డిగ్రీలు చూపించి, మీయింటికి మరొకర్ని పంపి అడిగించిన వరుడికి మీరిచ్చిన అయిదువేల రొక్కాన్ని కట్నం అని పిలుస్తున్నారు. తేడా ఉందంటారా? ఉందని మీరు అన్నారో పప్పులో కాలేసినట్టే, , లేనివాడికి మొండిచెయ్యి చూపుతున్నారు,దోపిడిదారుకి పచ్చజెండా ఊపుతున్నారు, ఇంతటి సాంఘిక దురన్యాయంలో మీరు కూడా ముఖ్యమైన భాగస్వాములు కారా?

గోపాలరత్నం మనసుని అంతలా నిలదియ్యడానికి అంతకు ముందురోజు జరిగిన ముఖ్యమైన సంఘటనే కారణం. తన ఇంటికిటికితలుపు తీసి చూస్తే దూరంగా రెండురోడ్ల అవతల, చింతచెట్టు నీడన, గోనెపట్టామీద వేరుశెనక్కాయలు పొగులుపెట్టి అమ్ముకునే తాత కనిపించేవాడు. అతను మరి కనిపించడు, ముందురోజురాత్రే చచ్చిపోయాట్ట. అతనికెవరూలేరు. అక్కడమేడమీద మెస్‌లో చదువుకుంటున్న కుర్రాళ్ళే అదని దహన సంస్కారం నిర్వహించారు. ఇంటింటికి వచ్చి చందాలుపోగుచేశారు. గోపాలరత్నం ఏమీ ఇవ్వలేకపోయాడు. ఆదినారాయణగారికని వేరే ఉంచినసొమ్ము అలా ఉంచడాని కే తనకి చాలా కష్టమైపోయింది. అదీ అలా హెడ్ గుమస్తా చేతిలో అలాపెట్టి వంపేసిన అరగంటకి ఇలా యీకుర్రాళ్ళు వచ్చారు. వాళ్ళని ఉత్తిచేతులతోనేపంపవలసి వచ్చింది, నా అన్నవాడులేని ఒక దరిద్రుడికి చచ్చినరోజుకి తన చేత్తో తనో రూపాయి చందా ఇవ్వలేకపోయాడు. వేలకి పైగా నెలజీతంగల ఒక భాగ్యశాలి పుట్టినరోజుకి తన చందా ముంధుగానే కట్టేశాడు చేతగాని తనంతో పిరికివాడి కోపంతో "ఏమైతే అవనీ....ఇంతోటి ఉద్యోగం పోయి నాలుగువీధులు అడుక్కు తిననీ....... ఇవాళ మాత్రంనేను ఆదినారాయణగారి బసకు మాత్రం వెళ్ళనుగాక వెళ్ళను'' అని తీర్మానించుకున్నాడు.

ఆ బక్క పేగుల మనిషికి ఆ మాత్రంశాంతి అయినా కలక్కుండా మరోప్రశ్న అతనిలోంచేఅతన్ని నిలదాసింది. "ఆఫీసరుగారి జన్మదినాన గైరుహాజరు కాగల ధైర్యమేఉంటే ఆ పనేదో సాహసంతో చేసెయ్యక జ్వరంగా ఉందని లీవుపెట్టి కప్పదాటు వెయ్యడమెందుకు గోపాలరత్నం?

దానివి జవాబు చెప్పుకోలేని తికమకలో ఉండగానే "అన్నయ్యా, కాఫీ'' అంటూతిలకం తనని ఈ ప్రపంచంలోకి తెచ్చింది. ఆ కాఫీ గ్లాసుఇలా అందుకున్నాడో లేదో తోటి గుమాస్తా

విశ్వంవచ్చాడు, తను మంచం మీద కూచుని స్టూలుబల్ల అతనికి వేసి హేండిల్ విరిగిపోయిన కప్పులో కాఫీ సగానికి పోసి అతని చేతికి చ్చేడు.

"ఇంకా మూడయినా కొట్టినట్టులేదు, ఇవాళ అప్పుడే బయల్దేరు తున్నారాఏమిటి? నావంట్లో ఏం బాగో లేదోయ్.... మరోలా అనుకోవద్దని ఏదో సంధ్బంలో నారాయణగారికి నా క్షమాపణ చెప్పెయ్యి'' అన్నాడు గోపాలరత్నం కాఫీతాగినంత గబగబా. విశ్వం అందుకున్నాడు.

"అయ్యోరామా, ఏ లోకంలో విహరిస్తున్నావు రత్నం నువ్వు? ఈ ఏడాది అలాంటివేం పుచ్చుకోనని ఆ రావణబ్రహ్మ ఎప్పుడో చెప్పేశాడే,''

ఆఫీసరుగార్ని గోపాలరత్నం ఒక్కడే పేరుతో వ్యవహరించేది.

"అదేమిటి? నిన్నటికి నిన్న మన ఏడుకొండలు నా వాటా వసూలుచేసుకువెళ్లేడే'

విశ్వం పకపక నవ్వి అన్నాడు.

"బాగుంది బాగుంది, నీకు వేశాడు?టైపిస్టు దామోదరం దగ్గరికూడ ఇలాగే పుచ్చుకున్నాట్ట..... దేవుణ్ణి మించిన కేపిటలిస్టు లేనప్పుడుపూజారిని మించిన దోపిడీదారుడు ఉండడు. అప్పుకింద జమకట్టుకోండి. రుణాన్నిపడివుండి ఏ వచ్చే జన్మలోనో తీర్చుకోకపోడు, దు:ఖపడకండి, సరే, ఇంతకీ నీ ఒంట్లో ఎలా ఉంది''.

"ఇప్పుడు జ్వరం పూర్తిగా తగ్గిపోయిందిలే! దానికేంగాని నారాయణగారు ఉన్నట్టుండి పుట్టినరోజుకానుకల్ని ఎందుకు రద్దుచేసినట్టు? పైకి ఏదైనా కాగితం వెళ్ళిందా యేం?''

పైకి కాగితం పెట్టుకున్న సుబ్బారాయుణ్ణి పైకి పంపించే ప్రయత్నం మాత్రం ఆ మధ్య దిగ్విజయంగా నిర్వహ్రించబడిందిగా ! మనిషి రక్తం మరిగిన పులికంటే క్రూరమయింది రూపాయి రుచి. దాన్ని అడ్డుకోవడానికి ఎన్ని శక్తులుండాలి

ఆమాట కెందుకో గజగజ వణికిపోయాడు గోపాలరత్నం ఎలాగో నిలదీసుకు నీరసంగా మరోప్రశ్న అడిగేడు.

"అయితే? ఈ ఏడాది చివరికి ఎలాగా రిటైరు అయిపోతాడనా?'

"రిటైరు అవకూడదనే అనుకుంటాను. అటు అధికారుల్ని కాకా పట్టడంతోపాటు ఇటు అనుయాయుల్ని కూడా అన్ని విధాలా మంచి చేసుకుంటే షష్టిపూర్తిదాకా దేకవచ్చును గదా! ఏమో దైవలీలలు ఎవరికెరుక? నిజమో అబద్దమో గాని నేనింకో మాట విన్నాను.''

"ఏమిటది?''

"ఏం లేదు. ఈ సారి ఎలక్షన్లలో మన కీచక సామ్రాట్ తోడల్లుడు కూడా తొడకొడుతున్నాడని ఒక పుకారు. మన స్టాపు అందరి ఓట్లూ వాడికే వేయిద్దామనే ఎత్తుకి అది తొలిమెట్టు కావొచ్చు. అంచేత, బ్రదర్, మనం ఇప్పుడు ఇచ్చే స్థితిలో లేం. పుచ్చుకునే స్థితిలో ఉన్నాం. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టడం మంచిది. వస్తా.....''

విశ్వం వెళ్ళిపోయాడు. అల్లాడిపోతున్న గోపాలరత్నం అంతరంగాన్ని మరింత అట్టడుగున, అయోమయస్థితిలో పడేసి మరీ వెళ్ళిపోయాడు. ఎంత కాదనుకున్నా ఆదినారాయణగారు తనకి తనకి ఉద్యోగం ఇచ్చిన ఆఫీసరు, తనకి నెలజీతం ఇప్పించగల అధికారి 'ఇరుగు పొరుగిండ్లకైనను.....' అనే పద్యంలో కుమారీ శతక కర్త శలవిచ్చినట్టు కులకాంతకి కడుపుబ్బినా సరే వరుడో కాకత్తగారో

వదినయొ బావో...... 'ఆఖరి ఉయ్యాలలో ఊగుతున్న ఎనిమిది నెలల మరిది వెధవయినా సరే ఎవరో ఒకరి పర్మిషన్ తీసుకోనిదే గుమ్మం దిగడానికి వీల్లేదుట! ఇంచుమించు అలాంటి సంప్రదాయం అనుసరిస్తున్నవాడే గోపాలరత్నం కూడాను. అప్పుడప్పుడు మనసు విప్లవశంఖం పూరించి ఓ ఊపు ఊపి వదిలిపెడుతూన్నా, యజమాని అన్నవాడికి అపచారం. తలపెట్టడానికి అతని మనసు అంగీకరించడం లేదు. మంచో చెడ్డో వెళ్ళేది వెళ్ళనియ్యకుండా యజమాని ప్లేటు ఫిరాయించాడనే వార్త గోపాలరత్నం మృదువైన మనస్సుని మరింతగా కలచిపారేసింది.

సరిగ్గా ఆ సమయానికి ఆ యింటి ముందు కారాగింది.

కారు దిగి తన యింట్లోకి వస్తున్నది ఆదినారాయణగారు!

"ద.... ద..... దయచేయండి" అంటూ నమస్కరించడం కూడా మరచిపోయి ఆహ్వానిస్తూ ఖరీదైన ఉలెన్ సూట్‌లో ఉన్న ఆయన్ని ఎక్కడ కూర్చోపెట్టడమో తెలియక కిందా మీదా అయిపోయాడు గోపాలరత్నం.

ఆ యింటి పరిస్థితిని ఎగాదిగా చూస్తూ, తనే దగ్గిరున్న స్టూలు లాక్కుని కూర్చున్నారు ఆదినారాయణగారు.

"ఏవోయి గోపాలం.... నీకు జ్వరంగా ఉందని విని ఓసారి చూసిపోదామని వచ్చానంతే. నువ్వా ప్రక్కమీంచి లేచేవంటే యిప్పుడే వెళిపోతాను.... ఎన్నాళ్లనుంచో అనుకుంటున్నాను ఇలా బయల్దేరదామని. దిక్కుమాలిన ఆఫీసు పనులు తెమిలిచావవు కద.... ఎప్పుడూ చేప్పేనేకాదు, ఇంత రెచెడ్ క్వార్టర్స్‌లో ఎలా ఉంటున్నావోయ్ నువ్వు? మనకేం..... ఎలాగోలా పెద్దవాళ్ళం అయిపోయాం.... ఇలాంటి వాతావరణంలో పెరిగితే మన పిల్లలు ఏం కావాలి? చూడూ నీకు ఫిలుప్సు డీలరు సుందరం తెలుసు గదూ....చాలా కంఫర్టబుల్‌క్వాటర్స్ కట్టించాడు యిమధ్య..... మళ్ళీ అద్దెకూడ ఎంతో ఎక్కువ ఉండదు, ఓహండ్రెడ్ రుపీస్ ఎడ్వాన్సు మాత్రం ఇవ్వాలి,.... అన్నట్లు యిప్పట్లో నువ్వు ఇవ్వలేవేమో! ఓ వాటే ఫూల్ అయామ్! నేనే ఇస్తాను.... ఇంటికెళ్ళేటప్పుడు అతన్తో ఓ ముక్క స్వయంగా చెప్పేసి మరీ వెళతాను.... నువ్వు కాదంటే నే నొప్పుకొనేది లేదు. జీతంలో నెల కింతని కట్టుకుందువు గానిలే..... ఇంకా అందులోఒకటి ఖాళీగా ఉండడం మన అదృష్టం",

గోపాలరత్నం కళ్ళమ్మట గిర్రున నీళ్ళు తిరిగాయి. ఈ సహృదయుడినేనా తన మనసు గంటల తరబడి శంకిస్తున్నది!

ఇందాకటినుంచి ఒక్క అక్షరం పొల్లుపోకుండా యీ మాటలన్నీ వింటున్న అమ్మమ్మఇంక బయటపడకుండ లేకపోయింది. గోడని ఆసరాగా పట్టుకుని అక్కడికొచ్చి ఆదినారాయణగారి సమీపంలో కూలబడింది.

"పెద్ద ముండని, కళ్లు సరిగా ఆని చావవు. ఆయాసం, చతికిలపడ్డానని మరోలా అనుకోకండి బాబుగారూ! మీ దగ్గిర పనిచేస్తున్న మా గోపీ బొత్తిగా నోట్లో నాలికలేని సత్తెకాలపు సన్నాసి. వీడి చెల్లెలికి రెండేళ్ళున్నప్పుడు మా అమ్మాయి వీళ్లిద్దర్నీ నా కంఠానికి చుట్టబెట్టి కళ్లు మూసింది. ఇంతున్నప్పుడు వీడి లోకజ్ఞానమెంతో ఇప్పుడూ అంతే. ఎన్నోసార్లు చెప్పేను. మీ దర్శనం చేసుకుని మంచీ చెడ్డా చెప్పుకోరా అని వింటేనా? దేవుడు పంపినట్టు యివాళ మీరే దిగివచ్చేరు. ఇంట్లో మనిషిలా మాట్లాడుతున్నారు. మీ దగ్గిర వాడికింత భయమెందుకు చెప్పండి? ఒకర్ని అనుకోడ

మెందుకు. నా చేతులు మంచివి కావు. నేను చేసిందేది నిలబడదు. లేకపోతే ఎందుకూ పనికిరాని నేనిలా బతికుండడ మేమిటి. మహాలక్ష్మిలాంటి యీ యింటి కోడలు నా ముందే మసైపోవడమేమిటి! కర్మ బాబుగారూ, అంతే .... ఇదిగాక గుండెలమీద కుంపటిలా పెళ్లి కాని మా తిలకంఒకర్తీ. ఒసే. ఏం చేస్తున్నావే. వచ్చి బాబుగారికి దండంపెట్టూ."

తిలకం వచ్చి నమస్కారం చేసి, దూరంగా పమిట కప్పుకుని నిలబడింది.

"భలేవాడివేనోయ్ గోపాలం! ఇలాంటి చిక్కులున్నాయని మాటవరసకయినా నాతో చెప్పొద్దూ? నీకు పెళ్లి కెదిగిన చెల్లెలొకర్తి ఉందని చూచాయగానైనా నేను ఎరగను సుమా! మామ్మగారూ, మనది ఏశాఖ అన్నారూ?"

అమ్మమ్మ చెప్పింది.

"ఇంకేం? నాకు తెలిసిన సంబంధం ఒకటి రెడీగా ఉంది. అబ్బాయికి మాత్రం ముప్ఫై ఒకటో రెండో ఉంటాయి. మీకు అభ్యంతరం లేకపోతే ...."

తిలకం ఇంక అక్కడ ఉండలేక పోయింది. పెరట్లోకి పరిగెత్తింది. కూనిరాగం తీస్తూ .... ఓ అయిదునిముషాల తర్వాత ఆమె వచ్చేక వినపడ్డ మాటలివి.

"చూడండి మామ్మగారూ, మీ వయసెంతన్నారు?" ఆ మాటకి అమ్మమ్మ సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది.

"సరిగ్గా తెలీదు బాబుగారూ, అరవై వెళ్ళేయేమో..."

"ఓస్, ఇంకా ఎంతో అనుకున్నాను! డబ్భై అయిదేళ్ల మా అవ్వకి ఆపరేషను చేయించి కళ్లజోడు పెడితే ఇట్టే వచ్చింది, ఒకటోరకమైన చూపు. ఆ ఆపరేషను చేయించిన డాక్టరు ఇంకా యీ ఊళ్లోనే ఉన్నాడు కూడాను. ఇంటికెళ్ళగానే ఫోన్ చేస్తాను రేపీపాటికి మీ యింటికి వచ్చిమీ కళ్ళపరీక్ష పూర్తిచెయ్యడూ?"

గుడ్డికళ్ళలోంచి వేడినీటి కన్నీటి చుక్కలు కురిపిస్తూ ముందుకి జరుగుతూ అంది ఆవిడ!

"బాబుగారూ, మీ పాదాలు ఒక్కసారి నా చేతుల్తో తడమ నియ్యండి" ఆదినారాయణగారు చటుక్కున బూటు కాళ్లు తీసేసుకుని లేచి రెండడుగులు వెనక్కివేశారు.

"ఎంతమాట, ఎలాంటిమాట అన్నారు మామ్మగారూ! మా అమ్మలాంటి వారు!"

"దిక్కుమాలినదాన్ని, నాకూ దేవతామూర్తి లాంటి మీ తల్లిగారికీ పోలిక ఏమిటి బాబూ? కాళ్లు కాకపోతే పోయే తల అయినా తడమనీ" ఆయన నిలబడ్డ ఆవిడ దగ్గిర వెంటనే వంగి ఆ అవకాశం యిచ్చాడు.

"ఏ చల్లని తల్లి ఏ చల్లని వేళ కన్నదో .... వెయ్యేళ్ళు వర్థిల్లు నాయనా!"

గద్గదిక కంఠంతో ఆయన అన్నారు:

"చూశావా, చూశావా గోపాలం! వద్దు వద్దన్నా వినక మీరందరూ కలిసి ఏటేటా ఈ రోజున నాకేమిటేమిటో తెచ్చి యిచ్చే వారు....అనుభవంతో పండిపోయిన యీ తల్లి దీవనకన్న ఎందరెందరు కలిసినా నాకేం ఇవ్వగలడు! నేనందుకే వచ్చాను. వెడుతున్నాను, గోపాలం, గుర్తించి కదా, ఇవాళ జూన్ పదహారు!"

కలలో నయినా ఎదురుచూడని కరుణతో సానుభూతితో మునిగి తేలుతున్న గోపాలం

మనసు ఉక్కిరి బిక్కిరి చిక్కబెట్టుకుని మరొక్కసారి నిలదొక్కుకుని లేచింది. అవును ఆరోజు ఆదినారాయణ గారి పుట్టినరోజు. బక్క మృగాల రక్తం చుక్క చుక్కా తీసి భద్రకాళికి ఏటేటా బలిపెడుతున్నరోజు. గంధకద్రవ సింధువులో సుందర మధుబిందువులా! విశ్వం ప్రతిమాటా తూటాలా తన చెవిలో రొదపెడుతోంది. అందర్నీ అన్ని విధాలా మంచి చేసుకుంటే షష్ఠి పూర్తిదాకాడేకవచ్చు. లేదా అందరి ఓటూ తన తోడల్లుడికే వేయించే ప్రయత్నం కావొచ్చు. లేదా మరేదైనా, అదేదైనా కావొచ్చు లేకపోతే ఇన్నేళ్ళ ఇన్నాళ్ళ తన చిమ్మచీకటి బతుకులో ఒక్కసారి. ఒక్కసారైనా.....

"ఏమిటోయ్, ఉన్నట్టుండి అలా పెట్టావ్ మొహం!"

"ఏం....ఏం....ఏం లేదండి....క్ష....క్షమించండి."

"దేనికోయ్ నిన్ను క్షమించడం? ఇన్నాళ్ళూ నీ కష్టాలు నాతో చెప్పుకోలేదనేనా! ఫరవాలేదోయ్....తప్పులు మనుషులు కాకపోతే దేవుళ్లు చేస్తారా! ఇప్పటికైనా సాటి మానవుడిగా ఆదుకొనే అవకాశం కల్పించావు. అదెంతకాదు! సరే నేవచ్చి చాలా సేపయింది. అసలు పుచ్చుకోవడంలోనేకాక ఇవ్వడంలో గొప్పతనం ఇప్పుడే తెలిసింది. ఇకనేవెడతాను....చూస్తూవుండు రేపటిరోజు మీకెన్ని శుభాలు జరుగుతాయో.....అయ్యో నా మతిమరుపు మన్నుగాను నీకు నలుగురు పిల్లలుండాలి కాదుటోయ్ ఏరీ. ఏరీవాళ్లు, ఎక్కడా సందడి వినపడదే!"

ఇంకో నిమిషం కూచుంటే వాళ్లు బడినుంచి వస్తారనీ చూసి మరీ వెళ్ళమనీ అమ్మమ్మ చెప్పినమీదట నిలబడ్డ ఆదినారాయణ గారు మళ్ళీ కూచున్నారు.

అవునవును. నాకు నలుగురు పిల్లలుండాలి కదూ!....అనుకుని తనలో తనే నవ్వుకున్నాడు గోపాలరత్నం....అతని శ్రీమతి అతనికోసారి పిల్లల్ని గురించి చెప్పిన సంగతులు తల్లి గుండె కీర్తనలో ప్రతిధ్వనించే సంగతులు. --ఏమండీ ఎన్నిమాట్లు చెప్పినా నా ఆపరేషను చేయించు అనే నా సాధింపు ఈమధ్య మరీ ఎక్కువైపోయింది కదూ! ఏం చెయ్యమన్నారు. వాళ్ళకేం కావాలో కడుపునిండా పెట్టలేని దురదృష్ట జాతకురాల్ని .... నా మనసు మనసులో ఉండక ఏదేదో అనేస్తూంటాను ---ఏమీ అనుకోరు కదూ?

--ఇదిగో వింటున్నారు కదూ! ఒక్కొక్కప్పుడు నాకేమనిపిస్తూ ఉంటుందో తెలుసా? అయిదుగురు పిల్లలూ ఆదమరచి నిద్రపోయే వేళ ఎందుకో ఉలిక్కిపడి లేచి కూచుంటూంటాను. అలా అందర్నీ ఒక్కమారు చూసుకుంటూ ఉంటే --- కన్నీళ్ళలోంచి కాసంత గర్వం కూడా ఉండుండి తొంగిచూస్తూ ఉంటుంది సుమండీ! అయిదుగురు పిల్లల తల్లిని నాకేం అనుకుంటాను. అప్పుడు ఏమీ లేనట్టే తోచదు. గుండె అంతా నిండిపోయినట్లు కూడా ఉంటుంది. ఖర్మం జాలక దేశం దరిద్రంగా తయారయింది. కనక ఇప్పుడిలా అఘోరిస్తున్నాం గాని పిల్లలులేని యిల్లు అదొక ఇల్లుటండీ. వల్లకాడు గాని!

--ఏమండోయ్ .... ఇంకో మాట ..... నన్ను పెళ్ళాడక ఇంకే ధనవంతురాల్నో పెళ్ళాడి ఉంటే ఇంత కంటె మీ స్థితి బాగుండునని మీరోసారి అయినా అనుకుని ఉంటారు. అవునా? అలాగే నేనూ ఇంతకంటె పెద్ద ఉద్యోగస్థుణ్ణి కట్టుకుని ఉంటే యింత దౌర్భాగ్యస్థితి పట్టకపోయి ఉండునేమో అని ఎన్నోసార్లు అనుకున్నమాట కూడా నిజం. కాని మనిద్దరం ఎప్పుడయినా "ఈపిల్లలుకాక

మరెవరైనా మన కడుపున పుట్టి ఉంటే బాగుణ్ణేమో!" అనుకున్నామా! మనమే కాదు కుంటీ గుడ్డీ అయిన పిల్లల్ని గన్న తల్లిదండ్రుల సహా అనుకోరు .... అలాంటిది మన పిల్లలకేమండీ బంగారు కొండలు. రత్నాల రాసులు, వజ్రాల మూటలు!

"మామ్మగారూ! మీ మనవడు చూస్తే ఈలోకంలో ఉన్నట్టు లేదు! ఇక యీయన గారి పిల్లలూ యిప్పట్లో వచ్చేలా లేరు.... నేనింక వెడతాను."

ఆదినారాయణ గారు లేచి నిల్చొనే లోగా అల్లంత దూరంనుంచే ఇల్లు పీకి పందిరివేస్తూ నలుగురు పిల్లలూ రానే వచ్చేరు. ఇంట్లో ఓ పెద్దమనిషి వచ్చి కూచున్నాడనే స్పృహ వాళ్ళకు ఉన్నట్టు లేదు.

"అమ్మమ్మ గారండోయ్ ఒసేవ్! నేనెక్కడున్నానో చెప్పుకో."

"అత్తా, అత్తా, యివాళ మాకు చీమా చిలకా కథ చెప్పేరు. నీకు చెప్పనా? అమ్మా, ఎంతాశ! మొన్న నేను నాలుగో ఎక్కం అప్పచెప్పించుకోమంటే తీరుబడి లేదన్నావ్!"

"నాన్నా యివాళ మా తెలుగు మేష్టారు పడుకున్నప్పుడు పిలక ఎంత పొడుగుంటుందో మేం స్కేలుతో కొలిచి చూశాం తెలుసా?"

"మా ఫ్రెండు శంకరంగాడు లేడూ.

వాళ్ళ నాన్నని నిన్ననే ఆసుపత్రి నుంచి తీసుకొచ్చేరట. వాడు చెప్పేడు. మళ్లీ వాడికి తమ్ముళ్లు పుట్టకుండా వాళ్ళ నాన్న ఆపరేషన్ చేయించుకున్నాట్ట. పిల్లలు వాళ్ళ అమ్మకి కదా పుట్టేది వాళ్ళ నాన్న ఆపరేషను చేయించుకోవడమేమిటి చెప్పూ? నవ్వలేక చచ్చామనుకో!'

"ఏయ్ పిల్లలూ మీరు నోరు ముస్తారా ముయ్యరా! ఒసే తిలకం వీళ్ళని లోపలికి తీసికెళ్ళి ఏదైనా పెట్టమ్మా! చూస్తే ఇంతున్నారో లేదో, ఎక్కడలేని పెద్ద కబుర్లూ వీళ్ళకే!"

అమ్మమ్మ చెప్పినట్టు తిలకం వాళ్ళని బలవంతాన లోపలికి లాక్కువెళ్లేక తప్ప ముసిలాయనకి ఊపిరి తిరగలేదు.

"చూశారా బాబుగారూ, పిల్లలు ఎలా తయారయారో!" అంది అమ్మమ్మ.

"దానికేంగాని, నీ పిల్లలు మాంచి చురుకైనవాళ్ళోయ్ గోపాలం" అంటూ ఆయన ఇంకా ఏదో అంటూనే ఉన్నారు. పిల్లలు నలుగురూ మళ్ళీ ఊరుమీదకి బలాదూరు బయల్దేరేరు. వాళ్ళని పలకరించకుండా ఆయన ఆ యింటినుంచి కదల్లేకపోయారు.

"కారెక్కిస్తాను, వస్తావుటోయి అబ్బాయ్?"

"ఒకళ్లు నడుపుతుంటే పక్కని కూర్చోడానికి నాకేం ఖర్మం! నా కర్ర గుఱ్ఱం ఉందిగా!"

"నీ అంత రబ్బరుబొమ్మ కొనిపెడతాను. నాతో వస్తావుటే పాపా!"

"నా అంత బొమ్మ నేనేం చేసుకోనూ!"

"మా యింటి కొస్తారా, బిళ్ళలూ, బిస్కట్లూ కొనిపెడతాను!"

"మే మెందుకు రావాలీ, కావాలంటే మీరే తెండి, అప్పుడు ఆలోచిస్తాం."

'మాటకి మాటా బాగా చెబుతున్నారే! మిమ్మల్ని నలుగుర్నీ కలిపి ఎత్తుకుపోతా. ఏం చేస్తారేం?'

"మేం మీకు దొరికితే గదా! అయినా మీలా మాకేం పనీపాటూ లేదనుకున్నారా యేం? అల్లవాళ్లింట్లో నీలం మందార విడిచిందిట. వెంటనే వెళ్లి చూసిరావాలా వద్దా! మా చాకలాడి



గాడిదకి ఇంత ముండ పుట్టిందిట. ఎంతో ముద్దొస్తోందిట. చూసి రావొద్దూ .... తప్పుకోండి తప్పుకోండి. పెద్దబజారుల్లో పావలా యిస్తే ఏనుగుపిల్లని ఎక్కనిస్తున్నారట....పక్క మేడమీద...." గుక్క తిప్పుకోకుండా వెంటనే ఎటెండ్ కావలసిన అర్జెంట్ పనుల అంతులేని లిష్టు. అలా చెబుతూనే పిల్లలు నలుగురూ తుర్రుమన్నారు. మరో గడీకి ఆదినారాయణగారు కూడా వెళ్ళిపోయారు....అమ్మమ్మ పంచాంగం విప్పింది.

"ఇంటికా పెద్దమనిషి వస్తే నీ పిల్లలు చేసిన మర్యాద చూశావట్రా గోపీ?"

....నా ఉద్యోగం యీ మాత్రంగానైనా నిలబడాలని తెలిసినా ఏటా వార్షికాలు చెల్లించాను. ఆ మనిషి హృదయం లేనివాడని తెలిసికూడా అన్నీ సిగ్గులేక విస్మరించి అతన్నే ఆశ్రయించాం దేనికి? నాకో యిల్లు కావాలి. నీకు చూపు రావాలి. చెల్లెలికి మొగుడు దొరకాలి. ఇవన్నీ బజార్లో అమ్ముతున్నారు కనుక. ఆయన కొనిపెడతానన్నాడు. కాని ఆయన కొనలేనిది కూడా ఒకటుందని తెలిసి నా మనసు పరవశిస్తోంది. దిక్కుమాలిన పరిస్థితుల్లో పుట్టినా, పెరుగుతున్నా యిప్పటికి నా పిల్లలకి వ్యాపార లక్షణాలు వంటబట్టలేదు. ఈ జీవితం వాళ్ళకొక క్రీడారంగం .... ఎప్పుడూ ఇలాగే ఉండిపోతే! .... ఉండదని తెలిసినా ఆ క్షణంలో ఆ పిల్లల్ని ప్రసాదించిన తల్లిని తృప్తితో తలుచుకోకుండా ఉండలేకపోయాడు గోపాలరత్నం.

*(యువ మాసపత్రిక)*

# ఎవరికేది ప్రాప్తమో!




**'నువ్వేంతిచ్చినా** సరే, నేనీసారి యిక్కడ ఉండను ఫో ....'

'బంయ్'మని పైకి రాబోతున్న వాడి స్వరాన్ని కుడిచేత్తో మూసి,

ఎడం చేత్తో వాణ్ని లోపలికి రాకుండా పక్కగోడకి తొక్కిపెట్టి'

'ఒరే ఒరే నీ పుణ్యం ఉంటుంది అరవకురా మళ్ళీ మీ అమ్మ లేచి పోతుందిరా .... కాయకి పది పైసలు చొప్పున దొబ్బుతున్నావు కాదుట్రా?'

'అయితే మాత్రం. జుట్టూడి వచ్చేలా లాగుతావా. ఇప్పటికీ మంట తగ్గలేదే! ఈసారి కాయకు పావలా చొప్పున పెంచితే గాని నేనీ దరిద్రప్పని చెయ్యలేను. నిద్రాపుకోలేక ప్రాణాలు పోతున్నాయి బాబూ!'

'పోనీ అలాగే చేస్తాను లేరా .... ఆ అడిగేదేదో కాస్త నెమ్మదిగా అఘోరించి చావరాదూ? నూకాలమ్మలా అంత స్వరం ఎందుకూ? మళ్ళీ ఆ సుబ్బన్నగాడు గనక లేచిపోతే రెండ్రూపాయల కాయా మన చేతిలో పడకుండా పోతుందే! వెంటనే వెళ్ళీ తీసుకు రారా బాబూ.'

'మునపట్లా కాదయితే. ముందస్తుగా పావలాకాసు ఎక్కడుందో తీసి చేత్తో పట్టుకు నిలబడితేనే నేనిక్కణ్ణుంచి కదిలేది తెలుసా?'

'ఓరి నీ అసాధ్యం గూల, బాగా తయారయ్యేవే!'

అని పైకయితే అన్నాడుగాని, కొడుకు క్రమక్రమంగా వృద్ధిలోకి వస్తున్నందుకు లోలోపల సంతోషించక పోలేదు చలపతి.

వాడూ అలా ముందుకు వెళ్ళగానే ఆ తండ్రి మనసు అలా వెనక్కి యింకా వెనక్కి మళ్ళింది.

❋

అవును. మరి. అందరికీ ఈ ప్రపంచంలో మంచిగానే బతకాలని ఉంటుంది. కాని ఎదుటివాడు అలా బతకనియ్యొద్దూ!

ఇరుగూ పొరుగూ అన్నాక ఇచ్చి పుచ్చుకోడాలు ఉండాలి. తన కుటుంబం యిలా ఈ వాటాలోకి అద్దెకి వచ్చారో లేదో ఆ పక్క వాటాలో అద్దెకున్న సుందరమ్మ అలా చెప్పడం ఏమైనా బాగుందీ!

'చూడండి అన్నయ్యగారూ! ముందు నీళ్ళునవలడం, వెనకాతల శాపనార్థాలు పెట్టడం, యిలాంటి చచ్చుపనులు నాకు చేతకావు. నాదంతా రైట్ రాయల్ రోడ్. అందుకనే నేనంటే చాలా మందికి కిట్టదు. పోన్లెండి, నా కొచ్చిన నష్టం కూడా ఏమీలేదు. వింటున్నారా? ఈ యింటి వాళ్ళు సికింద్రాబాదులో వున్నారు. వారూ, మా వారూ ప్రాణ స్నేహితులు. మీరు నెల నెలా ఒకటో తారీకుకి అద్దెమాకేయివ్వాలి. మీదీ, మాదీ కలిపి మేం మనియార్డరు చేస్తాము. ఇంకో ముఖ్య విషయం ఉంది. చెప్పేనుగదా యింటి పూచీ అంతా మా మీదే పెట్టారని. చూస్తున్నారుగదా పెరటినిండా కొబ్బరి చెట్లు ఉన్నాయని. వాటి మీద మనకేమీ అధికారం లేదు. దింపించిన కాయలేకాక, పడిన కాయలైనాసరే మనం ముట్టుకోడానికి లేదు. ఇలాంటివి ముందే స్పష్టం చెయ్యడం నా తత్వం. నాదంతా రైట్ రాయల్ రోడ్. ఎక్కువ పెరటి భాగం అంతా మీ వైపే వుంది. బాగా పక్వానికి వచ్చిన కొబ్బరిబొండాలు కదా .... ఇలా గాలి వీస్తే అలా రాలిపోతాయి. పరాయి సొమ్ము మీకెందుకు. నాకెందుకు? మీ పిల్లవాడిచేత యిలా పంపించినా సరే, మాకు కబురెట్టి నా సరే .... ఇలా రాలినవీ, అప్పుడప్పుడు తీయించినవీ -- బజార్లో అమ్మించి ఆ డబ్బులూ అద్దె డబ్బూ అంతా కలిపి ఏ నెలకానెల యజమానికి పంపించెయ్యాలి.

మీరు మరోలా చేస్తారని కాదుగాని ....''

విషయం అర్థమైంది గనక యింక ఆ బోరు భరించలేక చలపతి లోపలకి తప్పుకున్నాడు గాని ఏమిటో మొట్టమొదటి రోజే యిలా హెచ్చరించడం ఇన్సల్టింగ్‌గా తోచింది. అదే విషయం ఆలోచించి ఆరా తీసేలా చేసింది.

అమ్మో ఆ సుందరమ్మకి తక్కువ కాపీర్ణం ఉందనా! పదిపైసల తోటకూరకి గంటపైగా బేరమాడుతుంది. ఇంట్లో ఎన్ని సామాన్లున్నా ఏదీ పైకి తీసి హాయిగా వాడుకోలేని మురికి మనిషి. ఆ మొగుడు, సుబ్బన్నగాడు ఎంత దర్జా పురుషుడో ఇదంత కక్కుర్తి మనిషి. ఇలాంటిది ఎక్కడో మొగుడి స్నేహితుడికి-కింద పడిన కొబ్బరికాయతో సహా --- పుట్టమీద పెట్టినట్టు అప్ప చెప్తోందంటే

-- ఎంత ఎడ్వర్‌టైజ్‌మెంట్ చేస్తే మాత్రం నమ్మేవాళ్ళు అంత వెర్రివెధవలుటండీ!

తన సొమ్ముకాదు. తన లోకం కాదు ..... దీని కెవడిచ్చాడు ఈ అధార్టీ .... ఆ మాత్రం యిరుగూ పొరుగూ యిచ్చి పుచ్చుకోడాలు లేకపోతే అది మనిషా? తను తినావచ్చు యింకొకరికి పెట్టావచ్చు. అలాంటిది ఎదుటి సొమ్ము కాపాడ్డం కోసం యింతలా దేవుళ్ళాడు తోందంటే యిందులో ఎంత స్వార్థం గూడుకట్టుకుని ఉందో!

ఇంకేం, ఈ క్రాస్‌వర్డ్ పజిల్‌కి కీ సొల్యూషన్ నిమిషాల మీద పట్టేశాడు చలపతి.

ఏరోజు చూసినా సుబ్బన్న గారింట్లో కొబ్బరికాయ పచ్చడే.

ఎప్పుడు చూసినా వాళ్ళింట్లోంచి కొబ్బరి నూనె పోపు వాసనే.

నెలకోసారయినా తలకి రాసుకునే కొబ్బరి నూనె రెండు పెద్ద హార్లిక్సు సీసాలకి సరిపోయేది -- వాళ్ళు గానుగ ఆడించుకుని -- తమ యింటిముందునుంచే లోపలికి తరలించుకుంటూ ఉంటారు.

కొబ్బరి ఈనెల చీపుళ్ళు కట్టించి అమ్మిస్తూ ఉంటుంది ఆవిడ. 'ఇదంతా సంఘసేవా అందూ' అన్నాడు చలపతి పెళ్ళాంతో, కొన్నాళ్ళపాటు యిదంతా గమనించి, 'ఏదైతేనేం, మనకేం సంబంధం? పోనీ వీళ్ళు తింటున్నారే అనుకుందాం. వాళ్ళ ఫ్రండ్సెవరో వాళ్ళకా అవకాశం యిచ్చారు. మధ్యని మనకేం?' అని విసుక్కుంది మహలక్ష్మి.

'ఎవర్దో సొమ్ము తినడానికి వీళ్ళెవరంట?'

'మనకేం పోయిందండీ.'

'ఏం పోయిందా, తప్పు జరుగుతూంటె ఊరుకోడం ఆ తప్పుని ప్రోత్సహించినంత తప్పు.'

'ఇరుగు పొరుగులతో మనకెందుకు బాబూ రొష్టు?'

'ఇరుగూ పొరుగూ కనకనే అప్పనంగా తనంతగాపడేసుకొంటోందే - సాటి ఆడదానివి కదా .... పునిస్త్రీ పడుచువి నీ చేతిలో ఓ కొబ్బరి బొండాం పసుపు కుంకుమతో యిచ్చుకుంటే దాని మొగుడి ఆయువు తగ్గిపోతుందా? చేసేదేదో దగుల్బాజీ పనీ, మళ్ళీ యింటికి అద్దెకెవరైనా దిగుతే దాని బాబుగారి యిల్లులా వల్లిస్తూ 'నాది రైట్ రాయల్ రోడ్ ' అంటూ టముకు కొట్టుకుంటుందా! ఆ మధ్య రెండ్రోజులపాటు ఎవరూ చూడకుండా పెరట్లో ఉండిపోయిందని బొండాం ఒకటి తీసి మన కుర్రాడు - కుర్రాడుగదా యింట్లో పెడితే ఊరూ వాడా గోలచేస్తుందా, ఇదేదో నేను చూడకపోతానా!'

ఈ మొగుడు ఎప్పటికైనా అర్థమవుతాడా అని మహాలక్ష్మి కాపురానికి వచ్చినప్పట్నుంచీ చూస్తూనే ఉంది. పుట్టిన కొడుక్కి పదేళ్ళయితే వచ్చాయి గాని ఆమెకి అనుకున్నది బోధపడలేదు. ఏవో చిన్న చిన్న విషయాలకి బోలెడంత ప్రాముఖ్యత యిచ్చి వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడిపేస్తాడు. తనకీ, మొగుడికీ ఆలోచనల్లోనేకాదు రూపంలో కూడా పోల్తి పట్టలేనంత వైరుధ్యం. పదేళ్ళ పిల్లాడికి తను తల్లి అంటే ఎవరూ ఒప్పుకోరు. 'మీ తమ్ముడా?' అని మోహం మీదే అడుగుతారు. 'ఎంతయినా ఆడపిల్ల పాపం ఎన్నాళ్ళకీ పెళ్ళికాక రెండో పెళ్ళి వాడికి యిచ్చేశారు కాబోలు' అని వెనక అనుకోడం ఎన్నిసార్లో స్వయంగా వింది తనూ మొగుడు ఎక్కడికైనా వెడుతూంటే, తన లాంటి మధ్య తరగతి మహిళకి అసంతృప్తీ, నిట్టూర్పులూతప్ప ఏం మిగులుతాయి! ఇలాంటి మొగుడితో ఓ ముద్దా, ముచ్చటా? చెప్పుకుంటే సిగ్గుచేటు - అతనితో దాంపత్య సుఖం కూడా

అంతంతమాత్రమే.

మొగుడి కేకలతో మహాలక్ష్మి మళ్ళీ ఈ లోకం లోకి వచ్చింది. " నే చెబుతున్నది వినడానిక్కూడా నీకు ఓపిక ఉన్నట్టు లేదే! ఏం చెయ్యను! నీలా, అన్యాయం జరుగుతూంటే ఊరుకునే చేతకానితనం నాకు లేదు. ఈ సుందరమ్మకి త్వరలోనే బుద్ధి చెప్పకమానను ఇంతకీ ఆవిణ్ణి అలా ఆడింది ఆటా పాడింది పాటగా తయారు చేసిన ఆ సుబ్బన్న గాడిని అనాలి.''

చలపతి మాటలకి మహాలక్ష్మి సపోర్టు ఇవ్వదుగాని సుందరమ్మ ఏం చెబుతున్నా సుబ్బన్న పక్కనే ఉండి 'అవునవును' అనడం, చాలా స్పీడుగా తల ఊపడం ఎప్పుడూ జరిగేదే. అందుకే సుబ్బన్న అంటే చలపతికీ మధ్య మంట ఎక్కువైంది.

ఇంతకీ చలపతి అట్టే కష్టపడకుండానే అతని కోరిక ఈడేరే అవకాశం కనిపించింది. దేవుడు దయామయుడు గదా!

ఆఖరి చెల్లెలి పెళ్ళి నిశ్చయమైందిట. రమ్మని కబురొస్తే, నెల్లాళ్లపాటు ఉండి రావడానికి సుందరమ్మ పుట్టింటికి వెళ్ళి పోయింది. వెళ్ళే ముందు మొగుడికి ఓ వంద జాగ్రత్తలూ, ఓ హెచ్చరికలూ వడ్డించి మరీ వెళ్ళింది. ఇందులో తొంభై శాతం కొబ్బరికాయల క్షేమం గురించే.

చలపతి ఎంతో ఆతృతతో ఎదురు చూస్తున్నదీ అందుకే.

అంటే సుందరమ్మగాని, చలపతిగాని మనస్సా కోరుకున్నది వారు అద్దెకున్న యింట్లో ఉన్న నారికేళ సంశ్లేషం. ఇల్లు కట్టుకుని ఆ మొక్కలన్నీ వేసి, కష్టపడి పెంచి పెద్దచేసిన ఇంటి యజమాని క్షేమం మాత్రం కాదు!

అంతే నడుం బిగించి రంగంలోకి దిగిపోయాడు చలపతి.

'నా చేత్తో నేనై వాళ్ళ కొబ్బరికాయలు చస్తే యింటికి చేర్చేది లేదు' అని ముందే చెప్పేసింది మహాలక్ష్మి.

చలపతి అయినా, సుబ్బన్న అయినా ఉద్యోగాలు చేసుకుని ఇల్లు చేరేది చీకటి పడ్డాకే. ఆ సీజన్లో ఆ ప్రాంతాల్లో రాత్రి వేళ తరుచూ ఈదురుగాలి వేస్తూ ఉండేది. రాత్రి పూట విధిగా నాలుగైదు కొబ్బరిబొండాలు రాలేవి. కొడుక్కి లంచం యిచ్చి పడిన బొండాలు యిల్లు చేర్పించేవాడు చలపతి.

'అర్ధరాత్రి ఏమిటి ఈ పాడు గోల? నన్ను పడుకోనిస్తారా లేదా? అంటూ ఆ నారికేళ చోరకేళితో విసుగెత్తిపోయిన మహాలక్ష్మి ఓనాడు నానా గోల చేసింది.

'సాయం చెయ్యవలసింది పోయి మొగాళ్ళు కష్టపడి ఇల్లు నింపుతుంటే నీకేం తీపు దిగదీసిందిటే?'

'రాత్రి నిద్రలేకపోతే పొద్దుట నేను పని చెయ్యలేను. మీ కేం?'

'అయితే సరే ఓ పని చెయ్యి. వీధి గదిలో మడత మంచం వేస్తా. ఆ గదిలో నువ్వు పడుకో. అడ్డ గడియ పెట్టుకో. తెల్లారేదాకా నిన్ను లేపితే అడుగు సరేనా?'

పెళ్ళానికి ఎలాగో బోధపరచి ఒప్పించాడు చలపతి.

'దొంగ పీనుగ. దీనికి దిగమింగటానికి హక్కుంది. నాకు లేకపోయింది! ఇదే పాపం కడుతోంది అద్దె! పాపం మొగుడికి అప్పజెప్పి వెళ్ళింది వెర్రిముండా కూతురు. వాడు రాత్రి

పడుకుంటే ఇక తెల్లగా తెల్లారాకే లేచేది! ఈ పదిరోజులకీ ఎన్ని చేరేశానా చూడరా!' అని మూలగదిలో చేరేసిన కొబ్బరి బొండాల కుప్పవైపు సగర్వంగా, తృప్తి గాచూసుకుంటూ అన్నాడు చలపతి కొడుకుతో.....

అయితే........

అప్పటికి నాలుగు రోజులై ఇంచు మించు అదే వేళకి చల్లచల్లగా పక్కింటి పడకగదిని చేరిన మహాలక్ష్మి సుబ్బన్న కౌగిలిలో సుఖసంతోషాలకు అసలైన అర్థం తెలుసుకొంటోందని చలపతికి తెలిసే అవకాశంమాత్రం ఇప్పటో లేదు!

*(ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక దీపావళి ప్రత్యేక సంచిక, 1981)*

# చిల్లన్గి ఎన్త చల్లన్ది !




**సిగరెట్టు** మీద సిగరెట్టు తగలేస్తున్నాను.

పెట్టెలకు పెట్టెలే ఊదిపారేస్తున్నాను.

నా ఆలోచన మాత్రం తెగడంలేదు.

ఎప్పుడూ బిజీగా ఉండడమే నాకు అలవాటు.

ఇలాంటి గజిబిజి ఆలోచనల్లో చిక్కుకుంటానని ఎప్పుడూ అనుకోలేదు. పనివాళ్లు ఎదురుచూసే, ముసలాళ్ళు అసూయపడే తారుణ్యం నాది. ఇంగ్లీషు సినిమా హీరోలు సిగ్గుపడే దేహధారుఢ్యం నాది.

తెల్లారింది మొదలు రాత్రి ఎప్పుడౌతుందా, రాత్రయింది మొదలు రసరాజ్యడోలలో ఎప్పుడు మునిగి తేలుదామా అని ఇరవై నాల్గుగంటలూ కొట్టుకుపోయే కొదమ సింహాన్ని నేను.

నాలో నేను అనుకోవడంలో తప్పేముంది!

కాలేజీలో చదివే రోజుల్లోనే ఈ ధ్యాస నాలో మొదలయింది.

మొదట్లో ఏదో తప్పు జరుగుతుందేమో అనిపించేది.

హస్టల్ మేట్స్‌ని పరిశీలిస్తే, నలుగురితో డిస్కస్ చేస్తే, మంచి సెక్సు పుస్తకాలు చదివితే, ఇది సహజమూ ఆరోగ్యకరమూ అని తెలిసింది. గర్ల్ ఫ్రెండ్స్‌ని వెదుక్కుని పబ్బం గడుపుకునే శక్తియుక్తులు ఆ రోజుల్లో మా గ్రూప్‌కి లేవు. అనుభవజ్ఞుల అడుగుజాడల్లో కొందరు కాల్‌గర్ల్‌తో కాలక్షేపం చెయ్యలేదని ఇప్పుడు అనుకుని నన్ను నేను మోసపుచ్చుకోలేను.

ఏవో కక్కుర్తి పనులు తప్ప ఏం అనుభవాలు అవి!

ఎవరైనా చూస్తున్నారేమో అని భయం.

తప్పుచేస్తున్నామనే బెంగ.

శరీరంలో ఎక్కడ ఏ కాస్త మార్పు కనబడినా -- ఏ రోగం అంటుకుందో అని దిగులు.

తప్పని పరిస్థితిలో డాక్టర్లని దర్శించుకోడం. వాళ్ళ క్రూయల్ జోక్సు. ఇంజక్షన్లు. ఇన్ని జరిగినా ఎప్పట్లా మళ్ళీ వయసు సందడి. మనసు అల్లరి. సుఖంతో క్రీడలు. వెలుగులో నీడలు.

గృహస్థునై, రెండేళ్ళే సంసార సౌభాగ్యం రెండు చేతులా జుర్రుకొంటున్న నాకీ నట్టింట ఆ పాడుతలపులు దేనికి!

కట్టుకున్నది మగాడి అవసరం గమనించకపోయాక ఇలాంటి పక్కదార్ల వైపు మనసు మళ్ళకేం చేస్తుంది!

ఇంతకీ దొడ్డిదారిన గడ్డి తిని రావడం తప్పు. పెళ్ళి ముందు అనుభవాలతో కొల్లగొట్టుకునేది ఏముంది!

'వెలకాంత లెందరైనను కులకాంతకు సాటిరారు గువ్వల చెన్నా!' అనేది నీతిగా బాగానే ఉంటుంది గాని అనుభూతిలోకి ఎందరికి వస్తుంది! మాట వరసకి హేవలాక్ ఎల్లిస్ ఏమన్నాడు?

'పెళ్ళి ముందు వేశ్యా సంపర్కం మగాడి సంసార జీవితానికి ఎంతగా పనికొస్తుందనేది ఏవిధంగా చూసినా అనుమానాస్పదమే. అలాంటి అనుభవాలున్న మగాడికి తన భార్య శృంగార స్పందన సాధారణంగా సరిఅయిన అంచనాకి దోహదం చెయ్యదు. రెండు తప్పుడు భావనల పట్ల అతడు కొట్టు మిట్టాడుతూ ఉంటాడు. ఏది చెబితే దానికి నిమిషాల మీద ఒడబడే మైనం ముద్దలా ఉందేమిటి. ఈ పల్లెటూరి మొద్దు!' అనే అభిప్రాయానికి గాని, 'నేనో బజారు సరుకుని. ఈవిడో దేవతా మూర్తి' అనే మరో భావనకి గాని రావొచ్చు. ఎందులో నిమగ్నమయినా 'దానికి' ఆవిణ్ణి సిద్ధంచెయ్యడం గాని అందులో తృప్తం చెయ్యడం గాని అతడు జయప్రదంగా నిర్వహించలేడు.'

అనుభవజ్ఞులు కాచి వడబోసిన కటిక నిజాలు కాదనేవారెవరు! కాని అవి ఎంత వరకూ నా అనుభవంలోకి వచ్చాయనేది వేరేమాట. అలాంటి వేవీ దరిదాపులకి రానివ్వనంతటి చాతుర్యంతో సంసార సుఖమే నిజ స్వర్గసీమగా ఇన్నాళ్ళూ తీర్చిదిద్దిన నా భార్య మాధురికి మాత్రం నా అణువణువూ రుణపడి ఉంటుంది.

నా ఆలోచనలోకి 'ఇన్నాళ్ళూ' అనే పదం జొరబడినందుకు గుర్తింపుగా నా మనసు ముడుచుకుపోయింది.

అదెన్నాళ్ళో కాకపోవచ్చు. కేవలం రెండేళ్ళే అయి ఉండొచ్చు.

రెండే రెండు క్షణాలలో దొర్లిపోయింది!

ఇంతకీ కన్నెమీద కన్నేసి, కావాలని చెప్పే ధైర్యం నా కెక్కడిది!

అమ్మా నాన్నా ఇష్టపడిన పిల్లకే మూడు ముళ్ళూ వేశాను.

కొన్ని చేదు అనుభవాలకి మరిన్ని చిలిపి ఊహలు జతచేసి ఏమో ఎలా ఉంటుందో రొమాన్సూ రెస్పాన్సూ అని ఆ మూణ్ణిద్రల దాకా కిందా మీదా పడుతూనే ఉంది, మాయదారి మనసు.

తల్లిదండ్రులు సాంప్రదాయం, కట్నం కానుకలూ చూసుకుంటారు. వధూవరులు పెళ్లి చూపుల్లో మహా అయితే మొహమొహాలు చూసుకుంటూరు.

పైకి కనిపించే ఒంటి రంగూ, ఒడ్డూపొడుగూ, ముఖకవళికలూ కొంతవరకైనా అంచనా వేసుకుంటారు.

ఎంతగా ముందడగు వేశామని వాచిపోయేలా భుజాలు చరచుకున్నా సంసార జీవితానికి మూల కేంద్రమని అంగీకరించబడిన సెక్సు మీద తమ అభిప్రాయాలు ప్రకటించి పరస్పరం అవగాహన చేసుకునే అవకాశం ఎంతమంది యువతీయువకులకి వారి పెద్దలు ఇస్తున్నారు? అలా ఇమ్మని ఎంతమంది వారి పెద్దల్ని అడుగుతున్నారు! పురోహితులు ఆశీర్వదించినా పెద్దలు దీవించినా వేడుకగా వివాహం జరిగినా స్నేహితులెన్నో ఎన్నో కానుకలు చదివించినా, మొదటి రాత్రి తెలుసుకోవలసింది కేవలం వాళ్ళిద్దరే కదా! పెడదారి పట్టించే పత్రికలూ టీవీ షోలూ సినిమాలూ తప్ప వాళ్లకి శృంగార జీవితం గురించి ముందుగా ఎవరేం చెప్పేరు గనక! ఇప్పటికీ 'సెక్సు ఎడ్యుకేషన్ అవసరమా!' అనే వాదనలు జరుగుతున్నాయి. ఇంకా నయం 'ఆహారం అవసరమా!'. 'సెక్సు అవసరమా!' అన్నారు కాదు. ఈ నాలుగైదు రోజులై ఇలా పిచ్చెత్తినట్టు సిగరెట్లు తగలేసి బుర్ర పాడుచేసుకుంటున్నాను గాని నిజానికి ఇన్నాళ్లూ ఇలాంటి వాటికి నాకు తీరికేది!

ఇంతకీ నా అదృష్టం. ఏనాడో చేసుకున్న పుణ్యం.

మాధురి ఇలా మా ఇంట్లో అడుగు పెట్టింది, నా శృంగార జీవితంలో ఒక్కసారి మాలతి విరబూసినట్టయింది. మా వాళ్ళు తెలిసి తెస్తేనేం మా అత్తమామలు నేర్పిస్తేనేం. పుట్టుకతో వచ్చి లోకాన్ని చూసి నేర్చుకుంటేనేం, ఏ రాత్రీ నా బతుకులో నిండు సుగంధం, నిత్య వసంతం.

మా వాళ్ళు ఆ పల్లెటూరు వదిలి రారు. నన్ను విడిచి మాట వరసకయినా మాధురి ఒక్కనాడయినా పుట్టింటికి వెళ్ళదు. డాక్టరమ్మ సలహా మేరకు రోజూ పిల్సు వేసుకుంటుంది గనక ఇప్పట్లో మా సుఖానికి పిల్లలు అడ్డుగా తయారుకారు.

ఇచ్చిపుచ్చుకోవడం ఇంత ఖచ్చితంగా అభ్యసిస్తున్న మా అందాల అనుబంధాలకి అడ్డూ ఆపూ అంటూ ఎందుకుండాలి! ఆఫీసులో పనిచేస్తున్నా అదేతలపు నాకు. ఇంటి దగ్గిర వంటచేస్తున్నా అదే కులుకు తనకి. ఏ క్షణం ఒకరి చేతుల్లో ఒకరు ఇమిడిపోదామా అనే ధ్యాస. అందుకోసమే మా శ్వాస.

ఇలాంటి కోరిక ప్రతి పడుచు జంటలోనూ ఇదే స్థాయిలో ఉంటుందో లేదో మాకు తెలీదు. దీన్ని ప్రేమ అంటారో కామం అంటారో మే మెప్పుడూ ఆలోచించలేదు. మైకం చెందడమే మా లోకం. చుట్టూ మరో లోకం ఉందనే పట్టింపు కూడా మాకు అనవసరం.

కాల్చిపారేసిన సిగరెట్టు పీకల గుట్ట చూస్తే మతిపోయినట్టయింది నాకు. చాతకాని నా పరిస్థితికి నేనే ఏడుస్తూంటే గాయానికి కారం అంటించినట్టు పక్కగదిలో దెప్పిపొడవడం మరింత బాధించింది.

'వక్కపొడి అయినా నమలని నంగనాచి అనవూ నీ మొగుడు, మరి యిదేం చిన్న సిగరెట్టు పేకల కొండ సృష్టించినట్టున్నాడూ!'

'కాస్త మెల్లిగా మాటడవే బాబూ, మళ్ళీ ఆయన చెవినపడితే బాగుండదు-అసలే ఎందుకో అదోలా ఉంది ఆయన మొహం!'

అని మాధురి సర్దిచెప్పబోతే ఆమె ఫ్రెండు వాసంతి మరింత గొంతుక పెంచి చెప్పిన జవాబు యిదీ.

"బాగుంది నీ మొగుడి మొహం ఎలా ఉంటే నాకేం. నే నొచ్చింది ఇదిగో నీ కోసం. ఈ చంద్రబింబం కోసం."

దగ్గిరకెళ్ళి చూస్తే ఆ తర్వాతి దృశ్యం తలుపు కన్నంలోంచి కనపడి మరింతగా ఒళ్ళు వేడెక్కిపోయింది నాకు. అలా అంటూ వాసంతి మాధురిని దగ్గిరగా తీసుకుని అందీ అందని ముద్దొకటి పారేసింది!

నా వస్తువు నా కళ్లముందే కొల్లగొట్టబడుతున్న భావనతో జుత్తు పీక్కున్నాను. ఇంతవరకూ రాకుండా నాలుగు రోజుల ముందే మేల్కొని ఉండవలసిందని నన్ను నేనే తిట్టుకున్నాను.

తీయగా హాయిగా సాగుతున్న మా సంసార సాగరంలోకి నాలుగు రోజుల కిందట పెనుతుఫానులా కొట్టుకొచ్చి అల్లకల్లోలంచేసి పారేసింది వాసంతి. మాధురిదీ వాసంతిదీ ఒకే వయసూ ఒకే ఊరూ కాక ఎదురెదురిళ్ళుట. ఆ ఊళ్ళో హైస్కూలు చదువు వరకూ వాళ్ళు సహధ్యాయినులు. మెట్రిక్‌తో మాధురి చదువు ఆపేసింది. వాసంతి టౌన్లో కాలేజీ చదువు పూర్తిచేసి ఇప్పుడు యూనివర్సిటీలో పీజీ చేస్తోంది. ఎంత ట్రై చేసినా పరీక్షల ఒత్తిడిలో మా పెళ్ళికి రావడం కుదర్లేదుట. ఉత్తరాలు రాసుకోడం వాళ్ళ ప్రిన్సుపల్ కాదుట. వస్తే ఒకటి రెండ్రోజుల్లో వదిలివెళ్ళడమూ వాసంతికి నచ్చదుట. ఏకంగా ఓ నెలయినా వచ్చి ఉండడం కోసం ఈ రెండేళ్లూ ట్రై చేసిందిట. ఇక ఓ సారంటూ వచ్చిపడ్డాక అంతటితో ఇంతటితో సరిపెట్టుకోడం ఆ అమ్మాయి వల్ల ఔనా!

ఇక నోరు విప్పిందంటే వాసంతికేం కొత్తా, సిగ్గా!

'ఏవండోయ్, మా మాధురి మొగుడు గారూ, మీ పేరు తెలీదు, ఇలా పిలుస్తున్నందుకు ఏమనుకోకండి. ముందే చెబుతున్నాను. గుండె రాయి చేసుకోడం ప్రాక్టీసు చేసుకోండి, ఇప్పట్నుంచే. దీనికి నాకూ రెండేళ్లూ ఐదేళ్ళూ కాదు. రెండైదుల, అంటే పదేళ్ల --- ఏమిటనుకున్నారు. అలాంటి లాంటి వ్యవహారం కాదండోయ్, ప్రాణస్నేహం. తెలిసిందా? ఒకరి వరుణ్ణి మరొకరు ఎప్రూవ్ చేసుకునేదాకా పెళ్ళిళ్లు చేసుకోకూడదని ప్రామిస్ చేసుకున్నాం కూడా. ముందే చెబితే ఎక్కడొచ్చి అడ్డుపడతానో అని చడీ చప్పుడూ లేకుండా ముడెట్టించేసుకుంది రాస్కెల్.' 'ఇలా చెబుతున్నప్పుడు రంగులు మారుతున్న మీ మొహం చూస్తూంటే మరిన్ని జోకులు పేల్చాలని ముచ్చటపడుతోంది నా మనసు. మరేం అనుకోరుగా! ఓహోహో! ఏం బింకం, ఏం ఠీవి, ఎంతటి మగసిరి! ఇలాంటి పెర్సనాలిటీని చూసి తన ఒరిజినాలిటీనే తాకట్టు పెట్టిందంటే నాటెటాల్ ఎ వండర్. ఇదే చనువుతో మరో చిన్న రెక్వెస్టు. మీదింకా రెండేళ్ళ సహవాసం గాని మాది పదేళ్ళపాటు ఒకటిగా మెలిగిన ప్రాణం. ఓ నెల్లాళ్ళపాటైనా దీన్తో గడిపి విరహం అంతా అహరహం రీఫిల్ చేసుకుంటే గాని నేను రిటర్న్ కాలేను. ఏ కేంపో, డ్యూటీ టూరో వేసుకుని మీరీ నెల రోజులు అలా అలా తిరిగి రండి. మమ్మల్ని మాకు వదిలెయ్యండి, మా అమ్మకదూ!" సుడిగాలిలా వచ్చి చుట్టబెట్టుకుంటానని

బెదిరిస్తున్న వాసంతిని చూసి కాదు నాకు ఒళ్ళు మండింది, మాటాడుకుండా ముసిముసి నవ్వు చిందిస్తున్న మాధురి మారిపోయిన వాలకం చూసి. 'రాత్రి గదిలోకి రాకపోతావా. అప్పుడు నీ పని చెప్పనా' అనుకున్నాను కసిగా.

కాని, అలాకూడా జరగలేదు!

మా సెక్సులైఫుకి ఆ రాత్రి నాగా పెట్టేసింది మాధురి!

రెండేళ్ళ తర్వాత ఎక్కడో పెట్టడుగున పడేసిన సిగరెట్ పెట్టి తీసి ఊదేసి, తనకే అర్థమయేలా తలుపు తట్టాను. ఏ అర్ధరాత్రి వేళో. రంయ్‌మని తీసింది. మా మాధురి కాదు, ఆ మహాపాతకి!

"నాకు తెలుసండీ బాబూ! ఇలాంటివి నాకు అనుభవంలోకి రాలేదుగాని ---ఆ మాత్రం అర్థం చేసుకోలేకపోను. మీ బాధ నాకు బోధపడింది. మరి నేనూ అదే స్థితిలో ఉండి వచ్చాను కదా! ఓ రోజు ఎడబాటుకే మీ రింత తపించిపోతే ఇన్నేళ్ళపాటు నేనెలా భరించాననుకున్నారు? ఓ విధంగా మనం ప్రత్యర్థులం. మీకుగాని నాకుగాని ఒకరి పొడ ఒకరు భరించడం కష్టమే మరి! అందుకే అన్నీ ఆలోచించి ముందే హెచ్చరించాను. ఈ చుట్టుపట్ల ఉండకుండా ఊరు దాటే ఉపాయం ఏదైనా ఆలోచించమని! ఇంతా చేస్తే ఎంతా? ఒక్కటంటే ఒక్కనెల, ఇలా గిర్రున తిరిగిరాదూ! బాగా ఆలోచించండి. శీఘ్ర పలాయనం శ్రేయస్కరం. వస్తానూ, గుడ్‌నైట్" అంటూ. "ఆ పీనుగ ఇంకా మేలుకొనే ఉందా? దాని మొగుడనేవాడొకడు ఇక్కడ అఘోరిస్తున్నాడని చెప్పండి' అనే నా మాట నా నోట్లోనే ఉండగా భళ్ళున నా మొహం మీదే తలుపేసేసింది. వెంటనే దాని పీక నా కసిదీరా కటుక్కున ఎందుకు కొరికాను కాదో ఇప్పటికీ నాకు బోధపడదు!

ఏమిటి, ఈ వాసంతి దారుణం!

నా ఇంట్లో ప్రవేశించి, నూటికి నూరు పాళ్ళూ నాదే అనుకున్న నా కట్టుకున్న భార్యని నైట్ సెషన్ కయిసా నాకు కాకుండా చేసి 'ఐ కాన్ట్ టాలరేట్ ఇట్. డోన్ట్ షో యువర్ ఫేస్ ఫర్ ఒన్ మన్త్. గెట్ అవుట్' అని నా మొహం మీదే చెబుతోందా! పగలంతా ఎలాగైనా ఏడవవచ్చు రాత్రయినా పక్కలోకి రాకపోతే ఎందుకండీ ఈ ఆడాళ్ళని కట్టుకుని నెలనెలా వీళ్ళ మీద ఇంత డబ్బు ఖర్చుపెట్టడం! ఇంతగా శృంగారం మప్పి ఇంతటి పొజెసివ్ హస్బెండ్‌గానన్ను తీర్చి దిద్దిందే. వరసపెట్టి ఇన్నాళ్ళు వాయిదాలు పెట్టేస్తూంటే వులుసూ కారం తింటున్న మగాడు ఎన్నాళ్ళు సహిస్తాడనుకుంటోంది! ఇంతకీ ఆహారంలా ఇది ఒకే ఒక వ్యక్తి పంచుకునే వ్యవహారం కాదే. ఎంత ఇచ్చినా ఇంకా ఇంకా కావాలని ప్రోత్సహించి పూర్తిగా పొంది పరవశించేదే ఆ మాధురి కెలా నిద్రపడుతోందిట? రెండేళ్ళ అనుభవమూ రెండు నిముషాల్లో పక్కకి నెట్టి ఎప్పుడో ఎరిగిన దాంతో ఒళ్ళు తెలీకుండా ఊరేగడానికి, దీనికి కొత్తగా వచ్చిపడీన పోగాలమేమిటని? నా కర్మగాలి, ఆ నాలుగు రోజుల్లోనే ఇనస్పెక్షను దాపురించి, ఇంట్లో పగలు రెండు గంటలయినా ఉండడానికి కుదిరేదికారు. ఇలా ఆఫీసు నుంచి ఇల్లు చేరానో లేదో ఫ్యూన్ ప్రత్యక్షం 'పెద్దాపీసరెందుకో అర్జంటుగా రమ్మనారని. ఇంట్లో చూస్తే ఇదీవరస వీలు చూసుకుని మాధురిని పిలిస్తే ఆ చైనాగోడగారు ప్రత్యక్షం!

'మా ఆవిడను పిలవండి, మాట్లాడాలి.'

'మీ ఆవిడ పన్లో ఉంది, నాతో చెప్పండి,'

'మీతో కాదు, దాన్తోనే చెప్పాలి, మాధురిని ఓ సారి కేకెయ్యండి',

'మాధురే నాతో చెప్పిందండి! మహానుభావా, తనని కేకేస్తే ఇలా పనిలో ఉన్నాను, కాస్త

నువ్వు నాబదులు కనుక్కోవే అని'.

'ఆ సంగతి దాన్నే అడుగుతాను అడ్డు లేవండి.'

'నన్నే అడగండీ బాబూ.'

'మిమ్మల్ని అడిగే విషయం కాదంటూంటే.'

'నాకేం ఫరవాలేదని స్పష్టంగా చెబుతూంటే.'

'ఏమండోయ్, మమ్మల్ని ఇలా అల్లరిపెట్టడం మీకేం బాగులేదు.'

'ఎన్నాళ్ళ స్నేహమో, ఇన్నాళ్ళకి మళ్ళీ కలుసుకునే అవకాశం కలిగింది. ఆడాళ్లం. అన్నీ కలిసిన వాళ్ళం. అనేకం ఉంటాయి మాకు. మమ్మల్నో నెలపాటు ఒదిలెయ్యవయ్యా అంటే ఇలా మధ్య మధ్యని కలుగుజేసుకుని అల్లరి పెట్టడం మీకు మాత్రం ఏమైనా బాగుందా?'

అన్ని విధాలా బరితెగించిన ఇంతటి మాటకారితో చమత్కారితో ఇంకెలా కొనసాగించేది! ఈ కబుర్లూ ఈవిడగారి ప్రవర్తనా చూస్తూంటే రెండ్రోజుల ప్రభావంతోనే మాటలకేనా ఆస్కారం లేకుండా చేసిందే' ఏకంగా నెల్లాళ్ళపాటు దీన్నిక్కడ ఉణ్ణిస్తే ఇక శాశ్వతంగా నేను మా ఆవిడకి దూరమైనట్టే! సెక్సుకి మనస్సే ముఖ్య కేంద్రం అయితే మనస్సు అనేది ఆడా మగా తేడాకి అతీతం కాబట్టి', శృంగార జీవితానికి లింగ భేదంతో పెద్దగా అవసరం ఏముంటుంది! ఈ దౌర్భాగ్యురాలు ఆ అమాయకురాలికి ఏ కొత్త పాఠాలు బోధిస్తోందో! ఇదెక్కడి 'లెస్బియనిజమ్' వచ్చిపడిందిరా తండ్రీ కొంపలో!

ఏదో వంక పెట్టి నిమిషాల మీద ఈ వాసంతి ముండని ఇల్లు దాటించెయ్యాలని ఆ క్షణమే అతి తీవ్ర నిశ్చయాని కొచ్చింది నా మనసు. అదృష్టవశాత్తూ ఆ అయిదో రోజు మా ఆఫీసు ఆడిటర్ల బృందం హెడ్ ఆఫీసుకి తరలిపోయింది. అప్పటికే ఆలస్యమైన మా జీతం ఆ మర్నాడే ఇచ్చేశారు. ఆ క్షణానికి ఎందుకో నాకే తెలీదుగాని 'తాత చావుబతుకుల్లో ఉన్నాడనే' అందరికీ తెలిసిన అబద్ధపు మిషతో వారంరోజులు శలవు గ్రాంటు చేయించుకుని ఎన్నెన్నో స్కీములతో ఇల్లు చేరాను.

ఇల్లు చేరే సరికి వాసంతి ఇంట్లో లేదు!

ఊళ్ళోనే లేదట!

నేను నోరు విప్పకుండానే మా ఆవిడ ఏకరువు పెట్టింది.

'దానికి నా మీద ఎంత అభిమానమో తెలుసుకోకుండా అనవసరంగా వాసంతిని కంటగించుకున్నారు. నాలో మార్పొచ్చిందేమో గాని ఇంకా నిన్నా మొన్నా మా సకినేటిపల్లిలో మేమిద్దరం జటపటాలు వేసుకు తిరుగుతున్నట్టే స్వచ్ఛంగా ఉంది దాని మనస్సు. ఈ నాలుగు రోజులికీ నా కెన్నెన్ని కొత్త విషయాలు చెప్పిందో" "చెప్పదూ. చెప్పే ఉంటుంది. కాపరంలో (కన్) నీళ్ళు పోద్దామని కృతనిశ్చయంతో వచ్చిన మనిషి ఎన్నయినా చెబుతుంది. చెప్పడమేం ఈపాటికి ఎన్నో నేర్పే ఉంటుంది. ఇంతకొద్ది టైములో ఎంత గాఢ ముద్రవేసిన దాని పట్టు నుంచి నిన్నెలా దక్కించుకోడమో ఏమిటో" -- అనుకున్నాను కసిగా.

'దాని ఊసెత్తుతేనే మీరలా గంటు మొహం పెట్టుకుంటే నేనెలా చచ్చేది! ఇల్లాలి నైనంత మాత్రాన నేనేం అకస్మాత్తుగా వయసు మీదపడి అమ్మమ్మని అయిపోలేదు కద! ఎల్లకాలం పెళ్ళికాని అమ్మాయిలా కనపడాలని 'అందచందాలలో కిటుకులట' అనేకం మప్పింది. అలా అయితే మీకూ

లాభమే కద!'

గొప్ప లాభమే. ఈ నాలుగు రోజులకీ లాభం గూబల్లోకి తెచ్చి సంసారం ఓ కొలిక్కిచేర్చింది. దీని సాయంసంతకెళ్ళిరి అనుకున్నా.

"ఈఒక్కజెడ దరిద్రమేమిటే ఇంత జుత్తు ఉంచుకుని!" అంటూ రెండుజెడలు వేసింది. ఈ 'మధ్య పాపడి ఏమిటో ముసలి ముత్తయుదులాగ!' అంటూ షోగ్గా పక్కపాపిడి తీసింది, చెవుల దిద్దులు తీయించేసి బలవంతాన రింగులు పెట్టించింది. 'ఈ మారు పయిట ఏమిటే తల్లీ ఏదో తప్పుచేసిందాన్లా' అంటూ జానెడు పైటకంటే ఎక్కువేస్తే పళ్ళు రాలకొడతానంది. "ఇలాంటివి మీరు ఒక్కటంటే ఒక్కటైనా చెప్పారా ! ఎంతో శ్రద్ధ తీసుకుని అది నన్ను 'జూలీ'లో లక్ష్మి తయారుచేస్తే మీకేం తీపు దిగదీసిందా! ఇంతకీ అది సిటీకి ఎందుకువెళ్ళిందనుకున్నారు? బ్యూటీక్లినిక్‌లో తెలిసిన ఫ్రండుందిట కన్సల్టేషన్ కోసం వెళ్ళింది. రాత్రి తిరిగొచ్చేస్తుంది, ఎవరి కోసం అనుకున్నారు! నా కోసం నా తలవెంట్రుకల మెత్తదనం, తేనె రంగూ చాలా అరుదైనవట. ఇలాంటివి వంకీలు తిప్పఢం సాధ్యమో కాదో శాంపిల్ తీసుకెళ్ళింది. పనిలో పని అని చేతిగోళ్ళు కూడా పొట్లం కట్టి పట్టికెళ్ళింది, తగిన నెయిల్ పాలీష్ షేడ్ ఎంత ట్రైచేసినా ఇక్కడ దొరకలేదు మరి. రాత్రికొచ్చేస్తానని మరీ మరీ చెప్పి వెళ్ళింది. ఈలోగా మిమ్మల్ని ప్రయాణం పెట్టుకోమంది.'

'ఆడది తన ప్రాణంకన్న ప్రేమించే ఒకే ఒక వ్యక్తి ఎవరు?' అని ప్రశ్నిస్తే "ఇంకెవరు? అద్దంలో తన ప్రతిబింబమే!' అని జవాబు చెప్పారుట. ఈ సత్యాన్ని వాసంతి ఎంత చక్కగా ఎక్స్ప్లాయిట్ చేసుకుంది! ఇంతగా ఈ వెర్రిదాని గుండెల్లో స్థిరనివాసం ఏర్పరుచుకున్న ఆవిడ ప్రభావానికి విరుగుడు సూచించగలడు! ఏ దేవుడు! దేవుళ్ళ శక్తి ఏనాడో సన్నగిల్లి యీ రోజుల్లో దెయ్యాలే రాజ్యమేలుతున్నాయి.! దెయ్యం అనే మాట రాగానే దాని పెంపుడు కూతురు లాంటి చిల్లంగి తల్లి స్ఫురించింది. వెంట్రుకలూ, గోళ్ళూ! ఇంకేం! నా బుర్ర అతిచురుగ్గా పనిచేసి ఆపద్ధర్మం బోధించింది. మాధురిని అతి దగ్గిరగా పిలిచి మనసు నాటేలా అతి నెమ్మదిగా బ్రెయిన్ వాష్ చేశాను. 'మీ ఫ్రెండుకి నీకైపోయినా ఇంకా పెళ్ళి అవలేదు. వాళ్ళక్క పెళ్ళికుంది గనక ఇప్పట్లో ఆ అవకాశమూలేదు పచ్చగా నీ సంసారం సాగుతూంటే చూడలేక చిచ్చుపెడదామని వచ్చింది మీ వాసంతి. మనం నమ్మం గాని చేతబడి ఏలుబడి చాలా ఎక్కువగా వుంది. ఎవరికి చిల్లంగి పెట్టాలనుకుంటామో వాళ్ళ వెంట్రుకలూ గోళ్ళూ కడుపులో పెట్టి గుడ్డబొమ్మచేసి శ్మశానంలో మంత్రంతో పాతేస్తే ఇక ఆ శాల్తీ అక్కడితో సరి. సిటీలో భైరవయ్యని కనుక్కోడానికే ఆవిడ వెళ్ళుండాలి. అందుకే తిరిగి వచ్చేసరికి నన్ను పొమ్మంది సరేలే. నేను ఇవాళ కోణార్క్ అందుకుంటున్నాను. దేవుడ్నే నిన్ను రక్షించాలి."

'నేనూ మీతో వస్తానండీ' అంది మాధురి ఒణుకుతూ అంతగట్టిగా నన్నెప్పుడూ పట్టుకోలేదు. అంత గాఢంగా ఈ మధ్య నేను కౌగిలించుకోలేదు కూడా నేనావిణ్ణి, ఇద్దరం అర్జంటుగా గదిలోకి పరిగెత్తి తలుపేసుకున్నాం!

(యువ మాసపత్రిక)

# శీలం చిరునామా

28



**శేషాద్రికి** అది దొరికినట్లే దొరికి చేజారిపోడం ఇది మొదటిసారికాదు. మొట్టమొదట అతనికి కలిగిన అనుభవం వారి వంశానికి మూల పురుషులు అయిన శ్రీమాన్ రామానుజయ్యం గారి విషయంలో. తెలిసిన బంధువులే కాక పెళ్ళామూ పిల్లలూ కూడా ఆయన్ని నెత్తిమీద పెట్టుకునేవారు. ఎవరికి ఏ ఆపదవచ్చినా తోచిన సాయం చేసేదాకా విల విల లాడిపోయేది ఆయన హృదయం. 'సచ్ఛీలుడు అంటే ఈయనే!' అని శేషాద్రి అనుకునే రోజుల్లోనే 'ఛిఛ్ఛీ!' అనవలసిన ముక్కఒకటి అతని చెవిన పడింది. ఎల్.ఎమ్.పీ మాత్రమే అయిన ఆ సామాన్య గృహస్థు అంతటి సంపన్నుడు ఎలా అయాడో పట్టి యిచ్చే వార్త అది. ఎందరు పెద్ద డాక్టర్లని సంప్రదించినా విజయపురి జమీందారిణికి గుండెపోటు తగ్గకపోతే వీరి హస్తవాసి మంచిదని తెలిసి రామానుజయ్యంగారిని పిలిపించుకుందట. ఆ తర్వాత ఆరునెలలు దాటకుండా విజయపురి జమీందారు గుండెపోటుతో మరణించారుట! వెండి బాల్చీల మొదలు బంగారు జడలవరకు కోటలో ఓ వంతు సరుకుతో వీరిల్లు నిండిపోయిందిట.

శేషాద్రి 'ఇది నిజమా!' అని ఓ నమ్మకస్థుడి దగ్గిర ఆరా తీశాడు. 'అయితే నేం, కాక పోతేనేం ... నిప్పుకాని ఆయన మనిషికాదు. ఆ మాటకి తిరుగు లేదనుకో!' అని కచ్చితంగా చెప్పేశాడు. 'ఏమిటీ తిరకాసు!' అని ఎవరి దగ్గిరో గునిస్తే ఎక్కణ్ణుంచి విందో అతని మామ్మ కస్సునలేచి, 'ఆడ కూతుళ్ళం. ఏ నీడ చాటునో తలదాచుకోవలసిన పువ్వులం. కట్టుకున్న వాడితో ఖయిదు తప్పదు మాకు. తిరగడం మరిగిన తుమ్మెదల్లాంటి మొగమహారాజులకి అదో తప్పా ఏమిటి శేషూ!' అని కొట్టి పారేసింది.

తుమ్మెదల్లో మొగవే కాకుండా ఆడవి కూడా ఉంటాయని రామసుబ్బమ్మని బాగా గమనిస్తే గాని శేషాద్రికి తెలిసిరాలేదు. అతనికి పద్నాలుగు ఏళ్ళు వచ్చేదాకా ఆవిడ వాళ్ళింట్లో వంటమనిషిగా పని చేసేది. ఎంతో రుచిగా శుభ్రంగా చేసేది. పగలంతా ఇంట్లో ఉండి అన్ని పనులూ చూసుకునేదిగాని ఇలా రాత్రి టంగు టంగు మని హాల్లో గోడ గడియారం పదీ కొట్టిందో చెంగు చెంగుమని ఆవిడ వీధి గుమ్మం దాటుతూ ఉండేది. 'అబ్బా, యింతమందిలో పడుకుంటే నాకు సిగ్గు బాబూ. వేరే గదిలో పడుకుంటే గాని నాకు నిద్రపట్టదు' అనేది. శేషాద్రీ వాళ్ళ యింటికి పెరటివైపు వీధిలో ఓ గది అద్దెకు తీసుకుని అక్కడికి వెళ్ళిపోయేది. బాగా పొద్దెక్కిపోయినా రాకపోతే ఆవిణ్ని పిలుచుకురాడానికి ఓసారి శేషాద్రి ఆ గదికి వెళ్ళేడు. 'ఇదేమిటమ్మా ఇంత పెద్ద పందిరిమంచం ఈ గదిలో!' అని అడిగితే ఆమె ఫకాలున నవ్వడం అతనికి ఎప్పటికి గుర్తుంటుంది. అదే కాదు, దానితో లంకె ఉన్న మరో సంఘటన కూడా అతను ఎప్పుడూ మరచిపోలేడు. ఓసారి వాళ్ళు యింటిల్లిపాదీ ఊళ్ళో ఉన్న చుట్టాలింటికి పెళ్ళి భోజనాలకి వెళ్ళేరు. రామసుబ్బమ్మకి ఇల్లు అప్పచెప్పి వెళ్ళేరు. రాత్రికి గాని రామని చెప్పి. భోజనాలవగానే శేషాద్రి ఒక్కడూ మాత్రం ముందు వచ్చేశాడు. ఈవిడ ఏం చేస్తోందో చూద్దామని యింటిగేటు చప్పుడవకుండా తీసి సందులోంచి పెరట్లోకి వచ్చాడు. చూస్తే ఏముంది. ఈవిడగారు బాత్‌రూంలో కూచుని, ఆవాసన జన్మలో మరచి పోగలడా, యింతింత యింగువ ముద్దలు మింగుతోంది! 'ఇదేం పని సుబ్బమ్మా!' అంటే తుళిక్కిపడి యిటు తిరిగి ఎందుకో అడగవద్దనీ ఎవరితోనూ చెప్పవద్దనీ అతని చేత ఒట్టు వేయించుకుంది. కళ్ళనీళ్ళు తుడుచుకుంది. ఆనాటి ఆ నవ్వుకీ ఈ కన్నీళ్ళకీ చాలా దగ్గిర సంబంధముందని బాగా పెద్దయ్యాక గాని శేషాద్రికి బోధపడలేదు!

స్వభావ రీత్యా ఏకాంత జీవి అయిన శేషాద్రికి, చాలావరకు, ప్రశ్న వేసుకునేదీ జవాబు చెప్పుకునేదీ తనకు తనే. ఆ రోజులు గడిచిపోయాయి. ఇప్పుడు ఆ రామానుజయ్యం గారు కాని, రామసుబ్బమ్మగాని లేరు. కాని వారు చిన్నప్పుడే తనలో ఏర్పరచిన యింప్రెషన్స్ మాత్రం ఎప్పటికీ మరచిపోలేక పోయాడు శేషాద్రి. తన కుటుంబం వాళ్ళకి రామానుజయ్యంగారి రాణివాసపు రాసక్రీడలు స్పష్టంగా తెలిసినా ఆయనని గొప్పవాడుగా గౌరవించడం మానలేదు. రామసుబ్బమ్మ రాత్రి రహస్యాలు, తెలీదనుకోడానికి ఎలాంటి ఆస్కారమూ లేకపోయినా, చక్రాంకితులైన తమ యింటి అతి నిష్ఠాపరుల్ని సహా అవి అట్టే బాధించినట్టులేదు. ఎందుచేత? ఇవి నీతికీ నియమానికీ గీటురాళ్ళు కావా, చూసీ చూడనట్టు తనవాళ్ళు ఎందుకూరుకున్నట్టు! శీలానికి విలువే లేదా? దాని ఎడ్రసు ఎక్కడట?

శేషాద్రి ఉద్యోగస్థుడయాడు. వివాహితుడయాడు. గంపెడు పిల్లల తండ్రి అయాడు.

అంతరంగికులుగా ఎవర్నీ తన మనసు గుర్తించకపోయినా అసంఖ్యాకులు తారసపడ్డారు. అతని జీవనయానంలో ఏమయినా అతను ఎదురు చూస్తున్న ఎడ్రసేమిటో ఎవరూ చెప్పలేకపోయారు. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యలచేత ఏ రోజుకారోజు ఏడిపించే ఏక పత్నీవ్రతులూ పబ్లిక్‌గా పదిమందితో తిరుగుతున్నా ప్రతి ఒకరిచేతా 'భళా!' అనిపించుకునే భాగ్యశాలురూ 'ఏమంటావ్?' అని వెక్కిరిస్తున్నారు కూడా. ఉన్నవాళ్ళు చాలక 'నా మాటేమిటి మరి?' అంటే మీనాక్షి అతని మనసులో తిష్టవేసుకు కూచుంది.

శేషాద్రికి మీనాక్షి మేనకోడలి వరస. అంటే అతని చెల్లెలు కామేశ్వరికి సవతి కూతురన్న మాట. శేషాద్రి చెల్లెలు కామేశ్వరికి, కడసారపు పిల్ల అవడంచేత. ఏమంటే అది చెల్లి తీరాలనే మూర్ఖత్వం బాగా అబ్బింది. వచ్చిన ప్రతీ సంబంధమూ కొట్టి పారేస్తూ పెళ్ళి వయసు దాటిపోయే స్థితికి చేరుకుంది. ఆఖరికి పదేళ్ళ సవతికూతురు మీనాక్షిని కూడా భరించవలసి వచ్చింది. ముప్ఫై అయిదేళ్ళ రెండోపెళ్ళి మొగుడు ముకుందంతో పాటు!

చెల్లెలు పెళ్ళికి సకుటుంబంగా వెళ్ళిన శేషాద్రి మనసులో మొదట్లోనే ఆ పదేళ్ళ అమ్మాయి బలమైన ముద్రవేసింది. బలంగా ఆరోగ్యంగానే ఉంటుంది గాని మీనాక్షి నలుపులోనే జమ. పైగా ఇక జీవితంలో చెరగనంత లోతుగా ఏర్పడిన, మొహంనిండా స్ఫోటకం మచ్చలు. ఆడపిల్ల అయినా అనాకారి అయినా, తండ్రి మరో అమ్మని తెస్తున్నా ఆ పిల్లకి చీమకుట్టినట్టులేదు. ఆ చురుకు తనం ఆ నవ్వుమొహం ఓ మారు చూసిన వాళ్ళు మరచిపోడం కష్టం. అన్ని పనులూ తనవే. ఆ పెళ్ళి పందిరే తను. అలా తిరిగింది మీనాక్షి. 'కామేశ్వరి సవతికూతుర్ని సరిగ్గా చూస్తుందా?' అని అనుమానించిన వాళ్ళకి ఆశాభంగమే అయింది. మీనాక్షి మంచితనమేకాక ఏడెనిమిదేళ్ళపాటు కామేశ్వరికి పిల్లలు పుట్టకపోడం కూడా దానికి కారణం కావొచ్చు. ఆ తర్వాత నాలుగేళ్ళలో ఆవిడకి వరసగా ముగ్గురు పిల్లలు. ఇంకెంత సంతానం వృద్ధి అవునోగాని ముకుందం మూడ్రోజుల విషజ్వరంతో కన్ను మూసేశాడు.

చెల్లెలికి తలచెడితే ఏకంగా యింటికి తీసుకురాడానికి శేషాద్రికి వెనక ఆస్తి అంటూ ఏమైనా ఉంటే అది అపరిమిత కుటుంబమే. ఏదో మొక్కుబడికి, తెలిసిన నలుగురూ నాలుగు అక్షింతలూ వెయ్యకుండా, తను చెయ్యవలసినవేవో నామకః పూర్తిచేసి కామేశ్వరిని సాగనంపేశాడు శేషాద్రి. అప్పుడు మరోసారి మీనాక్షి మన స్తత్వాన్ని పరిశీలించే అవకాశం కలిగింది అతనికి. అప్పుడేకాదు. పెద్దవుతున్న సంసార తాపత్రయం వల్ల ఎంత తీరిక చిక్కకపోయినా, శేషాద్రి ఆమె గురించి అలా భోగట్టాలు చేస్తూనే ఉన్నాడు. మరి అతన్లో ఎవరిదగ్గిరా లేనిది ఆ అమ్మాయికేం కనపడిందో ఆ పెళ్ళి పందిట్లోనే 'మామయ్య గారూ!' అంటూ ఒక్కఓణం వదిలేదికాదు. శేషాద్రి మీనాక్షి కంటె కనీసం ముప్ఫైఏళ్ళు పెద్ద. పైగా ఎవరితోనూ ఆటే మాట్లాడక ఓ మూల కూచునేరకం. 'మా పెద్దవాడికి దీన్ని చేసుకుంటేనో!' అని అప్పుడే అనిపించింది. అతనికి. దానికి ఏ పదహారో వచ్చాకే ఆ మాట పెళ్ళాం దగ్గర అని చూశాడు శేషాద్రి. 'ఇంటికి పెద్ద కొడలుగా గొప్పచక్కని చుక్కనే ఎంచారే! పోనీ అంత ఉద్ధరించాలంటే మీ బావచేత తమరే మరోమారు కాళ్ళు కడిగించు కోరాదూ!' అని ఆవిడ అసంధర్భపు హాస్యం చేసి ఆ తలంపుని మొదట్లోనే తుంచేసింది. ఈ అనవసరపు ఈసడింపు వల్ల మీనాక్షి పట్ల మొగుడిసానుభూతి మరింత పెంచిందని ఆవిడ ఎరగదు.

శేషాద్రిలాంటి సాహసంలేని వాళ్ళనిచూసి తప్పుపట్టి ప్రయోజనం ఏమీ లేదు. మనసు ఉండడం అతని నేరమూ కాదు. మీనాక్షిని ఎప్పుడు చూసినా ఒకరి సాయం కోరేదిగా అతనికి కనిపించలేదు. 'మీరు లోపల పడుకుంటారా, మీ మడతమంచం వీధిలో వెయ్యమన్నారా మావయ్యా?' ఇలా యింకొకరికి తనే సాయంచేసేలా కనిపించే మీనాక్షి ముందు ఎంతో చిన్నవాడిలా ఫీలయ్యేవాడు శేషాద్రి.

కామేశ్వరి ఒక్కర్తే చెల్లెలు కావొచ్చుగాని ముగ్గురక్కలు ఉన్నారు. శేషాద్రికి, బండెడు బలగం వాళ్ళది. ఊపిరి తీసుకోకుండా చెయ్యడానికి నిజానికి అతని కుటుంబ సభ్యుల సంఖ్య చాలు. అయినా ఇంతమందిలోంచి మీనాక్షిని ప్రత్యేకించి ఎంతో ఆప్తురాలిలా భావించడం, అది అలా ఏళ్ళ తరబడి కొనసాగడం ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుందతనికి ఓ ఊళ్లో లేరు. ఉత్తరాలు రాసుకోరు. మరి యింతటి సాన్నిహిత్యానికి కారణం ఏమిటో! రుచీ పచీలేని సంసార జంజాటనలో పడిపోయిన శేషాద్రికి, మీనాక్షి తలపే కొండంత బలం యిచ్చేదేమోమరి! ఏదైనా పనిమీద వాళ్ళ ఊరువెళ్ళి వాళ్ళింటికి వెడితే ఆ యిద్దరి కబుర్లకీ యింక అంతూ దరీ అంటూ ఉండేది కాదు, 'అలా పైకి పెద్దవారిలా కనిపిస్తాడు గాని అమ్మో, మా మావయ్య ఆలోచనలు ఎంత పడుచువో!' అనేది మీనాక్షి. 'ఆలోచనలతోనే ఆగిపోయిందమ్మా మీ మావయ్య బతుకు' అన్నాడు శేషాద్రి 'ఫరవాలేదులే... నువ్వు మెచ్చిన మీ మేనకోడలు వేస్తున్న ముందడుగు ఎప్పుడో అప్పుడు వీ కంటపడక పోదులే' అంది నవ్వుతూ.

ముకుందం బతికున్నప్పుడైనా ఇంట్లో వాళ్ళ మంచిచెడులు పట్టించుకున్నట్టు ఎక్కడా సాక్ష్యం లేదు. అసలే బేఖాతరు మనిషి. పైగా పిల్లలు కూడా పుట్టుకురావడంతో ఆఖరాఖరికి ఉన్న కాస్త బాధ్యతా చొక్కా ఊడదీసి మేకుకు తగిలించినట్లు నిష్పూచీగా తిరిగినట్టున్నాడు. ఆఖరికి చొక్కా ఉంచేసి చెక్కేశాడు. చెక్కు చెదరడ మన్నది మీనాక్షి ఎరగని గుణం. అంత చాకిరీతో ఎప్పుడు చదివేదో గ్రాడ్యుయేట్ అయింది. ఆఖరికి పిన్నికయినా పట్టింది గాని, కన్న తండ్రి అయినా తన పెళ్ళిమాట ఎత్తకపోతే 'దానికే ముంది' అని సరిపెట్టుకుంది. చెట్టంత తండ్రి నిమిషాల మీద వెళిపోతే తట్టుకుని, ఉద్యోగంలో చేరి 'ఏడవకండి నేనున్నాను' అని ఆ నలుగురికీ తనే దిక్కుగా నలిచింది. 'ముందడుగు' అంటే ఏముంటుంది గనుక! అనుకున్నాడు శేషాద్రి. కాని ఆ మధ్య వాళ్ళఊరెళ్ళినప్పుడు కంట బడ్డ ఆ దృశ్యం అతని అణువణువునా మంటలు రేగింది. రక్త సంబంధం ఉన్న యింటిల్లిపాదినీ యివతలికి నెట్టి తన మనసు ఎందుకు పరుగులు తీసిందో అప్పుడే బోధపడింది, అతనికి 'జీవితం ఎన్నో కష్టాలు పడింది. ఎదురీది ఎన్నెన్నో సాధించింది. ఎంతో ఆశ కల్పించింది. ఇందుకేనా!' అని గిలగిల కొట్టుకుంది అతని మనసు, రామానుజయ్యంగారూ, రామసుబ్బమ్మా కల్మషం చేసి పారేసి తన అంచనాలతో మీనాక్షి అయినా కాంతి రేఖగా నిలబడుతుందనుకున్నాడు. ఇన్నాళ్ళూ మంచి ముత్యంలా గడిపింది. మరో నాలుగు రోజులు కళ్ళు మూసుకుంటే కన్నకాపరమేశ్వరిలా కాలం వెళ్ళిపోదూ! ఇలాంటి దరిద్ర గొట్టుపని చేసినందుకు ఏం చెయ్యాలి?

పిల్లలు పడుకున్నారు. కామేశ్వరిని హరికథకి దిగబెట్టి సినిమాకి బయలుదేరాడు. టిక్కెట్లు దొరికేయి కావు. తీరా యింటికొస్తే కంటపడిన దృశ్యం యిదీ! మేడమీద గదిలోంచి వస్తున్న ఆ స్టూడెంటు కుర్రాణ్ణి స్పష్టంగా తనకళ్ళతో తను చూశాడు. మెట్లమీద సగందాకా వచ్చి మీనాక్షి

సాగనంపింది కూడాను.

ఓ పది నిమిషాలు ఎలాగో ఉగ్గబట్టుకుని ఊరుకున్నాడు శేషాద్రి. ఇంకా ఆలశ్యం చేస్తే చెల్లాయి హరికధ నుంచి వచ్చెయ్యవచ్చు. ఈ పాపిష్టి కబురు దాని చెవిన పడడం కూడా ఎందుకు. ఉన్న కష్టాలు చాలకనా' అని ఆరంభించాడు. ఆరంభించడమేమిటి, విజృంభించాడు; విరుచుకు పడ్డాడు.

మీనాక్షి తను చేసిన పనిని కాదనలేదు. కళ్ళుదించి తలవంచుకు కూచోలేదు. శేషాద్రి 'దులపడం' పూర్తిగా నెమ్మదిగా భరించింది. మధ్య మధ్య మాట్లాడవద్దని హెచ్చరికలాంటి లభ్యర్థన చేస్తూ స్పష్టంగా మొదలెపెట్టి, తొణుకూ బెణుకూ లేకుండా నిర్మొహమాటంగా మధ్యన ఎక్కడా తెగకుండా ఆపకుండా చెప్పదలచుకున్నవన్నీ పూర్తి చేసింది.

'మావయ్యా... ముందుగా ఒక్కమాట. ఎంత తెగించిన మనిషనయినా యీ విషయం నీతో ఎలా చెప్పాలా అని... కొట్టుకు పోతున్నాను. యాక్సిడెంటల్‌గా అయితేనేం... అది నువ్వు తెలుసుకున్నావు గనుక ఇక జరిగింది చెప్పడానికి నా కెలాంటి సంకోచమూ అనవసం.

ఇంతకీ అద్దానికి ప్రతిబింబించే శక్తి ఉందా ఊడిందా అనేది ముఖ్యంగాని అది చిన్నదా పెద్దదా అనేది కూడా అప్రస్తుతం. అందుకే నీ ముందు నా సంగతంతా బయట పెట్టడం.

ఇంకోమాట, వ్యక్తిత్వం గల ఏ మనిషికయినా తనకు తనే సలహాదారూ, సర్కారు వారూ! అవునా? అయినా యింత శ్రమ తీసుకుని నా మీద యింతగా ఆయాసం వచ్చేదాకా కేకలు వేశావు ఎందుకు? అదిగో ఆ అనుబంధమే ఎటువంటి అరమరికలు లేకుండా నన్ను నీ ముందుబయట పెట్టకునేలా చేస్తోంది. ఎలాంటి వారికయినా సాటి మనిషి మీద సానుభూతి చూపించగల శ్రోత కావాలి. నీ కంటె నాకెవరున్నారు చెప్పుకోడానికి? నేనేదో తప్పు చేశాననీ నా పొజిషన్ జస్టిఫై చేసుకోవాలనీ కాదు సుమా యీ ప్రయత్నం, కేవలం నువ్వు వినాలనీ అంతే.

నాన్నపోయిన రెండు నెలలకి కాబోలు ఉద్యోగంలో చేరాను. దుక్కలాంటి మనిషి ఒక్కసారి మాయమయిపోతే ఆ షాక్‌కి పిన్ని తట్టుకోలేక పోయింది. నీకు వేరే చెప్పనక్కర్లేదు. పిల్లల్ని కూడా నిరాదరించేంతగా పిచ్చెత్తిపోయింది. ఈ లోకంతో సంబంధం లేనంతగా స్నానాలూ జపాలూ ఉపవాసాలూ అలా తయారయింది. దాన్తో ఉన్న తోడు కూడా ఊడ్చుకు పోయి ఊబిలోకి దిగినట్టయింది నా పని. ఉద్యోగం చేసుకుని ఉస్సురని యింటికొస్తే ఇన్ని చల్లని మంచినీళ్ళిచ్చే వారు లేరు సరిగదా యిల్లెగిరిపోతున్నట్లు గోల చేస్తూ యింతింత పిల్లలు, ఎదురు చూస్తు యింటెడు పని! శరీరంబలం ఉంది గనుక శ్రమకి వెనుదియ్యక ఎలాగో పూర్తిచేసే దాన్ని. కాని మనసుకి కలిగిన అలసట తీరేలా ఎప్పుడూ లేంది ఓ పట్టాన నిద్రపట్టేది కాదు రాత్రి. మనకి రెండు దాకా నిద్రపట్టలేదని దయదల్చి ఏ పదింటికో ఉదయించడుగదా మర్నాడు సూర్యుడు! పోనీ పొద్దుట పనేనా చూసుకొనేదా పిన్ని? ఊహు ఆ పూట గదిలోంచి యిక యివతలి కొచ్చేది కాదు. ఇల్లెప్పుడు చక్కదిద్దను; ఆఫీసుకెప్పుడు తగలడను, ఎమర్జన్సీ ఒకటికదా సొద!

ఈ ఉద్యోగం ఈ యిల్లు ఈ పిల్లలు ఈ పిన్ని యిందులో ఏ ఒకటీ నావికావు. నా కోసం కావు. కాని వీటన్నిటితోనూ; ఎవరి బలవంతం తోనూ కాదు సుమా. నా మటుకు నేనే వేసుకున్న ముడి ఒకటి ఉంది. అవి నేను గాఢంగా ప్రేమించిన నా జీవితం. జీవితం లక్ష్యం జీవించడమే.

ఇవాళ నీకు కలిగిన తృప్తే రేపు నువ్వు జీవించడానికి పెట్టుబడి. కాని ఇది కూడా యిప్పుడు నాకు దక్కకుండా పోతున్న దెందుచేత? ఆఫీసులో తెచ్చిన జీతంతో పాటు అక్కడ తిన్న చివాట్లు కూడా యింట్లో యిచ్చే నీచత్వానికి నేనెందుకు దిగజారిపోతున్నాను? నన్ను నేనే అసహ్యపడే ఈ దుస్థితి నుంచి రక్షణ లేదా నాకు?

అనాకారి అయినంత మాత్రాన ఆరోగ్యం వయసూ ఉన్న ఆడదానికి మగవాడి సందేశాలు అందకూడదని ఏం లేదు. సుందరులు సులభసాధ్యలు కారు గనక అనాకారులవైపే మొగవారి మొగ్గు! దేశంలో ఫామిలీ ప్లానింగ్ ప్రచార ధర్మమా అని ఏ ఆపదలూ రాకుండా ఎలా సుఖపడాలో నేటి యువతకి స్పష్టంగా తెలుసు. ఇన్నీ ఎరిగినా సంప్రదాయాపు ఒత్తిడికి ఒకవైపు. సహజ వాంఛల అలజడి మరొకవైపు. ఇన్నాళ్లూ ఎవడేం వెకిలి వేషాలు వేసినా దవడ ఊడదీసేదాన్ని కాని యిప్పుడు నాలో ఏర్పడుతున్న న్యూనతా భావాన్నుంచి రక్షించుకోడానికి ఇది తప్ప గత్యంతరం లేకపోయింది. అందుకనే ఆ మధ్య ఇంటివారి పెద్దబ్బాయి చిటికె వేసి సైగ చేస్తే అడ్డు చెప్పలేక పోయాను!

మనసాన్నిహిత్యం మామూలు అంచనాలకి అతీతమైంది గనుకనే సిగ్గువిడిచి యిలా చెప్పగలుగుతున్నాను మావయ్యా! నిజానికి సిగ్గు పడవలసిందేమీ ఇందులోలేదు. ఎంత మొండి దాన్ని అయినా యీ పాడిబతుకు షాక్‌కి తట్టుకోలేకపోతానేమో అనుకున్నాను. ఓడిపోతానేమో అని బెంగపడిపోయాను. నేను బతకాలి. నలుగురికి దిక్కుగా నిలబడాలి. రోజు రోజూ పడ్డ శ్రమనుంచి నాకు విముక్తి కావాలి. మనిషిగా నిలబడాలంటే మనిషికి కావలసిన వన్నీ ఆలోచించి ఈ అనుభవాన్ని నామటుకు నేనే కోరుకున్నాను. ఏవిధంగానూ వెలుతురుకి అవకాశం లేని నాలాంటి కటువైన బతుకుల్లో యిలాంటి మృదువైన మధుర క్షణాలు అప్పుడప్పుడు అత్యవసరం మావయ్యా!'

మీనాక్షి చెప్పడం పూర్తయింది.

శేషాద్రి గబుక్కని లేచి గదిలోకి వెళ్ళి సంచీ అందుకుని ఇవతలికొచ్చేడు. ఎటువైపో చూస్తూ 'నేనిలా వెళ్ళిపోయానని కాముడితో చెప్పు' అంటూ గబగబా వీధిలోకి వచ్చేశాడు.

ఆమె చెప్పిన ఏ ముక్కా అతను మరచి పోలేడు, కాదనలేడు. అవుననడానికి కూడా అతనికి దమ్ముల్లేవు. అతనికి తెలిసింది ఒక్కటే. దొరికిందనుకున్న ఎడ్రసు యిక దొరక్కుండా పోయింది!

*(జయశ్రీ సంక్రాంతి ప్రత్యేక సంచిక, 1976)*



**శీలం చిరునామా**

# త్యాగమూర్తులున్నారు, జాగ్రత్త!




**సావిత్రి** గుండె దడదడలాడింది. మళ్ళీ రాంబాబు వచ్చినట్టున్నాడు. ఇదివరకు ఓసారి వాడు వచ్చి వెళ్ళినట్టు వింది. ఈసారి తన మొగుడికి ఏం నూరిపోస్తాడో? ఏ ఒడుదుడుకులూ లేకుండా ఎంతో హాయిగా తన కాపురం సాగిపోతోంది. ఏడాది గడిచింది గాని నిన్నో మొన్నో పెళ్లయినంత నిత్య నూతనంగా సాగిపోతోంది తన జీవితం. తన మొగుడు సుబ్బారావుకి తనంటే పంచ ప్రాణాలు. అనుభవించినవాళ్లు చెబితే వింది. వివరించినవాళ్లు రాసిపెడితే చదివింది. అంతేగాని ఓ మొగా ఓ ఆడా కలసి జీవించడంలో ఇంత కమ్మదనం ఉందని ఇదివరకు ఎరగదు తను. కర్మ కాకపోతే ఆ రాంబాబు బదిలీ అయి ఈ ఊరే రావాలా? తనూ రాంబాబూ ఇంటరుదాకా చదువుకున్నారని సావిత్రికి తెలుసుగాని ఎమ్మే రెండేళ్లూ వాళ్ళిద్దరూ క్లాస్‌మేట్స్‌ని ఎలా తెలుస్తుంది తనకి! తమ పెళ్ళికి రాంబాబు ఏదో ట్రెయినింగులో ఉండి రాలేకపోయాడుట. ఇప్పుడిలా వచ్చి తన పచ్చని కాపురంలో చిచ్చుపెట్టగలడని ఎప్పుడైనా అనుకుందా!

నుదుటను పట్టిన చెమట చీర చెంగుతో తుడుచుకుని ఇన్ని మంచినీళ్లు తాగి వేసిన తలుపుకి

మరింత దగ్గిరగా వచ్చి, బెదురుపాటుతో కూడిన ఆతృతతో వాళ్ల సంభాషణ రహస్యంగా వినజొచ్చింది సావిత్రి!

'కిందటిసారి వచ్చినప్పుడు మీ యింటి నిండా ఎవరెవరో ఉన్నారు. మీ ఆవిడ ఎక్కడికో వెళ్లిందని తెలిసి మరీ వచ్చాను, అప్పుడు. కాని అందరుండగా ఆ రహస్యం ఎలా చెప్పను? ఇప్పుడు తీరా వచ్చాక తెలిసింది. సావిత్రి ఇంట్లోనే ఉందని. అలా ఏ పార్కుకేనా వెళ్లి చెప్పుకుందాం పద!'

సావిత్రి నోట తడారిపోయింది.

'మనిషి ఎదుటలేకుండా చూసి విమర్శించడం నాకు నచ్చదు రాంబాబూ! పనులన్నీ చేసుకుని, ఏ పుస్తకమైనా పట్టుకుని అలా నిద్రలోకి జారడం సాధారణంగా సావిత్రికి అలవాటు ఈపాటికి పడుకుందో ఏమో, లేపి తీసుకురానా?'

సావిత్రి గుండె గిలగిల కొట్టుకుంది. బతికుండగా పోస్టుమార్టమా! అదైనా మనసుకా! అటు ఓనాటి ప్రియుడు, ఇటు కట్టుకున్న మొగుడు. వీరిద్దరి మధ్యా దోషిగా నిలబడ్డంకన్న స్త్రీకి శిక్ష ఉంటుందా!

'నే చెబుతున్నది నువ్వేం సీరియస్‌గా తీసుకున్నట్టు లేదు సుబ్బారావ్! నీ పెళ్లిమాటలు జరుగుతున్నప్పుడు నే నక్కడ లేకపోడంవల్ల వచ్చింది ఇదంతా. మిత్రుడికి ఇంత ద్రోహం జరుగుతున్నప్పుడు -- నా కేమాత్రం మాటగా అయినా తెలిసినా --- రెక్కలు కట్టుకుని వచ్చి ఈ అన్యాయానికి అడ్డుపడి ఉందును. శుభలేఖ అయినా పెళ్లి అయిపోయాక అందింది నాకు! అయినా పేరుకోసారి పెళ్లిచూపులకి వాళ్లింటికి వెళ్లేను గాని సావిత్రీవాళ్ల వాళ్ల పూర్తి భోగట్టాలు నాకేం గుర్తు! చాలా మామూలు పేరు కదా, సావిత్రి అనేది, మరెవరో అనుకున్నాను! తీరా ఆ మధ్య నువ్వు మీ పెళ్లి ఆల్బం చూపించేసరికి నా మతిపోయిందనుకో! అప్పట్నుంచి ఎప్పుడు నీకు అసలు సంగతి చెబుదామా అని కొట్టుకుచస్తున్నాను. లోపల ఎక్కడా చడీచప్పుడూ లేదు గనుక సావిత్రి పడుకుని ఉంటుంది. ఈ రెండు ముక్కలూ నీ చెవిని వేద్దామని నేను పనిగట్టుకు వస్తే, తనను లేపి తీసుకువస్తానంటా వేమిటి, నీకేం మతిగాని పోలేదు కద!'

తను కూచున్న చోటులోంచి మొగుడి మొహంచూసే అవకాశం లేదు సావిత్రికి. ఏం జవాబు వస్తుందో అని నరాలు తెగిపోయేటంత ఆందోళనతో చెవులు రిక్కించి వినసాగింది. కాస్సేపు గుండెలు పగిలిపోయే నిశ్శబ్దం. ఎందుకో గాని సుబ్బారావు జవాబు చెప్పలేదు. రాంబాబే కొనసాగించాడు:

'ఎలాగా జరిగింది జరిగిపోయింది గనక యిప్పుడు చెప్పి లాభం ఏమిటని అనుకోకపోలేదు. అందుకే మొదట్లో తటపటాయించాను. కాని ఎంతకాలం నుంచో ఎరిగిన మిత్రుడి నుంచి ఇంత ముఖ్య విషయం ఎలా దాచడమో నాకు బోధపడడంలేదు. అయిపోయింది ఎలాగా వెనక్కి తీసుకోలేము, ముందుగా అయినా తగిన కట్టుదిట్టం చేసుకుంటావని. ఒక్కటి మాత్రం నువ్వు గ్రహిస్తేనే, ఏదయినా నేను చెప్పేది. మీ కాపరంలో కలతలు రేపడానికి మాత్రం నేను రాలేదు. ఒప్పుకుంటావు కద?'

ఆ మాటకి అవునూ కాదూ అనలేదు కాని 'చెప్పు, చెప్పు. అంతా పూర్తి అయాక నా

అభిప్రాయం చెబుతాను' అనే మొగుడి కచ్చితమైన గొంతుక వినపడి త్రుళ్లిపడింది సావిత్రి. ఏవి వినకూడదని వెయ్యి దేవుళ్లని ప్రార్థించిందో, ఏయే విషయాలు మరచిపోయి, గతం ఖతంచేసి మరి వెనక్కి తిరగనక్కర్లేకుండా గడిపేద్దా మనుకుందో అన్నీ, ప్రతి ఒకటీ, ముక్క ముక్కా మరగకాచిన సీసం చుక్క చుక్కా పడినట్టు తన చెవిలో పడనే పడ్డాయి. అంతేకాదు. ఎవరికి తెలీకుండా ఉండాలని ప్రతిక్షణం తను ఆరాటపడిందో ఆ మనిషికి అని తెలియనే తెలిశాయి. అయినా తను యింకా బతికే ఉంది!

ఇప్పుడు కంటపడితే ఒళ్లు మండిపోతోందిగాని రాంబాబు అప్పటికీ ఇప్పటికీ అందగాడు. తెలుగులో వారపత్రికలూ, సినీమాలూ చూసి 'నీకు కాబోయే మొగుడు ఇలా ఉంటే బాగుణ్ణు' అని కన్నెపిల్లలందరూ కలలు గనే రూపానికి ప్రతిరూపం రాంబాబు. స్థిరమైన జీవితపు విలువలు కూడా కొన్ని ఉంటాయని ఈ ఏడాదిలో భర్త సహజీవనంలో ఎన్నో నేర్చుకుంది గాని, అంతకు ముందు సావిత్రి ఆలోచనలు వేరు. ఏవిధంగా చూసినా ఎదిగే ఆడపిల్లకి ఏదో ఓ రకం అన్యాయం చెయ్యడానికి ఎప్పుడూ రెడీగా ఉండే యీ సంఘంలో యింత కన్న గొప్ప ఆలోచనలకి అవకాశం ఎక్కడుంది గనక! బట్టీపట్టిన నాలుగు ముక్కలూ పరీక్షలప్పుడు చక్కగా కక్కగలిగితే పైమెట్టు చేరగలమనే ఒకే ఒక నీతి తప్ప, కాలేజీల్లో మాత్రం నేర్చుకొనేది ఏముంటుంది! తన ప్రసక్తి లేకుండా జరిగిన అనేకమైన పెళ్లి చూపుల 'అపరకర్మల్లో' 'ఇది జరిగితే బాగుణ్ణు' అని సావిత్రి ఆ రోజుకి పాపులర్‌గా ఉన్న దేవుణ్ణి మొక్కింది. మేడిపండులాంటి రాంబాబు బాహ్యరూపం చూసే. 'అన్నీ బాగానే ఉన్నాయి, జాతకాలు మాత్రం పడలేదు' అని వాళ్ళు రాసినప్పుడు మాత్రం సావిత్రి చాతకానట్టు ఊరుకోలేకపోయింది. పెళ్లవలేక చదివిస్తున్నారు గాని మామూలు సెంటిమెంట్సుని అధిగమించి బతికే సాహసం లేదు తన తల్లిదండ్రులకి. కాలేజీ ఫంక్షన్స్‌లో ఒకటి రెండుసార్లు రాంబాబుని కలిసి మాట్లాడి ఉండడం ఆమెకి మరింత చొరవ ఇచ్చింది. ఏం రాసిందో ఇప్పుడు సరిగ్గా ప్రతి ముక్కా గుర్తులేదుగాని అతనికి ఆ రోజుల్లో పంపిన ఉత్తరం సారాంశం ఎప్పటికీ మరచిపోలేదు. 'మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమించాను. తొలిచూపులోనే నా మనసుని దోచుకున్న -- నే ననేది పెళ్లి చూపుల మాట కాదు -- కాలేజీలో మీరు కంటపడిన రోజు నుంచీ -- మిమ్మల్ని ఆరాధిస్తూ వచ్చాను. నన్ను చూసుకోడానికి మా యింటికి వచ్చారంటే నా అదృష్టం తలుచుకుని గర్వించాను. పెళ్లి చూపులనాడు నేను మీకు నచ్చానని మీరన్నట్టు ఆ తర్వాత మా నాన్న చెబితే ఆకాశసీమలు అందుకున్నట్టు ఆశలల్లుకున్నాను. తీరా ఇప్పుడు ఎవరికీ పూర్తిగా నమ్మకంలేని ఏ జాతకాల వంకతోనో మీవాళ్ళు కాదంటే -- మీరు కూడా మౌనం వహిస్తే నేనేం కావాలి? మీ వాళ్లతో పోరాడి అయినా నన్ను మీదాన్ని చేసుకోకపోతే నే నెందులో పడాలి? నన్నెలా అనుగ్రహిస్తారో మేదే భారం' .... ఇంచుమించు ఇలా సాగి ఉంటుంది.

ఇప్పుడు మరి నాలుగు ముక్కలు జతచేసే చెప్పేడు రాంబాబు తన మొగుడికి. తలుపు సందులోంచి ఎంతో ప్రయత్నంచేసి చూసింది. ఉత్తరం చూపించినట్టు లేదు. ఏడాది అయిపోయింది. కాగితం ముక్క దాచడం కష్టం. రుజువు లేదు గనక మరిన్ని కల్పించి చెప్పడం సులభం.

'మొదట్నుంచీ ఆ కుటుంబానికి అంత మంచి పేరు లేదు. పెళ్లి చూపుల తర్వాత గాని మావాళ్లకి ఆ సంగతి తెలియలేదు. తీరా శీలప్రసక్తి తీసుకొస్తే ఏం బాగుంటుందని మా నాన్నగారు

జాతకాల మిషమీద దాన్ని తప్పించేశారు. ఎంత తెగించిన మనిషి కాకపోతే తల్లి చాటు పిల్ల ప్రేమలేఖలు నడిపిస్తుందా? ఇలా యిప్పటికి ఎన్ని కథలు నడిపిందో!....'

సావిత్రికి మొహం తిరిగినట్టయింది.

'నువ్వింతటి విలన్‌వని తెలియక, నీ పైపై మెరుగులకి భ్రమపడి అదే ప్రేమ అనుకుని నీలాంటి విషపురుగుకి మనసంతా అర్పిస్తూ ఓ ప్రేమలేఖ రాశాను, నిజమే. అంతకంటే మహాపరాధం లోకంలో లేదు. ఏది? కన్నెపిల్ల ప్రేమలేఖ రాయడం కాదు, నీలాంటి దౌర్భాగ్యుడితో జీవితం పంచుకోవాలనుకోడం. ఏనాడో నేను చేసిన పుణ్యాంకొద్దీ అది తప్పిపోయింది. ఇప్పుడు ఓ సహృదయుడి పంచన హాయిగా జీవితం వెళ్లబుచ్చుతూ ఉంటే నీకు బాధగా ఉందా? నే న్నీకు చేసిన అపకారం ఏమిటి రాంబాబూ?' అని అడిగింది మనసు. తన ప్రేమలేఖకి వెంటనే వచ్చిన రిప్లై లోనే ఉంది జవాబు.

తను లెటర్ పంపించిన పనిమనిషికే రిప్లై యిచ్చి పంపేడు రాంబాబు. 'సావిత్రీ! వెర్రెత్తించే నీ అందం ఓ యుద్ధనౌక లాంటిది. దాని ముందు నా స్టేచరు ఓ కాగితం పడవ లాంటిది. నన్ను లైక్‌చేసిన నిన్నెలా కాదనగలను! మనల్ని కాదనడానికి మన పెద్ద వాళ్లెవరు? రేపు రాత్రి మినర్వా టాకీసుకి ఫస్టుషోకని బయలుదేరు. అది విడిచిపెట్టగానే దాని ఎదురుగా ఉన్న మోడరన్ లాడ్జిలో రిసెప్షన్లో నా పేరు అడుగు. నేను బుక్‌చేసిన రూంకి నిన్ను డైరెక్ట్ చేస్తారు. ఇద్దరం కలసి ఒకటి అయే ఉపాయం ఆలోచిద్దాం -- ఆ సమయం కోసం ప్రతి క్షణం ఎదురుచూసే, నీ, రాంబాబు .... ఆ ఉడుకుతో ఆ దుడుకుతో తను తప్పకుండా వెళ్లి ఉండును, సమయానికి దేవుడు పంపించినట్టు తన క్లాస్‌మేటు రేవతి వచ్చి రక్షించకపోతే. ఆ రాంబాబు అప్పటికే ఎందరు ఆడపిల్లల్నో నాశనం చేశాడనీ వాడి దగ్గిరకి వెళ్లడంకన్న పులినోటిలో బుర్ర దూర్చడం మంచిదనీ ఎంతగా చెప్పిందో .... అయినా, అంత చక్కటి వాడిలో అంత టక్కరితనం ఊహించలేక .... ఆ జవాబులోని తీయతనానికి తట్టుకోలేక తనింకా వెడదామనే సిద్ధపడితే 'వెళ్లేవా, సర్వనాశనం కాకుండా తిరిగి రావు. అదో ప్రమాదభరితమైన దీపం. నువ్వు కీటకంలా పరుగుపెడుతూ ఉంటే చూసి చూసి ఊరుకోలేను నీ ఫ్రెండునై. ఇంట్లో పడున్నావా సరే సరి. లేదా, మీ వాళ్లని కేకెయ్యకమానను. ఆ పులివాత పడకుండా తప్పించాయి, నేనూ నమ్మేదాన్ని కాను. నిజానికి జాతకాలు ఎంత గొప్పవి!'

జాతకాలూ కాదు, సింగినాదాలూ కాదు, రేవతిలాంటి వాళ్లతో స్నేహాలు అన్నిటికన్న గొప్పవి. సావిత్రికి ఇప్పుడు అర్థమౌతోంది. రాంబాబుకి కావలసింది పెళ్లి కాదు, సెక్సు. అది ఆనాడు తనవల్ల లభ్యంకాలేదు. అందుకనే పగపట్టాడు. అవకాశం దొరికింది కనక ఇప్పుడిలా తీర్చుకుంటున్నాడు! తన ఉత్తరం సంగతి చెబుతాడు గాని, దానికి తను రాసిన జవాబు సంగతి చెప్పడే! రాంబాబు పంపిన రిప్లై తన ఉత్తరం కంటే ఎంతో గొప్పగా ఇంచుమించు కంఠత పెట్టినట్టు ఆనాడు గుర్తుంచుకుంది గాని దాన్ని తను దాచిఉంటే ఇప్పుడెంత బావుణ్ను! రేవతి చెప్పడమే కాక, ఆ విషయం దగాపడిన క్లాస్‌మేటు ఒకరు రుజువుచెయ్యడంతో సావిత్రి దాన్ని ఇంతింత ముక్కలు కింద చింపి --అగ్గిపుల్లతో దహన సంస్కారం కూడా చేసింది!

అంతటి దిగులులో కూడా సావిత్రికి ఓ మెరుపులాంటి తలపు చిన్న ధైర్యం ప్రసాదించింది. వాడి ఉత్తరం తన దగ్గిర ఎలా లేదో తన ప్రేమలేఖ కూడా రాంబాబు దగ్గిర లేదు! రుజావు

లేనప్పుడు ఎవరేం చెయ్యగలరని తనకీ దిగులు! కాని ఆ నయవంచకుడు ఆ ఆశ మాత్రం మిగలనిస్తేనా!

'నాకు తెలుసునయ్యా సుబ్బారావ్! నువ్వు నమ్మవు. నే చెప్పేదానిమీద ఏ మాత్రం ఆసక్తి చూపించకపోడాన్ని బట్టే తెలుస్తోంది సావిత్రి యిప్పటికే నిన్నెంత ఇన్‌ఫ్లూఎన్స్ చేసిందో! తెలిసో తెలియకో ఏదో రాసిందిలెమ్మని నేనా లెటర్ని చింపేశాను కాబట్టి ఇప్పుడు నీ ముందుంచే సాక్ష్యం కూడా లేదు. ఎవరి మనసుకి వాళ్లే సాక్షి. నేనెందుకు అనవసరంగా ఇందులో యింకా తలదూర్చడం! ప్రాణస్నేహితుడివి కదా, యిక ముందైనా సంగతి తెలుసుకుని తగిన కట్టుదిట్టం చేసుకుంటావని తప్ప, మిమ్మల్ని చూసి ఓర్చలేక కాదు. నమ్మేవో లేదో ఓపికపట్టి విన్నావ్, అదెంత కాదు! ఇంకొక్కటి కూడా చేసి నన్ను పంపెయ్యి. ఓసారి సావిత్రిని నిద్రలేపి ఇక్కడికి పిలిపించు. జరిగింది నీ నోటితో నువ్వే చెప్పి, నిన్ను ప్రేమించినదే అయితే, నీ ఎదుట నిలబడి నీ కళ్లలోకి చూస్తూ నే చెప్పిందంతా అబద్ధమని, ఆ పుస్తెలతాడు పట్టుకుని అనమను, అంతే చాలు.'

సావిత్రి గజగజ ఒణికింది. ఈసారి ఏ శబ్దమూ కాకుండా నిలదొక్కుకోడం ఆమెకు ఇంచుమించు అసాధ్యమే అయింది.

'ఏదో చప్పుడయినట్టయింది. సావిత్రి లేచిందేమో .... నే చెప్పినట్టు చేసి చూడరాదూ?' అన్నాడు రాంబాబు.

'అలాగే, తనని పిలవవలసిన అవసరం ఎలాగా ఉంది. అంతకు ముందు నీతో చెప్పుకోవలసింది కూడా ఉంది. ఇప్పుడు నీకేం అర్జంటు పనిలేదుగా! మరి కాసేపు ఉండగలవా?' అన్న సుబ్బారావు మాటకి ఎంతో పొంగిపోతూ 'అలాగలాగే' అని గబగబా బుర్ర ఊపేడు రాంబాబు.

'చెప్పేనుగా నీతో మాటాడాలని. అది సావిత్రి వినడం నా కిష్టంలేదు. ఇటూ అటూ కదిలి ఉండొచ్చుగాని తను లేచిందనుకోను. అదిగాక నిద్రపడితే ఇహ ఒళ్లెరగదు. ఇప్పుడు ఏ మాత్రం శబ్దంలేదు చూడు. ఇంకేం అనుమానం లేదు. పూర్తిగా మళ్లీ నిద్రలోకి జారుకున్నట్టే లెక్క .... హమ్మయ్య .... ఇప్పటికి నే అనుకున్నది నీలాంటి ఆప్తుడితో చెప్పుకునే ఛాన్సు దొరికింది. ఇక నువ్వు చెప్పిందాని గురించి నా వ్యాఖ్య. అంతకి తెగించింది. పసుపుతాడుని కేర్ చేస్తుందని ఏమిటి నమ్మకం! నువ్వు చెప్పిందే నాకు వేదవాక్యం. గుడ్డిగా పెళ్ళాం కొంగుపట్టుకు తిరిగే వాజమ్మలందరికీ నీ బోధ కనువిప్పు. ఇంక ముందు తగిన జాగ్రత్త తీసుకుంటాను. అమ్మ, ఎంతటి నమ్మక ద్రోహి! కానియ్యి తగిన బుద్ధిచెప్పే ప్రయత్నం త్వరలోనే చేస్తాను.'

రాంబాబు కృతజ్ఞతతో సుబ్బారావు చెయ్యి పట్టుకున్నాడు. 'చెడ్డపేరు వస్తే వచ్చిందని నీలా కాపురాలు దిద్ది తీర్చే త్యాగమూర్తులు ఎక్కడోగాని ఉండరు. మీ రుణాలు నిజంగా దారుణాలు. తీర్చుకోలేనివి. ఇది మా ఇద్దరి క్షేమమూ కోరే తప్ప ఇందులో నీ స్వార్థం ఏమీ లేదు కదా! దాంపత్యం అంటే బ్రహ్మచర్య జ్వరం వదిలాక ఇద్దరూ కలసి రుచిచూడవలసిన పత్యం కదా! ఇంత వరకూ అందులో ఒక్కరికే, అంటే నాకే వైద్యం చేశావు నువ్వు. ఇక రెండో వ్యక్తిని, అంటే సావిత్రిని కూడా కనువిప్పు కలిగేలా చేసే బాధ్యత నీదే.'

'అంటే?'

'అంత గట్టిగా అడక్కు. సావిత్రి లేవకుండా ఇది నేను నీతో చెప్పాలి. నువ్వే తనతో

చెప్పాలి. నేను స్వయంగా సావిత్రితో చెప్పలేని రహస్యం కదా ఇది!'

ఈసారి సావిత్రి ఆందోళన ఆశ్చర్యంగా మారింది. మొగుడి జీవితంలో కూడా ఇలాంటి రహస్యాలు ఉన్నాయా!

'ఇలా దగ్గిరగా జరుగు రాంబాబూ! మనం క్లాస్‌మేట్స్ అయిందగ్గర్నుంచీ నీకు నా గురించి రఫ్‌గా అయినా తెలుసుగాని అంతకుముందు సంగతులు ఎరగవు కదా! శీలం చెడినవాడని స్పష్టంగా తెలిసినా చంద్రుణ్ణి నెత్తి కెక్కించుకున్నాడు శివుడు! అలాంటి శివుడు, పేరుకి పార్వతిని శరీరంలో సగం చేసుకున్నానని కబుర్లు చెప్పినా, మోహిని లాంటిది కనబడితే బట్టలున్నాయో లేదో కూడా చూసుకోకుండా పరుగులెత్తక ఏం చెయ్యగలడు? అంతటి శివుణ్ణి ఆదిదేవుడుగా కొలిచే సామాన్య మానవులం మనం! ఒంటిమీదకి పడుచుదనం దిగీ దిగగానే జంటకోసం తహతహలాడక ఎలా ఉండగలం? చిలక్కొట్లకి ఎగబడకూడదేగాని 'పడుచు పచ్చని' తోటలో చిలకపిట్టలకేం లోటు? సావిత్రి యింకా తండ్రిచాటు ఆడపిల్ల కాబట్టి ఉత్తరంతో సరిపెట్టింది. దోరవయసు మీసగాణ్ణి, ఉన్నపాటున రంగంలోకి ఉరకడానికి నాకేం అడ్డు? ఇదంతా గుర్తుంచుకుని నువ్వు సావిత్రికి చెప్పాలి సుమా! అదేం, లేచి నిలబడిపోయావ్?'

'పనుంది. మరచిపోయాను సుబ్బారావ్ .... మరోసారి వస్తాను.'

'అలా కాదు. నువ్వు తప్ప మా కెవరున్నారు.? ఇలాంటి మంచి పనులు నీ లాంటి వాళ్ల తప్ప ఎలా అవుతాయి? నన్ను అడిగే నా పర్మిషన్ తీసుకునే ఇంతవరకూ నువ్వు చెప్పేవా! నీ ఉపకారబుద్ధి అలాంటిది. నువ్వు వెడతానంటే మాత్రం, పూర్తిగా వినందే, నిన్ను వెళ్లనిస్తానా! సావిత్రి గురించి నాకు చెప్పి ధన్యుడివయావు. నా గురించి సావిత్రికి కూడా చెప్పందే నీ పుణ్యకార్యం పూర్తవుతుందా! కూచో, కూచో .... ఎంతవరకు చెప్పేను! ఆ, గుర్తొచ్చింది. ఇలా ఛాతీమీద నాలుగు వెంట్రుకలు పొటమరించాయో లేదో కంటబడిన ప్రతి పడతి శరీరం పదేపదే మననం చేసుకునేది వయసొచ్చిన నా మనసు. మా నాన్నగారి ఆఖరి చెల్లెలు ఓ కూతుర్ని కన్నాక విధవరాలై మా యింట్లోనే ఉండేది తన కూతురితో. నీకు తెలియదులే, నువ్వు మా యింటికొచ్చాక అలాంటివాళ్లెవరూ లేరు అక్కడ. మేనత్త కూతురు బొత్తిగా పసిదని అనుభవం మీద తెలుసుకుని మేనత్తనే ఆక్రమించుకుంది పొగరెక్కిన నా శరీరం. కూతురూ తల్లీ ఒకే రాత్రి ఒకే నూతిలో పడి మరణించారు, ఆ మలినం కడుక్కుందామని. సావిత్రి ప్రేమలేఖకి ఎలా లేదో నా పాడుకథకి రుజువూ సాక్ష్యమూ లేవు. అంత మాత్రంచేత నిజమూ ఉండకుండా పోదు. నిష్కాములైన నీలాంటి సంఘ సేవకులకి లోకం గొడ్డుపోలేదు. ఉండు. లేచిపోకు. నే చెప్పింది అయిపోయింది గాని యింకా నీ కర్తవ్యం రెండో సగం ఉండనే ఉంది. సావిత్రిని లేపి తీసుకొస్తాను. ఇంకా ఎంతసేపు పడుకుంటుంది భడవ! ఏదో పనుందని నేను వెళ్ళిపోతాను. ఇప్పుడు నేను చెప్పిన ప్రతి ముక్కా, కాస్త నీ సహజకల్పన జోడించైనా సరే, నిజం చెప్పి మా కాపురం ఇరుపక్షాలా నిలబెట్టే పూచీ నీదే సుమా!'

సుబ్బారావు లోపలికి వెళ్లేసరికి అంతవరకూ ఎలాగో ఆపుకున్న సావిత్రి దుఃఖం, మొగుణ్ణి చూడగానే కట్టలు తెంచుకుంది. కన్నీళ్లతో భర్త కౌగిలిలో ఎంతసేపు ఉందో ఆమెకే తెలీదు! సుబ్బారావు అక్కణ్ణుంచే కిటికీ రెక్కతీసి చూశాడు. అతను అనుకున్నట్టే రాంబాబు అక్కడ లేడు!

---

**త్యాగమూర్తులున్నారు, జాగ్రత్త!**

సుబ్బారావు ఇలా లోపలికి రాగానే అలా రాంబాబు అవతలికి ఉడాయించి ఉండాలి!

'మీ కెంత దయాదాక్షిణ్యాలున్నా, మీ పెళ్లాం తప్పు కప్పిపెట్టడానికి అంత ఘోరమైన నేరం, అవతలివాడు మరి నోరెత్తకుండా, నెత్తిమీద వేసుకుంటారా! మీ నాన్నగారు, తాతయ్యగారికి ఏకైక సంతానం అని నాకైనా తెలీదంటారా! ఆయనకి చెల్లెలొకటా, కూతురొకర్తా! హవ్వ! ఇన్ని అబద్ధాలు ఎప్పుడు నేర్చారు?'

'అయితే నే అనుకున్నది నిజమే నన్నమాట. మొట్ట మొదట్నుంచీ నీకేం నిద్రపట్టలేదు కదూ?'

'అవునూ, ఆ సంగతి మీ కెలా తెలుసూ?' అంది ఆశ్చర్యంగా.

'నా ఆలి సంగతి నే నెరగనా! తోడు లేకుండా తొంగోదు' అన్నాట్ట వెనకెవడో నాలాంటివాడే .... అందుకూ' అన్నాడు సుబ్బారావు, పట్టపగలు భార్యని పక్కమీదకి లాగుతూ.

'ఆగండి' అంటూ వీధి తలుపు గడియ సరిగా వేసివచ్చి, భర్తని ప్రేమగా దగ్గిరకి లాక్కుంటూనే అడిగింది. 'ఉండండుండండి. చిన్న సందేహం తీర్చండి ముందు. మీరు చెప్పినవి అబద్ధాలని నాకు తెలుసు. నేను ప్రేమలేఖ రాయడం అబద్ధం కాదని మీకు తెలీదే! నిజానికి అది అబద్ధంకాదే!'

'మేనత్త కూతురి కథ అబద్ధం కావొచ్చు. వెయ్యి దిశలలో వెర్రితలలు వేస్తున్న ఈ నవనాగరికతలో పెరిగిన ముప్ఫై ఏళ్ల పెళ్లికొడుకు గత జీవితంలో ఎలాంటి మనోవ్యభిచారమూ జరగలేదంటే అదెంత పెద్ద అబద్ధం! ఇంతకీ కలసి జీవించాలని కంకణాలు కట్టుకున్నవాళ్లం మనం. మరచిపోయినా, మననం చేసుకున్నా, మన యిష్టం, మన లోకం. మూడోవాడికయినా మూడో కన్నువాడికయినా యిందులో చోటెక్కడ! అలాంటిది, ఆడకొంగు కనబడితే సోలడు చొంగకార్చే ఆ రాంబాబు గాడా మనకి తీర్పులు చెప్పేది! అందుకే మెత్తని చెప్పుతో శుద్ధి చేసినంత పనిచేసి పంపించాను. నీ గురించి వాడు చెప్పింది విన్న దగ్గిర్నుంచీ నీమీద ప్రేమ ఎప్పుడూ లేనంతగా పెరిగిపోయిందనుకో.' సావిత్రి ఏదో అడగబోతే వీల్లేకుండా మూతిని మూతితో మూసేశాడు సుబ్బారావు.

*(యువ దీపావళి ప్రత్యేక సంచిక)*

# గుట్టు తెలుసుకో, చెట్టు దులుపుకో !




**ఎవరూ,** ఆ బల్లగుద్ది చెబుతున్నది మా గురుమూర్తే! వీడికింత వాగ్దాటి ఎప్పుడు వచ్చింది చెప్మా! లోకంలో ఎవడికయినా ఏ పరిస్థితిలో అయినా గురుస్థాయికి ఎగబ్రాకగలడని ముందే ఊహించి వీడికీ పేరు చిన్నప్పుడు పెట్టేరు కాబోలు! లేకపోతే ఇంత పెద్ద పబ్లిక్ మీటింగ్‌లో యింతమంది ధనికులూ, రాజకీయవేత్తలూ స్టేజిని అలంకరించి ఉండగా గొంతెత్తి మాట్లాడ్డమే గొప్ప. వాళ్ళనే దెబ్బ తియ్యడమా! ఎంత ఆశ్చర్యం!

"కాబట్టి ఓ సోదర సోదరీమణులారా! మరచిపోకండి. ఇది వనమహోత్సవ వారోత్సవం. ఇంటికి వెళ్ళగానే తలో చెట్టూ నాటుకోండి. చెట్ల ఉపయోగం నేనిప్పుడు కొత్తగా చెప్పవలసిన అవసరం లేదు. మనకి కూడూ, గుడ్డా, కొంపా అమర్చేది చెట్టు తల్లేకదా! మన పూర్వీకులు ఆకూ అలమూ తిని బతికేవారు. మన ముత్తాతలందరూ వనచరులే అని సైన్సు చెబుతోంది. మన పెద్దలు మొలచుట్టూ ఆకులు చుట్టుకునేవారు. అవి కూడా మానేశాడు మన శివుడు. ఆకులు కూడా తినడం ఎందుకని 'అపర్ణ' అనిపించుకుంది మన పార్వతమ్మ. పుణ్యభూమిలో పుట్టిన మన

దేశప్రజలు చెడిపోకుండా అదేస్థితిలో యిప్పటికీ ఉండేలాగ మన నాయకులు కృషి చేస్తున్నారు. దేశంలో మూడొంతుల జనం చెట్ల నీడనే చిరునవ్వుతో యిప్పటికీ కాలక్షేపం చెయ్యడం, ఓహో, ఎంత కమనీయ దృశ్యం! పైన పక్షులూ, కింద అనాథ పక్షులూ అని కిట్టని వాళ్ళంటే మనకేం పోయింది? క్రమంగా మనదేశప్రజ యావన్మందీ అక్కడికే చేరుకునే స్వర్ణయుగం ఎప్పుడు రానున్నదో! కవులు కీర్తించిన, దేశ సేవకులు గుర్తించిన యీ హరిత విప్లవంలో ప్రతివ్యక్తీ ఒక హరియై తనకు తానుగా పునరంకితం కావాలి. కావున ఓ మహా జనులారా! చెట్టుతో ప్రతిమనిషీ చట్టా పట్టాలు వెయ్యాలి. చెట్ల గుట్టుమట్లు ఎవరికి వారు తెలుసుకుని కొల్లగొట్టుకోవాలి. 'ఇంటా బయటాచెట్టు' కార్యక్రమంలో యీ క్షణం మొదలు పురజను లందరూ....."

గురుమూర్తి ఉపన్యాసం ఓ కోతి అయితే నేనిప్పుడు చెప్పిన భాగం ఆ కోతి తోక చివరి కుచ్చులో ఓ వెంట్రుక! ఆ వ్యంగ్య వైభవం చూసి వాడి ఫ్రెండుగా ఎంతో గర్వం కలిగింది నాకు. తిరిగి వచ్చేస్తుంటే భుజం మీద బరువుగా చెయ్యివేసి పలకరించాడు. అంతే కాదు. హోటల్‌కి తీసికెళ్ళి మస్తుగా మేపితేగాని వదిలిపెట్టలేదు. మంచి బ్రూ కాఫీలు పట్టించి, ఖరీదైన సిగరెట్లు ముట్టించి, పార్కులో కూచున్నాం. రెండేళ్ళు ఆ వూర్నించి బదిలీ అయి వెళ్ళిపోయాను. మళ్ళీ మరో ఫ్రెండో పెళ్ళికొచ్చి యిదే చూడ్డంవాణ్ణి. అదంతా వడ్డీతోసహా తీర్చేశాడు వాడు.

ఈ కొద్ది కాలంలో బాగా డబ్బు చేసుకున్నట్టు వాడు పెడుతున్న ఖర్చే తెలియజేస్తోంది. అదే మరోలా అన్నాను.

"ఎంత యెదిగిపోయావ్‌రా మూర్తీ!"

"ఎదగడం కాదు. నా మొహం కాదు, మరేం చెయ్యలేక నేనైనా బాగపడదామని తెగించేశాను - అంతే !"

వింతగా వినడమే నాలాంటివాడు చెయ్యగలిగింది.

"అవున్రా .... నీతో చెప్పుకోడానికి నాకేం? ఎలాంటి పరిస్థితి నయినా డబ్బుగా మార్చుకోగల రాజకీయ పాఠం వొంట పట్టించుకున్నాను. పాపం మన దేశ ప్రజని యెల్లకాలం జంతువుల్లా బలిచెయ్యడానికి గొప్ప కృషి చేస్తున్నారు. వాళ్ళకి బుద్ధి జ్ఞానం అనే రెండు బ్రహ్మ పదార్థాలు అందకుండా మన రాజకీయవాదులు గొప్ప ప్రజాసేవ చేసి పారేస్తున్నారు. ఇలాంటి సమయంలో నాలాంటి దళారీకి కాక మరి ఎవరికి గిరాకీ!" వాడివైపే చూస్తున్నాను. అలా చెప్పుకుపోతున్నాడు.

"మన భారతీయ సోదరులు మంచి ధైర్యం ఉన్న వాళ్ళులే. వాళ్లకి ఒక్కటే ధీమా అనుకుంటాను - దేశానికి మూడువైపుల సముద్రమూ ఓ వైపు కొండలూ కదా ఏదైనా ఆపద ముంచుకొస్తే హాయిగా దిగిపోవడానికి కనుచూపు మేరలో గంగ, అలా కాదు. బతికుండాలంటే ఎంచక్కా కొండమీదకి పారిపోవచ్చు. 'లేదురా యిటువంటి భూమి యింకెందు!"

"ఎంత సీరియస్‌గా చెబుతున్నా నీ సెన్సాఫ్ హ్యూమర్ వదలవుకదా!"

అది లేని బతుకేముందిరా బడాభాయ్! పరమాన్నం ఎంత చప్పగా ఉన్నా ఒక్క జీడిపలుకు పంటికి తగిల్తే చాలదూ! నన్ను అడ్డు పెట్టక, చెప్పింది వింటూ నువ్వే ఆలోచించు. నీ మటుకు నువ్వే చూడు. స్వతంత్రం రాకముందు కల్లు తాగడం ఓ తప్పుపనిగా భావించేవారు. ఊరి చివర ఎక్కడో ఏడిసేవి కల్లు పాకలు. స్వతంత్రం వచ్చాక యిన్నేళ్ళకి మన దేశంలో ప్రగతి పథంలో

ప్రసరించేది మద్య వ్యాపారం ఒక్కటే. మెదడుకి మేత వేసే లైబ్రరీలు కొన్ని గంటలే తెరచి ఉంటాయి. ఎంతో అవసరమైన దుకాణాలూ, పోస్టాఫీసులూ, బ్యాంకులూ కూడా పరిమిత కాలంలోనే పనిచేస్తాయి. ప్రాణాల్ని రక్షించే మందులు దొరికే షాపులు కూడా అన్నీ రాత్రింబవళ్ళు తెరచి ఉండవు. ఏటేటా షాపుల సంఖ్య పెంచుకుంటూ ఇరవై నాలుగ్గంటలూ ప్రజాసేవలో అంతర్లీనమైనవి దేశంలో ఒకటే ఒకటి - అవి బ్రాందీ షాపులు! తనకు ఓటు వేసి గెలిపించిన ప్రజ ఎక్కడ ఇబ్బందిపడిపోతారో అని ప్రభుత్వమే చక్కగా సారాయి దుకాణాలు నిర్వహిస్తోంది. అంతే కాదు. ముఖ్యావసర వస్తువు లయిన బియ్యం, పంచదారా, కిరసనాయిలూ, సిమెంటూ యిలాంటి వాటిధర ఎంత పెరిగినా, అసలు దొరకకపోయినా సర్కారువారు పట్టించుకోరు. తాము సప్లై చేసే సారాయి సబ్సిడీ రేటు మాత్రం పైసా పెరక్కుండా ఎంతో జాగ్రత్త తీసుకుంటోంది. ప్రజలు తాము పిచ్చివాళ్ళుగా ఉండాలని నిశ్చయించుకున్నంత కాలం ప్రజా నాయకులు దోపిడీదార్లుగా మారడంలో ఆశ్చర్యం లేదు. అందుకనే విచక్షణ పెరగకుండా, విప్లవాలు రేపకుండా. తను పాలించే ప్రజ ఎల్లకాలం తప్ప తాగి పడుండాలని ప్రభుత్వం అన్ని 'ముందు జాగ్రత్త చర్యలూ తీసుకుంటోంది!'' నిశ్శబ్దంగా వింటున్నాను నేను. వరసగా సిగరెట్టు తగలేస్తూ .... "ఇప్పుడు జరుగుతున్న దేమిటో దానిమీద ప్రజాదృష్టి కేంద్రీకృతం కాకుండా 'గుప్త రాజ్యం నాటి స్వర్ణయుగం' వైపో, వచ్చే పదేళ్ళలో 'ప్రతి కన్యకీ ఒక భర్త పథకం' వైపో మరలిస్తోంది. ప్రస్తుత సమస్యలు పక్కకి పెట్టి. ప్రతి జిల్లాలోనూ 'సీమ పందుల పెంపకం' 'గిరిజన క్రీడల కోసం అయిదుకోట్లు మంజూరు' లాంటివి ఎవరికి అందుబాటులో లేని విషయాల్లో ఎంతో ప్రాధాన్యత ప్రకటిస్తోంది. ఒరే, ఒక్కటి చెబుతావిను. జోలపాట పాడుతున్న వారిదిట కాదు, ఎప్పటికీ మెలుకువరాని దద్దమ్మలది తప్పు''.

"అయితే మనలాంటి వాళ్ళం ఏం చెయ్యాలి!"

"ఏం చెయ్యలేక .... వీళ్ళని ఎడ్యుకేట్ చెయ్యలేక .... ఈ మందలో మనం కూడా కలిసిపోలేక .... ఇవతలికి వచ్చేశామనే యింతసేపూ ఈ ఏడుపు. ఆఖరికి మనం కూడా వీళ్ళని ఎక్స్ప్లాయిట్ చేస్తున్నామనే పాపపు చింతే యిలా అప్పుడప్పుడు మాటల మంటలు కక్కడానికి కారణం."

గురుమూర్తి తనులేచి నాకు చెయ్యి అందించాడు.

"పద, ఎన్ని చెప్పుకుంటే తరిగేను యివి?"

"మునుపు డల్‌గా వుండేవాడివి. ఇప్పుడు కబుర్లు నేర్చేవ్."

"అవును. కావలసినంత కరెన్సీ చేరితే కబుర్లకేం లోటు

మిగిలేవి అవే!" దార్లో యిక వుండబట్టలేక నిలదీశాను.

"ఉన్నట్టుండి యింత డబ్బు యెప్పుడు సంపాదించావని?"

"చెప్పేనుగదా, ప్రజల అమాయకత్వమే ప్రభుత్వానికి పెట్టుబడి అని! కొల్లగొట్టడం కోటి రకాలు. ఒక్క ఉదాహరణ మాత్రమే నీకు యిస్తాను. అదైనా వనమహోత్సవ వారం గనక. దానికి సంబంధించినదే. విను. సాధారణంగా స్కూళ్ళ ముందు, కాలేజీల ముందు మామిడి తోటలు పెంచుతారు. ఎందుకో ఆలోచించావా? లెక్చెరరు పని చేస్తున్నావ్‌గా చెప్పు."

"దానికి లెక్చెరర్ పని చెయ్యక్కర్లేదు. ఎవడైనా చెప్పగలడు మా కాలేజీ ఆవరణలో కూడా మామిడితోట వుంది. ఎందుకంటే ఏం చెబుతాం! లక్ష ఉపయోగాలు. చల్లటి నీడ నిస్తాయి."

స్టూడెంట్సు క్లాసులు లేనప్పుడు కూచుని కబుర్లు చెప్పుకుంటారు వాటి కింద....''

"నిజమే, నువ్వు ఎన్ని ఊహించగలవో అన్నీ ఊహించి చెప్పు. 'చెట్టు దాని ఉపయోగములు' మీద వ్యాసం రాయించావనుకో స్టూడెంట్స్ నుంచి ఎన్ని పాయింట్స్ ఎక్స్‌పెక్ట్ చేసావో అన్నీ చెప్పెయ్యి.' ' 'మధ్యని నన్నడుగుతాడేమిటని' నాకు ఒళ్లు మండింది అయినా అణచుకుని. ఓ పది పదిహేను లాభాలదాకా వివరించాను.

"నువ్వు మరచిపోయింది మరోకటుంది. చెప్పిన దాంట్లో తప్పుకూడా ఒకటుంది. రెండింటికీ సంబంధ ముంది. అట్టే కంగారు పడక చెప్పింది ఫాలో అవు. ఏటా కాసే మామిడి పళ్ళ వల్ల కాలేజీకి ఆర్థికంగా లాభం అని చెప్పేవు అంత కంటే అసందర్భం ఉందా! ఎంత కట్టు దిట్టమైన కాపలా వుంచినా కోతుల్లాంటి కుర్రాళ్ళని కంట్రోలు చెయ్యడం యెవడితరం? చెట్టున యిలామామిడిపిందె కనపడిందో లేదో స్టూడెంట్స్ చూపు యెప్పుడూ అక్కడే కదా, రాయి విసరని కుర్రాడిది పాపం! తనదికాని వస్తువుపై యెంత మోజు వుంటుందో చెప్పడానికి యిదొక ట్రెయినింగ్ సెంటర్ కాదంటావా?''

'ఇదీ చెట్టు వలన ఓ ప్రయోజనమేనా?''

"అని నే నన్నానా! కొంచెం దృష్టి ముందుకి మరలించు అక్కడ యాస్‌బెస్టాస్ షెడ్సు అనబడే క్లాసురూములు వున్నాయికదా! ఎప్పుడూ సిమెంటు రేకులే వేయిస్తారు. స్లాబ్సు చేయించరు తగిన ఫండ్సు లేవనే సాకుతో. ఎందుకో ఆలోచించావా?''

"మనం యిప్పుడు చెట్లగురించి మాట్లాడుతున్నాం!''

"అదే యిప్పుడు నేచెప్పేది వయసొస్తున్న కుర్రాళ్ళు బలంగా చెట్లమీదకి విసిరిన రాళ్ళు అక్కడే వుండవుకదా. పక్కనున్న షెడ్స్‌మీద పడతాయి. అవి పగులుతాయి. ఏటా సిమెంటు రేకులు తిరగేయించాలి. అవి ఎవరో ఓ బిజినెస్ మేన్ సప్లై చెయ్యాలి గదా! అందులో పాలకవర్గానికీ, సప్లై చెయ్యాలి గదా! అందులో పాలకవర్గానికీ, సప్లైదారుకీ ఫిఫ్టీ ఫిఫ్టీ కమిషన్. ఊరికే వచ్చే ఈ వార్షికం ఎవడొదులు కుంటాడు! చెట్టుని నమ్మి, చెడిపోయిన వాడున్నాడా? దేర్‌ఫోర్ తలో చెట్టూ నాటండి''

"రిడిక్యులస్, అలా జరుగుతుందనే స్కీముతో కాలేజీల కాంపౌండులో తోటలు పెంచుతున్నారంటే నమ్మడం కష్టం.''

"ముందు ఆ వుద్దేశం లేకపోవచ్చు కాని కన్నుగప్పే పద్ధతి ఒకటి కళ్ళపడ్డాక దోపిడీదారు యిక వెనకంజ వెయ్యడు. అందుకనే తోటల అంచు క్లాసు రూముల పైకప్పు సాధారణంగా సిమెంట్ స్లాబ్ వెయ్యబడి ఉండదు. ఇంతకీ యీ చెట్టు చరిత్ర మన వ్యవస్థలో ఎంత మోసం ఉందో చెప్పక చెబుతోంది. అది కూడా చెట్టు వలన ఓ ఉపయోగమే! కావున ఓ పురజనులారా. నేడే ఓ చెట్టు నాటుడు!'' అనే వాడి మాటకి పైకి నవ్వూ, లోపల ఏడుపూ ఒకేసారి వచ్చేయి!




# ఇదేమైనా బాగుందా?




**ఆయనేమో** ఊళ్లో లేరు. మా అమ్మాయి దుర్గ వాళ్ల స్కూలు పిల్లలతో పిక్నిక్‌కి వెళ్లింది. అన్ని పనులూ చేసి పనిమనిషి వెళ్లిపోయింది రెండో పూట రాలేనని చెబుతూ. ఊరికే కూచోలేక ఎదుటి ఆలమారా సర్దితే అందులోంచి మా ఝాన్సీ చీటీ, ఏ రెండేళ్ల నాటిదో బయటపడింది. 'అంకురం' అనే గొప్ప సినిమా వచ్చిందనీ, తప్పక చూడమనీ.

రెండేళ్ల పై మాటగా ఝాన్సీని మరచిపోయే మార్పు నాలో ఏం వచ్చిందో నాకే వింతగా తోచింది. కొన్నేళ్ళపాటు ఆయన్తో హోరా హోరీ పోరాడి ఇక చేసేది లేక లొంగిపోయానో లేక రోజు రోజుకీ పెరిగిపోతున్న ఆయన ఐశ్వర్యానికి దాసురాలనైపోయానో .... ఎందుకంటే నా బాధలన్నీ ఎప్పటికప్పుడు మా ఝాన్సీకి ఉత్తరాల్లో చెప్పుకునే దాన్ని మరి.

దాని రైటింగు చూస్తూ ఉలుకూ పలుకూ లేకుండా అలా పడక్కుర్చీలో కూలబడిపోయాను. దాని ఊసు తలుచుకుంటే చాలు. నా మనసు ఎంత వెనక్కైనా వెళ్లగలదు. ఏవైనా గుర్తు తెచ్చుకోగలదు.

ఒకటా రెండా ఆరేళ్లపాటు దాన్తో కలసి చదువుకున్నాను. దాని అభిప్రాయాల ప్రత్యేకతని నేనెలా మరచిపోగలను!

మాట మరసకి పెళ్లి చూపుల తతంగాన్నే తీసుకోండి.

బుర్రా బుద్ధీ ఉన్న ఏ కన్యయినా దీన్ని ఆమోదిస్తుందా?

కాని ఝాన్సీలా దీన్నెవరైనా ఎదిరించగలరా!

"నన్ను కట్టిపడేసినా సరే కత్తికి బలేసినా సరే ఈ సిగ్గుమాలిన పనికి తలవంచను. పెద్ద పెద్ద కేకలేసేస్తాను. ఊరూ వాడా ఏకం చేసేస్తాను" అని కన్నవారి మీదే కాలు దువ్వగలరా!

"లలితా, పోనీ నువ్వే చెప్పవే. ఏదైనా కొనుక్కోడానికి మనం బజారుకి వెడతాం అనుకో. కొనుక్కునే వస్తువు మన దగ్గిర కొస్తుందా, మనమే వస్తువు దగ్గిరకెడతామా? కట్నాలు యిచ్చి మనం పెళ్లి కొడుకుని కొనుక్కుంటున్నాం కదా. వాడెవడే మధ్యని మనింటికి వచ్చి మనల్ని సెలక్టు చేసుకోడానికి? డబ్బు మనదీ - ప్రశ్నలు వాడివీనా? ఇందులో నీకే అసందర్భమూ తోచలేదూ?"

తోచకేం? ఆ రోజుకి అయిదో పెళ్లి చూపుల తతంగంకి తలవంచాను నేను. ఎప్పట్నించో వస్తున్న ఆచారం ఇది. నేనేమని బదులివ్వగలను!

"పోనీ మరో ముఖ్య విషయం"

"ఏమిటది?"

"మన పెళ్లిళ్ల వ్యవహారమే చూడు. అంతకు ముందు ఆడపెళ్లి వారెవరో వరుడు ఎరగడు. అయినా కట్న కానుకలు ఆశించి చెయ్యి జాచడం అనేది ఏ విధంగా చూసినా బిచ్చగాడి లక్షణమే కదా! ఇక్కడ యాచకుడు ఎవరూ, పెళ్లికొడుకు. దాత ఎవరూ, పెళ్లి కూతురు అప్పనంగా ఆస్తి చేజిక్కించుకునే దరిద్రుణ్ణి తరిమి తరిమి కొట్టక 'ఎదురు సన్నాహం' అనే పేరున బాజా భజంత్రీలతో ఆహ్వానమా! ఏ కాశీకో వెళ్లిపోతానని ఆ దౌర్భాగ్యుడు పోజుకొడితే 'అలా వద్దు, మా అక్కనిచ్చి పెళ్లి చేస్తానని' బావమరిది చేత బతిమాలించడమా! అన్నిట్నీ మించి అంత ఘోరానికి ఒడికట్టిన వాణ్ణి కొత్త బట్టలు పెట్టి దర్జాగా కూచోబెట్టి పదిమందిలో కాళ్లు కడగడమా! వాడి ఈ హోదాకి మూలకారణమైన పెళ్లికూతురు పాపం ఏదో తప్పు చేసినట్లు తలవంచుకు కూచోడమా! ఇలాంటి 'కసాయివాడూ, మేకా' కథకి పెద్దలందరూ మద్దతు పలికి ఏ వీడియోనో తీసి రికార్డు చేసి దాచుకుని, ఇంటికొచ్చిన ప్రతీ పెద్ద మనిషికీ బలవంతాన చూపించ డమా...."

ఇలా సాగేది దాని ధోరణి. ఇది ఏదైతేనేం? ఇది ఇంతే. మన వాళ్ల సాంప్రదాయమూ, సంస్కారమూ అంటూ ఏటా కొన్ని లక్షల కళ్యాణ మంటపాల్లో బాజా భజంత్రీలు మోగిపోతున్నాయి. అప్పటికే రెండేళ్లై కాపరం చేస్తూ పురుడు పోసుకోడానికి నేను మా పుట్టింటికి చేరాను కూడా.

ఆఖర్న చేసే శుభకార్యం అంటూ, బాగా డబ్బున్న వాళ్ల సంబంధం దొరికిందని మురిసిపోతూ, లేనిపోని భేషజాలకు పోయి పెద్ద ఎత్తున చేసిన నా పెళ్లి ఖర్చులకే మా వాళ్లు ఓ వంతు చిదిగిపోయారు. మా ఆయన గొంతెమ్మ కోర్కెలకు తట్టుకోలేక క్రమంగా చతికిలబడిపోయారు. నిజంగా నా పురిటి ఖర్చులకి తట్టుకొనే శక్తి అప్పటికి వాళ్లకి లేదు. ఆయనకి తెలీకుండా ఓ జత గాజులమ్మేసి నేనే ఎలాగో కమ్ముకొచ్చాను. పురుటి ముందు జబ్బు చేసి నన్ను ఓ ప్రైవేటు హాస్పటల్లో చేర్చవలసి వచ్చింది. పట్టుకున్న గుండె జబ్బు వదలక మా అమ్మే ఓ పేషెంట్ అయితే నాకేం చేస్తుంది? మా

చిన్నక్కా పెద్దక్కా పై ఊళ్లలో ఉన్నారు. ఇక మా ఊళ్లో నాకు ఝాన్సీయే తోడైంది.

ఝాన్సీ వాళ్లమ్మగారు ఊరుకోలేక పోయింది.

"నీ తోటి వాళ్లందరికీ పెళ్లిళ్లై బుద్ధిగా కాపరాలు చేసుకుంటున్నారు. పిల్లా పాపా కలిగి పచ్చగా బతుకుతున్నారు. నా పిల్లలైనా ఏ ఒక్కరూ ఇలా లేరమ్మా ... ఈ పిశాచి ఏ అమావాస్య నాడు కడుపున పడిందో ... ఇదెక్కడి పిల్లో ఏం లోకమో ... పెళ్లి చూపులకైనా కూచోదుట ఇదెక్కడి చోద్యమో ... ఇక దీనికి పెళ్లెలా అవుతుందో .... ఎవర్తో నయినా లేచిపోతుందో ఏమిటో...."

"ఈ దిక్కుమాలిన పెళ్లి తంతుకి వంతపాడే కన్న లేచిపోవడమే బెటరమ్మా ... ఎవరైనా సరైన వాణ్ణి చూపించి పుణ్యం కట్టుకుందూ, ఎంచక్కా లేచిపోతానూ..."

-అని తల్లితోనే సరాచికం, ఏం చెప్పను!

సరే, ఆ పురుటి రోజుల్లో రాత్రుళ్లు నా దగ్గిర పడుకుని నాకు చేసిన సాయం ఇంతా అంతా కాదు. సాయమా, పొరపాటు! జీవిత కాలం అంతా ఉండిపోయే మహోపకారం! పురుటి ముందు రోజుల్లో నాతో హోరాహోరీ వాదించి, ఎలాగో ఒప్పించింది. ట్యూబెక్టమీ చేయించుకోడానికి. 'పిల్లల్ని ఎందుకు కనాలో ఎలా పెంచాలో కనీస జ్ఞానం లేని ఏ తల్లికీ తండ్రికీ ఇంకా భూభారం పెంచే హక్కు లేదు' అని నాకు నచ్చ చెప్పింది. అంతకు ముందే నా ఉత్తరాల ద్వారా మా వారి దోపిడీ లక్షణాలు బాగా పసిగట్టి ఉందేమో, 'అవకాశం వచ్చింది. వదిలిపెట్టకు' అని నన్ను హెచ్చరించింది. భర్త అమెరికాలో ఉన్నాడనీ అనుమతి పత్రం తర్వాత సంపాదించి పంపడానికి తనదే పూచీ అనీ లేడీ డాక్టరమ్మకి హామీ పత్రం రాసిచ్చి ఆ పని కాస్తా చల్లగా చేయించేసింది. అప్పుడే మా దుర్గ పుట్టింది. దుర్గాబాయి దేశ్‌ముఖ్ పేరు ఝాన్సీయే సూచించింది.

ఆడదాన్ని కన్నందుకే మా ఆయనా వాళ్ల వాళ్లూ అనరాని మాటలంటూ ఆడపిల్లకి బారసాల కూడా ఏమిటని నోటి కొచ్చినట్టు ఉత్తరాలు రాస్తూ ఎంతో హింసించారు. నెలలపాటు వాళ్లు మళ్లీ యిటు తిరిగి చూడలేదని బెంగపెట్టుకుని, అదో.అవమానంగా భావించి, రోగం పెంచుకుని, మా అమ్మ కన్ను మూసింది. పేరుకి వచ్చి ఇంట్లో సామాన్లేమయినా ఉంటే తగువులాడుకు తన్నుకుపోయారుగాని మా అక్కల్లో ఏ ఒక్కరూ నా కన్ను తుడిచినవారు కాలేకపోయారు.

దుర్గని ఎత్తుకుని పుట్టెడు కష్టంతో ఇల్లు చేరిన నన్ను గుమ్మంలోనే మా ఆయన దులిపి దుళ్ల కొట్టేశారు. ఇక ట్యూబెక్టమీ విషయం ఏ ఆడది మొగుడి దగ్గర దాచగలదు! తిట్టిన ఆ బూతులు నా నోటితో నేను చెప్పలేనివి. 'ఎంత దారుణానికి ఒడి కట్టిందే మీ అమ్మ? అల్లుడితో మాట మాత్రమైనా చెప్పకుండా ఇలాంటి వెధవపని చేయిస్తుందా? ఉండు, దావా వేసి దీన్ని జెయిల్లో పెట్టిస్తాను' అని రంకె లేశారు - ఆ కోపంలో ఆవిడ చచ్చి నెల దాటిందనే విషయం మరిచిపోయి! అక్కడితో ఆ కసి మా ఝాన్సీ దిశ మరలకుండా చల్లారిపోడం నా కొద్ది అదృష్టాలలో ఒకటి.

శరీరం రకరకాల హింసలకి గురైనా మనసు మాత్రం ఎదురు తిరుగుతూనే ఉండేది ఆ రోజుల్లో. తరతరాల్నుంచీ విలువలన్నీ తనకి మాత్రమే అనుకూలంగా తీర్చిదిద్దుకుని ఈ సంఘాన్ని తయారు చేశాడు మగాడు అనేవాడు. పిల్లల్ని పెంచే పద్ధతిలోనే ఇప్పటికి కూడా ఆడపిల్లని హీనంగా చూసే ఏర్పాట్లన్నీ సజీవంగా వర్ధిల్లుతున్నాయి. సంఘ నీతీ, సాహిత్యరీతీ ఆ పద్ధతిలోనే ఎప్పట్నుంచో నిరాటంకంగా రాజ్యమేలుతున్నాయి. చిన్నప్పుడు ఎదిగే వయస్సులో ఝాన్సీ నాలో నాటిన భావ

జాలమూ, పురుటి రోజుల్లో అది నాకు చదివి వినిపించిన విప్లవ సాహిత్య ప్రభావమూ కొన్నేళ్ల పాటు నన్ను ఊపిరాడనివ్వలేదు. అనారోగ్యమన్నది నా జీవితంలో ఎరగను. పురిట్లో చేసిన జబ్బా, ఆపరేషను తర్వాత కలిగిన చికాకూ చాలా తొందర్లోనే సర్దుకున్నాను. అయిదేళ్ల ఆడపిల్లల్తో ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా ఒకటే కాదు. కోతి కొమ్మచ్చి ఆడ్డానికి కూడా రెడీగా తయారయింది నా శరీరం. కాని నేను ఆడదాన్ని. ఇప్పటికే ఎన్నిటికో తలవంచి సర్దుకుపోతున్న మామూలు స్త్రీని. ప్రకృతి ప్రసాదించిన బలమే కాక సంఘం ఇచ్చిన ఆమోద ముద్రాబలంతో యజమానిగా తయారయిన మొగుడి ముందు బానిసగా తల ఊపక నేను చేసేదేముంది! అన్నిటినీ మించి ఆర్థిక పుష్టి ఆడదానికి అత్యవసరమనే అతి ముఖ్య విషయం విస్మరించాను. ఇక తను రకరకాల దోపిడీ విధానాలతో ఆడదాని ననే మాట దేవుడెరుగు, మనిషిననే మాట కూడా మరచిపోయేలా కండిషన్ చేసి పారేశాడు. నన్ను మా ఆయన.

రోజంతా ఒళ్లు విరుచుకుని మర బొమ్మలా చాకిరీ చేసి అన్నీ సమకూర్చి పెట్టినా మగతనం విజృంభించేది, పడకగదిలోనే కదా! మనకి బాగా ఆకలైనప్పుడు 'నిన్నెలా ఉడక బెట్టాలే మేకా, ఎన్ని ముక్కలుగా చితక్కొట్టాలే కోడీ, ఎప్పుడెప్పుడు నిన్ను చప్పరించాలే చేపా?' అని వాటిని అడగం. మన యిష్టం, మన రాజ్యం. పురుషాహంకారి రాక్షస రతి క్రీడా అలాంటిదే. "నా వంట్లో బాగు లేదు. ఈ ఒక్క రాత్రీ నన్ను వదిలెయ్యండి బాగు లేదు. రేపు చూసుకుందాం' అని పెళ్లాలు ఎంత కాళ్లా వేళ్లా పడినా, ఓవేళ పక్క గదిలో ఊహొచ్చిన పిల్లలు వింటున్నా, 'అదేం కుదర్దు. ఆ 'రేపు' ఏదో యివాళే' అంటూ విజృంభించకపోతే అది మగ పశువు ఎలా ఔతుంది మరి? ఇక నా విషయంలో అయితే పిల్లలు పుట్టకుండా చేసుకుని పెళ్లి కూతుర్లా తయారయావ్. ఎంత మందికైనా ఏకకాలంలో జవాబు చెప్పేలా కనబడుతున్నావ్. నా ఒక్కడి దగ్గరేనా నీ టెక్కులు?" -అంటూ మరింతగా రాత్రీ పగలూ అనకుండా మీద పడిపోయేవాడు.

తిరగబడలేని నిస్సహాయతతలో నన్ను నేనే తిట్టుకునే దాన్ని. కళ్ల ముందు పిల్ల లేకపోతే ఎక్కడికో, అతను సూచించిన 'నా దిక్కున్నన చోటికే' పారిపోయేదాన్ని. ఏడుస్తున్న మనసుకు ఊరుకో పెట్టడానికి ఎలాగో తీరిక చేసుకుని ఎవరూ చూడకుండా ఉత్తరాలు రాసి ఝాన్సీకి పోస్టు చేసేదాన్ని.

ఇప్పుడనిపిస్తోంది అవన్నీ నేనే రాశానా అని!

ఓ సారి నా ఉత్తరం చేతిలో పడి ఝాన్సీ వాళ్లన్న చాలా గొడవ చేసి పారేశాట్ట. "ఈ ఝాన్సీకి ఎలాగా పెళ్లవదు. పెళ్ళైన వాళ్లకైనా స్థిమితంగా కాపరాలు చేసుకోనివ్వదు కాబోలు. ఇదేదో నూరిపోయ్యకపోతే లలితలాంటి నెమ్మదస్థురాలు, వాళ్లాయన మీద ఇంత అసహ్యంగా రాస్తుందా?' ' అక్కడతో ఊరుకోలేదుట వాళ్లన్న. పోస్టుమేన్‌ని పిలిపించి ఆ కవరూ, నీ రైటింగూ చూపించి ఇలాంటి కవర్లొస్తే వెంటనే చించేస్తే ఒక్కొక్క కవరుకి అయిదేసి రూపాయల చొప్పున ఇస్తానని బేరం పెట్టేడుట. ఆ సంగతి రాస్తూ ఝాన్సీ యిలా కలిపింది.

"తాళాలకి మారు తాళాలున్నట్టే బేరాలకి మారు బేరాలుంటాయని ఎరగడు మా సహోదర మహోదయుడు. అలాంటి కవరే వచ్చినప్పుడు రహస్యంగా తెచ్చి నాకిస్తే పదేసి చొప్పున ఇస్తాననే ఒప్పందం ఎప్పట్నుంచో అమలు జరగుతోంది మరి!"

ఎవరో అదే పనిగా కాలింగ్ బెల్ మారుమ్రోగించడంతో మళ్లీ ఈ లోకంలోకి వచ్చి వీధి తలుపు తీశాను. ఇంతా చేస్తే పేపర్ల బిల్లు వాడు. అదేదో చెల్లించి తలుపు వేసేసి మళ్లీ కూచుని ఆ చీటీ చూశాను. అప్పుడే గుర్తొస్తే ముందు రోజు పేపరు చూసి వెరిఫై చేసుకున్నాను. 'అంకురం' మళ్ళీ వచ్చిందిట. ఇంటి పనులన్నీ నిమిషాల మీద పూర్తి చేసి తలుపులన్నీ వేసేసి మేటనీ షోకి తయారయిపోయాను. వీధి తాళం వేసేసి కనబడిన ఖాళీ ఆటో ఎక్కేశాను.

మరుక్షణం థియేటరు 'అభిరుచి' లో బాల్కనీలో ఎఫ్ - 12 సీట్లో ఉన్నాను. చిత్రం మొదలెట్టిన మొదలు ఆ రేవతి పాత్రలో లీనమైపోయాను నేను. ఎక్కడున్నానో తెలియనంతగా పిచ్చి వెర్రీ ఎత్తిపోయాను. ఒక మంచి పని కోసం దేన్నైనా ఒదులుకోగల ఆ పాత్ర ఒంటరిపోరాటం నన్ను నిలువెల్లా ఓ కుదుపు కుదిపింది. ఇంతకు మించిన అద్భుతం ఆ థియేటరులోనే ఎదురుపడుతుందని నేను కలలో కూడా అనుకోలేదు! అదే సినిమాకి వచ్చిన ఝన్సీని ఆ షో అవగానే కలుసుకున్నాను!

ఆటోలో మా యింటికి వెడుతూ దార్లో ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. ఎమ్మే అయ్యాక ఏదో కంప్యూటర్ కోర్సులో అప్పుడే ఏడాదై చేరిందిట అది. వేరే పార్ట్ టైమ్ జాబ్ చేస్తోందిట. ఆఫీసుకి దగ్గరగా ఆ ఊళ్లోనే వేరే సమస్త సదుపాయాలూ ఉన్న చిన్న వాటా తీసుకుని తనదైన ఎస్టాబ్లిష్మెంటు పెట్టుకుని ఏడాది దాటిందిట. ఉత్తరాలు రాయడానికి బద్ధకం కదా, నాలా రాయలేదు, సాధారణంగా ఓ కార్డు మీద గెలుకుతుంది. మహారాస్తే చిన్న చీటీ లాంటిది. నాకీ వివరాలు తెలియజేశానంది. అందలేదు మరి!

"అదేమిటే? ఆస్తి పంచేసుకుని మీ అన్నలిద్దరూ ఎవరి మటుకు వాళ్ళు వెళ్లిపోయారన్నావు కాదుటే..... ఇక మిగిలింది ఆ పాత పెంకుటిల్లూ, ముసలి వాళ్లయిపోయిన మీ అమ్మా నాన్నా. ప్రావిడెంటు ఫండూ, గ్రాడ్యువిటీ మీ అక్క పెళ్లికే హరించుకుపోయాయని చెప్పేవు. అయిదొందల పింఛెను డబ్బుల్తో ఈ కరువు రోజుల్లో ఎలా బతుకుతున్నారనుకున్నావ్?"

"ఏం చెయ్యమన్నావ్. అట్నించి కూడా కో ఆపరేషన్ ఉండాలి కద. అక్కడుంటే రాత్రింబవళ్లు పెళ్లో పెళ్లో అని ఒకటే గోల. డబ్బు తన్నుకు పోయిన కొడుకుల మీద కొంచెమైనా కోపం లేదు. ఇంట్లో ఉండి అన్నీ చూస్తూ పోషిస్తున్న కూతురే బరువు. 'గుండెల మీద కుంపటి' అనే మాట ఎవడు కనిపెట్టాడో వాణ్ణి పెట్రోలు వేసి తగలెట్టాలి. తల్లిదండ్రులే మా మటుకు మమ్మల్ని మాకు నచ్చిన తీరులో బతకనివ్వరా! ముప్ఫైఏళ్ళు దగ్గర పడుతున్నా యింకా దాని మొహం దానికేం తెలుసు 'నిన్న మొన్నటి పిల్ల' గానే ఉన్నాను నేను! నెల నెలా రెండు వేలు సంపాదించి యింట్లో యిచ్చేస్తున్నా. ఆఖరికి నాకు తెలీకుండానే ఓ రెండో పెళ్లివాడితో సంబంధం నిశ్చయం చేసి కట్నంగా ఆ పెంకుటిల్లు అనుకున్నారుట. పెళ్ళంటూ నాకు చేసేస్తే 'అయ్యో ఆడపిల్ల పెళ్లి చెయ్యకుండా అలా ఉంచేశారు కదా.... అనే లోకనింద తప్పుతుంది కదా! ఆ పైన పెన్షన్ డబ్బులు యిస్తామని బతిమాలి పెద్దన్న దగ్గిరే బుగ్గి అవుతారట. బతకడంలో పరమార్థం కొరివి పెట్టించుకోవడమే కదా! ఇలాంటి దిక్కుమాలిన ప్లాన్లని తట్టుకోలేక ఏ నూతిలోనో ఉరకడానికి నేను వరవిక్రయం నాటి కాళిందిని కాను. సంగతి తెలిసిన ఆ రాత్రికి రాత్రే అన్నీ కుండ బద్దలు కొట్టినట్లు వాళ్లకి చెప్పేసి, నా సామాన్లు తీసుకొని ఓ ఫ్రండింటికి వచ్చేశాను. నాలుగు రోజుల్లో మంచి వాటా వెతుక్కుని ఇప్పుడున్న యింటికి వచ్చేశాను. ఎవరు గాని నా వ్యక్తిత్వం మీద దాడి చేస్తే అక్కడ ఓ క్షణమైనా ఉండలేను!"

విని ఊరుకోడం తప్ప దాంతో ఏం వాదించను! ఇంకా నన్ను అల్లరి పెట్టే ఓ ముఖ్యమైన ప్రశ్న మిగిలే ఉంది.

దాని పెళ్లెప్పుడుట?

ఆ సంగతి అడక్కుండానే ఆటో యిల్లు చేరిపోయింది.

అన్నట్లు అనుకోకుండా దాన్ని కలిసిన హడావిడిలో పై ఊరు వచ్చిన మనిషి చేతిలో ఓ బ్రీఫ్ కేస్ అయినా ఎందుకు లేదో, ఏ పని మీద వచ్చిందో కూడా అడక్కపోవడం నాకే ఆశ్చర్యమనిపించింది. ఓ ఫ్రండుతో కలిసొచ్చి హోటల్లో దిగిందిట. ఏవో కంప్యూటర్ పార్ట్స్ కొనడానికి వచ్చేరుట. వాళ్ల కంపెనీ తరపున. రాగానే ఆ పని అయిపోయిందిట. ఫ్రండు షాపింగ్‌కి వెడితే తనిలా మా యిల్లు వెతుక్కుంటూ వచ్చిందిట. తీరా వస్తే తలుపుకి గొళ్ళెం, దానికో పెద్ద తాళం కప్ప! 'అంకురం' సినిమా ఉందని తెలిసి అక్కడి కొచ్చి లక్కీగా నన్ను కలిసిందట.

శ్రీవార్ని కలవలేనందుకేం బాధ పళ్లేదు గాని దుర్గ ఎంతగా ఎదిగిందో చూడలేకపోయినందుకు బాధ పడింది. చాలా రోజుల తర్వాత కలసి భోం చేశాం.

"నీ కిష్టమని పెసరట్ల కూరా అరటిపువ్వు పచ్చడీ చేశాను. బాగా వచ్చాయా?" అంటూ కొసరి కొసరి వడ్డించాను.

"నా కిష్టమైనవి చేసినందుకు థాంక్స్. బాగా ఇష్టమైనవి ఇంకొన్ని ఉన్నాయి. అవన్నీ చేశావా మరి?" అంది.

ఈ రెండేళ్లలో యింకేం చేశానబ్బా! ఆ, గుర్తొచ్చింది. బీరువా తీసి ఆ మధ్య కొనుక్కున్న పట్టుచీరలన్నీ కుప్ప పోశాను. వంట గదిలోకి నడిపించి ఏడాదికి సరిపడే ఊరగాయలన్నీ కొత్త కొత్తవి. ఏవేం నేర్చుకున్నానో, ఎన్నెన్ని పెట్టేనో చూపించాను.

"ఎలాంటి ఉత్తరాలు రాసే దానివే! ఎంత చైతన్యపూరితంగా ఉండేవే అందులో సంగతులు! మొగుడనే వాడు ఎంత బ్రెయిన్ వాషింగ్ చేసినా, వ్యాపార దృష్టి తప్ప మరొకటి ఎరగని సాటి స్త్రీ లోకం ఎంత కిందకి లాగినా, నీ లాంటి నిప్పుకణిక యిలాంటి బుగ్గి తునకగా రాజీ పడిందంటే నమ్మలేకుండా ఉన్నాను. 'ఇదిగో ఇదీ నా ముందడుగు' అని కూతురికి దారి చూపించవలసిన దానివి స్నేహితురాలికి ఇంకా పట్టుచీరలూ ఊరగాయలూ చూపించే సిగ్గుమాలిన స్థితిలోనే స్థిరపడిపోయావా!"

దాని మొహం చూడలేక అటు తిరిగిపోయాను. ఇంకా చెప్పవలసినవీ, చూపించ వలసినవీ ఎన్నో ఉన్నాయనుకున్నాను. ఆ మధ్య మేం ఆలిండియా టూర్ వెళ్లి దేశంలోని ఇంచు మించు ప్రతీ దేవాలయమూ దర్శించి వచ్చాం. మంచి త్రీ బెడ్ రూం ఎపార్ట్‌మెంటు కొనుక్కున్నాం. కిందటేడు ఆయన నా పుట్టిన రోజుకి ప్రెజెంటు చేసిన వజ్రాల నెక్లెస్ యింకా బీరువాలో అలాగే ఉంది. ఇవన్నీ రెండేళ్లలో పెరిగిన మా ఐశ్వర్యం చాటేవే. దానికి జంకి కొన్నే బయట పెట్టేను. ఇంకానయం!

"నే యిలా అన్నానని నొచ్చుకోకే! నీలో వచ్చిన ఈ మార్పు నాకెందుకో గొంతుకలో పచ్చి వెలక్కాయలా ఉంది. నువ్వే ఆలోచించి నీకు నచ్చిన పద్ధతిలో ఓ నిర్ణయానికి రా. ఏదైనా నీ కూతురు గమనిస్తూ ఉంటుందని మాత్రం మరచిపోకు. సరే వస్తాను. కబుర్లలో పడి ఆలస్యమైపోయింది. హోటల్‌కి ఓ ఫోన్ చేసుకుంటానే."

మా టెలిఫోన్ తీసి హోటల్‌కి ఏదో నెంబర్‌కి డయల్ చేసింది.

"అవునండీ, రూమ్ నెంబర్ ఫార్టీటూ. డబుల్ రూమే. ఓసారి కనెక్షన్ ఇస్తారా?" అంటూ ఓ గడీ వెయిట్ చేసి, "ఎవరూ మధూ నువ్వేనా? షాపింగ్ పని పూర్తయ్యిందా? ఇక్కడ మా క్లోజ్‌ఫ్రెండు ఒకర్తుందని చెప్పేనుగా? డిన్నర్ అయిపోయింది. నువ్వూ అక్కడ కానిచ్చెయ్. ఓ అరగంటలో వస్తున్నా"

"మధూ ఎవరే? మధుమతా, మధుబాలా?"

ఝూన్సీ పక పక నవ్వింది.

"రెండూ కాదే, మధుసూదనరావని, మా కొలీగు, ఇద్దరం కలిసొచ్చి హోటల్లో దిగేమని చెప్పేనుగా!"

నా గుండె దడ దడ కొట్టుకుంది.

అనుకున్నది ఆచరణలో పెట్టగల ధైర్యశాలి ఏదైనా చేస్తుంది! తనకి నచ్చిన ఎవడ్నో రిజిష్టరు మేరేజి చేసుకుని ఉంటుంది. హనీమూన్‌కి ఇలా వచ్చి ఉంటుంది. ఆ మాటే అడిగేశాను. హేండ్ బాగ్ తీసి రెండు రకాల పిల్స్ చూపించింది. సెక్స్‌లో పాల్గొనే స్త్రీ పురుషులు వాడే ఫేమిలీ ప్లానింగ్ మాత్రలు అవి. ఎందుకైనా మంచిదని ఇద్దరూ వాడతారట.

దాని మెడలో పుస్తె లేనందుకు నేనేం ఆశ్చర్యపోలేదు. అతన్ని నాకు చూపించే ప్రయత్నం చెయ్యనందుకు మాత్రం బాధపడ్డాను.

"ఎలా ఉంటాడే, బాగుంటాడా?" అని అడక్కుండా మాత్రం ఉండలేకపోయాను.

"ప్రస్తుతానికి ఫరవాలేదు. ముందు ముందు చూడాలి"

"పోన్లే ఎప్పటికో అప్పటికి నీకు నచ్చిన వాణ్ణి కట్టుకున్నావ్ కద?"

"కట్టుకోవడం ఏమిటే నీ మొహం! ఇంకా మేం ప్రొబేషన్ పీరియడ్‌లోనే కదా ఉన్నాం.

"అయితే ప్రేమించుకుని ఉంటారు. మేరేజ్ డేట్ ఎలాగా ఫిక్స్ అయింది కదా అని ఇలా వచ్చేసి ఉండాలి, అవునా?"

" అదేం లేదు. ప్రాక్టికల్ యాస్పెక్ట్ తప్ప ప్రేమ అనే దోమని పొరపాటున కూడా జొరబడనివ్వం. రొటీన్ వర్క్‌తో బాగా టైర్ అయి ఉంటాం కదా..... మాకూ రిలీఫ్ కావాలి. టెన్షన్ అనేది రిలీజ్ కావాలి. దాని కోసం అప్పుడప్పుడిలా వస్తూ ఉంటాం.

నా ముఖంలో నెత్తురు చుక్క లేదు! ఎవడ్నో తీసుకొచ్చి పై ఊరి హోటల్లో సిగ్గు లేక కులకడమేగాక దానికో సమర్థన కూడానా!

"నువ్వు నిదానంగా వింటే నా యీ చర్యకి మరో జస్టిఫికేషన్ కూడా కనపడుతుంది విను. మన పెద్దవాళ్ళు మన ఆడపిల్లలకి వరుణ్ణి వెతుక్కునే ఛాన్సు జన్మలో ఇవ్వరు. డాక్టర్లయినా డాక్టరేట్లు తెచ్చుకున్నా డాటరు అన్నది పెళ్లిచూపుల తంతుకి తలవంచవలసిందే! విదేశాల్లోని ఫ్యాషన్లూ, సరుకులూ, ఉద్యోగాలూ జీతాలూ మనకి కావాలి గాని వాళ్ల 'డేటింగ్ సిస్టమ్' అంటేనే గుండె బాదుకుంటారు! ఇదేదో ప్రగతిశీలక ఉద్యమం అని నేననను గాని ముక్కూ మొహం తెలీని వాడితో బిక్కు బిక్కు మనే కాపరంతో పోలిస్తే కొంతవరకూ నయమే. మన వ్యక్తిత్వం ప్రదర్శించడానికీ, అవతలవాడి వ్యక్తిత్వం తెలుసుకోడానికీ అవకాశం ఉంటుంది. ఇష్టం లేని వాడితో చావు దెబ్బలు

తిని పక్కమీదకి చేరి ఒళ్ళు హూనం చేసుకునే చచ్చు సెక్సు కన్న ఫ్రెండ్‌తో ఎంజాయ్ చేస్తే తప్పేముందిట? తాళీ, వేవిళ్ళూ అంటూ సెంటిమెంటు పేరుతో కాసులు కొల్లగొట్టడానికి ఇది తెలుగు సినిమా కాదు. ఆడదానికే ఆపాదించి రాయబడిన శీలవంతుల పతివ్రతల కథలు సహజత్వానికి దరిదాపుల్లోకైనా రావు. శీలమనేది శరీరానికే పరిమితమై మనస్సుకుండే స్వచ్ఛత పక్కకి పెడితే, మధురవాణి లాంటి మానవతులు ఏమైపోవాలి?

ఇంకా మా ఝాన్సీ ఎంత సేపు లెక్చరిచ్చునో, ఇక్కడి నెంబరిచ్చింది కాబోలు టెలిఫోను మ్రోగి అవతల్నించి మధుసూదనరావు కాబోలు ఏదో మాటాడేడు.

"నువ్వే ఆలోచించు లలితా... మన మటుకు మనం తెగించి మనకి తోచిన మంచి పద్ధతి ఎంచుకోకపోతే మరి బయట పడలేం. చాలా వరకు మన పెళ్లిళ్ల మేకపోతుని కసాయి వాడికి డబ్బిచ్చి కట్టపెట్టడమే! ఈ దోపిడీ వ్యవస్థలో నిలిచేది యజమానీ, బానిసా సంబంధమే. సంస్కర్తల సత్కార్యాలన్నీ చంక నాకిపోయి వ్యాపార దృక్పథమే ప్రపంచాన్ని ఏలుతోంది. స్నేహితుడిలాంటి వరుణ్ణి ఎంచుకుని సుఖపడాలంటే ఈ నాటి కన్యలకి కొన్ని ఎక్స్‌పర్‌మెంట్సు తప్పవు. ఇందులో ఫెయిలయినా నాకేం విచారం లేదు. వొస్తా. మళ్ళీ కలుస్తా"

నాలో తుఫాను రేపి ఝాన్సీ వెళ్లిపోయింది.

'ఎంతగా చదువూ, సంస్కారం ఉన్న అమ్మాయి ఎలా చెడిపోతోందో!' అనిపిస్తుంది ఝాన్సీ ఉదంతం విన్న ఎవరికైనా. అది చెడిపోడమో, నిస్సహాయురాలైన ఓ కన్య బాగుపడ్డానికి తీసుకున్న కఠినమైన నిర్ణయమో దాంతో ఇంత పరిచయమున్న నేనే చెప్పలేకపోతున్నాను. ఇంతకీ బాగుపడ్డానని నేను బావుకున్నదేమిటో నాకే అర్థం కావడం లేదు!

*(రచన జన్మదిన సంచిక, ఫిబ్రవరి, 1999)*

# సంచితార్థం




**అనుకున్నవన్నీ** ఆచరణలో పెట్టలేని సాధారణ మానవులం కనక చచ్చినట్టు పడున్నాం గాని లేకపోతే ఆ రాత్రి పన్నెండు గంటల తర్వాత పారా గునపమూ పట్టుకుని నేను మా ఆవిడ గులాబి తోటలోనూ, ఆవిడగారు పెట్రోలూ అగ్గిపెట్టీ పట్టుకుని నా గ్రంథాలయంలోనూ ప్రత్యక్షమై అనుకున్నపని ఆరంభించవలసిన మాట. అంతలా కసి పెరిగిపోయింది ఒకళ్ళమీద ఒకళ్ళకి, ఆ బదిలీ కాగితాలు నా చేతికి అందిన మరుక్షణం నుంచీ.

"నీకేమైనా బుద్ధుందా లేదా, ఈ ఇరవై పూలకుండీలూ మనతో తీసుకెడదామంటావా! మనకి బదిలీ అయిన మహాపట్నం ఎలాంటిదో ఎరుగుదువా? ఈ వానాకాలం అక్కడ డైరక్ట్‌లారీ వెళ్ళదు. చుట్టూ తిరిగి రెండు రైళ్ళు మారి, అక్కణ్ణుంచి ముప్పైమైళ్ళు నాటు తెప్పమీద ప్రయాణం చేస్తేగాని ఆ ఊరు రాదుట. ... అదైనా ఆ స్టేషనులో రైలు ఏడు నిమిషాల కంటె ఆగదుట. ఇంకా రైలు ఆగకుండానే ప్రయాణీకులు కిటికీల నుంచి ఒకటీ ఒకటీ సామాను విసురుకుంటారుట.

'ఆఁ అన్ని సామానులూ వెళ్ళేయి, ఈ రెండు పూల మొక్కలూ వెళ్ళ నన్నాయి! ఛాల్లెద్దురూ

మీ దంతాబడాయి". అంది నా అర్ధాంగి, ఇంతటి నా బాధలోనూ సహస్రాంగి అని అయినా అనిపించుకోనంత తేలికగా- అన్నీ వినికూడా.

"అయ్యో పాపం రెండేనా నీపూల కుండీలు!" "రెండంటే, రెండేనా ఏమిటి? మొన్న తెచ్చివేసిన ఆరెంజ్ గులాబీతో కలిపి మహా ఉంటే ఇరవై రెండు ఉంటాయేమో!"

"ఆఖరి మాట చెబుతూన్నాను. ఆ ఇరవై మూడు ఇక్కడఉంచవలసిందే!"

ఆ ఇరవై మూడో శాల్తీ తనే అని గ్రహించలేనంత వెర్రిదేం కాదు మా ఆవిడ. "'అంతగా వాటిని వదిలి రాలేకపోతే వాటితోపాటు నువ్వూ ఇక్కడే ఉండిపో అంతేగాని వాటిని తీసుకురావడం కుదరదు" అని నేను చెప్పకుండానే గ్రహించేసినట్టుంది.

"అలాగే! మా వెయ్యిన్నూట పదిహేడూ ఇక్కడే ఉంటాయి గదా! వాటిని వదిలి ఈ ఇరవై మూడూ ఎక్కడి కెళ్లగలవు!" అంది ధీమాగా.

నా పెర్సనల్ లైబ్రరీ ఆ మధ్య లెక్కలేస్తే వెయ్యికి దరిదాపుల్లో ఉన్నట్టు తేలింది. అన్ని ఎక్కువ పుస్తకాలున్నాయని సరదా వేసి, ఆ కొరత తీర్చి, వెయ్యి చేశాను. మా ఫ్రెండొకడు నూట పదహారు పుస్తకాలు ప్రెజెంటు నూట పదహారు పుస్తకాలు ప్రెజెంటు చేశాడు. ఇద్దరం కలిపి మా యింట్లో చిన్న ఫంక్షన్ లాంటిది ఏర్పాటుచేసి నలుగుర్ని పిలిచాం కూడా. ఈ మధ్యనే వేలంలో చవగ్గా వస్తే నాలుగు చిన్న అద్దాల బీరువాలు కొని మా ఆవిడతో మూడు రాత్రింబగళ్ళు హోరాహోరీ పోరాడి స్టోర్ రూమ్‌ని లైబ్రరీగా మార్చి ఆ పుస్తకాల బీరువాలు అక్కడికి తరలించాను. ఇన్నాళ్ళ బట్టి దిగ్విజయంగా వెలిగిపోతున్న మా సంస్థ ఉన్నట్టుండి ప్రభుత్వంవారు వశపరచుకుంటారనీ మా కందరికీ బదిలీలు ప్రసాదిస్తారనీ ఎవరెరుగుదురు?

"అయితే? అందుకనీ. ఎక్కడ బడితే అక్కడ దొరికే ఈ ముళ్ళ మొక్కలకీ, ఎంచి సేకరించిన యీ ఉద్గ్రంధాలతో సాటి తెస్తుందా? రాళ్ళూ రత్నాలూ ఒకే రకం దారంతో గుచ్చుకుంటారా ఎవరైనా! ఏమి దీని సాహసం!" ఆ మాటే నిలదీశాను.

"చూడండీ, పిల్లలు కూడా ఎక్కడ బడితే అక్కడ కనిపిస్తారు? అలాగని మానుకుంటున్నారా, లేకపోతే ఎవరి పిల్లల్ని వారు కూడా రైలెక్కించుకుంటున్నారా?"

అని ఎదురుసవాలు వేసింది!

ఈ అన్యభాషా ప్రాంతంలో పిల్లలకి చదువులు వంటబట్టక వాళ్లమ్మగారి ఊళ్లో ఉంచి చదివిస్తున్నాం. కన్న ప్రేమ కన్న పెంచుకున్న ప్రేమ గొప్పదంటారు కాబట్టి మా శ్రీమతికి ప్రస్తుతం పువ్వులే పుత్రికలు, నాకు పుస్తకాలే పుత్రులు.

"వీళ్ళు మన అభిమాన పాత్రులు వీళ్లని రైలెక్కించడం మన కెలాగా తప్పదు. వీళ్ళు లేకుండా మనం ఎలాగా ఉండలేం, ఈ విషయంలో మనకి అనవసరంగా అల్లరెందుకు గాని....."

అని అతిత్వరగా రాజీకి విచ్చేసి పుస్తకాలూ పూలదండులూ తీసుకెళ్ళక తప్పదని తనకి తనే గడుసుదనంగా గుట్టుగా నిర్ణయంచేసి,

"........... ఇల్లు నిండిపోయిన సంసారం ఇంకా చాలా ఉంది. ఇటువైపు మళ్లించండి కొంచెం తమ దృష్టి. జాయినింగ్ టైం కూడా ఆట్టే ఇవ్వలేదంటున్నారు."

అని నిమిషాల మీద టాపిక్ మార్చేసింది. అవును అది చెప్పినమాట నిజమే! చేటలూ బుట్టలూ

కేలండర్లూ, చీపుళ్ళూ ఇలాంటి ఒక బలమైన మనిషి గోడవతలకి గిరవాటు వెయ్యగలిగిన వస్తువుల మాట అటుంచి నలుగురు వస్తాదులు కలిసినా కదపలేని సరుకులు చాలానే చేరేయి మా యింటిలో. ఏం దారి. వీటిలో ఏది ముఖ్యం! ఏది కాదు! తీసి కెళ్ళేది ఏది, వదిలేసేది ఏది! ఈ కరువు రోజుల్లో ఏది తీసికెళ్ళకపోతే మళ్ళీ డబ్బిచ్చి కొనుక్కోగలం! ఉదాహరణకి మా అన్నయ్య మా పెళ్లికి ప్రెజెంట్ చేసిన సోఫాసెట్టు ఉంది. వాళ్లక్కయ్య ఆ వేళకే డబుల్‌కాట్ ఇచ్చింది. రెండు పక్కలా అంతో ఇంతో ఉన్నవాళ్ళం. కాస్తో కూస్తో ఇద్దరికీ ఆర్టూ, అందమూ తెలుసుమరి, ఇంట్లో సరుకు పెరిగిందంటే పెరిగినమాట నిజమే మరి. సంసారంలో ఏది లేకపోతే జరుగుతుంది కనక! ఏడేళ్ళయి ఆ ఊళ్ళో ఉంటున్నాం. అదృష్టవశాత్తూ విశాలమైన ఇల్లే దొరికింది.

ఈనాడు నాకు ట్రాన్ఫ్సరు అయింది గదా అని కాలుజారి నెల తప్పిన కన్యలా నేనూ, పెళ్లి కెదిగిన కూతురున్న తల్లిలా తనూ, ఎప్పుడూ భారం దింపుకుందామా అనీ ఏదో తప్పుచేసినట్టు ఎందుకు బాధ పడాలి!

ఎవరికైనా ట్రాన్ఫ్సర్ ఆర్డర్సు వచ్చాయో లేదో నాకు తెలీదుగాని, సామానులు సర్దుకున్న ఆ నాలుగు రోజులూ యుద్ధం ప్రజ్వరిల్లేది. మాట వరసకి "మీ అమ్మలా ఆకారం అనీ ఆ ఆవకాయ గూనలెందుకు?" అని నేనంటే,

"అదే నేనూ ఆలోచిస్తున్నాను, మీ బాబుని పోలిన బార్‌లైట్లు రెండున్నాయి కొంపలో! వాటితో వీట్ని వడ్డించండి ఏకంగా శని విరగడవుతుంది!"

అని వెంటనే జవాబు వచ్చేసేది.

"చూడూ ఇన్ని డబ్బాలూ సీసాలూ పోగుచేశావు కదా, వీట్నిప్పుడు ఏం చేద్దామనీ!"

"అటక నిండిపోయిన తమ పాత జోళ్ళూ, అలమరలో కిక్కిరిసిన పాత బ్లేడ్లూ ఇలాంటి ఇల్లునిండిపోయే ఆస్తి కూడా బెట్టేరు కదా? ఏం చేసుకుందామనీ?"

"కట్టేదీలేదు ఏం లేదు ఈ కుట్టు మిషనుకూడా ఎందుకూ!"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. హోదాకి కొన్నాంగాని ఎప్పుడైనా వాడాంగనుకనా, మీ టైపు మిషనూ ఇదీ కలిపి అమ్మేద్దాం. ఏం?" మొగాడుగాడు ఇంతటి కష్టపరిస్థితులలో ఉంటే ఇలాగేనా ప్రవర్తించేదీ? ఇది ఆడదాయా, ఆకురాయా!

అది వద్దంటూనే ఉంది గాని "ఆడ దాని మాట విని బాగుపడ్డ మగవాడెవడు?" అని మనసులో అనుకొని మా మేనత్త కొడుకు రాంబాబుకి ఉత్తరం వ్రాశాను. "బండెడు సామానులు సర్దుకోలేక ఇలా ఒక్కణ్ణీ చస్తున్నాను. వచ్చి కాస్త చెయ్యూత ఇవ్వరా మహానుభావా" అని, తనకి తీరికలేకపోతే ఆ మాట రాయొచ్చు. తనకి ఇష్టంలేకపోతే ఆ సంగతి తెలియజేయొచ్చు. కాని అదును దొరికిందిగదా అని ఓ ఆట ఆడించడం అనవసరం. లోకంలో ఓ పూట గంజినీళ్ళు కరువైన వాళ్ళు వేలకొద్దీ ఏడుస్తూంటే ఐహిక సుఖాలకోసం అర్రులుచాచి అష్టయిశ్వర్యాలూ మూట గట్టుకుందామని చూసేవాళ్ళందరికీ నా ప్రస్తుత పరిస్థితి చూసి తెలుసుకోవలసింది ఎంతో ఉందిట. పెంచుకున్నవాళ్ళు ఆ భారం మొయ్యవలసిందే నట. కొందరు పరలోకంలో అనుభవిస్తే కొందరు ఇక్కడే అనుభవిస్తారుట- వెంటనే వచ్చిన జవాబులో ఇదీ సారాంశం. ఆలోచించి చూస్తే తను అడిగినప్పుడు మా ఆఫీసులో నేను రాంబాబుకి ఉద్యోగం వేయించలేక పోయాననే సత్యానికీ ఈ ఉత్తరానికీ ఏదో దగ్గర సంబంధమే

ఉన్నదనిపించింది. ఇంట్లో అందరికీ నీళ్ల మజ్జిగే అయినా ఏ పూట పెరుగుబిళ్ల వెయ్యకపోయినా విస్తరితన్నేస్తాడువాడు. ఎప్పుడూ బుగ్గని 'పండా సుబుద్ధీ' పెదిమల మధ్య 'వజీరు సుల్తానూ' ఉండవలసిందే వాడికి, ప్రపంచాన్నీ పంచభూతాల్నీ తన అనుగుణంగా నడవలేదని వాడు ఎత్తిపెట్టని తిట్టిపొయ్యని రోజుండదు. 'ఇంతటి అన్నీ విడిచిపెట్టినవాడు కాకపోతే నాకలాంటి జవాబు చెప్పగలడా!' అని సరిపెట్టుకున్నాను.

మా ఆవిడకూడా ఇలాంటి చిన్న పిల్ల సైజు పరాభవం ఒకటి జరిగి నాకు కొంత మనశ్శాంతి నిచ్చింది. ఎదురింటి చుట్టపావిడ మా యింటికి వచ్చిన తనకు తానుగా సామానులు సర్దుతానని మొదలు పెట్టింది, ఆవిడ సర్దింది తక్కువా సణిగింది ఎక్కువా.

"నువ్వేమంటూ అనూ సామానులు సర్దుకునేటప్పుడు మొగాళ్లని మాత్రం యిరు పంచలకి రానియ్యకూడదే అమ్మాయ్! ఊరంతా తిరిగి ఆవురావురుమని యింటికొచ్చి, వేలెట్టేదాకా వాయించడమే గాని యింట్లో ఏం కావాలో ఏం అక్కర్లేదో వాళ్లకేం తెలుస్తుందే! ఏదీ ఒదిలెయ్యకు సుమా! యింకా ఏమిటో అనుకున్నాను. యిదో సామానా! మీ తాతగారికి బదిలీ అయినప్పుడు సామాన్లు తీసుకెళ్లేమా, అనకాపల్లి నుంచి అరసవిల్లి దాకా మా బళ్ళు నిలబడితే రోడ్డు మీద మరో బండికిక ఖాళీ లేదనుకో. మనమేం చేత్తో మోసుకెళ్ళంగదా! మీకేం యిద్దర్ని కని, గుప్‌చుప్‌గా ఊరుకున్నారు. మా రోజుల్లో అయితే పెట్టీబేడాతోపాటు పిల్ల గాడిదల్ని కూడా లెక్క పెట్టుకునే వాళ్లమే అమ్మాయీ!" ఆ శ్రీహరి కథ అలా ఎంతవరకూ సాగునో ఆవిడ దృష్టి తిరగలిమీద పడింది. ఆదిమ్మని నోరు విడిచి అడిగింది. కుదరదని నోరు తెరిచి చేప్పేసింది ఈవిడ. అంతేలేచి నిలబడిపోయింది.

"పెద్దదాన్ని ఏదో అడిగేను గాని ఈ గుళ్ళూ రాళ్ళూ కూడా పట్టుకుపోం కదా అమ్మాయీ! యిద్దరు మనుషులన్నారు. నేనన్నానని కోసం ఒద్దుగాని మరీ యింత యిల్లుపట్టని సామానా!" ఆవిడ గురించి యిదివరకే ఎదురింటి నుంచి విని ఉందేమో ఈవిడ ఒక క్షణం ఊరుకోలేదు.

"మీరు చెప్పింది నిజమే పిన్నిగారూ!

అయితే ఒకటి. ఒక్కచేతి సంచీతో ఈ కరువురోజుల్లో చుట్టాలింటికి చేరి నెలలు నెలలు ఉండిపోవడం అందరికీ మాత్రం చేతకాదు. ఎదుటివాళ్ళ ఏ వస్తువు అయినా తవదిలాగా వాడుకోగల సమదృష్టి ఏ తపశ్శాలికో తప్ప సాధ్యం కాదు!"

ఆవిడ మరిక్కడ క్షణం ఉండలేదు. చురచుర చూస్తూ జారుకుంది. "పాపం పెద్దావిడని పట్టుకుని ఏం మాటలవీ!"

"లేకపోతే? అడిగింది యివ్వలేదని ప్లేటు ఫిరాయిస్తుందా? మీకు తెలుసునో తెలియదో, ఆ మహాజ్ఞానికి వాళ్ల ఊర్నిండా అప్పులేనట. ఎప్పుడు యిదివెళిపోతుందా అని ఎదురింటి వాళ్ళంతా ఎదురుచూడని క్షణం లేదుట. యింతటి గుణకీర్తి నన్నే ఎత్తి పెడుతుందా? నేనేనా ఊరుకొనేది!"

ఈ రెండు అనుభవాలూ అయాక మరెవరి సహాయమూ మేము అర్థించలేదు, ఆశించలేదు కూడా. డబ్బిస్తే మనం ఎలా చెబితే అలా చేసేవాళ్ళు యింకా దొరుకుతున్నారు. కాబట్టి అలాంటి వాళ్ళ చేత పనులు చేయించి సామానులు కట్టించి స్టేషనుకి తరలించి కొన్ని కొన్ని గూడ్సులో బుక్‌చేయించాము. ముఖ్యమైనవీ విలువైనవీ అనుకున్నవి కొన్ని కూడా తీసికెళ్ళేం. ఎలా అయితేనేం

చచ్చి చెడీ అడంగు చేరేం..... మా అదృష్టం మంచిదే. మేం అడుగు పెట్టిన ఊరూ. మాకు దొరకిన ఇల్లూ మా ఇద్దరికి కూడా సంతృప్తికరంగానే ఉన్నాయి. కాని తీరిక సమయాల్లో నన్నో ప్రశ్న ఇంకా బాధించడం మానలేదు. అంతకు ముందు అందర్నీ ఎరిగినా, ఎందరో తెలిసినా కళ్ళముందు సైన్యాలు బారులు నిలబడితే అర్జునుడు కలవర పడినట్లు ఆనాడు స్టేషనులో దింపబడిన మా మూటలూ వాటి సంఖ్యా చూస్తే మాత్రం నాకు మతిపోయింది! 'ఇద్దరం ఉన్నాం కదా ఇన్ని సామాన్లు అవసరమా! అనే సందేహం నా భార్యముందు మాత్రం వెల్లడించడానికి అవకాశం లేదు. ఈ విషయంలో ఆవిడకి రెండు మాటలంటూ లేవు 'ఉపయోగిస్తున్న ప్రతీ వస్తువు మనకి అవసరమే!' అని ఆమె చెక్కు చెదరని అభిప్రాయం. పైకి అనలేక పోవచ్చుగాని నా బాధలు నాకున్నాయి ఈ ప్రయాణంలో మా ఎలక్ట్రిక్ గ్రైండర్ పాడయింది. అది రిపేరు చేసేవాళ్ళు మా ఊరి చుట్టుపట్ల లేరు. మా గేస్ పొయ్యి అలా దాచుకుని పూజించవలసిందే. కనుచూపుమేర ఇక్కడ గేస్ సప్లయి లేదు. 'యివి కొనుక్కోకపోతే ఈ బాధ ఉండకపోనుగదా!' అని పొరపాటున నేను అన్నదానికి మా ఆవిడ చెప్పిన జవాబు యిదీ. "ఓ గృహస్థుకి ఓ కొడుకూ కూతురూ ఉన్నారనుకుందాం. ఖర్మం జాలక కొడుకు పరీక్షలో ఫేలయ్యాడు, వాళ్ళు బీదవాళ్ళు కనుక వాళ్లిచ్చే రేటుకి తెలిసినంత మేర వాళ్ళమ్మాయికి వరుడి సప్లయి లేదనుకుందాం. 'వీళ్ళని కనకపోయిన ఉంటే ఈ చికాకు తప్పేది కదా!' అని తల్లిదండ్రులు అనుకుంటారా?'' దీనికి నేను చెప్పే జవాబు ఏమీ లేకపోయినా ఈ వస్తువుల్ని మా ఆవిడ పిల్లల్లా ప్రేమిస్తోందని స్పష్టం అయింది నాకు, ఈ బంధనాలు మరింత పటిష్టం కాకముందే వీటినుంచి ఎలాగైనా విముక్తులం కావాలి అనిపించింది. ఈ నాగరిక జీవనం ఈ ఆధునిక పరికరాలూ మనిషిని మరింత మరగా మార్చేస్తున్నవేమో అనిపించింది. అసలు ఒకమనిషికి ఎన్ని సామాన్లుండాలి? ఎన్ని జతలు బట్టలయితే సరిపోతాయి? ఎన్ని కేజీల బియ్యం ఎన్ని కూరలు! యెన్ని గదులు? ఇలాంటి విషయాల్లో తలసరి యింతా అని నిర్ణయించడం జరిగేపనేనా? యిది జరగని నాడు యెవడు గొప్పో యెవరు బీదో ఎలా నిర్ణయిస్తారు? యిదే సరిగ్గా నిర్ణయించలేకపోతే కంఫర్ట్‌కీ లగ్జరీకి సరిహద్దు రేఖ యెలా గీస్తారు? యిలాంటి వందలాది సందేహాలు వెర్రెక్కించేయి నన్ను. నేను మొదట్నుంచీ ప్రేమించి ఆరాధించే మా నాన్నగారి స్నేహితుడు సుబ్రహ్మణ్యం గారికి నా మనసులో ఉన్నదంతా రాసుకుంటేగాని నాకు తోచలేదు. వెంటనే జవాబొచ్చింది 'బాబూ! నీ ఉత్తరం అందింది నా మీద గౌరవం ఉంచి అన్నీ రాసినందుకు ఎంతో సంతోషం. నీకీ మధ్య బదిలీ అయినట్టూ సామాన్లూ అవీ పెరిగి, ప్రయాణంలో బాగా ఇబ్బంది పడ్డట్టూ రాశావు! ఇంకా యెన్నెన్నో అనుమానాలు యెంతో చనువుతో వెల్లడించావు నీ సందేహ నివృత్తి చెయ్యడం నా ధర్మం నాయనా! కోరికలు మనిషిని కోతిని చేసి ఆడిస్తాయి! ఏవేవో లేనివి కోరుకొనేలా చేసి పాపాన్ని పెంచుతాయి ఆ పాపానికి ప్రతిరూపాలే మనం మన ఇంట్లో చేర్చుకునే సామాన్లు. యెన్నున్నా ఇంకా అన్ని కావాలని అనిపిస్తుంది. లోకమంతా తెచ్చి ఇంట్లో పెట్టుకుందామనే భయంకరమైన దురాశకి ఇదే మొదటి మెట్టు సుమా! నువ్వు సమయానికి గుర్తించి వీటిని అదుపులో పెట్టుకుందామని చూడడం ఆరోగ్యకరం. ఒక్కటి గ్రహించు. నిండు బ్రతుకులు బతికిన మన పూర్వులకి ఇప్పుడున్న పరికరాలు యెన్నున్నాయి! అయినా వాళ్ళ సుఖ శాంతులకేం లోపం వచ్చింది? ధనికులూ ఆధునికులూ వేస్తున్న ఈ వెర్రి తలలకి దూరంగా ఉండు. ఐహికమైన వాటి మీద భ్రమలు తగ్గించుకుని,

తామరాకు మీద నీటి బిందువులా జీవించాలి. ఒక మనిషి యెంత తక్కువ సరుకులో జీవించగలడో ప్రయత్నించి సాధించాలి. తాపత్రయం తగ్గించుకుని పరమాత్మని పరిశోధించాలి.

పూర్తిగా అర్థం కాలేదుగాని ఏదో తృప్తి నిచ్చింది ఆ ఉత్తరం. ఇదివచ్చిన రెణ్నెల్లకి కాబోలు ఆయనకి ఉన్నట్టుండి సుస్తీ చేసిందని కబురు తెలిసి నిలుచున్న పళాన వెళ్ళిపడ్డాను. ఆయనకి వంటిమీద తెలివిలేదు. తాటాకు పాకా, పేడతో ఆలికిన అరుగులూ; కుండలతో వంటలూ ఆనాటి ఏ ఆశ్రమంలోనో ఆడుగుపెట్టినట్టుంది. నేటి మన కృత్రిమ వాతావరణంలో కూడా ఆయన సామాన్య జీవన సరళి యెంతటి పరిశుద్ధంగా ఉంది!' అని నేనేదో అనబోతే కరణంగారు అందుకున్నారు. 'ఆఁ గాడిద గుడ్డు. అన్నీ తెంపుకోడం అంత సుళువేం కాదు, ఉన్నది యెవర్నయినా ఏ నాడైనా తిన నిచ్చేడా. చచ్చేడా! ఇంటిల్లి పాదినీ పస్తులుంచి పైసాపైసా సొమ్ముచేసి నూట ఏభై తులాల బంగారం పోగు చేశాడు. యెవడికో తెలిసింది. రాత్రికి రాత్రి కన్నం వేసి యెత్తుకుపోయాడు. ఆ దెబ్బతో చూపూ మాటా పడిపోయాయి!' ఇక వినలేక తిరుగు రైల్లో ఇల్లు చేరుకున్నాను.

అనుకున్నవన్నీ ఆచరణలో పెట్టలేని సామాన్యులం కనక ఊరు కున్నాంగాని. నేను ఇల్లు చేరిన ఆ నాటి రాత్రి ఆకులూ వక్కలూ పట్టుకుని మా ఆవిడా, మంచి గంధమూ మల్లెపువ్వులూ పట్టుకుని నేనూ ఒకరికోసం ఒకరం యెంత సేపైనా యెదురు చూడవలసిన మాట.

*(జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక, 1971)*

# యోగ్యత




నీళ్లతో మొహం కడుక్కుంది. డికాక్షన్ కాఫీ రెండు కప్పులు తక్కువ కాకుండా ఎక్కించింది. ఫుల్ స్పీడ్‌లో తిరుగుతున్న సీలింగు ఫ్యాను కింద పావు గంటై దొర్లుతోంది. అయినా పార్వతమ్మ అలసట తగ్గలేదు.

ఆ రిక్షావాడితో అంతకుముందు ఆనిడ పడ్డ ఘర్షణ నుంచి ఓ పట్టాన మామూలు స్థితికి రాలేకపోతోంది. ఒంటరిగా నిస్సహాయురాలిగా ఉంటే మాత్రం ఇంతటి దోపిడి ఎక్కడైనా ఉంటుందా!

తనిల్లు ఎక్కడో స్పష్టంగా చెప్పింది. దార్లో మార్కెట్లో సామాన్లు కొనుక్కుంటాననీ, అవి రిక్షాలో తీసుకురావలసి ఉంటుందనీ, అన్నీ కలుపుకునే పన్నెండు రూపాయలకి మాట్లాడుకుంది. బేరం కుదుర్చుకున్నప్పుడు బాగానే ఉన్నాడు. మంచి బియ్యం కనబడితే అరబస్తా పడేయించుకుంది. అక్కణ్ణుంచి ఆరంభమైంది అల్లరి, పేచీ, సామాన్లంటే ఏ కూరలో పప్పు దినుసులో అనుకున్నాట్ట. 'ఇలా అయితే మీరిచ్చిన కిరాయి కిట్టదండి' అంటూ దారి పొడుగునా ఒకటే సణుగుడు. దార్లో ఎరిగిన మనిషి కనబడే పలకరిస్తే, కాస్సేపు రిక్షా ఆపించి దాని మంచీ చెడ్డా కనుక్కోడం మరో

మహాపరాధం. వాడి నస భరించలేక గురుద్వార్ మళుపు తిరిగే సమయంలో ఎరక్కపోయి నోరు జారేసింది. 'నిన్నగాక మొన్న ఇంతకు రెట్టింపు సామాన్లు అంత అప్పా ఎక్కించడమే కాక మా మేడమీది వాటాకి చేర్చి, పదిరూపాయలిస్తే కళ్లకద్దుకుంటూ పోయాడు. నీలాంటివాడే! ఇంత అల్లరి ఎరగం సుమా, అన్నీ ముందు మాట్లాడుకున్నాక! కావాలంటే అడగాలి గాని ఇలా నానాగోలా పెట్టడం ఏం బావులేద్సుమా!

అంతే, ఆ మలుపులో రిక్షా ఆపేశాడు. 'ఈ కొండమీదకి సింతోపాటు మీతోపాటు ఇవన్నీ చేర్చడం కాక, అక్కణ్ణుంచి, పై వాటాలోకి మొయ్యాలా? తల్లీ మీకూ మీ బేరానికి నమస్కారం.

ఓ రెండు నేనే తగ్గించుకుంటాను. ఓ పదరూపాయల నోటు నా మొహాన తగలేసి సరుకుతోపాటు మీరూ దిగిపోతే మరో నాలుగు రోజులు బతుకుతాను.' అనే ధోరణిలో దోపిడీ. అక్కడున్న రిక్షా వాళ్ళూ పనీ పాటూ లేనివాళ్లూ తనచుట్టూ చేరి ఇకఇకలూ పకపకలూ! మొత్తం ఇరవై ఎనిమిదికి మాటాడుకుని తనూ సరుకూ క్షేమంగా మేడమీదికి చేరేసరికి యజ్ఞం చేసినంత పనైంది. 'వీళ్లతో పడలేం! అయినా డబ్బుకి చూసుకోక ఇలాంటప్పుడు ఆటో కట్టించుకోవాలి!' అని ఎదురింటివాటా ఆవిడ సలహా ఒకటీ, కిందనుంచి ఆ ఆరబస్తాబియ్యం పైకి మొయ్యడానికి తను సిద్ధంగా ఉన్నట్టు!

అలా ఆలోచిస్తూ అటూ ఇటూ పొర్లుతున్న పార్వతమ్మకి గుండెల్లో ఏదో అసహజంగా ఉన్నట్టు తోచి జాకెట్‌లోపల పెట్టుకున్న పర్సు పైకితీసి, లేచి కూచుంది. పర్సు జిప్ బయటికి లాగి అందులో ఉన్న డిమాండ్ డ్రాఫ్ట్ ఇవతలకి తీసింది. మొగుడికి తెలియకుండా, పెళ్ళి నాటి తన గాజులు తణకాపెట్టి, పన్నెండు వేలు అల్లుడిపేర తీసుకున్న డ్రాఫ్టు అది. ఈ సాహసకృత్యం సఫలీకృతం చేద్దామనే తనీరోజు న్యూకాలనీలో ఉన్న కూతురింటికి వెళ్లి వస్తున్నది. విలువైన ఆ కాగితం ఎక్కడపోతుందో అని ఎంతో జాగ్రత్తగా గుండెలకద్దుకుని దాచుకుంది. ఈ దిక్కుమాలిన రిక్షా గోలలో పడి అంత ముఖ్యమైన విషయం మరచిపోవడం తనకే ఎంతో ఆశ్చర్యమనిపిస్తున్నది.

కూతురు కామాక్షి మాటలు ఆమెకి గుర్తొచ్చాయి.

'నీకు తెలుసుకదా అమ్మా, మీ అల్లుడిగారికి ఎంతమానుషమో! రెండు లక్షల కట్నంతో వచ్చే మేనకోడల్ని కాదని కేవలం ఏభైవేలకే నన్ను కట్టుకున్ననాడే ఆయన సౌశీల్యం అందరికీ అర్థమై ఉంటుంది. నా ఒంటిన ఈ నలభై కాసుల బంగారం, ఇల్లు నిండిన ఈ ఫర్నిచరూ నాన్న ఎంత బతిమాలితే ఆయన ఇక్కడ చేరనిచ్చారో నీకు తెలీంది కాదు కదా! ఆ సిటీ బస్సులు మారలేక, అంతటి అప్పు, ఆ సైకిలు తొక్కలేకా అవస్థపడుతుంటే నేనే చూడలేక ఆయన చెవిని పడకుండా నీకు ఫోను చేశాను కాని, అమ్మో పై వాళ్ల పైసా పుచ్చుకుంటే ఆయన ప్రాణం పోదూ! ఇన్నీ తెలిసుండి ఆయన పేర డిమాండ్ డ్రాఫ్టు తెస్తావా, నా కాపరం నిలబడాలనేనా! ఇన్ని చేసిందానివి ఎలాగోలా క్యాష్ తెచ్చి నాకివ్వలేవా? మీకు మాత్రం మరెవరున్నారని, ఎవరికి పెట్టుకోవాలని? పెద్ద ఉద్యోగమైన అన్నయ్యకి పెద్ద సంబంధం చేసి ఇలాంటి ఇంకో అన్ని అక్కణ్నుంచి రాబట్టుకోమనే కద, మన సంప్రదాయం మనకి రుజువు చేస్తున్నది!'

'తన చేతుల్తో తనుపెంచి పెద్ద చేసి తన కళ్ళ ముందు పెరిగిన పిల్ల ఇన్ని ఆరిందా కబుర్లు ఎప్పుడు నేర్చిందే!' అనే ఆశ్చర్యం నుండి తనింకా తేరుకోకుండానే కామాక్షి మరో బాంబు పేల్చింది.

'నువ్వు వేరే చెప్పక్కర్లేదు, నాన్నకి తెలీకుండా ఈ మనీ నువ్వు ఎడ్జస్టు చేశావని తెలుస్తూనే ఉంది. ఏం చేస్తాం! ఈ మగాళ్ళందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క రకం తిక్క. ఆయనకి ఇవ్వకూడదని తిక్క. ఈయనకి పుచ్చుకోకూడదని తిక్క. ఆడది ఓ వారధి అన్నారు. మనం చూస్తూ చూస్తూ ఊరుకోలేం గదా! ఎందుకు చెబుతున్నానంటే నువ్వు తెచ్చింది స్కూటరు కొనడానికి చాలదు. ఈసారి మరో నాలుగు కలిపి, గుర్తుందిగా, నగదే తీసుకురా, ఏ లాటరీలోనో కొట్టుకొచ్చానని మంచి సమయం చూసి మీ అల్లుడిగార్ని మభ్యపెట్టి స్కూటరు కొనిపిస్తాను. నాలుగురోజులాగి ఫోను చేస్తాను. సర్దుబాటు విషయం చెబుతావుగా?'

ఎవడో రిక్షా బెల్లు వాయించుకుంటూ రోడ్డుమీద పోతూంటే ఆ చప్పుడు చెవినపడి పార్వతమ్మ మనస్సు త్రుళ్ళిపడినట్టయింది. ఇవతలి వరండాలోకి వచ్చి అక్కడి పడక్కుర్చీలో జారపడి కళ్లు మూసుకుంది. కూతురి ఆ సంభాషణకీ, రిక్షావాడితో తన సంఘర్షణకీ ఏదో ముడిఉన్నట్టు ఆమెకి అనిపించింది.

రిక్షాలో బైఠాయించిన తనకే ఆ మండుటెండలో చెమటతో ఒళ్ళంతా తడిసి ముద్దయిపోయింది. ఇంతటి బరువుని ఇలాంటి అప్పులో దేవుడామని పైకి లాగడమేకాక, మళ్ళీ మంచినీళ్లనా అడక్కుండా అరబస్తాబియ్యాన్ని పైకి చేర్చాడు. ఎర్రగా కందిపోయి ఏరులా ప్రవహిస్తున్న వాడి మొహం ఎందుచేతో తన ముందు నుంచి కదలడం లేదు. పన్నెండుకి బేరమాడిన మాట నిజమే. తను ఖర్చుపెట్టిన వాడి అదనపు సమయమూ, చేర్చిన అదనపు భారమూ మరో పది వేసుకున్నా వాడు ఎక్స్ట్రాగా తీసుకున్నది ఎనిమిది రూపాయలు మాత్రమే! ఈ శ్రమజీవి కష్టానికి ఈ మాత్రం ఖర్చు పెట్టేశాననేనా తను ఇంతసేపూ ఇంతగా తలబద్దలు కొట్టుకున్నది!

అల్లుడు ఒకటోరకం డబ్బుమనిషని తను ఎప్పుడో పోల్చుకుంది. ఆ మోసం ఆ చిద్విలాసం, అదెంతటిదంటే తను గుర్తుపట్టలేనంతగా తన కూతుర్నే రెండేళ్ళు దాటకుండానే మార్చేసింది. అల్లుడుగారు తానుగా ఇస్తానంటాడేగాని పైసా అడగడు. అంతా అమ్మాయిద్వారానే అడిగిస్తాడు. అదైనా అడిగినట్టు తెలీకుండా అడగగలిగిన జాణ అయిపోయింది!

చాకిరీకీ సౌఖ్యానికీ కన్యనిస్తారు. కట్నాలు చదివిస్తారు. కానుకలు సమర్పిస్తున్నారు. అందరికీ తెలిసిన ఇలాంటి అనేక రకాల దోపిడీలని అత్యంత సన్నిహితులైనా అదేమని నిలదీయకపోగా అదే సహజమన్నట్టు సరిపెట్టుకోగలిగిన కుసంస్కారులం మనం. ఇంతటి సాంఘిక కాలుష్యం పెంచి పోషిస్తున్న మనకి, కడుపు మండిన కార్మికుడి కక్కుర్తి ఎత్తిచూపే యోగ్యత ఎక్కడిది!

పార్వతమ్మ వంచిన తల ఎత్తలేదు. అది అరక్షణంపాటే కావొచ్చు. అరక్షణం కూడా అనంతంలో ఓ భాగమే.

*(స్వాతి సపరివార పత్రిక)*

# కాంతికిరణం




'రా అన్నయ్యా, రా'

అంటూ శాంతమ్మ వెంకట్రామయ్యని సాదరంగా ఆహ్వానించింది. ఆమె గొంతులో వచ్చిన మార్పు చెవిలో పడగానే ఆశ్చర్యపోయిన వెంకట్రామయ్య గేటు తలుపు తీసుకు లోపలికి వస్తూ, ఆవిడ చేస్తున్న పనిని చేసి మరింత మతి పోగొట్టుకున్నాడు. వీధిలో ఉన్న ఆ కాస్త కాళీజాగాలో ఆవిడ ఆ వయసులో బంతినారు ఒకటీ ఒకటీ విడదీసి లైనుగా నాటుతోంది!

'ఎలా వుంది యివాళ మీ అమ్మగారికి, కొంచెమైనా ఎంగిలి పడ్డాదా?'

ఆ లోపలి గుమ్మం దాటి యివతలి కొచ్చేది కాదు. ఇప్పుడిప్పుడు గాలీ వెలుతుర్ల లోకి రావడమే కాకుండా ఎదుటివారి కష్ట సుఖాలు కనుక్కొనే నిండుతనం సంతరించుకుంది, మనసుని ఎక్స్‌రే తీసి భావాలు వెలికి లాగ కలిగే పరికరం ఏదైనా ఉంటే వెంకట్రామయ్యకి ఆ క్షణంలో కలిగిన తృప్తికి యిలా వాక్యరూపం ఇచ్చి ఉండును. 'ఇంత వయసులో ఎలాంటి ఆర్థిక పుష్టీ లేని నా పంచ చేరిన నా కన్న తల్లి ఒక్కర్తే కాదు, ఈ లోకమంతా వెర్రి తల్లుల మయం. ఇలాంటి వాళ్లకి

కొన్నాళ్ల కయినా కాస్తయినా జ్ఞానం ప్రసాదించేటట్టు చేస్తే అంతకంటె నా జన్మకి సార్థకత ఏముంది!'

అబ్బో, ఎప్పటి మాట అది!

ఆ రోజుల్లో ఎప్పుడైనా సాయంకాలం, తనకి తీరిక చిక్కిన వేళ వెంకట్రామయ్య శాంతమ్మకి గీతాసారం వినిపించడానికి వస్తూండే వాడు. పేరుకి ఏదో వింటున్నట్టు తల ఊపేది గాని శాంతమ్మ మనసు ఎప్పుడూ కొడుకు చుట్టూ తిరుగుతూ ఉండేది.

జీవితంలో చాలా ఒడుదుడుకులు పడిన సామాన్య సంసారి వెంట్రామయ్య. గ్రాడ్యుయేటు అయి ఉద్యోగం లేక తిరుగుతూండే వాడు, అతని ఒక్కగానొక్క కొడుకు. పాతిక వేలు లంచం కడితే బ్యాంకు ఉద్యోగం వస్తుందని తండ్రిని నమ్మించి, బంగారం లాంటి పొలం సగం రేటుకి అమ్మించాడు. డబ్బుచేతిలో పడ్డాక మరి ఆ మనిషి అయిపులేడు!' మెద్రాసులో ఎక్స్‌ట్రా సప్లైదారుగా ఎవర్తినో పెట్టుకు ఉన్నాడని ఆ తర్వాత కబురు తెలిసింది. అంతే! ఆ దెబ్బకి తట్టుకోలేక గిలగిల కొట్టుకుపోయాడు వెంకట్రామయ్య. అలాంటి స్థితిలో చేయిచ్చి లేవనెత్తి మళ్లీ మనిషిని చేశాడు శాంతమ్మ భర్త సీతాపతి. అయన ఆ రోజు చేసిన సాయం జన్మలో మరచిపోలేడు వెంకట్రామయ్య. సీతాపతి పోయి ఎన్నో ఏళ్లయినా వారానికోసారి ఆగడప ఎక్కి ఆ ఇల్లాల్ని పలకరించి రాందే ఉండలేడు వెంకట్రామయ్య.

ఆ రోజుల్లో శాంతమ్మ మనసుకి ఏ మాత్రం ధైర్యం తోచేది కాదు. 'ఏదో వస్తాడు, ఏవో పురాణ ప్రవచనాలు వల్లిస్తాడు, వెడతాడు.... ఇందువల్ల నా గుండె వెలితి ఎలా నిండుతుంది!' అనుకునేది. ఆ చివరి రోజులు అంత దుర్భరంగా గడుస్తాయని ఆమె అనుకోలేదు.

ఆవాళ వాడి పుట్టినరోజు, లేచి తల నెప్పిగా ఉందని ఇంత కాఫీ కాచుకు తాగింది. అంతే. ఇంకేం చేసుకోవాలనిపించలేదు. రెండ్రోజుల కిందట కొడుకు దగ్గిర్నుంచి వచ్చిన కవరు దిండు కింద నుంచి పైకి తీసి గుండెల మీద ఆనించుకుపట్టుకుంది. వందడాలర్లకు చెక్కు కాక అందులో అంతకు మించిన విలువైన ముక్కలున్నాయి.

'అమ్మా, ఎప్పట్లా నా పుట్టిన్రోజు మళ్లీ వస్తోంది. నేనెక్కడున్నా నా మనసు నీ దీవెన కోరుతూనే ఉంటుంది. ఈ డబ్బుతో నీకు నచ్చింది ఏదైనా కొనుక్కో. నన్ను మనసారా ఆశీర్వదించు.

ఎప్పుడూ లేంది కోపంతో ఆమె మనసు ఆనాడు తిరగబడింది 'నాన్నా, నానిగా! ఏనాడైనా ఏ తల్లైనా కొడుకు పుట్టిన్రోజు నాడు ఏం చెయ్యాలనుకుంటుందో నీకు తెలీదా! తలంటు పోస్తుంది. కొత్త బట్టలు కొనిస్తుంది. వాడికిష్టమైన ముద్దినుసు పిండి వంటలూ చేసి పెడుతుంది. దగ్గిరగా తీసుకుంటుంది. దిష్టి తీసి దీవిస్తుంది. పది కాలాల పాటు చల్లగా చూడమని వెయ్యి దేవుళ్లకి మొక్కుకుంటుంది. తనకి నచ్చింది కొనుక్కుంటుందిట్రా ఎక్కడైనా!'

ఇప్పుడేం మొత్తుకుంటే ఏం లాభం!

మొదట్నుంచీ ఇన్ని ఆశలు కల్పించింది వాడే! ఆ పద్ధతే వేరు. వాడికంటే పెద్దాళ్లు ఇద్దరు ఆడపిల్లలున్నారు. ఆడపిల్లల పెళ్లిళ్లు చేసేసి తనకా బరువు మిగలకుండా చేశాడు పాపం ఇంటాయన. అంతేకాదు, వాళ్లకంటె అయిదారేళ్ల చిన్న వాడయిన సూర్యం చదువు పూర్తయేదాకా ఉన్నాడు. తనకే పూచీ మిగల్చలేదు. ఆడపిల్లలు అత్తారిళ్లలో వాళ్ల కాపరాలు వాళ్లు చేసుకుంటున్నారు. సాధారణంగా తల్లిదండ్రుల పట్ల ఆడపిల్లల కున్న ఆపేక్ష మగపిల్లలకి ఉండదంటారు. శాంతమ్మ

పిల్లలు మాత్రం దీనికి పూర్తిగా వ్యతిరేకం. ఇప్పుడు పెళ్లిళ్లై ఎవరి సంసారాలు వాళ్లు దిద్దుకుంటున్నప్పటి మాట కాదు. మొదట్నుంచీ ప్రతి చిన్న విషయంలోనూ పేచీలే వాళ్లు. నానిగాడు మాత్రం అలాకాదు. ఆ అక్కల్లా కాకుండా చిన్న చిన్న పనులు చేసిపెడుతూ కూడా కూడా తిరిగేవాడు. కత్తిపీట దగ్గర కూచుని తను కూరలు తను కూరలు తరుగుతూ ఉంటే ముచికలూ తుక్కూ ఆపీ తనే ఎత్తి పారపోసేవాడు. తను బట్టలు ఉతికితే స్టూలు ఎక్కి తనే ఆరేస్తానని అల్లరి పెట్టేవాడు. తన కంటే ముందు నిద్ర లేచి బాయిలరు అంటించేవాడు, తను ఎంటిల్లు కడుక్కుని ముగ్గేసేదాకా ఆగి, దానికి తాళం వేసి వచ్చేదాకా తనని వదిలేవాడు కాదు.

రెండు చేతుల గుప్పిళ్లూ మూసి బుగ్గల మీద ఆనించుకుని తన కళ్లల్లో కళ్లు పెట్టి ఎప్పుడూ అలా చూస్తూ ఉండేవాడు. తన కంట్లో ఏ మాత్రపు కన్నీటి పొర పసిగట్టినా తల్లడిల్లిపోయేవాడు. తన మనసు మళ్లీ స్తిమిత పడ్డానికి ఎన్ని చెయ్యాలో అన్నీ చేసేవాడు.

తన పాలరుచి ఏ తల్లికీ తెలీదు. ఆ పాలు తాగిన పేగు పంచి యిచ్చిన ప్రేమరుచి ఏ కొద్దిమంది అదృష్టవంతురాళ్లో తప్ప ఎరగరు. అందులో తనూ ఒకర్తేనని శాంతమ్మ మురిసిపోయేది.

'ఎందుకూ ఎద్దుల్లా ఎదిగారు. ఆడపిల్లలు మళ్లీ! చెప్పిన ముక్క ఒక్కటీ వినిచావరు. ఇది కావాలని అడక్కుండానే చేసి పెడతాడు, నాని. చిన్నవాడైనా వాణ్ణి చూసి సిగ్గుపడాలి మీరు.'

అంటూ ఒక్కోక్కప్పుడు కూతుళ్ల చేష్టలు చూసి విసుక్కునేది. 'ఓయబ్బో! చాలా మందిని చూశాం, యిలా కబుర్లు చెప్పిన వాళ్లని.... పెద్దై పెళ్లాం అన్నది రానీ..... ఏమే చెల్లీ?'

'ఇంకా అందుకు సందేహమా! నెత్తి మీద ఇంత బండ ఎత్తకుండా ఉంటే చాలు. పెళ్లాం పక్కలో కొచ్చేదాకా ప్రతీ కొడుకూ బంగారు కొండే! కదుటే అక్కా!'

అంటూ ఇద్దరూ కలసికట్టుగా చెప్పినట్టు చెప్పారు.

"ఛ! అసలు నేను పెళ్లి చేసుకోను" అని అడ్డంగా బుర్ర ఆడించేవాడు నాని. "తప్పుబాబూ, అలా అనకూడదు" అని తల్లి మందలించేది. బిడ్డ కడుపులో పడ్డాక నవమాసాలూ మోస్తుంది తల్లి. ఎదుగుతున్న కడుపుని తడుముకుని ఆశలు పెంచుకుంటుంది తల్లి. ఆ తొమ్మిది నెలలకీ ఎన్ని రోజులో, ఎన్ని గంటలో, ఎన్ని నిమిషాలో కనీసం అన్ని కోరికలయినా పేర్చుకుంటుంది. పుట్టిన బిడ్డ పున్నమి చందమామలా తయారవడమే కాక తలలో నాలికలా మసులుతూ ఉంటే ఏ తల్లి మురిసిపోదు!

అంతకుముందే ఆడపిల్లలు పెళ్లిళ్లై వెళ్లిపోయారు. ఆ తర్వాత ఆరేళ్లు దాటకుండా ఆ మగమహారాజు కాలగర్భంలో కలసిపోయాడు. ఒంటరిగా మిగిలింది గాని ఆ ఒంటరితనం ఉన్నట్లు శాంతమ్మకి ఎప్పుడూ తోచనివ్వలేదు, చేతికి ఎదిగి వచ్చిన కొడుకు.

మొగుడు ఉన్నప్పుడు, ఎప్పటిమాట అది, కొడుకు నామకరణం విషయంలో పట్టుదల పట్టి, తన మాటే నెగ్గించుకుంది శాంతమ్మ! తల్లి పేరు పెట్టుకుంది. సూరమ్మ గారు సూర్యనారాయణ మూర్తిగా తమ యింట ఉదయించాడు. ఇప్పుడింత వాడయాడు గాని ఎప్పుడూ తన కంటికి వెర్రినాగమ్మగానే కనిపిస్తాడు. నిన్న మొన్నటిదాకా తన పక్కలో చేరి, తన డొక్కలో దూరి, "అమ్మా, నీ ప్రేమ ఒక్కటీ నాకు చాలమ్మా!" అని కళ్లల్లో కళ్లు పెట్టి చూసి చెబుతున్నట్లే ఉంటుంది. అలా చూస్తుంటే వాడి స్థానంలో తన తల్లిని చూసుకున్న భ్రమ కలిగేది శాంతమ్మకి. తనే తన తల్లితో అవే మాటలు అంటున్న భావనకు లోనయేది.

వేలెడంత లేనివాడు చూస్తూండగా చేయెత్తితే వాసాలు అందుకొనేటంత వాడయాడు. అక్షరాలు దిద్దితే వేళ్లు కంది పోతాయేమో అనిపించిన కుర్రసన్నాసి తను రీసెర్చి చేసే సబ్జక్టుకి యీ దేశంలో ఏ యూనివర్సిటీలోనూ వనరులు లేవేమో అనే విద్యార్థియికి చేరుకున్నాడు! ఆ బ్రాంచిలో ఫారెన్ స్కాలర్‌షిప్ దొరకడమే వారి అనుబంధానికి ప్రతిబంధకమయిందేమో! ఆ విరహం ఊహించలేక ఆ తల్లి మనసు అల్లకల్లోలమైపోయింది. వాడిలా అన్నాడు:

"నీ కంట్లో విషాదరేఖ నేను భరించలేను. నువ్వు నవ్వుతూ పంపకపోతే నాకు విజయం లభించదు కూడా. అసలు నేనే నిన్ను విడిచి ఉండలేను. ఇప్పుడున్న నా చదువుకి ఇక్కడే మంచి ఉద్యోగం దొరక్కపోదు" అనే సూర్యం మాటలు ఆ రాత్రి తెల్లవార్లూ మననం చేసుకుంది. గుండె దిటవు చేసుకుంది. రెండేళ్లు ఎంతలో తిరిగి రావాలి! ఏ కూతురి దగ్గరుంటే దినం వెళ్లిపోదు! మనసు రాయి చేసుకుంది. ఏరోడ్రోముకి వెళ్లి వీడ్కోలు చెప్పి వచ్చింది.

కూతుళ్ల దగ్గిరకి వెళ్లింది గాని ఎక్కడా ఎక్కువ రోజులు ఉండలేక పోయింది. ఆ వాతావరణంలో ఇమడలేకా, వాళ్ల వాళ్ల మాట తీరు సరిపెట్టుకోలేకా.... "నాదంటూ నాకో యిల్లు లేకపోతే కదా" అనుకుని ఇల్లు చేరుకుంది. కొడుకు నడయాడని, బావురు మంటున్న ఆ యిల్లు చూసుకుని "నాదంటూ ఏఁమిగిలిందని!" అని కొట్టుకు పోయేది ఆ తల్లి ప్రాణి.

ఆ రెండేళ్లూ ఎలా గడవ గలిగిందో శాంతమ్మకే తెలీదు. విస్తట్లో అన్నీ వడ్డించుకుని కూచునేది, తినకుండానే లేచి పోయేది! దుప్పటి దులుపుకుని మంచం మీద వేసుకునేది. పడుకోకుండా గంటలు గంటలు లేచి కూచొనేది! ఆ గచ్చు చల్లగా ఉందని ఎప్పుడూ అదేవుడి గదిలో దొర్లేది, అక్కడేదో ఆధారం చిక్కుతుందని కాదు! అతడేదో చదివి వినిపిస్తున్నాడని భగవద్గీత వినేది, వెంకట్రామయ్య చెబుతున్నది తన బుర్ర కెక్కుతోందని కాదు! "అంత దూరంలో ఆ దేశంగాని దేశంలో వేళ కింత నోటికి అమరక పాపం నానిగాడి కడుపు ఎంత లోతుకుపోయి ఉంటుందో!" అనేది ఒక్కటే ఆ అమ్మతపన.

వెంకట్రామయ్యతో ఆవిడకున్న అనుబంధమూ అంతంత మాత్రమే. పేరుకి ఆ వీధి చివర ఓ చిన్న పెంకుటి కొంప అంటూ అతనికి లేకపోలేదు గాని ఒక్కొక్కప్పుడు నెలకి నెలలు ఆ ఇంటికి తాళమే. కొడుకు కోసం అప్పటికప్పుడు అమ్మగా మిగిలిన అర ఎకరం అతని బావమరిది అమరకంలో ఉంది. దాని శిస్తూ వసూలు కోసం కాకపోయినా పెళ్లాన్నీ కూతుర్నీ చూసి రాడానికయినా అప్పుడప్పుడూ ఆ ఊరు వెళ్లి రాక తప్పదు. వెంకట్రామయ్య పెళ్లాం మొగుడితో దెబ్బలాడి వాళ్లన్నయ్య దగ్గిరకి చేరి ఏడాదిన్నర దాటింది. చుట్టపు చూపుగా పెద్ద కొడుకు వెంకట్రామయ్య దగ్గిర కొచ్చిన అతని విధవ తల్లి పక్షవాతం వచ్చి, అక్కడే ఉండిపోవలసి వచ్చింది. అది అతని పెళ్లానికి కంట గింపయిది. ఇన్నాళ్లూ ఆవిడ ఒంటెడు నగలూ ఒకటీ ఒకటీ అమ్ముకు తినడానికి నా తోటి కోడలికి అత్తగారు పని కొచ్చిందా? ఈనాడు రోగాన పడిందని బోసిమెడ చేసి చాకిరీకి నా యింటికి దిగబెడుతుందా! మీ తమ్ముడిపాటి బుద్ధి మీకు ఉండదనే! వెంటనే అత్తగార్ని రైలెక్కిస్తారా లేదా!" అని మూడు రోజుల పాటు అహోరాత్రాలు మొగుడితో పోరాడింది. వెంకట్రామయ్య వినలేదు. కూతుర్ని తీసుకుని ఆవిడే బస్సెక్కేసింది.

అసలు వెంకట్రామయ్యే డయబెటీసు పేషెంటు, ఎంతగా వైద్యం, పత్యం చేసినా

ఒక్కొక్కప్పుడు చెప్పలేని నీరసం ప్రాణాలు తోడేస్తూ ఉంటుంది. కట్టుకున్న దాని సాయంతోనే ఎత్తలేని బరువు తనకి, అన్నీ మంచం మీదే అవుతున్న ఈ తల్లి. కాని ఇలాంటప్పుడు కన్న తల్లిని చూస్తూ చూస్తూ ఎలా దిగబెట్టగలడు! మరదలు తన పెళ్లాం కంటె నాలుగాకులు ఎక్కువే చదువుకుంది యిలాంటి విషయాలలో చీకటింట వెడితే మళ్లీ చీకటి పడితేగాని ఇంటికి చేరుకోలేని ఉద్యోగం తమ్ముడిది. ఎవర్నని లాభం!

తము చ్చి చెప్పి వెడుతూంటాడు.

"అమ్మని ఈ వయసులో యిక్కడ చేర్చి నీకూ నీ వాళ్లకీ దూరం చేశాను. అసలే జబ్బు మనిషివి. ఒక్కడివీ ఎలా నిర్వహించుకు వస్తున్నావో....... పొద్దుట్నుంచీ సాయంకాలం దాకా ఇల్లు కనిపెట్టుకు ఉండే పనిమనిషిని పెట్టుకో. వేరే వంట మనిషి కోసం చూడు. ట్రై చేస్తే దొరక్కపోరు. ఎంత కావలిస్తే అంత నేను పంపుతానుగా!" ఊరికే నోటి మాట కాదు. నోట్ల కట్టలు అందించి మరీ.

అయినా వృద్ధాప్యం. రోజు రోజుకీ సన్నగిల్లుతున్న ఆరోగ్యం. ఒంటరితనం. నిస్సహాయత. ఒక్కొక్కప్పుడు ఎంత సరిపెట్టుకుందామన్నా వెంకట్రామయ్య కృంగి పోతూ ఉంటాడు. అలాంటప్పుడు భగవద్గీత తీసుకుంటాడు. చదవడానికి కాదు, అలా అది గుండెలమీద పెట్టుకుని పడుకుని, తనకి తను ధైర్యం చెప్పుకోడానికి.

మన కెక్కడా తారసిల్లని, మన అనుభవంలోకి మాట వరసకైనా తొంగి చూడని, ఓ మహావీరుడి ధర్మ సందేహం అది. "అంతటి సన్నిహితులలో యుద్ధం ఎలా చెయ్యను!" అనే సందేహానికి నారాయణుడి సమాధానం అది. పై నుండి చూస్తే "సామాన్యులకేం ఉంది ఇందులో నా మొహం!' ' అనిపించక మానదు, కాని బాగా ఆలోచిస్తే ఏ ఉద్గ్రంథంలో అయినా సందేశం సూచనాప్రాయంగానే ఉంటుంది. విషమ పరిస్థితులు నరవరులకే కాదు నరులందరికీ ఎదురౌతాయి. ఎటో దారి చూపే డిటో నారాయణులు ఎప్పటికప్పుడు దొరకరు. ఎవరికి వారే జవాబు చెప్పుకుని ముందుకి సాగాలి. అంతే. ఆ ఊహ ఇచ్చిన ఊతతో ఉత్సాహంగా లేచి కూచుంటాడు వెంకట్రామయ్య.

తన పనులే కాదు, తల్లి పనులు కూడా చకచకా చక్కబెట్టేస్తాడు. పనిపిల్లని అక్కడ కూచోబెట్టి శాంతమ్మ దగ్గరకి పరిగెడతాడు. 'చూశారా ఈ పెద్ద మనిషి దురాశ! లేని ఓపిక తెచ్చుకుని ఎందుకలా పరుగెడుతున్నాడో ఆ శాంతమ్మ గారింటికి! ఈ మధ్యనే మరింత ఎక్కువ చూపిస్తున్న ఈ అభిమానాల వెనుక ఏముందో ఎవరెరగరూ! సూర్యం ఈ నెలాఖరుకో వచ్చే నెల మొదట్లోనో స్వదేశం తిరిగొస్తున్నాడాయె. అతని వయసుకి జోడైన కూతురు జానకి ఇతనికి ఉందిగా! ఇప్పట్నుంచీ ఎంత పెద్ద వల పేనుకు రాకపోతే అంత పెద్ద చేప పడుతుందీ!" అని ఒకరిద్దరంటే మొదట్లో విసీ వినట్లు ఊరుకునేవాడు. 'అత్యాశే రావొచ్చు పోనీ మనమూ ప్రయత్నించి చూస్తే తప్పేమిటి? బియ్యే అయితే తనంతట ప్రైవేటుగా కట్టుకుని మంచి మార్కులతో పాసయింది గాని, తన కూతురు తండ్రి సాయం లేకుండా మొగుణ్ణి తెచ్చుకోలేదుగా!' అనుకున్నాడు వెంకట్రామయ్య. శిస్తుల కోసం ఈ సారి ఆ ఊరు వెళ్లినప్పుడు వాళ్ల దగ్గిర ఈ ప్రస్తక్తి తెచ్చాడు. దాంతో ఆ తల్లీ కూతుళ్లకి ఎక్కళ్లేని చైతన్యమూ పుట్టుకొచ్చింది!

జానకి అందమైనదే గాక అది మరింతగా తీర్చిదిద్దుకోడం తెలిసిన అమ్మాయి. ఇంగ్లీషు

తప్పుడు లేకుండా మాటాడగలదు. ఈ మధ్య పరీక్షకూడా పాసయింది. ఇప్పటి నవలలూ సినిమాలూ టీవీ షోలూ రుచి ఎరిగిన నవ నాగరీకురాలు. గాలిలో కాకుండా భూమ్మీద ఎందుకు నడవాలి? ఇక వాళ్లమ్మకి ఆ చాత కాని మొద్దుని కట్టుకోడం చేత ఏ కోరికా తీరిచావలేదు. కొడుకైనా ఉద్ధరిస్తాడనుకుంటే మొదట్లోనే కొంప నిలువునా ముంచేశాడు. ఇంకా అన్నా వదినా మంచి వాళ్లు కాబట్టి ఎన్నాళ్లయినా తన్ని తగిలెయ్య కుండా ఇంత అన్నం పెడుతున్నారు. ఇక తనకి ఏ ముద్దూ ముచ్చటా తీరినా ఈ బంగారపు బొమ్మవల్లనే ఏమో! దీని ద్వారా తనకి విదేశయానం రాసి పెట్టుందేమో ఎవరు చెప్పగలరూ! వారం దాటకుండా తల్లీ కూతుళ్ల తండ్రితో స్వంతింటికి ప్రయాణం కట్టేశారు. 'ముసిలావిడ కంపు' ఈ సారి వాళ్లని అట్టే బాధించినట్టు లేదు. తల్లీ కూతురూ వెంకట్రామయ్యకి ఓ మోస్తరు సాయం చేస్తున్నారు కూడా. పట్టుదల వస్తే ఏవో సవాలక్ష అనుకుంటాం. పెద్ద వాళ్ళు చేయించుకోక తప్పుతుందా, మాలాంటి వాళ్లం చెయ్యక తప్పుతుందా!' అనే సన్నాయి నొక్కులు నొక్కుతూ. ఓ మంచి రోజు చూసి కూతుర్ని తీసికెళ్ళి శాంతమ్మకి దండం పెట్టించాడు వెంకట్రామయ్య. " రెండేళ్లలో ఎంత ఎదిగిపోయిందో! తగినట్టు ఒళ్లు చేసింది కూడాను. ఇంటి కెళ్లగానే నీ పెళ్లాం చేత దిష్టి తీయించు అన్నయ్యా... ఏ అదృష్టవంతుడు ఎదురు చూస్తున్నాడో మీ జానకిని చేసుకోడం కోసం' అనేసింది అమాయకంగా. అది విన్న జానకి మనసు మరుక్షణం సూర్యంతో హనీమూన్‌లో ఐఫిల్ టవర్‌లో ఉంది!

ఇంతకీ సూర్యం స్టేట్సు నుంచి తిరగొస్తూ తీసుకొచ్చిన కబురు ధాటికి వచ్చిన చిల్లర సంబంధాల పేక ముక్కలతో పాటు ఈ తురుపు ముక్క కూడా ఉఫ్ మని ఎగిరిపోయింది!

సూర్యం ఇండియా వచ్చింది. ఇక్కడేదో ఉద్యోగం చూసుకుని ఉండి పోదామని కాదుట. తల్లితో మనసులోని ఆ కబురు చెప్పి అనుమతి తీసుకుని మళ్ళీ పదిహేను రోజుల్లో వెళ్లి పోడానికట. అతని రీసెర్చి పథకం ఇంకా పూర్తికాలేదు. దానికి తగిన ఖరీదైన పరికరాలు అక్కడ తప్పలేవు. అతన్ని గైడు చేసే ప్రొఫెసరు ఎక్కడున్నా ప్రతిభని గుర్తించి ప్రోత్సహించే ఆదర్శ శాస్త్రజ్ఞుడు. అతని రికమెండేషను వల్లనే సూర్యం స్కాలర్‌షిప్ మరో రెండేళ్లు పొడిగించబడింది. అతని చలవ వల్లే సూర్యానికి ఓ పార్ట్‌టైమ్ జాబ్ దొరికింది కూడా. గత ఆరు నెలలుగా అలా సంపాదించి కూడా బెట్టిన సొమ్ముతోనే సూర్యం ఇప్పుడు రిటర్న్ టెక్కెట్టు కొనుక్కు వచ్చినది.

శాంతమ్మ కూచుని ఉంటే ఆవిడ ఒళ్లో తల పెట్టుకుని పడుకుని, ఆవిడ ఇచ్చిన చేగోడీలు ఒకటీ ఒకటీ నవులుతూ ఎక్కళ్లేని కబుర్లూ అందిస్తున్నాడు సూర్యం. ఈ భోగట్టా లన్నీ ఉత్తరం రాసి పడెయ్యొచ్చు. ఇంత ఖర్చు పెట్టుకుని స్వయంగా వచ్చి చెప్పనక్కర్లేదు. కాని స్వయంగా తప్ప చెప్ప లేని విషయం ఒకటుంది. తీరా అదే నోరువిప్పి చెప్పలేకపోడం అతనికే ఆశ్చర్యం కలిగించింది. ఆ వేళకి వెంకట్రామయ్య అక్కడికి రావడంతో అతనికి పోయిందేదో దొరికినట్టు అనిపించింది. వెంటనే లేచి అతని చెయ్యి పట్టుకున్నాడు.

'మీతో ఓ ముఖ్య విషయంల చెప్పాలి అంకుల్, ఓ సారి అలా పార్కుకి వెళ్లొద్దాం వస్తారా!' అంటూ లాక్కుపోయాడు. అక్కడ చేరగానే విషయమంతా క్లుప్తంగా వివరించాడు. బతిమాలాడు. 'వెంటనే మీ విషయం కాస్త అమ్మకి నచ్చ చెప్పరూ!' అని ఎదురుచూడని ఆ భోగట్టాకి మరొకడయితే మ్రాన్పడిపోయేవాడే. తన తొట్రుబాటు పైకి తేలనివ్వక మా అమ్మని డాక్టరుకి చూపించాలి సూర్యం.

వీలు చూసుకు కలుద్దాంలే' అంటూ వెనక్కి తిరక్కుండా వడివడిగా ఇంటికి జారుకున్నాడు. ఆ మర్నాడు కూడా శాంతమ్మ గడపతొక్కడానికి వెంకట్రామయ్యకి మనస్కరించలేదు. ఆవిడ సమస్య అలా ఉంచి తన కూతుర్ని చూసుకుంటాడనే ఆశకి కూడా ఆస్కారం లేకుండా పోయింది, ఇప్పుడు సూర్యం చెప్పిన కబురుతో ముఖ్యంగా అంతటి ఆశాభంగానికి ఆ తల్లీకూతుళ్ల తట్టుకో లేకపోయారు. ఇక అతని పెళ్లాం ఆడిన మాటలు ఒకటీ రెండూ కావు. 'తమ నిర్వాకం ఇంతలా అఘోరిస్తుందని తెలిసే సిగ్గు విడిచి ఎక్కడికో వెళ్లి తలదాచుకుంటున్నాం. అలాగేనా ఉండనివ్వక ప్రత్యేకించి సుఖాన ఉన్నవాళ్లం మళ్లీ మమ్మల్ని ఈ రొంపిలోకి దింపడం దేనికి! వాడెవర్తినో అక్కడ పెట్టుకునే ఉన్నాడన్న కబురు తమకి ముందే తెలియలేదంటే ఇప్పుడెవరు నమ్ముతారు! ఇంకా ఎందుకీ దొంగ కబుర్లు? అంటూ ఆ రోజే బస్కెక్కేశారు.

వాళ్ల సాయంతో ఈ మధ్య కాస్తయినా ఊపిరి తిరిగేది వెంకట్రామయ్యకి, ఆ ఆసరా పోయింది. వాళ్లే నిందవేసినా తనమటుకు తనే కట్టుకున్న ఆశాసౌధం ఉండనే ఉంది, అదీ కూలిపోయింది. ఏం కొడుకులు, ఏం లోకం! కొడుకేదో యింకా తనని ఉద్ధరిస్తాడనే వెర్రిభ్రమలో ఉంది ఇంకా ఆ శాంతమ్మ. ఈ వార్త తనే చెవిన వెయ్యాలా! తనకి తోచిన కాస్త వెలుగూ మరి కనిపించకుండా చేసిన సూర్యం తరపున తను వెళ్లిశాంతమ్మకి నచ్చజెప్పాలా! ఊహుఁ వెంకట్రామయ్య మనసు మొదట్లో మొండికేసుకు కూచుంది.

అయితే తన పొరపాటు తను తెలుసుకోడానికి ఆ సహృదయుడికి ఆట్టే రోజులు పట్టలేదు. వెంకట్రామయ్య తమింటికి రాలేదని తెలుసుకున్న సూర్యం వరసగా ఆ రెండ్రోజులూ ఆయనింటికే వెళ్ళేవాడు. గంటలకి గంటలు తన పొజిషన్ ఎక్స్ప్లెయిన్ చేసేవాడు. తన ప్రాజెక్టుకి సంబంధించిన కాగితాల కాపీలు చూపించి అతనికి బోధపడేటట్టు చెప్పేవాడు. తనూ, తన ప్రొఫెసరూ, తను పెళ్లాడదామనుకుంటున్న వాళ్లమ్మాయి లూసీ - వీళ్ల ఫోటోలు ఉన్న ఆల్బం - తల్లికి చూపిద్దామని తెచ్చినా తను చూపించలేనిది - వెంకట్రామయ్య ముందు పరచాడు. 'నాకు తెలుసు. కడుపున పుట్టిన కూతుళ్లతోనే సరిపెట్టుకోలేని సున్నిత హృదయం మా అమ్మది. లూసీని పెళ్లాడితే అక్కడే ఉండిపోవాలిగాని మరి ఈ దేశం వచ్చే అవకాశం లేని పరిస్థితులు నావి. తనే అక్కడికి వచ్చి మాతో ఉండిపోవాలి. అదైనా ఇంకో రెండేళ్ల తర్వాత, నేను తనకి వీసా సంపాదించగలిగాక. అలా అమ్మ ఇష్టపడితేనే ఈ పెళ్లిచేసుకుంటాను. కన్నతల్లి కన్నీటి రేఖ నేను ఊహించలేను. ఆవిడకి ఇష్టంలేని పని చెయ్యలేను. అలా చేసి ఆ విషాద భావాన్ని క్షణం క్షణం గుర్తు చేసుకుంటూ జీవితాంతం భరించలేను. కాదూ కూడదంటే రిజైను చేసి ఇండియా వచ్చేస్తాను. ఖర్చు పెట్టిన సొమ్మంతా వెనక్కి తిరిగి వాళ్లకి ఇవ్వవలసి ఉంటుందనుకోండి. చాలా పెద్ద మొత్తమే. కాని నన్ను వెన్నాడే వ్యధ కంటె ఇదేం ఎక్కువ కాదు. మొదట్లో నన్ను అసహ్యించుకున్నా ఇప్పటికైనా అర్థం చేసుకున్నారు. తనకి ఏ మాత్రం సమ్మతం కాకపోయినా ఎదుటి వారి ఆలోచనల తీరు కనీసం చివరి దాకా వినడానికయినా ఎంతటి సహనం, సంస్కారం కావాలి!' అంటూ అన్నీ వివరించి వెళ్లిపోయాడు సూర్యం.

వెంకట్రామయ్య గుండెల మీద ఆ బౌండు బుక్కు అలా ఉండనే ఉంది. వెల్లకిలా పడుకున్న వాడు అలాగే ఉన్నాడు. గంటలకి గంటలు అలా గడచిపోతున్నాయి కాని తీర్పు చెప్పే జేగంట అతనిలో ధ్వనించలేదు. సూర్యం దగ్గిర బయటపడలేదు గాని ఆ ఉదయం శాంతమ్మకి ఆ ఘోరవార్త

తన నోటితో తను అందించడం జరగనే జరిగింది! అది తట్టుకోలేక ఎంతో సేపు గిలగిల కొట్టుకుంది ఆ పిచ్చితల్లి. ఆ షాక్ నుంచి తేరుకున్నాక ఆవిడ వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.

'ఏ నాడు యీ ఇంట్లో అడుగు పెట్టానో అప్పట్నుంచీ ఈ ఇంటికీ ఈ వీధికీ అతుక్కుపోయింది నా ప్రాణి. పుట్టింటి దక్షత లేకపోడం చేత మా అత్తగారే నా మూడు పురుళ్లూ ఈ యింట్లోనే పోశారు. నా పిల్లలు పెరిగింది ఇక్కడే. మా అత్తగారే కాదు మా ఇంటతనూ, కాలం చేసింది ఇక్కడే. ఏళ్ల తరబడి యిక్కడే మసలడం చేత కాబోలు ఇది కన్నతల్లిలా తోస్తుంది గాని ఇల్లనిపించదు నా ప్రాణానికి. ఓ వారం రోజులు దీన్ని విడిచి వెడితేనే తిరిగి వచ్చేదాకా ఏదోలా ఉంటుంది నాకు. అలాంటిది తెలిసిన పరిసరాలు విడిచి ఎరిగిన మొహాలు కాదని ఇంత వయసులో నేనంత దూరం వెళ్ళి ఎలా ఉండగలను అన్నయ్యా!'

'మా నానిగాడికి దొసావకాయ ఇష్టం. బాగా వెల్లుల్లి వేసి కొట్టిన తెలగ పిండి గుండ ఇష్టం. బాగా చిన్న చిన్నవిగా ఎర్రగా వేయించిన ఉల్లిపాయ పకోడీలు ఇష్టం. ఇలాంటివి నా కొడుక్కి నా చేత్తో నేను చేసి పెట్టాలని కోరుకోడం తప్పా అన్నయ్యా! ఎక్కడ పడితే అక్కడ, మన మాటా మనసూ అర్థం చేసుకోలేని చోట, ఇలాంటి నా చిన్న చిన్న కోరికలైనా తీరుతాయంటావా!'

'ఇష్టాఇష్టాల ప్రసక్తి ఎలాగా వచ్చింది గనక ఓ మాట అడుగుతాను, నీకు కోపం రాదుగా చెల్లెమ్మా! నీ కొడుక్కి ఏవేవి యిష్టమో అవన్నీ చేసి పెట్టాలనుంటుందని ఇప్పుడే ఓ లిస్టు ఇచ్చావు. ఏవి, దోసావకాయ, తెలగపిండి గుండా, ఉల్లిపాయ పకోడీలూ... ఇప్పుడు ఆ లిస్టులో కొత్త యిష్టం ఒకటి వచ్చి చేరిందిట. అది వీటన్నిటి కంటె సూర్యానికి యిష్టమైనది. దాని పేరు లూసీ. పూర్తిగా చెప్పలేం గాని ఆ ఆల్బంలో ఆ అమ్మాయి ఫోటోలు చూస్తే కొంతవరకైనా ఆ గుణగణాలు ఊహించవచ్చు. ఆ బట్టలూ ఆ చూపులూ ఎంతో గౌరవప్రదంగా సంస్కారాన్ని సూచించేలా ఉన్నాయి. అలాంటి అమ్మాయిని కావాలనుకున్న వాడు వ్యామోహంతో ఆ నిర్ణయానికి వచ్చాడని మాట వరసకైనా అనిపించదు. వాళ్లిద్దరూ ఒకే సబ్జక్టులో రీసెర్చి చేస్తున్నారనీ, అలాగే ఒకరికొకరు సన్నిహితులయామనీ సూర్యం చెప్పాడు. ఆ అమ్మాయి ఒంపుసొంపులే కోరితే పాతికేళ్ల నీ కొడుక్కి వెంటనే పెళ్లాడ్డానికి ఏ ఏ అడ్డూ లేదు. నీ అనుమతి కోసం ఇంత దూరం రానక్కర్లేదు.

కాలం మారుతోంది. తరానికీ తరానికీ అభిరుచుల్లో అంతరాలు పెరగడం సహజమే. తమ పిల్లలు చాలా పెద్ద చదువులు చదువుకుని ఏ విదేశాలలోనో డిగ్రీలు సంపాదించుకురావాలని ప్రతి తల్లిదండ్రులూ ఇప్పుడు కోరుకుంటున్నారు. అలాంటి చదువులు కావలసి వచ్చినప్పుడు వాటితో అవిభాజ్యంగా వచ్చే ఇతర విషయాలని కూడా భరించవలసి ఉంటుంది. మనం స్వేచ్ఛ ఇవ్వకపోతే వాళ్లే తీసుకుంటారు. తమంత తామే అదివ్వడం పెద్దల గొప్పతనం. ఏ పెద్దవాళ్ళు కుదిర్చిన సంబంధాల్లో కాక తమతో మానసిక సాన్నిహిత్యం గల సహచరుల్ని ఇప్పటి పిల్లలు ఇష్టపడితే అందులో తప్పేముంది! ఇదైనా బాధ్యత గల కొడుకుగా ఇంత దూరం నీ అనుమతి కోసం వచ్చాడు. మహా ఉంటే మన బతుకులు యింకా అయిదేళ్లో పదేళ్లో! మన స్వార్థం కోసం మన పిల్లల ని జీవితాలకే మనం అడ్డునిలుస్తామా చెల్లెమ్మా! మనం కోరినట్టే మన పిల్లలు చేస్తే తప్ప మనం మన్నించి దీవించలేమా! నువ్వు ఆలోచించు చెల్లెమ్మా...'

అంత సేపూ మాటాడుతున్న వాడు ఉన్నట్టుండి గుండెని పట్టుకు కూలబడితే తెల్లబోయింది

శాంతమ్మ. కొంచెం మంచినీళ్లు కావాలని సంజ్ఞ చేసాడు. ఆమె తెచ్చిన గ్లాసు అందుకుని, జేబులో ఏదో పొట్లం తీసుకుని నోట్లో వేసుకుని, ఇన్ని మంచినీళ్లు తాగేడు. నుదుటను పట్టిన చెమట తుడుచుకుంటూ లేచి నిలుచున్నాడు. 'ఏదో వాగుతూ కూచున్నాను. టైం చూసుకోలేదు. పనిపిల్ల మధ్యాహ్నం వెళిపోతానని చెప్పింది. మా అమ్మ ఒక్కర్తే ఏమయిపోతుందో ఏమిటో.... పాపం ముసిలిది... గట్టిగా మాటాడలేనిది...... కాలూ చెయ్యీ కదపలేనిది."

అనుకుంటూ గబగబా నాలుగు అడుగులు వేశాడు వెంకట్రామయ్య. మళ్లీ అంతలో ఏం వచ్చిందో వీధి గేటు ఆసరాగా పట్టుకుని అతను వెళ్లిపోయినట్టయింది శాంతమ్మకి. తనదంటూ కాదని అవతలి వారి దృక్పథం నుంచి చూడడం ఆ క్షణమే మొదలయిందేమో.

ఇప్పుడిలా తనకి యిన్ని చెప్పి వెళ్లిన ఈ వెంకట్రామయ్య తన జీవితంలో ఒక్క కుటుంబ సభ్యుడి వల్ల సుఖపడ్డాడా! ఇంట్లో ఉండి రోగిష్టి మొగుడి మంచీ చెడ్డా చూడవలసిన పెళ్లాం, పుట్టింట్లో తల దాచుకుంది. కడుపున పుట్టిన కూతురయినా, మాట వరసయినా కన్న తండ్రి కన్నీటిని తుడిచిన తుడిచినా దాఖలా లేదు! పైగా ఈ వయసులో మలమూత్రాలు ఎత్తి చాకిరీ చెయ్యవలసిన తల్లి ఒక్కర్తే! అయినా ఇన్నిసార్లు వస్తూ పోతున్నా, ఒక్కసారంటే ఒక్కసారైనా ఒక్కరి గురించైనా చెడుగా చెప్పలేదు! ఇన్ని బాధ్యతలు నెత్తిన వేసుకుని కూడా, ఎప్పుడో తన మొగుడు చేసిన ఉపకారం గుర్తు పెట్టుకుని తన యోగక్షేమాలు కనుక్కుంటున్నాడు! తను?

ఈ వయసుకి తగిన ఆరోగ్యానికేమీ లోటు లేదు. ఆర్థికమైన ఇబ్బందులు ఎలా ఉంటాయో తను ఎరగనివి. అయినా తన కోసం ఇంత దూరం పరిగెత్తుకు వచ్చిన కొడుకు మీద నేరాలు చెప్పుకుంటోందా! మగవాడి మనసు కర్కశం అంటారు. కన్నతల్లిగా తను చూపించిన క్షమాగుణం, ఏముంది!

' ఆ వరండాలో అలా ఎంతసేపు కూచుంటావే అమ్మా!' అనే సూర్యం మాటల్తో మళ్లీ ఈ లోకంలోకి వచ్చింది.

'ఈ అమ్మ కోసం ఇంత దూరం పరిగెత్తుకు వచ్చావా, నాన్నా నానిగా! నీ ఇష్టమే నా ఇష్టంరా వెంటనే వెళ్లి ఆ పిల్లని పెళ్ళి చేసుకో. పది కాలాలపాటు సుఖంగా ఉండండి. ఇక నీ దగ్గిరకి రావడం అన్నావా! ఏమిటో పిచ్చి భ్రమగాని నీ కన్న ఈ యిల్లూ దేశమూ నాకు దగ్గిర కావుగా! మాట యివ్వలేను గాని తప్పకుండా ప్రయత్నిస్తాలే' అంది కొడుకు తల నిమురుతూ.

*(ఆంధ్ర సచిత్ర వారపత్రిక 22 జనవరి, 1987)*



# డాక్టరు బాబుకో దరఖాస్తు




**"రౌడీ** ఇజమ్ జిందాబాద్'' అని కదా ప్రభుత్వమూ, ప్రజలూ పోటీలు పడి రుజువు చేస్తున్నది! నాకు మాత్రం హక్కు లేదా అనుకుని మా ఇంటి పక్క ఖాళీ జాగాను కొంతవరకూ సొంత ఇంటిలో కలుపుకున్నాను. తీరా నగర పాలక సంస్థ వాళ్లు ఇంటి ప్లాను కాగితాలు చూపించమంటే, చెప్పకేం - కాళ్లూ, చేతులూ వణికాము. పెద్దాపురంలో పేరు మోసిన వకీలున్నాడంటే విని వెంటనే బస్సెక్కేశాను. ఆయనతో నాకు కలిగిన అనుభవం మీకు చెప్పడం పెద్దమనిషి లక్షణం కాదు. ఎలాగా పెద్దమనిషిని కాను గనక నా కా ఇబ్బందీ లేదు!

నే వెళ్లే ముందే నలుగు రైదుగురు పార్టీలు 'కూలబడితే మరి ఓ పట్టాన లేవకుండా ఏర్పాటు చేసిన' కుర్చీల్లో ఆసీనులై ఉన్నారు. నాకూ ఆ అవస్థ తప్పలేదు. ఆయన నే నెవరో, ఎందుకొచ్చానో అడిగే ధోరణిలో లేరు. మిగిలిన వాళ్లూ అదే స్థితిలో ఉన్నా రనడానికి వారి వారి బిక్కమొహాలే సాక్షి.

"రవణా, ఒసే రవణా, ఎక్కడ చచ్చావే, తొందరగా దావే, ఇలా కూచో - మనవాళ్లే. ఏం అనుకోర్లే .... సిగ్గు పడకు'' అంటూ వకీలుగారు. ఓ పదేళ్ల అమ్మాయిని మా ఎదురుగా కూచోపెట్టారు.

"పరికిణీ ఎత్తి ఆపాదం సరిగ్గా చూపెట్టవే .... ఇది మామూలు పాదం అనుకుంటున్నారు కదూ. అబ్బే! రెండేళ్ల కిందట స్కూల్నుంచి వస్తూంటే బస్సు కింద పడి ఎడం పాదం అంతా ముద్ద ముద్ద అయిపోయింది. యాంప్యుటేషన్ చేయించి, ఎలాగో పిల్లని బతికించుకున్నాం. ఆర్టిఫిషియల్ లిబ్ సెంటర్ వాళ్లకు కొలతలూ అవీ పంపించి ఈ ప్లాస్టిక్ పాదం తెప్పించాం. చెబితే గాని తెలీడం లేదు కదూ! సరే, నువ్వెళ్లి మీ చిన్నన్నని పంపవే!"

"వీడు మా మూడో అబ్బాయి విజయ్ అండీ! మొన్ననే మెట్రిక్కి ఎపియర్ అయాడు. వీడి కళ్లల్లో కళ్లు పెట్టి చూడండి. మీకేం తేడా కనిపించలేదు కదూ! ఉన్నట్టుండి ఆ మధ్య చాలా ఘోరమైన షార్టు సైటు పట్టుకుంది. ఎదుటిది కోతి పిల్లో తెలీదు. కొండచిలవో తెలీదు! స్కూలు కెళ్లే కుర్రాడికి ఇంతింత దళసరి కళ్లద్దాలు తగిలించడానికి నా తండ్రి ప్రాణం ఒప్పుకుంది కాదు సుమండీ! అయితే అయిందని హైద్రాబాదు తీసుకెళ్లి నేత్ర వైద్యుల్ని సంప్రదించాను. 'కాంటాక్టు లెన్సు' అంటారు. చూడండి అవి తగిలించారు కళ్లల్లో. కొత్తవి ఏవో పెట్టినట్టే లేదు కదూ! అదే తమాషా, ఏమనుకున్నారో మరి .... ఇంకా అలా కూచుంటావేంరా, వెళ్లి టీలు తెమ్మని మీ అమ్మకి చెప్పు."

".... ఇప్పుడు మీకు టీలు సప్లై చేసి వెళ్లిందే మా ఆవిడ. దాని ముఖంలో మీ రేం చిత్రం పసిగట్ట లేదూ? ఆరేళ్ల కిందట పల్లెటూళ్లోని మా ఇల్లు అంటుకున్నప్పుడు మా ఆవిడ సామాన్ల గదిలో చిక్కడిపోయింది. మరేం తొందర్లేదు, మీరు నెమ్మదిగా టీ పుచ్చుకోండి. ఆఁ, ఏమిటి చెబ్తున్నానూ, మా ఆవిడకి జరిగిన ప్రమాదం గురించి కదూ .... ఎలాగో ప్రాణాలతో ఇవతల పడేశారు గాని, ఆ మొహం బాగా కాలిపోయింది. పచ్చడి చెయ్యడానికి వంకాయ కాలుస్తాం చూడండి అలా కుత కుత ఉడికిపోయింది. నెల రోజులు వైద్యం జరిగాక బతుకులో పడింది గాని తన మొహం అద్దంలో చూసుకుంటే ఆవిడే హడిలిపోయేలా తయారైంది. ఇలాంటి విషయాల్లో నేను డబ్బుకు చూసుకోను సుమండీ, దాన్ని తీసుకుని బొంబాయి వెళ్లి పడ్డాం. ఆర్నెల్ల వైద్యం, ఏభై వేల కైంకర్యం. ఆ ప్లాస్టిక్ సర్జరీతో మళ్లీ ఇలా అయిందంటే మేమే నమ్మలేక పోతున్నాం. దూరం నుంచి పోల్చలేం గాని ఆ మొహమంతా ముప్ఫై మూడు కుట్లు సుమండీ!"

"అయ్యయ్యో, లేచి నిలబడ్డారేం .... పర్వాలేదు. కేసు లనేవి ఇవాళ కాకపోతే రూపు చూసుకోవచ్చు. తొందర పనం దంటారా? మీరే అలా మొహమాట పడిపోతే నేనేం చెప్పను? పోనీ, ఈ ఒక్క మాటా చెప్పి వెళ్లిపోండి. ఇంతసేపై వాగుతున్నాను. నాలో ఏ కృత్రిమ భాగమూ మీరు గుర్తించనే లేదా?"

వాళ్లకి అలవాటయిపోయిందేమో గాని ఈ పెర్వర్టెడ్ ఎగ్జిబిషనిజమ్ భరించడం ఇక నావల్ల కాకుండా పోయింది. ఎలాగో కుర్చీని విడిపించుకుని లేచి నిలబడ్డాను. అతను నా ఎడం చెయ్యి పట్టుకుని ఆపేశాడు. చటుక్కున తన నోట్లో చెయ్యి పెట్టుకుని రెండు వరసల కట్టుడు పళ్లూ నా కుడి అరచేతిలో పెట్టేడు. ఇల్లెరిగిపోయేటట్టు బోసినవ్వులు ఒలకబోస్తూ.

అంతే ! నేనేం చేశానో ఒళ్లెరగను.... ఆ ఎంగిలి పళ్లు ముప్ఫై రెండు ముక్క లయేటట్టు విసిరికొట్టాననుకుంటాను. అంతేనా? టాక్సీ చేయించుకుని సామర్లకోట చేరి మెయిల్లో పడేదాకా నా గుండె దడ ఆగలేదు. అయ్యబాబోయ్, ఇంకా ఉంటే ఏం చూపిస్తాడో! ఇంతటి గొప్ప వకీలుని

కలుసుకోమని చెప్పిన మా ఫ్రెండుని ఏం చేసి బుద్ధి చెప్పాలా అని ఆపై బెర్త్ మీద కూచుని ఆలోచిస్తున్నాను.

నా గుండెల్లో ఇంకా వేగంగా రైళ్లు పరిగెత్తించగల శాల్తీ నా బెర్త్ కిందే ఉందని నే నప్పుడు గుర్తించలేకపోయాను. నాకు చెవుడు లేకపోవడం ఎంత దురదృష్టమో తెలిసిన క్షణం అదే.

ఓ మద గజలక్ష్మి మరో అర గజలక్ష్మితో తన శరీర బాధలు వివరిస్తోంది - "నాకు మొట్టమొదటి ఆపరేషను ఎప్పుడయిందనుకున్నావ్, పద్దెనిమిదో ఏట! మొన్న చేయించుకున్నది ఎన్నోది అంటావ్, ఎనిమిదోది! నలుగురు డాక్టర్లు ఆరు గంటలసేపు హూరాహూరీ పోరాడి, ఎనిమిది ఇంచీల మేర కడుపు నిలువునా చీరి, మేజర్ ఆపరేషన్ చేస్తే గాని ఆ బిడ్డ సంచీ ఇవతల పడలేదే మాయమ్మ!" ఇలా మొదలెట్టిన మనిషి మళ్లీ ఆపుచేసింది - ఆమె దిగవలసిన స్టేషనులో రైలు ఆగేకనే, వెడుతూ వెడుతూ అవి దన్న ముక్క ఇదే!

"ఇంతకీ నేను అనుభవిస్తున్న నిత్య నరకం నీకేం చెప్పినట్టు అయింది అమ్మాయీ ఆవగింజలో అరవయ్యో వంతు .... శరీరంలోని ఏ భాగాని కా భాగం శిథిలమైపోయి ఏదో ఇలా చావలేక దినాలు దొర్లిస్తున్నా ననుకో!"

ఇష్టం లేని ఏ కుటుంబ నియంత్రణ రేడియో ప్రోగ్రామో, గజ్జీ, చిడుమూ, తామరా వదలగొట్టే మందుని గానం చేస్తూ టీ.వీ. ప్రకటనో వస్తే వెంటనే కట్టేసి నోరు మూయిస్తాం. అలా కాదే ఇది ఎన్ని బేసిన్లతో పారబోసినా కంట్రోలు కాని రక్తస్రావం, ఎన్ని సెలైన్ బాటిల్సు ఎక్కించినా అందుకోని పల్సు రేటూ - ఇలాంటి జబ్బు భోగట్టాలు చచ్చినట్టు వినవలసిందే. రైలు దిగిపోతే మళ్లీ జీవితంలో తారసపడని కొత్త మనిషితో గంటల తరబడి తన రోగం అట్టు గుట్టు ఆనవాళ్లు అంత పెద్ద గొంతుకతో ఉటంకించిందంటే ఇంతకు మించిన హైపోకాండ్రియా ఇంకొకటి ఉంటుందనిపిస్తుందా? మిస్ వరల్డు బహుమతి లాగే మోస్ట్ ట్రబుల్డ్ ఎవార్డు ఏదైనా ఇస్తే మెరిసే కళ్లతో, వణికే చేత్తో తనంత కప్పు ఆవిడ సగర్వంగా ఎగిరే అందుకొనేదేమో!

నే నెందుకు బయలుదేరానో, నా సమస్య ఏమిటో ఎప్పుడో మరచిపోయాను. కుంపటిలోంచి గాడీ పొయ్యిలోకి గెంతి నట్టయింది. నా మనసు వకీలుగార్ని వదిలించుకున్నానంటే ఈ వనితామణి బారిన పడ్డా నేమిటి నేను! ఆ స్టేషనులో ఆవిడ దిగిపోయినా ఆ ధాటి న న్నింకా పీడిస్తోం దేమిటి!

'ఉబ్బసం ఘోరమా, మధుమేహం బాధాకరమా!' అనే చర్చనీయాంశంతో సభలు నడిపే చచ్చు పెద్దమ్మలు ఎవరూ ఉంవరు. అలాగే 'పయోరియో నయమా, ఫైలేరియా కష్టమా!' అనే కుశంకలు ఎవరూ లేవదియ్యరు. ఎందుకంటే స్వర్గాలు ఎన్ని వర్గాలో గాని నరకాలు మాత్రం నానా రకాలని అందరికీ తెలుసు. బాగా తెలిసిన మనసు కలిసిన ఆప్తులతో కష్టం పంచుకోడంలో తప్పు లేదు. అంతేగాని ఒక మొహమ్మూ, రెండు చెవులూ కనీ కనపడగానే ఉండబట్టక, బట్ట ఉండక, తమ జబ్బు డప్పుతో ఎదుటి వారి తుప్పు వదలగొట్టే వారిని మించిన అంటురోగులు ఈ ప్రపంచంలో ఉండరు. లోకంలో శోకం పాలు తక్కువైందనా మనం సప్లై చెయ్యడానికి నడుం కట్టడం!

హాస్యాని కని మీ రంటే అనుకోండి గాని, నా కో చిత్రమైన ఆలోచన వచ్చింది. వీళ్ల రోగం కుదరాలంటే డాక్టరుగారి కిలా దరఖాస్తు చేసుకోవాలి.

"అయ్యా డాక్టరు మహాశయా! ప్రజాక్షేమం దృష్టిలో పెట్టుకుని మీ కో చిన్న సూచన. మీరు

ఆపరేషను పూర్తి చేసి శరీర భాగాలు, ఉన్నవో కృత్రిమమైనవో, సరిగ్గా అమర్చి కుట్లు వేస్తారు. చూశారూ, అప్పుడు, పనిలో పనిగా, బాబ్బాబు, ఆ పేషెంటు నోరు కూడా కాస్త కుట్టెయ్యరూ?"

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 25.9.91)*




**గంటకి** ఇన్ని నిమిషాలని చెబుతారు. కాని, నిమషానికి ఎన్ని గంటలో అనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు. లేకపోతే, వెంకటాచలాన్ని కలుసుకుని నలభై ఏళ్ళు దాటిపోయినా ఏదో అదంతా నిన్నా మొన్నా జరిగినట్టు అనిపిస్తుందా?

వెంకటాచలం పెళ్లాంతో సహా రావడం, వాళ్లిద్దరూ ఈ వయస్సులో కూడా ఆరోగ్యంగా ఉండడం రఘురామయ్య దంపతులకి పరమానందం అనిపించింది. నిండు హృదయాలతో ఆహ్వానించారు.

ఆడాళ్లిద్దరూ ఇంటి పనులు చక్కబెట్టుకుంటున్న ఆ రాత్రివేళ ఆ చిన్ననాటి మిత్రులు డాబామీదకి శరీరాలు చేరేసి కబుర్లలో పడ్డారు. రఘురామయ్య మొదలెట్టాడు.

"మళ్లీ ని న్నిలా చూస్తా ననుకోలేదురా, ఇవాళ ఎంత హాయిగా ఉందో!"

"అందుకే కాబోలు, వచ్చిన రెండో రోజున దర్శన మిచ్చావు!"

"సారీరా ...ను వ్చొచ్చావని కబురందగానే ఎంత త్వరగా కలుసుకుందామా అని

కొట్టుకుపోయింది నా ప్రాణి ....వెంటనే కుదిరింది కాదు."

"ఓ వేళ కుదిరి ఉంటే మేం దిగిన పెళ్లివారింటికి వచ్చి, ఇలాగే రెండు మాయ కబుర్లు చెప్పి, అక్కణ్ణుంచి అలాగే రైలు స్టేషనుకి దిగబెట్టేసి ఉండేవాడి వనుకుంటాను. నీ కంటికి మాలాంటి వాళ్లు కనిపిస్తారా బాబూ!"

రఘురామయ్య పక్కున నవ్వుతూ అన్నాడు - "అప్పటికీ, ఇప్పటికీ ఏమాత్రం మారలేదురా బాబూ నువ్వు!"

"కాలం గడిచిన కొద్దీ కన్న కలలు నిజాలయితే, అదృష్టం అందలా లెక్కిసేస్తే మనిషి ఎన్ని వేషాలయినా వెయ్యొచ్చు. రోజులు బాగుంటే ఎన్ని మేడలైనా కట్టి, ఎలాంటి పోజులయినా పెట్టొచ్చు. పట్టుకున్న ఏ కొమ్మయినా భళ్లుమని విరిగిపోయే నాలాంటి దరిద్రగొట్టు జాతకుడిలో ఎలా వస్తుందిరా మార్పు, ఎందుకు రావాలి?" అంటూ పై పంచ తీసుకుని కన్నీళ్లు అద్దుకున్నాడు. తన మామూలు మాటకి అతన్నుంచి అలాంటి స్పందన ఆశించని రఘురామయ్య కంగారు పడ్డాడు. ఏం చెప్పాలో తెలీక అలాగే ఉండిపోయాడు.

వెంకటాచలం గద్గద కంఠంతో కొనసాగించాడు - "అయినా ని న్నని ఏం లాభం? నా రాతే అలా ఏడిసింది. కన్న తండ్రే నాకు ద్రోహం చేశాడు. ఉన్న వా ళ్లందరికీ పెద్ద పెద్ద చదువులు చెప్పించాడు. నా క్కాస్త తెలివితేటలు తక్కువే అవొచ్చు. అలాంటప్పుడు ఏ డొనేషనో కట్టి నన్ను పైకి లాగితే నా గీత ఈనా డిలా తగలడునా? మరి నా పిల్లల్ని నే నలా చెయ్యగలిగానా? పెద్ద పెద్ద మొత్తాలు కావని ఇంజనీరింగు లాంటి ఖరీదైన చదువులకి ఎగదోశానా, లేదా? బంగారం లాంటి ఇల్లు అమ్మేశానే, దేనికోసం? ఇంత త్యాగం చేశానా, కళ్లముందు పెరిగిన పిల్ల వెధవలకైనా తల్లిదండ్రుల పట్ల కాస్తంత జాలీ, దయా ఉండాలంటావా? ఎంతసేపూ ఇట్నించి ఆశించడమే కాని, అట్నించి పైసా రాల దనుకో. ఒకర్ని అనుకోడం దేనికిలే, నీలా ముందునుంచీ జాగర్త పడలేని నన్నూ నా కర్మనీ అనుకోవాలి. నీకేం నాయానా, ఏ మాటైనా విసిరేస్తావు. ఉన్న ఊళ్లో సొంత ఇంట్లో పెళ్లికొడుకులా తులతూగుతున్నావు. ఇంత ఉన్నా ఇంకా ఇంకా సంపాదించాలనే దురద, ఈ వయసులోనైనా నీకు చావలేదు. ఒళ్లు హూనం చేసుకుని ట్యూషన్లు చెబుతున్నావు. దాన్తోనైనా తృప్తి పడక నడుం వంగిన పెళ్లాం చేత బేబీ సిట్టింగు చేయిస్తున్నావు. ఏ వేళ వచ్చి నిన్ను కలుసుకుందామన్నా ఇంటి నిండా పిల్లలు! ఏదో ఓ పూటయినా ఆదరించగలిగావు. అ దెంత కాదు! ఇంతకీ పీకపోయినా నా బాధలు నాలో ఇమిడి పోవలసిందే గాని పైకి కక్కను. చిన్నప్పుడు కలసి చదువుకున్న వాళ్లం గనక ఉండబట్టలేక బయట పడిపోయాన్రా రఘురామయ్యా!"

పైన మగాడి మనోవేదన అలా చిన్ననాటి మిత్రుడి ముందు దొర్లిపోయింది గాని, ఆయన భార్య మీనాక్షికి ఆ పట్టింపూ ఉన్నట్టు లేదు. రఘురామయ్య పెళ్లాం సావిత్రిని అదే జీవితంలో మొదటిసారి కలుసుకోవడం. ఆవిడ వాక్ప్రవాహం వరస ఇదీ:

"కృష్ణా, రామా అనుకోవలసిన ఈ వయసులో పొద్దస్తమానం 'గారు గీరు' మంటూ ఇంట్లో మీ కీ పసిపిల్లల పెంట ఏమిటి వదినగారూ? మీకేం లేదా, పోదా! శుచీ శుభ్రం లేకపోతే నా సొంత మనవల్నైనా నేను వేలేసి ముట్టుకోను సుమండీ! అందుకే తన కూతురి పురుళ్ల పూచీ ఒకటే కాదు, మా వియ్యపురాలికి నేనుపెట్టిన కండిషను ఏమిటో తెలుసా? ఆ మనవల్ని అయిదేళ్లొచ్చేదాకా మా ఇంటికి దిగబెట్టడానికి కుదరదని, అవునండీ, అలా ఆశ్చర్యంగా చూస్తారేం? తన కూతురేమో

మూడు ముస్తాబులూ అయి ఉద్యోగం వంక పెట్టుకుని ఏ ఆఫీసులోనే ఫాను కింద జల్సా చేస్తూంటే, నే నింట్లో రోజంతా చాకిరీ చేస్తూ ఆ గుంట వెధవల్ని సాకాలా? మనవలు కదా అని మమకారంలో పడిపోతే లోకువ కట్టి పిల్లలు మనల్ని ఆడించెయ్యరు టండీ? పోనీ పెద్దదాన్ని తెచ్చిన ఆ జీతపు రాళ్లు సాటి ఆడదైనా నా చేతిలో పొయ్యాలా, అక్కర్లేదా? ఎన్నిసార్లు గింజుకున్నానా మాటే అంత లక్ష్యం లేకపోయాక ఇంట్లో ఇటు వస్తువు అటు పెట్టే అవసరం నా కేమిటంట? నీతి-నియమం, ధర్మం-న్యాయం, పెద్దా-చిన్నా అన్నీ చచ్చేయండి ఈ లోకంలో!"

వాళ్ల భోజనాలు అయాక, ఇన్నాళ్లకి ఇంటి కొచ్చిన ముత్తైదుకి పసుపూ కుంకుమా, రవికల గుడ్డా, పళ్లూ ఇచ్చి సాగనంపాక కూడా వాళ్లు సృష్టించిన హోరునుండి తప్పించుకోడానికి అవలేదు ఆ దంపతులకి. అసలు ఆదివారం తప్ప తీరిక ఉండదు వాళ్లకి. ఏ పాత తెలుగు సినిమా కాసెట్టో తెచ్చుకుని వేసుకుంటారు. అంతే! ఆ వారం ఆ అదృష్టానికీ నోచుకోలేదు వాళ్లు. పైగా ఆ గాభరా నుంచి తేరుకోడం అంత సుళువా!

"ఇన్నాళ్లకి కలిసిన స్నేహితుడు కదా, ఎన్నో చెప్పుకుందా మనుకున్నాను. తన గొడ వేదో తప్ప మాట వరసకైనా మన గురించి అడగలేదు వాడు. ఇంకేం చెప్పను!" అన్నాడు రఘురామయ్య.

"మీరు పిల్లలకి పాఠాలు చెప్పడం, నేను ఇంట్లో ఓ అరడజను మందికి బేబీ సిట్టింగ్ చెయ్యడం - ఇదంతా డబ్బాశతోనే అనుకుంటున్నారు వాళ్లు. నే చెబ్దా మనుకున్నాను గాని ఉన్న విషయం మీరే చేప్తే బావుంటుందని ఊరుకున్నాను. అదైనా చెప్పవలసింది."

"మనం చేసే పనుల్ని చూసి వారి వారి సంస్కారాలని బట్టి జనం ఓ నిర్ణయానికి వస్తారు. అసలు విషయం చెప్పినా నమ్ముతారని గారంటీ ఏమిటి?"

ఆ దంపతులకి నలుగురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లూ, ఆడా-మగా అందరికీ పెద్ద పెద్ద చదువులు, అందరివీ పెద్ద ఉద్యోగాలు. ఇద్దరు కూతుళ్లూ, ఇద్దరు కొడుకులూ ఫారెన్‌లో సెటిలయిపోయారు. దేశంలో ఉన్న ఇద్దరు కొడుకులూ బొంబాయిలో ఒకడూ, ఢిల్లీలో ఒకడూ వేరే ఫ్లాట్సు కొనుక్కుని స్థిరపడిపోయారు. రఘురామయ్యకి ఓ రెండు వేల దాకా పెన్షన్ వస్తుంది. సొం తింట్లో స్థిరపడిపోయాడు. పదిమందిని పెంచి పెద్ద చేసిందేమో, సావిత్రికి ఒక్కర్తీ ఉండడం - అంతమంది పిల్లలూ, మనవలూ ఉండగా - కలచివేసినట్లు అయింది. పైకి చెప్పడు గాని యాక్టివ్ లైఫ్ లీడ్ చేసిన రఘురామయ్యకి మరీ దిగులు అనిపించింది. ఒకరికి బరువు కాకుండా చివరి రోజులు గడవడానికి వాళ్లు వెదుక్కున్న కాలక్షేప మార్గం ఇది. అన్నం, బట్టా, మూడొందలు జీతం ఇచ్చి పసిపిల్లల పనులతో సహా ఇంటి పనులన్నీ చెయ్యడానికి ఓ దిక్కులేని విధవరాల్ని కుదుర్చుకుంది సావిత్రి. బేబీ సిట్టింగ్ బాధ్యత తనది గాని, పనులన్నీ ఆవిడవే. డియ్యీవోగా పదవీ విరమణ చేసిన రఘురామయ్య గారికి పిల్లలకి పాఠాలు చెప్పడంలో ఇంకొకరి సాయం అక్కర్లేదు. ఇంతకీ పసిపిల్లల్ని సాకినా, పెద్ద పిల్లలకి పాఠాలు చెప్పినా, వాళ్లు చేసేది ఫ్రీగానే!

"మావాణ్ణి మించిన దాన్లా ఉంది వాడి పెళ్లాం. ఒక్కరోజు దెబ్బకే ఇప్పటికీ తట్టుకోలేకపోతున్నాం మనం. ఇలాంటి భారీ మనుమలతో సరిపెట్టుకోలేక వాళ్ల పిల్లలు నిత్యం ఎంతగా క్రుంగిపోతున్నారో!" అన్నాడు రఘురామయ్య.

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 11-09-91)*



## భూభారం పురుషులూ శిరోభారం స్త్రీలు

# పై మెరుగు లోకం, ఏ మెరుగు శోకం !

## 37



**రామ్మూర్తి** మనసు మహా చికాగ్గా ఉంది. ఇటు అక్కా, అటు ఆప్తమిత్రుడూ. ఇద్దరి సలహా ఒకే మాదిరిగా ఉండడం అతనికి ఆశ్చర్యం కలిగించింది. నిజంగా అంతకంటే తన మేలుకోరేవారు ఎవరుంటారు! డబ్బు ఉండొచ్చు లేకపోవచ్చు. ఆపాటి ఆత్మాభిమానానికైనా తను నోచుకోడా? తన తరపున వకాల్తా పుచ్చుకుని, తానెలా అవమానించబడ్డాడో అర్థం చేసుకుని, తగిన ప్రతిక్రియ సూచించారు. వాళ్ళిద్దరూ ఏ నిర్ణయం తీసుకోవాలో తేల్చి చెప్పేశారు కూడా. అది వెంటనే ఆచరణలో పెడితే గాని తన మనసు తేలికపడదనిపించింది రామ్మూర్తికి. ఆ ఉద్రేకంలోనే తల్లిని పేరిట నాలుగు ముక్కల ఉత్తరం రాసేశాడు కూడా. అ దిలా పూర్తి చేశాడో, లేదో శొంఠి మాస్టారు వచ్చి వీధి గదిలో కూచున్నారని పెద్దమ్మాయి చెప్పి వెళ్ళింది. అతను మరీనూ, చిన్నప్పుడతని దగ్గర చదువుకోడం కాదు గాని, ఇక రాకపోకలకీ, ఆ నీతి సూత్రాలకీ అంతూ, దరీ అంటూ ఉండవు. విసుక్కుంటూనే వెళ్ళి నమస్కారం చేశాడు.

"ఏవిటోయ్! అమ్మడి కేదైనా సంబంధం జతపడిందా?'' అంటూ పలకరించా డాయన కాఫీ

గ్లాసు అందుకుంటూ, ఆయన కాఫీ పూర్తి చేసేదాకా ఆగి రామ్మూర్తి మొదలెట్టాడు.

"మాస్టారూ! చిన్నప్పట్నుంచీ నన్ను ఎరిగున్నవారు. అదీ గాక మీలా అభిమానం చూపించే పెద్ద దిక్కు కూడా మాకు మ రెవరూ లేరు. నే నేమన్నా మీరు మరోలా అనుకోరనే ధైర్యంతో ఇవాళ నా మనసులో ఉన్నదంతా మీ ముందు వెళ్ళగ్రక్కదలుచుకున్నాను. మా పెద్దమ్మాయికి పెళ్ళీ, రెండో దానికి కాలేజీలో సీటూ, అబ్బాయికి ఉద్యోగం, మా ఆవిడ 'హిస్టీరియాక్టమీ' ఆపరేషనూ .... ఇలాంటి వెయ్యినొక్క ఇబ్బందుల నుంచి విముక్తి కలగడానికి ఇన్నాళ్ళకి నా కొక్క ఉపాయం తోచిందండీ ... ఏమి టలా ఆశ్చర్యంగా చూస్తున్నారూ?"

"అబ్బే, ఎన్నేళ్ళు నేనేం చెప్పినా బెల్లం కొట్టిన రాయిలా ఉలుకూ పలుకూ లేకుండా ఈ కొట్టడమేనా లేకుండా కూచునే వాడివి. ఈ రోజున నీకు నువ్వుగా, ఎత్తిన తల దించకుండా దంచేస్తూంటే ఆశ్చర్యమా, మరీ ఆశ్చర్యమా? ఈ నీ ఇంటి పరిస్థితులు ఇవాళా, నిన్నా వచ్చినవి కావు. కేవలం నీ ఒక్కడి ఇంట్లోనే ఇలాంటివి లేవు కూడా. అలాంటిది ఉన్నంట్టుండి నీ కింతటి జ్ఞానోదయం అవడానికి జరిగిన గీతోపదేశం ఏమిటా అని.... చెల్లాయమ్మగారు గాని నీ దగ్గరికి ఏకంగా వచ్చేస్తానని రాశారా, ఏం?" అని అడిగిన మాస్టారి వైపు విస్మయంగా చూశాడు రామ్మూర్తి.

చెల్లాయమ్మగారంటే మరెవరో కాదు, తన తల్లే. నాన్న పోయిందగ్గర్నుంచీ ఆమె ఆలనా పాలనా తమ్ముడు ప్రభాకరం చూస్తున్నాడు. నాన్నగారికి కేన్సరు వచ్చిందనీ, ఇక బతకడనీ డాక్టరు చెప్పకుండానే రోగి గ్రహించడం జరిగింది. శౌంఠి మాస్టారూ, నాన్నా కలిసి చదువుకున్నారు కూడా. చనిపోయేముందు నాన్న మాస్టారితో చెప్పాడు - "ఒరే శౌంఠీ! నేను పోతున్నాను. మా పెద్దాడు బొత్తిగా అమాయకుడు. చిన్న ఉద్యోగం. ఇది చాలక నిత్య రోగిష్టి అయిన పెళ్ళాం. వాడి ప్రాణానికి అదీ, ఆ పిల్లలూ చాలు. ఇక తల్లి నేం చూస్తాడు? మా ఆవిడ చిన్నాడి దగ్గర ఉంటుంది. ఫామిలీ పెన్షను వెయ్యి రూపాయలందుతుంది గనక తల్లి పోషణకోసం అందులో అయిదొందలు చిన్నాడు ఉంచుకుంటాడు. వాడి మామగారు భాగ్యవంతుడూ, వాడి పెళ్ళాం గడుసుదీ గనుక ఆ మాత్రంతో మెయిన్‌టెయిన్ చెయ్యగలరు. మిగిలిన అయిదొందలూ ఏ నెల కా నెల రామ్మూర్తికి పంపెయ్యాలని నా కోరిక. వింటున్నారుగా? ఇక ఉన్న ఒక ఆడపిల్లా సుగుణకి ఏం పెట్టారని అది దుఃఖపడకుండా తల్లి ఒంటెడు నగలూ, ఇంట్లో ఉన్న ఇత్తడీ, వెండీ అన్నీ దానికి ఇప్పుడే ఇచ్చేస్తున్నాను."

ఆయన కోరినట్లే అక్షరాలా పిల్లలు జరిపించారు కూడా. ఆయన పోయిన ఈ మూడేళ్లి చెల్లాయమ్మగారు ప్రభాకరం దగ్గరే ఉండి నెల నెలా పెద్ద కొడుక్కి డబ్బు పంపిస్తోంది. ప్రభాకరానికి ప్రమోషన్ వచ్చింది ఈ మధ్య. ఉన్న ఒక్క కొడుక్కీ ఇంజనీరింగులో సీటు వచ్చింది కూడా. సుగుణకి పిల్లలు పుట్టలేదు. ఆ మధ్యనే మరిది కొడుకుని దత్తత తీసుకుంది. ఆ దత్తతతోపాటు హైదరాబాదులో మంచి సెంటర్లో ఉన్న ఓ ఇల్లు కూడా దఖలు పడింది. నానాటికీ తీసికట్టుగా తీసుకుంటున్నది రామ్మూర్తి కుటుంబం మాత్రమే.

తన మనో వ్యథకి మూలాకారణం తల్లి చెల్లాయమ్మగారే" అని శౌంఠి మాస్టారు అంత తొందరగా మరోసారి గుర్తించడం రామ్మూర్తికి విస్మయం కలిగింది, తను చెబ్దా మనుకున్నదేదో గొంతుక దగ్గరే ఆగిపోయింది. అయినా మాస్టారు అలా ఆగిపోతే ఊరుకునే రకం కాదు. సాగదీసి అసలు విషయం బయటకి లాగగలిగాడు.

**పై మెరుగు లోకం, ప మెరుగు శోకం!**

ఆ ముందు రోజు సుగుణ ఆ ఊరునుంచి పాస్ అవుతూ రామ్మూర్తికి స్టేషనుకి రమ్మని రాసిందిట. తమ్ముణ్ణి కలుసుకున్నప్పుడు సుగుణ చెప్పిన మాటలు ఇవి: "ఏంరా రామూ రోజు రోజుకీ మరీ అలా తయారవుతున్నావ్, ఏం, మరదలింకా మంచం మీంచి దిగడం లేదా? అయినా ఇరవై నాలుగ్గంటలూ అలా మూలుగుతూ పడుకుని మొగుడి చేతా, పిల్లల చేతా చేయించుకునేది అసలు ఆడదేనా అని! కొంచెం అటూ ఇటూ అయితే అవుతుంది, డిస్చార్జి బాధ ఏ ఆడదానికి తప్పిందని! నెలా అయేసరికి అయి దొందలు చేతిలో పడుతూంటే ఇక మంచం దిగాల్సిన అవసరం ఏముందిలే! అయినా నీకుండాలిరా సిగ్గు! పెళ్ళాన్ని కంట్రోల్ చెయ్యలేని వాజమ్మని, మనస్సునైనా కంట్రోల్ చేసుకుని అమ్మ పంపే డబ్బు వద్దని చెప్పొచ్చుగా! నిజంగా అది స్త్రీ ధనం. అడిగే హక్కు నాదీ. అయినా ఎప్పుడైనా అడిగేనట్రా? అప్పనంగా అందుకుంటే అరుగుతుందిట్రా?"

సుగుణ మాటలు ములుకుల్లా తగిలి, తట్టుకోలేక ప్రాణస్నేహితుడు ప్రకాశం దగ్గరకెళ్ళి ఆ వేదనంతా వెళ్ళగ్రక్కాడు రామ్మూర్తి.

"ఒరే రామం! ఇన్నాళ్ళకైనా మీ అక్క నీకు కనువిప్పు కలగజేసినందుకు సంతోషం. వృద్ధాప్యంలో సేవ లందించలేని తల్లి నుంచి నెల నెలా డబ్బు అందుకోడ మంత దరిద్రం ప్రపంచంలో మరోటి లేదు. ఆ డబ్బు అలా వస్తున్నంత కాలం తల్లిని కాక, ఆమె పంపే డబ్బునే ఎప్పుడూ తలుచుకుంటూ ఉంటావు నువ్వు. ఎంతటి రక్తబంధాలూ ఆర్థిక కబంధహస్తాల్లో కలుషితం అయిపోతాయి. ఇది నీకు శుభంకాదు. అందుకే నీ కుటుంబం ఎత్తిరిల్లడం లేదు. స్టాపిట్ ఇమీడియట్లీ."

వచ్చే నెల నుంచి తన కిక సొమ్ము పంపించవద్దని రామ్మూర్తి తల్లి పేర ఉత్తరం రాసేశాడు. ఇక పోస్టు చెయ్యడమే తరువాయి శాంతి మాస్టారుతో జరిగిందంతా చెప్పుకున్నాడు. అన్నీ విని ఆలోచించి ఆయన ఇచ్చిన తీర్పు ఇది:

"సుగుణ కానీ, మీ ఫ్రెండు ప్రకాశం గాని, మరెవరైనా గాని ఈ లోకంలో మనుషులు. లోకానికేం కోడై కూస్తుంది. కాకై పాడుస్తుంది. నాలుగు వేళ్ళూ నోట్లోకి వెళ్ళిన ప్రతి ఒకరూ మానవ సహజమైన అసూయతో అనేక హితబోధలు చెయ్యొచ్చు. పిల్లా పీచూ లేదు కదా, చచ్చినంత ఆస్తి వచ్చిపడింది కదా, మీ సుగుణక్క మీ అమ్మని తెచ్చి ఎందుకు దగ్గర పెట్టుకోదు? మీ ప్రకాశం సంగతి నాకు తెలియంది కాదు. తనూ, పెళ్ళామూ ఉద్యోగాలు చేస్తూ ముసలి తండ్రి చేత వీధి కొళాయి నుంచి బిందెలకి బిందెలు మంచినీళ్ళు తెప్పించేవాడూ నీకు మాతృసేవ గురించి సలహాలుఇవ్వడమే! ఇంతకీ మీ అమ్మ చెల్లాయమ్మగారిని ఈ మధ్యనే చూసి వచ్చా. ఇప్పటికీ టింగురంగా మని ఇంటెడు చాకిరీ ఎడం చేత్తో చేసిపారేసే ఆరోగ్యంతో ఉంది. ఆవిడికి ఎవరైనా నిజంగా సేవ లందిస్తే వెంటనే జబ్బు పడిపోతుంది! కాబట్టి ఆ ఉత్తరం ఇలా ఇయ్యి." అని జేబులోంచి ఊడలాక్కుని ఇంతింత ముక్కలు చేసేశాడు.

"ను వ్వింతటి తెలివైన వాడివని తెలిసే మీ నాన్న ఇలాంటి ఏర్పాటు చేశాడు. ఆయన లేకపోయినా నే బతికున్నాను. ఆ ఏర్పాటుని నువ్వు కాదంటే నే ఊరుకుంటానా? మూడో పురుట్లో పట్టుకున్న డిస్చార్జి జబ్బు తట్టుకోలేక నీ పెళ్ళాం ఎంత గిల గిల కొట్టుకుంటూందో నీకూ తెలుసు, అప్పుడప్పుడు ఆవిణ్ణి ఆసుపత్రికి తీసుకెళ్ళే నాకూ తెలుసు. పైవాళ్ళకేం పట్టింది నాలుగు రాళ్ళు విసరడం తప్ప! ఎల్లకాలం ఒకరి దగ్గర చెయ్యిజాపే స్థితిలో ఉండమని ఎవరూ చెప్పరు. అన్ని

విధాలా ఆర్జించవలసిందే. కాని, ఈ రోజు ఎలా వెళ్ళాలో ఆలోచించుకోవాలి కద! 'ఫాల్స్‌ప్రిస్టేజ్' ని పారద్రోలి కాస్త 'ప్రాక్టికల్' గా ఆలోచించు'' మరి శౌంఠి మాస్టారి వైపు గౌరవంగా చూశాడు రామ్మూర్తి.

*(ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, 28-8-91)*

# ముసిలాళ్ళంతా సాలీళ్ళేనా?




**శర్మా,** శాస్త్రీ, చలపతీ - వీరి సగటు వయస్సు డబ్బై ఉంటుంది. సాయంకాలపు వేళ మైడాబామీద కలుసుకుని కబుర్లాడుకుంటే గాని ఏ రోజూ వాళ్లకి తృప్తిగా ఉండదు. ఆనాటి సాయంకాలం శర్మ రిమార్కుతో వాళ్ల సమావేశం చిన్న మలుపు తిరిగింది ఇంతకీ అతను అన్నదిదీ:

'అదేమిటి, చలపతి అలా మూలకి వెళ్ళి అటుతిరిగి పడుకున్నాడూ?

'వాడికెందుకో అలకొచ్చినట్టుంది' అని శాస్త్రి జవాబు చెబితే-

'డబ్బైదాటి ఈ వయసులో మనకింకా అలకలేమిటండీ, నా బొందా!' అని కొట్టిపారేశాడు గోపీ.

'రెండో బాల్యంకదా, ఏం చేస్తాం! అన్నిటికంటె విచిత్రమేమిటంటే శర్మగారూ, ఇంకా బాగా చీకటి పడకుండానే మీరీవేళకి ఇలా డాబామీదకి దయచెయ్యడమే' అని వ్యంగ్యం ఒలకపోశాడు శాస్త్రి.

'పని తీరికలేక రానుగాని ఇంచుమించు ఓ వయసువాళ్లం. మీతో కష్టం సుఖం చెప్పుకోవాలని

నాకు మాత్రం ఉండదూ? ఈ ఏడంతస్తుల మెట్లూ ఎక్కి ఎందుకు వచ్చానంటారు మరి' అని సంజాయిషీ ఇచ్చుకున్నాడు శర్మ.

గోపీకి కాస్త సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువ.

'ఏనాడో అన్నాడు కదా శ్రీశ్రీ, అందుకేనేమో అనుకున్నాన్లెండి.''

'ఏమని?'

'పోదాం పోదాం పైపైకి' అని.

'అంటే? ఇంకా అభివృద్ధి సాధించాలని అర్థంగాని ఎపార్ట్‌మెంట్స్ ఎక్కి పై డాబా మీదకి చేరుకోవాలనా?'

'అయితే ఇందులోనూ ఓ సుళువుందండోయ్'

'ఏమిటో అది?'

'పండువృద్ధులమైన మనం అతిత వర్లో పైకి చేరుకోవలసిన వాళ్లంకదా..... ఇంతటి ఎత్తయిన ప్రదేశానికి ముందే చేరుకుని ఉంటే పైకి ఓ దూరం తగ్గినట్టవుతుంది.''

'అలా జరిగేనో లేదో గాని మనం ఇలాంటి మరీ ఎత్తయినచోట హరీమంటే మనల్ని దింపుకోలేక మనవాళ్ళు చావాలి ముందు.'

ముగ్గురు ముదివగ్గులూ గొల్లున నవ్వుకున్నారు. చలపతి మాత్రం కస్సుమన్నాడు.

'ఇందాకట్నుంచి వింటున్నాను. ఇలాంటి అశుభపు కబుర్లు చెప్పుకుంటూ మీకు నవ్వెలా వస్తోందర్రా! నూరేళ్ల బతుకన్నారు. ఇంకా ముప్ఫైఏళ్లు గ్యారంటీ.'

'చలపతీ, ఒకటడుగుతాను నీకు కోపం రాదుకదా!' అన్నాడు శర్మ.

'నా కోపాన్ని నాకన్నపిల్లలే ఖాతరు చెయ్యలేదు. అడుగు, దానికేం?'

'మనదేశం సగటు ఆయుర్దాయాన్ని మించే మనం బతికేస్తున్నాం. చెప్పాలంటే బోనస్ ఏళ్లు ఎంజాయ్ చేస్తున్నాం. కూటికీ గుడ్డకీ లోటు లేదు. ఇంకా ఏదో ఉట్టిగట్టుకు ఊరేగుదామనే కోరిక న్యాయమంటావా?' శర్మ ఉవాచ చలపతి కెప్పుడూ ఓ గడ్డిపోచ. ఎగిరి కంట్లో పడ్డాడిలా.

'అన్నీ అనుకున్నట్టు జరుపుకుంటున్న అదృష్టవంతుడివి, నీకేం నాయనా! ఎన్నయినా చెబుతావ్. జిర్రున చీది ఎరగవు నువ్వు. శిథిలమైన శరీరాలు మావి. ఇంతకీ ఇవాళ ఏం జరిగిందో ఒక్కడూ అడిగి చావడేం?'

చలపతి మొహం చూసి అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

అతనే చెప్పేడు, 'వాళ్ళకి పడదుకదా అని ఏదో తప్పుచేసినట్టు వరండాలో ఓ మూలకి వచ్చి రహస్యంగా వెలిగించుకున్నాను, చుట్ట. ఇలా రెండు దమ్ములు లాగేనే లేదో మా మనవడు వెధవ వచ్చి లాక్కుని అవతలకి విసిరేస్తాడా? ఇంటిల్లిపాదీ నవ్వుతారా! ఏం, నాకా మాత్రం స్వతంత్రం లేదూ? నా బరువు నేనే మోసుకుంటున్నాను కద.....'

'పరువుగా బతికితే బరువు అట్టే బాధించదులే' అన్నాడు చటుక్కున శర్మ.

'అలా అనడంలో నీ ఉద్దేశం? ఏదో ఓ చురక అంటించదే, ఓ వాత పెట్టందే, నీ నోట మాట రాదు కదా....'

'ఏం చెయ్యను? నా నాలిక అలాంటిదేమరి? అని ఒప్పుకున్నాడు శర్మ. అవకాశం దొరికింది

గనక చలపతి ఊరుకోదల్చుకోలేదు.

'నాలిక ఒకటేనా? ఛీఫ్ సర్జన్‌గా రిటైరయ్యావు. ఎన్ని ఆపరేషన్లు చేసి ఈ పాటికి ఎన్ని వందల మందిని గట్టెక్కించి ఉంటావో....'

'నువ్వలా అనడం న్యాయం కాదు. సర్జనులందరూ దుర్జనులు కాదు'

'ఏమో బాబూ.... మాలా నువ్వు ముక్కుతూ మూలుగుతూ లేవు కదా! నీకు డబ్బై దగ్గర పడిందంటే ఎవరైనా నమ్ముతారా?'

'మరే శర్మగారు మాంచి స్పోర్ట్స్‌మెన్ అని కూడా విన్నాను. అందుకే ఈ వయసులో కూడా ఇంత దిట్టంగా ఉన్నారేమో!' అన్నాడు గోపీ.

"కాలేజీ డేస్‌లో గేమ్స్‌లో పాల్గొనవద్దని మిమ్మల్నెవరైనా అడ్డుపెట్టేరా? వయసులో చేసిన వ్యాయామం జీవితమంతా కాపాడే భీమా పథకం'

'నలభీమా పథకం అంటే సరిపోతుందేమో' అన్నాడు గోపీ నవ్వుతూ. అదేమిటో వివరించమని తక్కువ ఇద్దరూ పట్టుపట్టేరు.

'చెబితే శర్మగారు ఏమనుకుంటారో' అని నసిగాడు గోపీ.

'చెప్పండి పర్వాలేదు' అని అభయమిచ్చాడు శర్మ.

'మరేంలేదు. ఇంట్లో మూడు పూటలా చెయ్యి కాల్చుకునేది శర్మగారేనుట. వారి ఆరోగ్య మహాభాగ్యానికి అంతర్రహస్యం అదేనట!'

శాస్త్రీ, చలపతీ గొల్లున నవ్వేశారు.

'ఎంత బాగా చెప్పేరు గోపీ .... మీరు విన్నది నూటికి నూరుపాళ్లూ నిజం' అంటూ శర్మ సీరియస్‌గా చెప్పడంతో వారి నవ్వుకి బ్రేకు పడింది.

'ఆమాట నలుగుర్లో ఒప్పుకోడానికి సిగ్గుగా లేదూ?' అని చలపతి నిలదీశాడు.

శర్మ చెక్కుచెదర్లేదు. మెల్లగా గంభీరంగా చెప్పుకొచ్చాడు.

'ఎందుకూ సిగ్గు పడడం? ఇంట్లో వాళ్ళకి సాయపడకుండా, చేసిన దాంట్లో లోపాలు వెదుకుతూ, ఏ పడక్కుర్చీలోనో విలాసంగా మూలుగుతూ పడుకుంటే సిగ్గుపడాలి. గతకాలపు ఘనకార్యాల ఊబిలోంచి బయట పడలేకపోతే సిగ్గుపడాలి.'

'అయితే? పడుచువాళ్లని కూచోపెట్టి నడుం వంగిన మనం వండివార్చాలా?'

'తప్పేముంది? బతికున్నన్నాళ్లూ మా ఆవిడ వండిపెట్టేది. ఇప్పుడు వండి పెట్టడానికి నేను బతికున్నానని సంతోషిస్తున్నాను. మునపటి కాలం కాదు. మునపటి కోడళ్లు కాదు. ఉద్యోగాలు చేసి నెలనెలా బంగారుగుడ్లు పెట్టే కోళ్లు వాళ్లు. ఏదో పింఛెను డబ్బులు వాళ్లచేతిలో పెడుతున్నాం కదా అని ముసిలాళ్లు పింఛెం విప్పి ఆడాలని అనుకుంటే అంతకుమించిన వంచన ఉండదు.'

'ఏమిటి శర్మా ఈ లెక్చరు? మేం అడిగింది ఏమిటి ....? చలపతి అడ్డుపడబోయాడు.

'నన్నాపకండి. ఈ రోజుల్లో ఉదయం ఎనిమిది దాటకుండా ఆడా మగా చిన్నా చితకా టిఫిన్ బాక్సులు పట్టుకుని వీధిన పడుతున్నారు. ఇక మళ్ళీ చీకటి పడితేనేగాని ఇల్లు పట్టరు. ఈ జీవన వేగాన్ని తట్టుకోలేకపోతే మనలాటివాళ్లు నిలబడేది ఎలా? ఇంట్లో ఇరవై నాలుగ్గంటలూ పడుండే ముసిలాళ్లు ఆ మాత్రం వంట సాయం చేస్తే తప్పా? ఏ ఎనిమిదికో ఇల్లు చేరిన అలసిపోయిన

కోడలికి ఓ అరకప్పు టీ చేసి ఇస్తే ఇక మావగారి మగతనం మంటకలసిపోయినట్టే?'

'నేడో రేపో అన్నట్టున్నాం. ఇంకా మనం చాకిరీ చెయ్యాలటయ్యా?' అన్నాడు శాస్త్రి.

'నేడో రేపో అంటున్న మనమే ఎంచక్కా ఏడంతస్తులూ ఎక్కి చకచకా ఇక్కడ చేరుకున్నాం. ఈ పాటిగా ఉన్నాం. సంతోషించి ఇంట్లో వాళ్లకైనా కాస్త సాయపడరాదా? బలవంతమేమీలేదు. మన వయస్సుకి తగిన పనులే చెయ్యొచ్చుగదా! బట్టలు ఉతకలేకపోవచ్చు. ఆరిన బట్టలు తీసి మడతపెట్టలేమంటారా! 'పెద్దల్ని గౌరవించవలెను' అనిపించుకోవాలంటే ముందు మనం పెద్దల్లా ప్రవర్తించాలిగదా! ఇంతకీ ఎంత ఒంటరివాళ్లమైనా, వృద్ధులమైనా, జీవితం అనేది ఎవరికి వారు ఆస్వాదించే కల్లుముంతగా చేసుకుంటే ఎలా? ఏమాత్రం శక్తి ఉన్నా అది నలుగురితో పంచుకుంటే అమృతభాండం అవదా!' అని ముగించాడు శర్మ.

*(ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రిక, 24.4.96)*





# గొప్ప ఎడ్వాన్సు ఏర్పాటు ఉద్యమం!




'నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు – ఓ మనిషి గొప్ప వాడవడానికీ, బాగా డబ్బు చేసుకోవడానికీ, అతని ప్రతిభ కన్న అవి సొమ్ము చేసుకొనే లోక జ్ఞానమే ముఖ్యం' అనే మా చిదంబరం మాటకి అభ్యంతరం చెబుతూ

'లోక జ్ఞానం అంటే?' అనడిగాను.

'పెద్ద పెద్ద ఉద్యోగాలకే ఎగనామం పెట్టి యోగ్యులను కున్న కుర్రకారుతో సహా బిజినెస్ వెర్రికి ఎగబడుతున్న ఈ రోజుల్లో సమస్త రంగాల్లోనూ ఓ ఉద్యమంగా విరాజిల్లి పోతున్నది వ్యాపార దృక్పథమే. నీతి నియమాలకు తిలోదకాలిచ్చి వీలైనంత తక్కువ కాలంలో వీలైనంత ఎక్కువ డబ్బు సంపాదించడమే ఈ యుగధర్మం.'

మావా డలా మాట్లాడుతూంటే నాకు గొప్ప ఆశ్చర్యం వేసింది. చిదంబరం అంతో ఇంతో పేరు సంపాదించిన రచయిత. చిన్నప్పట్నుంచీ ఎన్నో వందల కథలు రాసినవాడు. సాహిత్యమనేది మనిషి హృదయ వికాసానికి తోడ్పడే మంచి సాధనమని మనసారా నమ్మినవాడు. ఎక్కువగా

రాసిన వాడు గనుక, తక్కువగానే ఔొగాక. అందులో కొన్ని చాలా మంచి కథలు లేకపోలేదు. అవన్నీ ఒక పుస్తక రూపంలో రావాలని వాడి చిరకాల వాంఛ తీరేలా లేదు. సక్సెస్ అందని మనిషి వెక్స్ అయిపోవడంలో ఆశ్చర్యం లేదేమో ......

'ఎందుకూ పనికి రాని ఆ సుందరం గాడు తన కథల పుస్తకం అచ్చు వేయించుకున్నాడు. ఏ విలువలూ లేని ఓ ఎం.ఎల్.ఏ. గారికి అంకితమిచ్చి ఆయనిచ్చిన డబ్బుతో ఎంతో అందంగా తీసుకొచ్చాడా వాల్యూమ్‌ని. చచ్చినా బతికినా వాడి పుస్తకం కాపీ ఏ లైబ్రరీలోనో బతికే ఉంటుంది. పాతికేళ్లయి రాస్తున్నాను. అచ్చయిన కథల ప్రతుల్ని దాచలేక నా ప్రాణాలు పోతున్నాయి. ఎప్పుడో హరీ మంటాను. దాన్తో పాటే ఆ కాగితాలూ గాలికి ఎగిరిపోతాయి. నా లాంటి వాడికి ఆ శిక్ష తగిందే'. అంటూ చిదంబరం కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ చెబుతూనే ఉన్నాడు.

'ఈ లౌకిక ప్రపంచంలో ఇచ్చిపుచ్చుకునే లక్షణ మొకటి ఉందని గ్రహించడానికి నాకు చాలా కాలం పట్టింది. నీ జన్మ మీద గాని, నీ చావు మీద గాని అధికారం లేని నువ్వు, ఎవరి మీదా ఎందునా ఆధారపడకుండా నువ్వుగా బతకాలనుకోడం అజ్ఞానం. అతను ఎమ్మెల్యే అవడానికి ఎంతో ప్రచారం చేసి తోడ్పడ్డాడు కాబట్టే సుందరంకి అతగాడు డబ్బిచ్చాడు. అమాయకులు పసిగట్టకపోవచ్చుగాని ఈ లోకంలోని ప్రతి ఒక్క విజయానికి 'నా వీపు నువ్వు గోకు, నీ వీపు నేను గోకుతాను' అనే లోపాయికారీ ఉద్యమం తోడ్పాటు ఉండి తీరుతుంది.' ఆ లెక్చర్ ఇక భరించలేక అడ్డుపుల్ల వేశాను.

'పోనీ ఇప్పటి కైనా తెలుసుకున్నావ్ కదా! అదే దారి నువ్వూ ఎందుకు తొక్కకూడదు?'

' రైట్ రాయల్ రోడ్డు అలవాటైపోయింది గనక పక్కదారి పట్టడానికి ఓ పట్టాన సిద్ధం కాలేక పోతోంది నా మనసు. ఏమైనా ఎత్తుకి ఎదగాలంటే ఆంతో ఇంతో కిందకి దిగక తప్పదని గ్రహించాను, దిగాలని కృత నిశ్చయంతో ఉన్నాను కూడా. నీలాంటి దగ్గిర వాడి దగ్గిర నిజం ఒప్పుకోడానికి ఇంకా సిగ్గెందుకు? చూస్తూ ఉండు. ఎవడి నెత్తి మీద్లో చెయ్యిపెట్టి అతి తొందర్లోనే నా పుస్తకం అచ్చు వేసే డబ్బు సంపాదించుకుంటాను.'

చిదంబరం అంతగా ఢంకా బజాయించి చెబుతూంటే తెల్లబోయాను నేను. సొంత డబ్బుతో పుస్తకం అచ్చువేయించుకుంటే అమ్ముకోలేక చావాలి. మామూళ్లే మామూలయిపోయిన సంఘంలో కావలసినంత బ్లాక్ మనీ పేరుకుపోయి ఉంది. అలాంటి దేదైనా పసిగట్టి, దులుపుకోగలిగితే ఎవరి చేతికీ తడి అంటదు. ఎలా వస్తేనేం మా చిదంబరం కథల పుస్తకం అంటూ వస్తే కాంప్లిమెంటరీ కాపీ ఎలాగా నా చేతికి చిక్కుతుంది. ఏ ఏభయ్యోపెట్టి ఎవరు కొనగలడు!

లతా వనితా కవితా ఒకర్ని ఆశ్రయించందే వృద్ధిలోకి రావని మనవాళ్లు ఊరికే అన్నారా? మా చిదంబరం ఏ రాజకీయ నాయకుణ్ణో ఏ సినిమా వాణ్ణో ఆశ్రయిస్తాడని నేను సహజంగా అనుకున్నాను. కాని జరిగింది మరొకటి - ఒక చిత్రమైన అవకాశం అనుకోకుండానే అతని కాళ్ల దగ్గరకొచ్చింది.

అతను కొత్తగా సర్వీసులో చేరిన రోజుల్లో అనకాపల్లిలో 'సరస్వతీ సమాజం' అనే సాహితీ సంఘం స్థాపించాడు. తెలుగక్షరం మీద మమకారం ఉన్న కుర్రకారంతా అందులో చేరి, ఒకటి

రెండేళ్లలోనే అదో మహాసంస్థగా రూపుదిద్దుకుంది. సమయపాలనకీ, క్రమశిక్షణకీ - అతని ఆధ్వర్యంలో అదొక ఉన్నత సాహితీ వేదిక అయికూచుంది 'బాగా చదవందే ఏదీ రాయకూడదు, రాసుకురాందే ఏదీ చదవకూడదు' లాంటి నియమాలు మొదట్లో అతను పెట్టినవే. కథా రచనకి చిదంబరానికి బలమూ, ప్రోద్బలమూ ఆ సంస్థే అని చెప్పొచ్చు ఓ విధంగా. అయితే అనుకోకుండా అతనికి అక్కణ్ణుంచి బాగా దూరపు ప్రాంతం, ఏకంగా హైదరాబాదుకే, ట్రాన్స్ఫర్ అయిపోయింది. అయినా అయిదేళ్ల పాటు కథలూ, సలహాలూ పంపి దాన్ని ప్రోత్సహించేవాడు. తర్వాత రెండేళ్ల పాటు ఏ ఫంక్షనుకయినా వెళ్లేవాడు. పూర్తిగా మరచిపోలేదుగాని ఇప్పుడా సమాజమే అతనికి తలుచుకుంటే 'అదోలా అనిపించే' స్థితికి దిగజారింది.

దేశంలోని తక్కిన సంస్కృతీ సంస్థల లాగే అదీ ఓ వ్యాపారకేంద్రంగా మారింది. చిదంబరం పెట్టిన నియమ నిబంధనలు గాలికి ఎగిరి పోయాయి. 'ఏ ఫంక్షను జరిపితే ఎంత మిగులు తుందో' అనే దుస్థితికి చేరుకున్నారు అందులోని ప్రతికార్యకార్తా. పేరున్న తెలుగు సాహితీ వేత్తలు చాలామంది వ్యసన పరులు గనక వారి భారీ ఏర్పాట్ల నిమిత్తం ఊరంతా చందాలు దండి అంతో ఇంతో జేబునింపుకునే 'విత్త' శుద్ధి పెరిగింది నిర్వాహకులలో. ఇవన్నీ చెవిన పడి 'సమాజం ఎంత పతన మయింది!' అని చాలా రోజులు బాధపడేవాడు చిదంబరం. ఇప్పుడిప్పుడు తనే పొరపాటు చేశానని తెలుసుకొని లెంపలేసుకునే స్థితికి ఎదిగాడు!

'సరస్వతీ సమాజం' వాళ్లు ఇప్పుడతన్ని ఎప్రోచ్ అయ్యాడు గనుకనే ఆ పూర్వాపరాలు చెప్పుకోవలసి వచ్చింది. నమ్మడం కష్టంగాని చూసస్తాండగానే అది స్థాపించి పాతికేళ్లు అయిపోయిందిట. అప్పటి కుర్రాళ్ళంతా ఉద్యోగాలు చేసుకుంటూ ఎక్కడెక్కడో స్థిరపడ్డారు గాని బెల్లం వ్యాపారి కొడుకు చిన్నారావు మాత్రం అక్కడే ఉన్నాడట. తండ్రిపోయాక అతనే వ్యాపారం చూసుకుంటున్నాట్ట. సమాజం స్థాపించిన నాటి నుంచి ఇప్పటి దాకా అందులో ఎంతో చురుకుగా పాల్గొంటున్నాడు. నాలుగేళ్లైె ప్రెసిడెంటుగా ఉన్నాట్ట. చిదంబరం ఎడ్రసు ఎలాగో పట్టుకుని అతని వూరు వచ్చేశాడు 'అన్ని ఏర్పాట్లు చాలా గ్రాండ్గా చేశాం. ఫౌండర్ ప్రెసిడెంటు మీరు. సిల్వర్ జూబ్లీకి వచ్చి ఆశీర్వదించక తప్పదు. మీరు నాటిన మొక్క ఎంతగా ఎదిగిందో మీరే చూద్దురుగాని. ఊళ్లో వాళ్లంతా ఎంతో ఉత్సాహపడుతున్నారు. డొనేషన్స్ యిచ్చారు, లక్షరూపాయిల పైగా!

అక్షరూపాయిలనే మాట చెవినపడగానే చిదంబరం బుర్ర పాదరసంలా పనిచేసింది. తన కథల పుస్తకం ప్రచురణకి ఇరవై వేలయితే సరిపోతుంది. తనకా మాత్రం పర్సు వాళ్లెందు కివ్వకూడదు! అడిగితే గాని అమ్మైనా పెట్టదు. ఇన్నాళ్లూ చెయి జాచకే తను చెడిపోయింది. ఏమైతే అయిందని నా చేత అడిగించాడు.

'రానూ పోనూ ఖర్చులైనా పుచ్చుకోని నీతి ధనులు చిదంబరంగారు. అడిగితే ఎంతైనా ఎప్పుడో యిచ్చి ఉందుం. పైసా అంతే చీచీ అనే పరమాత్ములే వారు! ఇది మీకు మీరే ప్రపోజ్ చేసి ఉండాలి' అన్నాడు చిన్నారావు దాంతో 'మంచి పేరు' అనే వంచనకి తలవంచిన మా చిదంబరం ఎలాగో తెప్పరిల్లి.

'పోనీ ఓ పని చేద్దాం. మీ ఇద్దరి మాటా నిలబడేలా నేనో ఉపాయం చెబుతా. నిండు సభలో నాకా ఇరవైవేల పర్సు ప్రదానం మీరు ఏర్పాటు చెయ్యండి 'సన్మానితుడి కృతజ్ఞతలు'

కార్యక్రమంలో అదే పర్సు మీ సంస్థకోసం ఖర్చు పెట్టమని తిరిగి నేనిచ్చేస్తాను' అనే మాటయిచ్చి అతన్ని పంపేశాడు చిదంబరం. 'నువ్వాట్టే కంగారు పడకు. నిన్నూ ఆహ్వానించారుగా! చూద్దువుగాని ఏం జరుగుతుందో .... పర్సు అందుకుంటాను గాని ఛస్తే తిరిగి ఇవ్వను. జుట్టు పీక్కోమను వెధవల్ని. ఇంకా నేర్చుకోకపోవాలా!' అన్నాడు చిదంబరం విషపు నవ్వు నవ్వుతూ.

సరస్వతీ సమాజం సిల్వర్ జూబ్లీ చాలా గ్రాండ్‌గా జరిగింది. చిదంబరాన్ని గొప్పగా సన్మానించారు. పర్సులో ఏముందో అని ప్రేక్షకులకి గాని, మాకు గాని అనుమానం రాకుండా 'రెండొందల వంద రూపాయిల కట్ట' పళ్లెంలో పెట్టి బహూకరించారు. నాతో చెప్పినట్టే చిదంబరం 'తిరిగి ఇవ్వడం డ్యూటీ' పెట్టుకోలేదు! కట్టను ఉంచిన పెట్టెని కాపాడుకోడంలో రాత్రల్లా రైల్లో జాగారం ఉండి ఇల్లుచేరిన మాకు బ్యాంకులో వేసే ముందుగాని అసలు విషయం తెలియలేదు! అందులో అటూ యిటూ ఉన్న రెండూ మాత్రమే వందరూపాయిల నోట్లు. తక్కిన వన్నీ ఆ సైజు తెల్ల కాగితాలే! ఓ తెల్ల కాగితం మీద 'తిరిగి మాకే చేరేవి ఏవైతేనేం! ఆ మాత్రం ముందు జాగ్రత్త లేకపోతే మేం బతగ్గలమా!' అనే చురక ఒకటి!

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 8.5 96)*

# దేవుడున్నాడు సుమండీ !




**చేసిన** పాపం చెబితే పోతుందంటారు.

నేనూ చాలా రోజులు దేవుడంటే నమ్మకంలేనివాణ్ణే.

ఓ ఏనుగుని మొసలినుంచి రక్షించాడంటారు. ఓ ఆడదానికి చీరనిచ్చి మానం కాపాడాడంటారు. ఓ బీద స్నేహితుణ్ణి ఆదుకున్నాడంటారు, బాగా డబ్బిచ్చి. ఇవో, ఇలాంటివో, ఇంకెన్నో చెబుతారు. మంచిదే.

కిరసనాయిలు పోసి ఆడాళ్ళని అంటిస్తున్నారు.

ఎదురు తిరిగినవాణ్ణి అడ్రసు లేకుండా చేస్తున్నారు.

ఇలాంటివి ఎన్ని జరిగినా ఓసారైనా అడ్డుపడడేం?

"చదువుమీద దృష్టితక్కువా, పై ఆలోచనలు ఎక్కువా. అందుకే బియ్యే మూడో ఏడు లాగిస్తున్నావు" అంటారు, నా ఆలోచన పసిగట్టిన ఎవరైనా.

నా మీద ఈ విమర్శ సరిఅయినదే.

బాగా డబ్బున్న కొంపలోంచి ఊడిపడ్డాను.

కష్టపడి చదవ్వలసిన అవసరం నాకేం కనపళ్ళేదు. అందులో ఇక్కడి కొచ్చిం దగ్గిర్నుంచీ బొత్తిగా నిలకడ కుదరడం లేదు నా దృష్టికి.

ఆ హాస్టల్లో ఉండలేక ఈ మేడమీద గది తీసుకున్నాను. ఇక్కడి కిటికీలోంచి ఆ వీధి కొళాయి కనీపిస్తుంది. అక్కడి కొచ్చే పోయే ఆడాళ్ళు కనిపిస్తారు.

ఆ వీధి మొత్తం మీద నేను ఉన్నదొక్కటే మేడ. మిగిలినవన్నీ పెంకుటిళ్ళూ, చాలా వరకూ పాకలూ.

ఇక్కడి ఆడవాళ్ళు కాయకష్టంతో రాటు తేలినవాళ్ళు. ఈ శరీరాలే వేరు. మా ఇంట్లో ఆడాళ్ళు ఇంకో రకం. నిలబడితే బీరువాలు. కూచుంటే భోషాణాలు. ఆడాళ్ళలో మెడా నడుమూ ఇంతగా వేరు వేరుగా కనిపిస్తాయని నా కన్ను ఎక్కువగా గ్రహించగలిగింది ఇక్కణ్ణుంచే. ఇంతకీ ఏది సంగ్రహించడానికైనా కాలం కలసిరావాలి. స్వానుభవం ఉండాలి. కర్మ పరిపక్వం అవాలి.

ం కావాలి.

"ఉన్నచోటునుంచే నన్నింత ఉన్నతుణ్ణి చేశావా తండ్రీ" అని ఇప్పుడనుకున్నా నంటే దానికంతా ఓ కారణం ఉంది. అది చెప్పేముందు ఓ మాట.

"తమసోమా జ్యోతిర్గమయ" అంటారు.

చీకటినుంచి వెలుగులోకి దారి పెద్దాళ్ళే చూపక్కర్లేదు. నాలాంటి చిన్నవాళ్ళు కూడా కాంతి చూపగలరు.

"తమసొమ్మా", జ్యోతిర్గమయ?

❋

ఇక్కడ మా (నేను అద్దెకున్న) ఇంటి వాళ్ళ గురించి చెప్పాలి.

ఆయన పేరు కన్నయ్య పంతులు. యూనివర్సిటీలో పని. పెళ్ళాం పేరు సావిత్రి. ఇద్దరు పిల్లలు. అతని తమ్ముడు రామశాస్త్రి వాళ్ళతోనే ఉండేవాడు. నా క్లాస్ మేట్ కూడా. కింద ఫ్రీగా ఉండదని పైకి వచ్చేవాడు మొదట్లో. మరి మా దాసీది నా గురించి ఇంట్లో ఏం చెప్పిందో, క్రమంగా రావడం తగ్గించేశాడు. ఇంతకీ పైకి రావాలనే ఉంటే కేవలం మేడమెట్లు ఒకటేనా సాధనం? మేమిద్దరం చెరువ్వొడ్డున కలుసుకుని, సిగరెట్లు కాల్చుకుంటూ కబుర్లు చెప్పుకునేవాళ్ళం. సిగరెట్ల ఖర్చు నాది. ఏ రోజు భోగట్టా ఆ రోజు నాకు చేరేసే కార్యక్రమం శాస్త్రిగాడిది.

"రేపు మెయిలుకి మా వదినా వాళ్ళమ్మ దిగుతోందిరోయ్" అంటూ ఆవిడ పూర్వాపరాలు చెప్పుకొచ్చాడు.

ఆవిడ పేరు సుబ్బాయమ్మట. వీళ్ళంతా ఇప్పుడుంటున్న మేడ ఆవిడపేరనే ఉందిట. నాకింకా కొత్త కాబట్టి తెలియలేదు గాని సుబ్బాయమ్మగారు ఇక్కడే ఎప్పుడూ ఉంటుందిట. పేరుకి కన్నకొడుకు ఒకడు లేకపోలేదు, అతనిచేత మూడు ముళ్ళూ వేయించిననాడే వాళ్ళిద్దరికీ చెడిపోయిందిట.

సుబ్బాయమ్మ కోడలు పేరు నాగరత్నం. తీరా ఇలా తలంబ్రాలు పోసుకుంటున్నారో లేదో

ఆ కబురు ఎవరో సుబ్బాయమ్మ చెవిలో ఊదేశారు. నాగరత్నం అన్నయ్య కులంలేని పిల్లని చేసుకున్నాట్ట.

"నిజం కప్పెట్టి నా కొంప నిలువునా తీసేశారు బాబోయ్! ఒక్కగా నొక్క కొడుకు. నా వంశం గంగలో కలిసిపోయింది తండ్రోయ్" అని సుబ్బాయమ్మ పెళ్ళినాడే పెద్ద శోకాలు మొదలు పెట్టింది. ఆ పసుపు బట్టలతోనే, అక్కడే, అప్పుడే జవాబు చెప్పిందిట కోడలు. ఎలా? చల్లగా. నసాళానికి అంటేలా.

"ఇంతకీ మన పెద్దవాళ్ళు చెప్పింది మనం నమ్మడం తప్ప ఎవరి వంశం ఎవరికి తెలుసు అత్తగారూ! ఏ వంశంలో అయినా జాతి వెలుగులూ ఉంటాయి. వేరు పురుగులూ ఉంటాయి. ఇంతకీ మా అన్నయ్య ప్రేమించినదాన్ని పెళ్ళి చేసుకున్నాడు గాని కట్నకానుకలు అందుకోలేదే!" అంటూ ఎదురుదెబ్బ కొట్టిందిట. కొడుకు కూడా నోరెత్తకపోడం చూసి సుబ్బాయమ్మ తల తీసేసినట్టయింది. తనలా నోరు పెట్టుకు మీదపడేవాళ్ళయితేనే ఆవిడ ఎదుర్కోగలదు గాని ఇలాంటి సన్నాయి నొక్కులు ఆవిడతరం కాదు. అంతే. వచ్చేసిందిట.

ఎప్పుడో ఏడాదికోసారి, మొగుడికి తద్దినం ఎక్కడ పెట్టరో అని, కొడుకు దగ్గరకెడుతుంది ఆవిడ. ఆ నాలుగురోజులయినా కోడలు బతకనిస్తుందా!

సుబ్బాయమ్మగారిది నిప్పు కడుక్కునే వంశం. మడీ, ఆచారమూ అంటూ పరమ పవిత్రంగా గడిపారు తన పూర్వీకులు. దొంగ పీనుగ, కోడలు పైకి గట్టిగా ఒక్కమాట అనదు. అన్నంగిన్నెనీ, నేతిగిన్నెనీ పెద్ద చప్పుడయేలా ఓ దానికి ఒకటి తాకించడం మాత్రం తెలుసు.

"అయ్యో, నేతిగిన్నె అంటు అయిపోయిందమ్మాయ్" అని అనకుండా ఉండలేదు తను. ఇక చూసుకోండి. పెదవి కదపకుండా అతినెమ్మదిగా అంటిస్తుంది.

"అవును సుమండీ అత్తయ్యా! ఎంత పొరపాటు జరిగిందీ! గిన్నెలోపల అన్నం ఉంటే అది అంటగిన్నె అంటారు కదూ! మనిషి అన్నం తిన్నాక మూడు గంటలదాకా జీర్ణంకాదు అంటారు కదా. ఎలాగండీ మరీ? భోంచేసిన కొన్నిగంటల దాకా ప్రతి మనిషిమీదా కొంచెం కొంచెం నీళ్ళు జల్లుకుంటూ ఉందామంటారా? పోనీ అలా అయితే శుద్ధి జరిగి, వంశం నిలబడి కులం వృద్ధయి, ఋషులు సంతోషిస్తారేమో!"

సుబ్బాయమ్మగార్ని ఈసారి బాగా పరికించి చూశాను. చాలా మంచి రంగు. బాగా భారీ శరీరం. మైలు దూరానికి వినపడే మైకు స్వరం. ఆవిడ కింది ఏ గదిలో ఉందో పైకి నాకు స్పష్టంగా తెలిసిపోతుంది.

"పైన ఉంటున్నది ఆ అబ్బాయేనా? మనవాళ్ళే కదూ, కాలేజీకి వెళ్ళొచ్చాక ఆ బట్టలు విడిచి వేరే పెట్టుకుంటాడా, లేపోతే మన కోడలమ్మలా అంతా సర్వమంగళమేనా?" ఇవీ ఆవిడ ప్రశ్నలు. ప్రతి నిమిషం ఆవిడకీ, మనవలకీ రామ రావణ యుద్ధం. ఈ "మడిబట్ట ముట్టుకున్నావనో, కాళ్ళు పూర్తిగా కడుక్కోకుండా ఇంట్లోకి వచ్చావనో" ఏదో ఓ సాధింపు. పిల్లలిద్దరూ ఆవిడ పోలికే. ఒక్క క్షణం నోరు మూత పడదు. సావిత్రీ, కన్నయ్యపంతులూ మాత్రం సర్దుకుపోయేరకం. సుబ్బాయమ్మ

మాత్రం కన్నకూతుర్ని అయినా లక్ష్యపెట్టదు. "ఏమే, ఈనెల నువ్వు వేరే కూచున్నట్టు లేదు?" అని రెండ్రోజులకోసారైనా అడుగుతూ వుంటుంది!

వాళ్ళిల్లూ - వాళ్ళిష్టమొచ్చినట్టు ఏడవనియ్యి. నాకెందుకు మధ్య అనుకున్నాను గాని సుబ్బాయమ్మ నాకే ఎగనామం పెడుతుందని కలలోకూడా అనుకోలేదు.

"నా అందమైన సృష్టి ద్వారా నన్ను పోల్చుకో" అన్నాడంటారు దేవుడు. అందమైన ఆడాళ్ళు ఆయన సృష్టిలో భాగమే కదా ఇంతకీ నేను చేసిన తప్పేమిటి? ఏదో కళ్ళ వేడుక.

ఆ వీధి కొళాయి దాటి పైకివెడితే రామకోవిల. అక్కడికి వెడుతూ వస్తూ మరి సుబ్బాయమ్మ ఎక్కడ పసికట్టిందో కిటికీ దగ్గిర ఉన్న నన్ను!

"మేడమీది కాలేజీ కుర్రాడు అట్టే కాలేజీకి వెడుతున్నట్టు లేదే! మన శాస్త్రితో పాటు చదువుతున్నాడు. అసలూ, ఇంతింత మీసాలూ వాడూ మరీ పెద్దవాళ్ళా కనిపిస్తున్నాడేమిటీ? ఇంత వయసొచ్చి ఇంకా ఎందుకు పెళ్ళికాలేదు చెప్మా!"

అంటూ రోజుకో రకం విసురు.

అక్కడితో ఊరుకుంటుందా ఆవిడలో ఉన్న పొగరు? అసలుకే పెట్టింది ఎసరు!

"ఎప్పుడూ ఆ కిటికీ దగ్గరే అఘోరిస్తాడేం? ఆడాళ్ళు, నీళ్ళూ పట్టుకుంటారు, ఒళ్ళూ తడుపుకుంటారు. ఆపోకిరీ చూపులూ వాడూ అక్కణ్ణించి కదలడేం?"

గుండె దడ దడ కొట్టుకుంది.

అప్రయత్నంగా కిటికీ తలుపులు మూసేశాను. బెదిరి అలా చేసినందుకు మళ్ళీ నన్ను నేనే తిట్టుకున్నాను. మరింత బార్లా తెరిచేశాను. ఇంకా బాగా దగ్గిరగా కుర్చీ లాక్కుని [illegible] న్నాను. చెప్పేనుకదా మాంచి గాత్ర సౌలభ్యం ఉన్న మనిషి సుబ్బాయమ్మ. ఆవిడ మాట [illegible] ఆ వీధి వాళ్ళంతా వినే ఉంటారు. నన్ను గుర్తించే ఉంటారు. ఇక ఆ వీధి ఆడాళ్ళు అక్కడ నీళ్ళు పట్టుకోరు కాబోలు. నాకు తోచిన పద్ధతిలో నన్ను దైవదర్శనం చేసుకోని[illegible] కాబోలు. అనుకున్నానుగాని ఆరాతీస్తే చాలా సంగతులు తెలిశాయి ఆ తర్వాత నాకు.

ఆ చుట్టుపట్ల కంతటికీ అదొక్కటే కొళాయి. అందులో నీరు కొన్ని నిర్ణీత సమయాల్లోనే వస్తుంది. ఈ మధ్య అదీ సరిగ్గా రావడంలేదు. ఎలాగో అలా ఓ బిందెడునీళ్ళు తెచ్చి ఇంట్లో పడేసుకోడమే పాపం ఆ బడుగు జనానికి గగనం. ఎవళ్లు ఎక్కణ్ణుంచి తొంగిచూస్తున్నారో గమనించే వ్యవధి వాళ్ళకిలేదు.

సుబ్బాయమ్మ హెచ్చరికలు వాళ్ళనేం మార్చినట్టులేదు. అంచేత ఆ తరుణారాధనకి ఆటంకం కలగలేదు. ఎందుకేనా మంచిదని చేత్తో ఓ పుస్తకం పట్టుకుంటున్నాను. కూచోడం మానేసి నిలబడి పచార్లు చేస్తున్నాను. పుస్తకం పైనుంచీ, కిందనుంచీ చూడ్డానికి కావలసినంత జాగా.

ఇంతకీ పొద్దుట అరగంటే ఆ కాస్త వైభవమూ. దానికీ అడ్డుపడుతుందనుకోలేదు మాయదారి సుబ్బాయమ్మ.

కింద ఇంట్లో నుయ్యి ఉంది.

దాసేది రంగి బండెడు నీళ్ళు తోడిపోస్తుంది.

ఓ బిందెడు మడినీళ్ళు మాత్రం ఆవిడ తెచ్చుకోవాలిట. కొళాయి కట్టేసిననాడు ఏం చేస్తారో

ఈ పుణ్యాజీవులు!

"తప్పుకోండి తప్పుకోండి మినిష్టరు గారు వస్తున్నారు'' అంటే జనం ఎలాదారి ఇస్తారో సుబ్బాయమ్మగారు మడినీళ్ళు తెచ్చుకోడానికి వచ్చేటప్పుడు పాపం ఆ వెర్రి జనం అలా వైదొలుగుతారు. నిలువెత్తు పచ్చటి విగ్రహం. పైగా ధగ ధగ మెరిసే నగలు. అతి ఖరీదైన పట్టుచీర. ఏ దేవతో దిగివస్తుందనుకుంటారో ఏమిటో, ఆ అమాయక స్త్రీలు! దారి ఇచ్చేస్తారు.

"ఏమే రంగీ, స్టీలు బిందె లోపల మరో మారు తోమేవుటే? నిన్న ఏదో చేతికి తగిలి అన్ని నీళ్ళూ ఒంపేసుకోవలసి వచ్చింది'' అని చెప్పిందే చెబుతుంది సుబ్బాయమ్మ.

బిందె తోమి బోర్లిస్తే, కూతురిచ్చిన వెండి గ్లాసులో నీళ్ళు జల్లి, తిరగేసి చంకని ఎత్తుకుంటుంది. ఇంతకీ ఎంత ఉంటుందని, మరచెంబు కంటె చూపు వాసి పెద్దదేమో! ఆయాసపడుతూ చంకనేసుకుంటుంది దాన్ని.

"దూరం, దూరం, పెద్దమ్మగార్ని కాస్త నీళ్ళు పట్టుకోనివ్వండి'' అని రంగి కూడా వచ్చి, ముందు జాగా శుభ్రం చేసి, మనుషుల్ని ఈగల్ని తోలినట్టు తోలుతూ ఉంటుంది. మనుషులందరూ ఒకటే అనే మాట మరచిపోయి, రూపం చూసో, కులానికి సలాంచేసో, ధనానికి భయపడో కింది వర్గంవాళ్ళు ఇంకా కింది కిందికి తగ్గినంత కాలం పైవాళ్ళు ఇలా స్వారీ చేస్తూనే ఉంటారు.

అసలే మంచినీళ్ళకి మహా కటకటగా ఉంది ఊళ్లో. ఈవిడగారి దోపిడీతో సగం కాలం గడిచిపోతుంది. ఏ ఒకరిద్దరో వాళ్ళల్లో వాళ్ళు గొణుక్కోడం తప్ప ఈవిడ అజమాయిషీని ఎదిరించినవాళ్ళేలేరు!

ఇక కొళాయి మూతిని మరో మారు కడిగి, బిందెని మరోమారు తొలిచి, నీళ్ల పట్టుకుని, సుబ్బాయమ్మ ఇంటికి తెస్తున్న దృశ్యమే చూడాలి.

నిండా నూరు గజాలుండదు ఇంటి గుమ్మానికీ కొళాయికీ. ఆ బూరగాలు ఊడ్చుకుంటూ, ఆయాసపడి మంత్రాలు చదువుతూ, లోన కులధర్మాన్ని ఇంతగా పాటిస్తున్న తనని అందరూ బాగా పరికిస్తున్నారో లేదో అని ఓ కంట కనిపెడుతూ... "జరగండి. మడితో ఉన్నాను, ముట్టుకోకండి'' అని హెచ్చరికలు పలుకుతూ.

......నిజంగా తిలకించి పులకించవలసిందే (ఇకిలించి పుక్కిలించవలసిందే) ఆ కాస్త టైమూ ఇలా వేస్టు అయితే ఇంకెలా జరిగేను నా తలుపుచాటు తన్మయత్వం!

పరితపించింది నా మనసు.

"నేనున్నాను'' అని రుజువు చేశాడు దేవుడు. ఆయన ఎక్కడ ఎలా ఆదుకుంటాడో ఎవరు చెప్పగలరు! వెనక "ఆదిలక్ష్మి'' అనే సినిమా వస్తే ఓ భక్తురాలికి టిక్కెట్టు దొరక్క ఎంతో బాధపడిందిట. ఎవరో నిండు ముత్తైదువ, అంత పసుపూ నుదురంత బొట్టూ ఆవిడా, రెట్టింపు ఖరీదుకే అనుకోండి, టిక్కట్టు అమ్మి, ఇట్టే మాయమైందిట! ఆ రోజుల్లో ఆ కథ అబద్ధమని కొట్టి పారేశాను, కేవలం మిడిమిడి జ్ఞానం చేత. "క్షమించు తండ్రీ!'' అనుకున్నాను ఈ రోజు కన్నీళ్ళతో.

ఇంతకీ ఏం జరిగిందో చెబితే మీరు నమ్మరు.

అయినా నాకు జరిగిన మంచిని నలుగురికీ తెలియబరచడం నా విధి. నాస్తికులు కాదంటే నా పూచీ లేదుసుమా! నా మొర ఏ సందున విన్నాడో ఆ దీనజనరక్షకుడు. గేదె రూపంలో ఎప్పుడు

దిగాడో మా వీధిలోకి. గేదెలకు "అంటూ", "ఎంగిలీ", "మడీ", "మయిలా", "మేనర్సూ" ఉండవుకదా! ఎప్పుడు కన్పించాడో మరి, సుబ్బాయమ్మ వచ్చేదారిలో, పేడరూపంలో అవరోధం. తిరిగి వస్తూ, తన గొప్పతనాన్ని నలుగురూ గుర్తిస్తున్నారో లేదో అని వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ, సుబ్బాయమ్మ బూరగాలు ఎందుమీదవెయ్యకూడదో సరిగ్గా అక్కడే వేసింది.

అయ్యో, దైవ సంకల్పం అలా ఉంది మరి!

ఓ కాలు జర్రున జారింది. మరో కాలు మడత పడింది. చేతులు పట్లు తప్పేయి. నడుం జారిపోయింది. భూమ్యాకాశాలు రెండే రెండు ముక్కలయేలా అరుస్తూ సుబ్బాయమ్మ చతికిలబడిపోయింది.

దేవుడు లేడా? సత్యం జయించదా!

నా మటుకు నేను కిటికీ చాటున కూచుండి ఫెమినైన్ ఎనాటమీ రీసెర్చి చేసుకుంటూంటే అన్ని విధాలా అడ్డుపెట్టిన వాళ్ళు ముందుకొస్తారా!

అయితే ఆ మూడోరోజు కన్నయ్యపంతులు సావిత్రితో ఆడిన మాటలు నన్ను కలవరపెట్టకపోలేదు.

'అంత బంగారం, ఇంత మేడా కాదనలేక మీ అమ్మ చేస్తున్న న్యూసెన్సు ఇన్నాళ్లూ ఎలాగో భరించాం. పిల్లలూ, వీధివాళ్లూ ఇప్పటికే గోలపెట్టేస్తున్నా అంత చాదస్తం కిక్కురుమనకుండా సహించాం. ఎక్సురే చూసిన డాక్టరు ఇవాళ చెప్పేడు. ఫ్రాక్చరు అయిందిట. నెలరోజులు వెల్లకిలా ప్లాస్టరు వేసి పడుకోబెట్టాలిట. అయినా ఈ వయసులో అతుక్కునే ఛాన్సెస్ తక్కువట. ఎవడు చెయ్యగలడు బాబూ? టెలిగ్రాము ఇచ్చాను. మీ అన్నయ్యా, వదినా ఇంకో గంటలో దిగుతున్నారు.' వాళ్ళెందుకు అంత తొందరగా దిగుతున్నారో, వీళ్ళంతా ఎంత తొందరగా ఎందులో దిగుతారో నాకు అనవసరం. నా కళ్ళెదురుగుండా దుష్టశిక్షణ జరిగింది. నాకు కనువిప్పు కలిగింది. అంతే, మహాఅయితే ఆ నాగరత్నం వచ్చినన్నే మేడగది ఖాళీ చెయ్యమని చెప్పొచ్చు. గుండెలో శృంగార కవాటాలు తెరుచుకోవాలే గాని లోకంలో కిటికీలకే కరువా! ఇంతకీ నారు పోసినవాడు నీరు పొయ్యడా! బారు తీసినవాడు బీరు పొయ్యడా!

*(జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక)*

# తమ మగసిరి తగలేసిరి !

## 41



**పాసెంజరు** ఏ ముప్పైలో నడుస్తూందో నాకు తెలీదు గాని నాకు మాత్రం అరవై నాలుగు నడుస్తోంది.. ఆరోగ్యం గల మగాడికి అదో వయసా! ఆ మాత్రం జ్ఞానముంటే ఆడది గాడిదెందుకవుతుందీ, మా ఆవిడ అటువైపు తిరిగి పడుకోడం మొదలెట్టి పదేళ్లుదాటింది మరి!

నా ఎదుటి బెర్త్ మీద పడుకున్న పడుచు పైట చెంగు ఫానుగాలికి పక్కకి తొలిగింది. రెండో కన్నుకూడా వెంటనే కాటరాక్ట్ ఆపరేషన్ చేయించుకోవాలనిపించింది. ఆ కనపడిన దానికే గుండె వేగం ఎక్కువైంది. ఆడదాని ఒంపుసొంపులే మగశవంకయినా ఊపిరితిత్తులు! పోతన అంతటి భాగవతోత్తముడికే తప్పలేదు. ఎంతగా ఏం కంటబడి మనసుకి నాటుకుపోయిందో! లేకపోతే రాస్తాడా, 'చక్షురుత్సవదాయి చన్నుదోయి' అని!

"యోగా అండ్ సాధనా" అనే బొండు బుక్కు చేతుల్లోకి తీసుకున్నాను. ఎప్పుడు దేని ఉపయోగం తెలుసుకొస్తుందో! దాని చాటుగా ఆ సుందర దృశ్యం పరికిస్తే మరి నన్ను అడిగే వాడుండడు కదా! ఆ హడావిడిలో పుస్తకం పక్కకి పడి చిన్నచప్పుడైంది. ఆ నిద్రలోనే ఒత్తిగిల్లి,

బట్ట సరిచేసుకుని అటు తిరిగిపోయింది ఆ వయారి. దిక్కుమాలిన పుస్తకం ఎంతటి అవకాశం చేజార్చింది, అని తిట్టుకున్నాను.

స్టేషనుకి దిగబెట్టడానికి వచ్చిన మా బావమరిది కొనిచ్చిన నిర్వాకం అది. బాగుండదని లోపల పెట్టేను. ఓసారి అటూ ఇటూ తిప్పకపోలేదు కూడా. అసలా ఇంట్రడక్షనే మహా గొడవ గొడవగా ఉంది.

యోగా అంటే కంట్రోలు అని అర్జంట. పుస్తకాలు పెట్టే పుర్రాకులు కాకపోతే ఈ లోకంలో ఎవరికైనా ఎప్పుడైనా ఎందులోనైనా కంట్రోలు ఉండి ఏడిసిందా అని. పరమ నాస్తికులైనా సూర్య చంద్రుల్ని ప్రత్యక్ష ప్రమాణాలుగా అంగీకరించక తప్పదే, మరి ఆ యిద్దరు పెద్ద మనుషులకైనా కేరక్టరు ఉండి చచ్చిందా అని!

దేవుడనే వాడే ఉంటే, భజన అనేదే ఆయనకి పరమావధి అయితే, మనిషి అనే వాడికి చేతులు మాత్రమే యిచ్చి చెరో తాళపు చిప్పా యిచ్చి "ఆగకుండా వాయించర్రా!" అని పురమాయిస్తే పోలే? ఇన్నిన్ని రంగులూ రుచులూ యిచ్చి, వెరైటీలూ వ్యామోహాలూ కల్పించి పంచేంద్రియాలూ మనసూ సృష్టించి "అవన్నీ ఒదులుకుని నన్ను కలుసుకోవడమే మీ జీవితాశయం" అని చెప్పడం కంటె లోకంలో మరో అల్లరి ఉందా! మానవమాత్రుడనే వాడికి ఆచరణ సాధ్యం కాని యీ యోగసూత్రాలు దేనికోసమని!

చేయూతగా కాకపోయినా మా బావమరిది బహుమతి తలదిండుగా పనికి రావడంతో నా కినుక క్రమంగా కునుకుగా మారింది. నాంపల్లి స్టేషనుకొచ్చిన మా వాడు నన్ను వెతుక్కుంటూ కంపార్టుమెంటు ఎక్కి నిద్ర లేపే దాకా నాకు తెలివి రానే లేదు!

ఓ ఫ్రెండు కొడుక్కి కావలసిన ఊరికి బదిలీ చేయించే ప్రయత్నంలో హైదరాబాదు రావలసి వచ్చింది. ఎలాగా మా మూడో అబ్బాయి మురళీధరానికి పోలీసు డిపార్టుమెంటులో అక్కడే ఉద్యోగం గనక, వాడి దగ్గర నాలుగు రోజులు ఉన్నట్టూ ఉంటుంది. వాడికి తెలిసిన పై ఆఫీసర్ల ద్వారా నేనొచ్చిన పని అయినట్టూ ఉంటుందని బయల్దేరాను. ఇంతకీ మా కోడలు రాజేశ్వరి పైదేం కాదు, మా రెండో చెల్లెలు సుబ్బులు కూతురే అది. మా బావపోయాక సుబ్బులు వాళ్ళ దగ్గిరే ఉంటోంది. మా వాడికి ముగ్గురు పిల్లలు. ఇంతమంది ఆప్తులతో గడపడానికి ఇంతకన్న మంచి అవకాశం ఎక్కడుంది! సర్వీసులో ఉన్నంత కాలం వీలైనంత వరకూ ఆఫీసులో నిద్రపోతూనే గడుస్తుందేమో కాలం, రిటైరు అయాకనే కదా ఎవరికైనా మెలుకువ వచ్చి, సరదాగా నాలుగు ఊళ్లూ చక్కర కొట్టుకు రావాలని ఉండేది!

అదృష్టవశాత్తూ నేనక్కడికి వచ్చిన పని దివ్యంగా జయప్రదం అయింది. అయిదేళ్ళ తర్వాత మా మురళీధరం కుటుంబాన్ని మరోసారి నిశితంగా పరిశీలించే అవకాశం కూడా కలిగింది. మా పెద్ద మనుమడు న్యూ కాలేజీలో బి.కాం. వెలిగిస్తున్నాడు. రెండోవాడు ఇంటరు ఫేలై సప్లిమెంటరీకి కట్టాడు. మధ్యది ఆడపిల్ల. దానికి లోకజ్ఞానం మీద ఉన్న చొరవ చదువుమీద ఉన్నట్టు కనపడదు. మా కోడలు రాజేశ్వరి పెళ్ళికి ముందే బియ్యే బియ్యీడీ అనిపించుకుంది. టీచరుగా పనిచేస్తూ ఎమ్మేకి కడుతోంది.

ఇంట్లో పని మనుషుల సంఖ్య ఇంటివాళ్ళ సంఖ్య కంటె ఎక్కువ! నీళ్ళు తెచ్చి పోసేది ఒకడు.





అంట్లు తోమేది ఒకర్తి. బట్టలు ఉతికి ఆరేసే జంటవేరు. బజారు పని చూసేది ఇంకొకరు. మా వాళ్లెవరూ ఇటు పుల్ల అటు తీసి పెట్టే అలవాటు ఉన్నవాళ్ళు కారు. వీళ్ళ కోసం వచ్చే ఫ్రెండ్స్ సంఖ్య కూడా తక్కువేం కాదు. ఎప్పుడూ రేడియో అలా వాగుతూనే వుంటుంది. కృష్ణమాచారి ఎప్పుడూ అరుస్తూనే ఉంటుంది. (నల్లగా వుంటుందని వాళ్ళ పెంపుడు కుక్కకి ఆ పేరు పెట్టుకున్నారట) కాలింగ్ బెల్లు ఎప్పుడూ అలా మోగుతూనే ఉంటుంది. ఇంతెందుకు అది ఇల్లు కాదు, కోళ్ళఫారం!

రెండు మూడేసి ఏళ్ళ తేడా వయసున్న పిల్లలు గనక ముగ్గురూ ఎప్పుడూ దెబ్బలాడుకుంటూ వుండడంలో నాకేం వింత కనపడలేదు. కాని వాళ్ళలో ఏ ఒక్కరిలోనూ ఏ ఒక్క విషయం లోనూ మా సుబ్బులుకే సరిపడదు! ఇక ఎదుట మావాడి ఆఫీసరు ఉన్నా సరే, మొగుడు మాటాడే ప్రతి ముక్కనీ ముక్క ముక్కలు చెయ్యడమే మా కోడలి ఆదర్శం. మావాడైనా ఊరుకుంటాడా, ఈగవాలితే జోడిచ్చుకు కొట్టేరకం. పోనీ మా సుబ్బులయినా కూతుర్ని వెనకేసుకు వస్తుందంటారా అది అష్టోత్తరం మొదలెడితే ఇది సహస్రనామం అందుకుంటుంది.

ఎదుటివాళ్ళు తమ మాట ఏ మాత్రం చెవిని పెట్టరని స్పష్టంగా తెలిసినా తమ అభిప్రాయం వీలైనంత గట్టి గొంతుకతో బయటపెట్టి తీరాలని ఆ యింట్లో ప్రతి ఒక్కరూ తీర్మానించుకుని ఉండాలి. అంతే కాదు. తెలిసిన విషయంలోనే తల దూర్చాలనే నిబంధన గాని, చిన్నా పెద్దా తారతమ్యం గమనించాలనే నియమం గాని, వాళ్లెవరూ పాటిస్తున్నట్టు లేదు.

చెప్పకేం, నేను కని, పెంచి, చదువు చెప్పించిన మురళీధరం కుటుంబమేనా ఇదని, కాస్త బాధ కలిగింది నాకు. కుర్రాళ్ళకి కాపోతే పెద్దాళ్ళకైనా ఉండొద్దూ? మొగాళ్ళకి కాకపోతే ఆడాళ్ళకైనా తెలియొద్దూ? ఇందర్ని పెంచి ఇంతింత వాళ్ళని చేశాం, ఇలాగే తగలెట్టుకున్నామా మా సంసారాలు! ఇదేం ఇల్లా, పిండిమిల్లా? ఇద్దరూ రెండు చేతులా ఎంచక్కా ఆర్జించుకుంటున్నారు. తన కోడలితో పడక మాటామాటా వచ్చి ఇక్కడ స్థిరపడిందిగాని మా సుబ్బులికి దాని అత్తారిచ్చిన చచ్చినంత ఆస్తి ఉండనే ఉంది. ఇళ్ళద్దెలే వస్తాయి. నెలకి వెయ్యికి పైగా. ఎందరు తెచ్చింది కలుపుకుంటే నిలుస్తుంది. ఈ సత్రపు కొంప! అయినా మరీ ఇంత ఖర్చా? నిన్న మొన్నటి గుంటముండ ఆ మనవరాలు సువర్ణకి రెండు బీరువాల బట్టలా! ఇంటరు ఫేలైన ఆ తుంటరి వెధవకి రెండొందల టెన్నిస్ రాకెట్టా! ఇలా ఏది గమనించినా, ఏ మాత్రం తలపోసినా నా బుర్ర వేడెక్కిపోయేది. వేడెక్కిన బుర్ర ఊరుకోదు కదా, ఏదో వాక్రూపాన అది నోటి ద్వారా ఇవతల పడితే గాని నిలబడలేదు కదా!

ఆ మాటంటే వాళ్ళకి కోపమొస్తే నే చెప్పలేను గాని సాధారణంగా ఈ ఆడాళ్ళకి బుర్ర తక్కువని నా ఉద్దేశం. ఆలోచనతో సంబంధం లేని, రుజువూ సాక్ష్యాలతో ప్రమేయం లేని, ప్రయోజనంతో పరిమితం కాని విషయాలే వాళ్ళని ఆకర్షిస్తాయి. అందుకే వాళ్లే ఎక్కువగా మంచిరోజులూ, మొక్కులూ, బొట్టు తాంబూలాలూ అంటే పడి చస్తారు. ఏడాదికి ఏ రెండు మూడు సార్లో కట్టుకునే పట్టు చీరకోసం ఏడాదిపొడుగునా మొగుడ్ని వేధించేది వాళ్లే. చదువుకున్న కొద్దీ ఈ మూర్ఖత్వం మరింత పెరుగుతోందేగాని తగ్గడం లేదు. అందుకే స్త్రీలకు విశేషంగా ఆకర్షిస్తున్నాయి. "అసిరమ్మ అద్భుతాలు" లాంటి తెలుగు సినిమాలు! ఈ సంగతి ఇప్పుడింతగా ఎందుకు చెప్పానంటే ఈ యింట్లో కాస్తయినా నా మాట వినే వెర్రి వాళ్ళు వాళ్ళ.యినా కాకపోతారా అని నా బోధనా ప్రయోగం అక్కణ్ణుంచే ఆరంభించాను. ఆ నాలుగు రోజులూ సువర్ణ ఆడబట్టలు వెయ్యడం నా

కళ్ళతో నేను ఒక్కసారి కూడ చూడలేదు గనక, అది మొగాడికిందే లెక్క. అయినా చెప్పకేం దాని వాగుడూ దూకుడూ చూస్తూంటే మొదట్నుంచీ నాక్కొంచెం గుండె బెదురుగానే ఉంది.

ఏదైనా నోరు విప్పడానికి అవకాశం అంటూ దొరికి చావాలి గద! ఆ ఆదివారం మావాడి కుటుంబమంతా మార్నింగ్ షోకి తరలి వెళ్ళారుట నేనింటికి వచ్చాక నాకు వడ్డిస్తూ మా సుబ్బులు చెప్పింది. ఒక కడుపున పుట్టి, కూడా పెరిగింది. ఈ సంసారం కాస్త బాగుచేసే పద్ధతి దీన్తో సూచిస్తే తప్పేం, అంటూ మొదలుపెట్టబోయాను. ఇంకా నోరు విప్పందే అదే మొదలెట్టింది!

'ఏదో పెద్ద పని ఉన్నట్టు ఊరంతా తెగ తిరిగి వస్తావు. ఏ పనికోసం వచ్చానో అది మొన్ననే అయిపోయిందని చెప్పావు. నీ కోసం కనిపెట్టుకు ఉండడంచేత నిష్కారణంగా ఇవాళ నాకు సినిమా ఛాన్సు పోయింది. ఆ వచ్చేదేదో ఓ గంట ముందొచ్చి అఘోరించకూడదట్రా అన్నయ్యా!'

నోట్లో మాట నోట్లోనే ఉండిపోడం కాక నాలిక తడారిపోయింది నాకు! "సొంత కూతురితో ఎందుకే పచ్చగడ్డేస్తే భగ్గుమన్నట్లు ప్రతీ దానికీ అలా ఘర్షణపడతావ్? ఎంత ఎదిగిన వాళ్ళయినా వాళ్ళు వయసులో చిన్న పిల్లలు, పేచీ పెట్టినా అర్థముంది. ఇంటికి పెద్దదానివీ సొంత యింట్లో సుష్టు లేక పరాయి యింట్లో బైఠాయించినదానివీ, నువ్వే చీటికి మాటికీ అలా ఒంటికాలి మీదలేస్తే ఎలా?" అని చెప్పాలనే నా ఉద్దేశం, అక్కడే ఆగిపోయింది బిక్కమొహం వేసి.

పైగా ఈ వయసులో దీనికి, కృష్ణా రామా అంటూ ఓ మూల చెంగు పరచుకుని దినాలు వెళ్ళబుచ్చక సినిమాకి సిద్ధమవడం ఒకటా! అందులో ఇంగ్లీషు మాటనీకి! ఇంకా చెప్పాలంటే "కిస్ కిస్ కిస్", అనే పేరు గలదానికి!!

"గుబుకూ గుబుకూ నాలుగు ముద్దలు గుటుక్కుమని దిగమింగక ఎందుకురా అలా గుడ్లగూబలా చూస్తావ్? ఈ వంటముండ ఉండుండి మానెయ్యడం కాదు గాని నా నడుం పటుక్కుమని విరిగిపోయేలా ఉంది రా అన్నయ్యా!"

అంటూ తొందరచేసే తోడబుట్టిన దాన్తో, నామొహం, నేనేం చెప్పిచచ్చేది? ఇంకా ఆకాడికి మా రాజేశ్వరే నయం వాళ్ళల్లో వాళ్ళు ఏం కుమ్ములాడుకున్నా నా పెద్దరికాన్ని ఎంతో గౌరవించి ఎంతో శాంతగా ఉంటుంది నా దగ్గర. "ఆ గొడ్డు మంచిదైతే అక్కడే అమ్ముడుపోను" అనే రకం నా చెల్లెలు. ఆ అరకతరకల మనిషి ముందు నా నోరు విప్పి బయటపెట్టుకున్నాను కాను! మా చెల్లి ముండ అక్కడితో సరిపెట్టింది, నయమే, కృష్ణమాచారిని 'ఉస్కో' పెట్టింది కాదు! అయినా దీన్తో చెప్పి లాభమేముంది! ఇంటికి మూలవిరాట్టు కోడలు, దాన్తో ఏం చెప్పినా అందం చందమున్ను!

నేను వెళ్ళిపోయే ముందు అనుకోకుండా ఆ అవకాశం చేజిక్కింది. మా మురళీధరం ఆఫీసు నుంచి అలా రైల్వే స్టేషనుకి వస్తానన్నాడు, నన్నిలా ఆటో మీద బయల్దేరమని. ఎందుకో ఆవాళ మా కోడలికి మధ్యాహ్నం స్కూలు లేదుట. ఇంట్లోనే ఉంది ఎదురింటి పెత్తనానికి వెళ్ళిన మా చెల్లెలు యింకా యిల్లు చేరకపోడం నా అదృష్టం. వీళ్ళు ఎదురింట్లో ఉంటేనే ఇంటికి క్షేమం.

నేనలా మంచం మీద కూచుంటే రాజేశ్వరి ఎదురుగా కుర్చీ లాక్కుని కూచుంటూ అంది!

"అన్నీ సర్దేసుకున్నారుగా? ఏం అలా చూస్తున్నారు, ఆ రైల్వేస్టేషన్ గొడవలో ఏం చెబుతాననా, మీ అబ్బాయికి ఏమైనా చెప్పమన్నారా?"

ఇంకేం, మొదలెట్టేను!

**తమ మగసిరి తగలేసిరి !**



"ఈ ఇంట్లో మీ అత్తగారి మొదలు ఆ కృష్ణమాచారి వరకూ 'ఒకళ్ళు చెప్పడం, మేం వినడమూనా!'' అన్నంతటి సర్వజ్ఞులు. ఇలాంటి యింట్లో నీలాంటి వినయం సహనం ఉన్న మనిషి కీలక స్థానంలో ఉండబట్టి యింకా యీ 'దరేఖానా' కుక్కలు చింపిన విస్తరికాకుండా నడుస్తోంది.' '"మీరేం చెబుతున్నారో నాకొక్క ముక్క అర్థం కావడం లేదు మామయ్యా! అది సరేగాని మీ హేండ్ బాగూ సూటు కేసూ సర్దుకోడం పూర్తయింది కద?''

'దిక్కుమాలిన సూట్‌కేసు, అదెంతలో సర్దుకోవాలి, సాయిలా పాయిలాగా, చడీచప్పుడూ లేకుండా ఓ యిల్లు సర్దుకు రావడంలోనే ఉంది ఎక్కడలేని నేర్పరితనమూ! ఎందుకలా చూస్తావ్, కుటుంబ క్షేమం కోరి, పెద్దవాణ్ని, నాలుగు ముక్కలు నీ చెవిని వేసి పోదామని నా తాపత్రయం. ఒక్క ముక్క ఆలోచించు. నాలుగు చోట్ల తిరిగి వేడెక్కి యింటికొస్తాడు మగాడు. అన్నీ తెలిసి ఇంత చదువుకుని పది మంది పిల్లలకి పాఠాలు చెప్పే నువ్వు కూడా మా వాడితో సరిగ్గా ఒకటంటే పది చదివితే ఎలా? ఇవి ప్రతి రోజూ వింటూ గమనిస్తూ పెరుగుతున్న పిల్లలు ఎలా తయారవాలి! మీరిద్దరూ ఏక మాట అనుకుంటే ఈ సంసారం ఏకతాటిని నడిచి మీది చల్లని యిల్లనిపించుకుంటుంది. పిల్లలు చెయ్యిదాటిపోయారని విచారించకు. ఇప్పటికైనా వ్యాధి ముదిరిపోలేదు. వాడొక వేళ అహంకారంతో ఏదైనా అన్నా ఆడదానివి నువ్వు తగ్గాలి ఒక్క విషయం ఆలోచించు. గింజుకుని నోరు నొప్పెట్టడమేగాని వాడు తోచింది వాడు చెయ్యడం ఏ కొంచెమైనా మానుకున్నాడా? మీ పడకగది పక్కనున్న నడవలో నాకు మంచం వేశారు. మీ కీచులాటలు విని విని ఏ రాత్రి కారాత్రి నా గుండెలు పీచుపీచుమనేవి. అక్కడికే కాదు, నాలుగు కోసులు వినపడతాయి మీ నాజూకు ఊసులు. ఏదో దేవుడింత యిచ్చాడు. నాలుగు చేతులా యింత సంపాదించుకుంటున్నారు. సంసారం అనేది గుట్టుగా నడుపుకు రావడంలోనే ఉంది సుమా స్వారస్యం అంతా! ఏమంటావ్?''

అనుకున్నది చెప్పగలిగిన తృప్తి యిచ్చిన ఆనందంతో, తన్మయత్వంతో మూసుకున్న కళ్ళతో, యింకాస్సేపు యిలాగే హితబోధచేసి తలెత్తి చూశాను రాజేశ్వరి లేదు!

మరి ఎప్పుడెళ్ళి పట్టుకువచ్చిందో, వీధిలో ఆటో ఆగిన చప్పుడైంది. తనే రెండు చేతుల్తో సామాన్లు పట్టుకొని ఆటోలో పెట్టింది. నేను తెల్లబోతూ జోళ్ళు తొడుక్కుని యింకా వీధి మెట్లు దిగి ఆటోలో కూచున్నానో లేదో ఆటో కదలడం, వీధి తలుపు భళ్ళున మూతపడడం, ఒకేసారి జరిగేయి!

తిరుగు ప్రయాణంలో మాట. ఎంత సుఖప్రదమైన సైడ్ అప్పర్ బెర్త్ దొరికినా, నా మనసులో సుఖమూ లేదు, నా కంటికి నిద్రా రాలేదు! కోడలు కొట్టిన మెత్తని చెప్పుదెబ్బ అదరిపాటుకి ఇంకా నా మనసు ఒణుకుతూనే ఉంది!

పక్కలో ఏదో ఎత్తుగా తోచి తడిమి చూశాను.

మరచే పోయాను. "యోగా ఎండ్ సాధనా'' పుస్తకం అది. చేత్తో విరచి పట్టుకుని ఏదో ఓ పేజీ తీశాను, ఏం తోచక.

"కళ్ళూ, ముక్కు రంధ్రాలూ, చెవులూ అనేవి రెండేసి ఉంచిన దేవుడు నోరు అనేది ఒకే ఒక్కటి ఎందుకుంచాడో ఎప్పుడైనా ఆలోచించావా? పైగా వాటన్నిటికీ ఉన్న పని ఒక్కొక్కటే.

ఇటు ఏదైనా అనడానికి, తినడానికీ ఈ రెండు ముఖ్య ధర్మలూ మాత్రం నోటికి అప్పచెప్పాడు. అంటే ఏమిటి? మరింత ఒళ్ళు దగ్గర పెట్టుకొని దానిని ఉపయోగించు కోవాలని కదా!''

గాయానికి కారం రాసినట్టే పెద్ద చప్పుడుతో ఆ బౌండు పుస్తకం మూసేశాను. ఆ చప్పుడు వింటే మా కోడలు వేసిన తలుపుల చప్పుడు గుర్తొచ్చింది. స్త్రీ ఎంతటి శక్తి స్వరూపిణి! ఒక్క ముక్క నోటితో చెప్పకుండా ఎంత గొప్ప సందేశం యిచ్చింది!

"కొట్టుకు చస్తున్నామో, గోలతో కీచులాడుకుంటున్నామో ఇరవై ఏళ్లై కలిసి మెలిసే యీడుస్తున్నాం యీ సంసారం. విడాకులు ఇచ్చుకోలేదు. సరిగదా ఏ ఒక్క రాత్రీ కూడా వేరే గదుల్లో పడుకోలేదు. శబ్దమంతా సంగ్రామమూ, నిశ్శబ్దమంతా నిండుదనమూ అని దేన్ని బట్టి పోల్చారు మామయ్యా మీరు? గింజుకుని నోరు నొప్పెట్టడమే గాని, ఒకరి మాట ఇంకొకరు వినరని పోల్చుకున్న మీరు, అదే మా ట మీ విషయంలో అన్వయించు కోరేం?''

అనేది, ఇంతకంటే స్పష్టంగా చెప్పే పద్ధతి ఉందా!

కింది బెర్త్ మీద పడుకున్న ఓ అమ్మాయి పైబట్ట గాలికి తొలగడం ఈసారీ తొంగి చూశాను. నా కళ్లు చూసేవి అలాటివే కదా! అయితే ఈ తిరుగు ప్రయాణంలో తిరిగి తిరిగి అటే చూడాలనిపించలేదు. సిగ్గుపడి ఇటువైపు తిరిగిపోయాను. బోధపడినా మానినా నాకా బుక్కే దిక్కు. బౌండు పుస్తకాన్ని కడుపు మీద చేర్చి మనమడిలా దగ్గరికి తీసుకున్నాను!

*(జ్యోతి మాసపత్రిక మార్చి, 85)*

**తమ మగసిరి తగలేసిరి!**

# ఈ ఆడాళ్ళతో ఇదే చిక్కు!




**తను** చెప్పేది శ్రద్ధగా వినే సహృదయుడైన భర్త కంటే అడదికోరే వరమంటూ ఏం ఉంటుంది. అందుకనే ఏ రాత్రికి ఆ రాత్రి -- ఆ నాటి నారీ విమోచన సంఘం వివరాలు వేణుకి అందిస్తుంది, ఎడ్వకేటు ఇందిర. భార్య నుంచి ఏ రాత్రికి ఆ రాత్రి అందుకుందామని పగలంతా భర్త ఎదురు చూసే విశేషాలు యివేనా అనిపిస్తుంది వేణుకి.

అయినా అతను కార్యవాది. ఓపికపట్టి కొంతసేపు సహృదయుడిగా ఉండగలిగిన భర్త తర్వాత చాలాసేపు రసహృదయుడిగా రాణించవచ్చు అని అతనికి తెలుసు. అతని మరో ఆలోచన కూడా ఓ మొట్టికాయ వేసి మనసుని వెనక్కి లాగుతుంది. ఆ స్పర్శసుఖం స్వర్గమయమే. కాని సాటి మనిషి మంచికోసం కొట్టుకుపోయే ఆ అత్యున్నత వ్యక్తిత్వంతో తన సాహచర్యం మాత్రం తక్కువ అదృష్టమా!

'నారీ విమోచన సంఘం' అనేది స్త్రీల హక్కుల కోసం అహర్నిశలూ పోరాడే ఓ ప్రగతి శీలక సంస్థ' అడ్వకేటు ఇందిరకాక డాక్టరు మీనాక్షీ, సైకాలజీ ప్రొఫెసరు కనకలతా ..... ఇలా వివిధ

భాగాల నిష్ణాతులు తలొకరూ ఉన్నారు. సంఘ శ్రేయస్సు కోసం నిస్వార్థంగా పనిచేసే ఆ సమిష్టికృషికి ఇందిర ఒక వెన్నెముక. తక్కిన సభ్యురాళ్ళలా ఆమెకి ఇంటి బాధ్యతలు అనేవి ఇంచుమించు లేవనే చెప్పాలి. నెత్తిమీద పెట్టుకునే భర్తేకాక కన్నకూతురి కంటె ఎక్కువగా చూసుకునే అత్తగారు మాటవరసకయినా తన స్వేచ్ఛకి అడ్డురాకపోవడం ఆ ఉద్యమానికి మరింత ఊపిరి.

అత్తగారు వరలక్ష్మికి ఆ ఇంట్లో ఇటుపుల్ల అటుతీసి పెట్టవలసిన అవసరంలేదు. అయినా అందరు నౌకర్లని అజమాయిషీ చెయ్యడం అదేం తక్కువ బాధ్యతకాదు. అత్తగారు శాంత స్వభావం తలుచుకుంటే ఎంతో ఆశ్చర్యంగా ఉంటుంది తనకి. ఎలాగైనా అత్తగారికి కోపం తెప్పిద్దామని ఇందిర దుందుడుకు స్వభావం చేసిన ప్రయత్నాలన్నీ దిగదుడుపు అయాయి! వేణుకి అయిదోపదో నడుస్తున్నప్పుడు కాబోలు, బ్యాంకులో కాషియరుగా పని చేస్తున్న వాళ్ళ నాన్నగారు ఏదో పెద్దమొత్తమే చేజిక్కించుకుని పరారీ అయారుట అంతే, మరి ఆయన భోగట్టా లేదు, అప్పట్నుంచీ కొడుకు బాధ్యత నెత్తినవేసుకుని ఇంతటి ప్రయోజకుణ్ణి చేసిందిగాని వరలక్ష్మి భర్తని పల్లెత్తుమాట అనదే! పైగా 'ఎక్కడో అక్కడ వారు కులాసాగా ఉంటే అంతే చాలు' అనే అత్తగార్ని పరికిస్తే మరింత మతిపోతుంది ఇందిరకి.

ఈ క్షమాగుణం చూసి గౌరవించాలా, ఈ చచ్చుతనం చూసి నిలదియ్యాలా? ఏదైనా వాదనకి దిగితేకదా ఇదేమని అడగడానికి! తెల్లారి, తలారా స్నానం చేసి, దేవుడికి దీపం పెట్టుకుంటే గాని వచ్చి మంచినీళ్లు ముట్టుకోని అత్తగారే స్వహస్తాలతో తమిద్దరికీ బెడ్‌కాఫీన ఇస్తూంటే, ఏం చూసి తప్పుపట్టడం? 'ఏమిటీ, అమ్మని చూస్తూ అలా ఉండి పోయావ్, దేన్ని గురించి నీ ఆలోచన?' అనే భర్త ప్రశ్నకి తుళ్ళిపడి ఇటు తిరిగి మామూలు ధోరణిలోకి వచ్చేసింది ఇందిర.

ఓ వారం రోజుల క్రిందటదాకా 'నారీ విమోచన సంఘం' కట్నాల కాల్పుల కథలలోనే నిమగ్నమయి పోయి ఉంది. పురుషాహంకారానికి బలి అయిన కలకంఠి కన్నీటిగాథలు ఒకటా రెండా? పదహారేళ్ళ వసంత ఓనాడు సంఘ కార్యాలయాన్ని వెతుక్కుంటూ వచ్చి తమ దీనగాథ చెప్పుకోవడంతో వారి కార్యక్రమాలకి కొత్త మలుపూ ఊపూ వచ్చినట్టయింది.

వసంత తల్లి పేరు వసుంధర. వసంతకి మెట్రిక్ చదువుతున్న తమ్ముడు కూడా ఉన్నాడు. ఈ పిల్లల్నిద్దర్నీ పెట్టుకుని వసుంధర అన్నగారింట్లో రాజోలులో ఉంటోందిట. వసుంధర హైస్కూల్లో లెక్కల టీచర్‌గా పనిచేస్తోందిట. తండ్రి గురించి వసంతా తమ్ముడూ ఏవేవో విన్నారుగాని మంచి క్రమశిక్షణలో పెంచిన తల్లి ముందు ఏది అడగడానికీ వాళ్ళకి భయం.

ఇలా ఉండగా వసంతకి ఏదో పెళ్ళి సంబంధం వచ్చిందిట. ఆ కుర్రాడు వసంత కళ్ళకి ఎంతో నచ్చాడుటకూడా. కాని వీళ్ళ కుటుంబ చరిత్ర భోగట్టా చేసి వాళ్ళు ఒప్పుకోలేదుట.

'ఈవిడ తిన్ననైందే అయితే మొగుడు వేరే ఇంకోదాన్ని పెట్టుకుని మరో కాపరం ఎందుకు అఘోరిస్తాడూ! ఇంత కన్న మంచి సంబంధమే దొరక్కపోయిందా!' అని కొట్టిపారేశారుట.

వసంత ఎంతగా కుమిలిపోయిందో అంతగా తిరగబడాలని నిశ్చయించుకుంది. ఆ పిల్లల దృష్టిలో తల్లి ఓ దేవత. అలాంటిది తప్పెందుకు చేసి ఉంటుంది? నాన్నదే తప్పు అయిఉండాలి అనుకుని ఎక్కడో ఈ సంఘం గురించి చదివి వీళ్ళతో వచ్చి చెప్పి వెళ్ళిందిట.

'అదేనా, మోహన్రావు కేసేనా?' అని అడిగాడు వేణు. అవునంటూ, ఆ సంస్థ వెలుగులోకి

తెచ్చిన మరిన్ని వివరాలు చెప్పింది ఇందిర.

వసుంధర భర్త మోహన్రావు మహా రాజాస్ కాలేజీలో కెమిస్ట్రీ రీడరుగా పనిచేస్తున్నాడు. ప్రైవేటు చెప్పించుకోడానికి ఇంటికి వచ్చే కళ్యాణి అనే తనకంటే పన్నెండేళ్ళ చిన్న అమ్మాయితో పబ్లిగ్గా కాపరం వెలిగిస్తున్నాడుట. వాళ్ళకి ముగ్గురో నలుగురో పిల్లలు కూడానుట.

'ఇందులో వింతేమిటంటే మోహన్రావు కళ్యాణికి కేవలం చేరదీయడం కాదట. మా సంస్థ ఇన్వెస్టిగేషన్లో ఏమని తేలిందో తెలుసా, వాళ్ళకి రిజిష్టరాఫీసులో పెళ్ళైందిట!'

'ఏం దారుణం! మొదటి భార్య బతికుండగా భర్త రెండో పెళ్ళి చేసుకోడం చట్టరీత్యా నేరం అనుకుంటాను! అలా చేసుకున్న వాళ్ళకి 'కోర్టు చేసే పెళ్ళి' వేరే ఉందంటారు?'

భర్త అడిగిన పద్ధతికి నవ్వుతూ ఇందిర చెప్పిందిదీ.

"అవును. 494 భారత శిక్షాస్మృతి కింద ఇలాంటి నేరస్థులకి ఏడేళ్ళ శ్రీకృష్ణ జన్మస్థానం విధించవచ్చు. లేదా దానితో పాటు అపరాధరుసుము కూడా చెల్లించవలసిరావచ్చు."

"మరి అన్నీ తెలిసి ఎందుకు ఊరుకున్నావు? వీడిక్కడ పూలరండిలాకులకడమేమిటి, అక్కడ ఏ పాపం ఎరుగని వీడికూతురు వసంతకి వచ్చిన సంబంధం తప్పిపోవడమేమిటి? ఇలాంటివి చక్కదిద్దకపోతే మీ వారీ విమోచన సంఘాలు దేనికి?"

"మోహన్రావుకి బుద్ధి చెప్పడం ఎలా అని మీ ఉద్దేశ్యం?"

"మీ వాళ్ళు పరిశోధించి అతనికి రెండో పెళ్ళైందని సాక్ష్యం సంపాదించారు కదా ఇంకా ఆలస్యం దేనికి? అతని మీద వెంటనే కేసెందుకు పడేశావు కాదు?"

'అది నేరమని తెలిసినా ప్రతివ్యక్తికీ ఆ నేరస్థుడిమీద చర్యతీసుకునే అవకాశం న్యాయశాస్త్రం కల్పించలేదు గనక"

"అంటే?"

"ఈ ప్రత్యేకమైన పరిస్థితుల్లో ఇటు బాధ్యతగల పౌరులుగాని, అటు సంఘ భద్రతని పరిరక్షించే రక్షకభటులుగాని కేసు పెట్టే వీలు కల్పింపబడలేదు. కోర్టు గుర్తించడానికి వెసులుబాటులేదు. బాధితురాలు తప్ప మరెవరు కేసుపెట్టినా కోర్టు కాగ్నిజన్సు తీసుకోదు"

"సాధారణంగా ఇలాంటి పరిస్థితుల్లో మోసగించబడేది అమాయకురాలైన ఆడదే అయివుంటుంది. ఇలా కేసు పెట్టవచ్చునని ఆమెకీ తెలియకపోయి ఉండొచ్చు. మరి ఇలాంటి న్యాయసూత్రాల వల్ల ఎవరికేం లాభం?"

'న్యాయసూత్రాల నిర్దేశం మీరనుకున్నంత తేలికగా జరగదు. ప్రతీవాడికీ ప్రతీదానికీ కోర్టు ఎక్కే హక్కు కల్పించబడితే అది దుర్వినియోగం అవడానికే ఎక్కువ అవకాశం ఉంది. వీడు చేసుకున్న ఈ రెండోపెళ్ళి రహస్యంగా జరిగింది అనుకుందాం. ఈ వెధవచేసిన ఘనకార్యం గుర్తించి అంతకుమించిన మరో దొంగవెధవ ఇది బయటపెడతానని బెదిరించి బ్లాక్‌మెయిల్ చేస్తే?'

'అదంతా నాకు తెలీదు గాని ఈ సూత్రాలలో ఇలాంటి లొసుగులున్నాయి కాబట్టే ప్రతీవాడూ దర్జాగా రెండో పెళ్ళికి సిద్ధమైపోతున్నాడు. ఆ మొదటిపెళ్ళాం ఎవరి పంచన హీనంగా పడిఉందో తలుచుకుంటే ఎంతకష్టంగా ఉంటుందంటావు!"

"అది తలచుకుని మనసు గిలగిల కొట్టుకుంది కాబట్టే ఇవాళ మీనాక్షికారులో మేమిద్దరం

రాజోలు వెళ్ళొచ్చాం .... ఈ కేసులో భార్యమాత్రమే భర్తమీద దావా వెయ్యడానికి అర్హత కలది కదా, ఆ సంగతి చెప్పిరాడానికి."

ఇలాంటి ఇన్‌స్టెంట్ యాక్షనంటే వేణుకి ఎంతో ఇష్టం. ఎంతో ప్రశంసతో ఆమెవైపు చూశాడు. ఇందిర మొహంలో రోజూకనబడే కళ కనపడక అతను గతుక్కుమన్నాడు.

'మేమిద్దరం ఎంత నచ్చచెప్పినా వసుంధర భర్తమీద న్యాయరీత్యా చర్య తీసుకోడానికి అంగీకరించలేదు' ఆమె దగ్గిర బంధువులూ, అందర్నీమించి ఆమె కింత నీడకల్పించిన అన్నావదినా ఎన్నాళ్ళనుంచో ఎంతగానో చెబుతున్నారట, కీలకమైన ఈ పాయింటు ఆమెకు ఎప్పట్నుంచో తెలుసునట. అయినా వసుంధర ఏ విధంగా చెప్పినా ఒప్పుకోలేదు."

"తామేదో త్యాగమూర్తులని ఈ పతివ్రతలు భ్రమపడుతున్నారేమో, చేజేతులా మొగాళ్ళని మోసగాళ్ళుగా తీర్చిదిద్దుతున్నారు! న్యాయం తమకి కల్పించిన హక్కుల్ని వదులుకుంటే ఈ సంగతి మీరెందుకు ఆవిడలో నాటలేకపోయారు?"

వేణు ఆవేశం చూసి ఇందిర ముచ్చట పడుతూ వసుంధర ఆఖరిమాటగా ఇలా అందని చెప్పింది.

"నా కేదో మేలుచేద్దామని ఇంత దూరం వచ్చారు. కృతజ్ఞురాల్ని. కాని ఈ రోజు నేను వారిమీద కేసువేసి సాధించేది ఏమిటంటారు! ఆయనకి శిక్ష పడుతుంది ఉద్యోగం ఊడుతుంది. రెండోపెళ్ళి చెల్లదు గనక కళ్యాణికి పిల్లలకీ గుర్తింపు ఉండదు. ఆయనా, వారిని నమ్మిన కుటుంబమూ వీధినపడితే నాకేం ఒరుగుతుంది? ఆఖరిమాటగా ఇందిర ఇలా అంది.

'మొగుడి పాపం మొదటిభార్యతో పూర్తికాలేదు వాళ్ళ పిల్లల్ని చుట్టుకుంది వాళ్లేంపాపం చేశారని చెప్పచూసినా ఆ మొండిమనిషి దగ్గిర జవాబు సిద్ధంగానే ఉంది.

"అనాలని నిర్ణయించుకున్న పాడు లోకం ఎప్పుడూ ఏదో అంటూనే ఉంటుంది మీరు చెప్పినట్టు చేస్తే మాత్రం మొగుడిమీద కేసు నడిపిన ఆడదాని పిల్లలుగా ఆడిపోసుకోరంటారా!'

నీరసంగా పెదవి విరుస్తూ ఇందిర వచ్చేసింది ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది, వాళ్ళ బాగుకోసం మేంశ్రమించినా అర్థంచేసుకుని సహకరించని వాళ్ళని మేం ఏం చెయ్యగలమని! ఈ ఆడాళ్ళతో ఇదే చిక్కు." అని పూర్తి చేసింది, తనో ఆడదాన్నని ఆ క్షణం మరిచిపోతూ! అది గుర్తుచెయ్యడాని కన్నట్టు వేణు బెడ్‌రూం తలుపులు చటుక్కున బిగించాడు.

అయితే వాళ్ళిద్దరూ గుర్తించనిది ఒక్కటే. కొడుకూ కోడళ్ళ ఏకాంతానికి కలలో అయినా భంగం కలిగించి ఎరగని వరలక్ష్మి అప్రయత్నంగా ఆ మాటలన్నీ ఆ పక్కగది సోఫాలో పడుకుని వింది! వాళ్ళు పూర్తిగా నిశ్శబ్దంలోకి జారుకున్నాక ఆమె మనసు మేలుకుంది.

ఆ వసుంధర కథలాంటిదే తనది కూడా!

పెళ్లైననాటికి తనకి తెలీదు, ప్రాణాధికంగా ప్రేమించిన మేనమామ కూతుర్ని కాదని, పెద్దల ఒత్తిడిమీద ఆయన తనని చేసుకున్నారని, గుండెదిటవుగల మగాడు కాబట్టి తన మొగుడు సరిపెట్టుకున్నాడు గాని మేనమామ కూతురు తట్టుకోలేక పోయింది. ఆ అయిదేళ్ళల్లో ఎన్ని ఆత్మహత్యా ప్రయత్నాలు చేసిందో .... వేరే పెళ్లి నిర్ణయిస్తే ఆ రాత్రే నూతిలో పడతానని ప్రతిజ్ఞ చేసిందట. మేనమామ ఏడుస్తూ రాసిన ఉత్తరం వరలక్ష్మి చేతిలో పడింది. అంతే ఆ త్యాగమూర్తి

అప్పటికప్పుడు ఓ నిర్ణయానికి వచ్చేసింది.

మొగుడు బ్యాంకు డబ్బు దొంగిలించి పారిపోవడం అనేది అతన్ని ఆ ఊరు దాటించే కట్టుకధ. తనే కొడుకుని తీసుకుని పుట్టింటికి వచ్చేయ్యడానికి అదో మిష. ఆ తర్వాత ఎన్నిరకాల పాట్లు పడిందో ..... ఇంతకీ ఉన్న ఒక్కకొడుకూ బుద్ధిమంతుడు అన్నీ స్కాలర్ షిప్పులమీద చదువుకుని ఇంతటి ఉద్యోగస్థుడయ్యాడు. ఆ మేరకైనా తను అదృష్టవంతురాలే.

వాళ్ళు ఏ రంగూనో పారిపోయి పెళ్ళి చేసుకున్నారని గాలి కబురు విన్నది. తన మొగుణ్ణే తప్ప ఆ మేనమామ కూతుర్ని వరలక్ష్మి చూడనైనా లేదు. అయితేనేం, ఆమెని అంత గాఢంగానూ తన భర్త ప్రేమించాడని తనకి తెలిశాక పగ అనేది మొదట్లో పంతంగా, సాధన మీద త్యాగంగా, మార్చుకోగలిగింది.

వరలక్ష్మి నవ్వుకుంది. " ఈ ఆడాళ్ళతో ఇదే చిక్కు" అనే కోడలి మాటవిని నిన్న మొన్నటి చిన్నపిల్ల, దీనికేం తెలుసు! స్త్రీని మాత్రమే 'క్షమయా ధరిత్రీ' అంటారు. ప్రేమించడం వీళ్ళ జన్మహక్కు. ప్రేమించడం కోసం ఎంత త్యాగానికైనా వెనుదియ్యరు. మామూలు న్యాయసూత్రాలు వీళ్ళని రక్షించలేవని తెలుసుగనక వాటిని ఆశ్రయించరు. వారివారి జీవితాలు నిర్దేశించిన ధర్మసూక్ష్మాలు వారికి వేరే ఉంటాయి. వాటికే కట్టుబడతారు, పదిమందికోసం పాటుబడే నారీ విమోచనోద్యమ సంఘాల నిజాయితీని వారూ శంకించరు గాని ఉద్రేకం తగ్గించుకుని జీవితానుభవం జోడిస్తే మరింత సంఘ సేవికలు కాగలరు.

పడకటింటి పులకరింపులు లీలగా చెవిని బడడంతో తనింక అక్కడ ఉండకూడదని వరలక్ష్మి గ్రహించి సోఫా మీంచి లేచి నెమ్మదిగా మెట్లుదిగి కిందకి తనగదికి వచ్చేసింది. ఈ సుఖ సోపానాలలో తన పాత్ర గుర్తింపు వచ్చేసరికి తెరిచిఉన్న కిటికీలోంచి వచ్చే నైట్ క్వీన్ పరిమళంలా ఆమె గుండె గుబాళింపుతో ఘుమఘుమలాడి పోయింది.

*(జ్యోతి మాసపత్రిక, ఆగష్టు '85)*




**వెలుగేది,** చీకటేది అనే ప్రశ్న ఏ గుడ్డివాళ్ళకోగాని రాదు, చూడగానే తెలిసిపోతుంది గనక. అంత సుళువుగా కొరకబడని ధర్మ సూక్ష్మాలు అనేకం ఉంటాయి మాయదారి లోకంలో. సదుపాయమేదో. తొడపాశమేదో ఓ పట్టాన తేలిచావదు. ఏదో చెందుతుందన్న ఆశతో కాక ఎప్పటికో అందకపోదన్న శ్వాసతోనే బతకవలసి వుంటుంది. గవర్నమెంటు సర్వీసులో అనుకోకుండా చొరబడ్డ శేఖరం క్రమంగా గ్రహించింది ఇదే.

ఇందు శేఖరం గవర్నమెంటు సర్వీసులో చేరడమే ఓ వింత. వయసు మళ్ళే కాలంలో పడుచుపిల్లతో పెళ్ళికుదిరినట్టు అతని నలభయ్యోయేట పనిచేస్తున్న ప్రైవేటు కంపెనీ ప్రభుత్వపరమైంది. ఈ అదృష్టానికి చంకలు గుద్దుకున్నన్నాళ్ళు పట్టలేదు, చతికిలపడక తప్పనూ లేదు. పెద్దగా దేన్నీ పట్టించుకుని అత్యాశకు పోయేరకం కాదు గనక, ఆ పాటి యీ పాటి కుదుపులకి శేఖరం చలించలేదు. అయితే ఈ పదేళ్ళ సర్వీసులోనూ అతన్ని అహోరాత్రాలు అల్లరిపెట్టిన అయిటమ్ ఒకటి లేకపోలేదు. లభించే దాన్ని లాభించేలా ఎలా లాలించుకోవాలో తెలీక

లబోదిబోమంది మొదట్లో ఆ అమాయకపు ప్రాణి.

ఆ ప్రసక్తి కూడా మొదటిసారి భార్యా ముఖంగానే ..... "అయ్యో ఏం మనిషమ్మా ఈయన' .... అంటూ తన మామూలు శ్రీకారంతో సదాలక్ష్మి మొదలెట్టింది.

.....పైవాటికి చేతులుచాచే చాకచక్యం లేకపోతే పోయె. న్యాయంగా మనకి రావలసిన వాటినే చేజేతులా వదులుకుంటారా ఎవరైనా! ఇంతకంటె గుడ్డెద్దు చేలోపడ్డం అంటే వేరే ఎక్కడైనా ఉంటుందా! అవ్వ! మీరు కూడా చీమకుట్టనట్టు ఊరుకుంటారేం అన్నయ్యా, ఆ అయోమయానికి అంటేటట్టు చెప్పక!

ఆ రోజునే ఆ విషయం ఎదురింటి కామాక్షమ్మగారి భర్తద్వారా ఇంజక్టు చెయ్యబడింది. ఇంతకీ అతనికది తెలియని విషయమేం కాదు. 'మెడికల్ రీ ఇంబర్స్‌మెంటు' అంటారు దాన్ని. "మీమీ రోగాలకి మందు ఖర్చు మీరు పెట్టుకోండి తర్వాత మేం అణాపైసలతో తీర్చేస్తాం. మీరు చెయ్యవలసిందంతా కొన్న మందు ఖర్చుల రసీదులు జోడించి అప్లై చెయ్యడమే! అన్నంత సులువుగా కనిపిస్తుంది. ప్రభుత్వం ఉద్యోగస్థులకి కలగజేసిన ఆ వైద్య సదుపాయం. ఈ వెసులుబాటు గుర్తించి ప్రభుత్వేతర ఉద్యోగస్థులు "ఆహా వీరెంత 'మందు' భాగ్యులు!" అని అసూయచెందే అవకాశం కూడా లేకపోలేదు.' అదృష్టవశాత్తూ శేఖరం, సదాలక్ష్మి వారి ముగ్గురు పిల్లలూ ఎప్పుడూ జిర్రున చీది ఎరగరు. ప్రభుత్వం వితంతు భరణం ప్రకటించింది కదా అని పుణ్య స్త్రీలంతా ముచ్చటపడి పతిహత్యలకి నడుంకట్టలేనట్టు, వైద్య సదుపాయం ఉంది కదా అని లేని రోగాలు ఎక్కడ తెచ్చుకోగలం!

ఆ మాటే శేఖరం పైకి అనడం కొంప ముంచింది. "అయ్యో ఏం మనిషమ్మా ఈయన .....' ' అంటూ సదాలక్ష్మి తాటి ప్రమాణాన ఎగిరింది.

".....రోగాలు లేని మనిషంటూ ఉంటారా అన్నయ్యా లోకంలో! పైకి దుక్కలా కనిపిస్తూ చాకిరీ చేస్తున్నంత కాలం ఆడది మొగాడికలాగే కనిపిస్తుంది! తాగేపాలు కల్తీ, పాలల్లో కలిపే నీళ్ళు కల్తీ నీరు కల్తీ, నీటిని శుద్ధిచేసే. క్లోరిన్ కల్తీ, గాలి కల్తీ, గాలిలో కొట్టే దోమలమందు కల్తీ. ఇలా చెప్పుకుపోతే అన్నిటాకల్తీ కనిపించే ఈ రోజుల్లో చెక్కు చెదరకుండా నిలబడ్డానికి మనిషనే శాల్తీ టేకుమాను అయినా అయిఉండాలి, కోట గోడయినా అయి ఉండాలి. అందునా మామూలు మధ్యతరగతి వాళ్ళకి ఆరోగ్యం ఏమిటి నాపిండాకూడు!"

ఆవిడ ఎంతసేపు అలావాగినా అవునూ కాదూ అనకుండా వూరికే ఉండిపోవడం అతనికి ఆలవాటే. అతని మౌనం చూసి మరింత పేట్రేగి పోడంకూడా సదాలక్ష్మికి పరిపాటే.

"చూశారా అన్నయ్యా, నేనెంత గొంతుక చించుకున్నా బెల్లంకొట్టిన రాయిలా నీళ్ళు నమలడం తప్ప వారి నోటంట ఒక్క మాటయినా వస్తుందేమో! ఆరు నెలలై నడుం నొప్పితో విలవిలలాడిపోతున్నాను. ఒక్క బిందెడు నీళ్ళు కొళాయిదగ్గిర పట్టి యింట్లోకి చేర్చడానికి కరేలుమని పోతోంది వెన్ను. పెద్ద మనిషయిందగ్గిర్నుంచి అమ్మాయికి నెల నెలా గండమే. పెద్దబ్బాయి సరేసరి, కర్మగాలి వాడికీ నా పోలికే వచ్చింది, పైకి తేలడు వెర్రినాగమ్మ. ఎదిగే వయసులో జబ్బుమీద జబ్బు వేసుకువస్తూ ఎలా ఉండాలంటారు, వేరుశెనక్కాయ లాగ యిలాగేనా? ఇక చంటి సంగతి చెబితే ....."

అయితే తను ఈ గవర్నమెంటు నౌకరీ చేపట్టిన ప్రతి కుటుంబ సభ్యుడూ తలోరోగమూసిద్ధం చేసుకున్నారన్నమాట. భేష్! ఆ వెగటు తలకెక్కి ఆ రాత్రి ఓ పట్టాన నిద్రపట్టలేదు, శేఖరానికి. పొద్దుట లేచేసరికి తలదిమ్ముగా బరువుగా తోచి 'ఓసారి డాక్టరు దగ్గిరకి వెళ్ళి కంప్లీట్ చెకప్ చేయించుకుంటే?' అనే ఆలోచన ఆచరణలో పెట్టేదాకా అతన్ని బతకనివ్వలేదు. తన చేతిలో పడ్డాక కేసు వదులుకుంటాడా వైద్యుడు!

నిప్పుకి చెదపట్టినట్టు ఇంటి యజమానే డాక్టరు దగ్గిరకి పరిగెత్తాడనే శుభవార్త విన్నాక ఇక సదాలక్ష్మికి పట్టపగ్గాలు లేకపోయాయి. అతను ఆఫీసునుంచి అలా ఇల్లు చేరేసరికి ఇలా ఈవిడ ఎప్పుడెలా వెళ్ళిందో నాలుగు పాకెట్లతో సహా సైకిలు రిక్షామీద వచ్చి గుమ్మంలో దిగింది. ఆ పాకెట్లు విప్పి చూసేసరికి శేఖరానికి ఉన్న మతిపోయింది. అరడజను పెద్ద హార్లిక్సు సీసాలు, రెండు ఓ వల్టిన్ టిన్నులు, నాలుగు బోర్నవిటా డబ్బాలు, పెద్దసైజు విక్సు సీసాలు రెండు, మల్టీ విటమిన్ టాబ్లెట్సు వందేసి పేకెట్సు అయిదు ..... ఇలాతేలింది ఆ సరుకు.

"ఇవి కొన్నాక జీతపురాళ్ళు అంటూ ఏం మిగిలి ఉండవు గనక, నీకీనెల వంట బాధ ఏం ఉండదులే ... అయిదుగురం వీటినే తలోకాస్తా మింగి పడుందాం" అన్నాడు ఒళ్లుమండి.

"అయ్యో, ఏం మనిషమ్మా ఈయన అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కు తినానివ్వదని అనుభవించే అవకాశం సర్కారు వారు కల్పించినా తను తేనూ లేరు. చచ్చిచెడీ నే వెళ్లి ఇంత కష్టపడి యిల్లు నింపితే గుమ్మంలో పెట్టి యిదేనా అనవలసినమాట!

'మందులషాపుకి నాలుగు చక్రాలు లేవు. లేపోతే ఓ తాడు కట్టి యీపాటికి ఏకంగా యింటికే యీడ్చుకొద్దువేమో!'

'అయ్యో రామా, వాళ్ళు తర్వాత డబ్బిస్తామన్నా మనం తెచ్చుకో కూడదట, వింటున్నారా అన్నయ్య!

'అన్నిటికీ డబ్బులిస్తే, అందులో యిలాంటి పోషక పదార్థాల ఖరీదుల్ని 'రీ ఇంబర్స్' చేస్తే గవర్నమెంటు ఎప్పుడో దివాళా తీసి ఉండును. అందులో మీ ఆడాళ్ళున్నారే వేలు చూపిస్తే మండ నాకే రకాలు. ఆపాటి ఆంక్ష పెట్టకపోతే కావలసిన సబ్బులూ సర్ఫులూ యింటికి చేరేసి ఈపాటికి వేరే సైడ్ బిజినెస్ పెట్టుకుని ఉండరూ!'

ఆ కోపంలో ఆడాళ్ళని అంతమాట అన్నందుకు శేఖరం ఆ తర్వాత్తర్వాత చాలా విచారించ వలసి వచ్చింది. ముఖ్యంగా ఈ 'మెడికల్ రీ ఎంబర్స్‌మెంట్' పేర ఎంత సైడ్ బిజినెస్ జరుగుతూందో, ఈ అవకతవక సిస్టమ్ ఎంతటి సిస్టమెటిక్ కరప్షన్‌కి దారి తీస్తోందో ఒక్కొక్కటిగా తెలుస్తున్న కొద్దీ అతన్లో ఆశ్చర్యమూ వివేకమూ పెరుగుతూ వచ్చాయి.

రోగాలన్నీ జరుగుబడి సంకటాలనీ, ఔషధసేవనం అనేది ఓ స్టేటస్ సింబల్ అనీ, డాక్టర్లందరూ ధనమదాంధులనీ ఒక్కముక్కలో కొట్టి పారెయ్యడం కంటే అన్యాయం ఉండదు. కాని ఓసారి అలవాటు పడితే పాన్, సిగరెట్, కాఫీ, టీ, కల్లూ బ్రాందీలలాగే రోజూ దేనికో దానికి రెండేసి మూడేసి రకాల మాత్రలు మింగడం మాత్రం నేటి ఆధునిక మానవుడికి మత్తు మందయి కూచుంది, అందులో వెంటనే అవనీ తర్వాత అవనీ కొంతైనా లాభిస్తుందనే 'రీ ఎంబర్స్‌మెంట్ వసతి' మనిషిని ఎన్ని వెర్రితలలైనా వేయిస్తుంది. ఇందులో తలమునకలై శేఖరం పోల్చుకున్నది. ఒకటే ఒకటి. నిజంగా

సొంత డబ్బు పెట్టి మందులు కొనుక్కున్న రోగికి ఒక్కడికి మినహా, తక్కిన ప్రతి ఒక్కరికీ ఇది లాభసాటి వ్యవహారమే మందులన్నీ 'రీ ఇంబర్స్‌బుల్', 'నాన్ రీ ఇంబర్స్‌బుల్' అనే రెండు భాగాలుగా విడదీసి రీ ఇంబర్స్‌బుల్ లిస్ట్‌ని తయారుచేసి ఉంచుతుంది ప్రభుత్వం. కొన్నిరకాల మెడికల్ డెసిషన్సుని బట్టి ఈ జాబితాకి అప్పుడప్పుడు చేర్పులూ మార్పులూ కూడా ఉంటాయి. వీటి సైక్లోస్టయిల్డు కాపీలు ప్రతి ఆఫీసులోనూ ఉండాలని రూలు. కాని తక్కిన అన్ని ముఖ్య ప్రభుత్వ పత్రాలలో లాగే ఇవీ సామాన్యులకి అంతగా అందుబాటులో ఉండవు. రోగి అయిన ప్రభుత్యోద్యోగికి. సాధారణంగా తనకి డాక్టరు ప్రిస్క్రైబ్ చేసిన మందు కొనుక్కుని వెంటనే వేసుకుని తగ్గించుకోవాలని ఉంటుంది గాని 'ఆ ఫలానా మందు తిరిగిరాబట్టుకునే మందుల జాబితాలో ఉందో లేదో చూసుకుని మరీ' మందుల షాపుకి పరిగెత్తాలని ఉండదు. మాట వరసకి ఓ డాక్టరు గారు సదాలక్ష్మి బలానికని రాసిచ్చిన "ఎక్స్‌కార్‌బెక్స్" అనే మందు మూడు నెలలపాటు రోజుకి ఆరుమాత్రల చొప్పున ఆయన సలహా మీదే ఉపయోగించాడు. తీరా మందుల బిల్లుకి పెడితే అనుమతించబడిన జాబితాలో ఆ మందులేదని తెలిసి, రుజువుతో సహా అయి, బిల్లు పాసవ కుండా వెనక్కొచ్చింది! ఎవిల్, కోసావిల్ లాంటివి ఎందుకు చెల్లవో సామాన్యులకు అందని సత్యాలు.

'ముక్కుకు సూటిగా పోయేవాళ్ళకి చిక్కులు తప్పవు, టిక్కెట్టు కొని రైలెక్కుతారు చూడండి. పాపం అలాంటి అమాయకులకు ఎన్ని ఇబ్బందులో! ఇదెలా సాల్వ్ చెయ్యాలో నేచెప్తారండి బావగారూ!' అని పిలిచాడు ఓనాడు, సదాలక్ష్మి "చూడండి అన్నయ్యా" అని ఎప్పుడూ ఉదహరించే కామాక్షి మొగుడు. భర్త ఏ సర్వీసులోనో ఉండడం కామాక్షి పేకాటకీ తిరుగుళ్లకీ కుదరదు. ఆయన సాధారణంగా యింట్లో కుకింగ్ సర్వీస్‌లోనే గడుపుతాడు. ఎక్కడే ఎలా ఉంటేనేం ఆయనకి తెలీని భోగట్టా ఉండదు ఈ భూలోకంలో.

"చూడండి డాక్టర్ త్రిశూల్ గారు మీ కెప్పుడూ ఏ కాగితం మీద మందుల పేర్లూ అవీ రాసిస్తున్నారో గమనించారా?

"పెద్ద గమనించ డానికేముంది, "విక్టర్ ఫార్మసీ, మెయిన్‌రోడ్, ఇక్కడ అన్ని ఇంగ్లీషు మందులు సరసమైన ధరలకు లభించును" అదేనా?

"మరి ఎప్పుడు విక్టర్ ఫార్మసీలోనే కొంటున్నారా?"

"ఎక్కడ వీలైతే అక్కడ"

"అదే తప్పు. ఒకేమాట, ఒకే బాణం. ఒకే భార్య అనేది ఆనాటి నీతి. ఒకే డాక్టరు, ఒకే మందు, ఒకే మందుల షాపు అనేది (ఖర్చు పెట్టింది ఓ వంతైనా కళ్ల చూడ్డానికి) ఈనాటి దగ్గిర దారి ఓకే?

శేఖరం తెల్లబోయి చూస్తూంటే కామాక్షి మొగుడు అసలు విషయం చెప్పాడు. డాక్టరు చూపించిన చోటికే పేషెంటు వెడితే మందుల షాపువాడికి అతని 'శీలం' మీద గురికుదిరి, అదనపు గౌరవం కలుగుతుందట. చెల్లని మందులేవో వాళ్ళకి అనుభవైక వేద్యమే గనక ఆ ఖరీదుకి సరిపోయే అనుమతించబడిన మందుల పేర్లు మనకిచ్చే బిల్లులో ఫిరాయిస్తారట. కొన్నవాడికి నష్టముండదట.

"కొనని మందుల్ని చేరిస్తే చూస్తూ ఊరుకోడం అన్యాయం కాదూ. అమ్మడు కాని మందుల్నివి బిల్లులోనో చేర్చినట్టు చూపితే తరవాత తణికీలో ఆ మందుల లెక్క తక్కువై ఆడిట్‌వాళ్ళు ఆ

షాపు వాళ్ళని పట్టుకోరూ?''

కామాక్షి మొగుడు ఆ సందేహాలు విని మొదట ఇల్లెగిరి పోయేటట్లు నవ్వి "ప్రైవేటు కంపెనీలో ఎక్కడో మీమటుకు మీరు లెక్కలు రాసుకుంటూ ఉండే వాళ్ళు. మిమ్మల్ని విధి యిలా తీసుకొచ్చి వీధిని పడేసింది బావగారూ ఇంతకీ మీ లాంటి అమాయకులు దొరకడం మా చెల్లెలి దురదృష్టం" అని కళ్ళ నీళ్ళు తుడుచుకున్నాడు.

అమాయకులు కూడా బతకాలి గనక ఈ మాయదారి వ్యవస్థలో వాళ్ళుకూడా క్రమంగా మాయ ఒంటబట్టించుకోక తప్పదు. శేఖరం చేసిందీ అదే డాక్టరు చెప్పిన ఏ మందు అయినా సరే, అది రీ ఎంబర్సబుల్ మెడిసిన్స్ లిస్టులో లేకపోతే ఆ ఖరీదుకి సరిపడే చెల్లిన మందుల్ని చేర్చి విక్టర్ ఫార్మసీ వాళ్ళు. అతనికి బిల్లు ఇస్తున్నారు. అయితే ఖర్చుపెట్టినదేదో బిల్లు వెరిఫైచేసి డబ్బు అప్పటికప్పుడు యిస్తే సర్కారు వారి గొప్పదనం నలుగురికీ ఎలా తెలుస్తుంది? ఇంతకీ మందులు కొన్న ఆ రసీదు మీద "దీన్ని నేనే చెల్లించానండోయ్" అని గవర్నమెంటు సర్వెంటు సంతకం చెయ్యాలి. "అవును సుమీ ఈ పీనుగ యివి పుచ్చుకున్న మాట నిజమే" అన్నట్టు డాక్టరు దానిని సర్టిఫై చేయాలి. ఇన్ని ఇముడ్చుకున్న ఆ మందుల రసీదు వైశాల్యం ఎంతని! రోజుకి వేలు కాజేసే మందులకామందుల కరువంతా ఆ రసీదుల సంకుచితత్వం లోనే బయట పడుతుంది. మహా అయితే సిగరెట్టు పెట్టె అంత ఉంటుంది! ఎడా పెడా అన్ని సంతకాలూ, మొహరులూ, దాని మొహం మీదే!

అక్కడితో అయితే ఘనతవహించిన ప్రభుత్వం ఎలా అవుతుంది? "ఎసెన్సిషియల్ సర్టిఫికెటేట్" అని ఒక ఫారమ్ ఉంటుంది. ఆ ఫారం కాపీలు కూడా ఏ ఆఫీసులోనూ అంతగా అందరికీ అందుబాటులో ఉండవు. ఒక్కొక్క మందుల బిల్లుకి రెండేసి చొప్పున ఆ ఫారాలు నింపి జోడించాలి. ఎవరి వైద్యం? దేనికి? ఎప్పట్నుంచి ఎప్పటివరకు? ఎక్కడ జరిగింది వైద్యం? కొన్న మందులు ఏవి, మాత్రలా కాప్సూల్సా ఇంజక్షన్సా? ఎన్ని? ఎంత ఖరీదు? ఇలాంటి లక్ష యక్ష ప్రశ్నలకి విసుక్కోకుండా, తప్పులు రాకుండా, రెండింటిలోనూ పూర్తిచేసి డాక్టరుచేత సంతకం పెట్టించుకోవాలి. బిల్లు మీద కాక ఈ ఫారాల మీద కూడా 'నేను నేనే సుమా'! అని ఉద్యోగి సంతకం 'ఎవరో అనుకున్నాను, ఔరా! వీడు వీడే సుమా!' అన్నట్టు గవర్నమెంటువారి గుర్తింపు పొందిన డాక్టరు చేత ఎటెస్టు చేయించుకుంటే రాతకోతలు పూర్తయినట్టు.

తప్పు తప్పు! కోత పూర్తయితేగాని రాతకోతలు పూర్తయినట్టు కాదని, డాక్టర్, త్రిశూల్ దగ్గరికి ఎసెన్షియాలిటీ ఫారాలు తీసికెళ్ళినప్పుడే గ్రహించాడు శేఖరం. కత్తికోత 'కస్సు' మని ఎంత స్ట్రెయిట్‌గా శరీరంలోకి దిగుతుందో డాక్టరుగారి నోటిమాటా అలాగే 'బాగుందండి శేఖరంగారూ, అన్నీ సవ్యంగా చేశారు కాబట్టి ఈ బిల్లు మొత్తం మూడొందలూ మీ చేతిలో పడతాయి. ఇన్ని సంతకాల కూలీ చేయించారు నా చేత. ప్రైవేటు ప్రాక్టీసు చేసే మాకు మీలా నెలా అయేసరికి ఇంతని చేతిలో పడదు. ఇలాంటివే మాకు దక్కుడు. నా కూలి డబ్బులు ఇచ్చేసి మీ కాగితాలు పట్టుకుపొండి'.

తెల్లబోయాడు శేఖరం. ఏమనాలో తోచలేదు. త్రిశూల్ చెప్పేడు తనే.

'డాక్టరు ఫీజు యిచ్చానంటారేమో! అవి నా వైద్యానికి ఇవో? ఇవి నైవేద్యానికి, మీ

ఎదురింటాయన చెప్పే ఉండాలే. నూటికి ఇరవై పుచ్చుకుంటాను నేను. అరవై రూపాయలు యిచ్చి పట్టికెళ్ళండి. చేతిలో మందుల డబ్బు పడ్డాక వీళ్ళకీ వాళ్ళకీ పంచడానికి మీ మనసొప్పదు. ఇప్పుడే ఇచ్చేసి మనసు రాయి చేసేసుకుంటే ముందు ముందు మీకే సుఖం'

అరవై చేతిలో పెట్టి సంతకాలైన ఆ కాగితాలు ఆప్యాయంగా ఆస్తిలా అందుకొని ఆఫీసు గుమాస్తాకి ఆరోజే అందించాడు శేఖరం 'బాబ్బాబు మీరూ పిల్లలు గలవాళ్ళు. ఆలశ్యం అవనియ్యక వెంటనే పుటప్ చేయించండి' అనే అభ్యర్థనతో 'మీ కంటె ముందు యిచ్చిన వాళ్ళు ఎంతోమంది ఉన్నారు శేఖరం బాబూ! కాయితాల క్రమం మారాలంటే అందజేసిన రూపాయి కాయితాల సంఖ్య బట్టి ఉంటుంది. నాదంతా పద్ధతి మరి.

అని కళ్ళజోడు తీసి కిచకిచ నవ్వితే అది విసిరేసి ఆగుడ్లు పేకెయ్యాలని అప్పటికి అనిపించినా శేఖరం చేసింది ఆయనకీ నలభై యివ్వడమే.

ఇన్నయినా హెడ్డాఫీసరు సంతకం చేస్తేగాని ఆ కాగితాలు ప్రాణం పోసుకోవు ఆయన మూడ్ కనిపెట్టి వెనక్కి తిరిగి రాకుండా అన్ని సంతకాలూ చేయించడం హెడ్ ప్యూన్ పని. అక్కణ్ణుంచి అవి ట్రెజరీ చేరాలి. పరిశీలన జరిపి అవి పాస్ అవడానికి అనుకూలమే అని తత్సంబంధ గుమాస్తా పుటప్ చెయ్యాలి.

ఆఫీసరు అలాగే అంటే అవి స్టేటుబ్యాంకుకి వెళ్ళి కేష్ రూపం దాల్చి వస్తాయి. వీటన్నిటికీ మరో ఏభై తరుగు!

వెలకట్టలేని తన వేతనా యాతనా మినహాయిస్తే, డాక్టరు కిచ్చిన ఫీజు అందులో చేర్చకపోతే, తన చేతుల్తో తను మందులకని ఖర్చుపెట్టుకున్న మూడొందలూ ఆర్నెల్ల తర్వాత తిరిగొచ్చింది సగానికి సగమూ!

అమాయకులైన చాలామంది గవర్నమెంటు ఉద్యోగులు హృద్రోగులుగా మారడానికి ఈ మెడికల్ బిల్సే కారణమేమో! ఒక్క అనుభవంతోనే పూర్తి జ్ఞానం వచ్చేసింది శేఖరానికి.

మరో ఆరునెలలకి కామాక్షి మొగుడుకే సలహా చెప్పేటంతగా పండిపోయాడు శేఖరం.

ప్రజలూ ప్రభుత్వమూ గుర్తించేది దేన్ని? అంతెందుకు పెళ్ళాం పిల్లలు గౌరవించేది దేన్ని? తన మంచినికాదు, పరువునికాదు ఎలా చేస్తేనేం. తను ఇంటికి తెచ్చే సంచీ బరువుని బట్టి.

ఎదిగిపోయిన శేఖరానికి కూడా తనని కుదిపివేసే విషాద సంఘటన ఒకటి అప్పుడప్పుడు గుర్తు వస్తుంది.

ఆయన దుక్కలా ఉన్నవాళ్ళూ తండ్రి ఫించెను డబ్బులు అనుభవించిన అన్నయ్య మంచాన పడిపోయిన తండ్రిని తన దగ్గిర దిగబెట్టేశాడు. మూడు నెలలు మల మూత్రాలు ఎత్తి సేవచేసాడు. శేఖరం. చచ్చిపోయాక ఎంతో ఘనంగా శ్రాద్ధ కర్మలు నిర్వర్తించారు. అన్నయ్యకి తన సేవ కనపడలేదు. అన్నయ్యనే పొగిడారు అందరూ ఎంతో ఘనంగా.

నలుగుర్నీ మెప్పించాలంటే నిజాన్ని నిద్రబుచ్చడం తప్పనిసరి.

కాలకూటంతో కాలక్షేపం చెయ్యాలంటే చేదుమింగడం తప్పించుకోలేని ఉరి!

*(జ్యోతి మాస పత్రిక, జూన్ '85)*

# మాస్టర్ పీచు




**ధర** శక్తి ముందు సుబ్బమ్మగారి దైవభక్తి పాపం అల్లాడిపోయింది. చిన్న పాట రూపంలో పైకి తన్నుకొచ్చింది.

'కొబ్బరికాయని తెచ్చి కొట్టుకుందామంటే
చెట్టెక్కె దాని ధర శ్రీరామచంద్రా!'

'ఎంత కష్టం వచ్చిపడింది బామ్మా' అని విచారం ప్రకటించాడు అది విన్న గోపీ.

'చాల్లేరా ఎప్పుడా వెధవ వేళాకోళాలూ నువ్వూను' అని బుస్సుమంది బామ్మ.

'కోప్పడకే బామ్మా! ఏదో ఇబ్బందిలో ఉన్నావ్‌కదా, నాకు తోచిన సలహా చెప్పి నీకు సాయపడదామనుకుంటూంటే.....'

'ఏమిట్రా నువ్వు చేసే బోడి సాయం?'

'అలా అడిగావ్ బాగుంది. కొట్టుకోవాలని కోరికే ఉండాలిగాని భక్తితో ఏదైనా కొట్టుకోవచ్చునుకదా అని.....'

'అంటే నీ ఉద్దేశం.?'

'మరేంలేదు. మనసేకదా ప్రధానమని.... మనకు లభించిన దాన్నే భగవదర్పితం చేసుకోవచ్చు ననుకుంటానూ....'

'అయితే'

'పెరట్లో బాదం కాయలు రాలినట్టున్నాయ్, వెళ్లి తెస్తాను. ఈ రోజుకి అవి కొట్టుకుని పూజ కానిచ్చేస్తే?'

మనవడి అపహాస్యం చూసి ఈసారి సుబ్బమ్మ తోకతొక్కిన తాచులా లేచింది.

'ఏంరా, ఏమిటి కూస్తున్నావ్? అంతా నీకు నవ్వులాటగా ఉన్నట్టుందే, కళ్లు పోతాయ్ సుమా!'

'అంతగా శపిస్తే ఎలా బామ్మా! నువ్వేదో ఇబ్బందిలో ఉన్నావని చిన్న ఉపాయం చెప్పాను. దానికే అలా ఒంటికాలిమీద లేస్తే ఎలా? పోనీ ఇంకోమాట చెప్పనా? పెరటిదాకా వెళ్లి బాదంకాయల్ని ఏరి తెచ్చుకునే పనేంలేదులే. నిన్న నేను తెచ్చుకున్న వేరుశెనక్కాయల్లో ఒకటో రెండో మిగిలినట్టున్నాయి. అన్నట్టు నీకు నిప్పు కడిగే ఆచారం కదా, శుభ్రంగా కడిగి తెస్తాను. ఫలం, పుష్పం, తోయం అన్నారు. ఆపద్ధర్మంగా ఈ ఒక్కరోజూ కొబ్బరికాయ బదులు వేరుశెనక్కాయ కొట్టుకోరాదా, పుట్టెడు పుణ్యం మూటకట్టుకోరాదా!'

'ఇంకా నయం, ఆ ఆదిదేవుడికి అక్రూట్‌కాయ అర్పించుకోమన్నావ్ కాదు. ఇంతకీ కొబ్బరికాయ కొట్టుకోవడంలోని అంతరార్థం నీలాంటి నాస్తిక సన్నాసికి తెలిసి చస్తేగా?'

'బామ్మా బామ్మా! అదేవిటో నాకు చెప్పవ్?' అని బతిమాలాడు గోపీ', వీలైనంత అమాయకపు పోజుపెట్టి.

ఎవరైనా ఏదైనా అడగ భయం, బామ్మ ఎన్‌సైక్లోపీడియా అయిపోతుంది.

'శివుడికి ఎన్ని కళ్లురా, గోపీ?'

'మూడూ, ఏం?'

'కొబ్బరికాయకి కూడా మూడుకన్నా లుంటాయి. ఈసారి సరిగ్గా చూడు. అంటే? ఈ నారికేళం ఆ అదిదైవం బాహ్యస్వరూప మన్న మాట.. మన మిచ్చేదేమిటి, ఆయన్ది ఆయనకే ముట్టచెబుతున్నాం. సరేనా?'

'ఇందులో ఇంతటి అంతస్సూత్రం ఉందా? న్యూటన్స్ థర్డ్‌లా చదువుకున్నాంగాని ఈ థీరీ ఇంతటిదని ఇదివరకెరగం సుమీ! అయితే బామ్మా నా కో చిన్న సందేహం. అడిగితే ఏం అనుకోవుగా?

'అడగరా అనుమాన ప్పక్షీ!'

'కొన్ని చోట్ల ఇంద్ర పూజ కూడా చేస్తారని విన్నాను, నిజమేనా?'

'దేవత లందరికీ ఆయన రాజు, చెయ్యారా మరి? ఏదోపెద్ద చదువుకున్నామని విర్రవీగుతారు, ఆ మాత్రం తెలీదా?'

'మూడు కళ్ల శివుడికి కొబ్బరికాయ కొట్టడం సబుబే. వెయ్యి కళ్ల ఇంద్రుడికి ఏ కాయకొట్టుకుని

పూజ చెయ్యాలిట!'

'ఇలాంటి చొప్పదంటు ప్రశ్న వేసిన నీలాంటి వాణ్ణి చాచి లెంపకాయ కొట్టాలి, నీలాంటి మనవ డున్నందుకు నా నెత్తి కొట్టుకోవాలి. ఇక్కణ్ణుంచి పోతావా, పోవా!'

అంటూ వెంట బెట్టినా గోపీ బామ్మ నుంచి పూర్తిగా తప్పుకోలేదు. ఇంతలో ఆవిణ్ణి రక్షించడానికా అన్నట్టు ఎదురింటి సీతామహాలక్ష్మి ఒకానొక నిజ సందేహంతో అక్కడి కొచ్చింది.

'గొప్ప ధర్మ సంకటం ఒకటొచ్చి పడింది పిన్నీ' అనుకుంటూ.

'రామ్మా సీతా రా ... అలా దిగులుపడిపోకూడదు. దేనికైనా నివారణోపాయాలంటూ ఉంటాయి. సొంత మనవడైన మా గోపీ గాడికైతే నన్ను ఆటపట్టించాలని ఉంటుంది గాని, నీకింకా నా మీద ఎంతటి భక్తి శ్రద్ధలే తల్లీ!'

'మరేం లేదు. చిన్నడౌటు. కొబ్బరికాయకి కొంచెమైనా పీచు లేకపోతే దేవుడి కది కొట్టకూడదుటకదూ పిన్నీ?'

'ఇంకా అడిగావా! కొబ్బరికాయ యొక్క ఆ భాగం పునిస్త్రీకి నుదుటి తిలకంతో సమానం కాదుటే! మా మరిదిగారి చిన్నబ్బాయి, వట్టి హేతువాది, నీకు తెలుసుగా! మొన్న ఏమైతే అయిందని పూర్తిగా పీచుతొలగించిన కొబ్బరికాయ కొట్టబోయాట్ట. అంతే! ఆ చేతులు గడగడ ఒణకనూ, ఆ మనిషి గిరగిర తిరిగి పడిపోనూ! వెర్రి జ్వరం వచ్చిన ఆ కుర్రఘటం మరి లేవలేదుట! ఆనాటి ఋషులు ప్రజాక్షేమం కోరి ఏర్పరిచిన విధులు కాదన్డానికి మన మెవరమే తల్లీ!

'చూశావా పిన్నీ! ఆ మాట చెబితే మీ అల్లుడు వినరే! అది మా ఇంటి కొబ్బరి చెట్టు తొలికావు. దేవుడికి అర్పిస్తానని మొక్కుకున్నాను. తీరా చూస్తే మీ అల్లుడు గారు బొండాం ఒలవడం కాదు గాని బోడి చేసి పారేశారు. నాకు కాళ్లు చేతులూ ఆడక ఇలా పరిగెత్తుకొచ్చాను పిన్నీ!'

'బాధపడకే సీతా! చికాకులు వచ్చినప్పుడే మనసు చిక్కబట్టుకోవాలి. ఇలాగే మా ఇంట్లోనూ ఓసారి పీకల తెగిపోయే సమస్య వచ్చిపడింది.'

మా అత్తగా రెంతో మేధావీ, ధైర్యశాలీనూ. చెక్కు చెదర్లేదనుకో'

'ఇంతకీ వచ్చిపడని ముప్పు ఏమిటి బామ్మా?' అని గోపీ అడిగాడు.

'నీకేం చెప్పడం లేదు .. ఇటురా సీతా ... నీలాంటి వినయం ఉన్నవాళ్లకి చెబితేనే ఇహమూ పరమూను. ఆ మరుచటి రోజు కార్తీక సోమవారం. ఓ అరడజను కొబ్బరిబొండాలు దింపించారు మా అత్తగారు. ఒలవమని పాలేరుకి అప్పచెప్పి పనుంటే లోపలికి వెళ్లారు. తీరా వచ్చే సరికి ఆ వెధవ అన్నింటికీ పూర్తి క్షౌరం చేసి పారేశాడు. ఒక్కదానికీ పట్టుకోడానికి పీచు అనేది లేదు. జరిగిన ఘోరానికి మరొకరయితే ఏ హార్టు ఎటాకో తెచ్చుకుని ఉందురు. మా అత్తగారిది ఎంత నిబ్బరమని!'

'ఏం చేశా రేం చేశారు?' అంటూ సీతా, గోపీ ఏకకంఠంతో అడిగారు.

'ఏం చేశారా, పెద్ద గిన్నెడు మైదా పిండి ఉడక బెట్టించారు. ఏ కాయకి ఏ ముచిక సరిపోతుందో ఏర్పాటుగా పెట్టుకున్నారు. ఒకటీ ఒకటీ జాగ్రత్తగా అంటించుకుని ఆరబెట్టుకున్నారు. దైవకార్యం మరీ, ఓ గంట కష్టపడితేనేం, మర్నాడు పబ్బం గడుపుకున్నారు!'

'ఏ 'ఫెవికాల్' ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లోనో ఇమిడిపోయే స్టోరీ సుమా!' అనుకున్నాడు గోపీ.

'ఇంతకీ చెప్పేదేమిటంటే నువ్వూ అలాగే చెయ్యమ్మా సీతా! కష్టాలు వచ్చాయని చతికిలపడిపోతామా!'

గోపీ చప్పట్లుకొడుతూ అన్నాడు 'సెభాష్ బామ్మా .... అన్నాడు భర్తృహరి ఏమన్నాడు -- 'ఆపదలందు ధైర్యమును' అని కదా! ఆ నీతి నీలాంటి వాళ్ల గురించే అయిఉంటుంది! నీతుల్లో ఇది మాస్టర్ పీచు సుమా!'

(
*ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 10 04.96.)*

# సుత్తి ముత్తాతావళి




**వంటగది** వైపు ఆశగా చూశాడు సూరన్నగారు. "ఇక మీరు మడి కట్టుకోవచ్చు" అని పిలుపు యింకా వినపడలేదు. రిటైరయిన తర్వాత పనీ పాటూ లేక కాబోలు ఆకలి మరీ పెరిగిపోయినట్టయింది. ఆకలి ఒకటే అయితే ఫరవాలేదు. పిల్లలంతా కలసివేసే కేకలు వినిపించినట్టై తుళ్లి పడతాడు. "నూనె దినుసు అయినా ఊరుకోదు, బాణలిలో వేసి మరగబెడితే తాపంతో బుస బుస పొంగుతుంది. నూతి గిలక అయినా పడి ఉండదు. గిరగిర తిప్పితే కోపంలో కిర కిర లాడుతుంది. మళ్ళీ నువ్వూ ఉన్నావు. మనిషివై పుట్టేవు. మమ్మల్ని ఇంతింత వాళ్లని చేశావు. స్పందన అంటే ఏమిటో నువ్వెరుగుదువా అని"

కుర్ర సన్నాసులు, తలెత్తుకోలేని పను లకితలపడిందే చాలక, తలాతోకా ఆనక తలో దిక్కుకూ అయిపోయామని ఎదుటివాడి మీద నిందలు కూడా దేనికి!

ఇంతకీ ఏది ఎలా జరగాల్సుందో, ఎలా జరగాలని రాసి పెట్టి ఉందో మనకేం తెలుసునని చెప్పడానికి!

ఆడించే పైవాడిని నమ్ముకున్నాడు తను. వాడి మీద సంపూర్ణ విశ్వాసం ఉంచి నాటినుంచి నేటి వరకూ ఇల్లు నడుపుతున్న తన భార్య ఉంది. సంపాదించడం తనపని. సంసారం దిద్దే బాధ్యత తన పెళ్ళానిది. ఒకళ్ళ పనిలో ఇంకొకరు జోక్యం చేసుకోకుండా ఇన్నాళ్ళూ సవ్యంగా నడిపారు ఇద్దరూ.

ఇంకో దారి తొక్కమని పిల్లల కెవరూ చెప్పలేదే!

అందరూ అనుకున్న, నలుగురూ ఆమోదించిన కట్టు బాట్లూ సంప్రదాయాలూ కొట్టి పారేస్తే శిక్ష తప్పుతుందా మరి!

మనసు తికమక నుంచి మళ్ళీ ఆకలి నక నక వైపు దృష్టి మళ్ళించ గలిగాడు సూరన్న గారు.

చటుక్కున గుర్తొచ్చింది ఆరోజు వైకుంఠ ఏకాదశి అని.

పెరుమాళ్ళకు ప్రత్యేకమైన పూజా, తగిన ఆరగింపులూ ఉంటాయి. ఆ పైవాడి కింత నివేదించి లోవేడి కింత అందించడం లోనే ఉంది మనిషి బతుకులో స్వారస్యం. పోయిన వారితో పోలేంగాని యిప్పుడొచ్చిన లోటేమిటని? ఏమంత పెద్ద ఉద్యోగం కాకపోయినా, అతన్ని వాళ్ళ వెధవక్క పెంచుకొని యిచ్చిన పెంకుటిల్లు యీనాటి పదవీ విరమణ కాలంతో సహా ఆశ్రమం యివ్వడమే కాక, రెండొందలు అద్దె యిస్తోంది. ఇక నర్సమ్మగారు రెండు రకాల కడుపుకోతలూ ఎరగని ధన్యజీవి. పుట్టిన పిల్లలెవరూపోలేదు. శస్త్ర చికిత్స మాట దేవుడెరుగు ఇంజక్షను ఎరగని భాగ్యశీలి. ఆర్థిక చింతలు లేవుగనకనే పారమార్థిక చింతనలూ, దైహిక బాధలు ఎరగరు గనకనే దైవ సంబంధ బోధనలు. ఇవి వారి జీవితంలో కిక్కిరిసి ఉండడంలో ఆశ్చర్యం లేదని కొందరు కువ్యాఖ్య చెయ్యొచ్చు.

"అప్పుడు మన చేతిలో ఉన్నదేమిటి, ఇప్పుడు కొత్తగా లేకపోయిందేమిటి! ఎప్పుడైనా మనం ఆ ఆడించేవాడి చేతిలో కీలు బొమ్మలమే!"

అనే నరసమ్మ గారి విశ్వాసాన్ని వేలెత్తి చూపడానికి ఆయన కెప్పుడూ అవకాశం కలగలేదనా! దొరక్క పోయికాదు, ఓ విధమైన నిర్లిప్తత. ఏదోవిధంగా రోజులు గడిపే పూచీ యింటి యిల్లాలే నెత్తిన వేసుకుంటున్నప్పుడు "నేనెందుకు మధ్యని వేలు పెట్టడం" అని గడుసరి అయిన మొగాడు వేసుకునే తప్ప దాటు ముసుగు లక్షణం. ముసుగు తన్నడంలో ఉన్న సుఖం ఎందరికెరుకా!

వంట గదికే తప్పితే పూజమందిరానికి తప్ప ఆడది మరొక దానికి అంకితం కాకూడదని నర్సమ్మ నమ్మకం. అయితే అక్కణ్ణుంచే, తన యింటికే కాక నాలుగు యిళ్ళకి వినిపించే పెద్ద స్వరంతో, ఎంతెంత వేదాంత ధోరణులూ శాస్త్రీయ దృక్పథంతో వివరించినట్టు భ్రమ కలిగించగలదు. ఆవిడ గత జన్మ పాపపుణ్య కర్మలబట్టే ఈ జన్మలో మనకి రూపం, కులం, గుణం, ధనం అనే అనేకానేక తారతమ్యాలు ఏర్పడతాయి కాబట్టి ఈ హెచ్చు తగ్గుల్ని సరిదిద్దే ఎట్టి ప్రయత్నమైనా బోర్లా పడకా తప్పదని కుండ బద్దలు కొట్టినట్టు చెప్పగల దావిడ.

"కాళ్ళకి టోపీ పెట్టుకుని నెత్తిన జోళ్ళు పెట్టుకోంగదా, బాత్రూంలో భోంచేసి వంటింట్లో నీళ్ళోసుకోం గదా! వస్తువులకే హద్దులున్నప్పుడు మనుషుల్లో అంతరాలు ఉండక ఏంచేస్తాయి? ఈ అంతస్థులు అంతరింప చెయ్యాలనుకోవడం కొండని అరగదీసి కోనేట్లో కలుపుదామనుకున్నంత వెర్రితనం "పనిమనిషి మొహాన విధి ముందే అలా రాసి ఉండబట్టి అది నా యింటి కొచ్చి అంట్లు

తోము తోంది లేపోతే నేనే దానింటికి వెళ్ళి దాసీ పని చెయ్యనూ! దేవుడింత స్పష్టంగా చెబుతూ ఉంటే ఈ వెర్రి మానవులకి యింకా మా అనుమానాలు దేనికో!" అంటుంది అక్కడితో ఊరుకోక యింకా తగులుకుంటుంది.

"అవునండి, ఓ కులం అయితే మాత్రం మీకూ నాకూ ఎంత తేడా పెట్టేడు అన్నీ తెలిసిన ఆ బ్రహ్మదేవుడు! నాకు బిడ్డ సంచీ యిచ్చినవాడు మీకది యిచ్చాడా? ఊహుఁ మీ చేతిలో ఓ గుడ్డ సంచీ పెట్టి నెలా అయేసరికి దాన్ని నింపుకు రమ్మని విధించాడు. కాదనమనండి ఎవర్నైనా చూద్దాం"

మౌనం అనేది అర్ధాంగికారం అయితే సగం అంగీకరించకపోవడం కూడా. సూరన్న గారి రెస్పాన్సు అలా వుంచి పిల్లలు మాత్రం ఏఒక్కరూ ఆవిడకి ఓటు వేసినట్టు లేదు.

ఇంట్లో కాస్తో కూస్తో విప్లవం అనేది పెద్దవాడిలోనే మొదలైంది. మొదట్లో వాడు నరసమ్మ గారి అన్నకూతుర్ని చేసుకోడానికి ఓ పట్టాన ఒప్పుకోలేదు. తీరా చేసికున్నాక తల్లి చాటున ఆ యింట్లో ప్లీడరు ప్రాక్టీసు చెయ్యడానికి మాత్రం ఎంత చెప్పినా లొంగలేదు. తండ్రికి చెప్పి పెద్దకోడలే బాగా దూరపు ఊళ్ళో మొగుడుకి ఉద్యోగం సంపాదించి పెట్టింది. ఏ పెళ్ళికో వచ్చిపోతుంది, జన్మకో శివరాత్రి. ఆ కుటుంబం అంతే.

రెండో కొడుకు యింకా క్లుప్తంగా తీవ్రంగా స్పందించాడు. ఇంకో శాఖ పిల్లని చేసుకుంటానంటే, అలా జరిగిన్నాడు ఆ పిల్లని వంటింట్లో కాలు పెట్టనివ్వనంది నరసమ్మ. "వంటింట్లోకే కాదు. యీ యింట్లోకే మేం రాం. అంతేకాదు ఇంతటితో నీకూ నాకూ రాం రాం' అని, అన్నంత పని చేశాడు!

"నేను పూజిస్తున్న దేవుళ్ళే ఎన్నెన్నో కష్టాలు పడ్డారు. ఎప్పుడో చేసుకుని ఉంటాను. ఇప్పుడనుభవిస్తున్నాను. కొద్ది నోములు నోచి గొప్ప ఫలానికి కొంగుపడితే ఎలా!" అని సరిపెట్టుకుంది గాని తన పట్టు సడలనివ్వలేదు నరసమ్మ.

అలా పడక్కుర్చీకి అతుక్కుని కూచుంటే జీవితం అంతా ఫ్లాష్‌బాక్ అయినట్టు తోచింది సూరన్నగారికి.

మూడోది ఆడపిల్ల. దానికి మొదట్నుంచీ చదువు పిచ్చి. తల్లికూడా చేసే చాకిరితో దానికి ఎన్ని ఆటంకాలో వచ్చేవి. అంటు, ముట్టు, మడి, మయిల ఆడప్రాణికి ఓ శిక్ష విధించాడా ఆ పై వాడు! ఇదిగాక ఎక్కడే పక్షిణీ దొరుకుతుందో అని వెయ్యి కళ్ళతో ఎదురుచూసేదిట ఆ తల్లి పక్షిణి! మెట్రిక్ అయేసరికి తల్లి ధర్మమా అని మైనారటీ దాటింది. పెద్దమ్మాయికి ఎలాగైనా కాలేజీలో చేరతాననే దాని పేచీ వాళ్ళమ్మ ముందు ఫలించలేదు. "నాకు బాగా చదువు వస్తోందిట. మా లెక్కల మేష్టారు చెప్పేరు" అని పెద్దమ్మాయి అనబోతే "ఎవడూ, పెళ్ళాన్ని మింగిన ఆ గిరజాల వెధవా? పెళ్ళాడతాడేమో కనుక్కోకూడదూ, కాలేజీలో చేర్పిస్తాడో కాటికే పంపిస్తాడో" అని బోడెద్దుకి పోట్లు మప్పింది నరసమ్మ. ఆ మరుచటి నెల వ్రతానికి వాళ్ళిద్దరూ అన్నవరం కొండెక్కుతూంటే, అట్నించి దిగొస్తూ పసుపుబట్టలతో పెద్దమ్మాయీ. లెక్కల మేష్టారూ "మమ్మల్ని దీవించండి!" అంటూ తయారు! నోరుంది గనక అక్కడే ఓ దులుపు దులిపేసింది నరసమ్మ. ఇంటి కొచ్చేదాకా ఏడుస్తూనే ఉంది. అంతే "ఏ భక్తులకి రాలేదు గనక పరీక్షలు!" అనుకుని గుండె మరింత నిబ్బరం

చేసేసుకుంది. "నాకింకా బంగారంలాంటి మరో కూతురూ వజ్రంలాంటి కొడుకూ ఉండనే ఉన్నారు. ఇంతట్లో చెడిపోయిందేంలేదు. నమ్మిన వారి నెప్పుడూ ఆ దేవుడు నిలువునా ముంచడు!"

అని మరింత పెద్ద గొంతుకతో "సుత్తి ముత్తాతావళి" ప్రారంభించేది.

"ఆఖరి కూతురికి" ఊరంతా చద్దరిల్లేలా పెళ్ళి చెయ్యాలని ప్రయత్నాలు మొదలెట్టింది. "స్కూల్లో వెనకపడితే యేం, నా తల్లికున్న లోకజ్ఞానం ఎవరికుంది? దీన్ని పెద్ద డాక్టరికి తప్ప మరొకరి కివ్వను" అని తీర్మానించుకుంది. మరి ఆ ముక్క ఎక్కడవిందో తల్లికి ఆ యిబ్బంది లేకుండా చేసిందా చిన్నది. డాక్టరు కాకపోతేనేం, అదే వర్గం కదా, యింట్లో అద్దెకి దిగిన ఓ కంపౌండరు కుర్రాడికి శరీరమే సొంతం చేసింది. పెళ్ళి కాకపోతేనేం, ప్రేమకదా ముఖ్యం, జివ్వు జివ్వున రివ్వు రివ్వున లేచిపోయింది అతనితో ......

ఆ దెబ్బతో నరసమ్మ తలెత్తుకోలేక చాలా రోజులు బాధ పడినమాట నిజమే గాని క్రుంగి కృశించిపోలేదు. రోజూ కంటె మరోగంట పూజా మందిరంలో గడిపేది. ఆఖరివాడిమీదే అన్ని ఆశలూ పెట్టుకుని ఎన్నెన్నో మొక్కులు మొక్కేది. వ్రతాలు చేసేది. పరాయి ఊళ్లో ఇంజనీరింగ్ ఆఖరేడు యిక పరీక్షలు అయిపోయి ఇవాళో రేపో యింటికి వస్తాడనగా, తనకి అన్ని విధాలా నచ్చిన సాటి సంబంధం ఒకటి సిద్ధంచేసి ఉంచింది. వాడు వచ్చేరోజు వస్తుందనగా కఠోర ఉపవాసాలు ప్రారంభించింది. ఉగ్ర శనివారాలు పాటించింది.

"ఇదిగో ఇవాళో రేపో వస్తుంది చల్లనివార్త, అబ్బాయి కులాసాగా యిల్లు చేరుతున్న కబురు. ఉగ్రం సమగ్రంగా చేసిన వాళ్ళకి స్వామి అనుగ్రహం తప్పదు" అని నరసమ్మగారు అనుకుంటూనే ఉంది, పెద్ద టెలిగ్రాము ఒకటి వచ్చి ఒళ్ళో పడనే పడింది!

కుర్రాడు స్వామి భక్తి పరాయణుడు! ఆయన అడుగు జాడల్లోనే ఓ బీబినాంచారిని రిజిష్టరీ ఆడి రెండేళ్ళు మాత్రమే అయిందిట. ఏడాది అహ్మద్‌తో పెళ్ళాన్ని తీసుకుని ఎమ్మే చదవడానికి అమెరికా చేరి ఉంటాడుట యీ సరికి! ఆవిడ ఆశలు కల్పించిన కాబోయే వియ్యంకుడు ఆరా తీసి చీవాట్లు పెడుతూ చేర్చిన వార్త అది!

ఓ నెల్లాళ్ళపాటు అన్నీ కోల్పోయినట్టు ఏం తీసుకుందో అంతే. "ఇంకేముంది నేను పోగొట్టుకోడానికి!" అనే మొండిధీమాతో చెంగున లేచి కూచుంది నరసమ్మ. మళ్ళీ అంతలోనే లెంపలు వాయించుకుంది. "పోగొట్టు కోడానికి నాదంటూ ఏముంది! ఇన్నాళ్లూ వెర్రిభ్రమలతో ఎంత గుడ్డిగా బతికాను! మనదనేది ఏం ఉండదనే దివ్యజ్ఞానం ఎంత దయతో కలిగించాడు ఆ స్వామి నాకు! పూజా గృహంలో రోజు రోజుకి ఎన్ని కొత్త దేవుళ్ళ పటాలు చేరుస్తున్నాను! ఇంతగా వీరికి తాపటం అయిన నా విశ్వాసం ఎగిరిపోడానికి నేనేం తోకతెగిన గాలి పటాన్నా!" అనే అచంచల దీక్షతో నిత్యకర్మకి అంకితమైపోయింది నరసమ్మ మనసు.

గతంలోంచి వర్తమానం లోకి వచ్చి పడ్డాడు సూరన్నగారు అప్పుడప్పుడనిపిస్తుంది ఆయనకి పిల్లలందరూ విడి విడిగా తనని నిలదీస్తున్నట్టు. "నాన్నా, పాతికేళ్ళ పై సంబంధమే ఉంది నీకూ మాకూ, మా కష్టాలు కన్నీళ్లూ గాలికి వదిలెయ్యడం తప్ప ఏనాడైనా నువ్వనే వాడి వొకడివి ఉన్నావనే భ్రాంతి అయినా మాకు కల్పించావా! నిండిల్లు యిలా శూన్యం అయిపోయిందంటే నీ బాధ్యత ఎంతో ఆలోచించావా!" అంతట్లోనే మళ్ళీ జవాబు చెప్పుకుంటాడు. "ఇన్నాళ్లై కాపురం చేస్తున్న

యిల్లాలే నన్ను ఒక్కటంటే ఒక్కమాట అనలేదు. పిల్లకాకులు మీరేమంటే ఎవడికి లెక్క!'' అనుకుని అక్కడితో సరిపెట్టుకుంటాడా, ఊరంత సమర్థన కొండంత ఊరట యిస్తుందతనికి.

"ఇది ఒకే ఒక కుటుంబం చరిత్ర ఎందుకయింది, ఇది మన దేశగాథ. ఇంకా చెప్పాలంటే ఇదే ప్రపంచ ప్రగతి చరిత్ర. కావలిస్తే లెక్కపెట్టండి. ఇంతా చేస్తే, ఇంత విస్తృతమైనదీ, హిందువుగా నేను చెప్పేదీ మాత్రమే. ఏటా విదేశాలలో పెరిగే దేవాలయాల సంఖ్య ఎక్కువ. ప్రతీ గుడిలోనూ పెరుగుతున్న రాబడి ఎక్కువ. పోలోమని పోటీపడి చేయించుకుంటున్న బోడిగుళ్ళ సంఖ్య ఎక్కువ పుంతలో పున్నమ్మ మొదలు భూలోకమాతవరకు వెలుస్తున్న చిల్లర దేవుళ్ళ సంఖ్య ఎక్కువ. ఇంతెందుకు నా చిన్నప్పుడు యీసంతోషిమా లేదు. ఈ అయ్యప్ప శరణార్థులు లేరు. ఈ సాయిభజన్లు లేవు. ఇన్ని లక్షలమంది భక్తులు మూర్ఖులనడంకంటె వెర్రి వెధవ తనం ఉండదు. మనకి బోధపడకపోవచ్చు ఇందులో ఏదో ఉండే ఉంటుంది'' అని అక్కడికి ఆపి, మనసు అలజడిని పేగుల కదలిక జయించడంతో " ఏమే, ఇక ఇవాళకి వంటవడం ఉండదాయేం?'' అనే గావు కేక పెట్టాడు.

*(జ్యోతి మాసపత్రిక ఏప్రిల్, 85)*

సుతి ముతాతా!

# తాతా,

# పెళ్లాడతావా?



**ఎదురుగుండా** ఏమీ అనలేక కథల్లో పెట్టి ఏకేస్తూ ఉంటానని చాలామంది మా బంధువులకి నేనంటే మంట. స్వతహా నేను చాలా మంచివాణ్ణే అనీ, నా పెళ్ళామే నాకు లేనిపోనివి నూరిపోసి, కిట్టనివాళ్ళమీద దుమ్మెత్తిపొయ్యమని 'డిక్టేటు' చేస్తూ వుంటుందనీ మరో ఆరోపణ. అపోహలు సహా, అహో, ఒక్కొక్కప్పుడు ఎంతటి మహోపకారం చేస్తూంటాయి! వచ్చినవాడు కాదనకుండా కాపాడుకుంటూ, తద్వారా బంధుపీడ ఒదుల్చుకుంటూ సినిమా సంభాషణలు రాయడానికి పట్నం వచ్చినప్పుడల్లా, ఇక్కడ ఏ వీధిలో చూపినా మా గోత్రీకులే అఘోరిస్తారు గనక, ఎక్కడా దిగకుండా ఏహోటల్ 'జిగ్ జిగేల్' ఎయిర్ కండిషన్ రూమ్‌లోనో ఏదోవిధంగా తలదాచుకుని ఎంజాయ్ చేస్తూ ఉంటాం.

కాగితాలూ కలమూ ముందు పడేసుకుని కూచున్నాను గాని కథ నడవడం లేదు. తలెత్తి చూశాను. హాయిగా నిద్రపోతోంది వాణి. అంతవరకూ రాసినదానివైపు మళ్ళించాను దృష్టి. నేను రాస్తున్న సినిమా పేరు 'దసరా సచ్చినోడు.' అప్పటికి సగం మాత్రమే సాగేయి మాటలు. రాసింది

చదువు కుంటే నాకే సిగ్గేసింది.

ఎన్ని ఫామిలీ ప్లానింగ్ ప్రక్రియలు వెలసినా ఎంత వయసు ముదిరినా, పాపం తెలుగు సినిమా హీరోకి 'నిరోధ్' గురించి అయినా తెలీదు! కథానాయిక 'సేఫ్ పీరియడ్' అయినా పాటించదు! చేసిన చీకటి తప్పుకి ఫలితంగా ఇంటర్వెల్ అయేసరికి విధిగా నెలతప్పి, వీధిని పడకమానదా కషాయిత గ్లిసరిన్ లోచన! ఒకవేళ ఎబార్షన్ అనేది చట్టబద్ధం చేయబడినా అది కథాగమనరీత్యా దర్శక సమ్మతం కాదు గనక, 'కడుపు చించుకుంటే ఆపరేషన్ బల్ల మీదే పడుతుంది సుమా!' అని ఎవరెంత చెప్పినా రెండుచెవులూ మూసుకొంటుందా కల్పిత కాటన్ కుచ!

ఒకచోట నిలబడని ఆలోచనలకి అక్కడితో ఒక్క నమస్కారం చేసి, రాస్తున్నది కట్టిపెట్టి, హోటల్ రూం నుంచి మెయిన్‌రోడ్ మీదకు చేరేశాను శరీరాన్ని. వంద గజాలు నడిచానో లేదో, మా కాశీపతి మామయ్య కంటబడక తప్పించుకోలేకపోయాను. ఆ వయసులో నడకలోనేకాక, మాటలో కూడా ఆ దారుఢ్యం చూసి మతిపోయినంత పనైంది నాకు.

'నీతో మాటాడాలి, ఎక్కడైనా కూర్చుందామా?' అని అడిగితే ఎలా తప్పించుకోవడమో బోధపడలేదు నాకు. ఎండవేళ అయినా చల్లగాఉంది ఆపూట. ఇద్దరం పార్కుకి వెళ్ళేం. రేడియో రూం వరండాలో రెండు సిమెంటు సోఫాలలాంటివి ఉన్నాయి. అక్కడ కూచున్నాం. 'ఉండు, ఇప్పుడే తీసుకొస్తాను' అని కాశీపతి ఉన్నపాటున లేచివెడితే ఆశ్చర్యపోయాను. 'రౌడీలను కాదుకదా, నన్ను తన్నించడానికి? ఈ మధ్య అత్తయ్యను హేళనచేస్తూ నేను పత్రికలో రాసినకథ ఇంకా మరచిపోలేదేమో!' అనిపించి చిరు చెమటలు కమ్ముకొచ్చేయి నుదుటి మీద. కాని కాశీపతి తీసుకొచ్చినవి తనకి చుట్టలూ, నాకు సిగరెట్లూనూ! చల్లని వాతావరణాన్ని అవధుల మేరకు పొల్యూట్ చెయ్యడానికి పోటీలుపడుతూ మేమిద్దరం దీపారాధన చేస్తూండగా కాశీపతి దీవించడం ప్రారంభించాడు. నన్ను కాదు, కోదండపాణి బాబాయిని!

మళ్ళీ ఈ కోదండపాణి మా కాశీపతికి పైవాడు కాదు! దూరపు చుట్టరికం కావొచ్చుగాని మా వనచరులందరిదీ ఒకటే శాఖ!

పువ్వుని చూపి ముద్దాడడానికి తల్లి వేరు ఎక్కడుందో తవ్వవలసిన అవసరం లేకపోవచ్చుగాని కోదండపాణి పువ్వులాంటివాడు కాదుగదా! అతన్ని గురించి కాశీపతి ప్రస్తుతం చెబుతున్నది అర్థంచేసుకోవాలంటే నాకు తెలిసిన కోదండం గత చరిత్ర నెమరువేసుకోక తప్పలేదు.

మామగారు మనోహరం పంతులు గారికి డిస్ట్రిక్ట్ జడ్జీగా ప్రమోషన్ వచ్చిందని తెలియగానే --- ఆ ఆనందంతో మరింత ఎక్కువగా గెంతులు వేశాడో యేమో కోదండానికి జీళ్ళ పాకంలాంటి కీళ్ళవాతం పట్టుకుని మరి వదలలేదుట. అంతటి అంతస్థులో ఉన్నవాడికి అల్లుడై, గుమాస్తా పని ఇంకా కొనసాగించడం మామగారికే మచ్చ అని నిలుచున్న పాటున చేస్తూన్న ఉద్యోగానికి తిలోదకాలు ఇచ్చేశాడు. ఆ తర్వాత అతను ఆపీసులో అడుగు పెట్టలేదు. అంతేకాదు మామగారింట్లో మంచంమీద పక్కేసిన వాడు మరికాలు కింద మోపలేదని చెబుతారు!

వకీలెరిగి వాతపెట్టడం జడ్జీగారికి బాగా తెలుసు. కాని 'కీలుకీలూ సలుపు, మామా!' అని మూలుగుతున్న అల్లుడి నోరు మూయించడానికి కీ ఏ వైద్యుడి దగ్గిర దొరుకుతుందో ఎన్ని ప్రయత్నాలు చేసినా, తెలిసి చావలేదు. పంతులుగారి కట్టుకున్న పెళ్ళామా, మంచి పై చూపు ఉన్న

మనిషి. చేయించుకున్న పుట్టిన దినాలకంటె పెట్టించుకున్న తద్దినాలే ఎక్కువ! ఇక ఒక్కగానొక్కడైన కొడుకుగాడా, బాగా దూరదృష్టి ఉన్న మనిషి, ఇస్త్రీ మడతలాంటి ఒక ఇంగ్లండు స్త్రీ రత్నాన్ని కట్టుకుని అక్కడే స్థిరపడిపోయాడు! ఇక అమ్మాయి కస్తూరి, అదెప్పుడూ తలపైకెత్తగా ఎవరూ చూసి ఉండరు. దాని అవలోకనం ఎప్పుడూ క్రిందకే, భర్త పాదాలమైపే! ఇంట్లో నడయాడే ఒకే ఒక్క రక్తబంధువుని చూస్తే పంతులుగారికి సహజంగా పంచప్రాణాలూను. ఇక తన కూతురి ఇలవేల్పుని, ఆ 'నొప్పులకుప్పని', ఇంకా నొప్పించడం దేనికి? అలా ఆయన ఆలోచించగానే కోదండంకి ఇక మంచం దిగవలసిన అవసరం లేకపోయింది.

ఇక ఆ రోజుల్లో, ఆ పెద్ద బంగళాలో, అల్లుడికని ప్రత్యేకించిన ఆ గదిలో ఏ తెల్లవారు ఝామున కాస్త చెవి ఒగ్గివిన్నా భర్త పాదాల దగ్గిర కూచుని, కస్తూరి, కర్రసుత్తితో ఆయనగారి వాతం నొప్పులు తగ్గడానికి, సెవానుగా దరువులు వేస్తున్న టక్కుటక్కు చప్పుళ్ళు వినిపించేవి. అప్పుడప్పుడు కునికిపాట్లువచ్చి కర్రసుత్తి చేతిలోంచి జారిపోతూ ఉంటే, ఆ 'మృగమహారాజు' ఏ డొక్కలోనో తంతూ ఉంటే తెలివి తెచ్చుకుని లెంపలేసుకుని మరింత శ్రద్ధతో పాదపూజ చేసుకునేది ఆ జూనియర్ సుమతి. ఇలా జడ్జీగారమ్మాయి ఇరవై ఏళ్ళ పాటయినా తరించి ఉంటుంది! అన్నాళ్లై మంచం దిగకపోయినా అతనేం చెక్కుచెదరలేదుగాని, వెన్నులో ఏదో నలుపూ పోటూ ఆరంభించి అది బోన్ టీ.బీ. కింద పరిణమించింది ఆమెకి. ఆఖరికి ఆపరేషన్ బల్లే ఆపద్బంధువురాలై ఆమె కష్టాలు గట్టెక్కించింది. ఆమె వెళ్ళిపోయాక ఇక ఇక్కడ అట్టే ఉండలేకపోయారు జడ్జీ గారు. తండ్రి హఠాత్తుగా పోయినట్టు కేబిల్ అందగానే వెంటనే వచ్చివాలితే గాని ఆగలేకపోయింది ఆ పుత్రప్రాణి. తండ్రిది ఏదైనా మిగిలి ఉంటే అది గంగలో కలిపి, ఆస్తిమాత్రం అణాపైసా తేడారాకుండా ఆకాశమార్గాన తన్నుకుపోయాడు. కోదండపాణి అవస్థమాత్రం బతికుండగానే పట్టుపరుపుమీంచి ముట్టుచాపమీదికి దించేసినట్టయింది!

అతనికి తనదంటూ ఉన్న ఆస్తి ఉంటే అది తండ్రి ద్వారా సంక్రమించిన పెద్ద కాంపౌండులో ఉన్న చిన్న పెంకుటిల్లు మాత్రమే. ఇన్నాళ్ళూ అదెకిచ్చేశాడు దాన్ని. ఇప్పుడు అమ్మా బాబూ అందులో ఉన్న వాళ్ళని అని బతిమాలుకుని ఖాళీచేయించి పునః ప్రవేశం చేశాడు. చిన్నతలగడా అంతసైజు ఉన్న ఓ హోమియోపతీ 'మెటీరియా మెడికా'ని మాత్రం చంకని పెట్టుకుని సొంత బొందిని చేరుకుంది ఏభై దాటిన 'ఎల' ప్రాయంలో అతని ప్రాణి. ఎవరికొచ్చినా తనకింకా చావురాలేదు గనక, చేవకి నిజానికెప్పుడూ చావు లేనే లేదు గనక. పది కాలాలపాటు బతకడానికే నిశ్చయించుకున్నాడు కోదండం.

తనకి రోగమేలేదనీ వైద్యమే అక్కర్లేదనీ ఎప్పుడైతే పోల్చుకున్నాడో ఎదుట కనిపించిన ఎంతటి ఆరోగ్యవంతుణ్ణైనా రోగిగానే గుర్తించి, తనకి అర్థమయిన కొద్దిపాటి హోమ్యోపతీ వైద్యజ్ఞానంతో, 'ఉచిత రీతిని' వైద్య సదుపాయం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు కోదండపాణి. 'అలా రోగంలేదని కొట్టిపారెయ్యకండి మరి .... ఎంత మొండిరోగానికైనా హోమ్యోపతిలో భేషైన మందులున్నాయి. ఎంత నీరసంగా కనిపిస్తున్నారు మీరు! అశ్రద్ధచేస్తే పొద్దున్న ఆరంభించి రాత్రికి 'కొట్టేసిన' కేసులున్నాయి. అన్నీ అందరికీ తెలిసిపోతే మేం వైద్యులం ఎందుకూ?' అని ధన్వంతరికయినా దడపుట్టించేలా మాట్లడ్డం నేర్చుకున్నాడు. 'ఒడ్డూ పొడవూ ఉండి, తిన్నది అరిగి, నిద్రపడుతూంటే

సరిపోయిందా! పైకి కనపడకుండా లోపల లోపల పందికొక్కు కన్నాలుపెట్టే సంకటాలు ఎన్ని లేవని! అలా మేకపోతు గాంభీర్యం ఒలకబోస్తున్నారు గాని, మీ కళ్ళల్లోకి చూస్తే సరిగ్గా రక్తంలేదని స్పష్టంగా తెలిసిపోడంలేదూ! దీన్ని ఎనీమియా అంటారు. పాండురోగమని మనవాళ్ళు అంటారు. దీన్ని ఇంకా ఇంకా ముదరపెట్టుకుంటే ఎలా తిన్న అన్నం అలా వెళ్ళిపోతుంది. నాకేం?' అని అశ్వనీ దేవతల్ని సహా హడలగొట్టించి పారేస్తున్నాడు, రాత్రిపూట ఏదో కుట్టి ప్రొద్దుటకి ఇంత దద్దురుగా కనిపించి చూపించుకుంటే, 'కుష్టుమచ్చ ఇలాగే ఉంటుందని పుస్తకంలో చదివాను. ఎందుకైనా మంచిది. మూణ్ణెల్లు సల్ఫరు హైపాటెన్సీలో పుచ్చుకోండి, కీడెంచి మేలెంచమన్నారు' అని సలహా ఇచ్చేస్తున్నాడు. ఎంతో భయంతో ఓ స్టూడెంటు కుర్రాడు తన ఆందోళన చెబితే 'ఆడాళ్ళ దగ్గిర పడుకుంటేనే సుఖరోగాలు రావాలని ఎక్కడా లేదు తమ్ముడూ! యూరినల్స్ పరిశుభ్రంగా ఉంచుకోరు గనక, కొంచెం రేర్‌గానే అనుకో -- ఇలాంటివి వచ్చే అవకాశం ఉంది. ఈ రోగం నువ్వు భయపడుతున్నదే అని స్పష్టంగా చెప్పలేనుగాని అలా డెవలప్ అయ్యే అవకాశం మాత్రం స్పష్టంగా ఉంది. ఓ ఆరునెలలపాటు రోజుకి రెండేసి పూటల చొప్పున ఆర్నికా మింగితే తప్పేమిటి, ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దేన్ క్యూర్ గదా!' అని హెచ్చరించేస్తున్నాడు.

లేని రోగం ఉందని భ్రమ కల్పించి మందిస్తున్నాడు గనక -- వ్యాధి తగ్గకపోవడం అనే ప్రసక్తేలేదు! మొదట్లో నాటు ప్రజాహృదయంలో నాటుకుని, వేరువేరు పై వర్గాలలో కూడా క్రమంగా వేరు తన్నుకుని, పాతుగల పెద్దల దృష్టిలో కూడా డాక్టరుగా పాతుకుపోయాడు కోదండపాణి. ఎప్పుడూ పెళ్ళో, పెద్ద కర్మో అన్నట్టు కిటకిటలాడిపోయేది అతని కొంప.

ఏదో మాత్ర ఇవ్వడమే గాని ఏ మాత్రమూ డబ్బు రూపేణా వసూలు చెయ్యకపోడమే అతని కీర్తి పతాక మరింత ఫర్‌ఫర్ లాడడానికి కారణమేమో! తన కొడుక్కి కడుపు నొప్పి వస్తే అది అపెండిసైటిస్ అని పోల్చి, ఆపరేషన్ చెయ్యకుండా మందిచ్చి మళ్ళీ ఆ నొప్పిరాకుండా చేశాడే. మంగలి వెంకట్రమణ అదెలా మర్చిపోగలడు? అందుకే నెలకోసారి క్షవరం చెయ్యడమే కాకుండా వారం వారం ఒళ్ళునలిచి డాక్టరు గారికి తలంటడానికి సిద్ధపడిపోతూ ఉంటాడు. చాకలి అప్పలసూరి మరదలు వెర్రిచూపులు చూస్తుంటే అది ఒకరకమైన బ్రెయిన్ ఫీవర్‌గా నిర్ణయించి మందిచ్చి నిమిషాలమీద మళ్ళీ మామూలు మనిషిని చేశాడే, ఆ బాబు ఉపకారం ఏంచేస్తే తీరుతుంది? వాడే రోజువిడిచి రోజు ఇంటికొచ్చి పద్దు కూడా రాసుకుని, కుక్కచెవుల్లాంటి బట్టల్ని తీసి కెళ్ళి పాముమీసాలు చేసి అందిచేస్తూ ఉంటాడు. కాణీ చేతిలో పెట్టబోతే భోరున ఏడుస్తాడు. మామూలుగా వచ్చే పురుడే ఎక్కడ కష్టపడిపోతుందో అని తన ఇంటిదానికి మందిస్తే, నా ఇల్లే నిలబెట్టేరు. మీ గోడపడిపోతే చూస్తూ ఊరుకోగలనా! అని మేస్త్రీ భీమన్న సరుకుతో సామానుతో సిద్ధమై పోతాడు. అఖరికి ముక్కూ మొహం ఉన్నవాళ్ళు గనక అద్దెలేకుండా ఉండలేక, ఏవో 'వాళ్ళు తిన్న పచ్చడిమెతుకుల్లోనే' ఇంత అతగాడికి పంపుతున్నారు. ఏదో పాపం ఆ అమ్మాయి మంగా, అతనూ కూడా ఎదుటిమనిషి ఒంటరిగా బాధపడడం ఇష్టంలేని దయా సముద్రులు గనక వీలువెంబడి ఒకరి మీద కొకరు ప్రవహిస్తూ సహాయం చేసుకుంటున్నారు. వాళ్ళదీ వీళ్ళదీ ఒకే వంశం గనక, నలుగురూ వింటున్నప్పుడు మంగ అతన్ని 'పెదనాన్న గారూ!' అనే పిలుస్తుంది గనక, లోకం మరోలా అనుకునే అవకాశమేలేదు!

తనకీ విషయాలన్నీ ఎలా తెలిశాయో నేను అడగడం కూడా మరచి పోయినంత కథన శిల్పంలో ముంచి నన్ను మైమరపించి, ఆఖరిమాటగా కాశీపతి ఈవిధంగా సెలవిచ్చాడు.

'ఇంత అన్యాయం జరుగుతుంటే నువ్వు ఊరుకోకూడదు గోపీ. అందుకే నీతో చెప్పేను. ఎవరికీలేని కలంబలం నీకుంది. ఇలాంటివి పేర్లు పెట్టి ఉన్న దున్నట్టు కడిగిపారేస్తే గాని మన సంఘం బాగపడదు. ఒకరుచెపితే నేను నమ్మేవాణ్ణికానని నీకు తెలుసు. ఆ మధ్య సెకండ్ షో సినిమానుంచి ఇంటి కొస్తుంటే కాల్లో గాజుపెంకు గుచ్చుకున్నట్టయింది. ఏ సెప్టిక్ అవుతుందో ఏమిటో పోనీ మనవాళ్ళే గదా అని వాళ్ళింటి కెళ్ళేను. ఆ కిటికీ కన్నంలోంచి ఆ రాత్రి నేను చూసిన దృశ్యం ఛ, ఏమని వర్ణించను గోపీ .... మన వాడి వయస్సేమి, ఈ పనులేమి! ఇక మనం తలెత్తుకు తిరగ్గల్గుదుమా!'

కాశీపతి వెళ్ళిపోయాక ఆలోచించుకు చూసుకుంటే ఎందుకో గాని ఇందులో ఇంత పిసరు అసహజమైనదేదీ నాకు కనిపించలేదు. పైగా ఎంతో తమాషాగా ఉన్నట్టు తోచింది. ఇదంతా చెప్పి, నేనిలా అంటే వాణి ఏమంటుందో! వెంటనే వెళ్ళి చెప్పకపోతే ఎక్కడో ఏదో బరస్ట్ అయిపోతుందన్నంత ఆతృతతో ఆటోమీద హోటల్ చేరేను.

నేనింకా నోరు విప్పకుండానే ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసియిస్తూ 'ఒకటోరకం కథ విన్నాను, ఇవాళ ఒకచోట. ఎక్కడి కెళ్ళిపోయారు? ఎప్పుడది మీ చెవిన వేద్దామా అని ఎంతో ఆతృతతో చూస్తున్నాను. వింటారా?' అని నా జవాబుకేనా ఎదురుచూడకుండా ఆరంభించింది! '....అతను రిటైరయి అయిదారేళ్ళు అవుతుంది. చేసింది చిన్న ఉద్యోగమైనా, చాలా పొదుపరి అయిన భార్య ఉండడంచేతా, పుట్టిన పిల్లలందరూ బాగుండి వృద్ధిలోకి వచ్చి ఆడపిల్లలకి తేలిగ్గానూ, మొగపిల్లలకి భేషుగ్గానూ సంబంధాలు కలిసిరావడంచేతా ఆఖరాఖరికి బాగా ఆస్తిపరుడయాడు. ఇక డబ్బు విషయంలో అతని జాగర్త ఎటువంటిదంటే 'పెళ్ళానికి నగచేసి ఇచ్చినా ఆమెకు-ముట్టజెప్పే మొత్తంలో మజూరీ మినహాయించే కంసాలిభర్త' బాపతు! పెద్దకూతురూ ఆమెభర్తా ఇద్దరూ ఎడ్వకేట్లే అయి ఆ ఊళ్లోనే ప్రాక్టీసు పెట్టడంలో తనకి ఫేమిలీ హేడ్‌గా ఇవ్వవలసినంత గౌరవం ఇవ్వడంలేదేమో అనే శంకతో అసలు గొడవ ఆరంభమయింది.

పెళ్ళయిన కూతుళ్ళతో సహా ఇంటిల్లిపాదినీ చేర్చి 'దొమ్మరిముండా సంతానం నా పిల్లలు' అని అయిందానికి కానిదానికీ తిట్టిపొయ్యడం అతనికి ఎప్పట్నుంచో అలవాటయింది. అయితే అతను రిటైరు అయేదాకా ఆ నిరంకుశం ఎలా ఓర్చేరో ఓర్చి, ఆ తరవాత అతను వింటూండగానే 'ముక్కోపి ముండాకొడుకు మా బాబు' అంటూ వ్యవహరిస్తూ వచ్చారు అతని పిల్లలు. ఇలా పట్టుదలలు పెరిగిపోయి అతనొక్కడూ ఒకటీ, ఇల్లంతా ఒకటీగా తయారయారు.

అంతకుముందే రెండేళ్ళ క్రితం ఒకటోరకం ఇల్లుకట్టుకున్నారు వాళ్ళు. అతగాడి ప్రావిడెంటు ఫండుగాక - ఏనాడో ఎంతో లోనుకి లోనయింది, అదిపోను ఏం మిగిలింది గనక! - పెళ్ళాం నగలూ, ఉద్యోగాలూ చేస్తున్న కొడుకులు పంపే సొమ్ము - ఇలాంటివి చాలా కలిశాయి, ఆ ఇల్లు కొనడంలో. అప్పటికింకా ఇంతగా మాటలు మానేసేదాకా రాలేదు గనక ఇల్లు అతని పేరనే రిజిష్టరీ అయింది.

రాను రాను ముడి బిగిసింది గనక ఏడాదై ఆ యింట్లోనే ఓ పక్కగా ఔట్‌హౌస్ లాంటిది

వేయించుకున్నాడు. రెండువేల పైగా ఖర్చుపెట్టేడు, దానికి. కిచెన్ లేవేటరీ లాంటి సమస్త సదుపాయాలూ అమర్చుకున్నాడు అందులో. అంత డబ్బు అతని కెక్కడిదని అడిగితే జవాబు అంతకష్టమైంది మాత్రమేమీ కాదు. ఊరికే ఒక్కక్షణం గడపడం అతని పద్ధతికి విరుద్ధం. ఎవర్ని ఏ విధంగా పట్టుకున్నాడో రెండు ఇంగ్లీషు దినపత్రికలకి ఏజెన్సీ సంపాదించాడు. బజారులో టైప్ ఇన్‌స్టిట్యూట్ ఒకటి నడుపుతున్నాడు. ఇంగ్లీషులో బియ్యేదాకా కోచింగు ఇవ్వగలడు. ఉద్యోగం చేసే రోజుల్లో అతని రాబడి నూటయాభై అయితే ఇప్పుడు పదిహేను వందలు!

'ఏం చేసుకుంటాడుటయీ వయసులో యీడబ్బంతా?' అని ఎవరికో కాదు, అతనికే సందేహం వచ్చినట్టుంది. 'అయ్యో, యీ దిక్కుమాలిన జంఝాటనలో పడి ఇన్నేళ్లూ వృథాచేశానే!' అని మనసు చివుక్కుమనిపించినా, ఏడుస్తూ కూచునే తత్వంకాదు అతన్ది. కంటిచూపు కొంచెం తగ్గిందేమోగాని పంటిచురుకూ వంటిబిగువూ చెప్పుకోదగ్గంతగా సడలలేదంటే చూసినవాళ్లు గాని నమ్మరు; ఏమైతేఅయిందని తిండి తగ్గించి టిఫిన్లమీద పడ్డాడు. మంచి నీళ్ళ బదులు మందు సేవించడం క్రమక్రమంగా అలవాటుచేసుకున్నాడు.

ఈ విషయం చూచాయగా తెలిసినా, అపర దుర్వాసుడూ, అంత ఆస్తికీ హక్కుదారుడూ అతనేకద ఇదేమని అడగడానికి ఆ కుటుంబంలో ఎవరికి ధమ్ములున్నాయి? అదిగాక ఆ కుటుంబంలో ప్రతి వ్యక్తికీ పైకి చెప్పుకోలేని ఏదో ఒక బలహీనతలాంటిది ఉండనే ఉంది, ఇక ఏ ధైర్యంతో ప్రశ్నిస్తారు? నీతి విషయంలో నిప్పులాంటిది ఆ యింట్లో అతని యిల్లాలు ఒక్కతే! కాని ఆమెకున్న శారీరక బలహీనత మరి ఎవరికీ లేదుగద! పేరుకి బతికుంది గాని మూడేళ్లై పక్షవాతంతో మాటేనా లేకుండా మంచాన పడిఉంది. ఆమె ఏమని అడుగుతుంది. అసలిదంతా ఆమెకి ఎవరు చెప్తారని!

అతను వేరింటికాపరం ఆరంభించాక మొదట్లో పెద్దింటినుంచి రెండు పూటలా కారియర్ వెళ్లేది. ఓ రోజు కూరలో పోపు సరిగ్గా వేగలేదనీ, ఓ రోజు అన్నం గంజిపొదిగిందనీ, ఇంకో రోజు పేడచెయ్యి కడుక్కోకుండానే పనిమనిషి కారియర్ తెచ్చిందనీ రోజుకో వంకపెట్టి పదిహేనోనాటికి బంద్ చేయించేశాడు. ఆ రోజునుంచి గుంటనక్కలాంటి ఓ వంటలక్కని కుదుర్చుకుని మరింతగా స్వేచ్ఛా వాయువులు పీల్చడం ఆరంభించాడు.

ఓనాటి శుభలగ్నాన ఆ ముసలి వంటమనిషి కాలం చేసింది. ఆ తరవాత ఓరోజు జీతం పుచ్చుకోడానికి ఆ ముసల్దాని కూతురు అతని ఇంటికి వచ్చింది. అమ్మాయి పేరు రంగరాజ్యం. ఆమె మొగుణ్ణి ఏదో ఖూనీకేసులో సంబంధం ఉందని జెయిల్లో పెడితే తప్పించుకు పారిపోయాట్ట. ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా అతని ఆచూకీ తెలియలేదట.

రంగరాజ్యం అతనిఇంట్లో కాలు పెట్టిననాడు అలా చూస్తూ ఉండిపోయాడు అతను. ముసల్దాన్ని చూస్తే చుంచూ, కొరకంచూ ఇలాంటివి గుర్తుకొచ్చేవి. దీన్ని చూస్తే చాకూ, మొగలిరేకూ ఇలాంటివి గుర్తుకొస్తున్నాయి! ఇది దాని కూతురా! ఇంకా నయం ఆ ముసల్ది ఇంకొంతకాలం బతికిందికాదు! దీని మొగుణ్ణి విడిచి పెట్టేరుకాదు! అనుకున్నాడు అతను. ఇప్పుడు ఇది ఎవరి కూతురనే విషయం అంత ముఖ్యం కాదు, ఏ చీకటియింట్లో వెలుతురు?

మంచాన పడిఉన్న పెళ్ళానికేదో ద్రోహం తలపెడుతున్నానని కలలో కూడా అతను

అనుకోలేదు. ఇన్నాళ్ళూ ఈ రకం సుఖం వెతుక్కోకుండా తను తనకెంత ద్రోహం చేసుకున్నాడో గదా అని బాధ పడ్డాడు.

తాగడంతోనే తన బతుకు తాపడం చెయ్యడానికి యికముందు ఒప్పుకోలేకపోయాడు. డబ్బుకీ, సుఖానికి మొహం వాచిఉన్న రంగరాజ్యం కూడా అట్టే అడ్డు చెప్పలేదు!

వాణి మీడమీద బాల్కనీలో నిలబడితే ఆమెను గుర్తుపట్టిన మా బంధువు ఒకాయనపై కొచ్చి ఇదంతా చెప్పేడుట.

"నువ్వు వరసకి కూతుర్లాంటిదానివి కాబట్టి అర మరిక అభ్యంతరాలు లేకచెప్పేను గాని ఈ బూతు పురాణం కక్కలేక సిగ్గుతో చచ్చిపోయాననుకో. పక్కఇంట్లో గోడ ఒక్కటే అడ్డు సుమా. మనమలు, మనవరాళ్ళు, బండెడు సంసారం..... కట్టుకున్న పెళ్ళాంతో అయినా అలా తిరిగి ఎరగం, ఓ సినిమాలా, ఓ షికార్లా! లోకం ఏమనుకుంటుందో అనైనా వెరవ్వొద్దుటమ్మా? ఇంతకీ కట్టుకున్న పెళ్ళాం ననుకుందో ఏమిటో ఆ దిక్కుమాలిన ముండ. మా పక్కింటి సూపర్‌వైజరు గారి అమ్మాయితో, దాని యీడుదేలే, చెబుతుందిట 'ఈ మధ్య ఆయనకి ఉన్నట్టుండి వెర్రిజ్వరం వచ్చేసిందొసే. తగ్గేదాకా నాకు మతిలేదనుకో. నా పసుపూ కుంకుమా నిలబెట్టు తండ్రీ అని నేను మొక్కని దైవం లేదంటే నమ్ము' అనీ. బాగుందా?"

మేడమెట్లదాకా అతన్ని సాగనంపడానికి వచ్చిన వాణితో ఆఖరిమాటగా అతను అంటాడుట.

'చూడమ్మాయీ, నేను చెప్పినదంతా గుర్తుంచుకున్నావుకదా? ఇదంతా ఉన్నదున్నట్టు ఏదైనా పత్రికకి పంపమని నీ మొగుడికి చెప్పు. వీళ్ళ బండారం బైటపెట్టించి యిప్పటికైనా వీళ్ళ ఆట కట్టించండి. ఆస్తంతా అతనిపేర ఉంది. ఎక్కడ ఆ రంగరాజ్యం పేర పెట్టేస్తాడో అని పైకి కక్కలేక కుటుంబమంతా కుత కుత ఉడికిపోతున్నారు. ఎలాగైనా ఇది రచ్చకీడ్చి వీళ్ళ అమానుషం ఆపించండి. ఇక నే వెడతా! అన్నట్టు ఆ నీతిబాహ్యుడి పేరు నీకు చెప్పనేలేదు కదూ! కాశీపతి ... మావాడికి వరసకి మామయ్య అవుతాడు. ఇక నా సంగతా? కోదండం బాబాయి అని చెప్తే చాలు మావాడికి అర్థమౌతుంది' అని వెళ్ళిపోయాట్ట. ఆ పేర్లు చెవిలో పడీపడగానే కొన్ని నిమిషాలపాటు నాకు భూమ్యాకాశాలు అనలేదు.... అర్థమయింతర్వాత నవ్వాగలేదు.... జరిగిందంతా వాణికి చెప్పడానికి కొంత టైం పట్టింది.

'దసరా సచ్చినోడు' మాటలు నేను కాకపోతే మరొకరు రాస్తారు అది ఎవరు రాసినా ఒకటే కనక 'రాయమని మమ్మడగవలెనా, మాని బతుకుట సాధ్యమా?' అని వాడవాడలా కలం చేత్తో పట్టుకోగలిగిన కవులూ, కవయిత్రులూ సినిమా ఛాన్సుకోసం కలవరిస్తున్నారు. గనక. కాని ఇంతటి అసాధారణపు కథలు వినే ఛాన్సు మాత్రం అందరికీ దొరకదు. మనం తప్పించుకుందామని చూసినా ఎంత హుషారైన కథలు చెవిన వేసిపోయారు మన బంధువులు!'

'మన బంధువులు, ఏమిటి! మా బంధువులు అనండి. అర్వై యేళ్ళ వయస్సులో ఆ పాడుబుద్ధి ఏమిటో తలుచుకోడానికే సిగ్గుగా అసహ్యంగా ఉంది. దాన్ని మీరు వెనకేసుకు రావడం ఒకటా? ఛీఛీ ! మా చిన్నాన్న వరసైన దామోదరం కూడా ఈ ఊళ్ళోనే ఉన్నాడు. వీళ్ళ కంటె ఏ అయిదేళ్ళో చిన్నేమో కూడాను. ఇర్వై ఏళ్ళై మా పిన్నిపోయింది. చూసుకు బతకడానికి మళ్ళీ యేం పిల్లా పాపా?

ఏళ్ళతరబడి మంచిముత్యంలా రోజులు గడుపుకు వస్తున్నాడు. ఇలాంటి వెధవ బుద్ధులు మాటవరసకైనా అతని దగ్గర ఎరుగుదుమా అందరూ ఒకలాగే ఉంటారా!' 'అందరూ ఒకలాగే ఉంటారో లేదో నాకు తెలీదుగాని మీ దామోదరం గారి సంగతిమాత్రం బాగా ఎరుగుదును! ఫేమిలీ ప్లేనింగ్ మంత్రిగా గవర్నమెంటు అతన్నింకా ఎందుకు గుర్తించదో నాకు బోధపడ్డంలేదు!' అని అనుకోకుండా జోక్‌వేసేసి నాలిక కరుచుకున్నాను.

'ఏమిటీ అర్థంలేనిమాటలు - ఆయన గురించి మీకేం తెలుసు?'

'ఈ సెక్సు అనేది పైకి ప్రదర్శించడంలో కొందరికి అవకాశం ఉంటుంది. కొందరికి ఉండదు. మానసికంగా మాత్రం ఎవరైనా ఒకటే అనిపిస్తుంది. మీ దామోదరంగారు కూడా తక్కువవాడని నేననుకోను. ఫిజికల్‌గా ఆయనకి కుదర్లేదు. అంతే! మన ఫేమిలీ డాక్టరు జోసెఫ్ లేడూ ఆయనే ఓసారి చెప్పేడు ఏదో మాటలో మాటొచ్చి, అతను మన రిలేషన్ అని తెలీక! ఇందాక ఫేమిలీ ప్లేనింగ్ విషయంలో అతన్నెందుకు రిఫర్ చేశానంటే అతని ద్వారా ఇక సంసారం విస్తరించే ప్రమాదం లేదు గనక. మీ దామోదరంగారు ఇంపొటెంట్ అని జోసెఫ్ చెప్పాడు గనక!' వాణి తేరుకోడానికి మళ్ళీ కొంత టైంపట్టినట్టుంది. మా సంభాషణ మరోసారి మా తొలి కథా నాయకులమీదకు మళ్ళింది.

'అయితే వీళ్ళిద్దర్లోనూ ఏ తప్పూ మీకు కనబడలేదా? వాళ్ళు చేస్తున్న పనే ఎదుటివాడు చేస్తూంటే అంత ఏడుపు దేనికి?'

'అది అతి సహజమైన మానసిక బలహీనత. వాళ్ళ ఎంటర్‌ప్రైజింగ్ స్పిరిట్‌తో పోల్చి చూసినప్పుడు యీ వీక్నెస్‌ని ఇగ్నోర్ చెయ్యొచ్చు. పుట్టిన ప్రతి మనిషికీ సుఖపడే హక్కుంది. అదెప్పుడు గుర్తిస్తారో ఎలా నిర్ణయించుకుంటారో అది వారి వారి వ్యక్తిగత విషయం. మనలో మన మాట. ఇది మనకిమాత్రం ఏమైనా తక్కువ పాళ్ళలో ఉందనా?' అని స్వరం తగ్గించి, కళ్ళల్లో కళ్ళుపెట్టి చూస్తూ అన్నాను.

'ఏది?'

ఎలా చెప్పాలో బోధపడక చూస్తూంటే ఎదుటి సినిమాహాలు ముందు ఎలక్ట్రిక్ పోల్‌కి వేలాడుతున్న బోర్డు ఆప్తమిత్రుడిలా కనిపించింది. నేను కావాలని మా గదివైపు చూపిస్తూ చదివాను. 'ఇక్కడ దినసరి రాత్రి ఆటలు గాక శనాదివారములు విధిగా మ్యాటనీలు వేయబడును.'

'ఛ, ఏంపోకిరీ మేళం బాబూ!' అంటూ ఫోం బెడ్‌మీదకి పరిగెట్టింది వాణి. ఆ మాటతోనే, ఆ నడకలోనే, ఫోర్సుతో నన్ను ఆహ్వానిస్తూ

*(యువ దీపావళి ప్రత్యేక సంచిక)*





# ఎవడేం చేసి పోతాడో ఏమో ?

47



**ప్రతి** కత్తికీ రెండు పక్కలా పదును గల అంచులు వుండకపోవచ్చును గాని ప్రతీ వాదనకీ ఇరుపక్షాలూ ఉండి తీరతాయి. అందులో వాదించేవారు కక్షతోనూ కవ్వింపుతోనూ కాక అనుభవంతో పాటు హాస్యం కూడా కలగలిపి పాల్గొంటే, ముఖ్యంగా ఏ మాత్రం తనకు తగిలినా ఉడుక్కోకుండా తేలిగ్గా తీసుకుంటే, చర్చ గొప్ప రసవత్తరంగా ఉంటుంది వినడానికి. ఓ ఆదివారం మధ్యాన్నం భోంచేసి ఇలా కన్ను మూశానో లేదో ఇలాంటిదే ఒకటి వినపడి విసుక్కుంటూ లేచిపోయాను. అలా అప్పుడు విసుక్కున్నందుకు ఇప్పుడు విసుక్కుంటుంది నా మనసు. నిద్ర సుఖమేగాని అంత కంటె సుఖం అందించేవి జీవితంలో మరికొన్ని లేకపోలేదు మరి!

ఇక్కడ ఇంకోటి చెప్పాలి మీకు.. వాదించుకున్నప్పుడు వయో భేదాలు పాటించడం మా ఇంట్లో అలవాటు లేదు. బొత్తిగా పది పన్నెండేళ్ల గుంటలకయితే అవకాశం యివ్వంగాని పద్దెనిమిదేళ్ల చెల్లాయి అయినా అరవై అయిదేళ్ల తాతతో ఢీ అంటే ఢీ అనడానికి పర్మిషను ఉంది. ఇక్కడే మాట్లాడుకోవాలి అనే నిబంధనని కూడా మేం లక్ష్యపెట్టం. సినిమా హాలయినా రైల్వే ప్లాట్‌ఫాం

అయినా ఆఖరికి ఆ రైలు పెట్టయినా మాకొకటే. అది మా ఇంట్లోనే అయితే మాకు అడ్డేముంది? మా యింటి కొచ్చిన కోడళ్లూ అల్లుళ్లూ కూడా మాకంటె ఒకాకు యీ విద్యలో ఎక్కువ చదువుకున్న వాళ్లే. పైవాళ్లు వింటే 'ఈ కుటుంబ సభ్యులు ఇరవై నాలుగ్గంటలూ కొట్టుకుచస్తున్నారేమో' అనుకుంటారని ఒకప్పుడు సిగ్గుపడినా 'ఇంత ఫ్రీగా నిస్సంకోచంగా ఎందరు డిస్కస్‌చేసుకో గలరు గనుక!' అనే తృప్తిలో ఎంతో గర్వం కలుగుతూ ఉంటుంది నాకు.

"ఈ రణగణ ధ్వనిలో నిద్ర కూడా ఏమిటి? అయినా ఇంతటి ముఖ్య సమస్య మీద చర్చ జరుగుతూంటే మొద్దు నిద్రకి ఎవడికి మాత్రం హక్కు ఉంది? రవణగాడ్ని నువ్వు తీసుకు వస్తావా, పిలక పట్టుకు నేను లేపుకు రానా?" అని మా చిన్న బావ చిన్నక్కని బయలుదేరదీస్తూంటే

"అంత అవసరం లేదు లేవోయ్, నేనే వస్తున్నాను. మీరు పడుకుంటారా, ఒకర్ని పడుకోనిస్తారా? తిన్నది అరక్క పోతే లోకంలోని 'అన్ని భోగట్టాలూ మనవే' అని కోపం నటిస్తూ, లుంగీ సవరించుకుంటూ ఉయ్యాల బల్ల మీదున్న మా అమ్మని జరగమని అక్కడ బైఠాయించాను నేను.

'ఎవరి గొడవో అయితే మన కెందుకురా, ఇవాళ మన పద్మకి పొద్దున్నే స్పెషల్ క్లాసు ఉందికదా, వెళ్లొస్తుంటే ఏమైందో తెలుసా? వాడు వినేలేదు కాబోలు. ఏమైందో చెప్పవే' అమ్మ చిన్నతల్లి వైపు చూసింది. అదింకా చెప్పేలోగా మా పెద్ద బావ ఓ చురక అంటించాడు.

"అంతగా అలంకరించుకుని వెడితే ఏమైనా అవుతుంది మరి!" ఇంతకీ ఇక్కడో ఫామిలీ జోక్ చెప్పాలి. పెద్ద బావ పెళ్ళి చూపులకి వచ్చినప్పుడు 'ఏమోయ్ పెళ్ళి కూతురు నచ్చినట్టేనా?' అని అడిగారట. ఈ మాటకి అతను జవాబు చెప్పేలోగా అక్కడున్న ఆనాటి ఎనిమిదేళ్ల మా చెల్లాయి పద్మ 'నాకు మాత్రం పెళ్లి కొడుకు బాగా నచ్చాడు సుమా!' అందట! అప్పుడు బతికున్న మా మామ్మ 'అలాగటే భడవ కానా! ముహూర్తందాకా ఆగుతావా, ఈ రాత్రికే పుస్తి ముడుపు ఏర్పాటు చెయ్యమన్నావా?' వేసిన మరో జోకు కూడా ఇప్పటికీ ఫ్రెష్‌గా మేం చెప్పుకుంటూ ఉంటాం. అప్పటి చిట్టిలక లాంటి మా పద్మ యీ పదేళ్లలో సినీనటి రేఖనిమించి తయారైంది. పెద్దబావ ఆ మాట అనలేదు గాని దాన్ని వెంటబెట్టకు పోవని వారిది తప్పు అని ఎవరికైనా అనిపిస్తూ ఉంటుంది.

'నీ చెల్లెలయితే ఇలాగే అంటావా బావా?' అని ఎదురు ప్రశ్న వేసింది పద్మ, కొంటె తనానికో నిజంగానో మరి!

"అనను. ఏంచేస్తానో ఏమీ అనుకోపోతే చెబుతాను." "దాన్ని అక్షరాలా అమలు చెయ్యమంటే కష్టంగాని నీ అభిప్రాయం వినడానికి మాకేం అభ్యంతరముంటుంది? దాని మీద మాకు ఎవరికి తోచింది వారు ఎలాగా అనుకుంటాం. సొంతబుద్ధీ, తనకంటూ ఓ వ్యక్తిత్వం ఉన్న మనిషి అలా అనుకోకుండా ఉండలేడు కదా! అలా అనుకోమని ముందుహామీ ఎలా యివ్వగలమయ్యా అల్లుడూ!' అన్న నాన్నమాటకి మా పెద్దబావతో సహా అందరం నవ్వుకున్నాం. చర్చ అనేది హద్దులు దాటి ఉద్రేకాలు పెరిగిపోకుండా ఎప్పటికప్పుడు కళ్లెం చేత్తో పట్టుకునే నాన్న అంటే అందుకనే అందరికీ అంత గౌరవం 'చెప్పేదేదో అతన్ని చెప్పనివ్వకుండా మీ రెందుకంట?' అని అమ్మ విసుక్కుంది. పెద్ద బావ కొనసాగించాడు. 'పద్మకీ నాకూ పదిహేనేళ్లు తక్కువ తేడాలేదు. నా వంతుకి నాకు ముగ్గురు ఆడపిల్లలు కలగనే కలిగారు ఇవాళ యిలానే పొద్దుట నిద్ర లేచేసరికి పుస్తకాలు పట్టుకుని ప్రైవేటు క్లాసంటూ పద్మ ఎదురు పడితే నాకే ముచ్చెమటలు పోశాయి మరి' 'ఆ మాటలు నలుగురిలో

చెప్పుకోడానికి సిగ్గెంత లేకపోయిందో!" అంటూ పెద్దక్క మొగుణ్ణి తగులుకోకపోతే నాన్న వారిస్తూ 'నలుగురిలో.నిజం చెప్పలేకపోతే సిగ్గు పడాలి గాని చెప్పగలిగినందుకు సిగ్గెందుకే, గర్వపడాలి గాని. ఇంతకీ పద్మ అడిగిన ప్రశ్నకి నీ జబాబేమిటోయ్!' అని బావ వైపు చూశాడు. 'మా చెల్లయినా మరొకరి చెల్లెలయినా మరీ పది మందిని ఆకర్షించేలా సింగారించుకోవడం తప్పు మామగారూ!....' పెద్దబావ చెప్పేది చెప్పనివ్వకుండా పక్కగదిలోంచి వదిన హఠాత్తుగా వచ్చి ఆటకాయించింది. ఇలాంటి ఇంటి డెబేట్స్ అంటే ఆవిడకు వళ్ళుమంట. సాధారణంగా గది తలుపులు దగ్గరగా వేసుకుని ఏ ఇంగ్లీషు నవలో పట్టుకు కూచుంటుంది. వచ్చిందంటే చాలా ఖచ్చితంగా వాదిస్తుంది.

"ఇందాకట్నుంచీ వింటున్నాను. ఇవాళ మీ ధోరణి మరీ అన్యాయంగా ఉంది. అన్నయ్యగారూ చదువుకున్న పిల్ల కాలేజికి వెడుతూంటే నీట్‌గా ముస్తాబై వెళ్ళక విజయనగరం రథయాత్రలో అమ్మిన పేడ బొమ్మలా- అవతరించిన అప్పలమ్మలా వెళ్లాలనాతమరి ఉద్దేశం? మీకేం ముగ్గురు ఆడ పిల్లల్ని కాదు, ముప్ఫై మంది మనవల్ని ఎత్తుకున్నా రూపాయికి రెండిచ్చినా దొరకని అప్పుడు కోసిన మొక్కజొన్న పొత్తులా ఉండగలరు. ప్రకృతి పక్షపాత బుద్ధి వహించిన ఆడకూతుళ్లం. నేను మా పెద్ద వదినా రెండు మూడు కానుపులకే సాయంకాలం చవకగా అమ్మబడే పావలాకి అయిదు రకం జామపళ్ళలా ఎలా తయారయామో చూడండి. ఆడదాని ఒంటిమీద ఏ అందచందాలు నిలిచినా పెళ్ళయి పిల్లలు పుట్టేవరకే. ఆ నాలుగు రోజుల పాటయినా పాపం వాళ్ళని ముచ్చట తీరా అలంకరించుకోనీండి" అని నాలుగూ గబగబా అనేసి తన గదిలోకి వచ్చినట్టే వెళ్ళిపోయింది. కాస్సేపు హాల్లో ఎవరూ వూహించని నిశ్శబ్దం రాజ్యమేలింది. ఈలోగా ఎప్పుడు పెళ్ళి వచ్చిందో మా సుబ్బులత్త పెద్ద గిన్నెతో కాఫీ పట్టుకొచ్చింది. అది అందరికీ కూచున్న చోటికి అందించడంలో మా చెల్లెళ్లిద్దరూ సాయం చేశారు. ఆ కార్యక్రమం పూర్తికానిచ్చి, "మినప్పప్పు నానబోశాను. ఇక్కడ కబుర్లు చెబుతూకూచుంటే అక్కడ దాన్ని రుబ్బేదెవరు;? అని అమ్మ లేచినిలబడింది. ఆ చర్చ అక్కడితో చప్పగా ఆగిపోడం నాకే నచ్చలేదు.

"వెదుదువుగాని కూచోవే.... ఇప్పుడే కదా కాఫీలు తాగేం.... అయినా ఇవాళ పద్మకి ఏం జరిగిందో సరిగ్గా చెప్పనేలేదు? మళ్ళీ ఆ మోహన్ గాడేనా అల్లరిపెట్టింది." అని అడుగుతూ తర్కానికి మరోసారి అందర్నీ తయారు చేశాను. అనుకోకుండా నాకు మా చిన్నక్క సపోర్టిచ్చింది. "నీలోక జ్ఞానానికీ వాదనా పటిమకీ ఎప్పుడూ పై చెయ్యి నీదిగా ఉండేదిగాని బావా, ఈ సారి మాత్రం ఎత్తుగడలోనే చిత్తు చిత్తు అయిపోయావు. ఆడపిల్లల్ని అల్లరిచేసేందుకు ప్రోత్సాహం యిచ్చేటంతగా ఎందుకు అలంకరించుకోవాలని టీనేజ్ గర్ల్సని తప్పు పట్టడంలోనే ఉంది నీ వాదనలో బలహీనత అంతా. మగాడి దుర్మార్గానికి ఆడాళ్లేకాదు మగాళ్లు కూడా మండిపడి పోతున్న రోజులివి. ఏరోజు ఏ పేపర్లో చూసినా మానభంగం కేసులే. ఇంతగా స్త్రీ జాతికి సానుభూతి లభిస్తున్న యీ రోజుల్లో కూడా నువ్వు వాళ్లనే తప్పుపట్టడం ఎందుకు?"

"ఎందుకా? గాలి వాటుకి దిశమార్చే గాలికోడిని కాదు గనకే" సెభాష్ అని చప్పట్లు కొడుతున్న మా నాన్నతో నేనూ చిన్న బావా కూడా చేతులు కలిపాం.

చిన్నక్క నిలగేసినందుకు కుంగిపోనూ లేదు. మా ప్రోత్సాహానికి పొంగిపోనూ లేదు. తన విశ్వాసమే తన వ్యక్తిత్వమే తనకు తోడుగా నిండు గంభీరస్వరంతో పెద్దబావ మొదలెట్టేడు. అతనికేదైనా

కాస్త ఉత్సాహం కలిగించే విషయం ఉందంటే అది ఆ వేళకి వదిన ఎదురుగా వచ్చికూచోడమే, మా చిన్నక్క ఎదురుగా సంబోధిస్తూ పెద్ద బావ ఆరంభించాడు.

"ఇంతగా స్త్రీ జాతికి సానుభూతి లభిస్తున్న ఈ రోజుల్లో కూడా...... అని కదూ పార్వతీ నువ్వు అన్నావ్? అదేం సంతోషించవలసిన విషయమా. ఒకరు తనని చూసి జాలీ, సానుభూతీ చూపవలసిన స్థితిలో ఉండడం స్త్రీ జాతికేం గౌరవప్రదం పద్మా? స్త్రీకి పురుషుడేమైనా ప్రేమ అంటూ చూపించగలిగితే అది ఆమె తనను తను రక్షించుకొనేలా, తనకు తానుగా ఓ వ్యక్తిత్వం రూపుదిద్దుకొనేలా దోహదం చెయ్యడం. అదిగాక యీ ఏడు జరిగిన మానభంగాలు లెక్కెట్టుకుంటే మీదటికి రెట్టింపు ఆయేలా కేసులు రిపోర్టు అవుతున్నాయి. ఈ సంఖ్య వల్ల, బాల్చీల కొద్దీ కురిపించిన ఖద్దరు లాల్చీగాళ్ళ సానుభూతి వల్ల, సభల వల్ల, సినిమాల వల్ల సీరియల్ నవలల వల్ల దేశంలో వ్యాపార దృష్టి అపారంగా పెరిగిందిగాని స్త్రీ జాతికేం ఒరిగిందీ? ఇంతకీ మానభంగం అనేది జేబులు కత్తిరించడంలా ఏకపాత్రాభినయం కాదు, అందులో ఇద్దరు పాల్గొని ఉండాలి."

ఈసారి వదిన చర్రున లేచింది.

"మీ మొగ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు అన్నగారూ, ఇంకా ఉపన్యసించి మీరు తీర్పు యిచ్చింది ఇదా. మదించిన ఓ మగపశువు అప్పుడే పూసిన పువ్వులాంటి ఓ అమాయకురాల్ని 'రేప్' చేస్తే ఇద్దరూ సమానంగా దోషులే అనా తమరి నిర్ణయం? ఇంతకంటె పక్షపాత బుద్ధి ఉంటుందా?'
'

"చూడు చెల్లెమ్మా, ఇందాక అనేదేదో అనేసి మరి నా జవాబుకి ఎదురు చూడకుండా భళ్ళని తలుపు వేసేసుకున్నావు. ఇప్పుడు నీ మటుకు నువ్వు ఎదురుగా వచ్చి కూచున్నావు. మళ్ళీలేచి నిలబడ్డావు. కదిలావా, చెయ్యి పట్టుకు కూచో బెట్టి మరీ చెబుతాను యీసారి. ఇందాక ఎన్నాళ్ళయినా మగాడి రూపురేఖలు నిలబడతాయనీ, ఆడదాని అందం కానుపులతో చెడిపోదుందని అది ప్రకృతి ప్రసాదించిన పక్షపాత బుద్ధి అనీ చెప్పావు. ఇప్పుడు నాది పక్షపాత బుద్ధి అంటున్నావు. పోనీ ఒప్పుకుందాం. ఇప్పుడిప్పుడు నువ్వు ఉదహరించిన మాటల్లోనే, ఉపయోగించిన పోలికల్లోనే, పురుషుణ్ణి పదికాలాల పాటు బతికే బలమైన పశువుగానూ, స్త్రీని ఈ రోజు వికసిస్తే రేపు వాడిపోయే పువ్వుగానూ చిత్రించావు. స్త్రీ జాతి మీదే స్త్రీ జాతికింత చిన్న చూపు దేనికి?"

"అది చిన్న చూపు కాదు అన్నగారూ, ఉన్న విషయం చెప్పడం. పురుషుని పశు ప్రకృతి అమాయక స్త్రీ ప్రకృతిని బలితీసుకున్న దోషంలో ఇద్దర్నీ సమనేరస్తులుగా నిర్ణయించే మీ అవకతవకని బయటపెట్టడం."

"ఈ సంగతి నేను చెప్పింది కాదు చెల్లెమ్మా, శరీర నిర్మాణ శాస్త్రం చెబుతోంది. తాగించిగాని, మత్తుమందు ఇచ్చిగాని, ఇతరుల సాయంతోగాని మరే ఉపాయల వల్లనైనా గాని ఓ పురుషుడు ఓ స్త్రీని లొంగదీసుకోగలడేమో గాని, వయస్సుకు తగిన శారీరక మానసిక ఎదుగుదలా ఆరోగ్యమూ ఉన్న ఏ స్త్రీనైనా ఆమె సహకరించందే పురుషుడు ఆక్రమించుకోలేడు సుమా!"

వదిన రెండు చెవులు మూసుకుంది.

"మరీ ఇంతటి అసభ్య ప్రచారమా అన్నయ్యగారూ!" అంటే ఈసారి నాన్నే కలుగజేసుకున్నారు.

"మనకు తెలీనివన్నీ అలాగే అనిపిస్తాయి గౌరీ! ఇంత వయసు వచ్చినా నాకే మొన్న

మొన్నటిదాకా యీ సంగతి తెలీదు. ఆ మధ్య ఏదో రిఫరెన్స్ కావలసి వచ్చి యీ విషయమై ఓ స్టాండర్డు బుక్ తీసి చూశాను. పెద్దల్లుడు చెప్పింది నిజమే" "ఏమయినా మీరూ...."

"మొగాళ్ళే కదా అను, తప్పులేదు.... మనింటి ఎదురుగా ఎవరో లేడీ డాక్టరు అద్దెకు దిగిందని విన్నాను. ఈసారి నువ్వూ మీ అత్తయ్యా వెళ్ళి వెరిఫై చేసుకురండి."

అనే నాన్న మాటకి అందరం నవ్వేశాం వదినా పద్మలతో సహా. "ఇంతకీ అన్నగారు చిన్న మరదలికిచ్చే సందేశం ఏమిటో బోధపడలేదు" అని మరో మారు పురెక్కించాడు చిన్న బావ. "ఇంతకీ చెప్తేనా, ఏంరా రవణా?" అని మా చిన్నక్క అంటే "అదేమో" అన్నాను నేను.

"నేను హడావిడిగా తిరగిరావడంచూసి ఏదో జరిగి ఉంటుందని అమ్మ కంగారు పడిందిగాని అసలు ఏమీ జరగందే" అనే పద్మ జవాబుతో మరోసారి నవ్వులతో హాలంతా మార్మోగిపోయింది.

"అదేమిటే మధ్యని నన్నా ఆటలు పట్టించేది? వెళ్లినదానివి వెళ్లినట్టే తిరిగొచ్చేశావు కదా బెదురు చూపులూ నువ్వూ అప్పుడే అడుగుదామనుకున్నానుగాని మీ నాన్న ఎందుకో కేకేస్తే ఆ హడావిడలో పడి మరచేపోయాను. ఏమీ జరక్కపోతే ఒగుర్చుకుంటూ ఎందుకు తిరిగొస్తావు?" "చెప్పవే చెల్లీ, ఎందుకు దాస్తావు?" అని నిలదీసింది చిన్నక్క "ఏంలేదంటే నమ్మరేం? ఏ కొంచెమైనా జరిగిందీ అంటే, ఆట్టే మాట్లాడితే దానికి నీ సుపుత్రుడు బాబ్జిగాడే కారకుడు" అని జరిగింది వివరించింది పద్మ.

చిన్నక్క ఏకైక పుత్రరత్నం ముద్దుపేరు బాబ్జి. ఎనిమిదేళ్ళ గడుగ్గాయి. తనతో రోజూ కాలేజీకి వచ్చే పక్కింటి లక్ష్మీకాంతం వాళ్లమ్మ యింట్లోకి రానికారణంచేత ఆ పూట ప్రైవేటు క్లాసుకి రానందిట. పద్మ ఒక్కర్తీ వెళ్లలేక బాబ్జిగాణ్ణి కాలేజీకి దిగబెట్టమందిట. అర్ధరూపాయి లంచం ఇస్తే వస్తానని వాడు ఒప్పుకున్నాట్ట. రెండు పావలాలు పట్టుకుని బాబ్జితో బయలు దేరిందిట పద్మ. ఇంచుమించు సగందూరం ఇచ్చాక సగమయినా చేతిలో పడితేగాని ముందుకి సాగనన్నాడుట బాబ్జి. పద్మ ఓ పావలా వాడి చేతలో పెట్టింది. పొరపాటున అది చెల్లని సత్తుపావలాట. "మంచిది ఇదిగో తీసుకో.... అక్కడి కెళ్ళాక ఎవర్నైనా అడిగియిస్తాను" అని పద్మ ఎంత చెప్పినా వాడు నమ్మలేదు. "కావాలనే, నాకు అంటగట్టాలనే సత్తుపావలా పట్టుకున్నావు. ఇంకా నయం మధ్యలో చూసుకున్నాను. ఇంకా నిన్నెవడు నమ్ముతాడే సత్తురాచ్చిప్పలా మొహం నువ్వూనూ" అని అక్కణ్ణుంచే యింటికి పరుగుచ్చుకున్నాడు. వాణ్ణి అనుసరించక తప్పలేదుట పద్మకి!

అంతవరకూ జరిగిన సీరియస్ డిస్కషన్ అందరూ మరిచిపోయి, అవాళ పొద్దుట జరిగిన సరదా సంఘటన పదే పదే తలుచుకుని నవ్వుకోడంలో పడిపోయారు.

"అదేం పెదబావా యింకా సీరియస్ గానే ఉందేం నీ మొహం?" అని పద్మ అడిగింది. మేమందరం తెల్లబోయి అటుచూశాం "అవును నిన్ను చూస్తే నాకు నాకు ఒళ్ళు మండిపోతోంది"

"అదేం నేనేం చేశాను?" అంది పద్మ అర్థంకాక.

"గజ్జెల గుర్రంలా ఎదిగావు. గవ్వంత వ్యక్తిత్వంకూడా పెంచుకోలేకపోయావు. నిండా చూస్తే అరమైలులేదు మీ కాలేజీ. పట్టపగలు ఆ మాత్రం దూరం వెళ్ళి రాడానికి నీకో సాయంకావాలా. ఎనిమిదేళ్ల గుంట వెధవని తోడు తీసుకెళ్ళేవా లంచంఇచ్చి? పోనీ మీ చిన్నన్న కొడుకు పదినెలల బాడీగార్డుని ఎత్తుకుని వెళ్ళలేకపోయావా? ఏదైనా మొగసాయంకదా కావలసింది. ఇంతగా ఆధారపడి

బతుకుతూ ఉంటే మీది తప్పా, మిమ్మల్ని ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్న మా మొగజాతిది తప్పా?"

జవాబు చెప్పలేక, ఓటమి ఒప్పుకునే ధైర్యంలేక, మా వదిన ఇంకొకరు అడ్డుపెట్టేలోగానే పక్కగదిలోకి తప్పుకుంది.

మా పెద్దక్క ఆఖరమ్మాయి నిద్రలేచి అల్లరి పెడుతూంటే సముదాయించడానికి వెళ్ళిన పెద్దక్కతోపాటు అమ్మకూడా లేచిపోయింది. ఇంట్లో కావలసిన సరుకులు తేడానికి కాబోలు సంచీ తీసుకుని మా నాన్న మా ముందునుంచే వెళ్ళిపోయారు. ఏదో పండుగ ధర్మమా అని ఇంతమందిమీ కలిశాం. ఇంతకీ శలవు దొరక్క మా అన్నయ్య రాలేకపోవడం అనే వెలితి ఉండనే ఉంది. చెప్పొచ్చేదేమిటంటే ఆ రోజు పంచాయితీ ఆఖర్న మేం అయిదారుగురం మిగిలాం. పెద్ద బావలో ఎంతో కొంత ఉపన్యాస ధోరణి ఉంటే ఉందిగాని అతని మాటల్లో ఓ ప్రత్యేకమైన ఆకర్షణ ఉంది. కేవలం తనూ తన పిల్లలూ అని కాక సమస్త మానవ ప్రగతికీ అతనుచేసే నూతనమైన సూచనలు ఎన్ని విన్నానాకింకా వినాలనే ఉంటుంది. ఇంతకీ అతను పలికిన సుదీర్ఘమైన భరతవాక్యం ఇదీ.

"నా ఆవేదన ఒక్క పద్మని చూసేకాదు. ఆ వయసు ఆడపిల్లలు ఇంచుమించు అందరూ అలాగే ఉన్నారు. మేకప్ చేసుకోడానికే ఎక్కళ్లేని టైమూ చాలనప్పుడు వ్యక్తిత్వం రూపుదిద్దుకోడానికిక ఏం మిగులుతుంది? ఆడపిల్లల్తో పోటీపడి అంతకంటె ఆడంబరంగా తయారయ్యే మొగ స్టూడెంట్స్ లేరా అంటే ఉన్నారు.అదిగాక ఈ అవధులు దాటిన అలంకరణ ప్రియత్వం చచ్చేదాకా ఆడదాన్ని వదిలి పెట్టకపోడం మరో దురదృష్టకర విషయం. ఇంకా, ఇంతగా ఆడది ఎదిగిందని మనం చెప్పుకుంటున్న యీ రోజుల్లో కూడా శ్రావణ మాసంలో ఓ పావుతులం బంగారం, పెద్ద పండుగకి ఓ పట్టుచీరా ప్రతియేటా కొని యివ్వగల భర్తల్ని మాత్రమే భార్యలు దైవసమానంగా భావించడం ఘోరం! పెంపుడు కుక్కకి ఓ బిస్కట్ ముక్కలా మొగుడు పెళ్లానికి ముట్టచెప్పి తక్కిన తొంభై తొమ్మిది పాళ్ళ జీవితం తనకి తను వేరుగా ఎంజాయ్ చేస్తున్నాడని ఈ అమాయకురాళ్ళు ఎప్పటికి గ్రహిస్తారు? ఓ శుభ్రమైన చీర కట్టుకుని ఓ ఖరీదైన నగ పెట్టుకునేసరికి ఎక్కడిలేని వ్యక్తిత్వం తనకి వచ్చి పడిందని ఏ ఆడదైనా పగటికలలు కంటే అంతకంటె తప్పుదారి ఉంటుందా? నేనోమాట అంటే సమస్త స్త్రీ జాతి నా మీద ఒంటికాలిమీద లేస్తారు. అయినా వాళ్ళ క్షేమంకోరి ఆ మాట అనకమానను. కట్టుకున్న చీరతో జాకెట్ మేచింగ్ కుదిరిందో చూసుకోడంలోనే స్త్రీ జన్మ సార్థకత ఇమిడిఉందని భావిస్తున్నారు.

కట్టుకున్న భర్తతో తమ బతుకు మేచింగ్ అయిందో లేదో చూసుకోవడం అంతకంటె ముఖ్యం కాదంటారా? చదువులో సంపాదించడంలో, ఆటపాటల్లో, జ్ఞానాభివృద్ధిలో వీటిలో కాదా ఆడది మొగాడితో సమాన స్థాయి నిలబెట్టుకో వలసింది? మొగాడు కనిపిస్తే తలుపు పక్కని నిలబడి మాట్లాడే అమ్మమ్మల కాలం వెళ్ళిపోయింది. సమస్త జాతినీ తలుపుసందున నొక్కి ఓ ఆడదే పాలించే కాలం వచ్చింది. అయినా ఆడాళ్లు ఏం ఎదిగారు. మొగాళ్ల గడుసుదనాన్ని ఏం ఎదిరించారు? నాటికీ నేటికీ నోములూ, వ్రతాలూ, మొక్కులూ పేరంటాలూ మూడొంతులు ఆడాళ్ళవే..... పిల్లల్ని కనిపెంచమని ప్రకృతి విధించిందని అనుకుందాం. మరీ ఇవన్నీ ఎవరికి ఎవరు విధించుకున్నట్టు? ఇలాంటి ఆడదాన్ని లోకువకట్టి, సిగరెట్లూ పేకాటలూ తాగుళ్లూ గర్ల్‌ఫ్రెండ్స్ వీటిలో మొగాడు కుషీ చేస్తూంటే దానికి పరోక్షంగా ఎవరు సాయం చేసినట్టు!" అప్పుడే వచ్చిన పెద్దక్కని చూసి "ఇలాంటి

కబుర్లరాయుడుతో ఎలా కాపురం చేస్తున్నావ్ అక్కా?" అని నెమ్మదిగా అనబోయి గట్టిగా అడిగి నాలిక కరుచుకుంది పద్మ 'ఆయన కేవలం కబుర్లరాయుడు కాదు గనక' అంది హఠాత్తుగా పెద్దక్క. ఆ తర్వాత అది చెప్పిన ఏ ఒక్క ముక్కా మేం ఎప్పుడూ మరిచిపోలేం! పెళ్ళికి ముందు పేరుకు మెట్రిక్ పాసయ్యాను గాని వీధి చివరికి పెళ్ళి అగ్గి పెట్టె తెమ్మన్నా 'ఎవరేం అనుకుంటారో ఏం చేసిపోతారో' అనే సిగ్గుమాలిన ఆడబుద్ధిలోనే నేను ఉండేదాన్ని. కాపురానికి వెళ్లేదాకా. ఇంతకీ మనల్ని నఖశిఖ పర్యంతం పరిశీలించడం మన గురించి ఆలోచించడం తప్ప లోకంలో మరెవరికీ మరి పనీపాటూ లేదా! ఈ విషయం నాకు నచ్చజెప్పి నన్నో మనిషిగా తీర్చిదిద్దినవారు మీ బావగారే! ఇది వరకు ఆయన రిక్షాకు దిర్చి వీధిలో నిలబెడితే నేను ఒకర్తినీ అందులో కూచోడానికి వెయ్యి వంకర్లు తిరిగిపోయేదాన్ని బెరుకుతో. కాపురానికి వచ్చిన ఏడాదిపాటు ఆ వీధి దాటి ఊళ్ళో ఎక్కడేముందో ఆయన చెప్పవలసిందే! చిన్నప్పుడు తండ్రి, పెళ్లయ్యాక మొగుడూ, చివరికి కొడుకూ అలా బతికున్ననాళ్లూ ఒకరి పెంపకంలో ఆడది పడి ఉండకూడదని ఆయన ఎంతగా చెప్పి నన్ను నేనుగా ఆలోచించుకొనేలా చేశారో! ఇప్పుడు లూనా మీద మా పెద్ద దాన్ని స్కూలుకి నేనే దిగబెట్టే స్థాయికి చేరుకున్నాను!"

"ఉద్ధరించావులే!" అన్నట్టు వెక్కిరిస్తూ అక్కణ్ణుంచి జారుకుంది పద్మ.

*(జ్యోతి దీపావళి సంచిక)*

# దైవ కార్యం




**ఒక్క** ఊపుతో రైలు కదిలి క్రమంగా వేగం హెచ్చించింది. ఆ ఊరు, దానితో ముడివేసు పోయిన నా ఆరు నెలల జీవిత దృశ్యమూ ఒక్కమారు నా మనసు నుంచి చెరిపివెయ్యడానికి, దూరం చెయ్యడానికి, వెర్రి రైలు. దీన్ని కెన్ని గుండెలు!

అప్పుడూ ఇలాగే టిక్కెట్టు లేదని ఆ స్టేషనులో దింపేశారు. ఊళ్ళోకి వెళ్ళి వీధులన్నీ వెర్రెత్తినట్టు తిరిగినా విస్తరేసే అదృష్టం కనబడలేదు. ఉసూరుమంటూ ఓ అరుగుమీద చేరేశాను శరీరాన్ని. కళ్ళు తిరిగినట్టయింది. అప్పుడే ఎంగిలాకు పారేద్దామని ఓ ఇల్లాలు అరుగుమీదికి వచ్చింది. నన్నా స్థితిలో చూసింది. నేను కూడా ఓ ఎంగిలాకు లాంటి వాణ్ణని ఆవిడకు తెలీదు కాబోలు. లోపలికి పిలిచి అన్నంపెట్టి ప్రాణం నిలబెట్టింది. అమ్మగారితో అనుబంధం అలా మొదలై ఆ ఊళ్ళో ఉండగా మరి తెంపుకోలేనంతగా బిగిసిపోయింది.

అమ్మగారి నాన్నగారుట అక్కడే అల్లుడి యింట్లోనే ఉంటారుట. నా గురించి అన్నీ అడిగేరు. కులం శాఖా అన్నీ వాళ్ళవీ నావీ ఒకటేనుట. మా వాళ్ళు రెండు తరాల నుంచి వాళ్ళకి పౌరోహిత్యం

చేసేవారుట.

"ఆ భారీ శరీరం, ఆసూదిముక్కూ చూసి అప్పుడే అనుకున్నాను. వీళ్ళ తాత దీక్షితుల్దీ ఇదే మొహం. వాళ్ళ వాళ్ళంతా ఎంత నైష్ఠికులనీ! ఇప్పుడంటే కాలం ఇలా తిరగబడిందిగాని ఆ రోజుల్లో దైవజ్ఞులు వచ్చి దేవతార్చన చేస్తేగాని ఇంటి కార్యక్రమం ఆరంభం అయ్యేదామరి? నీ వేషం వాలకం చూస్తే తండ్రి డొక్కశుద్ధి నీకేం అబ్బినట్టులేదేం! అయినా ఆ వంశంలో పుట్టిన మొలకవి. వర్చస్సు ఉంది, మంచి కంఠం ఉంది. ఎంతలో నేర్చుకోవాలిలే - అవునే అమ్మాయ్ ఇతన్ని మనింట్లో ఉంచేసుకుంటేనో? అల్లుడురానీ. అడుగుదాం.... ఏమంటావోయ్ నువ్వు?"

మౌనమే నా అంగీకారమైందేమో.... దేన్నుంచైతే పారిపోదామనుకున్నానో అదే నన్ను వెంట పెట్టడం కన్న ఆశ్చర్యమేముంది! నాన్న ఎంత ప్రయత్నం చేసినా యీ వైదిక వృత్తికి నా మనస్సు ఎంత మాత్రం ఒడబడలేదు. ఆ మంత్రం ముక్కలు నా నోట పలికిద్దామని తను ఎంత గింజుకున్నా అవి స్పష్టంగా నా నుంచి ఊడిపడి చావలేదు. అది తన పరాజయంగా అంగీకరించలేక చావగొట్టేశేవాడు. ఆయనలా గొడ్డుని బాదినట్టు బాదుతున్నకొద్దీ అమ్మలేని బాధకంటే నాన్న బతికుండిపోయాడే అనేబాధ నన్ను క్రుంగదీసేది. అక్క లేచిపోయిందనే చింతకంటే అయ్యో నేను ఆడదాన్ని కాకపోయానే, నాకూ ఆ అవకాశం దొరికి ఉండునే" అనే దుగ్ధ నన్ను కాల్చేసేది. నాకు పదిహేడేళ్లు వెళ్ళే వరకూ నాన్న బతికాడు. ఆయన చెప్పిన చదువు నాకేం చెవికెక్కలేదు గాని, ఆయనా గుమ్మం దిగనిచ్చి తలుపు గడియపెట్టుకుని, ఏదుంటే అది ఉడకబెట్టుకునో వేయించుకునో ఇంత కారమో పంచదారో జల్లుకుని మింగడం మాత్రం అలవాటు చేసుకున్నాను. అసలు నాన్న ఓపూట నాచేత వండించేవాడుకూడా. వండుతున్నప్పుడే 'తినదగు ఎయ్యది దొరికిన' అన్నట్టు సహం వంట మంటకిందకి రాకుండానే పంటికిందకి వెళ్ళిపోయేది. ఎలా అయితేనేం వారం వర్జ్యం చెప్పేయాయవార బ్రాహ్మణుడిగా కాకపోయినా వంటబ్రాహ్మణుడిగా అయినా కితాబు తప్పలేదుట నాకు.

నాన్న చావగొట్టి మరీ చెప్పడంచేతో యేమో శుభం కానివ్వండి అశుభం కానివ్వండి యీ ప్రక్రియల మీద మొదట్నుంచీ ఎంతో అసహ్యం ఏర్పడి పోయింది నాకు. ఈ తిరుగుబాటు ధోరణి నా వయసుతో పెరిగిందేకాని తగ్గలేదు. ఈ పూజలూ, వ్రతాలూ మొక్కుబళ్ళూ, తద్దినాలూ అన్నీ ఎంతో హాస్యాస్పదంగా కనిపించేవి నాకు.

కొన్ని కర్మలూ, కొన్ని విద్యలూ, కొన్ని క్రతువులూ కొందరికే పరిమితం అయితే మిగిలినవాళ్లు ఏంకావాలి! ఉచ్చారణవల్లే ఊర్ధ్వలోకాలు లభించే అవకాశం వుంటే మూగవాళ్ళు ఏ గంగలో కలవాలి! ఎవరి కర్మ వారిదే అయితే ఆడదిచేసే ప్రతీ పూజా మొగుడి కోసమే ఎలా అవుతుంది? చాలా మంది ఆడాళ్ళకి మొగుడు బతికుండడమే గొప్ప శిక్ష. అతగాడు అవతారం చాలించక కూడా కొత్త రకం కొరత విధింపబడడం ఏం న్యాయం?

"అర్చన" వికృతీ "ఆర్జన" ప్రకృతీ అనేవాడు నాన్న. గుళ్ళో కుదురుకుంటే యింత ప్రసాదం తినిపడుంటాడని ఆ నౌఖరీ కోసం నాన్నచేసే ప్రయత్నాలు కూడా నాకు నచ్చలేదు. గొప్పదనంమాట తనే ఎరుగు, లోపంలేని దేవుడే నాకు కనపడలేదు! కొండమీద కూర్చుని కొల్లగొడుతున్న ముఖ్యులు ముగ్గుర్నే తీసుకుందాం. ఇద్దరు పెళ్ళాలకి జవాబుచెప్పలేక నల్లరాయిగా మారిపోయిన ధైర్యశాలి

ఒకడు; తమ్ముణ్ణి చంపేడని అభిమానంగల ఓ అన్న పగబడితే, దారుణంగా హత్యచేసిన దయామయుడు ఒకడు; ఇష్టం ఉండొచ్చు ఉండకపోవచ్చు, తన ప్రసాదం నోట్లో వేసుకోలేదని అలిగి, భక్తుల నోట్లో మట్టికొట్టిన విశాల హృదయుడు ఒకడు! ఏ దేవుడూ మనిషిలా ఉండడు. మనిషిలా ప్రవర్తించడు, అలా ఉంటే మనిషే గుర్తించడని కాబోలు. అయినా ఒకరిచేత గుర్తింపబడాలనే దేవిరింపు దేనికి దేవుడికి! ఫలానా వ్రతంచేస్తే ఫలానా లాభం కలుగుతుందని చెప్పడమే పత్రికలో ప్రకటన లాంటిది. అలా చెయ్యకపోతే ఎంత కీడు కలుగుతుందో చెబుతూ పరోక్షంగా శాపనార్థాలు పెట్టే భక్తి సాహిత్యం బ్రహ్మాండమైన ప్రచార సాధనంకాదా!

ఇంటి దగ్గర నాన్న దెబ్బలే యింతటి వనుకున్నాను. నాన్న పోయాక, ఆ కాస్త పొలమూ అమ్ముకుని ఆ రెండేళ్ళూ ఏం అనువించానో అంతే. పొట్టచేత్తో పట్టుకుని వీధిలో కాలు పెట్టాకనే తెలిసింది, ఎదురు దెబ్బల రుచి ఎలాంటిదో. నా ఆలోచనా అనుభవమూ నాకు నేర్పిన పాఠం ఒక్కటే. మన వాళ్ళకి సాటి మనిషి కష్టసుఖాల చరిత్ర కన్న కనబడని దేవుళ్ళ పురాణాల మీద గురి ఎక్కువ. ఊపిరితీస్తూ తనతో మాట్లాడుతూ రక్త మాంసాలతో ఎదుట నిలబడ్డ మనిషికన్న ఏ కర్రతోనో రాతితోనో చెక్కిన ఎక్కడో ఉన్న ఏ విగ్రహంమీదో మోజు ఎక్కువ. నిప్పులా కాలుతుంది కాబట్టి నిజమంటే మంట. తమాషాగా ఉంటుంది కాబట్టి మాయఅంటే మక్కువ. సమస్త మానవజాతి తారాబలము ఒకే ఒక్క పేజీలా వెతుక్కోగలరు. సర్వరోగ నివారణ శక్తి చిటికెడు బూడిదలో ఉందని నమ్మగలరు. అలాగే ఉండిపోవాలని నిశ్చయించుకున్నారు గనక వీళ్ళని జోకొట్టి డబ్బు చేసుకోడంలో తప్పేంలేదు!

అందువల్లనో యేమో అక్కడ చేరిన మూడో నెలకే ఆ ఊరిచివర దేవాలయ నిర్మాణంలో నేను ప్రముఖపాత్ర వహించవలసి వచ్చింది!

అంతకంటె చిత్రమైన సంగతేమిటంటే ప్లీడరుగారింట్లో అమ్మగారికి వంటపనిలో సాయంచెయ్యటమే కాకుండా ఏ రోజు కారోజు పూజాసామాగ్రి అమర్చడం! అన్ని రకాల వ్రతాల, నోముల పుస్తకాలు ఆ యింట్లో వుండేవి. తాతగారికి సరిగ్గా కళ్ళు కనిపించక నా చేత చదివించేవారు తప్పు చదివితే సరిదిద్దేవారు.

ఎందుకోగాని అమ్మగారి ముఖంలో ఎప్పుడూ చూసినా ఆనందమనేది నాకు కనపడేది కాదు. చాలామంది పిల్లలు పుట్టిపోయారని పనివాళ్ళు చెప్పేరుగాని, అదే అన్నిటికీ మూలంలా నాకు కనిపించలేదు. ప్లీడరుగారు వేలకి వేలు డబ్బు సంపాదించే వారు. ఎంత రాత్రి గడిచినా యింటికి వచ్చేవారు కాదు. వాళ్ళిద్దరూ నవ్వుతూ మాట్లాడుకోవడం నేనెప్పుడూ చూడలేదు.

అందరూ చావగా మిగిలిన అమ్మాయి, బేబీ అంటారు ఒకర్తి లేకపోలేదు. హైస్కూల్లో పదో క్లాసు కాబోలు చదువుతోందంటారు. ఎప్పుడూ పత్రికలోంచి మొహం బయటకి తియ్యదు. తీసి బయటకి ఎత్తితే, అది ఒక్క సినిమా హాలులోనే!

నేను ఆ యింట్లో చేరిన రెండో నెలకే తాతగారు పోయారు. దాన్తో అమ్మగారు మరీ డీలా పడిపోయారు.

"నా మెడకి ఇదొకత్తి మిగిలింది. లేకపోతే ఎప్పుడో వెళ్ళిపోయివుందును. ఎదిగి కూచుందిగాని ఏమీ ఎరగని వెర్రిపిల్ల.... దీని బతుకు ఎలా వెడుతుందో ఏమిటో" అనేవారు అమ్మగారు అస్తమానమూ.







మామగారు పోయాక ప్లీడరు గారికి దుక్కముక్కలాంటి నన్ను ఊరికే యింట్లో కూచుని మేపడం యిష్టంలేకపోయింది. ఆలోచించారు. ఆ తర్వాత ఊరి చివర, రోడ్డువార, పాకలోకి మార్చబడింది నా మకాం. అక్కడ చెట్టుకింద ఆంజనేయుడి విగ్రహం ఏ ఏభై ఏళ్ళ నుంచో ఉందిట. ఆ విగ్రహం ఎండకి ఎండుతూ వానకి తడుస్తూ ఉండిపోయిందనే విషయం హఠాత్తుగా ప్లీడరుగారి బుర్రకి ఎక్కి కూచుంది.

ఆయన నవ్వుతూ అన్నారు.

"కలవచ్చి పడిందయ్యా, ఏం చెయ్యను మరి! కల అనేది కాదనలేనిది, టెలివిజన్‌కాదు గదా! స్వామి కనిపించి కోపించాడు - ఇన్నేళ్ళయినా నాకు గుడి కావాలని ఊరి వాళ్ళకి పట్టలేదా అని! తప్పుతుందా మరి! అన్ని బస్సులూ వెళ్ళేది అదే రూటున - అన్ని మనస్సులూ పట్టుబడాలని పట్టుపట్టేది కూడా అలాంటి చీకటి మాటునే. శక్తికొలదీ వసూలు చెయ్యి ప్రయాణీకుల దగ్గర్నుంచి. అందులో సగభాగం పుజారివి నీదే. కండక్టరికో పావలా వాటా పారేస్తే కత అడ్డం తిరగదు. భక్తి మాట దేవుడెరుగుగాని ప్రజలకైనా జవాబు చెప్పుకోవాలి గదా! గుడికోసం ఓ పావలా చొప్పున వేరేదాస్తూండు, మమ్మల్ని మరచిపోయావు, అమ్మగారు అసలే గాలిలో దీపంలాంటిది. కాకి చేత కబురంపించినా రెక్కలు కట్టుకు వాలాలి సుమా! ఇలా అప్పుడప్పుడు చేసే వంట పనికి మాత్రం నీకు కూలీ ఏర్పాటు ఉండదు. నీ రాబడిలో నేను వాటా అడగను. ఇది మనిద్దరి మధ్యా కాంట్రాక్టు వింటున్నావా?"

ఆయనంత ఖచ్చితంగా మాట్లాడుతూంటే ఎంతో దగ్గరై నట్టనిపించింది కాని అమ్మగారికీ నాకూ దూరం చేసింది యీయనేకదా అనిపించి ఆభావం ఆట్టేసేపు నిలబడలేదు. అలా ప్రారంభమైంది గుడిలో లింగాన్ని మింగే నా వ్యాపారం.

ఆ మధ్య లారీ ఒకటి ఆ జాగాకి సుమారు రెండు మైళ్ళ దూరంలో ఓ చెట్టుకి గుద్దుకుని డ్రైవరూ, క్లీనరూ నామరూపాలు లేకుండా పిప్పి పిప్పి అయిపోయారు. అసలు ఆ రోజు వాళ్ళిద్దరూ పాకదగ్గిర లారీ ఆపి చెరో రూపాయీ డబ్బీలోవేసి ఇంతంత కుంకం బొట్లు పెట్టుకుని మరీ వెళ్ళేరు. శవాలు సాక్ష్యం చెప్పలేవుగదా! 'చూశారా, ఒక్కమారు కళ్లు మూసుకుని దండం పెట్టుకోకుండా వెడితే రెండు నిండు ప్రాణాలు నిలువునా ఎలా బలైపోయాయో. మీ కిష్టమైతే ఓ పైస వెయ్యండి. లేకపోతే లేదు. స్వామికోరేది ఏమిటి? ఒక్క నమస్కారం. అదైనా ఎవరికోసం? మీ పిల్లా పాపా చల్లగా ఉండాలని', ఇలాంటి అవకాశ వాదాలతో నిండి, నా ధర్మ డబ్బీ ఉక్కిరి బిక్కిరి అయిపోయేది.

ఓ రోజు ఆ చిల్లర డబ్బీ పసుపుచీర చుట్టబెట్టుకున్న జేగురు చుక్కల గలగల లక్ష్మి- నాకు కనిపించలేదు, పైగా పక్కపాకలోంచి కిలకిల వినిపించింది. అది అంట్లు తోమే అప్పల్నర్సిది. ఎలా సంపాదించామనే విషయంలో నా కాట్టే పట్టింపు లేనట్టే ఎక్కడ సుఖపడాలనే విషయంలో అప్పల్నర్సికి ఆట్టే పట్టింపు ఉన్నట్టులేదు. దాని చురుకు చురుకు చూపులే ఏ మొగాడికయినా ఉడుకు ఉడుకు పిలుపులు. పైగా నవ్వుల సిగ్నల్ ఇచ్చింది. ఈ విద్య ఇదివరకు నే నెరగంది కాదుగదా! పాకలు వేరయినంత మాత్రాన పడకలు వేరవాలా!

ఈ పూజారి పుండాకోరు బతుకు నా మనసుకి పడదు. కాని అనేక రకాల సంఘర్షణలకి లోనై ఆఖరికి ఇక్కడ చేరుకున్నాను. అప్పుడప్పుడే అన్ని రకాల సుఖాలూ అమరుతున్నాయి. దీన్ని వదిలిపెట్టడం మంచిది కాదని శరీరం మారాం చేసింది. ఓ జందెపు పోగూ, ఓ విభూతి పండూ,

సామాన్య ప్రజలకి అర్థంకాని భాషలో అప్పుడప్పుడొక మంత్రమ్ముక్క చెప్పగలిగే శక్తి ఏ పరిస్థితినయినా మరో పైసా డబ్బీలో పడేలా మార్చి నోరెట్టుకు బతకగల ఉపాయం - ఇవీ నా పెట్టుబడి. దివ్యంగా సాగిపోతోంది వ్యవహారం. చింతదేనికి! అందులో యీ మధ్య అప్పల్నర్సి - నేను కొన్ని నెలల వెనకపెట్టిన మందు కొట్టడం కూడా మప్పింది. అదే నా చేత ఆనాడు అంత దుర్మార్గపు పని చేయించిందేమో!

ముందు రోజు గాలివానకి రోడ్డుకడ్డంగా చింత చెట్టు పడిపోయిందని తాత్కాలికంగా రోడ్డు మలుపు తిప్పేడు. అది బాగు చేసేదాకా బస్సులు మా పాకమీంచి వెళ్ళవు. ఓ పూట దాకా నాకు వండుకోవడం, తినడం తప్ప మరో పనిలేదు. చిన్న చలిగాలి వేస్తున్నది. చిరుచీకటి వేళ. అక్కకూతుర్ని ఆస్పత్రి పెట్టేరని తెలిసి అప్పలనర్సి మధ్యాహ్నమనగా వెళ్ళిపోయింది. ఇలాంటప్పుడు తను దగ్గర్లేకపోతే నన్నే ఆస్పత్రిలో పెట్టాలేమో అనిపించింది. లోపలికెళ్ళి సీసా ఖాళీచేసి వచ్చాను లేని హుషారు తెచ్చుకోడం కోసం గుమ్మంలో కూర్చుని గుప్పు గుప్పుమని బీడీ మీద బీడీ వదుల్తున్నాను.

పరుగుపరుగున ఆ అమ్మాయి ఆవేళ నాదగ్గర కెందుకొచ్చిందో నేను అడగలేదు. ఆ స్థితిలో నిజానికి అడగడం ఎలాగో నాకు తెలీలేదు, ఆ అమ్మాయి అడ్డుచెప్పనూ లేదు. ఎగిరెగివచ్చి యాపిల్ పండు ఒళ్ళోపడింది తీసుకు తింటే తప్పా? తప్పేనని తిన్న తర్వాతగాని తెలీలేదు!

ఆ అమ్మాయి మరెవరో కాదు, ప్లీడరు గారి బేబీ! ఆయన హైకోర్టు పనిమీద ఊరెళ్ళేరుట. ముగ్గురు పనివాళ్లూ ఆ రోజు రాలేదుట..... అమ్మగారికి మళ్ళీ ఒళ్ళు తెలియని జ్వరంలో మరెవరూ లేక నన్ను పిలవడానికి తనే వచ్చింది బేబీ.

తొందర తొందరగా అమ్మాయితో వాళ్లిల్లు చేరేను. దార్లోనే డాక్టరుగారిల్లుంటే చెప్పికూడా తీసికెళ్ళేను. అమ్మగారికి యింజక్షన్ యిప్పించాను. వేరే ఏవో మాత్రలు కావాలంటే మళ్ళీ బజారుకొచ్చి తెచ్చి యిచ్చాను. ఇంటిపనే కాక వంటపని కూడా పూర్తిచేసి అన్నీ ఎక్కడి వక్కడ సర్దేసరికి అర్థరాత్రి దాటిందనుకుంటాను.

ఏపని చేస్తున్నా, చేసిన అఘాయిత్యానికి అణువణువునా పశ్చాత్తాపం నన్ను దహించక మానలేదు. "ఇలాంటి పని చెయ్యడం బ్రహ్మతరం కాదు" అంటాం మనం మామూలుగా" నిజానికి కూతురిలాంటిదాంతో కులకడం బ్రహ్మతరం మాత్రమే అవును. ఇంతకు మించిన పాపం చేశాను, ఒకర్ని వేలెత్తి చూపడం దేనికి! పదహారేళ్ళకి పాతికేళ్ళదాన్లా కనపడవచ్చు. ఛీ ఛీ అంటే చిరునవ్వులు వెలిగించే పాపాయిలాంటి మనసు బేబీది. ఆమెకేనా యిలాంటి కిరాతకం!

చికాగ్గా ఉన్నప్పుడు బీడీలు తగలెయ్యడం చిన్నప్పట్నుంచి అలవాటునాకు. ఆఖరికి అది కూడా మరిచిపోయి. సిగ్గుతో తల మోకాళ్ళమధ్య దూర్చి యించుమించు ఏడుస్తూ కూచున్నాను ఆ నిశిరాత్రివేళ, ఆ మేడమీది వరండాలో మెట్లగది తలుపు అడ్డ గడియ వేసేసి బేబి, పట్టెల చప్పుడు కాకుండా, నా వైపు మెల్లిగా నడిచి వస్తూంటే నిర్ఘాంతపోయాను.

"అమ్మకి నిద్ర పట్టేసింది. పద, ఆ మూల గదిలోకి పోదాం, అబ్బ రమ్మంటోంటే" అని చెయ్యిపట్టుకు లాగుతూంటే ఉన్న మతికూడా పోయింది!

ఉన్నట్టుండి తెలివి తెచ్చుకుని, ఆమెను విడిపించుకున్నాను. మేడ దిగి కిందకివచ్చేశాను. అమ్మగారి మొహంలోకి చూడగల ధైర్యం ఎప్పుడో కోల్పోయాను నేను. నిద్రమందు పట్టిచ్చినట్టుంది.

పెద్ద గురక వినపడుతోంది. ఆ శబ్దానికే పట్టుపడి పోయినట్టు నిలువెల్లా ఒణికిపోయాను. వరండాలోకి వచ్చి కూర్చున్నాను. వీధిలైటు వెలుగుపడేచోట. ఆ లైటువైపు చూస్తే తెలుస్తుంది, చుట్టూ ఎంత చీకటిగా ఉందో..... అలా చూస్తేనే తెలిసింది, వర్షపు జోరు ఏమాత్రం తగ్గలేదని.... ఇటువైపు చూస్తే తెలిసింది ఈ అమ్మాయి జోరుకూడా ఏ మాత్రం తగ్గలేదని, దగ్గరగా వచ్చి రెండు చేతులూ నా మీద వేసింది.. కళ్లల్లోకి చూస్తూ అడిగింది.

"ఎందుకలా వచ్చేశావ్, నేనంటే యిష్టం లేదా?" ఎలా, ఎలా చెప్పను! ఎలా చేస్తే తెలుస్తుంది! ఆ ఉవ్వెత్తు మబ్బుల వెనక ఉన్నది కేవలం చిన్నారి చందమామే అని! ఆ వెలుగురేక కోసమే ఓ తల్లి పంచప్రాణాలూ పెట్టుకుని బతుకుతోందిని! జరిగిన దానికే కుమిలి కుమిలి ఛస్తున్నాననీ, యింకో యిలాంటి దానికి పాల్పడ్డం కంటె పురుటిగుడ్డుని పీకపిసికి చంపడం నయమనీ - ఎలా చెప్పను!

ఎలాగో చెప్పాలిగా.... ఇది మహాదారుణమనీ, జరిగిందాన్ని మరచిపోమనీ, మంచి సంబంధం చేసుకుని హాయిగా వుండమనీ..... నచ్చజెప్పడానికి ప్రయత్నించాను. పత్రికలూ, చలనచిత్రాలూ ఆ అమ్మాయిని జీవితం నుంచి ఇంతదూరం తీసుకుపోయాయని బేబీ మాటలు వింటేగాని నాకు తెలీలేదు. ఈ దేశంలో ఆడది జీవితంలో ఒకే ఒకసారి ప్రేమించగలదంది. తనువు ఒకరికీ మనసు ఒకరికీనా, ఇంత తక్కువ గానా నువ్వు స్త్రీమూర్తిని అంచనా వేసేది! అని నిలదీసింది. నీ పదధూళి చాలు, శిరసున ధరిస్తాను అంది. కాదన్నా పోనీ పాదాల దగ్గరే తల బద్దలుకొట్టుకు చస్తానంది. ఏమనుకున్నావ్. పెళ్ళంటే వెయ్యేళ్ళ పంట సుమా అని హెచ్చరించింది. అరిటాకు మీద ముల్లు పడినా ముల్లుమీద అరిటాకు పడినా అరిటాకుకే కదా నష్టం, నీకేం! అని నిలబెట్టేసింది.

ఇలాంటి ధోరణికి జవాబంటూ లేదు. అయినా నేను ఊరుకోలేదు. "ఏ అయినింటికో కోడలిగా వెళ్ళి పిల్లాపాపతో కళకళ లాడవలసిన దానివి. నాతో నీ కేమిటి తల్లీ" అని నచ్చజెప్ప ప్రయత్నించాను. "పొరపాటున ఓ పిచ్చిగీత పడినంత మాత్రంచేత తెల్లకాగితం బతుకు ఆ గీతకే అంకితం అయిపోనక్కర్లేదు. ఎంతటి సిరామరకయినా కనపడకుండా చెరిపే రబ్బర్లు దొరక్కపోవు. ఇది పొరపాటు. దీన్నొక స్థిరమైన నేరంగా రూపొందించి బతుకు బండలు చేసుకోనక్కర్లేదు" అని హితవు చెప్పేను.

ఎన్ని చెప్పనియ్యి - ఆ అమ్మాయి వినే స్థితిలో లేదు. 'డాడీ నా మాట కాదనరు. ఓ వేళ మొదట్లో అడ్డు చెప్పినా నేను, మమ్మీ కలిసి చెబితే కొట్టి పారెయ్యలేరు. మావాళ్ళకున్న ఒకే ఒక పట్టింపు కులం గురించి. అదృష్టవశాత్తు ఆ చికాకు మనకి లేదు గదా! నేను గట్టిగా పట్టుబడితే మన పెళ్ళి జరిపించి తీరతారు. ఇక వయసు తేడా అంటావా, ప్రేమ హృదయానికి సంబంధించిందని వినలేదా?" "లేదు బేబీ.... మీ వాళ్ళు ఒప్పుకుంటారని నేననుకోను." "ఒప్పుకోకపోతే చావమను. వాళ్ళు నా పేరెంట్సూ కాదు, నేను వారి డాటర్నీకాదు. మన బంధం జన్మ జన్మల అనుబంధం.... నీ సన్నిధి నా పెన్నిధి.... పద, ఇలా నీతో వచ్చేస్తాను. రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళిపోదాం".

"ఆవారాగాణ్ణి. నాతో నువ్వెలా బతుకుతావ్ బేబీ?"

"టట్.... హీరోయేనా ఇలా బీరాలు పలికేది? జీవిత మంటే ఏమిటి, ఒక కంట కన్నీరు, ఒక కంట పన్నీరు.... ఆ మాత్రం తెలీదా నీకు? అయినా మా తాతగారు నా పెళ్ళికోసం ముందే ప్రెజెంటుచేసిన వజ్రాల సూట్‌కేస్ ఉందయ్యా.... ఇప్పుడిలా వెళ్ళితేనా?

ఇక ఆ అమ్మాయితో వాదించడానికి నాకేం మిగల్లేదు. ఇక ఆ ఊళ్ళో ఉంటే లాభం లేదని ఆ క్షణమే నిశ్చయించుకున్నాను.

ఆఖరికి ఆ అమాయకురాలి దగ్గర కూడా మోసమే పనిచేసింది. నాన్నగారు రాగానే ఆయనతో మాట్లాడి వీలైనంత తొందర్లో మూడు ముళ్ళూ వేస్తానని నచ్చజెప్పి, అంతదాకా కలుసుకోడం మంచిది కాదని ఒప్పించాను.

నిజానికి ప్లీడరుగారు ఊర్నించి రాగానే నేను చెప్పిన విషయాలు వేరు. మెడ్రాసులో ఇదివరకు నేను పనిచేసిన హోటలువాడు నేనిక్కడున్నానని ఎలాగో తెలుసుకుని మళ్ళీ వచ్చి పనిలో చేరమని కబురు వేశాడనీ వెళ్ళడానికి నిశ్చయించుకున్నాననీ-చెప్పేను. మొదట్లో ఒప్పుకోలేదుగాని ఎంతో నచ్చచెప్పిన మీదట తను వద్దన్నా నేను వెళ్ళక మాననని గ్రహించి, ఊరుకున్నారు. ఈ సంగతి యింట్లో తెలియనియ్యవద్దనీ, అమ్మగారు అసలు ఒప్పుకోరనీ, బ్రతిమాలి ఒప్పించాను. ఆలయ నిర్మాణానికి వసూలయిన చందాలో మిగిలింది లెక్కచూస్తే అయిదు వందల చిల్లరుంది. మిగిలింది నేను ఉంచుకుంటాననీ, ఇప్పటి వసూలు యింతేనని ఊరివాళ్ళకి తన పలుకుబడి ఉపయోగించి నచ్చచెప్పమని ప్లీడరుగారి చేతిలో మూడు వందలు పెట్టేను. మరొకర్ని చూసి వేసుకోమనీ ఇలా హఠాత్తుగా వెళ్ళిపోతున్నందుకు క్షమించమని మరీ మరీ ప్రార్థించి ఒప్పించాను.

ఎప్పట్నుంచో పట్టుచీర కొనిపెట్టమని అప్పల్నర్సి చంపేస్తోంది. ఈ డబ్బుకది వస్తుందో రాదో తెలీదుగాని ఆ రెండొందలూ దాని చేతిలో పోశాను. చెప్పాలనుకున్నానుగాని చెప్పలేదు. ఇలానే వెళ్ళిపోయానని తెలిసినా భరించగలదు అది. అనేక రకాల ఢక్కా మొక్కీలు తిన్న ఘటం అది. పమిట సర్దుకున్నంత సులువుగా ఏ పరిస్థితిని అయినా సర్దేసుకోగలదు. ఫర్వాలేదు!

చిల్లర మల్లర తిరుగుళ్ళ వాడ్ని, ఎలా వచ్చినట్టు అలాగే చిల్లర డబ్బులతోనే రైలెక్కేను.

రైలు ముందుకి వెడుతున్నా ఆలోచన వెనక్కి లాగుతోంది. అలా వెళ్ళి వెళ్ళి ఓ దృశ్యం ముందు నిలిచిపోయింది.

ఎండలో సొమ్మసిల్లిన నా మొహం మీద చల్లని నీళ్ళు జల్లి సేదతీర్చి కడుపునిండా తిండి పెట్టింది జీవితంలో సుఖమంటూ ఎరగని ఓ పిచ్చితల్లి. ఫరవాలేదు. ఇప్పుడు తలెత్తి ధైర్యంగా అమ్మగారి మొహంలోకి చూడగలను. ఈ తృప్తినిచ్చిన బలంతో యిక ఎలాంటి ప్రయాణమైనా చెయ్యగలను.

*(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, దీపావళి ప్రత్యేక సంచిక, 1974)*



# స్నేహం

49



**"అయినా** అయిదేళ్లున్నాయో లేదో, ఆ ప్రహ్లాదుడిగాడికి, వెధవకి అంత బుర్ర తిరుగుడు దేనికోయ్. ఇంతకీ వాడిబాబేం నాస్తికుడు కాదే. తండ్రి చెప్పిన ప్రతిముక్కా కొట్టి పారెయ్యకపోతే, వాడి నోరేం తుప్పెక్కిపోతుందా! చేతిలో కలమో గంటమో ఉంటే ఎలాగైనా గీకి పారెయొచ్చు. ప్రహ్లాదుణ్ణి రక్షించేవాడు. 'ఎందెందు వెదికి చూచిన అందందే గలడు' గాని దానవాగ్రణిని సపోర్టు చేసే చచ్చు పెద్దమ్మ ఎక్కడా కనపడ్డు! అలాగే వాడు లేకపోతే సరి!''

నీలా చలం చెప్పిందంతా విని-

'ఆ! లోక మేమంత గొడ్డు పోలేదు గాని నీ కొచ్చిన బాధ ఏదో సూటిగా అఘోరిద్దూ!' అన్నడు దామోదరం.

పేరుకి 'ఓయ్ అంటే ఓయ్' అని పిలుచుకుంటారుగాని 'ఓరి చచ్చు సన్నాసీ' అంటే 'ఏం ఎలా ఉందేమిట్రా దొంగ రాస్కెల్'' అని పలకరించుకునేటంత గాఢమైన స్నేహం వాళ్ళది. వాళ్ళ వయసయితే అరవై దగ్గిర పడితే పడొచ్చుగాని వాళ్ళ వరస మాత్రం ఇంకా పైలా పచ్చీసులోనే

ఉంది.

నీలాచలంది మొదట్నుంచీ దర్జా పద్దు. జల్సా జాతరం,. పెళ్ళామూ సుఖమూ కలిసి ఒకేచోట లభిస్తాయని ఆవిడ బతికున్న రోజుల్లోనే అతను నమ్మిచావలేదు. ఒకానొక ప్రజాహిత ప్రభుత్వ సంస్థలో ప్రస్తుతం 'తీసుకుంటున్నాడు' ఉన్న ఒకే ఒక కొడుకు ఏదో సైంటిఫిక్ కంపెనీలో జూనియర్ సేల్స్‌మన్‌గా శక్తివంచన లేకుండా 'చేసుకుంటున్నాడు'

ఇక దామోదరం లోకం పోకడ తెలిసిన చిద్విలాసుడు ఫారెస్టు డిపార్ట్‌మెంట్‌లో హెడ్‌క్లర్క్‌గా పనిచేస్తున్నాడు. మొగా ఆడా అని భేదం లేకుండా ఆయన ప్రతి బిడ్డపేరా ఏదో 'తల దాచుకోడానికో కొంపా, రెండు తిండి గింజల కోసం ఓ యింత పొలమూ' ఏర్పాటు చెయ్యకపోలేదుగాని 'గంపెడు సంసారం. పాపం యీ గడ్డురోజుల్లో ఎలా యీడ్చుకొస్తున్నాడో యేమో!' అనే సానుభూతి సంపాదించగల సమర్థుడు.

ఎవర్నో పట్టుకుని ఎలాగో ఇన్ఫ్లుయెన్సు చేయించుకుని ఇద్దరూ యించుమించు పదేళ్ళుగా ట్రాన్స్ఫరు అవకుండా విజయవాడలో ఉండగలిగేరు. అయితే రెండేళ్ళ క్రితం నీలాచలం ప్రమోషన్ మీద హైదరాబాద్ వెళ్ళిపోక తప్పలేదు. ఆ తర్వాత ఏణ్ణర్థం పైగా ఎంతో ప్రయత్నిస్తే గాని దామోదరం హైద్రాబాదుకి ట్రాన్స్ఫర్ చేయించుకోలేకపోయాడు అంతటి స్నేహం వాళ్ళది.

'ఇలా వచ్చావ్. శలవుపెట్టి అలా చెక్కేశావ్! నువ్వు యీ ఊరొచ్చిన సుఖమేది నాకూ! పీకలదాకా దిగబడిపోయి గిలగిల కొట్టుకుపోతున్నాను. ఎంత శలవయినా ఏకంగా మూణ్ణెల్లా?'

పెద్దన్నగారికి ప్రాణం మీదికి వచ్చిందని తెలిసి ఇచ్ఛాపురం వెళ్ళవలసి వచ్చింది దామోదరానికి. అన్నగారిని తగలేశారని కాక, ఆయన చాలామటుకు ఉమ్మడి ఆస్తిని తగలేశాడని తెలిసి తమ్ముళ్ళంతా గొల్లుమన్నారు, ఇక అలాంటి పరిస్థితుల్లో అక్కణ్ణుంచి తొందరపడి తప్పుకుంటే దక్కే ఆ కాస్త ముక్కా చేతికిరాదు మరి. అందుచేత అంత ఆలస్యమయింది.

'ఇంతకీ నీకు కొత్తగా వచ్చిపడ్డ చావేమిటోయ్? కృష్ణానది గాలి మునపట్లా తగలడం లేదా ఏం?' అన్నాడు దామోదరం.

తక్కిన పద్దులెన్నున్నా మొగాడు ముద్దు చెల్లించుకునేది ఒకే ఒకచోట అని అనుభవ పూర్వకంగా గ్రహించాడు నీలాచలం. తను విజయవాడలో ఉన్నప్పుడు ఆ ఆఫీసులో ఎల్డీసీగా చేరిన ఆ అమ్మాయి, పాత బనీనులో కొత్త పౌడరు వేసుకున్నట్టు తన జీవితంలో ప్రవేశించింది. పేరు మూడు భాగాలు కలిపి చెబితే మిస్. బాలాకుమారి. కాని అందులో ఏ ఒక్కటిగానూ ఉండడానికి ఆమె యిష్టపడదు. అసలు ఆ పేరే ఆమెకి మంట. అందులోంచే రెండక్షరాలు తీసి బాకూ! అని పిలుస్తాడు. తను పరవశించి పోతుంది. ఆ పిలుపుకి మరువం లాంటి ఆ పరువం ఆఘ్రాణించి మెచ్చి టైపిస్టు కమ్ స్టెనోగా ప్రమోషన్ వరం ప్రసాదించాడు. తనకి అసిస్టెంట్ డైరెక్టర్ చాన్సు వచ్చి యిలా హైదరాబాదు తరలివస్తుంటే అన్నీ వదలుకుని ఆ అమ్మాయి తనతో వచ్చేస్తానని గోల పెట్టకపోలేదు. గాని తనే అన్నీ వదులుకోలేకపోయాడు. ఇంతకీ ఆ ఆఫీసులో వీళ్ళిద్దరి గురించి చెవులు కొరుక్కోని వాళ్ళు లేరని అందరికంటే వీళ్ళిద్దరికే బాగా తెలుసు. చూడ్డానికి చాలామందికి కనుదమ్ములు ఉండొచ్చుగాని యిదేమని ఆఫీసర్ని అడగడానికి ఎందరికి దమ్ములు! పోనీ పెళ్ళి చేసుకుందాం అంటే ఏమిటో దీన్ని పెళ్ళాంగా చూసి అవమానించడానికి తన మనసు మొగ్గ లేదు. ఇదిగాక చెట్టంత కొడుకొకడూ తన

ప్రాణానికి. చచ్చు రూల్సు గల సంఘంలో సభ్యుడిగా ఉన్న నేరానికి శిక్షగా వాడికీ పెళ్ళీ పెడాకులూ తగలెయ్యాలిగద.....

ఆ కృష్ణానదిగాలి తగిలే అవకాశం కనపడకే ఊపిరాడక చస్తున్నాను' అంటూ నీలాచలం ఆ విషయం చెప్పుకొచ్చేడు.

పై స్థానం భర్తీకాక ఇన్నాళ్ళూ అసిస్టెంటు డైరక్టర్ నీలాచలమే, ఆ ఆఫీసుకి భర్తా, భర్తృహరీ కూడా. దామోదరం ఇచ్ఛాపురం వెళ్ళిన పదో నాటికి కాబోలును ఆ ఆఫీసుకి కలికాల చోళన్ అనే పాత ఐసీయస్‌గా డొకడు డైరెక్టరుగా వచ్చి పడ్డాడుట. డెప్యుటేషన్ మీద బ్రోతల్ హౌస్‌పై పోలీసు దాడిలా, మహా స్ట్రిక్టు చచ్చినాడుట ఆ పాపిష్టివాడు. చిరకాలంగా చిలక్కొట్లకి అలవాటు పడిన ఆఫీసు స్టాఫు పాపం గిలగిల కొట్టుకుపోయారుట. నీలాచలం ఏడుపు అది కాదు. మునపట్లా విజయవాడకి జాలీ ట్రిప్పు వేసుకునే అవకాశమే లేకుండా పోయింది గద!

'ఇంతకీ తమాషా ఏమిటో తెలుసుటోయ్ దామోదరం! నువ్వు వెళ్ళి వచ్చేలోగా ఆ చోళన్‌గాడు రాడం పోడం కూడా జరిగింది, టెంపరర్‌గానే ఔగాక. గవర్నమెంటు ఆఫీసుల్లో కూడా అప్పుడప్పుడు బుద్ధీ జ్ఞానం ఉన్న పనులు జరుగుతూ ఉంటాయి కాబోలు. నార్త్ ఇండియాలో ఎక్కడో రెండు వర్గాల వాళ్ళు కొట్టుకు చచ్చేరుట. విషయాన్ని విచారించి రెణ్ణెల్లలోగా రిపోర్ట్ పంపించమని ఒన్ మేన్ కమిటీగా చోళన్‌గార్ని పంపించార్కడికి.

రెణ్ణెల్లు తక్కువ టైమా, అవకాశాలు మళ్ళీ మళ్ళీ వస్తాయా! నీలాచలం బుర్ర అతిచురుకుగా పనిచేసింది. ఆ అమ్మాయిని తన దగ్గరకి రప్పించుకునే బ్రహ్మాండమైన పథకం వేశాడు. ఆఫీసులో డబ్బు వ్యవహారాలు మరీ ఎక్కువై పోతున్నాయనీ వున్న స్టేఫ్ చాలడం లేదనీ, ఎక్స్ట్రాహేండ్ కావాలనీ కేషియర్ని కేష్ చేసుకుని పిటిషన్ పెట్టించాడు. ఆ డిపార్టుమెంట్ చీఫ్ సెక్రటరీని 'తీర్థయాత్ర'ల్లో పునీతుణ్ణి గావించి దగ్గిరుండి పోస్టు సేంక్షన్ చేయించుకున్నాడు. జాబ్ ఎడ్వర్‌టైజ్‌చేసి అమ్మాయి చేత అప్లయి చేయించాడు. ఈ ఉద్యోగంలో అక్కడి కంటే ఓ వంద ఎక్కువ ముడుతుంది. ఉన్న వూళ్ళో కళ్ళ ముందు పడుంటుంది. తన సెక్షన్ కాదు గనక బాస్‌గాని మరో పాపాపోస్ గాడు పబ్లిగ్గా వేలెత్తి చూపడానికి వీలుండదు. కలికాల చోళన్‌గాడు గెద్దకీ గుడ్ల గూబకీ పుట్టిన రకం. ఆ చూపుకి ఎక్కడా అంతు చిక్కకుండా, పట్టుదొరక్కుండా, ఆ జాబ్ ఫైల్ అంతా కేషియర్ చేత పకడ్బందీగా మెయిన్‌టెయిన్ చేయించాడు నీలాచలం. క్వాలిఫికేషన్స్ విషయంలో ఆ అమ్మాయికి అనుకూలంగా రెండు విషయాలలో ప్రత్యేకించి జాగ్రత్తవహించాడు. అఫీషియల్ రికార్డులో బా. కు. వయస్సు యిరవై నాలుగని ఉంది గనక ఆ ఉద్యోగానికి గరిష్ట వయః పరిమితి యిరవై అయిదేళ్లు. చిన్నప్పుడెప్పుడో రెండేళ్ళు కోయంబత్తూరులో ఉందిట ఆ అమ్మాయి అందుకని మాతృభాష కాక మరే యితర ద్రావిడ భాషలో అయినా పరిచయం ప్రత్యేక యోగ్యతగా గుర్తింపబడుతుంది. చోళన్‌కి తమిళం అంటే పంచ ప్రాణాలు ఇంకేం!

'ఇంతకీ యీ కథలో ప్రహ్లాద ప్రవేశం ఎప్పుడూ?'

అని అడిగాడు దామోదరం యిక ఉండబట్టలేక.

'సరిగ్గా ఇక్కడే' అంటూ ఆ సంగతిలా పూర్తిచేశాడు నీలాచలం. అనుకున్నది జరుగుతోందని నీలాచలం మురిసిపోతున్న సమయంలో హనుమకొండలో పనిచేస్తున్న వాళ్ళబ్బాయి అనుకోకుండా

ఊడిపడ్డాడుట.

"డాడీ....... డాడీ..... చెప్పడు మాటలు విని తప్పుడు అంచనా వేసుకున్నాను మిమ్మల్ని. మీరింత కైండ్ హార్టెడ్ అనీ మీదింత హెల్పింగ్ నేచర్ అని అనుకోలేకపోయాను. ఎక్స్క్యూజ్ మీ" అంటూ "ఎందుకలా ఏమీ ఎరగనట్టు పోజు పెడతారు డాడీ! మీరు ప్రకటించిన అసిస్టెంటు కేషియర్ ఉద్యోగం మా గరుడధ్వజం కోసం సృష్టించింది కాదూ!"

నీలాచలానికి తలా తోకా ఆనలేదు, గరుడధ్వజ మెవడు మధ్య! భాస్కరం అలా చెప్పుకుపోతూనే ఉన్నాడు.

"ఏళ్ళ తరబడి మిమ్మల్ని రిక్వెస్టు చేశాను. మా పూర్ ఫ్రెండ్ కింత నీడ పట్టు చూపించమని వాడి "బయోడేటా" అంతా టైపు చేయించి నాలుగు కాపీలు ఇచ్చేనుమీకు. ఎప్పుడో ఎక్కడో పారేసి ఉంటారని పొరబడ్డానుగాని తగిన అవకాశం కోసం మీరు ఎదురు చూస్తున్నారని ఉడుకు నెత్తురు గాళ్ళం మాకెలా తెలుస్తుంది డాడీ! అప్పుడు వాళ్ళ పినతండ్రిగారింట్లో తిరుచిరాపల్లిలో ఉండిపోయి సెకండ్ లేంగ్వేజ్ అరవంలో స్కూలు ఫైనలు పేసయ్యాడు. ఇప్పటికైనా మోగిని అంటాడుగాని మోహిని అని పలకలేడు పిచ్చి సన్నాసి. ఎవడూ మరి నోరెత్తకుండా 'ఇతర ద్రవిడ భాషలో పరిచయం' ప్రత్యేక యోగ్యతగా ఎంత చిత్రంగా యిమిడ్చారు! నేనే దగ్గిరుండి అప్లికేషన్ ఫిలప్ చేయించి, పోతుందేమో అని రిజిష్టర్డ్ కూడా చేయించాను. సకాలంలో అందిందని మీ ఆఫీస్ స్టేంప్‌తో ఎక్నాలెడ్జిమెంట్ కూడా వచ్చింది. వాళ్ళ ఫేమిలీ ఫేమిలీ అంతా అయిదేళ్లై అలమటించిపోతున్నారు. పొన్లెండి యిక మీ పేరు చెప్పి దీపం వెలిగించుకుంటారు. అన్నట్టు ఇంటర్వ్యూడేటు ఎప్పుడు డాడీ? ఎలాగా జాబ్ గన్‌షాట్ అనుకోండి. అయినా ఆ డేటు కనుక్కోడానికే కదా నేను వస్త!'

'సపుత్రస్య నిజం శాస్త్రి', అని మనసులో అనుకుని పైకి యిలా అన్నాడు నీలాచలం.

'సంతోషమే గాని అనుకున్నది అనుకున్నట్టు చెయ్యగలనో లేదో!'

'పేరుకి యింటర్‌వ్యూబోర్డు అంటూ కన్నుగప్పుతారు గాని మన పవిత్ర భారతదేశంలో చాలావరకు ఉద్యోగాలు ప్రీప్లాన్డ్ కదా. తుది తీర్పుమీదే గదా, యింకా ఆ సందేమం దేనికి డాడీ?'

'బావుంది, అన్నీ నా చేతిలో ఉంటే యికలేంది ఏముందీ?' 'ఆ కలికాలం రేపు బుధవారమే వచ్చి జారబడి పోతుంది గదా!'

'అయ్యో, అదేమిటి!'

అదేమాట అప్పుడు భాస్కరమూ ఇప్పుడు దామోదరమూ అడిగేరు.

'ఏం చెప్పమన్నావోయ్ దామోదరం! ఓ అవస్థ అయితే యిలా నెలకి మూడుసార్లు బుర్రకి రంగేసే ఖర్మమేం! ఇంకా వచ్చే నెల ఫస్టుకి జాయినవుతాడు గదా యీ తతంగమంతా ఓ వారం ముందుగానే పూర్తి చెయ్యలేనా అనే ధీమాతోనే ఉన్నాను. ఆరువారాలు దాటకుండానే అంత ఇన్విస్టిగేషనూ పూర్తి చేసుకుని గువ్వగూటికి చేరుకుంటుందని నేనేం కలగన్నానా? ఫిక్సుచేసిన యింటర్ వ్యూడేటుకి వారం ముందుగానే తగలడుతున్నాడు గనుక వాడే హెడ్‌గా వ్యవహరిస్తాడు. ఇంతకీ పక్కలో బల్లెం పెట్టుకుని పై నుంచి పడుతున్న పాముని తిట్టుకోడం దేనికి? మాట్లాడ్డమే గాకుండా ఆ గరుడ ధ్వజానికి తమిళం రాయడం చదవడం కూడా వచ్చునన్నమాట. వాడికి ఉద్యోగం ఖాయం. అంతగా ఆశపెట్టి నిరుత్సాహపరుస్తున్నాను గనుక ఆ అమ్మాయి నాకు దక్కడం అన్నది కలలో

వార్త. ఇక నాకు మిగిలింది ఒకటేదారి. ఆ గరుడ ధ్వజాన్ని హత్య అయినా చెయ్యాలి, నేను ఆత్మహత్యయినా చేసుకోవాలి' దామోదరం అంత సుళువుగా ఓటమి అంగీకరించే రకం కాదు.

'ఏదోయ్, ఆ ఎడ్వర్‌టైజ్‌మెంటూ వచ్చిన అప్లికేషన్లూ - ఆ అసిస్టెంటు ఫైలుకట్టా అంతా నా మొహాన్న పారెయ్ ఓసారి' అన్నాడు.

నీలాచలం నీరసంగాలేచి అది అతని కందించాడు. ముందు ఆ ప్రకటనా, తర్వాత ముఖ్యమైన ఆ రెండు అప్లికేషన్లూ, అరగంటసేపు కిందామీదా పెట్టి, చదివిందే చదివి, చూసిందేచూసి దామోదరం పెదవి విరిచేశాడు.

"లాభంలేదోయ్, మనకి పనికొచ్చే పాయింటు దొరకడం లేదు."

"దానికింత టైమువేస్టు ఎందుకోయ్ దద్దమ్మాగ్రణీ! 'రోగి ప్రాణం పోయింది' అని చెప్పడానికి ప్రతీసారీ డాక్టర్ చచ్చినాడే సర్టిఫికేట్ యివ్వాలాయేం ఖర్మ. ఈ చావుకబురు చెప్పడానికింత సస్పెన్సు కూడా ఎందుకు! ఇలాంటివాళ్ళని చూసే అన్నారు 'వైద్యో నారాయణోహరిః' అని!"

"అది అందరూ ఎరుగున్నదేకదూ, వేరే నువ్వు చెప్పేదేమిటి, అయినా ఆ మాట యిక్కడ వాడడంలో సందర్భం ఏమిటి?"

"పదార్థాలు ఒకలాగే కనిపిస్తాయి పైకి. ముక్క విరుచుకుని మనకి నచ్చేటట్టు రసం గ్రోలడంలోనే ఉంటుంది రుచి. 'వైద్యోనారాయణోహరిః' అంటే ఏమిటనుకున్నావ్? వైద్యుడి చేతిలో పడితే ఆ నారాయణమూర్తి అయినా హరీమనక తప్పదని!"

దామోదరం పక పక నవ్వుతూ నీలాచలం భుజంతడుతూ అన్నాడు 'ఓ పక్క బతుకంతా బండలయిపోతుందని ఏడుస్తున్నా ఎదుటివాణ్ణి నవ్వించ గలుగుతున్నావ్. నీలాంటివాణ్ణి సేవ్ చెయ్యకపోతే యింకెందుకు నా జన్మ, యింకేం స్నేహం నాది!'

'ఏమో యీ కాలపు కుర్రాళ్ళు, వాళ్ళతో మనం ఎక్కడ పోటీచెయ్యగలం! ఇంతకీ వాడు యిందాక వాళ్ళ స్నేహం గురించి ఏమన్నాడో తెలుసా?'

దామోదరం కుడి పిడికిలి అప్రయత్నంగా బిగుసుకుంది.

'ఏవడూ, మీ వాడేనా, ఏమాన్నాడేం"

"ఇంతగా వాడిని ఆశపెట్టి ఇప్పుడు గరుడధ్వజానికి మొండిచెయ్యి చూపిస్తే ఆ కుటుంబం ఏమైపోవాలి! మావాడికి ఎలా ఉద్యోగం రాదో నేనూ చూస్తాను లోకంలో స్నేహానికి ఆ మాత్రం విలువ లేకుండా పోతుందా! అన్నాడోయ్"

'అలాగా! లోకంలో స్నేహానికి ఆ మాత్రం విలువ ఉందో లేదో యీ కుర్రగాడిద కొక్కడికేనా తెలిసిందీ అదేమిటో నేనూ చూస్తాను!'

ఏదో నిశ్చయంతో లేచి పెద్ద పెద్ద అడుగులేస్తూ ఉన్నట్టుండి వెళ్ళిపోతున్న స్నేహితుణ్ణి చూడగానే నీలాచలానికి ఉన్న మతి కూడా ఊడిపోయినట్టయింది.

దామోదరం ఆ యింటి వీధి గేటు దాటుతుండగానే లోపలికొస్తూ భాస్కరం పలకరించడం జరిగింది.

'నమస్కారం బాబాయ్‌గారూ అంతా క్షేమమా! ఇప్పుడు మీ యింటికే వెళ్ళొస్తున్నాను.'

'అవునోయ్ అంతా చెప్పేడు. అనుకున్నదంతా తల్లకిందులు అయిపోయిందిటగా! మీ ఫాదరు

చేతిలో వుంటే మీ వాడికే ఉద్యోగం ఖాయం. కాని అనుకోకుండా పై దెయ్యం దిగిపోతోందిటగా! ఏం చేస్తాడో ఏమిటో!'

'అందుకే గద మీ యింటికి వెళ్ళి వస్త! ఇలాంటి విషయంలో ఏదో దారి చూపించి పుణ్యం కట్టుకోడం మీ లాంటి హైలీఇంటెలిజెంట్ పీపుల్‌కే తగును. గేటు దగ్గిర యిక్కడేమిటి, లోపలికి పదండి, కూర్చుని మాట్లాడుకుందాం.'

'లోపల ఏమిటో కంజెస్టెడ్‌గా ఉందోయ్ అలా నాలుగడుగులు మా యింటిదాకా రారాదూ, ఏమైనా ఉపాయం ఉందేమో చూద్దాం.'

తోటరాముడు మాయలఫకీర్ని అనుసరించినట్టు భాస్కరం దామోదరం కూడా వెళ్ళేడు. కొంతసేపు నిశ్శబ్దాన్ని అభినయించి 'పోనీ ఓ పని చేద్దామా? కాని, దేనికీ టైములేదు గద!' అన్నాడు.

'ఏమిటండీ అది?'

'ఏం లేదు, మీ గరుడ ధ్వజం ప్రస్తుతం ఎక్కడున్నట్టు?'

'ఇంటర్వ్యూ డేటు తెలుసుకుందామని వాడు హనుమకొండ వచ్చాడు. వాణ్ణి అక్కడ ఉంచి నేనిలా వచ్చాను. ఏం?'

'చెప్తాను. మీరు కుర్రాళ్ళు. మా వెనకతరం వాళ్ళ పోలసీలూ, పోకడలూ మీకు అర్థం కావు. కాబట్టి మీ వాడికి జాబ్ దొరకడం అనేది యించుమించు ఇంపాజిబుల్. లేనిపోని ఆశలు కల్పించక, నువ్వు వెళ్ళగానే స్పష్టంగా అతనికి చెప్పెయ్యి మరోచోట ట్రై చేసుకోమని.'

'ఈ మాట చెప్పడానికా.....'

'.... అదిగో ఆ తొందపాటే తగదు. దాన్తోపాటు మరో ఆఖరి గట్ట్ ప్రయత్నంకూడా చేసి చూద్దాం. గుడ్డివాడి చేతి రాయో అనుకో. ప్రయత్నంలో తప్పేముంది?'

'ఏమిటంటారు అది?'

'పూర్తిగా విను మధ్యలో ఆలోచన తెంపెయ్యకు పైకి ఎంత నిజాయితీ ఉన్నట్టు నటించినా యీ పుణ్యభారతిలో ఎవడి స్వార్థం వాడికి తప్పదు. అంత ఉరుకులూ పరుగులూ పెట్టి పై ఆఫీసర్ ఎందుకొస్తున్నాడంటావ్! వాడికి 'ఉప్పు' అంది ఉంటుంది. వాడి తాలూకు కేండిడేటు ఎవడో ఉండనే ఉంటాడు. అందుకనే ఫెయిలవ్వక తప్పదని నిర్ణయించుకునే మీ వాణ్ణి పరీక్ష పేపరు రాయమను ఇక నా సూచన అంటావా? వెంటనే ఫ్రెండ్‌చేత మరో అప్లికేషన్ పెట్టించు వీలయినంతగా కుటుంబ బాధలు విడమర్చి రాస్తూ మనసు కరిగేలా విజ్ఞప్తి చేసుకోమని రాయి. పోనీ నువ్వే వెళ్ళి కాగితం పెట్టించరాదు! అవునోయ్ ఆ మాట బాగుంది. ఇప్పుడు మా యింటికిరా. నమూనా తయారుచేద్దాం ఇద్దరం కలసి ఆలోచించి. ఏమో ఎవరు చెప్పగలరు దీని పర్యవసానం ఎలా వుంటుందో!' దామోదరం యింటికెళ్ళేడు భాస్కరం.

వెళ్ళిపోయిన మూడోరోజు సాయంత్రం దామోదరం నీలాచలాన్ని కలుసుకున్నాడు. అతి నీరసంగా మొహంపెట్టి 'ఏమిటి చూస్తానన్నావ్, ఇదేనా?' అని ఓ కవరు విసిరేడు అతను.

అది గరుడధ్వజం పెట్టుకున్న రెండో దరఖాస్తు. పాత దరఖాస్తుడేటూ నెంబరూ ఉదహరిస్తూ అసిస్టెంటు డైరక్టరు పేర పెట్టుకున్న పెర్సనల్ అర్జీ లాంటిది అది. ఉద్యోగానికి యోగ్యతలుగా నిర్ణయించబడిన అర్హతల ప్రసక్తి అందులో ఎత్తకుండా - తన ఆర్థిక దుస్థితిని హృదయ విదారకంగా

వర్ణిస్తూ - ప్రత్యేకమైన మానవతా దృష్టితో తన విషయం పరిశీలించి ఎలాగైనా తనకాపని యిప్పించమని ప్రార్థిస్తూ ఉత్తరం ముగించాడు గరుడధ్వజం. తను దగ్గిరుండి రాయించింది. సగర్వంగా చూసుకుంటూ అన్నాడు దామోదరం.

'అవునోయ్. ఇదే ఏం చేస్తున్నారో తెలియని పరిస్థితుల్లో నీ కొడుకునీ వాడి ఫ్రెండ్‌ని పెట్టి దగ్గరుండి సెల్ఫ్‌గోల్ చేయించింది దీనితోనే ఆ అప్లికేషన్ పెట్టుకుని సంతకంచేసి తనని తనే డిస్క్వాలిఫై చేసుకోలేదా గరుడధ్వజం! ఇన్నాళ్లై గవర్నమెంటు గిరీ వెలిగిస్తున్నావు. ఇన్నేళ్ళొచ్చేయి వంటిమీదకి. తెలీలేదా! నువ్వు పేపరు కిచ్చిన ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లో లాస్ట్ బట్ ఒన్ నిబంధన చదువుతున్నాను. విను. 'వ్యక్తిగతమైన హోదాలో ఏ విధమైన కేన్వాసింగ్ చేసినా ఆ దరఖాస్తు పరిశీలింపబడే అర్హతను కోల్పోతుంది. ఇంకేం? ఆ మొదటి అప్లికేషన్‌కిది జోడించి డిస్క్వాలిఫైడ్ అని ఎర్ర సిరాతో రాసి, సంతకం చేసి, ఆఫీసు ముద్ర వేసి, ఫైలు చెయ్యి..... ఆ చేత్తోనే విజయవాడకి పీపీ.... కాల్ బుక్ చేసి ఆ అమ్మాయిని పెట్టే, బేడా సర్దుకోమను". నీలాచలం దామోదరం రెండు చేతులూ పట్టుకున్నాడు.

'ఇవి చేతులు కావు..... 'అవి విదిలించేస్తూ దామోదరం అన్నాడు. 'నోర్మూయ్యి తియ్యి నీ పాపిష్టి చేతులు..... అవి చేతులే..... ప్రస్తుతం కల్తీ ప్లస్ కంత్రీ మన కంట్రీగా ఉంది గనక ఏ నాటకమైనా ఆడుతున్నాం అవతల ఓ కుటుంబం మట్టిగొట్టుకు పోతోందని తెలిసినా నీ వేడి నిట్టూర్పులు భరించలేక ఇంతకి తెగించాడు. ఒక్క ప్రహ్లాదుడికేనా వున్నారు స్నేహితులు, వాళ్ళ బాబుకి మాత్రం లేరూ!'

(అనామిక మాసపత్రిక)

# కంటకాభరణం




**ఇల్లెగిరి** పోయేటట్టు గుంట గుక్కపట్టింది.

'కాస్త దాన్ని ఊరుకోబెట్టవే చెల్లీ' అంటూ రామూ విసుక్కున్నాడు. పాపా వాళ్లమ్మ వచ్చేదాకా దాన్నెలాగో సముదాయించి మరీ ఇవతలి కొచ్చింది రేవతి.

అయినా దాని ఏడుపు అడపాదడపా వినిపిస్తూనే ఉంది. ఇది చాలక ఎప్పట్నుంచో పట్టుకున్న హాన చప్పుడు ఒకటీ.

"ఇంత వర్షంలో ఆవిడగారు వస్తుందో, రాదో" అన్నాడు రామూ.

"ఎవర్రా ఆవిడ?" అనడిగింది రేవతి.

"నిన్నటి సాహితీ సభలో కనపబడిందన్నానే దైవలీలగారని, ఆవిడా!"

"సభల్లో ప్రజల్ని చంపడంతో తృప్తి కలగలేదు కాబోలు, ఇంట్లో కూడా సాహితీ గోష్ఠులు

కాబోలు, కర్మ! ఇంతకంటె చంటిదాని ఏడుపే ఏ ఇంటికైనా సహజాలంకార మేమో!" రేవతి నవ్వుతూ అంది.

"అమ్మో, ఏమో అనుకున్నా.... నీ నోటకూడా చక్కని పలుకు బళ్ళు దొర్లుతున్నాయే!"

"ఏదో సావాసదోషంగాని, మీ రెక్కడ నే నెక్కడ!"

"నువ్వెక్కడో నాకు తెలీదు గాని చెల్లీ, అదిగో అక్కడ మెట్లమీద నిలబడి గొడుగు ముడుచుకుంటోంది - ఆవిడే ఇవాళ నా అతిథి. రండి దైవలీలగారూ! వానలో ఇబ్బందేం పళ్లేదుకదా!

'నమస్కారం రామారావుగారూ! ఇబ్బంది పడినా మీలాంటివారు ఆహ్వానించాక తప్పుతుందా?' అంటూ దైవలీల లోపలికొచ్చి కూర్చుంది.

"ఈ అమ్మాయి మా చెల్లెలు రేవతి. ప్రయివేటుగా తెలుగు బియ్యేకి కట్టింది"

"అలాగా.... సంతోషం.... ఇప్పుడెందుకండీ ఇవన్నీ?" అంటూనే కాఫీ టిఫినూ కానిచ్చింది దైవలీల.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ రేవతి అంది. "మిమ్మల్ని కలుసుకోవడం మా అదృష్టం. మీ గురించి అన్నయ్య ఎంతో చెప్పాడు"

"చెప్పడానికేముందండీ! ఆయన అభిమానంగాని! ముప్ఫై నిండకుండానే ఇటు గోల్డు మెడలూ, అటు డాక్టరేటూ సంపాదించాననుకోండి! అయినా అవన్నీ పైకి చెప్పుకుంటామా!"

"ఇంతకీ మీ థిసిస్ దేనిమీద?" అనడిగాడు రామూ ఆమె వినయానికి విస్మయపడుతూ.

"పరిశోధన దేనిమీ దంటారా? 'పానుగంటివారి కంఠాభరణంలోని తెనుగు నుడికారం' అనే సబ్జెక్టుమీద. గతంలోకి వెళ్లి ఆ ప్రాంతపు పలుకుబళ్ళు పైకి లాగేసరికి ప్రాణం పోయిందనుకోండి. ఎవరూ సాధించి ఎరగనిదాన్నే శోధించాలనేది నా ఆశయం. ఏం చెయ్యను! గొప్ప గొప్ప సాహితీవేత్తలే నా కృషి గమనించి 'ఇది అరుదైన సాహితీ విశ్లేషణ కాని మరొకటి కాదు' అని దీవించారు. ఈ జన్మకింకేం కావాలి! ఎక్కడో పాప ఏడుపు వినిపిస్తున్నట్టుంది"..... అంటూ ఆగింది దైవలీల.

"మా పెద్దక్కకి నాలుగేళ్ల బాబు తర్వాత ఈ పాప'

"అలాగా! పేరేం పెట్టేరు?"

"మావాడు చెల్లెల్ని అయిదు నిమిషాలపాటు ఏడిపించకుండా ఉండలేడు. దాన్తో మా పెద్దక్క వాణ్ణొకటి వేస్తుంది. వాడు బేరుమంటే, చెల్లి క్యారుమంటూ శ్రుతి కలుపుతుంది. పెద్దలు పెట్టిన పేర్లకేంగాని వీళ్ల నిత్య హోరు భరించలేక మేం సరదాగా 'లబో', 'దిబో' అనే పేర్లు పెట్టుకున్నాం."

దైవలీల నవ్వుతూ అంది- "బలే తమాషా పేర్లు పెట్టారే! సాహితీ ప్రియులు అనిపించుకున్నారు! ఇంతకీ ఏడవడం వాళ్ల జన్మహక్కు 'బాలానాం రోదనం బలం' అని ఊరికే అన్నారా పెద్దలు?"

"అంటే ఏమిటి మేడమ్? కాస్త వివరించరూ?" అనడిగింది రేవతి.

ఎదురుచూడని ఆ ప్రశ్నకి కలిగిన తడబాటు కప్పి పుచ్చుకుంటూ దైవలీల ఇలా అంది: "ఏదో అడిగారుగాని, మీకు మాత్రం తెలియదనా? ఏ సామెత అయిన ఊరికే పుట్టదుగా!' 'బాలానం రోదనం బలం' అంటే పసిపిల్లలు అన్నీ ఏడ్చి సాధిస్తారనే అర్థమయి ఉంటుంది,"

రేవతి "మరికాస్త విడమర్చి చెప్పరూ?" అనడిగింది.

దైవలీల ఇలా వివరించింది. "ఇప్పుడు గుక్కపట్టి ఏడుస్తున్న మీ నెలల పాపనే తీసుకుందాం.

దేనికేదైనా అవసరం వస్తే నడిచి వెళ్ళి తీసుకునే శక్తి లేదుకదా! అలాంటివాళ్లకి దేవుడిచ్చిన సాధనం రోదనం. గట్టిగా ఏడిస్తే అమ్మో నాన్నో వచ్చి ఆదుకోకపోతారా అనేది అందులో అంతరార్థం!

"నేనింకోలా చదివాను సుమండీ" అన్నాడు రామూ చటుక్కున.

"అనేక అర్థాలు ఉండొచ్చు. నే చెప్పిందే అసలైన అన్వయం" అంది దైవలీల నిశ్చయంగా, దృఢంగా.

అయినా రామూ తన వివరణ ఆపలేదు. "పోనీ ఇది కూడా వినండి. పసిపిల్లలు ఏడుస్తున్నప్పుడు కాళ్లూ, చేతులూ ఆడిస్తారు. ఒళ్లంతా కదిలిస్తారు. ఊపిరి బాగా పీల్చి వదులుతారు. అంటే శరీరంలో ప్రతి కండరానికీ వ్యాయామం జరుగుతుంది. అలా బాగా ఏడిస్తేనే తాగిన పాలు వాళ్లకి సరిగ్గా జీర్ణం అవుతాయి. ఆ వయసులో వాళ్ల కదే ప్రకృతి సూచించిన వ్యాయామం, బలం. ఈ మధ్యనే ఆ వివరణ చదివి అండర్‌లైన్ చేసి ఉంటాను. ఆ పుస్తకం తెచ్చి చూపించనా?"

దైవలీల కళ్ళు చిట్లించింది. 'పుస్తకాలకేం లెండి, అభిప్రాయ భేదాల పుట్టలు" అని కొట్టిపారేసి, "ఇంతకీ మీరేం చేస్తుంటారు?" అనే ప్రశ్నతో మాట మార్చింది.

"యూనివర్శిటీలో ఆనర్సు పిల్లలకి తెలుగు చెబుతుంటాను. మీరు.....?"

"ఇదిగో ఈ డాక్టరేట్ వచ్చాక ఎక్కళ్లేని ఆఫర్సూ వచ్చిపడుతున్నాయి. ఎందర్నని తృప్తి పరచగలం చెప్పండి.....? సరే నే వస్తా. వర్షం తగ్గినట్టు లేదే! వస్తే ఒక్కసారి ఇలాగే వచ్చేస్తాయి. ఊరూ వాడా నదులు పొంగి, జలకాలుష్యం జరిగి, ఎక్కళ్లేని రోగాలూ పట్టుకుంటాయి. అందులో మీ విశాఖపట్నంలో మరీనూ. 'విశాఖలో వర్షాలు, వ్యాధులకు హర్షాలు' అనే సామెత మీకు తెలిసే ఉంటుంది."

"కేవలం విశాఖపట్నంమీదే ఓ సామెత ఉండడం చిత్రంగా ఉందే!" అంది రేవతి.

"అది విశాఖపట్నంమీద కాకపోవడమే అసలైన చిత్రం!" అనే రామూ జవాబుకి ఉలిక్కిపడి "అదేమిటండీ, అంత స్పష్టంగా 'విశాఖలో వర్షాలు' అని ఉంటే?" అని దబాయించబోయింది దైవలీల.

రామూ ఈ సారి మాత్రం లొంగలేదు.

"అది ఓ వ్యవసాయ సామెత. అందులో 'విశాఖ' అనే మాటకు విశాఖపట్నం అని అర్థం కాదు. 'విశాఖ కార్తె' అని. ఆ కార్తెలో పడితే అది అకాల వర్షం అవుతుంది. అ కాలంలో పడిన వర్షం విశాఖపట్నంలో అయినా నిజాంపట్నంలో అయినా రోగాలకు కారణం అవుతుందని అర్థం."

"ఏమిటో... అన్నీ తెలిసినవారని ఆహ్వానిస్తే ఆశపడి వచ్చాను. ఇంతగా సాహితీ సీమలో ఎదిగిన నన్నే ప్రతీ దానికీ కొట్టిపారేస్తున్నారు. నే వెడతాను. వెళ్లేముందు ఒక్కమాట. జనాభా పెరిగి ఇప్పుడిలా తగలడిందిగాని మీ విశాఖపట్నం ఒకప్పుడు ఎంత బాగుండేది! పానుగంటివారు తన కంఠాభరణంలో 'విశాఖపట్నం భోగాలు' అనే పదం ఎన్నిసార్లు వాడారని! అది మరచిపోకండి.... శలవు" అంటూ విసవిసా నడిచి వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళే వరకూ ఎలాగో ఆపుకున్నాడుగాని ఆ తర్వాత విరగబడి నవ్వాడు రామూ.

"ఎందుక్కురా బాబూ అంత నవ్వు?" అని రేవతి అడిగితే అతని వివరణ ఇదీ....

"ఏం చెప్పను? 'కంఠాభరణం' అంతా ఇంచుమించు నాకు కంఠోపాఠం. పానుగంటివారు 'విశాఖపట్నంభోగాలు' అనే మాట వాడినమాట నిజమేగాని, దైవలీల చెప్పినట్టు మాత్రం కాదు.

ఆయన కాలంలో శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలన్నీ కలిసి 'మెద్రాస్ ప్రెసిడెన్సీ' గా ఉండేది. ఆ రోజుల్లో ఆ ప్రాంతాల్లో బోదకాలు అంటారు చూశావా, ఏదీ 'ఫైలేరియా' అనే రోగం, బాగా వ్యాప్తిలో ఉండేది. వ్యంగ్య హాస్య ధోరణిలో పానుగంటివారు ఉదహరించింది ఆ రోగం గురించే. నా బాధ అందుకు కాదు, డాక్టర్ దైవలీల పాఠాలు వినే తెలుగు పిల్లలు ఏమైపోతారో అని!"

*(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 17-4-96)*

# వాళ్లమ్మాయీ, అల్లుడూ

51



**'ఎవరూ,** నువ్వు గోపీగాడివి కదూ?'

అని అరుగుమీది కళ్లజోడుగాడు ఆరాతీస్తే!

'ఆరి చిదంబరం నువ్వట్రా?' అంటూ నా బొక్కినోరు మరింత వెడల్పయింది.

ఏభైఏళ్ల మా స్నేహం ఎన్ని నెమరు వేసుకుంటే తృప్తిపడను! అయినా ఎక్కడున్నా వాణ్ణి పట్టివ్వడానికి ఓ సుళువు ఉండనే ఉంది.

'ముక్కోటినాడు పుట్టేనట!' అనేవాడు చిదంబరం.

'బహుశా ఒక్కముక్కుతోటే పుట్టి ఉంటావు!' అనేవాళ్ళం వాడి దీర్ఘనాసిక పడిగట్టి. అనుకున్నది తక్షణం ఆచరణలో పెట్టే సాహసానికి సూదిముక్కు ఓ ప్రతీక అంటారు. నిజమే నేమో అని వస్తుంది వాడి జీవితాన్ని పరిశీలిస్తే.

ఆనాటి కాకినాడ పి.ఆర్. కాలేజిలో ఇంటర్లో క్లాస్‌మేట్సుగా మా తొలి పరిచయం. మేమందరం హాస్టల్లో ఉంటే వాడూ, వాళ్ల మేనత్తా వేరే చిన్నవాటాలో ఉండేవారు.

నేనెప్పుడు వెళ్ళినా ఆవిడ నోటి తిట్లదండకమే వినపడేది. "వేడి అనేది గర్భకుహరంలో ఉండాలిగాని మెదడుని చీటికీ మాటికీ వేడెక్కించేస్తుంటే తిన్నది జీర్ణం అవుతుందాంట! ఇలాంటి మొండి ఘటంతో మీరంతా ఎలా సర్దుకుంటున్నారో ఏమో! వాడి రుచులకీ పదున్లకీ తట్టుకుని వండి వడ్డించలేక నా ప్రాణాలు పోతున్నాయి బాబూ!"

చిదంబరం ఓ పట్టాన నలుగురితో కలిసేవాడు కాదు.

ఎప్పుడైనా నోరు విప్పితే అది నాతోనే.

ఎందర్లో ఉన్నా వాడి ప్రత్యేకత వాడిదే.

చదువు పూర్తై, పెళ్లై, ఉద్యోగం వెలగబెట్టే రోజుల్లో అయినా అది తగ్గాలంటారా? ఊహు వాడితో అది పెరుగుతూనే వస్తోంది!

ఏదైనా చెబితే నాతోనే చెప్పేవాడు, అంతే అందుకే వాళ్ళ నాన్నగారైనా నా ముందే గోల పెట్టేవారు.

'చూశావటోయ్ గోపీ, మీ ఫ్రెండ్ చేసిన నిర్వాకం? ఇంకా పెళ్లై ఏడాది అయిందో లేదో ఉన్న ఊళ్లోనే వేరింటికాపరం పెట్టేటంత ఘనుడైపోయాడు!'

ఆశ్చర్యంతో నానోట మాట రాలేదు.

వాళ్లమ్మగారు ఆ మధ్యనే పోయారని విన్నాను.

ఆవిడ అస్తమానూ ఏదో రోగంతో తీసుకునేది. వాళ్లమ్మగారి అక్క శాంతమ్మగారు కాబోలు యిల్లు చూసుకునేది. చిదంబరమూ, వాడి పెళ్లామూ ఎప్పుడూ ఇంటి బాధ్యతను చేపట్టిన దాఖలాలు లేవు. ఇలాగైనా ఉండనీక వేరింటి కాపరమా!

'ఈ పల్లెటూళ్ళో ఇక నేనెలా తలెత్తుకు తిరగ్గలనయ్యా? మా కుటుంబం పరువు ఏం కావాలి?' అని మొత్తుకున్నాడంటే వాళ్ల నాన్నగారిదా తప్పు? దానికి మా చిదంబరం జవాబేమిటో విన్నారా? 'అదే నేనూ ఆలోచిస్తున్నాను. వీలైనంత తొందర్లో ఈ ఊర్నుంచి ట్రాన్స్ఫరు చేయించుకోవాలి మరి'

అంటూ వాడు చెప్పిన సంజాయిషీ యిదీ:

పెళ్లినాటికే చిదంబరం కాబోయే భార్య టీచరుగా పని చేస్తూండేది. పెళ్లయ్యాక కూడా సాగించింది. ఇద్దరూ ఎవరి ఉద్యోగాల్లో వాళ్లు వీధినపడితే, వాళ్లమ్మగారు బతికున్నన్నాళ్లు యింటిపని చూసుకొనేదిట. ఆవిడ ఓ రోగిష్టి మనిషి కనక వాళ్లక్క, తల చెడి అక్కడ చేరిన శాంతమ్మగారే, చెప్పాలంటే, అంత బాధ్యతా వహించేదిట. మరింతకూ ముందే ఉందో, చెల్లెలు పోయాక అలా జరిగిందో, శాంతమ్మగారు మరిది పడకగదిలో కూడా స్థానం సంపాదించిందిట! ఇదేం పని అని ఎవరైనా పరోక్షంగా అయినా నిలదీస్తే వాళ్లనాన్న ముసిముసి నవ్వులతో దాటేశేవాడట. నలభై అయిదేళ్ల నడివయస్సులోనే కట్టుకున్నది దగాచేసి తన దారి తను చూసుకుంటే మగాడన్నవాడు ఏ సంబంధమూ పెట్టకోక చస్తాడా!' అనే బంధువుల తీర్పు వింటూ ఆ యింట్లో ఉండడం చిదంబరం భరించలేకపోయాడట! అందుకే మూటాముల్లే సర్దుకుని వైరైపోయారుట.

'ఒరే నీ యిష్టం వచ్చినట్టు నువ్వు చేస్తావు కదా, ఆయన తంటాలేవో ఆయన పడితే మధ్య నీకెందుకు మంట? అయినా యింటికి పెద్ద కదా....'

'అలాంటి పెద్దల చిన్న బుద్ధుల్ని నేను భరించలేకపోయాను గనకనే!'

అయినా వీడికి అక్కర్లేని గొడవంటూ లేదు. ప్లీడరుగా పేరుపొంది వీళ్ల నాన్న చచ్చినంత ఆస్తి సంపాదించాడు. వీడా ఒక్కగానొక్క కొడుకు లోకంలో అన్నీ మనకి కావలసినట్టే జరుగుతాయా, అందరూ మనం చెప్పినట్టే వింటారా? జన్మనిచ్చిన తండ్రి బలహీనతనే క్షమించలేకపోతే మనం ఏం సరిపెట్టుకోగలం, ఏం సుఖ పడగలం!

నేనెన్నివిధాల చెప్పినా అది చెవిటివాడి ముందు శంఖం ఊదడమే.

"అలా సరిపెట్టుకోడం నా దృష్టిలో కేవలం ఆత్మవంచనే. సుఖపడడం అనే మాటకి నా నిర్వచనం వేరు. అది నా తండ్రి విషయంలో అయినా ఒకటే, రేప్పొద్దున్న నా పిల్లల విషయంలో అయినా అంతే''

'చూద్దాంలే రక్తం బిగి ఉన్నప్పుడు ఎన్ని శపథాలైనా చెయ్యొచ్చు'

'నువ్వే చూస్తావుగా!

అనే ఎదురుసవాలే మా చిదంబరంగాడి రడీమేడ్ జవాబు.

'రక్తం బిగి'మాట దేవుడెరుగుగాని వాడి 'పంతంబిగి' మాత్రం ఎక్కడా చెక్కు చెదిరినట్టులేదు. వేరే ఊళ్లలో ఉద్యోగాల్లో స్థిరపడినా మంచికో చెడ్డకో అప్పుడప్పుడు మేం కలుసుకుంటూనే ఉన్నాం. ఎప్పట్లా వాడి విశేషాలు నన్ను ఆశ్చర్యంలో ముంచి తేలుస్తూనే ఉన్నాయి.

ఇంతకీ బాగా సంపాదించారన్నమాట నిజమే గాని అంతకు మించిన అప్పులు కనిపించేయిట, చిదంబరం నాన్న పోయాక చూసుకుంటే. ఉన్న యిల్లూ, కాస్త పొలమూ, ఆయన స్వార్జితమే గనక, సర్వహక్కులతో శాంతమ్మగారి పేర రాసేసి మరీ కన్ను మూశారట!

'మీ పెద్దమ్మగారు మీ నాన్నగారికి మందో మాకో పెట్టి అంత ఆస్తి రాయించేసుకుని ఉంటుంది. కన్న కొడుక్కి చిల్లి గవ్వ యివ్వకపోవడం ఎక్కడైనా ఎరుగుదుమా! మీరు కోర్టుకెక్కండి, ఊరుకుంటే లాభం లేదు' అని బంధువులు ఉసిగొల్పేరు.

'మనం లేదని కాదు, అన్యాయం జరుగుతూ ఉంటే చూస్తూ కూచోడం అధర్మం. నువ్వు వెంటనే ఓ కాగితం తగిలించు అల్లుడూ' అని మావగారు మరింతగా ప్రోత్సహించాడు.

నిజానికి వాళ్లమావగారు చెప్పినట్లు చిదంబరం ఆర్థికస్థితి ఒకళ్ల నుంచి రాబట్టవలసిన పద్ధతిలో లేదు ఆనాటికి. చిదంబరం క్లాస్ వన్ పోస్టులో ఉన్నాడు. వాళ్లావిడ హెడ్‌మిస్ట్రెస్ స్థాయికి చేరింది. ఒక్కర్తే కూతురు, హేమ అంటారు, ఎం.బి.బియస్ రెండో ఏడు చదువుతోంది.

దశాబ్దాలుగా మొగుడి మొండివైఖరికి అలవాటు పడిపోయిన అతని భార్య చూడామణి ఎట్టి పరిస్థితుల్లోనూ సలహాలు యిచ్చి ఎరగదు. అతనెప్పుడూ ఎవర్నీ దేనికీ సంప్రదించడు. తను అనుకున్నది చెయ్యకా మానడు! అందుకే ఆ రోజు.

'నేనోసారి పిఠాపురం వెళ్ళి పెద్దమ్మ వ్యవహారమేమిటో తేల్చుకుని వస్తాను' అని భర్త బయల్దేరుతూంటే మతిపోయినట్టు చూసింది.

అలా వెళ్ళిన పెద్ద మనిషి వారం రోజులకి గాని తిరిగొచ్చి ఆఫీసు పన్లో జాయిన్ కాలేదు. అతను చేసుకొచ్చిన నిర్వాకం విని మరి ఆ పెళ్లామూ వాళ్ల వాళ్లూ ఎలా తట్టుకున్నారోగాని, సాటి స్నేహితుణ్ణి నాకే నోట మాట రాలేదు!

## వాళ్లమ్మాయి, అల్లుడూ

ఇంతకీ రెండోసారి వైధవ్యం అనుభవించినంత దుస్థితిలో ఉందట వాళ్ల పెద్దమ్మ. మరిది ఆవిడపేర ఆస్తంతా రాసేశాడని తెలియగానే. ఎక్కడెక్కడి చుట్టాలూ యిల్లు నిండిపోయారట. ఆ సలహాల తీరుతెన్నులెలాంటివో ఆవిడ ఎరగదట. ఏకాంతంగా వేరే పిల్చి అన్నీ చిదంబరానికి చెప్పుకుని గొల్లుమందిట.

మీకు నేను చేసిన ద్రోహం చాలు. కన్న కొడుకువి, న్యాయమైన జ్ఞాతివి. నీకు గాక, ఆయన రాస్తే రాశారు. ఈ పాపం యింకా యింకా నేనే మూట కట్టుకుపోవాలా! వెంటనే నన్ను ప్లీడరు దగ్గరకి తీసికెళ్లు. నీకెలా రావాలో ఆ ఏర్పాటు చెయ్యి. ఎక్కడ సంతకం పెట్టాలో చెప్పు. నన్నే కాశీయో పంపేయ్యి' అని బతిమాలిందిట.

ఆ రాత్రే ఆవిడకి చిన్న హార్ట్ ఎటాక్ లాంటిది వచ్చిదిట. అంతకుముందే ఆవిడంటే ఎంతో ప్రేమ చిదంబరానికి. తల్లి సంకటం మనిషి గనక అతని ఆలనాపాలనా ఎక్కువగా చూసింది ఆవిడే మరి. ఇంతకీ అతని కోపం వాళ్ల నాన్నగారి మీద తప్ప అన్నేళ్లపాటు ఆ ఇల్లు నడిపిన పెద్దమ్మ మీదకానేకాదుగా!

'పెద్దమ్మా నేను ఏం చెబితే అలా చెయ్యాలి. కాదూ కూడదంటే నేను యిప్పుడే వెళిపోతాను' అని ఆవిడ చేత ఒప్పించాడుట. ఊళ్లో బాగా తెలిసిన ప్లీడర్ని కలిసి అతను అక్షరాలా అమలు చేసిన నిర్ణయాలు యివీ: ఆ యిల్లుగాని భూములుగాని వాళ్ల నాన్నగారి స్వార్జితం ఆయన వీలునామా ప్రకారం అవన్నీ పూర్తిగా శాంతమ్మకే దక్కుతాయి. తనకిగాని తన వారసులకి గాని వాటి మీద ఎలాంటి హక్కూలేదు. రెండో మేనమామతో సంప్రదించి వాళ్ల ఆఖరబ్బాయి పదేళ్ల శంకరాన్ని శాంతమ్మగారికి దత్తత యివ్వడానికి ఒప్పించడమేగాక ఆ తతంగాన్ని దగ్గిరుండి రిజిస్టరీ చేయించాడు కూడా. ఇందులో ఎవరేం తలదూర్చి చిక్కులు పెట్టడానికి ప్రయత్నించినా ఓ కార్డు ముక్క రాస్తే చాలు, తనొచ్చి సరిదిద్దుతానని పెద్దమ్మకి భరోసా యిచ్చి మరీ రైలెక్కేడట చిదంబరం!

ఇదంతా ఏదో పెద్ద ఘనకార్యమనీ, త్యాగమనీ చిదంబరం మురిసిపోవచ్చునుగాని నాకేమంత సబువుగా మాత్రం తోచలేదు. ఆవిడగారు తనంతట తానే ఒప్పుకుంది, 'ద్రోహమనీ'. పోనీ అనుభవించినంతకాలం అనుభవించి తర్వాతైనా వీళ్లపేర రాసిమ్మంటే అదోరకం. ఈ దత్తత వ్యవహారం కూడా ఏమిటి! తనకీ ఓ సంసారముందనీ, బాధ్యత ఉంటుందనీ, మరచిపోతే ఎలా? ఇదెలాంటి వ్యక్తిత్వం? ఇద్దరూ నాలుగు చేతులూ సంపాదించుకుంటూ ఒకే ఒక పిల్లనయితే కనిపారేశారుగాని, నాలాంటి బహు కుటుంబీకుడైతే ఏమైపోవాలి!

చిదంబరం పెళ్లాం గనక అన్నిటికీ మౌనంగా ఓర్చింది గాని మరో ఆడదైతే యీపాటికే మొగుణ్ణి వీధినపెట్టేసి జలకడగేసి ఉండును. పాపం మాదొడ్డ యిల్లాలు. కొంగున అగ్నిహోత్రం కట్టుకుని యిలాంటి తలపొగరుగాడితో యిన్నేళ్లపాటు ఎలా నెట్టుకొచ్చిందో! అందుకే ఆమెని ఆ దేవుడు చల్లగా చూసి ఉండాలి. కూతురు హేమ చదువు పూర్తయింది. ఉద్యోగం కూడా అయింది. కలిగున్న యింట్లో , మంచి హోదాగల ఉద్యోగం చేస్తున్న వరుడికిచ్చి పెళ్లి చేసింది. తన డ్యూటీ అయిపోయింది, ఇక యీ రణపెంకి భర్తతో ఎన్నేళ్లు కాపరం చేసినా ఒకటే. హాయిగా పసుపు కుంకుమలతో వెళ్లిపోయింది, అదృష్టవంతురాలు!

అప్పటికి మా చిదంబరంగాడు రిటైరై ఏడాది దాటింది పెద్దముక్కూ, దానికి తగ్గ ముక్కు

సూటి వ్యవహారమూ గనక, పెద్ద వుద్యోగం వెలిగించినా ఓ చిన్న కొంపైనా కట్టుకోలేదు. చేసన గుప్త దానాలకి లెక్కా జమా ఎలాగేలేదు. 'వేరే ఏం మిగుల్చుకోలేదని నాకెందుకు దిగులు! సర్కారు ధర్మమా అని నే ఎక్కడ ఉన్నా నెలకి మూడువేలు పెన్షన్ రాళ్లు చేతిలో పడతాయి. బక్కపేగుల వాణ్ణి, నేనెంతతిని చావాలి, నాకయే ఖర్చనగా ఎంత!' అనే ధీమా ఉన్న వాణ్ణి ఎవరెదిరించగలరు! మా దగ్గిరొచ్చి ఉండండి నాన్నా' అని కూతురూ అల్లుడూ వచ్చి ఎంతో బతిమాలితే తప్ప, ఒప్పుకోలేదట ఈ సంగతి ఎవరో చేరేసిన వార్త చెవిలోపడితే 'దారికావురా దొంగ!' అనుకున్నాను కసిదీరా.'ఎంతో బతిమాలితే తప్ప!' అనే బోడి సంజాయిషీ కూడా దేనికీ! వృద్ధాప్యం ఒంటరితనం, అజీర్ణరోగం అంటూ స్పష్టంగా ఒప్పుకోక! ఎవరైనా ఎప్పటికైనా పరిస్థితులతో రాజీపడక తప్పదు. 'రేపొద్దున్న నా పిల్లల విషయంలోనైనా అంతే!' అంటూ బీరాలు పలకడం కాదు. ఇన్నేళ్లకు ఈ విధంగా మళ్లీ కలుసుకున్నాం గనక మొహం మీదే అడిగెయ్యాలి వీడి పంతం ఏమైందో....

ఇన్నేళ్లకు మళ్ళీ ఒకర్నొకరం కలుసుకున్నామనే ఆనందానుభూతితో మై మరచి ఏవేవో అనుకుంటున్నాను గాని కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే చిదంబరంగాడు ఇప్పుడున్నది వాడి అల్లుడి క్వార్టర్సు కానేకాదు!

వాడికి మాత్రం ఎవరున్నారు గనక, కూతురికీ తనకీ మధ్య నడచిన వ్యవహారమంతా పూసగుచ్చినట్టు చెప్పుకొచ్చాడు చిదంబరంనాతో...

హేమ డాక్టరు. వాళ్లాయన ఎలక్ట్రానిక్ ఇంజనీరు. ఏదో ప్రైవేటు కంపెనీలో టెక్నికల్ కన్సల్టెంట్ మంచి క్వార్టర్సు కాక అన్నీ ఫ్రీ. పెద్ద హోదా. పెళ్లైన అయిదేళ్లదాకా పిల్లలు వద్దనుకున్నారు గనక ఆ ఖర్చూ ప్రస్తుతం లేదు. మొగుడెవరికి పెట్టేస్తాడో అని చూడామణి గారు తను సంపాదించిందంతా కూతురికే పెట్టేసింది, ఫర్నిచరూ, బంగారమూ కాక.

'లోకం ఏమనుకుంటుందో అని నేనెప్పుడూ లెక్కపెట్టింది లేదు. మీకెంత డబ్బున్నా నా ఖర్చు నేను పెట్టుకుంటేనే నాకు ఆనందం. నాకొచ్చిన పింఛెన్లో నెలనెలా రెండువేల తొమ్మిదొందలు మీకు యిచ్చేస్తాను. అలా మీరు పుచ్చుకుంటానంటేనే మీ యింటికి వస్తాను.' అనే నిబంధన పెట్టేడుట చిదంబరం, కూతురింటికి చేరడానికి.

'నాన్నా నీదంతా ఏకపక్షవాదం. తాతయ్య ఆస్తంతా పెద్దమ్మకి దోచిపెడితే మేం ఎవరమైనా పల్లెత్తు మాట అన్నామా! నువ్వు అననిచ్చావా! తల్లిపోతే కనిపెంచిన కన్న తండ్రిని గాలికొదిలేసిందనే నింద యీ నాడు నాకెందుకు? మాకిద్దరికీ కలిపి కొప్పెట్టినంత డబ్బుంది నీ డబ్బు పుచ్చుకుని నీకు తిండి పెట్టవలసిన దుస్థితిలో మేంలేం. ఇదేమైనా నీకు న్యాయమా?

'నీ విషయంలో న్యాయం యింకోలా ఉంటేనే చేసేది ఏమీ లేదు. అందుకే అన్నీ ముందే స్పష్టంగా చెబుతున్నాను. నువ్వూ అల్లుడు గారూ బాగా ఆలోచించుకుని దీనికి ఒప్పుకుంటేనే మీ గడపతొక్కేది'

అల్లుడి చేతకూడా అవుననిపించుకుని మరీ చిదంబరం వాళ్ల క్వార్టర్సుకి మారేడుట. చెప్పినట్టే. నెలనెలా రెండువేల తొమ్మిదొందలూ వాళ్లకిచ్చేశేవాడుట.

'ఆ మిగిలిన వందా నీ సొంతఖర్చుల కోసం కాబోలు" అన్నాను.

'నాకేం కావాలో అన్నీ ముందుగానే వాళ్లు అమర్చి పెడుతూంటే యింక సొంత ఖర్చులంటూ

ఏం ఉంటాయి?'

'అయితే ఆ వందా ఏం చేసేవాడివి?'

'నీకు గుర్తుందా, ఆ రోజుల్లో, ఏది, మనం యింటరు చదువుకొనే రోజుల్లో నేను వేరే వాటా తీసుకుని ఉండేవాణ్ణి, అప్పుడు మా అత్త నాకు వండి పెడుతూ ఉండేది!

'కాకినాడలో కదూ? అవును. గుర్తొచ్చింది. నీకు వేళకి అమర్చలేకపోయానని గోల కూడా పెట్టేది. ఆవిడేనా?'

'అవును ఆవిడే. మా నాన్నగారికి దూరపు కజిన్. ఏదో తప్పక ఆ రెండేళ్లూ ఆవిడచేత చేయించుకున్నారుగాని మానాన్నగారి తరపువాళ్లకెవరికీ మా అమ్మ పైసా పెట్టనిచ్చేది కాదు. మాట ఎంత పెళుసో మనసు అంత మృదువు మా మేనత్తకి. అసలే అర్భకుణ్ణి, ఆపైన ఎమీబియాసిస్ పట్టుకుని ఎంత బాధపడ్డానో ఆవిడ నన్నెంతగా కనురెప్పలా చూసుకునేదో నేనెప్పటికీ మరచిపోలేను. ఉన్న ఒక్కకూతురికీ పెళ్లి చేసే స్థోమత లేక ఓ తాగుబోతు తమ్ముడికి కట్టబెట్టింది. వాళ్లకో పోలియో కూతురు పు ంది. ఇప్పుడా ముప్పైఏళ్ల అష్టనాకారాల రాముడమ్మ తప్ప వాళ్ల వాళ్లెవరూ బతికిలేరు'

'ఆ రాముడమ్మకి పెళ్లయిందా?'

'అసలా ప్రసక్తికే అవకాశం లేదు. మా బంధువుల్లో అలాంటి అమ్మాయి ఒకర్తున్నట్టు నేను కనిపెట్టింది కూడా బాగా ఆలశ్యంగానే. చిన్న కిరాణా కొట్టు లాంటిది పెట్టుకుని, ఎలాగో కష్టంమీద రోజులు యీడుస్తోందిట. రెండేళ్లై రాముడమ్మకే నేను నెలనెలా వంద చొప్పున పంపించేది'

అంటూ తనకీ హేమకీ ఎందుకు ఘర్షణ వచ్చిందో బయట పెట్టేడు చిదంబరం. ఓసారి కూతురడిగిందిట! ఓ ఆర్నెల్లు గడిచాక కాబోలు.

'ఆ వందా ఏం చేస్తున్నావ్ నాన్నా!'

'రెండు వేల తొమ్మిదొందలే వద్దన్నారు కాదుటే?'

'ఇప్పుడు మాత్రం కావాలనా! అవసరం వచ్చింది గనక. మాకొచ్చిందాంట్లో నెలకో పదిహేనువేలు చీటీ కట్టేస్తూన్నాం కదా.... అదిగాక మీ అల్లుడుగారు ఫైనాన్సులో మారుతీకారు తీసుకున్నారు. దానికో మూడువేలు తక్కువొచ్చింది నెల నెలా తీర్చేది. నీ పెన్షన్ చెక్కు అలా ఇచ్చేస్తే నీ పేరు చెప్పుకున్నట్టు అవుతుంది. ఏదైనా అప్పుగానే. నీ దగ్గిర యిన్నాళ్లూ ఎంతెంత పుచ్చుకున్నామో ఆయన ఎకౌంట్ వేస్తూనే ఉన్నారు. పరాయిసొమ్ము పైసా పుచ్చుకుంటే ఆయన పై ప్రాణం ఎగిరిపోతుంది. నేనూ అంతేనని నీకు తెలుసుకదా! కాబట్టి పై నెల నుంచీ ఆ వందా కూడా యిచ్చేస్తే....'

తనిలా రాముడమ్మని ఆ సొమ్ముతో ఆదుకుంటున్నానని చెబితే హేమ పలికిన ఒక్కొక్క అక్షరం ముల్లులా దిగబడిందిట, అతని గుండెలో.

'ఇంకా ఎవరో అనుకున్నాను. ఆ ముష్టిముండ రాముడమ్మకా నువ్వు నెలనెలా వందేసి రూపాయిలు పంపేది! ఇలా అయినవాళ్లకి ఆకుల్లోనూ, కానివాళ్లకి కంచాల్లోనూ ఎన్నాళ్లు పెడతావ్ నాన్నా ! అది మన దూరపు బంధువని చెప్పుకుంటేనే సిగ్గుతో తల వంగిపోతుందే! పేరుకి కిరాణా కొట్టుగాని ఆ రాముడమ్మే కిరాయిని దొరుకుతుందని అందరూ చెప్పుకుంటారే!'

ఇక కూతురితో వాదన ఎందుకనుకున్నాడో ఏమో చిదంబరం రెండు చెవులూ మూసుకున్నాట్ట.

అలాగని ఆ నెల వంద పంపడం మాననూ లేదట.

రెండోసారి కూడా హేమ గొడవ పెట్టక మానలేదు.

'నీ ధోరణి నీదే అనుకుంటే నే చెప్పలేనుగాని నాన్నా, ఈ సంగతి తెలిసి మీ అల్లుడెంతో చికాకు పడుతున్నారు. పోనీ ఒకరిమాట ఎందుకు? మనమే ఆలోచిద్దాం. ఆ రాముడమ్మకి యింత పిసరు కృతజ్ఞత ఉందా? రోగంతో తీసుకుంటున్నావు, నీ డబ్బు తింటోంది. 'కులాసాగా ఉన్నావా?' అని ఒక్క కార్డుముక్క రాసిందా! అమ్మ పోయినప్పుడైనా నిన్నొచ్చి చూసిందా? బొత్తిగా పాముకి పాలు పొయ్యడం ఏమిటి నాన్నా!'

ఈసారి కూడా యిట్నించి ఉలుకూపలుకూ లేదు. కన్న కూతురి మీద ప్రేమ చంపుకోలేక యింకో ఛాన్సు యిద్దామనుకున్నాట్ట. నెల్లాళ్ళు ఎంతలో గడవాలి! 'మీ అల్లుడే మన్నారో తెలుసా నాన్నా!' పాపం ఏదో అమాయకత్వంలో పడిపోయి ముందే వాగ్దానం చేసేశారేమో మావయ్య! అనుకున్న ప్రకారం ఈ నెలకూడా పంపేసి చేతులు తుడిచేసుకుని ఉంటారు- ఆ మాత్రం సర్దుకోలేమా ఏమిటి, మనకేం లేదా పోదా! ఏం నాన్నా అంతేకదూ? వచ్చే నెల నుంచీ మాకు అందేది రౌండ్ ఫిగర్ కదూ!'

చిదంబరం కూతురి మాట ఓ విధంగా కరెక్టే చేశారు! ఆ పై నెల నుంచీ. 'రౌండ్ ఫిగర్' అంటే అతని దృష్టిలో సున్నా అని అర్థం. ఓ విధంగా కూతురిలా నిత్యం నిలదియ్యడమే. అతనికి కనువిప్పుకలిగించింది. న్యాయమేదో చూపించింది. తన తిండి ఖర్చు మహా అయితే తొమ్మిదొందలు అనుకుందాం. అయితే తను చేస్తున్నదేమిటి? నెలకి పాతికవేలు సంపాదించే వాళ్లకి రెండూ వేలూ, కిరాణాకొట్టు పెట్టుకుని గుట్టుగా తన మటుకు తను బతుకుతున్నా ఒళ్లమ్ముకుంటోందని నలుగురూ ఆడిపోసుకునే ఓ పరమ నిర్భాగ్యురాలికి కేవలం వంద మాత్రమేనా! వీళ్ల పంచ చేరినందుకు తన సొమ్ములో తను ఆమాత్రం ఖర్చుపెట్టుకోడానికి కూడా స్వతంత్రం లేదా!

నిర్ణయం తీసుకున్నాక చిదంబరానికి మళ్ళీ వెనుతిరిగి చేసే దృష్టే ఉండదు. అతను కూతుర్నివదిలేసి రామడమ్మ పెంకుటిల్లుకి చేరి అంతా మూణ్ణెల్లు గడిచిందిట! చిదంబరాన్ని నేనిప్పుడు కలుసుకున్నది రాముడమ్మ వీధి అరుగు మీదనేనట!

'ఏంరా నేను చేసింది రైటా తప్పా?' అని ఆ అహంకారి నన్నెప్పుడూ ఆడగడు నేనేం చెప్పినా వాడెలాగా వినడు. ఫట్టెడు కర్ర తగలేస్తేగాని ఆ బుద్ధి మారదు చాలా ఏళ్లై కలుసుకున్నానని సరదాపడ్డాగాని ఆ సంబరం నాలో ఆట్టేసేపు నిలబడలేదు. అక్కణ్ణుంచి కదిలిపోయేదాకా నా గుండెదడ వదల్లేదు! వాళ్ల గొడవ నాకెందుకు!

పొద్దుట లేచి పాలపేకెట్లు తెచ్చింది మొదలు, రాత్రి యింటి తాళాలు వేసే వరకూ చాకిరీ చేసినా కోడలి చేత దెప్పులు తినని రోజుండదు నా లాంటి ముసిలాడికి. అందరితో 'అమ్మాబాబూ' అంటూ గడుపుతూ 'కృష్ణారామా' అని ఓ చోట పడుండవలసిన రోజులు. నాకెందుకు బాబూ ఈ చిదంబరంలాంటి వాడి గోల! ఎంత స్నేహితుడు అయితేనేం యిలాంటి వాడితో యింత సేపు గడపడమే నాలాంటి అల్పజీవికి ఓ సాయుధ విప్లవం!

*(ఇండియా టుడే, 14-7-98)*



## వాళ్లమ్మాయి, అల్లుడూ

# కేరింతలు




**పెళ్లాం** ఫోటో ఆప్యాయంగా చేత్తోపట్టుకుని అలా చూస్తూ చాలాసేపు కూచున్నాడు సాంబయ్య తాత. అలా చూస్తున్నప్పుడు ఆ పెద్ద పెద్ద కళ్లు మిలమిల మెరుస్తాయి. ఆ మెరుపు చూడ్డం కిష్టిగాడికీ రాంబాబుకీ చాలా యిష్టం. వాళ్లు అక్కడికి చేరడంలోని అనేక కారణాలలో ఆ యిష్టం చాలా ముఖ్యమైనది.

సాంబయ్య అక్కడితో ఊరుకోక ఆ ఫోటో ఫ్రేము వెనక్కి తిప్పుతాడు. ఆ వైపు కూడా ఆప్యాయంగా తడుముతూ ఉంటాడు. 'బామ్మగారి వీపు తడమడం కాబోలు!' అంటాడు కిష్టిగాడు. వాళ్ళతోపాటు సాంబయ్యా నవ్వేస్తాడు.

అత్తగారి బాధలు పడలేక, మొగుడు కూడా పరమదుర్మార్గుడైతే భరించలేక, అయిదేళ్ల కూతుర్నెత్తుకుని ఆనాడు వీధినపడిన రాజ్యాన్ని 'ఇదిగో నేనున్నాను' అంటూ నిజంగా వెన్నుతట్టి ఆ నాడు ఆదుకున్నది సాంబయ్య. అలా పారిపోయి మరో ఊర్లో తలదాచుకున్న వాళ్లతో ఉన్న పిల్లని చూసి అదంతా ఒక కుటుంబంగానే జమకట్టింది సంఘం. మనసులు కలుపుకున్న వాళ్లే కదా

మొగుడు పెళ్లాలు!

కాని రాజ్యం కూతురు హనుమాయమ్మ మాత్రం ఏనాడూ సాంబయ్యని 'నాన్నా' అని పిలిచి ఎరగదు. తన తల్లి అక్కడే ఎలాగో సర్దుకొని పోయి ఉంటే తన జీవితం మరింత బాగుపడి ఉండేదని ఆమె దృఢవిశ్వాసం. వాళ్లు బాగా భాగ్యవంతులు మరి! తల్లి చేసిన దగుల్బాజీ పని తలచుకుంటేనే ఆమె ఒళ్లంతా సెగలూ పొగలూను. పెళ్లీ పెటాకులూ లేకుండా తన బతుకు యీ నాడిలా పక్కదారులు తొక్కిందంటే ఆనాడు తన తల్లి చేసిన వెధవపనీ, దానికి దారితీసిన ఈ దొంగ పీనుగ నిర్వాకమూ కారణం కాదూ! ఇంకా తను మంచిది కాబట్టి వీడికింత వండి పెడుతోంది. మరొక్కర్తియితే ఈపాటికి తన్ని తగిలెయ్యదూ?

సాంబయ్య ఆలోచనలు మాత్రం దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంటాయి. హనుమాయమ్మ పట్ల అతనికి అనంతమైన ప్రేమా, జాలీ. అది ఒప్పుకోదుగాని ఎప్పుడూ ఒళ్లో కూచోపెట్టుకుని 'అమ్మలూ' అంటూ తల తడమాలని ఉంటుంది. సవితి తండ్రి అనే భేదబుద్ధి లేక తనకోసం రెక్కలు ముక్కలు చేసుకుంటోంది. దాని ఆసరా లేకపోతే ఈ ముసిలివయసులో తను ఏమైపోను?

కనకలక్ష్మి కాన్వెంటులో హనుమయమ్మ ఆయాగా పని చేస్తోంది. ఏడున్నరకి లేచిన మనిషి అన్ని పనులతో పాటు వంటకూడా పూర్తిచేసి వీధిన పడుతుంది. ఏదైనా ఆడుతూ పాడుతూ గడపడానికి తనకేమైనా వీలా! గుదిబండలాంటి ఈ ముసిలాడు ఒకడూ! మనిషన్నాక ఎన్ని అమర్చుతే ఔతుంది!

అన్ని గదులకీ తాళాలు వేసుకుని కేరేజి పట్టుకుని వీధి గదిలోకి వస్తుంది హనుమాయమ్మ. సాంబయ్య గది అదే. 'ఇదిగో ముసిలాయనా! కేరేజి ఇటు వైపు మూల బల్ల మీద పెడుతున్నాను. పక్కన కూజాలో నీళ్లున్నాయి. అటువైపు చివరకి, అదేపైకి కాలువ ఉంది కదా, అక్కడ బాల్చీలో నీళ్లున్నాయి. పక్కన చెంబుంది. ఏదైనా అవసరం వస్తే తీర్చుకో!

సాంబయ్య కళ్ల నీళ్ళు తిరుగుతాయి - రాజ్యమే ఇలా తన కూతురి చేత యింత శ్రద్ధగా చేయిస్తోందేమో!

'నేనన్నీ చూసుకుంటాను లేవే, నువ్వెళ్లవే అమ్మలూ!'

'ఏమిటి చూసుకునేది, పేడా పిడకలూను! రేపొద్దున్న నీకేదైనా అయితే కూతురు సరిగ్గా చూడక చంపేసిందని నాకు మాట రావడానికా! కన్ను సరిగ్గా కనపబడదని ఓ మూల పడుంటావా, ఎక్కళ్లేని తడుముళ్లాటలూ నీకే! వీధిలో ఏ గొడవ జరిగినా నీకే! అందుకే అవతల గొళ్లెం పెట్టి మరీ వెడుతున్నాను, నువ్వేమనుకున్నాసరే!'

అంటూ హనుమాయమ్మ ఆ పని చేసిగాని గుమ్మం దిగదు.

ఆ వీధిలో గుమ్మానికి రోజూ పదీ అయ్యేసరికి గొళ్లెం పడుతుంది గాని, నెలకోసారి తాళం కూడా తప్పదు. అప్పుడు సవితి తండ్రికి రిక్షాకట్టించి సబ్‌ట్రెజరీకి తీసికెడుతుంది. గుమాస్తాకి అయిదురూపాయిలు, అందరూ యిచ్చేదే యిచ్చి, పెన్షన్ అప్లికేషన్ నింపిస్తుంది. దగ్గిరుండి సాంబయ్య చేత సంతకాలు చేయిస్తుంది. ఎన్నో గంటలు వేచి ఉన్నాక, ఏ సాయంకాలమో పేరు పిలుస్తారు. సాంబయ్య తరపున అతని పింఛను సొమ్ము అయిదొందల పాతికా అందుకుంటుంది. అది పట్టుకుని రిక్షా మీద యిద్దరూ యింటికొచ్చేస్తారు. 'నా బతుక్కి వీడు చేసిన అన్యాయం చాలు-వీడి పాపిష్టి

డబ్బు కూడా నాకెందుకు!' అనుకుంటుంది. ఆలోచనకీ ఆచరణకీ పొంతన ఎక్కడిది! 'వీళ్లని నేనెందుకు పోషించాలి, ఊరికే కూచోపెట్టి? సగం తీసుకుంటే పోలా?' అని కొన్నాళ్ళు తటపటాయించింది. 'ఒక్కమనిషికైనా ఈ రోజుల్లో తిండికి తక్కువౌతోందా? నాలుగొందలపైమాటేగా, ఏ విధంగా లెక్కచూసినా, ఆ మేరకి ఉంచేసుకుంటే తప్పేమిటి?' అని సమర్ధించుకుంది. 'మరి నా చాకిరీమాటో?' అని మనసు ప్రశ్నించింది. 'ఆ పైపాతికా ఇచ్చేద్దాం. ఎంతైనా వాడు గణించుకున్నదే కదా!' అనే నిర్ధారణకి వచ్చింది. 'ఏ ముసిలాడికైనా జిహ్వా చాపల్యం ఎక్కువగా ఉంటుంది. నెలకి పాతిక రూపాయిలంటే, అమ్మో, అదేం తక్కువా! ఏదైనా కొనుక్కు మింగేసేడంటే దేవలేక నేను చావాలి. అడిగితే రూపాయో అర్ధో మనమే చేతిలో పెడదాం' అనేది ఆమె ఆఖరి మాట అయింది. అక్షరాలా అదే పాటిస్తోంది!

అయినా పక్క కిటికీలోంచి ఏ పిల్లలు విసురుతారో ఏమో, అప్పుడప్పుడూ ఆ వరండాగది నేల మీద పిప్పరమెంటు బిళ్లలూ. చాకొలెట్ల విప్పేసిన ముచ్చిరేకు కాగితాలు కనపడతాయి! ఇవి కాక కాలికి తగులుతూ పేలిపోయిన రబ్బరు బుడగల తొడుగులు ఒకటీ! 'రెండో బాల్యం అంటారు ఇదే కాబోలు, ఎలాగో అలా తగలడనీ, నాకేం! నన్నేం అడిగి చావలేదుగా! అయినా ఇవన్నీ పట్టించుకోడానికి నాకు తీరిక ఎక్కడేసింది!' అనుకుంటుంది హనుమాయమ్మ.

పని చేస్తున్న కాన్వెంటులో ఆమెకి తక్కువ పనేం లేదు. రోజంతా పని చేసినా రాత్రికి, ఆ సంస్థ యజమాని పీలానాయుడికి వంటచేసి వెళ్లాలని ఒప్పందం. పెళ్లాం ఉందిట గాని మరి ఎక్కడ బెడిసికొట్టిందో కాపరానికే నీళ్లొదులుకుందిట. 'ఎలాగా కమ్మగా వండి పెడుతున్నావ్, దాన్తో కూడా మరొకటీ చేసి పెడితివా, నా బతుకు మరింత ఘుమ ఘుమలాడుతుంది.' అనే నాయుడి ఆహ్వానం కాదనడానికేం కనబల్లేదు, హనుమయమ్మకి. 'దగ్గి దగ్గి మీ నాన్న ముసిలాడు తొందరగా టపా కొట్టేస్తే బావుణ్ణు, ఏకంగా నేనే అక్కడికి మకాం ఎత్తేద్దును'

అంటాడా నాయుడు ఆమెను మీదకి లాక్కుంటూ.

'ఈ పళంగా మన యీ దుకాణం మా లోగిలి లోపలి గదుల్లోకి పెట్టేసుకున్నా అడిగేవాడులేడు, లోకానికి జడిసిగాని! వాడుగాని గుటుక్కుమంటే నెల నెలా చేతిలో పడే పించెనీ డబ్బులు ఏం కావాలి? అన్నీ తెలిసిన నాయుడుగారే కంగిస్తే ఎలా?'

అంటుంది హనుమాయమ్మ.

'నిజమే అనుకో. అగ్నిసాక్షిగా పెళ్లాడిన ఆడకూతురే నా ధాటికి తట్టుకోలేక పుట్టింటికి పారిపోయింది, మరి రానని ఒట్టేసుకుని. మరి సరిగ్గా అదే నీకు నప్పింది. ఎవరికేది నప్పుతుందో....'

'చాల్లెండి మీ పోకిరీ కబుర్లూ మీరూను'

అంటూ లైటార్పేస్తుంది హనుమాయమ్మ.

తను రాత్రి ఏ తొమ్మిదింటికో గొళ్లెం తీసేటప్పుడు చిన్న క్యారేజీలో ఏ మజ్జిగాన్నమో ముసిలినాయనకి తేడం ఏనాడూ మరవదు హనుమాయమ్మ.

అయితే పొద్దుట వేసిన గొళ్లెం అలాగే ఉందనడానికేం లేదు. కిష్టాయీ రాంబాబూ ఆవిడ వెళ్లిపోడం పక్క కిటికీ లోంచి కనిపెడతారు. కాస్సేపు ఆగి, అటూ ఇటూ చూసి ఆ గుమ్మం దగ్గిర రాంబాబు వంగుని నిలబడతాడు. వాడి మీద ఎక్కి నిలబడి కిష్టాయి గొళ్లెం తీసేస్తాడు. రాంబాబు

మూడో క్లాసు రెండోసారి ఫేలైతే ఓ సైకిలు షాపులో పనినేర్చుకోడానికి పెట్టేడు వాడి మేనమామ. ఆ షాపులో కన్న సాంబయ్య తాత దగ్గిరే ఎక్కువకాలం గడుపుతాడు వాడు. కిష్టాయి రిక్షాలాగే సూరీడు రెండోకొడుకు. కష్టపడి కుర్రాణ్ణి బళ్లో వేయించాడు గాని బడినడిచే టైములో వాణ్ణక్కడ ఉంచడం తండ్రి తరమైంది కాదు! తండ్రి రిక్షా గణ గణ యిలా దూరమవుతుందో లేదో అలా కిష్టాయి రాంబాబు దగ్గిరకి పరిగెడతాడు.

మరి సాంబయ్యని ఏ చల్లని వేళ ఏ చల్లని తల్లి కన్నదో గాని అతని బుద్ధికి ఏ పరిస్థితిలో అయినా యీ ప్రపంచమంతా ఎంతో అందంగా కనిపిస్తుంది. ఎలాంటి చీకటిలో అయినా అతని కళ్ల దీపాలు అలా మిలమిల వెలుగుతూనే వెతుకుతూనే ఉంటాయి! పాపం పుణ్యం అనేవి పిల్లలకే తెలీనివంటారు. వాటి గురించి పట్టించుకోక బతుకంతా తృప్తితోనే గడుపుకొచ్చిన సాంబయ్య లాంటి ముసిలి వాళ్లకి పసివాళ్లతో ఒకటైపోయి కేరింతలు కొట్టడంలో వింతేముంది? చిరు చీకటిగా ఉన్న ఆ చిత్తడి గదిలో ఎప్పుడు చూసినా కడిపెడు కథలూ, కడుపునిండా కబుర్లూ, గంటల తరబడి నవ్వులూ!

ఓసారి గుంటవెధవల లిద్దరూ కలిసి వెక్కి వెక్కి ఏడుస్తున్న మరో లొట్టికాయని తీసుకొచ్చారు, తాతయ్య ఓదార్పుకోసం.

'లెక్కల్లో మార్కులు తక్కువొచ్చాయిట, అందుకూ, ఆ దుఃఖం' అంటూ. 'వాణ్ణిలా దగ్గిరగా తీసుకురండి' అని సాంబయ్య అంటే ఓ బాదంకాయో చేతిలో పెట్టి బుజ్జగిస్తాడనుకున్నారు. ఊచి పుచ్చుకుని ఓ లెంపకాయ ఇచ్చుకున్నాడు 'ఈ మాత్రానికే కుళ్ళిపోవాలిట్రా పిచ్చి వెధవా' అంటూ.

ఆ లెంపకాయు అదటుకి ఆ లేతబుగ్గ ఏమైందోగాని అంతగట్టిగా కొట్టే శక్తి మాత్రం సాంబయ్యకి లేదు! ఆయాసం వచ్చి నిలువెల్లా ఊగిపోయాడు. తాతయ్యలో ఎప్పుడూ ఎరగని ఆ కొత్త 'నృత్యశైలి' గమనించి కుర్రాళ్ల నవ్వు ఆగలేదు. వాళ్ళతోపాటు బుగ్గ పొంగిన కుర్రాడు కూడా ఉప్పొంగిపోడం చూసి తాతయ్య కూడా ఆ ఆనంద బృందంలో తనూ ఒకడైపోక తప్పలేదు!

నేలని పరుచుకున్న దుప్పటికాక సాంబయ్య మరో ఆస్తి తలక్రింద పెట్టుకొనే చిన్నరేకు పెట్టి మాత్రమే. అందులో ఓ రెండు జతల బట్టలూ పంచెలూ తువ్వాళ్లూ కాక, ఇంచుమించు సరిగ్గా ఆ పెట్టెలో పట్టే సైజుగల రాజ్యం ఫోటో ఫ్రేం ఒకటీ. ఇవికాక ఎప్పటికప్పుడు సెల్సు వేయించుకుని ఉంచుకునే చిన్న బ్యాటరీ లైటు ఒకటీ. దాన్ని ముట్టుకుంటే మాత్రం సాంబయ్యకి ఎక్కళ్లేని కోపమూ వస్తుంది. దాన్తో ఆడుకోడం కిష్టాయికి రాంబాబుకీ ఎంతో సరదా మరి!

ఏ రాత్రివేళో లేచికూచుని రాజ్యం ఫోటో చేత్తో పట్టుకుని దాన్ని టార్చి వెలుగులో చూసుకుంటూ అలా కూచుంటాడు సాంబయ్య ఒక్కొక్కప్పుడు దాన్ని వెనక్కి తీసి చేత్తో తడుముతూంటాడు కూడా. ఆ అట్ట కింద తను దాచిన కాగితాల దళసరి తన చేతికి తగిలినప్పుడు తన గుండె వేగం ఎక్కువవడం ఎంతో తృప్తినిస్తుంది అతనికి.

చేసింది నౌఖిరీ ఉద్యోగమైనా సర్కారు పని గనక రిటైరు అయినప్పుడు పదిహేనువేల గ్రాడ్యుయిటీ వచ్చింది. ఆ సంగతి అమ్మలుకి తెలీకుండా ఎలాగో దాచాడు. తనీ వయసులో ఎలాగా దానికి సంబంధం తేలేడు. పదివేలు కట్నమిచ్చి మరో పదివేలు పెళ్లి ఖర్చుపెడితే ఏదో మాదిరి సంబంధం రాకపోదు. కలిగున్న యింట్లో పుట్టినా తల్లితో తన దగ్గిరకి వచ్చి చేరిన నేరానికి

పెళ్ళికావలసిన వయసులో పాపం అమ్మలు రెక్కలు ముక్కలు చేసుకుంటోంది. ఆ పది హేను వేలూ తన పేర్న ఎఫ్.డి తీసుకున్నాడెప్పుడో. ఇలా డబ్బుందని ఏ మాత్రం తెలిసినా ఈ కాలపు పిల్లలు ఉండనిస్తారా. సంబంధం కుదిరిననాడు మార్చుకుని దాని చేతిలో పెట్టాలి. తెలిసిన వాళ్ళందరికీ చెబుతూనే ఉన్నాడు. ఆ రోజు కలసి రావాలి మరి....

ఉద్యోగం చేస్తున్నప్పుడు వాళ్లూ వీళ్లూ ముట్ట చెప్పినవి వేరుగా దాస్తూ వచ్చాడు. ఏ రెండొందలో ఉండిఉండాలి. ఆ వెనక అట్టముక్కలు ఊడదీసి అప్పుడప్పుడు నోట్లు లాగుతూ ఉంటాడు. పిల్ల వెధవలు, వస్తూ పోతూ ఉంటారు. వాళ్లకో పటిక పంచదార ముక్క కొనిపెట్టినా, ఊరేసిన ఊసిరికాయలు యిచ్చినా, చాకలెట్లో బిక్కట్లో యిచ్చినా, ఆమాత్రం దగ్గిర ఉండకపోతే ఎలా? కన్ను కలిగినట్టు తనకి చాకిరీ చేస్తున్న అమ్మలి దగ్గిర చెయ్యి జాచాలా యింకా, యింకా? అయినా ఈ తినుబడి సరుకు మీద తనకే మాత్రమైనా మోజు తగ్గితే కదా! అన్నట్టు రబ్బరు బుడగలో?

బుడగ అనే తలపు వచ్చీరాగానే సాంబయ్య మనసు బుడుంగుమని గతంలోకి మునిగిపోతుంది. ఏం కన్నారో ఎలా పెంచారో సాంబయ్యకి తల్లీ తండ్రీ గుర్తులేదు. అత్తారింట అష్టకష్టాలూ పడి, ఆ మాత్రమైనా అనురాగం చూపిన భర్తని కోల్పోయి, ఇల్లు చేరిన మేనత్త మాత్రమే గుర్తుంది - మెత్తని ఆ ఒడి ఒకటే కాదు, మొహమెత్తి చూస్తే దుఃఖపు జాడ ఏమాత్రం పైకి కనపబడనీయని ఆ కన్నుల వెన్నెల తడి అతని జన్మంతా గుర్తుంటుంది.

ఆ రోజుల్లో యిప్పట్లా రంగు రంగుల రబ్బరు బెలూన్లు దొరికేవి కావు. సబ్బు నీళ్లు చిక్కగా కలిపి వాటిల్లో ఉల్లికాడలో బొప్పాయికాడలో ముంచి ఊదితే గుండ్రని బుడగలు వచ్చేవి. మేనత్త ఒడిలో కూచుని అలా ఊదుతూ కదుల్తూ రంగులు మారుస్తూ ఎగిరే ఆ సబ్బు బుడగల్ని చూస్తుంటే సాంబయ్యకాదు, మేనత్తా నవ్వేది. 'జీవితం ఓ బుడగే కావొచ్చు, అందీ అందకుండా పోవచ్చు, కాని అందులోని రంగురంగుల్ని చూసి కేరింతలు కొట్టే దృష్టిమాత్రం పోగొట్టుకోకూడదు సుమా!' అని చెప్పీ చెప్పక చెప్పేదేమో ఆ ధీచిత్త, తన మేనత్త. ఆ జీవనసూత్రం అలా సాంబయ్య నరనరానా పట్టి ఉండిపోయిందేమో! అందుకే ఎలాంటి ఒడుదుడుకులు వచ్చినా 'ఓ చింతా! నాకేరింత ముందు నువ్వెంతే?' అని సమాధాన పడడం నేర్చుకున్నాడు. అందుకే ఎదుటివారిలోని ఎంతటి తేలిక తనమూ, చంచల స్వభావమూ బాధించవు. బుద్బుదప్రాయమని తెలిపినా ఏ జీవితమైనా అతని దృష్టికి అద్భుతమయమే!

కాలికింద మెత్తగా రబ్బరు బుడగ తగలడగానే సాంబయ్య ఆలోచనలు మళ్ళీ పైకి తేలి, వర్తమానంలోకి వచ్చాయి. రాంబాబూ కిష్టాయీ యీ మధ్య తనని బొత్తిగా వదలడం లేదు. రబ్బరు బుడగలు అదే పనిగా తెచ్చి ఊదించుకుంటున్నారు. వాళ్లు ఊదలేక కాదు. 'నువ్వు బుడగ లోపలికి ఊదేగాలి తక్కువా, చేసే చప్పుడు ఎక్కువా తాతయ్యా!' అంటూ ఆట పట్టిస్తారు. ఏం చెయ్యడం, ఊదుతుంటే గుండెలో ఏదో నొప్పి, అలసట... ఈ కుర్రాళ్లకి ఎలా చెప్పి తప్పించుకోడం? తను ఊదుతున్నప్పుడు అయ్యే గరగర చప్పుడు విని పకపక నవ్వాలని వాళ్ల సరదా! 'ఏదీ, మరోసారి ఊదు' అంటారు రాధ, కృష్ణుణ్ణి మురళివాయించమని మోజు పడ్డట్టు!

ఆ నిశిరాత్రి వేళ అలా గతమూ వర్తమానమూ తలుచుకుని సాంబయ్య మనసు కేరింతలు కొడుతుంటే కాలికి తగిలిన రబ్బరు బుడగలోని తడి ఎప్పుడూ లేని అలజడి కలిగించిందతనిలో.

మ్మో, కుర్రాళ్లలో తానూ ఒకడై ఆ వెర్రి ఆనందంలో పడి కొట్టుకుపోతూ వాళ్లకి ఆపదతేవడం లేదుకదా!

అవాళ వెళ్ళిపోతూ హనుమాయమ్మ ఏమంది!

'కాటికి కాళ్ళు చాపుకున్న ముసిలాడివి. ఆ దగ్గు చూస్తూంటే ఏ రోగం పట్టుకుంటో అని భయం వేస్తోంది. అందుకే మరొకరికి సోకకుండా వీధికి గొళ్లెం పెడుతున్నాను. పిల్లల్ని దగ్గిరకి తీసి ఆడుతున్నావని విన్నాను. ఈ వయసులో నీకిదేం దుర్బుద్ధి? ఇంతింత వెధవలకి కూడా నీ రోగం సరఫరా చేస్తేగాని నీకు తృప్తి ఉండదుకాబోలు!'

పగిలిపోయిన బుడగ అవశేషాన్ని చేత్తో పట్టుకుంటే తగిలిన తడి పోల్చి సాంబయ్య మనసు విలవిల లాడిపోయింది.

అవునుమరి.... రోజురోజుకి తనకి దగ్గు ఎక్కువైపోతోంది. సాయంకాలం ఒళ్లు వెచ్చగా ఉంటోంది. కాళ్లూ చేతులూ సన్నపడిపోతూన్నయి. క్షయే అయి ఉంటుంది. అనుమానం దేనికి?

మర్నాడు హనుమాయమ్మ వెళ్ళిపోయాక, పిల్లలు రాగానే ఎక్కడికో ఓ చోటకి తీసికెడతానని రిక్షా ఎక్కించాడు. లంగ్ స్పెషలిస్టు శోభనాద్రిగార్ని కలుసుకుని అన్నీ చెప్పేడు. ఊపిరితిత్తులకి, ముగ్గురికీ ఎక్స్‌రేలు తీయించారు. తన అనుమానం నిజమే. తనకి కొంతవరకు ముదిరిందిగాని పిల్లలకింకా ప్రాథమిక దశలోనే ఉంది. డాక్టరు పెట్టిన చీవాట్లు అన్నీ యిన్నీ కావు. ఊపిరిలోనే క్రిములుంటాయి. ఉమ్మి సంగతి చెప్పాలా? ఇన్ని చెబుతున్నావు ఈ మాత్రం తెలీదా?

చేసింది అశ్రద్ధే గాని చెయ్యిదాటిపోకుండా మేల్కోడం ఓ విధంగా అదృష్టమే. పిల్లలిద్దరి తండ్రుల్నీ పిలిపించి, విషయం వివరించి, తిరిగి ఆరోగ్యవంతులయ్యేదాకా ఎంత ఖర్చయినా తనదే అని భరోసా యిచ్చాడు సాంబయ్య.

టీబీశానిటోరియంలో చేరాక చికిత్స తీసుకుంటూ ఆ గది కిటికీలోంచి పిట్టల్నీ మబ్బుల్నీ చుక్కల్నీ చూస్తూ కేరింతలు కొట్టడం మాత్రం మానలేదు, సాంబయ్య మనసు. దాన్తో పాటు చెయ్యవలసిన బాధ్యత కూడా అతను మరచిపోలేదు.

'పై పిల్లలమాట సరేసరి. తనకింత ఆలనా పాలనా చూసే పిచ్చితల్లి అమ్మలు. ఈ భయంకరవ్యాధి, యింట్లోనే ఉన్న పిల్ల, దానికి గాని సోకలేదు కద! వెంటనే పరీక్ష చేయించుకోమని నచ్చచెప్పాలి. తనపేర ఉన్న పదిహేను వేలూ దానిపేర మార్చెయ్యాలి. పెంకుటిల్లు ఇంకా తన పేరనే ఉంది. వెంటనే అమ్మలి పేర రాసేయ్యాలి, ఏమో ఏ క్షణం ఎలా ఉంటుందో!'

మాట వరసకి అలా అనుకున్నాడుగాని సాంబయ్యలాంటి వాళ్లకి అన్ని క్షణాలూ బాగానే ఉంటాయి. బాధ్యతల 'చేదు' కాదనని వారికే కదా జీవితంలో తీపి తెలిసేది!

అతని మనసెప్పుడూ ఆనాటి ఇంతున్న అమ్మలికి ఏదో గమ్మత్తయిన కథ చెబుతున్నంత ఫ్రెష్‌గానూ ఎప్పుడూ ఉండగలదు!

(ఆంధ్రపత్రిక, 8-1-99)

రెండు మొక్కలు నాటండి !
ఆనందం పంచండి !!





*With the best compliments from*

# TAMARIND MERCHANTS' ASSOCIATION

SALUR - 535 591





మనం పెంచే చెట్లు
మన ప్రగతికి మెట్లు



వన సంరక్షణ సమితి

కురుపాం – 534524

శుభాకాంక్షలతో



# హరిత వనాలు
# మనం సాధించవలసిన వరాలు

*With the best compliments from*

**Deputy Conservator of Forests**
**(Planning and extension)**
VIZIANAGRAM - 535 001







# పచ్చదనం పరిశుభ్రత ఈనాటి మన లక్ష్యం



## వన సంరక్షణ సమితి

విజయనగరం – 535001

**శుభాకాంక్షలతో**

శుభాకాంక్షలు!



అట్లూరి పుండరీకాక్షయ్య

(సినీ నిర్మాత)

చెన్నై

# షో!

ప్లేయింగ్ కార్డ్స్ ఆడడం అన్నా, వర్డ్స్‌తో ప్లే చెయ్యడం అన్నా నాకు చాలా యిష్టం. ఈ రెండూ కలిసివచ్చి నా కథలకి 'పేకముక్కలు' అని పేరు జతపడడం ఎంత అదృష్టం! ఎవడు దీన్ని కనిపెట్టేడో గాని పీకలు తెగిపోయే నేటి పీకులాట ప్రపంచంలో కాస్త రిలీఫ్ యిచ్చే ముచ్చట ఒక్క పేకాటే కదా! ' పడిన ముక్కల్తో నేర్పుగా ఆడి సాధించరా భడవా!' అనే జీవిత సత్యాన్ని ఇదెంత బాగా చెబుతుంది! పేకాటలో ఓడిపోయిన వాళ్ళ గురించే బహుశా ఆత్రేయ 'పోయినోళ్ళందరూ మంచోళ్ళు' అని చెప్పి ఉండాలి! క్రీడాత్మను ఎరిగిన శ్రీకృష్ణపరమాత్మ ఆనాడే 'అర్జునా! ఆటలలో పేకాటను నేనే సుమా!' అని ధ్వనించేలా చెప్పలేదా! నాకు అర్థమైన జీవితంలోని మనుషుల హెచ్చు తగ్గులూ, వెలుగు నీడలూ ఈ కథల్లో ఓ చోట చేరిస్తే పేకదస్తా విప్పి పరచినట్టై ఈ పేరు పెట్టుకున్నాను. చెప్పుకోతగిన నా కథ 1947లో వచ్చి ఇప్పటికి 52 సంవత్సరాలు అయింది గనక ఈ పేరు. నా కథలన్నీ చదివి పరిచయ పరిచర్చ చేసిన పోరంకి దక్షిణామూర్తి గారికి కృతజ్ఞతలు చెబుతూ 'ఈ పేరు ఎందుకు పెట్టారో మరి' అన్నారు గనక ఇదీ సంజాయిషీ.

ఇక నా ప్రత్యేకతల కథ చెప్పుకుంటే నేను బాగా పొట్టి. విపరీతమైన సన్నం. నలుపు. ప్రాయం డబ్భై దగ్గిరపడి, కాలం 'దొబ్బెయ్' అంటున్న వల్లమాలిన వృద్ధాప్యం. అయినా మనసుకి పొగరూ విగరూ తగ్గనంత కాలం గళానికి జిగీ, కలానికి బిగీ ఎందుకు తగ్గాలి గనక! విశాఖలో విజయ శిఖరాగ్రం చేరిన వికాస్ విద్యాసంస్థలోని ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్‌లో తలమానికంగా యిప్పుడూ కొనసాగుతూనే ఉన్నాను. ఇప్పటికీ ఏడాదికి అరడజను కథలు రాయడంతో పాటు (కొన్ని అచ్చయాయి, కొన్ని పచ్చడయాయి) పాతికేళ్ళుగా నిర్వహిస్తున్న 'మేధ मे tricks' శీర్షిక ఏ ఒక్క నెలా నాగా పెట్టలేదు! 'ఇక మీ విద్యార్థుల్నీ ఆ పాఠకుల్నీ ఆ దేవుడే రక్షించాలి!' అనే మీ విసురుకి నేను దొరకను. ఎందుకంటే అనేకానేక బాబాలతో పాటు ఆ దేవుణ్ణి నేను నమ్మను. ఇహలోకంలోనే ఇంత తెగింపు ఉంది గనక పరలోక చింతకూడా నాకు లేదు. చచ్చాక ఈ శరీర భాగాల్లో కన్నూ, కిడ్నీ యిలాంటివి ఉపయోగించి A.M.C. లోని ఎనాటమీ డిపార్ట్‌మెంటుకి శరీరం అప్పజెప్పమని ఏనాడో రాసి ఉంచాను.

ఇక మా యింట్లో వాళ్ళా? మాటవరసకయినా ఏ ఒక్కరూ నన్ను ప్రోత్సహించే ప్రయత్నం చెయ్యరు. ఇలా చేయి అందించకుండా జాగ్రత్త పడి, నా పట్టుదల పెరిగేలా నా వ్యక్తిత్వం విజృంభించేలా సాయం చేసిన వాళ్ళ మేలు ఎలా మరచిపోను!

భరాగో లాంటి పరమాప్తులు యిచ్చిన భరోసాతో లాస్టియరు 'అడిగో మావయ్య, ఆ వెనకే మేరీ!' ప్రచురించాను. ఇప్పుడీ 'పేకముక్కలు'. వచ్చే ఏడు మరో కొత్త బుక్కు దిగబడదని ఎక్కడుంది!

విశాఖలో ఇవాళ జులై 11; 99

ఇది **అ.రా.కృ.**తం.